# అంతరార్థ భాగవతము

## (బ్రహ్మ విద్యా దర్పణము)

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ

గ్రంథకర్త :
సరస్వతీ కంఠాభరణ, తత్త్వార్థ ప్రబోధక
కళాప్రపూర్ణ, విద్వాన్
డా॥ వేదుల సూర్యనారాయణశర్మ

ప్రథమ ముద్రణము :
జనవరి, 1984

ప్రతులు : 2000



వెల : రు. 30-00

This BooK is Published With the Financial
Assistance of T. T. D. Under their Cheme
Aid of Publish Religion Books.

కృతజ్ఞతాభి వందనములు

1. శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము వారికి – తిరుమల.
2. శ్రీ యాదగిరి గుట్ట, నల్లగొండ జిల్లా, లక్ష్మీ నరసింహ దేవస్థానము వారికి.
3. శ్రీ మాగంటి సూర్యనారాయణ పంతులు గారికి.
(ప్రొప్రయిటరు, బెజవాడ మోటార్సు, విజయవాడ)

ఈ గ్రంథ ముద్రణకు అవసరమైన ధనసహాయము చేసినందున నా
కృతజ్ఞతాభివందనములు తెల్పుకొనుచున్నాను.

—గ్రంథకర్త.

ప్రాప్తిస్థానము :–
క్వాలిటీ పబ్లిషర్సు
రామమందిరం వీధి,
విజయవాడ – 2

ముద్రణ :
విక్టరీ ప్రెస్,
విజయవాడ – 1
ఫోన్ : 74432

# సంస్మరణ

అమృత హృదయమ్ముతో 'అప్ప' అందఱకును,
రమ్యవృత్తమ్ముతో, కాఁపురమ్ముఁదీర్చె
'మూడుపూ లారుకాయలు' పోల్కిఁ గాగ;
కల్పవృక్షమ్మ; ఈయమ్మ, గౌరిదేవి.

# అంకితము

ఈ యది అంకితమ్ము, తనువెత్తిన దాదిగ, తాను భక్తియో
గాయత చిత్తయై, మరణ మందిన పిమ్మట, నన్ను జ్ఞానయో
గా యత చిత్తుఁజేసి, విరహార్తినిఁ బాపగ, నంతరార్థ సు
శ్రీయుత రామ భాగవత శేముషిఁ దేల్చిన గౌరిదేవికిన్

ఏమి యొసంగి నేను ఋణమీఁ గగలాఁడను నాదు దేవికిన్,
శ్రీమతి గౌరిదేవికి, విశిష్ట పతివ్రత ధర్మ జీవికిన్,
రామ కథాంతరార్థముల వ్రాసి యొసంగితి నంకితమ్మని,
ప్రీ మహనీయ భాగవత మిచ్చితి, భారత మిత్తు నీ పయిన్

"లక్ష్మీం క్షీర సముద్రరాజ తనయాం" ప్రారంభమౌ శ్లోకముల్
పశ్చాద్గమ్ముల ప్రాణవాయువులు నిల్వన్ బాడుచున్ శయ్యపై
"లక్ష్మీదేవి శుభాంక సీమకిదె చేరంబోవుచున్నా" నటం
చీశ్వా, వీడిన గౌరిదేవి గొను లక్ష్మీ దివ్య సాయుజ్యమున్

'వ్యాసాకుండి' ని 'వేదు' లాన్వయము ధన్యంబొంద జన్మించె; 'గౌ
రీ సావిత్రి' సునామధేయ, అదె గౌరీదేవి ఆధ్యాత్మ వి
ద్యా సంస్కారిణి ప్రేమదేవత, మదీ యర్ధాంగి ధన్యాత్మ ల
క్ష్మీ సౌభాగ్య అఖండ శాంతిఁ గొనుగా, కీమత్కృతి స్వీకృతిన్

ఇట్లు,
వేదుల సూర్యనారాయణశర్మ,
గ్రంథకర్త.

# సాష్టాంగ నమస్కృతులు

శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతుల వారి 90 వ జన్మదినోత్సవ కానుకగా ఈ గ్రంథము మహబూబ్‌నగర్‌లో సమర్పింపబడినపుడు శ్రీ స్వాములవారు ఈ గ్రంథ లిఖిత ప్రతులను అన్నిటిని స్పృశించి అంత విషయముల నడిగి తెలిసినదో ? అమందానందముతో శిరస్సుపై నిడుకొని నన్ను దీవించి త్వరలో గ్రంథ ముద్రణ ప్రచురణములు కల్గునట్లు ఆశీర్వదించిరి. వారి ఆశీర్వాదములతో వెంటనే ముద్రణ ప్రచురణములు లభించినవి. అందుకై శ్రీ వారికి నా కృతజ్ఞతా సాష్టాంగ నమస్కారములు.

# ఆశీస్సు మనస్సు

క్వాలిటీ పబ్లిషర్స్, విజయవాడ ప్రొప్రయిటరు శ్రీ కప్పగంతుల మురళీకృష్ణగారు ఈ గ్రంథ ముద్రణ ప్రచారముల నంగీకరించినందుకు వారికి నా హృదయ పూర్వక ప్రేమాశిస్సులు సమర్పించుచున్నాను.

—గ్రంథకర్త.

# నివేదనము

అంతరార్థం అన్నప్పుడు, అంతర+అర్థం అని విడదీస్తే, విభిన్నమైన అర్థం అనే అర్థం వస్తుంది. అంటే, వాచ్యార్థం కన్న విభిన్నమైన మఱో అర్థం అన్నమాట. అంతర్+ఆ+అర్థం అని విడదీస్తే, అంతర్=లోపలనున్న ఆ=సంపూర్ణమైన, అర్థం, అనే అర్థం వస్తుంది. అంటే పైకి కనుపించేది కాక లోపల నిగూఢంగా ఉన్న ఇంకో రకం అర్థం అన్నమాట. రెండు రకాల వ్యుత్పత్త్యర్థాలు ఒకే భావాన్ని చెప్తాయి.

మన వైదిక వాఙ్మయాన్ని, ఆధి భౌతిక, ఆధి దైవిక, ఆధ్యాత్మికార్థాలతో మూడు ముళ్లువేసి మూడు రకాల భావాలుకల మనుష్యులకూ, ఉపయోగార్థంగా మన మహర్షులు గ్రంథాలుగా వ్రాసి వుంచేరు. ఆధి భౌతికములైన అర్థాలు మంచి జీవితం సుఖవంతంగా ధర్మమార్గాన్ని నడిపించడాని కుపయోగపడతాయి.

ఆధి దైవికములైన అర్థాలు అమానుష విషయాలతో దైవంపై విశ్వాసం కల్గించి మనస్సును దృఢపరచి దైవోన్ముఖంచేసి, దైవానుగ్రహంవల్ల జీవితాన్ని ధైర్యంగా సుఖవంతంగా నడిపించుకొంటూండేటట్లు సంఘాన్ని జాతిని నడిపించడానికి ఉద్దేశింపబడ్డాయి.

ఆధ్యాత్మికార్థాలు, మానవుని మనసులో జరిగే గందరగోళాల నన్నిటినీ ప్రశాంతపరచి సుఖశాంతులతో జీవితాన్ని నడిపిస్తూ జీవాత్మను పరమాత్మలో కైవల్యంపొందే ముక్తి మార్గంవైపు నడిపిస్తాయి.

ఈ పై మూడు మార్గాలు వివిధ మనస్తత్వం గల మానవులు అందఱూ ఏకీకృతులై ఒకరితో నొకరు విరోధులు కాకుండా నడవడానికి వేసిన మూడు బంధాలు. వేదంలోనేవున్న ఈ మూడుముళ్లూ వేదసారాలైన భారత భాగవత రామాయణాల్లోను బిగింపబడి వున్నాయి.

పై ఆధి భౌతికాధి దైవిక ఆధ్యాత్మిక మార్గాల్లో మానవుణ్ణి శాశ్వతంగా తరింపజేసేది ఆధ్యాత్మిక మార్గమొక్కటే. ఆధ్యాత్మిక తత్త్వాన్ని అక్కడక్కడ పాత్రలచేత చెప్పించటమే తప్ప భారత భాగవత రామాయణాల్లోని కథలకు సర్వసంపూర్ణంగా సుబోధకంగా ఇంతవరకు అంతరార్థాలు ఎవ్వరూ తెలిపి యుండలేదు. కావుననే ఆ గ్రంథాలు ప్రజా బాహుళ్యంలో ఆధి భౌతికంగా సుగుణ సంపత్తినీ, ఆధి దైవికంగా

దైవభక్తినీ మాత్రమే అందిస్తున్నాయి తప్ప అధ్యాత్మికార్థాన్ని మాత్రం సర్వ సంపూర్ణంగా అందించలేక పోతున్నాయి. ఈ ఆధ్యాత్మికార్థమే కథంలోని ప్రతి చిన్న విషయానికి అంతరార్థంగా నాచేత చెప్పబడుతూంది. ఇంతవరకు నేను వాల్మీకి విరచితమైన రామాయణానికి అంతరార్థం వ్రాసి ప్రకటించేను. ఇప్పుడు వ్యాసరచితమైన భాగవత గ్రంథానికి అంతరార్థం మీ ఎదుట వుంచుతున్నాను. మునుముందు భారతం కూడ అంతరార్థపరంగా వ్యాఖ్యానించి మీకు అందించాలని ఆశిస్తున్నాను.

అసలీ అంతరార్థాలు వేదాల్లోనే ప్రవేశ పెట్టబడ్డాయన్న సంగతిని వేదార్థం చెప్పే 'నిరుక్తం' అనే వేదాంగం మనకు తెలియజేస్తూ వుంది. వేదభాష్యంలోని నిరుక్త విషయాలు కొన్ని ఇక్కడ వివరిస్తాను.

మన కర్మకాండలోని విఘ్నేశ్వర పూజ మొదలు అశ్వమేధయాగం వరకూ గల యాజ్ఞిక కార్యక్రమ తతంగం అంతా కూడా వేదంలోని నిరాకార నిర్గుణ పరమాత్మ తత్త్వానికి రూపకీకరణ ప్రయత్నమే. 'కల్పం' అనే వేదాంగం ఈ రూపకీకరణను సశాస్త్రీయంగా నిరూపించేదిగా కనిపిస్తూంది. 'నిరుక్తం' అమూర్తములై తాత్త్వికార్థపరములైన ఏయే పదాల్ని రూపకీకరణం చేయడంలో, ఏసాకార పదాలతో, ఏ నిరాకారతాత్త్విక పదాలకు సామ్యం చెప్పబడిందో విప్పి చెప్పింది. ఇక్కడ ఉదాహరణకు కొన్ని వేదమంత్రములలోని అమూర్తములైన పదాలకు మూర్తీకరణం ఏసామ్యంతో ఎట్లు చేయబడియుంటో, 'భారతీ నిరుక్తి' అనే నిరుక్త గ్రంథంలో చెప్పబడిన వానిని వివరిస్తాను.

ఉపనయన వ్రతంలో 'చర్మధారణం' అంటే, తోలుబందెం ధరించడం అనేది బ్రహ్మచర్య వ్రతధారణా కర్మలలో అంగంగా ఉంది. అది 'చర్మధారణం' కాదనీ, 'శర్మధారణం' అనీ, 'శర్మధారణం' అంటే మోక్షసుఖాన్ని ధరించడం అనీ, 'శర్మ' అనే పదం ముక్తి సంబంధమైన సుఖం అనే అర్థంలో అమూర్తం అవడం వల్ల దానిని ఉచ్చారణా సాదృశ్యంతోనూ, లేడి చర్మంలోని (హరిణాజినంలోని) తెలుపూ, గోధుమరంగూ, నలుపురంగూ గల మచ్చలు గుణసామ్యంతో సత్త్వ రజస్తమో గుణాలను చెప్పే చిహ్నాలనీ ఈ త్రిగుణాల్ని జాగ్రత్తగా అవిరోధంగా నడిపితే ముక్తి సుఖం చేకూరుతుంది అనే భావసామ్యంతోనూ 'శర్మధారణ' 'చర్మధారణం' గా ప్రత్యక్షీకరణం చేయబడిందనీ ఈవిధంగా 'శర్మ' పదం చర్మ పదంతో మూర్తిమంతం చెయ్యబడిందనీ వివరింపబడి యుంది.

ఇంకా అగ్ని ఉపాసనా కార్యక్రమంలో ఆజ్యంలో (నేతిలో) 'సమిధ' అనే పేరుతో మోదుగపుడకను ముంచి, అగ్నిలో వ్రేల్చడం అనే ప్రక్రియ ఉంది. దానిలో 'అగ్ని' అనేది 'అగ్రి' అనే అమూర్త పదానికి చేసిన మూర్తీకరణ కల్పన మనీ, అగ్రి అన్నదానికి ఆదీ, అంతమూ కూడ తానేయైయున్న పరమాత్మ అర్థమనీ, 'ఆజ్యం' (నేయి) అనే పదం 'ఆద్యం' అనే అమూర్త పదానికి ఉచ్చారణా సామ్యంతో చేసిన మూర్తీకరణమనీ, 'ఆద్యం' అంటే అన్నిటికంటే మొట్టమొదటిదిగా సృష్టియైన 'మాయ' అనేది అర్థమనీ, 'సమిధ' అంటే బాగుగా పెరిగినది అనే అర్థంలో ('సమ్యక్ ఏధతే ఇతి సమిధా' అని దా.ని వ్యుత్పత్త్యర్థం,) ఇంద్రియవృత్తి అని అర్థమనీ, ఇంద్రియవృత్తులు అమూర్తములు కావడంవల్ల మోదుగ పుడకలను సమిధలు అను పేరుతో వానికి మూర్తీకరణ కల్పనం చేయడం జరిగిందనీ, సమిధలను ఆజ్యంలో ముంచి అగ్నిలో వ్రేల్చడమనేది ఇంద్రియ వృత్తులను మాయతో కలిపి దానితోసహా ఆద్యంతములు తానేయైయున్న పరమాత్మలో విలీనం చెయ్యడమనే అమూర్తమైన ముక్తి సాధనకిది రూపకీకరణం అని నిరుక్తి గ్రంథంలో చెప్పబడి వుంది.

ఇంకా, వృషపదం ధర్మాన్ని చెప్పే పదం, గరుత్మత్పదం వేదాన్ని చెప్పే పదం. ధర్మమూ, వేదమూ రెండూ అమూర్తములు కాన వానిలో ఒక దానిని ఎద్దు గాను, మఱొక దానిని గ్రద్దగాను మూర్తీకరణంచేసి, ఎద్దు ఈశ్వరునకూ, గ్రద్ద విష్ణువునకూ వాహనాలుగా చెప్పడం జరిగింది. పరమాత్మను ధర్మమూ, వేదమూ మోసికొని వస్తున్నాయని చెప్పడమే అభిన్నతత్త్వములగు శివకేశవులకు వృషభ, గరుడములను వాహనములు గాప్పడలలోని ఉద్దేశమని భారతీ నిరుక్తి గ్రంథంలో చెప్పబడి వుంది. 'వృష' పదానికి ధర్మం అనే అర్థం ఉంది. గరుత్మంతుని వేదం అనే అర్థంలో చందోమయుడు అనే ప్రయోగం ఉంది.

ఇంకా అశ్వమేధం, గోమేధం, అజామేధం అనే యజ్ఞాలలోని గుఱ్ఱము, ఆవు, మేక అనే పశువులు క్రమంగా ప్రకృతికీ, ఇంద్రియ వృత్తులకూ, మాయకూ చేసిన మూర్తీకరణ కల్పనలేననీ, అశ్వ అజా గో పదాల వ్యుత్పత్త్యర్థాలతో నిరూపిస్తూ 'వేద నిగూఢతత్త్వ పరిశీలనం' అనే వ్యాస సముచ్చయ గ్రంథంలో శ్రీ అరవింద మహర్షి ఆంగ్లంలో వ్రాసి వున్నాడు కూడ. యావద్వేద తతంగానికి అరవిందుడు పరమాత్మ పరంగా అంతరార్థాలు ఉద్ఘోషిస్తూ ఉపన్యాసాలు చేస్తూ వ్యాసాలు కూడ ప్రకటించేడు. ఇంకా భావనోపనిషత్తు అనే ఉపనిషత్తు ఉపాసనా, కర్మ తంత్రాలలో తాంత్రిక

పదార్థములు ఏ విధంగా అమూర్త తత్త్వములుగా భావనచేసి ఆ తత్త్వాల్ని అందు కోవాలో వివరంగా చెప్పింది. శ్రీ విద్యాతంత్రంలోని తాంత్రిక కల్పనకు అంతకూ ఆ భావనోపనిషత్తు యొక్క వ్యాఖ్యలలో తత్త్వం వివరింపబడి వుంది.

ఈ భాగవతంలో అన్ని అవతారాలను గూర్చి ఏదో కొంత చెప్పబడినా కృష్ణావతార ప్రసంగం విశ్లేషించి దశమస్కంధం అంతటా చేయబడింది. అసలు కృష్ణావతార తత్త్వం చెప్పడానికే వ్యాసునిచే భాగవతం వ్రాయబడిందనాలి. కాని, కృష్ణావతారం దశావతారాల్లోను లేనేలేదు. బలరామావతారం వుంది. బలరాముడు కృష్ణుడు ఒకే దేవకీ గర్భంలోనుండి రెండుగా గర్భసంకర్షణం చేయబడ్డం జరిగింది. ఆ కారణంగా బలరామ కృష్ణులు ఒకే అవతారం అనాలి. కృష్ణుడు మిగిలిన అవతారాల్లోలాగ, ఏదో ఒకే ఒక విషయాన్ని నెరవేర్చడానికి మాత్రమే పుట్టలేదు. ఎందరో రాక్షసుల్ని ఎన్నెన్నో సమయాల్లో సంహరించడమే కాక ఎందరెందరినో తరింపజేశాడు కాగా కృష్ణుడు అవతారంగా కాక సాక్షాత్తు విష్ణువుగానే చెప్పబడ్డాడు. అసలు అవతార ప్రసంగం అంతా ఎందుకు కల్పింపబడిందో అవతార రహస్యం ఏమిటో తెల్పడానికి మీకు, స్వయంప్రకాశ బ్రహ్మానందస్వామి రచించిన సోపాధిక బ్రహ్మవిద్యా దర్పణంనుండి ఇక్కడ ఉదహరిస్తున్నాను :—

"దేనికీ తాను కర్తకాక ఎట్టి మార్పులు లేక ఉండేదే పరమాత్మ. పరమాత్మతత్త్వం తప్ప మరొకటి అసలు లేనేలేదు. పరమాత్మకు శోకమోహాల్లు, దయా కాఠిన్యాలు మొదలైనవేవీ లేవు. వేదంలో ఎక్కడా పరమాత్మకు రూపంగాని, గుణం గాని చెప్పబడనే లేదు. లోకరక్షణార్థం పరమాత్మ మాయామానుష రూపంతో ఆవిర్భవించాడనీ, ఆతని లీలలే అవతార కథా విశేషాలనీ చెప్పడం వేదవిరుద్ధంగా చెప్పడమే అవుతుంది. పరమాత్మకు లోకులవలె సంసారాన్ని అంటగట్టి శత్రుత్వ మిత్రత్వాలతో సుఖదుఃఖానుభవం అంటించి చెప్పే కథలు శ్రుతి విరుద్ధములే అనాలి. భగవదవతారంలో సుఖదుఃఖాలు ఆ భగవంతునకు అంటవని చెప్తారు. ఆ విధంగా చెప్పడం హేతుబద్ధం కాదు. అవయవానికి కల్గిన గుణాలు అవయవికి ఉండవనడం అనుభవ విరుద్ధం, అసంగతం అశాస్త్రీయం కూడ అవుతుంది కాన అవతారాలు భగవత్స్వరూపాలు అనడం తప్పు.

కర్మబద్ధులైన జీవుల మధ్య కొందరు జీవులు పూర్వ పుణ్యవశంవల్ల ప్రజ్ఞాతిశయం కలవారుగా ఉండవచ్చును. ఆ విశిష్ట జ్ఞానైశ్వర్య వ్యక్తుల్ని లోకులు భగవదవతారాలుగా భావించి పూజించడం జరిగిందని చెప్పాలే కాని కేవలం భగవంతుడే

అట్లాగు పుట్టేడని చెప్పడం మాత్రం కూడదు. అట్లా చెప్పితే అది వేద విరుద్ధమే అవుతుంది. వేదం కంటె మనకు పరమ ప్రమాణం మరొకటి లేదు. అన్ని మతాలు వేదాన్నే ఆశ్రయించి వున్నాయి.

"నిష్కలం, నిష్క్రియం, శాంతం,
దివ్యోహ్య మూర్తః, పురుషః
స, బాహ్యాభ్యంతరో, హ్యజః, ప్రకా
శవత్సర్వగతశ్చ నిత్యశ్చ సఏవ, ఏష
మహా, నజ, ఆత్మా, అమరో, అజ
రో, కదాచి దయం"–

అని శ్రుతి స్మృతులు ఘోషిస్తున్నాయి. పరమాత్మను సంసారిగా పుట్టేడని చెప్పడం ఎంతమాత్రమూ తగదు. భాగవతంలోనే –

శ్లో॥ ఏవం జన్మాని కర్మాణి
హ్యకర్తు రజనస్యచ
వర్ణయంతిస్మ కవయో
వేదగుహ్యాని హృత్పతేః॥
నాస్య కర్మణి జన్మాదౌ
పర స్యాను విధీయతే
కర్తృత్వ ప్రతిషేధార్థం
మాయయా ౽౽ రోపితం హి తత్– అని వుంది.

భారతంలో :–

శ్లో॥ నాహం ప్రకాశ స్సర్వస్య
యోగమాయా సమావృతః
మూ ఢో౽యం నాభిజానాతి
లోకో మా మజ మవ్యయమ్॥

అని వుంది. అవతారాలు నిజంగా జరిగిన చరిత్రలు మాత్రం కావు. అవి అర్థవాదాలు మాత్రమే అనాలి. అర్థవాదాలంటే ఏదో ఒక ప్రయోజనాన్ని ద్ఢపరచే [illegible]తం

చెప్పే కల్పనా విషయాలన్న మాట. ఆ కల్పనా విషయాలవల్ల కవి చెప్పే పరమార్థము ఏమిటో గ్రహించాలే కాని ఆ చెప్పిన కల్పనలన్నీ నిజం అనుకోవటం కూడదు. మనం ఏదైనా విషయాన్ని దృఢంగా నాటుకొనేటట్లు చెయ్యడానికి ఎన్నెన్నో ఉపమానాలు చెప్తాం. గ్రంథాల్లో కూడ అలంకారాలన్నీ ఈ విధంగా విషయదార్ఢ్యం కల్గించడానికి కల్పనాత్మకంగా చెప్పబడి వున్నాయి. ఆ ఉపమానాలు అలంకారాలూ దృష్టాంతాలంకారాలు, సమాసోక్తి అర్థాంతరన్యాసాలు నిజానికి జరిగినవి సత్యాలు అనుకోవడం ఎట్లా కూడదో అవతారాల కథలు కూడ ఆ విధమైన ఉపమానాది అలంకారాలుగా విషయదార్ఢ్యానికి చెప్పబడిన కల్పిత విషయాలే అని తప్పక తెలిసికోవాలి. ఆ అవతార కథలవల్ల చెప్పబడిన వ్యంగ్య విషయాలు గ్రహించి కవి ఉద్దేశమైన పరమార్థం గ్రహించుకోవాలి. కేవల పరమార్థమే చెప్తే, అర్థం చేసికోలేని అజ్ఞానులను జ్ఞానులను చెయ్యడానికి వారికి అర్థమయ్యే విషయాలతో అకల్పనలు చేయబడ్డాయి అనాలి. వేదాల్లో కూడ పరమార్థ విషయదార్ఢ్యానికే ఆఖ్యాయికలు ఎన్నో కల్పింపబడ్డాయి. అవే అర్థవాదాలంటారు.

వ్యాస వాల్మీకులచేత చెప్పబడ్డ భారత భాగవత రామాయణాల్లో ప్రత్యక్షంగా కాక, పై విధంగానే పరోక్షంగా పరమాత్మతత్త్వం అందించబడిందని గ్రహించాలి. పైకొక అర్థమూ, లోపల ఇంకొక అర్థమూ వచ్చేలాగు రచన అసలు ఎందుకు చెయ్యవలసి వచ్చింది ? అనే ప్రశ్నకు ఇంకో సమాధానం కూడ వుంది. ఈ సమాధానం నేటి అమెరికన్ విద్యావేత్తలు మనస్తత్వ శాస్త్ర పరిశీలనతో ఋజువు తేల్చి చెప్పినది.

"సులువుగా గ్రహించి జ్ఞప్తిలో ఉంచుకోడానికి అంతగా శక్యంకాని నిరాకార నిర్గుణ పరమాత్మకు సంబంధించిన విషయాల్ని ఎన్నాళ్లైనా జ్ఞాపకం వుండేలాగు మనస్సుకు హత్తుకుపోయేటట్లు చెయ్యాలంటే, వానిని సమసాదృశ్య ఔపమ్య ధర్మం కల సాకార సగుణ సాంసారిక విషయాలుగా మలచికొని ఆసక్తికరములైన వానినిగా కల్పనచేసి వ్యంగ్య రచనా శైలిలో చెప్పాలి. అప్పుడవి సులువుగా మనస్సున స్థిరపడతాయి. పైకి కన్పించే అర్థం కూడ కొంత ప్రయోజనకరంగానే ఉన్నా, అదే ప్రధానం కాదని తెలుస్తుంది. వివేచనా దృష్టితో పరిశీలిస్తే పైకి అర్థమయ్యే ఆ సాకార సగుణ సాంసారిక విషయాలన్నీ సాధర్మ్యంతో నిరాకార నిర్గుణ పరమాత్మ విషయాలుగా బోధపడతాయి. అట్లు బోధపడడానికే ఆ విషయాల్ని చెప్పే నామవాచక పదాలకు వ్యుత్పత్త్యర్థాలతో అర్థం చెప్పుకోవాలి. అప్పుడు ఆ పదాలు కీలక పదాలుగా తాళం చెవులుగా (key words) పనిచేసి జ్ఞానరత్న పేటికను తెఱచి అంతరార్థ రత్నాలను సులువుగా కరతలామలకం చేస్తాయి. మనస్సుకు సులువుగా అందదం

కోసమూ, చిరకాలం గుర్తులో ఉంచడంకోసమూ చెప్పదలచిన నిరాకార విషయాలను దృశ్యీకరణం (Visualise) చేసి చెప్పాలి. ఈ దృశ్యప్రధం మన ప్రాచీనతత్త్వ బోధకులు కనిపెట్టిన రహస్యం. ఈ అంతరార్ధగర్భిత రచనా శిల్పమే, ఆలోచిస్తే వేదవాఙ్మయంలో అంతటా ఈ శిల్పం కన్పిస్తుంది. అంతా విడమర్చి సరిగా అర్థం చేసికొంటే, అంతరార్ధంగా నిక్షేపించి చెప్పిన నిరాకార నిర్గుణ పరమాత్మ యొక్క తత్త్వము మనకు అందుతుంది. ఈ విధమయిన వ్యంగ్య రచనా కల్పనలలో ఆసక్తిని పెంచడం కోసమూ, చిరకాలం మనస్సులో పాతుకొని జ్ఞాపకకోశంలో ఉండిపోవడం కోసమూ సరైన సమాన ధర్మం కల్గిన కొన్ని అసందర్భాలూ, అశ్లీలాలూ, అసంబద్ధాలూ, అసంగతాలూ అయిన విషయాల్ని కూడ ప్రవేశపెట్టడం ఆదికాలంలోనే జరిగింది ఈ రచనల్లో. ఆ అసందర్భాలూ, అశ్లీల శృంగారాలూ కీలక పదాలను (key words) వ్యుత్పత్త్యర్థంలో విప్పి చెప్పుకొంటే అంతరార్థంలో ఏవిధమైన అసందర్భమూ, అశ్లీల శృంగారమూ మనకు కన్పించదు సరిగదా శిసలైన అసలైన తత్త్వ విషయం సరిగ్గా సూటిగా బోధపడుతుంది. ఇదంతా జ్ఞాపనా శక్తిని (Memory) పరీక్షించడానికి కన్పెట్టిన సులభ బోధనా రహస్యం. ఈ రకం బోధనా శిల్పం మన ప్రాచీన వేదకాలంలోనే వెలసిందని ఇదే విధానాన్ని నేడు అమెరికన్ మనస్తత్త్వ విద్యావేత్తలు 'విద్యా విధానంలో జ్ఞాపనాశక్తి సిద్ధాంతం' (Memory of Education System) అనే పేరుతో ప్రచారంచేసి అది జయప్రదంగా వుందని నిరూపించియున్నామని వారు వ్రాసి ప్రకటించిన వ్యాసాలు చెప్తూన్నాయి ఈ విధంగా దృశ్యీకరణ విధానంలో జరిగిన అంతరార్ధ గర్భిత రచన ఎంత ప్రాచీనమో అంత నవీనము కూడనై యున్నది. దీనిని సార్వకాలికమైనదీ, వివిధ దేశవ్యాప్తమైనదీ అయిన మనస్తత్త్వ శాస్త్ర విషయంగా భావించాలి.

ఈ విధంగా వ్యాస, వాల్మీకులు చరిత్ర వ్రాసిన కవులు కారనీ, జీవితంలో విశేషంగా వేదాంత ప్రబోధ చేసిన వారనీ మనం గ్రహించక తప్పదు. వారు ముఖ్యంగా తమ దృష్టిని అంతా ప్రకృతిని పురుషునిలో ఐక్యం చెయ్యడం అనే సాయుజ్య ముక్తికి సంబంధించిన ఆధ్యాత్మిక తత్త్వాన్ని ప్రచారం చెయ్యడంలోనే లగ్నంచేసి జీవించారు అనిపిస్తూంది. కాన వారి రచనలకు ఆధ్యాత్మికపరంగానే అర్థాలు చెప్పుకోవాలి. కాని అందు చరిత్రకు ప్రాధాన్యం ఇవ్వనే కూడదు.

చిరకాలంనుండి అంతరార్థాల్ని నేను గ్రహిస్తూవున్నా, నేను 1974 లో ఢిల్లీలో అంతరార్థములతో రామాయణ భారత భాగవతోపన్యాసాలు శ్రీ ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసైటీ వారి అధ్వర్యమున ఇరవై ఒక్క ఉపన్యాసాలు ఆంధ్రులు నివసించే అన్ని కాలనీలలోను జరిపేను. అచ్చట గొప్ప గొప్ప పదవులలోనున్న ఆధ్యాత్మ విద్యావేత్తలగు పౌరులు నా ఉపన్యాసాలను బహుశ్రద్ధతో విని నన్ను

'తత్త్వార్థ ప్రబోధక' అను బిరుదముతో గొప్పగా కీ. శే. కొత్త రఘురామయ్య (కేంద్రమంత్రి) గారి అధ్యక్షతతో పెద్ద సభచేసి సత్కరించి ఈ రచనకు ఉత్సాహం కల్గించేరు. ఢిల్లీలోని ఆంధ్రేతర రాలనీలలో కూడ నాచేత ఉపన్యాసాలు జరిపించి వానిని ఆంగ్లంలో అనువదించి శ్రోతలకు విన్పింపచేశారు కూడ. ఇంకా ఆంధ్రదేశం లోని పెక్కుచోట్ల కూడ నా ఉపన్యాసాలు జరిగేయి. అంతరార్థ విషయ పరిగ్రహణం చిరకాలంనుండి చేస్తూ వున్నప్పటికీ నేను నా భార్య శ్రీమతి గౌరీదేవి 7-12-78 తేదీని లక్ష్మీ సాయుజ్యం పొందిన తర్వాత, ఆమె ఆత్మశాంతికోసం రచన దీక్షగా సాగించి ముందు అంతరార్థ రామాయణం ప్రకటించేను. ఇప్పుడీ అంతరార్థ భాగ వతాన్ని మీ ముందు సమర్పించుకొంటున్నాను.

భగవంతుని గూర్చి ఆలోచించేటప్పుడు భగవదావేశం (Intusion) కల్గిన పవిత్ర సమయాల్లో మాత్రమే నేనీ అర్థాలు గ్రహించి నిర్ధారించుకొన్నానని, అవే వ్రాయగల్గేనని సవినయంగా నిజస్థితిని మీకు నివేదించుకొంటున్నాను.

ఎక్కడ మదనపల్లిలోని ఈశ్వరమ్మ కాలనీ? (చిత్తూరుజిల్లా) ఎక్కడ శ్రీవాణీ నిలయం, తణుకు, ప॥గో॥జిల్లా. ఆపైని ఎక్కడ హైదరాబాదు? ఇంత వరకు ముఖ పరిచయమైనా లేక నా అంతరార్థ రామాయణం కొనుక్కొని చదివి నంత మాత్రాన నాయందు అమిత భక్తితో నన్నొక జ్ఞానదేవునిగా భావించి నన్ను అంతరార్థ భాగవత రచనకు తొందరపెట్టి ప్రోత్సహించిన శ్రీ. ఎ. రామస్వామిగారికి (రిటైర్డు పోలీసు కానిస్టేబుల్) ఆయన భార్య శ్రీమతి ఎ. జయలక్ష్మిగారికి, నా ఈ రచనకంతకు శ్రద్ధాభక్తి వినయ విధేయతలతో ఎప్పటికప్పుడు సాపుప్రతి వ్రాసి పంపుచు నన్ను కృతకృత్యుని చేసినందులకు నా కృతజ్ఞతాభివందనములను తెలుపు కొనుచు, "భగవంతుడు వారికి సాయపడి వారి అభీష్టములను నెరవేర్చు గాక" అని ఆశీర్వదించుచున్నాను.

ప్రస్తుత మకాం చిరునామా :-
పి-జె-4 పంజగుట్ట,
హైదరాబాదు-4.

ఇట్లు,
వేదుల సూర్యనారాయణశర్మ,
గ్రంథకర్త.

స్థిరనివాసస్థానం చిరునామా :-
శ్రీ వాణీనిలయం,
టౌనుహాలు వెనుక వీధి, తణుకు,
పశ్చిమ గోదావరి జిల్లా,
Pin 534 211,

# అంతరార్థ భాగవతము

(బ్రహ్మ విద్యా దర్పణము)

## (ప్రథమ భాగము)

1 మొదలు 9 వ స్కంధం వరకు

## విషయ సూచిక


| కథా సూచిక | సాధనా సూచిక |
|---|---|
| **1, 2, 3, స్కంధాలు** | |
| 1. భాగవతావతరణం | |
| 2. వ్యాస శుక మహర్షులు | జ్ఞాన వివరణానుభూతి సాధన |
| 3. పరీక్షిన్మహారాజు కథ | భాగవతోపదేశార్థతా సాధన |
| 4. జనమేజయుని సర్పయాగం | ప్రకృతి పురుషైకీకరణ సాధన |
| **చతుర్థ స్కంధం** | |
| 5. దక్షాధ్వర ధ్వంసం | షోడశతత్త్వ సాధన |
| 6. నారదుని పూర్వజన్మ వృత్తాంతం | దాస్యభక్తి సాధన |
| 7. సనక సనందనాదుల అవతారం | పరబ్రహ్మాన్వేషణా సాధన |
| 8. దశావతారాలు | దశవిధ తత్త్వ సాధన |
| 1. మత్స్యావతారం | అహంకార మమకార నాశన సాధన |
| 2. కూర్మావతారం | షడూర్ముల రక్షణ సాధన |
| 3. వరాహావతారం | భగవన్మనోవృత్తి సంరక్షణ సాధన |
| 4. నరసింహావతారం | బ్రహ్మానంద రక్షణ సాధన |
| 5. వామనావతారం | స్థూల సూక్ష్మ విశిష్టతా తత్త్వ సాధన |
| 6. పరశురామావతారం | పరమాత్మానందానుసంధాన సాధన |
| 7. శ్రీరామావతారం | దశేంద్రియ విలీనీకరణ సాధన |
| 8. బలరామావతారం | ద్వైత భావ నాశన సాధన |

9. బౌద్ధావతారం — నిర్వాణ సాధన
10. కల్క్యవతార సాధన — మాయా నివారణ సాధన
9. ధ్రువోపాఖ్యానం — నిశ్చయతా జ్ఞాన సాధన
10. అంగపుత్రుడు వేనరాజు కథ — మనోబుద్ధి చిత్త త్రిగుణ సాధన
11. పురంజనోపాఖ్యానం — సత్కర్మానుష్ఠాన సాధన

పంచమ స్కంధం

12. జడభరతోపాఖ్యానం — అసంగయోగ సాధన

షష్ఠ స్కంధం

13. అజామిళో పాఖ్యానం — పశ్చాత్తాప స్మరణ సాధన
14. చిత్రకేతూ పాఖ్యానం — మతత్రయైక్య సాధన

సప్తమ స్కంధం

15. ప్రహ్లాదోపాఖ్యానం — బ్రహ్మానంద రక్షణ సాధన
16. త్రిపురాసుర సంహారం — దేహత్రయ త్రిగుణ విజయ సాధన

అష్టమ స్కంధం

17. గజేంద్ర మోక్షణం — జనన మరణ పరిభ్రమణ వినాశన సాధన
18. క్షీరసముద్ర మథనం — సాత్త్విక గుణ మథన సాధన

నవమ స్కంధం

19. అంబరీషోపాఖ్యానం — ద్వాదశీవ్రత సాధన
20. హరిశ్చంద్రోపాఖ్యానం — ప్రకృత్యనుభవ సాధన
21. శ్రీరామ చరిత్ర — దశేంద్రియ విలీనీకరణ సాధన
22. తారాచంద్రుల ప్రణయచరిత్ర — ఉపనిషత్‌జ్ఞాన సాధన
23. యయాతి చరిత్ర — అసంగయోగ సాధన
24. భరద్వాజ జననం. — హఠయోగ సాధన
25. వ్యాసవంశ చరిత్ర — త్రిగుణాతీత స్థితి సాధన
26. నలమహారాజ చరిత్ర — పూర్ణయోగ సాధన

# అంతరార్థ భాగవతము

(కృష్ణ తత్త్వ రహస్యము)

## (రెండవ భాగము)

10, 11, 12 స్కంధాలు

## విషయ సూచిక

దశమ స్కంధం - పూర్వార్ధం


1. శ్రీ కృష్ణ జననం — నిర్వృతి తత్త్వావిర్భావ సాధన
2. శ్రీ కృష్ణుని బాల్యలీలలు — నిర్వృతి మార్గ సాధనా ప్రారంభ విశేషాలు
3. యమళార్జున వృక్ష భంగం — సాత్త్విక ద్వంద్వ వినాశన సాధన
4. కృష్ణుడు గోపకులతో చల్దులు ఆరగించుట — సంచిత కర్మ సాధన
5. గోవులు గోపకులు మాయమగుట — స్వస్వరూప జ్ఞాన సాధన
6. కాళీయ మర్దనం — తమోగుణ మర్దన సాధన
7. దావాగ్ని నిర్వాపణ కథ — సంసారిక ఘోరతాప నివారణ సాధన
8. గోపికా వస్త్రాపహరణం — మాయావరణ నివారణ సాధన
9. యజ్ఞపత్ని ఉద్ధరణం — కర్మయోగ జ్ఞానత్రయ సాధన
10. గోవర్ధనోద్ధరణం — మనోగర్వ నిర్వాపణ సాధన
11. ఇంద్ర గర్వాప కారణం
12. పాఠకుల సందేహాలు — నివారణ
13. రాసక్రీడలు ప్రథమ ఘట్టం — జీవబ్రహ్మైక్య సాధన
14. రాసక్రీడలు రెండవ ఘట్టం — ,,
15. రాసక్రీడలు మూడవ ఘట్టం — ,,
16. రాసక్రీడలు నాల్గవ ఘట్టం — ,,
17. రాసక్రీడలు ఐదోఘట్టం — ,,

18. ఉరగ శాపవిమోచనం శంఖచూడుని వధ — నిరంతర కృష్ణ తత్త్వ సాధన
19. కంస వధ — అపరాశక్తి నిరోధన సాధన
20. గురు పుత్రానయనం — ముక్తికాంక్ష విచ్ఛిత్తి నివారణ సాధన

## దశమస్కంధం – ఉత్తరార్థం

21. జరాసంధవధ — ద్వంద్వ ప్రశమన సాధన
22. రుక్మిణీ కల్యాణం — జీవసందేశ సాధన
23. స్యమంతకోపాఖ్యానం (సత్యభామా పరిణయం) — సత్యజ్ఞాన ప్రకాశాన్ని నిర్వృతి తత్త్వంలో లీనంచేసే సాధన
24. అష్టమహిషి కల్యాణం — అష్టవిధ శక్తుల సాధన
25. పదహారువేల నూరుమంది గోపికల పరిణయం — ఏకోత్తర శత షోడశ కళా సమైక్య సాధన
26. రుక్మిణిపై కృష్ణుని ప్రణయకోపం — ప్రలోభ సంతారణ సాధన
27. నృగమహారాజు చరిత్ర — ఏకైక ముక్తి సాధనావశ్యకత
28. శిశుపాల వధ — అజ్ఞాన నాశన సాధన
29. కుచేలోపాఖ్యానం — శిథిలీకృత వాసనా నాశన సాధన
30. సుభద్రార్జునుల వివాహం — ముక్తి ప్రాప్తి సాధన
31. బహుళాశ్వ శ్రుతిదేవుల చరిత్ర — ప్రకృతి పురుషైక్య సాధన
32. బృందావన విహారం — ఇంద్రియ సమూహ రక్షణా సాధన

## ఏకాదశ స్కంధం

33. కృష్ణావతార పరిసమాప్తి — నిర్వృతితత్త్వ పరిపూర్ణతా సాధన

## ద్వాదశ స్కంధం

34. భాగవత ముఖ్య సందేశం
35. కలియుగ ప్రశస్తి



# అంతరార్థ భాగవతం

## భాగవతావతరణం

శ్లో॥ ఆనందధామని చిదేకరసే ఽ ద్వితీయే ।
తస్మి న్పదే ఽస్తు మమ చిత్త మగోచరే ఽపి ॥

"అగోచరమైనప్పటికీ ఆనందానికి స్థానమైనదీ, జ్ఞానరసమే ప్రధానమైనదీ అగు అద్వైత పదము నందు అది అగోచరమే అయినా, నా మనస్సు దానియందు నిలబడి యుండుగాక" అని పై ప్రార్థనకు భావము.

ఇందు అద్వైతమైన పరమాత్మ ఆనందరూపమనీ, ఆ ఆనందము జ్ఞాన సంబంధమైనదనీ అది ఇంద్రియాలకు కనిపించేది కాదనీ చెప్పబడింది. అంటే పరమాత్మ అనుభూతిచేతనే తెలియవలసిందనీ, ఆ అనుభూతి జ్ఞాన సంబంధంగానే జరగాలనీ, అది ఆనందస్థానమనీ మనకు తెలుస్తూంది. నశించే జగత్తు నందు మమత కలిగి యుండడం అజ్ఞానం. ఏది నశించేదో ఏది నశించనిదో దానిని తెలిసికొనే విమర్శయే జ్ఞానం. ఆత్మ విమర్శ అంటే అదే పరమాత్మ నశించదు. దానికి రూపం లేదు. ఆనందానుభూతి వల్ల ద్యోతకమయ్యేది ఆ ఆనందం జగత్తుకు నశించేది కావడం చేత దాని సంబంధంగా కలిగే ఆనందమూ నశించేదే కాన, జగద్విషయానందానుభూతి పరమాత్మ యొక్క ఆనందానుభూతి కాదు. విషయానందం, విషయము నశించడం తోనే నశిస్తుంది. అది అజ్ఞానానంద మన్న మాట. జ్ఞానానందం ఎప్పుడూ నశించదు. జ్ఞానం శాశ్వత విషయకంగా ఉంటుంది కాన దాని వల్ల కల్గిన ఆనందం శాశ్వతం గానే వుంటుంది. సత్ అంటే శాశ్వతంగా ఉండేది అని అర్థం. చిత్ అంటే జ్ఞానం అని అర్థం. సచ్చిదానందం అంటే శాశ్వతంగా ఉండే జ్ఞానం వల్ల కల్గే ఆనంద మన్నమాట. పరమాత్మ సచ్చిదానంద స్వరూపుడు. అట్టి పరమాత్మను అంటి పెట్టుకొని నా మనస్సు ఉండుగాక" అని పై శ్లోక భావం. ఎప్పుడు శాశ్వతా నందాన్ని అంటి పెట్టుకొని మనస్సు ఉంటుందో అప్పుడు జగద్విషయాలన్నీ నశించి వాసనలు నశించి జీవునకు ముక్తి లభిస్తుంది. ఈ ముక్తికి మార్గములు అనగా శాశ్వతానంద స్థితిని కల్గించే సాధనలు భాగవతంలో చక్కగా చెప్పబడి ఉన్నాయి.

ఆ భాగవత కథలు శుకబ్రహ్మచే పరీక్షిన్మహా రాజునకు చెప్పబడ్డాయి. ఆ కథాసారము మనస్సుకు పట్టించుకోవడం వల్లే పరీక్షిత్తునకు శాశ్వతానందానుభూతి దొరికింది. అందుచేత అతడు ఏడు రోజులలోనే ముక్తి పదం పొందగల్గేడు.

పరీక్షిత్తుకు ముక్తి కల్గించిన భాగవత కథలు విని తదేక నిష్ఠులు కాగల్గేవారికి ఎల్లరకూ ముక్తి తప్పకుండా లభిస్తుంది.

'ముక్తి' అంటే విడిచిపెట్టుట అని అర్థం. జనన కారణములైన వాసనలు విడిచి పోవడమే ముక్తి కలిగితే, అంటే జనన కారణం లేనప్పుడు జీవునకు పరమాత్మత్వం లభిస్తుండి. జీవునికి జనన కారణాలుగా అతడు చేసిన కర్మలలోని మమకారం కారణంగా ఆయా కర్మల యొక్క వాసనలు అంటి వుంటాయి. అవి విడుదల పొందాలంటే ఆ కర్మ వాసనలు అంటే ఆయా కర్మల యందలి మమకారాలు వదలాలి. మమకారం వదలడానికి తిరిగి మమకారం కల్గించే కర్మలు చేయకపోవడం ముందుగా జరగాలి. ఆ పైని ఆ మమకారాల యందు విరక్తి కలగాలి. ఈ విరక్తినే వైరాగ్యం అంటాము. ఈ రకం వైరాగ్యం కల్గడానికి మనస్సును స్వాధీనం చేసేటువంటి అభ్యాసములతో కట్టి వేసి ఉంచాలి. అభ్యాస వైరాగ్యముల వల్ల జన్మ వాసనలు దుల్లిపోతాయి. సాధనలు చేస్తే ఏ రకంగా మనస్సుకు వాసనలు పోతాయో భాగవత కథలు మనకు విశదం చేస్తాయి. ఆ కథలు పైకి సంసార విషయకములుగానే కన్పించినా అందులో అంతరార్థపరంగా సాధనా మార్గం ఇమిడ్చబడి వుంది. ఆ అంతరార్థాలు జాగ్రత్తగా విడదీసికొని సాధనలను గుర్తించినప్పుడు కర్మ వాసనలకు విముక్తి కల్గి తీరుతుంది. బాహ్యార్థాలు మాత్రమే అయితే కొంత వరకే శక్తిని కల్గిస్తాయి. అంత మాత్రం వల్ల వాసనలు విముక్తి కావు. కైవల్యం లభించదు.

కృష్ణ సంబంధమైన కథలన్నీ ముక్తిని చెప్పేవే. కృష్ణ పదానికి భూసంబంధమైన వాంఛలు లేకపోవడం అన్నదే వ్యుత్పత్త్యర్థం. 'ముక్తి' అన్నా అదే అర్థం. కాగా కృష్ణ కథలు ముక్తి కథలే అన్న మాట. కృష్ణుడు భారత భాగవతాల రెండింటిలోను కన్పిస్తాడు.

శ్లో॥ కృషి ర్భూ వాచక శ్శబ్దః ణశ్చనిర్వృతి వాచకః
తయోరైక్యం పరంబ్రహ్మ

'కృష్ణ' ఇ త్యభిధీయతే అని సోపాధిక బ్రహ్మ విద్యాదర్పణ మందు చెప్పబడిండి.

భారత భాగవతాలకు రెండింటికీ వ్యాసమహర్షియే కర్తకావడంవల్ల అందులో చెప్పవలసినవి ఇందులోనూ, ఇందులోని విలాగే సమన్వయించుకోవలసినవిగా రెండింటిలోనూ ఉన్నాయి. ఎప్పుడు ఏకాలంలో వ్రాయబడ్డాయో కాని భారత భాగవతాలు రెండూ విడదీసి ఇటీవల వారు వ్రాయడంలో అక్కడవిక్కడ ఇక్కడివక్కడ చేర్చి వ్రాసేరా అనిపిస్తాయి. ముఖ్యంగా కృష్ణ సంబంధమైన కథలు రెండు గ్రంథాల లోను కన్పిస్తున్నాయి. ఆ కథలకు పూర్వాపరసందర్భశుద్ధి లేని కారణంచేతనే భారత భాగవతాలు చరిత్రగ్రంథాలుకావనీ, అంతరార్థపరంగా అవి ఆధ్యాత్మిక సంబంధాల్ని చెప్పే కథలనీ మనం గ్రహించకతప్పదు. చరిత్రగ్రంథాలే అయితే ఆకాలాల కథలకు కాలక్రమనిర్ణయంతో అనుక్రమణిక ఏర్పడియే వుండేది. అప్పుడు భారత కృష్ణుడు వేరుగాను, భాగవతకృష్ణుడు వేరుగాను ఉండేవారు. కృష్ణకథలలో ఇటువంటి సందర్భశుద్ధి లేని విషయాలు భారతభాగవతాల్ని విడదీసి చెప్పలేనివెన్నో మనకు కన్పిస్తాయి. రెండుగ్రంథాలకు అంతరార్థదృక్పథంలోనయితేనే సమన్వయం బోధ పడుతుంది. ఇద్దరు కృష్ణులు ఒక్కరే అని తెలుస్తుంది.

ఈవిధంగాఉన్న కథాపరమయిన గందరగోళస్థితియే నేను అంతరార్థాలు చెప్పడానికి కారణం అయింది.

పైరెండుగ్రంథాలలోను భారతంలోని కథావిధానం కొంత చరిత్రపరంగా కన్పించినా అది అంతా ఆధ్యాత్మికపరంగా అంతరార్థదృష్టితో మలచుకోదగ్గటుగానే వుంది. భాగవతంలోని కథలలో చరిత్రకంటె ఆధ్యాత్మికదృక్పథంఎక్కువగా కనిపించు తుంది. అందలి చరిత్రకుకూడ అంతరార్థాలతోబాటు ఆధ్యాత్మికతకూడ వుంది. భారత కృష్ణునిలో వాచ్యార్థంలో ఎక్కువగా లౌకికదృష్టి గోచరిస్తుంది. భాగవతకృష్ణునిలో ఎక్కువ అలౌకికదృష్టి కన్పిస్తుంది. అంత లౌకికదృష్టి కాధారంగాఉన్న భారతకృష్ణుని కథలో అంతరార్థపరంగా చూచినప్పుడు అలౌకికదృష్టియే మనకు ఆపాత్రలో కన్పిస్తుంది. ముఖ్యంగా భారతంలోని కృష్ణరాయబారంలాంటి ఘట్టాలలో అత్యంత లౌకికపాత్రగా మలచబడ్డ కృష్ణుడే కన్పిస్తాడు. మఱి ద్రౌపదీవస్త్రాపహరణఘట్టంలో ద్రౌపదికి వస్త్రాలను ప్రధానం చేసినప్పుడూ, అర్జునునికి గీతోపదేశం చేసినప్పుడూ వాచ్యార్థంలోకూడ కేవలం అలౌకికపాత్రగానే కన్పిస్తాడు. కాన భారతభాగవతాల్లోని కృష్ణపాత్ర కంతటికీకూడ మనం ఏకవాక్యత చెప్పాలంటే అంతరార్థపరంగానే చెప్పాలి. కాని వాచ్యార్థంలో కుదరదు. ఇట్టి లౌకికాలౌకికవిషయాల సంకీర్ణతలోనున్న కృష్ణ పాత్రకు ప్రాతిపదికలైన భారతభాగవతగ్రంథాలు చారిత్రకములు అసలు కానేకావనీ అవి కేవలం ఆధ్యాత్మిక జ్ఞానరత్న పేటికలనీ మనకు నిస్సందేహంగానే తోస్తాయి.

# అంతరార్థ భాగవతం

## ప్రథమ, ద్వితీయ స్కంధాలు

### వ్యాస శుక మహర్షుల తారతమ్యం

(జ్ఞాన వివరణ జ్ఞానానుభూతుల సాధన)

"భాగవతం" అన్న పదానికి భగవంతుని సంబంధంగా చెప్పేవిషయం అనేది వ్యుత్పత్త్యర్థం. భాగవతాన్ని వేదవ్యాసమహర్షి వ్రాసేడు. వేదవ్యాసుని కుమారుడు శ్రీశుకుడు. శ్రీశుకునకు వేదవ్యాసుడు భగవంతునిగూర్చి చెప్పే భాగవతాన్ని చిన్నతనంలోనే ఉపదేశం చేసేడు. పదహారేళ్ళ ఎల్ల్రాయంలోనే ఉపదేశమాత్రంచేతనే శుకుడు బ్రహ్మానుభూతిని పొందేడు. "శుకుడు" 'శుకబ్రహ్మ' అయ్యేడు. అంటే తాను బ్రహ్మస్వరూపం అనే ఆత్మానుభవం పొందేడు అన్నమాట.

ఏ క్షణంలో శుకుడు శుకబ్రహ్మ కాగల్గేడో, ఆ క్షణంలోనే అతడు వివస్త్రుడై తండ్రిని విడిచి వెళ్ళిపోయేడు. బ్రహ్మోపదేశంతో శుకుడు హఠాత్తుగా తన్ను విడిచి తనకు చెప్పకుండానే వెళ్ళిపోతూంటే వ్యాసునకు అత డెక్కడకు ఎందుకు పోతున్నాడో అంతుపట్టలేదు. ఓ కుమారా! ఓహో కుమారా! అంటూ అరుస్తూ వ్యాసుడు శుకునివెంట పరువు తీసేడు. అతని కేకలకు చెట్లూ పుట్టలూ కూడ ప్రతిధ్వనించాయి. ఆ స్థితిని పోతన్నగా రీవిధంగా శుకస్తుతిచేస్తూ చెప్పారు.

మ॥ సముద్రై యెవ్వడు ముక్తకర్మచయుడై సన్యాసియై యొంటిఁ బో
వ, మహాభీతి 'యోహో ! కుమార!' యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతన్ బ్రతిధ్వనులు చక్కం జేసె యున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణి మహాధన్యాగ్రణిన్ ధీమణిన్॥

ఆంధ్రభాగవతస్కంధ 55 పద్యం

శుకుడు ముందూ, వ్యాసుడు వెనుకా పోతున్నారు.

దారిలో ఒక కొలనులో దేవతాస్త్రీలు వివస్త్రలై జలకమాడుతూ ఈ దృశ్యాన్ని చూచేరు. శుకుడు ఆ కొలనుగట్టువెంటనే వెడుతూండగా తాము జలమునుండి వెలువడి వివస్త్రలైయుండియే అతనిని సమీపించి మ్రొక్కులు చెల్లించేరు. తర్వాత వ్యాసుడు

తమవైపు వచ్చేటప్పటికి వారికి సిగ్గుకలిగి గట్టుపైనున్న బట్టలు కట్టుకుంటూ మర్మావయవాలు కన్పడకుండా కప్పుకుంటూ సిగ్గుసిగ్గుతో చూచీమాడనట్లు చెట్లుచాటుగా నిలఋడి నమస్కరించేరు. వ్యాసునిమాట వినిపించుకోక శుకుడు అదృశ్యమై పోయేడు.

"నగ్నుండు, తరుణుడునై చను తన కొడుకుంగని వస్త్రధారణంబు లొనరింపక, వస్త్రధారియు, వృద్ధుడునైన తన్నుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులను గని వ్యాసుండు కారణం బడిగిన, వారలు "నీ పుత్రుండు స్త్రీ పురుషులనెడి భేదదృష్టి లేకయుండు, మఱియు నతడు నిర్వికల్పుడు గాన నీకు నతనికి మహాంతరంబు గల" దనిరి. ఇవి భాగవతంలోని మాటలు.

వేదవ్యాసుని వల్లనే బ్రహ్మోపదేశం పొందేడు శుకుడు. అయినా గురువుకూ, శిష్యునకూ అనుభూతిలో ఎంత తేడా యున్నదో చూడండి. మనం వేదవ్యాస శుక బ్రహ్మ పదాల్ని అంతరార్థపరంగా అర్థం చేసుకోవాలి 'వేదం' అంటే జ్ఞానం, వ్యాసము అంటే వివరించి చెప్పడం, వేదవ్యాసుడంటే జ్ఞానవిషయ వివరణం అన్న మాట. ఆ జ్ఞాన విషయం తెలిస్తేనే కాని జ్ఞానాన్ని వివరణంచేసి చెప్పడం జరగదు. అజ్ఞానంతో అజ్ఞానాన్ని కూడ పరిశీలించిన కారణాన కేవల శాస్త్రజ్ఞానికి చివరకు జ్ఞానాల్ని సంగతులు వివరించే శక్తి వచ్చింది. అయినా మొదట్లో ఆ జ్ఞాన విషయాలు అతనికి తెలియకుండా ఆశక్తి రాలేదు. కానీ జ్ఞానోదయం కల్గినా అతనికి అజ్ఞానావరణం వదలదు. చెప్పడానికీ, చేయడానికీ ఏకత్వసమన్వయ అజ్ఞానం వాసనా బీజ రూపంలో వుంటూనే వుంటుంది. జ్ఞానం వృక్షరూపంలో విస్తరించి ఇతరులకు నీడ నిస్తూంటుంది. తాను ఎండలోనే వుండిపోతుంది. అట్టివారు జ్ఞానులేకాని, ముక్తులుకారు. వారి బోధలు ఇతరులకు జ్ఞాన స్థితి గల్గించి ముక్తావస్థను వెంటనే కల్గింపగల సమర్థము లయ్యే వుంటాయి. కాని వారు మాత్రం మరొక జన్మలో అజ్ఞానానుబీజాన్ని విరిచి ముక్తులు కాలేరు. శుకుడు జ్ఞానోపదేశం పొందిన వెన్వెంటనే ముక్తిస్థితిని పొందగల్గేడు. ఆ స్థితి రాగానే నిర్వికల్పుడు కాగల్గేడు. అంటే మొదట కల్గిన జ్ఞానస్థితినుండి మార్పు రానివాడుగానే ఉండగల్గేడు. అప్పుడు అతనికి బట్టతో పనిలేదు. స్త్రీ పురుషభేదమే వానికి కన్పించదు. అతడొక చోటుననే వుండేబుద్ధి వుండదు. అట్టివాడు శ్రీ శుకుడు. అతడు శుకబ్రహ్మ అని పిలువబడ్డాడు. శుకుడన్నది పేరు మాత్రం. అతడు బ్రహ్మ స్వరూపుడు. రూపం అన్న మాటకు ఇక్కడ స్థూలమైన ఆకారం అని కాదు అర్థం. మానసికమైన భావనారూప సూక్ష్మ శరీరం అని అర్థం. ఇక్కడ భావన అంటే బ్రహ్మమయత్వం అన్న మాట. కావుననే అతనికి వాసనలు లేవు. కారణం దేహం

నశించి ముక్తావస్థను పొందినవా డతడు. అతడు ప్రాణోత్క్రమణంవరకు స్థూల దేహంతో వుండి ప్రాణోత్క్రమణంతో జన్మరాహిత్యం పొంది ఆనందమయ పర బ్రహ్మంలో లీనమౌతాడు. స్థూలదేహంతో ఉన్నంతకాలం యితరుల ముక్తికి యత్నిస్తూ జీవిస్తాడు.

అంతరార్ధంలో 'శుకం' అనేది 'సుక' అనేదాని రూపంగా ఇచ్చట మనం చెప్పుకోవలసి వుంది. 'సు' అంటే యోగ్యమైనది అని అర్ధం. 'క' అంటే 'బ్రహ్మ' అని అర్ధం. యోగ్యమైన బ్రహ్మత్వసిద్ధి కలవాడు సుకుడు అన్నమాట. "శ, సయో రభేద:" అని వున్నది. శ, స లకు భేదములేదు. కాన శుకుడు, సుకుడుగా చెప్పుకో వచ్చును. లేదా 'సుఖ' పదం శుకపదంగా మారిందని చెప్పినా చెప్పవచ్చు. 'సుఖ' అంటే ఆనందం అని అర్థము లేదా, శుక్ + అ = శుక అవుతుంది. శుక్ అంటే దుఃఖము అని అర్ధము. 'అ' = అంటే, బ్రహ్మపదార్ధం. దుఃఖమునుగూడ బ్రహ్మముగా చూడగలవాడు శుకుడు. సుఖదుఃఖాలు బ్రహ్మకంటే భిన్నములు కావు అనే అనుభూతి కలవాడు శుకుడు అనికూడ అర్ధం చెప్పవచ్చు. బ్రహ్మ పదార్ధము, అగోచరమైనది. కాన దానిని పేరుపెట్టి చెప్పడం శక్యంకాదు. 'శుక' అంటే 'చిలుక' అనే అర్ధం వుంది కాబట్టి శుకగర్భంనుండి శుకుడు పుట్టినాడంటూ, కథకట్టి అతనిని 'శుకుడు' అని ఉచ్చారణాసామ్యం ఆధారంగా రూపం కల్పించి, చెప్పడం పురాణాల్లో జరిగింది. అంతరార్ధపరంగా ఇట్టి పదాలకు సరైన వ్యుత్పత్తితో అర్ధం చెప్పుకోవాలి. అవి వాచ్యార్ధపరంగా అవిశ్వాసాలకు, అసంబద్ధ కల్పనలకూ, సందేహాలకు తావిస్తాయి. పైకి ఏదో విధంగా రూపం కన్పించే రీతిగా స్థూలాకారములతో చెప్పితేనే తప్ప సామాన్య పాఠకులకు నగ్నంగా బ్రహ్మ విషయాలు వివరించడం శక్యంకాదని మన మహర్షులు వేదంలోనే ఈ విధంగా రూపాలను కల్పనలు చేయడం జరిగింది. దేవతల నందఱను ఇదే విధంగా పరోక్షనామములతో చెప్పడం వేదంలోనే జరిగింది. కనుకనే "పరోక్షప్రియాః దేవాః" అని వేదంలోనే పదే పదే పనికట్టుకొని చెప్పడం జరిగింది కూడ.

ఇప్పుడు మనకు వేదవ్యాసుడంటే జ్ఞాన వివరణం అనీ, సుకపదం సరైనదనీ అంటే బ్రహ్మపదార్ధం అనీ, అది జ్ఞాన వివరణంలోనుండి పుట్టుతుందనీ పై వ్యాస, శుక కథావిషయంవల్ల అంతరార్ధాన్ని మనం గ్రహించగలం. బ్రహ్మత్వ సిద్ధి పొందినవారి దర్శనం కూడ బ్రహ్మత్వస్థితికి తోడ్పడుతుందనీ కేవల జ్ఞానం బోధచేసేవారి దర్శనం వలన పొందజాలమనీ, బ్రహ్మ స్థితికూడ మనకు దేవశాస్త్రీల

వృత్తాంతంవల్ల తెలుస్తూంది. జ్ఞానబోధ పూర్వజన్మ పుణ్యబీజాల పరిపాకం గల వారిలో మాత్రం శాశ్వతంగా ఫలించి బ్రహ్మత్వసిద్ధి కల్గిస్తుందని కూడ తెలిసి కొన్నాము. వాచ్యార్థంలో పితాపుత్రులగు వ్యాస శుకులు వేరైనట్లే అంతరార్థదృష్టిలో కూడ ఒక జన్మకు మరొకరి కారణం అయినా, జ్ఞాన వివరణయూ, ముక్తావస్థాసితులకు సంబంధించిన మనోవృత్తులు వేలువేలుగానే వుంటాయి ఇట్లే భాగవతమంతా అంతరార్థపరంగా సాధకుల మనస్సులో జరిగే భగద్విషయిక మనోవృత్తులే కథా పరంగా ప్రత్యక్షీకరణం చేయబడ్డాయని గ్రహించాలి. అప్పుడే మనం అసలైన అధ్యాత్మిక స్థితికి చేరుకొని, ముక్తావస్థను పొందగల్గుతాము.

## పరీక్షిన్మహారాజు కథ

### (భాగవతోపదేశార్హతా సాధన)

పరీక్షిత్తు అరణ్యంలో వేటకుపోయి దాహాతురుడై శమీకమహర్షి యొక్క ఆశ్రమానికి వెళ్ళేడు. శమీకుడు తపోదీక్షలో ఉండి పరీక్షిత్తును చూడలేదు. ఆ కారణంచే తన్నవమాన పరచినాడని తలచి పరీక్షిత్తు డాఋషి మెడలో చచ్చినపామును చుట్టి వెడలిపోయేడు. తర్వాత శమీకుని కుమారుడు 'శృంగి' అనేవాడు తన తండ్రి మెడలో పామును పడవైచినవాడు "ఏడుదినములలో పాము కఱచి చస్తాడని" శాపం ఇచ్చేడు. పరీక్షిత్తున కాసంగతి తెలిసి పామురాకుండా సముద్ర మధ్యంలో ఏకస్తంభం మేడ కట్టించి అందు నివసిస్తూ వున్నాడు. అప్పుడు శుకుడు పరీక్షిత్తునకు ఏడు దినములు భాగవతశ్రవణం చేయించి ముక్తిని కల్గించేడు.

ఇచ్చట మనం పరీక్షిన్మహారాజు పుట్టు పూర్వోత్తరాలకు సంబంధించిన వృత్తాంతం కూడ కథాపరంగా ముందు తెలిసికొని ఆ తర్వాత దానితో అనుసంధానం చేసి దాని అంతరార్థం కూడ చెప్పుకోవలసి వుంటుంది.

పాండవులలో అర్జునుడు శ్రేష్ఠుడు. అతని కుమారుడు అభిమన్యుడు. 'ఉత్తర' భార్య. ఉత్తర పూర్ణగర్భవతి అయివుండగా అశ్వత్థామ ఆమె గర్భంలోని శిశువును నాశనం చెయ్యడానికి 'బ్రహ్మశిరో' నామకాస్త్రాన్ని ప్రయోగించేడు. ఆ అస్త్రం గర్భస్థ శిశువును నాశనం చెయ్యడానికి రాగానే ఉత్తర శ్రీకృష్ణభగవాను స్తుతించింది. కృష్ణభగవానుడు వెంటనే సుదర్శనచక్రాన్ని ప్రయోగించి బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని

ఖండింపజేసాడు. అప్పుడు ఉత్తర గర్భంనుండి పుట్టినవాడే పరీక్షిన్మహారాజు. పరీక్షిత్తు చివరకు శుకబ్రహ్మవలన భాగవతాన్ని విని ముక్తిని పొందేడు.

ఇక్కడ భాగవతంలో లేకపోయినా భారతంలో ఉన్న జనమేజయునికథను కూడ అనుసంధానంచేసి దానితోకూడ అంతరార్థపరంగా వ్యాఖ్య చేయాల్సివుంది.

జనమేజయుడు పరీక్షిన్మహారాజునకు కొడుకు. అతడు పెరిగి పెద్దవాడయ్యాక తన తండ్రియైన పరీక్షిత్తు సర్పదష్టుడై మరణించిన సంగతిని తెలిసికొని సర్పజాతిపై అమితమైన కోపంపొంది అసలు సర్పజాతే లేకుండా సమూలంగా నాశనం చేస్తానని శపథంచేసి సర్పయాగాన్ని ప్రారంభించేడు. ఆ యాగంలో యజ్ఞకుండంలో పురోహితుల మంత్రబలంవల్ల ఎక్కడెక్కడో వున్న సర్పాలు హోమకుండంలోపడి అగ్నికి ఆహుతి అయిపోయేయి. సర్పాలకు రాజైన తక్షకుడు మాత్రం హోమకుండానికి రాలేదు. పురోహితులు తక్షకుడు ఎక్కడ దాగివున్నదీ మంత్రశక్తివల్ల గ్రహించేరు. తక్షకుడు స్వర్గంలో ఇంద్రుడు కూర్చునివున్న సింహాసనాన్ని చుట్టుకొని దాగికొని వున్నాడు. పురోహితులు ఇంద్రసహితంగా తక్షకుడు హోమకుండంలో ఆహుతి కావడానికి మంత్రోచ్చారణం చేస్తూ "మహేంద్ర తక్షకాయ స్వాహా" (తక్షకుడు ఇంద్రుడితోసహా హోమకుండంలో ఆహుతి యగుగాక) అని ఆహుతి మంత్రాన్ని చెప్పి అగ్నికుండంలో నెయ్యి వ్రేలుస్తున్నారు ఆ మంత్ర బలానికి తట్టుకోలేక ఇంద్రుడితోబాటు, సింహాసనాన్ని చుట్టుకొన్న తక్షకుడు హోమకుండంలో పడడానికి ఆకాశమార్గాన వస్తూ వున్నాడు. అంతలో 'ఆస్తీకుడనే' మహర్షి వచ్చి హఠాత్తుగా హోమాన్ని ఆపుచేయించేడు. జనమేజయునికి జ్ఞానోపదేశం చేసి తక్షకుణ్ణి నాశనం కాకుండా కాపాడి సర్పజాతిని వుద్ధరించేడు.

పై కథల్ని అంతరార్థపరంగా మనం పరిశీలన చేసినప్పుడు మనకు ముక్తి మార్గ గమనం బోధపడుతుంది. భారత భాగవతాలు రెండు గ్రంథాల కథలయొక్క సమన్వయంలోను ఈ పరీక్షిజ్జనమేజయ వృత్తాంతాలు తెలుస్తాయి. రెండు గ్రంథాలు ఒకే కవి వ్రాసినాడు. ఆ కారణంచేత అంతరార్థపరంగా ఇచ్చట భారత భాగవత గ్రంథాల్లోని పరీక్షిజ్జనమేజయ వృత్తాంతములు రెండింటిని జోడించి వివరిసాను.

ఉత్తరకు అభిమన్యునకు పుట్టినవాడు పరీక్షిత్తు. ఉత్తర అనే పదానికి ఉత్+తర అని విడదీస్తే, ఉత్=ఉన్నతస్థితితో, తర=తరింపజేసేది ముక్తి, లేదా, శ్రేష్ఠమైనది అని అర్థం. మనలోపలనున్న మనోవృత్తులలో శ్రేష్ఠమైన మనోవృత్తి,

ముక్తికి సంబంధించినట్టి మనోవృత్తియే అని చెప్పాలి 'ఉత్తర' అనగా ముక్తినికోరే శ్రేష్ఠమైన మనస్సంకల్పం అన్నమాట. అభిమన్యుడంటే మన్యుః = అంటే యజ్ఞము అని అర్థం. యజ్ఞం నిస్స్వార్థకర్మ. దానినే ఇంగ్లీషుమాటతో చెప్తే Sacrifice అనేది సరియైన పదం. "అభితః మన్యుః యస్య సః, అభిమన్యుః" అని వ్యుత్పత్తి. "అభితః మంతా; వ్యాపక విజ్ఞానః అభిమన్యుః" అని కూడ వ్యుత్పత్త్యర్థం చెప్ప వచ్చును. విజ్ఞాన వ్యాప్తికలవాడని దానికి అర్థం. ఈ రెండింటిలో దేనినైనను అంతరార్థంలో చెప్పుకోవచ్చును. నిస్స్వార్థ దృక్పథము లేక విజ్ఞానవ్యాప్తి కలవాడు. అని అభిమన్యు పదానికి అర్థం చెప్పాలి. అసంగవృత్తితో లేకుండ, విజ్ఞానవ్యాప్తితో కూడి శ్రేష్ఠమైన [ఉత్తర] మనోవృత్తి ముక్తిని పొందివుంటుంది కాన అభిమన్యునకు ఉత్తర భార్యగా చెప్పబడింది అనగా అంతటను అసంగత్వంతోఅనగానిస్స్వార్థదృక్పథముతో, లేక విజ్ఞానవ్యాప్తితో చరించే మనోవృత్తి ముక్తినికోరే శ్రేష్ఠమైన [ఉత్తరా]మనోవృత్తి కలసి వుంటాయి అని ఇక్కడ అంతరార్థపరంగా చెప్పుకోవాలి. ఉత్తరా గర్భంలో పరీక్షిత్తుఉండగా అతనిని చంపడానికి అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించేడు. పరీక్షిత్తుఅంటే 'పరితః + ఈక్షా యస్య సః' పరీక్షా అవుతుంది. పరితః = అంతట, ఈక్షతే=చూచేవాడు అనబడతాడు. పరీక్ష అనగా అంతటను భగవంతుని చూచేవాడు అని 'పరీక్షి' అన్నదాని కర్థం. "పరీక్షి ఇవ ఆచరతి" అన్నప్పుడు ఆచారార్థమున 'క్విప్' అనే ప్రత్యయంవచ్చి 'పరీక్షిత్' అనే రూపం ఏర్పడుతుంది. అంతటను భగవంతుని చూచువానిరీతిగా ఆచరించువాడు అని ఈవిధంగా 'పరీక్షిత్తు' పదానికి వ్యుత్పత్త్యర్థం చెప్పుకోవచ్చును. ఇక్కడ పరీక్ష చేయువాడు అనగా విమర్శ చేయు మనోవృత్తి గలవాడు. పరీక్ష దానిపైని 'క్విప్' ప్రత్యయం చేయవచ్చు. అప్పుడు పరీక్షచేయువానివలె ప్రవర్తించు మనోవృత్తిగలవాడు పరీక్షిత్తు అవుతాడు. 'నేతి' 'నేతి' అనే నిషేధవాక్యాలతో "ఇది పరమాత్మకాదు. ఇది పరమాత్మకాదు" అని అన్నింటినీ విమర్శతో పరీక్షిస్తూ చివరకు 'అహం బ్రహ్మాస్మి' అనే సాధన లేక అంతటా భగవంతుని చూచే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధన గలిగే మనోవృత్తి 'పరీక్షిత్' సాధన అనబడుతుంది. ఉత్తరాభిమన్యులకు పరీక్షిత్తు పుట్టినాడంటే సాధకుని యందలి ముక్తిని కోరే శ్రేష్ఠమనోవృత్తికి, నిస్స్వార్థమనోవృత్తితో, లేక విజ్ఞానవ్యాప్తితో కలియటంవల్ల 'నేతి' 'నేతి' అని పరిశీలనచేసే బ్రహ్మ మార్గాన్వేషణావృత్తి జనిస్తుంది అనేది అంతరార్థపరంగా చెప్పుకోవాలి. అటువంటి అన్వేషణా సందర్భంలో సాధకునిలో మాయ ఆవరించి ఆ బ్రహ్మపదార్థాన్వేషణను నాశనం చేసేందుకు ప్రబలమైన

యత్నం చేస్తుంది. 'అశ్వ' అంటే [న+శ్వః] రేపటికి ఉండనిది. అనగా నిరంతరం మార్పుతో వుండేది. అనగా మాయాసంబంధమైన ప్రకృతి అని అర్థం. ఆపైని, "అశ్వ ఇవ ఆచరతి" అని ఆచారార్థక 'క్విప్' ప్రత్యయం చేస్తే 'అశ్వత్' అని అవుతుంది. అంటే మాయవలె ఆచరించునదిఅన్న మాట. అశ్వత్+ధామ, యస్యసః, అశ్వత్థామా" అవుతుంది. ధామా అంటే తేజస్సు; మాయవలె ఆచరించు అపరాశక్తి అన్న అర్థాన్ని ఈవిధంగా అశ్వత్థామ పదానికి అంతరార్థంగా చెప్పుకోవచ్చు. అసంగయోగంతో లేక విజ్ఞానవ్యాప్తితో బ్రహ్మపదార్థాన్ని అన్వేషణచేస్తూవున్న సందర్భంలో, స్థానంలోని అపరాశక్తి విజృంభించి అతనిలోని బ్రహ్మసాధనామనోవృత్తిని నాశనంచేస్తుందనడమే, ఉత్తర గర్భమందున్న పరీక్షిత్తుపైకి బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అశ్వత్థామ ప్రయోగించడం అంటే "శీర్యతే=అనేన ఇతి శిరః" అనే వ్యుత్పత్త్యర్థంలో నశింపుచేయునది 'శిరః' అని అవుతుంది. బ్రహ్మ=పరబ్రహ్మను చేరుకోవాలనే మనోవృత్తిని శిరః= నాశనం చేయునట్టి అస్త్రము 'బ్రహ్మశిరో'నామకమనే అస్త్రం అన్నమాట.

అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించినప్పుడు ఉత్తర కృష్ణ భగవానుని వేడుకుంటుంది. కృష్ణుడు సుదర్శనచక్రాన్ని ప్రయోగించి బ్రహ్మశిరస్సు అనే ఆ అస్త్రాన్ని నాశనంచేస్తాడు. కృష్ణుడు అంటే, "కృషి ర్భూవాచక శ్శబ్దః, ణశ్చ నిర్వృతివాచకః" అన్న వ్యుత్పత్తి ప్రకారం భూసంబంధమైన మనోవృత్తు లేవీ లేకుండా అంటే పునర్జన్మనిచ్చే వాసనావృత్తులు లేకుండా ఉండే నిర్వృతిమనోవ్యాపారం అని కృష్ణ పదానికి అర్థంగా చెప్పవచ్చును. వాసనారాహిత్యమైన మనోవృత్తిని ఆశ్రయిస్తే అది చక్కని జ్ఞానమును దర్శింపజేస్తుంది. చక్కని జ్ఞానదర్శనం అనేది సుదర్శనపదానికి అర్థం. సు=చక్కని, దర్శనం=చూపుగలది అని అర్థము. కృష్ణుడు ఉత్తరగర్భంలోని పరీక్షిత్తును రక్షించడానికి సుదర్శనాయుధం పంపాడంటే ముక్తిని కోరే శ్రేష్ఠమనోవృత్తి, వాసనారాహిత్యాన్ని పొందడంతో చక్కని జ్ఞానావిర్భావం కల్గి సాధకునిలో పరబ్రహ్మనుచూచే మనోవృత్తికి ఆటంకమైనమాయాజాలాన్ని పటాపంచలు చేస్తుందని పైకథకు తాత్పర్యంగా గ్రహించాలి. పరీక్షిత్తు అనగా బ్రహ్మపదార్థాన్ని విమర్శించే సాధకుడు, జ్ఞానావిర్భావంతోకల్గి మాయావరణాన్ని భేదించుకొంటాడని అంతరార్థపరంగా మనకు పైకథవల్ల తెలుస్తూంది.

ఇది ఒకరకమైన ముక్తిసాధన. సాధకుడు మనోవృత్తులన్నిటిలోను శ్రేష్ఠమైన ముక్తి కావాలనే మనోవృత్తి కలిగివుంటూ అన్నిపనులందు ప్రసంగవృత్తితో విజ్ఞానంతో జీవిస్తూవుండాలి. అప్పుడాతనికి అంతటను భగవంతుని, అన్వేషించే జ్ఞానదృష్టి మొద

అవుతుంది. ఆ బ్రహ్మజ్ఞానవృత్తియొక్క ఆవిర్భావమునకు ఆరంభావస్థలోనే దానిని త్రుంచివేయడానికి అపహాశక్తియొక్క మాయాప్రవృత్తికూడ సాధకుని ఆవరిస్తుంది. అప్పుడు సాధకుడు ఐహికవాసనావృత్తులను విడిచిపెట్టి ఆ మాయకు అతీతంగా ఉండాలి. అప్పుడు సాధకునిలో చక్కని బ్రహ్మజ్ఞానంకల్గి అతని సాధన సురక్షితంగా ఉండేటట్లుచేస్తుంది. ఈసంగతి అభిమన్యునిభార్యయైన ఉత్తరయొక్క గర్భంలో పరీక్షిత్తు ఉండగా అతనిని చంపడానికి అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించటం మూలంగా తెలియజేయబడింది. ఉత్తర కృష్ణుని ప్రార్థించగా కృష్ణుని సుదర్శనచక్రం పరీక్షిత్తుని కాపాడింది అన్న కథకంతకూ అంతరార్థం సులభంగానే గ్రహించవచ్చు. ఇదే అర్థంకాకపోతే వాచ్యార్థంలో గర్భస్థశిశువును సుదర్శనం అనే ఆయుధం రక్షించడం వంటిది అర్థవంతంగా కనిపించదు.

కథ : పరీక్షిత్తు అరణ్యానికి దుష్టమృగాల్ని వేటాడటానికి వెడతాడు. అక్కడ తన్ను గుర్తించలేదనే కోపంతో శమీకుడనే మహర్షి మెడలో చచ్చిన సర్పాన్ని చుట్టి బెట్టి ఇంటికి పోతాడు. శమీకుని కుమారుడు శృంగి అనేవాడు వచ్చి తన తండ్రి మెడలో పామును చుట్టినవాడు ఏడు రోజులలో పాము కాటుచే చస్తాడని శాపం పెడతాడు. ఆ శాపం నుండి పరీక్షిత్తుని రక్షించడానికి కశ్యపుడనే మంత్రవేత్త బయలుదేరుతాడు. పరీక్షిత్తుని కాటు వేయడానికి తక్షకుడనే సర్పరాజు బయలుదేరి వస్తూ దారిలో కశ్యపునిచూచి అతనికి ధనము లంచంగా ఇచ్చి పరీక్షిత్తు వద్దకు పోకుండా దారిలోనే కశ్యపుణ్ణి పంపివేస్తాడు.

పరీక్షిత్తు శాపం సంగతి తెలిసి పాము రాలేకుండాఉండడానికి సముద్ర మధ్యంలో ఒంటి స్థంభం మేడ కట్టించుకొని శుక బ్రహ్మర్షి వలన భాగవత గ్రంథ శ్రవణం చేస్తూంటాడు. తక్షకుడు మారువేషంలో వచ్చి పరీక్షిత్తుని కాటువేస్తాడు. పరీక్షిత్తు యొక్క కుమారుడు జనమేజయుడు. సర్పయాగం చేస్తాడు. అన్ని సర్పాలు హోమ కుండంలో పడిపోతాయి. తక్షకుడు ఇంద్రుని సింహాసనాన్ని చుట్టుకొని వుంటాడు. ఇంద్రునితోబాటుగా హోమకుండంలో పడడానికి తక్షకుడు మంత్రశక్తి చేత ప్రేరేపించబడతాడు. అప్పుడు ఆస్తీకుడనే ఋషి జనమేజయునికి జ్ఞానం బోధించి సర్పయాగాన్ని ఆపుచేస్తాడు. ఈ కథకు అంతరార్థం వివరిస్తాను :-

అరణ్యం- 'రణ్యం' అంటే ధ్వనింపదగినది, న + రణ్యం = అరణ్యం, ధ్వనింపని స్థితి, అనగా మిక్కిలి ప్రశాంత స్థితి అని అర్థం. పరీక్షిత్తు అరణ్యానికి వెళ్ళేడు' అనగా సాధకునిలో అంతటను భగవదన్వేషణ చేస్తూవున్న మనోవృత్తి

ప్రశాంతస్థితిని పొందింది అని అంతరార్థం. 'అరణ్యంలో శమీకుణ్ణి చూచేడు'- శమము అనగా అంతరింద్రియ నిగ్రహం- 'శమీ' అనగా అంతరింద్రియ నిగ్రహం గలిగిన మనోవృత్తి అని అర్థం. శమీ పదం మీద స్వార్థమున 'కపీ' ప్రత్యయం చేస్తే 'శమీకః' అవుతుంది. 'శమీ' అంటే ఏది అర్థమో 'శమీక' అన్నా అదే అర్థం- అరణ్యంలో శమీకుణ్ణి చూచేడు. అంటే ఇంద్రియ ప్రశాంతి స్థితిలో సాధకుడు తనలో అంతరింద్రియ నిగ్రహం కలిగిన సంగతిని సాధనలో గుర్తించేడు. కాబట్టి అంతరింద్రియ నిగ్రహంగల మనోవృత్తి అని శమీక శబ్దానికి అర్థం-తర్వాత శమీకుడి మెడలో పరీక్షిత్తు చచ్చిన సర్పాన్ని వేసేడు-సర్పం అంటే 'సర్పతి వ్యాప్నోతి ఇతి సర్పః' అనే వ్యుత్పత్త్యర్థంలో (ప్రసరించునది) వ్యాపించునది మాయ అని అర్థం - చచ్చిన సర్పం అంటే ఫలిత విహీనమైన మాయ అని అర్థం. పామును మెడలో వేశాడు అంటే సాధకుడు తనలో ఈ పైని మాయ అనేది వున్నా అది చచ్చిన దానితో సమానం అనగా, దుష్ఫలితాన్ని ఇవ్వగలది కాదు అని గుర్తించాడు. అని అంతరార్థం చెప్పుకోవాలి తర్వాత శృంగి వచ్చేడు. 'శృంగి' అంటే శృంగము అనగా చిట్ట చివర భాగము. శృంగి అంటే చిట్ట చివరకు కలిగినదియగు ఆలోచనా స్థితి అన్నది అంతరార్థం. "శృంగి వచ్చి ఏడు రోజులలో సర్పంచేత చస్తాడు అని శాపం ఇచ్చాడు" అంటే ఆలోచనలో చిట్ట చివరి స్థితిలో సాధకునికి ఆ చచ్చిన సర్పము అనగా ఫలిత శూన్యమైన దనుకొన్న తనలోని మాయ ఏడు రోజులలో అంటే శరీరములోని సప్తమూల పదార్థాలలో (సప్తధాతువులలో) ఇంకా నిలిచియే వున్నదని గుర్తించడంచేత ఆ మాయ బ్రతికియే యుండి తన యొక్క-ముక్తి సాధనను నాశనం చేస్తుంది అని సాధకునికి 'తోచిండి' అని శృంగి శాపానికి అంతరార్థంగా గ్రహించాలి. తర్వాత పరీక్షిత్తు శృంగి ఇచ్చిన శాపం తెలిసికొని సర్ప భయం చేత సముద్ర మధ్యంలో ఒంటి స్తంభం మేడలోకి తన నివాసం మార్చేడు అంటే సాధకుడు మాయ నుండి తప్పించుకోడానికి సముద్రంలో అంటే భగవత్ ధ్యానం అని అర్థం. 'ముత్' అంటే ఆనందం. స+ముత్ అంటే ఆనందముతో కూడినది; పరమాత్మ అని అర్థం. "సముదం రాతి అనే వ్యుత్పత్తిలో దానిని సముద్ర శబ్దానికి భగవత్ ధ్యాన స్థితియైన ఆనంద గ్రహణం సముద్రం = ఆనందముతో గూడిన దానిని, రాతి = గ్రహించుట అని అర్థము వస్తుంది. ఏకస్తంభ మేడ అంటే అద్వైత సాధన అని అర్థం చెప్పాలి. మాయా ప్రవేశానికి తావు లేకుండా సాధకుడు అద్వైత సాధనలో ఆనందరూప పరమాత్మను ధ్యానం చేస్తూ వున్నాడన్నది పరీక్షిత్తు శాప భయం చేత సముద్రం మధ్యలోని ఏక స్తంభం మేడలో నివాసం ఏర్పరచుకొన్నాడన్న దానికి అంతరార్థం.

శాప కారణంచేత పరీక్షిత్తు వద్దకు కాటువేయడానికై తక్షకుడు పోతూండగా, దారిలో మంత్ర శాస్త్రవేత్తయైన 'కశ్యపు' డనే బ్రాహ్మణుడు తారసపడ్డాడు. అతడు పరీక్షిన్మహారాజుకు పాము కరుస్తే తన మంత్ర ప్రభావంచేత బ్రతికించి బహుమానం పొందాలని వెడుతున్నాడన్న సంగతి తక్షకుడు తెలిసికొన్నాడు. కశ్యపుడు పరీక్షిత్తు వల్ల పొందాలనుకొన్న బహుమానం సొమ్ము తానే ఇచ్చి కశ్యపుణ్ణి వెనక్కి పంపించేశాడు. రహస్య వేషంలో పరీక్షిత్తు వద్దకు వెళ్ళి శుక బ్రహ్మ వల్ల భాగవతం విని అనుభవ సిద్ధిని పొందివున్న అతనిని నిజరూపం ధరించి కాటు వేసేడు. దీనికి అంతరార్థం వివరిస్తాను. 'తక్షకుడు' అని కాదు, తత్‌క్షకుడు అని ఆ పదాన్ని గ్రహించాలి. 'తత్' అనగా పరమాత్మను, 'క్ష' అనగా నాశనం చేయువాడు అని వ్యుత్పత్త్యర్థం వస్తుంది. పరమాత్మ ధ్యాన సాధనను నాశం చేసే మాయా మనోవృత్తి అని దానికి అర్థం చెప్పకోవాలి. ఆ మాయా మనోవృత్తి సాధకునిలోని సప్తధాతువు లలో నుండి పెరిగి సాధకుని సాధనను నాశనం చేసే ఆఖరు సాధనా విఘ్న కార్యంగా భావించాలి. ఏడు రోజులలో పాముకాటుకు గురి కాగలవన్న శాపానికి దేవి అంతరార్థం. బ్రహ్మత్వ సిద్ధి పొందియుండడం వల్ల విఘ్నం అనే పాము కాటు వేసినా చావలేదు. సాధకుడు అమృతుడుగానే వుంటాడు. ఇక 'పశ్యక' అనే పదాన్ని తలక్రిందు చేస్తే 'పశ్యకః' అవుతుంది. పశ్యకః అంటే చూచేవాడు అని అర్థం. అనగా భగవంతుని చూచే సాధనా మనోవృత్తి అని 'కశ్యప', పదానికి అంతరార్థం. పరీక్షిత్తుని అనగా సాధకుణ్ణి మాయ నుండి దూరం చెయ్యడానికి భగవదను సంధాన పరమైన మనోవృత్తి సిద్ధ పడుతుంది. ఆ సమయంలో తక్షకుడు అనగా మాయ ఆ భగవదను సంధాన వృత్తిని మధ్యపెట్టి బైటకు నెట్టివేస్తుంది. మాయా వృత్తి భగవదను సంధాన వృత్తి మధ్యపెట్టి నెట్టివేసి తాను సాధకుణ్ణి భ్రష్టుణ్ణి చెయ్యడానికి యత్నిస్తుంది. అని పై కథకు అంతరార్థంగా గ్రహించాలి.

అయితే అప్పటికే సాధకుడు శుక బ్రహ్మను పొంది అనగా పరమాత్మాను భూతి గల్గిన మనోవృత్తిని పొంది భాగవతాన్ని యావత్తు అంటే భగవద్విషయాన్ని సమస్తమూ విని ఒంట బట్టించుకొన్నాడు. అంటే భగవదన్వేషణ చేస్తూన్న సాధకుడు తనలో సప్తధాతువులలోను మిగిలియున్న మాయ తనమీదకు విజుచుకొని పడకపూర్వమే బ్రహ్మానుభూతిని పొంది (సమస్త భగవద్విషయ రహస్యాలను అనుభవ పూర్వకంగా పొంది) సిద్ధిని పొందిన కారణం చేత సాధకునిలో సప్తధాతువుల నుండి బయలు వెడలిన మాయ అతనిని స్పృశించి కూడా ఏమి చెయ్యలేక పోతుంది. సాధకుడు ముక్తావస్థను పొందువాడు అని అర్థం.

# అంతరార్థ భాగవతం

## మూడవ స్కంధం

## జనమేజయుని కథ

### ప్రకృతి పురుషైకీకరణ సాధన

తర్వాత పరీక్షిత్తుని కొడుకు జనమేజయుడు సర్పయాగం చేశాడు. జనమే జయుడంటే జన+మా+ఈ+జయుడు=జనమేజయుడు అవుతుంది, జన=పుట్టుకకు సంబంధించిన, మా=అనగా మాయ అని అర్థము. 'యా, మా, పా, మా, యా' అని వ్యుత్పత్తి చెప్పినప్పుడు ఏదిలేనిదో అది మాయ అనే అర్థంలో మా=అన్నదానికి మాయ [లేనిది] అని అర్థం చెప్పబడింది. కాన జన=పుట్టుకకు సంబంధించిన 'మా'=మాయ=జనమా అవుతుంది. 'ఈ' అంటే బుద్ధి లేక కోరిక అని అర్థం. "జనమా+ఈ"=జనమే అవుతుంది. అంటే పుట్టుకకు సంబంధించిన కోరికలు అనగా జనన కారణములైన వాసనలు అని అర్థం. జయుడు=అనగా జయించినవాడు. జనమేలను, జయించినవాడు=జనమేజయుడు అని అర్థం.

ఈవిధంగా జనమేజయుడు అనగా జన్మకారణములైన వాసనలను జయించిన ముక్తపురుషుడు అని అర్థం-ఇక్కడ పరీక్షిత్తుని కొడుకు జనమేజయుడు అంటే భగవ దన్వేషణాసాధనకు జనన కారణవాసనా విజయం సంభవిస్తుంది. అనే అంతరార్థం మనం సులభంగానే బోధపడుతుంది. సర్పయాగంలో యాజ్ఞికులు 'సహేంద్రతక్షకాయ స్వాహా' అని మంత్రం ఉచ్చరించేరు. ఇంద్రపదం భగవంతుణ్ణి చెప్పేదిగా వేద భాష్యంలో వుంది. భగవంతుణ్ణి మాయ ఆవరించి వుంటుందనడమే తక్షకుడు ఇంద్ర సింహాసనాన్ని చుట్టుకొన్నాడనడంలోని అంతరార్థం. 'సహేంద్ర తక్షకాయస్వాహా' అన్న మంత్రం భగవంతునితోసహా అతనిని చుట్టివున్న మాయ నశించాలి అనే అర్థాన్నిస్తుందన్నమాట. అంటే జనన కారణ వాసనారహిత మనోవృత్తిని అనగా భగవ ద్వృత్తినికూడ మాయకారణంగా నశింపజేసే, తొందరపాటుతో జరిపే అనాలోచితకర్మ సాధన భగవదస్తిత్వాన్నే నాశంచేసి సాధకుణ్ణి నాస్తికుణ్ణి చేస్తుంది. అప్పుడు సాధకుడు నాస్తికుడయ్యే ప్రమాదం సాధనలో వాటిల్లిందన్నమాట. భగవంతుని చేరాలన్న తొంద రలో సాధకుడు భగవంతుని అస్తిత్వబుద్ధినే నాశంచేసే స్థితికికూడ సంకల్పించడం జరుగు

తుందనే ఒకానొక హెచ్చరిక సాధకులకు ఈ కథలో ఉపదేశంగా వ్యాసభగవానుడు పైకథలో అంతరార్థపరంగా నిక్షేపించినాడని చెప్పాలి.

ఆ సమయంలో 'ఆస్తికుడు' అనే ఋషివచ్చి జనమేజయుణ్ణి ప్రబోధించి సర్ప యాగాన్ని విరమింపజేశాడు. అంటే అంతటి ప్రమాదస్థితిలో పడికూడ సాధకుడు వెన్వెంటనే తేరుకొన్నాడని, భగవంతుని అస్తిత్వబుద్ధిని గ్రహించి, మనోవృత్తితో మాయావినాశ ప్రయత్నాన్ని విరమిస్తాడనీ అంతరార్థ పరమార్థం ఇక్కడ ద్యోతక మౌతూంది. ఈ జనమేజయ సర్పయాగకథలో మనం సాధనావిచ్ఛిత్తి రహస్యాన్ని తెల్సికోగలం.

ఇప్పుడు పరీక్షజ్జనమేజయుల కథల యొక్క సమన్వయంతో మనం ముక్తిని సాధించడానికి మాయచేసే అవరోధాన్ని ఎదుర్కొని విజయం పొందడం, ఆ విజయ గర్వంతో అసలు మూల వినాశనానికి దారిచేసే నాస్తిక తత్త్వానికి తలవొగ్గడం, ఆ తర్వాత తన ప్రమాదాన్ని గుర్తించి ఆస్తికత్వం నిల్ద్రొక్కుకోవడం అనే విషయాలు ఈ కథలలో మనకు సంపూర్ణంగా ద్యోతకమౌతున్నాయి. అంతేకాక మాయను బుజ్జగించి తొలగించుకొని ముక్తిని పొందాలేకాని పూర్తిగా మాయను నాశం చేయడం జరిగేపని కాదని మనకు తెలుస్తూంది.

జనమేజయుడు సర్పయాగం తలపెట్టేడు. 'సర్పతి వ్యాప్నోతి ఇతి సర్పః' అనే వ్యుత్పత్త్యర్థంతో సర్ప అనగా ఆవరించియుండు మాయ అని అంతరార్థ పరంగా వ్యుత్పత్త్యర్థం చెప్పుకోవచ్చు. సర్పయాగాన్ని అంటే మాయా సంహరణం అనే కార్యక్రమాన్ని జనన కారణ వాసనా విజయాన్ని సాధించిన మనోవృత్తి తలపెట్టింది అని అంతరార్థం. తనకు జనన కారణ వాసనలు లేకపోయినా తనలో వున్న మాయ, తన్ను ఏమీ చేయకపోయినా అసలు 'మాయ' అనేది తనలో చోటు చేసికోకుండా ఉండడానికి యావత్తు మాయను నాశనంచేసి తీరాలి అని ముక్తావస్థితిని పొందిన మనోవృత్తి యొక్క ప్రయత్నంగా జనమేజయుని సర్పయాగ ప్రయత్నానికి అంత రార్థం చెప్పాలి.

యజ్ఞకుండంలో సర్పాలు అన్నీ పడి పోయినా తక్షకుడు పడలేదు. ఇంద్రుని సింహాసనాన్ని చుట్టుకొని దాగివున్నాడు. అంటే అన్నిరకముల మాయావృత్తులు నశించినా, పరబ్రహ్మ పదార్థాన్ని కనిపించకుండా చేసి ఆవరించివున్న మాయా వృత్తి నశించదు. అది పరబ్రహ్మ స్వరూపాన్ని ఆవరించి అంటిపెట్టుకొనే వుంటుంది. ఇంద్రపదం పరమాత్మ అనే అర్థంలో వేదంలో ప్రయోగించబడివుందని చెప్పుకొని

యున్నాము. తత్క్షకుడు ఇంద్రసింహాసనమును చుట్టుకొని వున్నాడంటే పరమాత్మను తెరవలె మాయ కూడ ఆవరించి ఉన్నదే అని అర్థం—మాయ అనగా ప్రకృతి అని అర్థం—ప్రకృతిలో లీనమై అదృశ్యంగా పరమాత్మ ఉన్నాడన్నది వేదాంత రహస్యం-ప్రకృతిని ఆధారం చేసుకొననిదే పురుషశక్తి యొక్క ఉనికిని గ్రహించలేము. 'శివ శ్శక్త్యాయుక్తో, యదిభవతి, శక్తః ప్రభవితుం నచేదేవందేవో, నఖలుకుశలస్స్పందితుడు, అన్నారు ఆదిశంకరులవారు. అందే ప్రకృతితో కూడి పరమాత్మ స్పందనాదులు చేస్తున్నాడు. ప్రకృతి లేకపోతే పరమాత్మ స్పందనారహితుడు అని దాని అర్థం. ఈ విధంగా ప్రకృతి పురుషుల ఏకీకరణము సాధనలలో ముఖ్య సాధనగా గ్రహించాలి.

# అంతరార్థ భాగవతం

### నాల్గవ స్కంధం

## దక్షాధ్వర ధ్వంసం

[షోడశ వక్త్ర సాధన]

నాల్గవ స్కంధంలో మొదటి కథ దక్షాధ్వరధ్వంసానికి సంబంధించింది.

కథ :- బ్రహ్మ మానస పుత్రులలో నొకడు 'దక్షుడు'. ఇతడు ప్రజాపతులలో నొకడుగా నున్నాడు. ఇతనికి మనువుయొక్క కుమార్తె 'ప్రసూతి' అను భార్య. ప్రసూతియందు దక్షప్రజాపతికి పదునార్గురు కుమార్తెలు పుట్టేరు. అందు 1. శ్రద్ధ 2. మైత్రి 3. దయ 4. శాంతి 5. తుష్టి 6. పుష్టి 7. ప్రియ 8. ఉన్నతి 9. బుద్ధి 10. మేధ 11. తితిక్ష 12. హ్రీ 13. మూర్తి 14. స్వాహా 15. స్వధా 16. సతి అను వారు. వీరిలో మొదటి పదుమువ్గురు కన్యలను దక్షుడు ధర్మున కిచ్చి పెండ్లి చేశాడు. స్వాహా అనుదానిని అగ్నిదేవునకు స్వధ యనుదానిని పితృదేవతలకు మిగిలిన 'సతి' అనుదానిని జనన-మరణాల నివర్తకుడగు అభవునకు ఇచ్చి పెండ్లి చేశాడు.

దక్షకన్యలలో మొదటి పడిహేనుమందికి సంతానం కలిగింది. అభవునికి భార్యయైన సతికి మాత్రం సంతానం లేదు.

ఒకప్పుడొక యజ్ఞసందర్భంలో చేరిన బ్రహ్మను మహేశ్వరాది దేవగణమూ, ప్రజాపతులూ, మునులూ పరివేష్టించి యుండగా దక్షప్రజాపతి ఆ యజ్ఞశాలకు వచ్చేడు. అతడు చాలా మహిమాన్వితుడు. బ్రహ్మదేవుడు ఈశ్వరుడు తప్ప మిగిలిన వాళ్ళంతా లేచి ఆయనకు స్వాగతం చెప్పేరు. దక్షుడు నిజజనకుడైన బ్రహ్మదేవునకు మ్రొక్కి తక్కినవారి నందరను చిరునవ్వుతో చల్లని మాటలతో గౌరవించి శివుడు తన్ను గౌరవించి పల్కరించలేదని అతని తిరస్కార భావముతో చూచి "ఈతడు క్రియాహీనుడు, మానహీనుడు, మర్యాద లేనివాడు, దిగంబరుడు, భూతివిప్తుడు, భూత పరివేష్టితుడు, శ్మశాన సంచారి, ఇతనికి నా కూతురి నిచ్చియున్నాను. ఆ కారణం చేత ఇతగాడు శిష్యప్రియుడు. నే నీతనికి గురువునౌదును. ఇతనికి నేనన్న ఎంత తేలికతనమో ఇప్పుడు తెలిసినది. ఈతనికి దేవతలందఱకు యజ్ఞములలో ఇచ్చినట్లుగా యజ్ఞ హవిర్భాగములు ఇంతటినుండి లేకుండు' నని శపించేడు. కొంతకాలం తర్వాత దక్షుడు అరుద్రకమైన అనగా రుద్రునికి హవిర్భాగం లేనట్టి యజ్ఞం తలపెట్టేడు. రుద్రుని ఆ యజ్ఞానికి పిలవనేలేదు. దేవతలందఱూ మునులందఱూ యజ్ఞమునకై పోతూండగా సతీదేవి తన తండ్రి చేయు యజ్ఞానికి తానుకూడ వెడతానని శివుణ్ణి పట్టుపట్టింది. భర్త కాదన్నా మాట వినిపించుకోకుండా తండ్రి ఇంటికి బయలుదేరి వెళ్ళింది. అక్కడ ఆమె తల్లి సోదరులు చూచనైన చూడలేదు. తండ్రి అవమానించి ఘోరంగా తన భర్తను నిందించిన కారణంచేత సతీదేవి స్వయంగా యోగాగ్ని సృష్టించి అందులో దగ్ధమైపోయింది.

ఆమెతో కూడ వచ్చిన శివుని సేనాపతి వీరభద్రుడు యజ్ఞాన్ని పాడుచేసి దక్షుని శిరస్సు తెగవేశాడు. తర్వాత దేవతలు, మునులు బ్రహ్మను ప్రార్థించి దక్షుని మొండెమునకు మేక తలకాయను అతికించి బ్రతికింప జేశారు.

ఈ కథలో దక్షకన్యల పేర్లు పరిశీలిస్తే ఇది జరిగినది కాదనిపిస్తుంది. కథ పరోక్షం చెయ్యబడిందని ఇందేదో అంతరార్థం ఉండి వుండాలని అనిపిస్తూంది.

శ్రద్ధ, మైత్రి, శాంతి మొదలగు పేర్లతో దక్షప్రజాపతి కూతుళ్లగా పేర్కొన బడ్డంలోనే కథ అంతా పరోక్షం చెయ్యబడిందని తెలియడమే కాకుండా పరోక్షం చెయ్యబడ్డ కథాభాగం ఏ విధంగా ప్రత్యక్షంగా చెప్పవచ్చునో కూడ సులువుగానే ఇందు మనకు అంతరార్థం అర్థమౌతూంది. దక్షుడంటే సమర్థుడు అని అర్థం. దక్షుడు బ్రహ్మయొక్క మానసపుత్రుడు - అంటే పరమాత్మ యొక్క

మనస్సంకల్పమే యైన లీలద అని అర్థం. ఈ జగత్తులోని సామర్థ్యవంతములైన అన్ని సంకల్పాలకు మూల భూత మైనదీ, అన్ని క్రియలకు మూలాధారమైనదీ 'ప్రకృతి' అనే పేరుతో పిలవబడుతుంది. ఆ ప్రకృతియే జీవాత్మ. అదే ఇచ్చట "దక్ష" పదంతో చెప్పబడింది.

దక్షునకు ప్రసూతి భార్య, ప్రసూతి అంటే విశేషమైన జనన వ్యాపారం అన్న మాట. జీవుని అంటియుండే వాసనాంశమే ఈ ప్రసూతి పదానికి అర్థం— జీవుడు వాసనా వశంవల్ల అనేక జన్మలతో అనేక కార్యాలు ఆచరిస్తాడు. దక్షునకు ప్రసూతి వల్ల 16 గురు కూతుళ్ళు పుట్టేరు. వారు 1 శ్రద్ధ 2 మైత్రి 3 దయ 4 శాంతి 5 తుష్టి 6 పుష్టి 7 ప్రియ 8 ఉన్నతి 9 బుద్ధి 10 మేధ 11 తితిక్ష 12 హ్రీ 13 మూర్తి 14 స్వాహా 15 స్వధా 16 సతి అనువారు. వీరిలో మొదటి పదముగ్గుర్ని ధర్మున కిచ్చి పెండ్లి చేసేడు. పదునాల్గవదియగు స్వాహాను అగ్నికిచ్చినాడు. పదిహేనవదైన స్వధను పితరుల కిచ్చేడు. 16 సతిని భవున కిచ్చేడు.

ప్రజాపతి అంటే సంతానమునకు కర్త అని అర్థం.దక్షుడు అంటే జీవుడని కదా చెప్పుకొన్నాం. ఇక్కడ జీవుడు సాత్త్విక వాసనావృత్తులు కలవాడనీ, ఆ సాత్త్విక వాసనావృత్తులే శ్రద్ధ మొదలగునవి అనీ గ్రహించాలి. అందు శ్రద్ధ మొదలు మూర్తి వరకూగల పదమూడు మానసిక వృత్తులు ధర్మమునకు సంబంధించినవి. వానిని ధర్మునికిచ్చి వివాహం చెయ్యబడ్డట్టు చెప్పిన దానిలో అంతరార్థం అదే. పధ్నాల్గవది 'స్వాహా' అంటే స్వ+అహా; అహా అంటే; 'హా' అన్నదానికి 'హంతి' ఇతి హా అని వ్యుత్పత్తి చెప్పాలి. అంటే చంపేది మరణం అని అర్థం. న+హా=అహా అంటే, చంపడమనేది లేనిది అనగా చావు లేనిది అని అర్థం. 'స్వ' అనగా పరమాత్మ యొక్క నిజ రూపం అని అర్థం. అది చావు లేనిది. పరమాత్మకు సంబంధించిన నిజరూపం 'అగ్ని'కి ఇవ్వబడింది. అగ్రి అనేదే అగ్ని పదంతో ప్రత్యక్షం చెయ్యబడిందని వేదభాష్యంలో చెప్పబడింది. 'అగ్రి' అంటే మొట్టమొదటిది, చిట్టచివరిది అనికూడ అర్థం కాన ఆద్యంతాలు తానే అయిన పరబ్రహ్మమే 'అగ్రి' అంటే. ఈ విధంగా అగ్రి పదం ఉచ్చారణాసాదృశ్యంతో ఆద్యంతాలు తానేయైన పరబ్రహ్మ పదానికి ప్రత్యక్ష రూపం. జ్యోతిరూపంతో కూడా సామ్యంచేసి 'అగ్రి' యే అగ్నిగా ప్రత్యక్షం చెయ్యబడిందని వేదార్థం చెప్పే భారతీ నిరుక్తి అనే గ్రంథంలో చెప్పబడి ఉంది.

ఇక పదిహేనవది స్వధా. 'స్వధా' అంటే స్వ= "స్వస్మిన్ ధీయతే ఇతిస్వధా"

అనే వ్యుత్పత్తిలో స్వస్మిన్ అనగా పరమాత్మ యందు లింగ శరీరము అనగా కారణ దేహము, ధీయతే= ఉంచబడుచున్నది అని అర్థం. అనగా పరమాత్మ యందు జీవరూపమున పునర్జన్మ మొందుటకు ఉంచబడేది లింగ శరీరంగా పేర్కొనబడింది. అది పితరులకు ఇయ్యబడింది. అంటే పితృలోకంలోని దేవతలు మరణించిన జీవులను తమలోకంలో వుంచి పునర్జన్మను కల్గిస్తారన్న విషయం ఇక్కడ గ్రహించాలి. ఇంతవరకు జీవుడు ప్రకృతిలోనుండి ధర్మంగా శ్రద్ధాదులతో కూడి జ్యోతి స్వరూపమై పరమాత్మతో కూడి పునర్జన్మల నందుతూ, అటుపిమ్మట చిట్ట చివరకు కైవల్యం పొందడం జరుగుతుంది అని దక్షసంతతికి అంతరార్థం చెప్పాలి. 'సతీ' అంటే ఎల్లకాలం ఉండే పరమాత్మను గూర్చిన మనోవృత్తి అని అర్థం. సత్, చిత్, ఆనందం అనేవి పరమాత్మకు చెప్పే పదాలు; సత్ పదానికి స్త్రీలింగంలో 'ఙీప్' ప్రత్యయం చేస్తే సతీ అని అవుతుంది. అప్పుడు పరమాత్మను గూర్చిన అఖండ మనోవృత్తి అనే అంతరార్థాన్ని ఇస్తుంది. ఎల్లప్పుడూ పరమాత్మతో జతపరచి వుంచిన అఖండ మనోవృత్తియే ముక్తి సాధనకు ఆఖరు సాధనగా గుర్తించాలి. సతీదేవిని అభవుని కిచ్చేడు. అభవుడు అంటే భవము లేని వాడు. అంటే పునర్జన్మ లేని వాడగు సచ్చిదానందరూప పరమాత్మ అని అర్థం. జీవుడు (దక్షుడు) సద్వాసనావృత్తులతో (దక్షకన్యలతో) క్రమ క్రమంగా పదహారు సాధనలతో పరమాత్మను చేరుకోవలసివుంటుంది అన్న సాధనారహస్యం దక్షునకు ప్రసూతివల్ల కల్గిన పదహారుగురు (షోడశ) కూతుళ్ళ పదహారు ముక్తి సాధనలు, ఈ వృత్తాంతం వల్ల మనకు అంతరార్థ పరంగా తేటపడుతోంది పదహారవది 'సతి' ఇది షోడశకళ. అది అభవత్వం (జన్మరాహిత్యం) కల్గిస్తుంది. పై పదహారుగురు పేర్లు వేరుగా పరోక్ష నామాలు చెప్పనక్కరలేకుండా ప్రత్యక్ష నామాలతోనే పేర్కొనబడటం, ఇందు జరగడంవల్లనే ఈ దక్షకథ నిజంగా జరిగింది కాదనీ షోడశ ముక్తి సాధనా పరమై కథారూపం దాల్చిందని మనకు సులభంగానే తెలుస్తూవుంది. కాకపోతే ఆపేర్లతో దక్షకన్యలను పేర్కొనవలసిన పని కవికి కన్పించదు. వ్యాసమహర్షి వాల్మీకి వలె కాక భాగవత కథలలో అంతా పరోక్షం చెయ్యడు. అక్కడక్కడ సగం ప్రత్యక్షం చేసి చూపిస్తూ ఆసక్తి కోసమూ జ్ఞాపకంలో ముంచు కోవడం కోసమూ మాత్రం కొంత కథనే వ్యంగ్యరచనతో పరోక్షం చేస్తూండడం మనం ముందు ముందు కూడా కథలలో బాగా చూడగలం. సతీదేవిని అభవునకిచ్చి వివాహం చేసి మాయమైన పెద్దరికం పొందిన దక్షుడు తన్ను అందచిపలె ప్రత్యుత్థాన సంభాషణాది సత్కారములతో గౌరవించ లేదని అభవునిపై క్రోధంపూని అతనిని శపించేడు,

అంటే సాధకుడగు జీవుడు ముక్తి కొఱకు సాధనలు చేస్తున్నా ముక్తావస్థ దగ్గఱకు వచ్చినాని ఆఖరుస్థితిలో ఆ పరాశక్తి యొక్క మాయచేత అహంకారాన్ని పెంచు కోవడం జరుగుతూంటుందని, ఆ అహంకార ప్రాబల్యంవల్ల తన ముక్తికి సాధనంగా తానై సమర్పించిన ఆఖరుదైన అఖండ మనోవృత్తిని ఏపరమాత్మకు అర్పించేదో, అర్పించినప్పటికీ, ఆ పరమాత్మ తనకు ఇంకా కైవల్యం ఇవ్వలేదనే అహంకారంకల్గి సహించలేకపోవడం సాధనయొక్క చివరి అవస్థలో విఘ్నస్థితి కొందరిలో జరుగు తూంటుందనీ తనయొక్క సాధనా ప్రాబల్యం పైగల అహంకారం సాధకుని చిట్ట చివరి సాధనాదశలో తప్పటడుగు వేయిస్తూందనీ ఇది అహంకారప్రాబల్యం యొక్క దుష్కార్యం అనీ ఇక్కడ సాధకుడు మెలకువ కల్గియుండాలనీ అంతరార్ధపరంగా సాధనా రహస్యాలను తెలిసికోవాలి. లోకంలో సాధకులు సాధనలు తీవ్రతరంగా సాగించి తమకు సిద్ధి లభించలేదని సహనం కోల్పోయి అసలు పరమాత్మయొక్క ఉనికినే శంకించే దౌర్బల్యస్థితికి గురిఅవుతూంటారు. చిట్ట చివరికి వారు తామే దైవమైనట్లు భావించి నాస్తికులుగా తయారవుతారు. వారు తమకు సాధనా బలంవల్ల కల్గిన ప్రకృతి వశీకారశక్తులవల్ల అహంకారం పొంది దైవం తనకు వశపడినట్లు భావించి ఆశక్తుల ప్రభావంతో ప్రజలచే తానేదైవంగా కొలించుకుంటూ కులుకుతూంటారు. వారు కైవల్యం పొందలేని యోగభ్రష్టులు. అట్లే ఇచ్చట దక్షుడు దేవతలందరూ తన్ను గౌరవింపగా అభవుడు గౌరవించలేదని అభవుని మీదనే శాపం ఇవ్వడానికి ప్రయత్నించాడన్న దానికి ఈ విధంగా యోగసాధనాభ్రష్టత్వం జరగడాన్ని అంతరార్ధ పరంగా మనం గ్రహించాలి.

ఆ తర్వాత సతీదేవి అగ్నిలో దగ్ధం అవుతుంది అన్నదానికి సాధకునిలో అంతవరకూ ఉన్న పరమాత్మ పరమైన అఖండమనోవృత్తి నాశనమౌతుంది అని అర్ధం.

తర్వాత దక్షునకు మేకతల బ్రహ్మదేవునిచే అతికించబడినది, అంటే జీవుడు లేనిదే పరమాత్మను సాధించడం జరగదు కాన జీవుణ్ణి పూర్తి నాశనం చేసినట్లు కథలో చెప్పకూడదు. అందుచే దక్షుణ్ని బతికించడం జరిగింది. మేకతలను అతి కించడంలో అంతరార్ధం ఏమిటంటే మేకతల ఎప్పుడూ అధోముఖంగా ఉంటుంది. వినయవిధేయతలకు చిహ్నంగా మేకతలను పోలిక చెప్తారు. జీవు డెప్పుడూ పర మాత్మకు వినయవిధేయతతో అతని అస్తిత్వాన్ని గుర్తించాలి. అంతేకాని ప్రకృతి శక్తులు లభించడంతో తానే దైవమని తిరిగితే పతనం తప్ప మరొకటి కాదు అని చెప్పడానికే అట్లు మేకతలను అతికించడం జరిగిందని అంతరార్ధపరంగా చెప్పవచ్చు.

ఈ విధంగా దక్షునికథ మనకు సాధకుడు చేసే పదహారు సాధనల్లోను చివరివరకు అంటే కైవల్యసిద్ధి వరకు జాగ్రత్తతో సంచరించాలని, అహంకార గర్వం పనికిరాదని ఈ కథ షోడశీసాధనా రహస్యాన్ని చెప్తూందనీ భావించాలి.

పరీక్షిత్తునకు ముక్తిసాధనలను ముందు చెప్పదలచుకొన్నాడు. కనుక శుక బ్రహ్మ ముందుగా హెచ్చరికకై దక్షాధ్వరధ్వంస కథను ఎన్నుకొనడం చాల సబబుగా నున్నదనీ ఉపక్రమం చాల చక్కగా ఎన్నుకొనబడిందనీ మనం గ్రహించాలి. దక్షుడు అనగా సమర్థుడు జీవుడు.

ఈ కథలోని షోడశీ సాధన :- సాధనకు ముందు (1) శ్రద్ధ వుండాలి. తర్వాత (2) అందరియందు మిత్రభావం వుండాలి, (3) బాధితులను దయతో చూడాలి, (4) మనస్సు శాంతితో నిండివుండాలి, (5) నిత్య సంతోషిగా వుండాలి, (6) దౌర్బల్యము లేక మనస్సు పుష్టిగా వుండాలి, (7) అందఱకు ప్రియకరుడుగా వుండాలి, (8) ఉన్నత దృక్పథముతో వుండాలి — (9) జ్ఞానము కల్గివుండాలి, (10) తెలివిగా వుండాలి. (11) కష్టములందు సహనశక్తి కల్గివుండాలి, (12) మర్యాద అనగా హద్దు తెలిసిన వినయ ప్రవర్తన కల్గివుండాలి, (13) స్వరూప జ్ఞానం కల్గివుండాలి, (14) ఈ పదమూడు గుణాలు ధర్మప్రవర్తనతో కలిపి యుంచాలి. అటు తర్వాత (14) స్వాహా సాధనను అనగా నేను నశించువాడనుగాను, అమృతుడను అనే భావ సాధనను అగ్నిలో అనగా ఆద్యంతరూపుడగు పరమాత్మలో భావముతో కలిపి యుంచాలి. (15) ఆపైని స్వధా, సాధనను, అనగా తన మరణం తర్వాత లింగదేహం పితృలోకంలో (అనగా సర్వులకు పితరులగు ప్రకృతి పురుషుల ఐక్యభావ సాధనలో) నివసిస్తుందని భావించాలి. (16) ఆ పిమ్మట తాను అభవునిలో సచ్చిదానంద స్వరూప పరమాత్మతో సతీరూపముతో అంటే నిరంతర భావనా సాయుజ్యంలో వుంటాననే సాధనను భావించాలి. ఇవి షోడశకళలు. కళ అనగా, క అంటే సుఖం అనగా ఆనందం అని అర్థం. లాతి గృహ్ణాతి ఇతికళా అనే వ్యుత్పత్తిలో 'ల' అంటే ముక్తి సుఖమును అందచేసేది అని అర్థం. ఇందు చిట్ట చివరిది 'సతీసాధన' అనగా అఖండ ధ్యానం. ఈ చివరిది షోడశి అన్న ఆఖరు కళ. మిగిలిన పదిహేనుగురు కన్యలకు సంతానం వుంది. కాని 16వది యగు 'సతి' కి సంతానంలేదని వ్యాసుడు చెప్పడంలోనే అది పునర్జన్మలేని అభవుని పత్నిగా చేడి జననమరణ రహిత ముక్తిస్థితిగా అర్థం చేసికోవాలి మిగిలిన 15 సాధనలు పునర్జన్మ నియ్యగలవని కూడ తెలిసికోవచ్చును. ముక్తిని సాధించుటలో సాధకుడు కనుగలిగి

వుండాలి. చివరిస్థాయికి సాధన చేరుకొనే సమయంలో సాధకునికి అహంకారం ప్రబలి ఆఖరు కళ సాధించుటయందు అశ్రద్ధకలిగి నాస్తిక తత్వం చోటు చేసికొని భ్రష్టుణ్ని చేసే ప్రమాదంవుంది. కాన ఆ సమయం గుర్తించి సాధకుడు అహంకారం తలయెత్త కుండా చూచుకోవాలి.

సమన్వయం :- జీవుడెప్పటికైన పరమాత్మలో చేరునట్టి యత్నం చేసేవాడై సమర్థుడై వుండాలి. కాన దక్షపదంలో జీవుణ్ని పేర్కొనబడటం జరిగింది. అఖండ మనోవృత్తిని (సతి) భగవదర్పణం చెయ్యడం అనేది శివునకు దక్షుడు తన కూతురి నిచ్చి పెండ్లిచెయ్యడం పరబ్రహ్మ స్వరూపం సాధకునిలో చోటు చేసికొనివున్న అహంకారం కారణంగానే సాధకున కింకా సాధ్యం కాకపోవడమే శివుడు దక్షునకు ప్రత్యుత్థాన సత్కారం జరిపించకపోవడంగా చెప్పబడింది. అఖండ మనోవృత్తిని పరమాత్మనుండి అహంకార మనోవృత్తి మరలించడమే సతీదేవిని దక్షుడు అవ మానించడంగా చెప్పబడింది. జీవునియొక్క అసమర్థత కారణంగా అతని అఖండ మనోవృత్తి ఆతనినుండి శాశ్వతంగా విడిచిపోవడమే సతీదేవి దక్షుని ఇంట్లో అగ్ని ప్రవేశం చెయ్యడంగా చెప్పబడింది. జీవుని సాధనలన్ని భ్రష్టంకావడమే దక్షాధ్వర ధ్వంసంగా చెప్పబడింది. జీవుడు పశ్చాత్తప్తుడు కావడమే దక్షునకు మేకతల అతికించి నట్లు చెప్పబడింది.

# నారదుని పూర్వజన్మ వృత్తాంతం

## [దాస్య భక్తి సాధన]

నారదుడు పూర్వజన్మలో దాసీపుత్రుడు. అతని తల్లి వేదవాదుల యిళ్ళల్లో దాసీవృత్తితో జీవిస్తూంది. ఆ వేదవాదులు ఆ దాసీపుత్రుని చాతుర్మాస్యవ్రతం నడుపు తూన్న యోగిజనులకు పరిచర్య చేయడాని కొకప్పుడు నియోగించేరు. ఆ యోగులకు సేవచేస్తూ వారి యెంగిళ్లుతింటూ అతడు కాలం గడుపుతున్నాడు. ఆ యోగులు కృష్ణ చరిత్రలు గానం చేస్తూంటే విని ఈ కుర్రవాడు ఆ కృష్ణ కథలందు ఆసక్తితో ఆట పాటలు వదలి కృష్ణతన్మయుడై యుండేవాడు. క్రమంగా బ్రహ్మోద్వితుడు కాగల్గేడు. అప్పటి కాతని కైదేండ్లవయస్సు. ఆ వయస్సులో నాత డుండగా, ఒకనాటి రాత్రి అతని తల్లి గోష్ఠంలోకి పాలుపితకడానికి వెళ్ళి పామును త్రొక్కి పాము కరచడంవల్ల

చనిపోయింది. తల్లి పోయినందుకా బాలుడు చింతించలేదు. సరిగదా, బంధవిముక్తి కలిగిందని ఆనందించేడు. తల్లి పోవడంతో ఆ బాలుడు ఉత్తరదశాభిముఖుండై నడిచి పోయి అనేక గ్రామాలు, అరణ్యాలు నడిచి ఒక అశ్వత్థవృక్షం కింద గూర్చుండి పరమాత్మ ధ్యానం చేస్తూండగా అతని అంతరంగంలో హరి సాక్షాత్కరించేడు. ఆతడు నిత్యమూ తనకు బాహ్యరూపంలో హరి సాక్షాత్కారం లభిస్తూండాలనే కోరికతో కాలం గడుపుతుండగా ఒకనాడు అతనికి ఆకాశవాణి "అబ్బాయీ! నీవు ఈ జన్మలో నన్ను చూడలేవు. 'కు యోగులు' నన్ను చూడలేరు. ప్రళయాంతమున పునస్సృష్టిలో నీవు నా భక్తుడవై జన్మిస్తావు. నన్ను అప్పుడు చూస్తావు అని విన్పించింది. తర్వాత కొంతకాలానికి అతనికి ఆకస్మికంగా మరణం జరిగి హరి కృపవల్ల శుద్ధసత్త్వంతో మృదువైన భాగవతదేహం సిద్ధించి ప్రళయకాలంలో నారాయణునిలో ప్రవేశించేడు. ఆపైన బ్రహ్మప్రాణంద్వారా అతడు తిరిగి జన్మించేడు. అఖండ బ్రహ్మచర్యంతో మూడులోకాలు తిరిగి బ్రహ్మాభివ్యంజములైన సప్తస్వరాలుగల 'మహతి' అనే వీణను వాయిస్తుకొంటూ నారాయణ కథాగానం చేస్తూన్నపుడు విష్ణు నాతని ముందు సగుణరూపంతో వాలుతుండేవాడు. ఈ కథ నారదుడు వ్యాసమునీంద్రునికి చెప్పి భాగవత రచన చేయవలసిందని ఉపదేశించేడు. తర్వాత నారదోపదేశంతో వ్యాసుడు భాగవతం వ్రాసి జ్ఞానియై తన కుమారుడైన శుకునకు దానిని ఉపదేశించేడు. శుకుడు భాగవతోపదేశంతో శుకబ్రహ్మయైనాడు. ఇల్లు విడిచి గోదోహనమాత్రకాలం కంటే (ఆవును పాలు పితికేటంతకాలం) ఎక్కువగా ఎక్కడా నిలబడక తిరుగుతూ పరీక్షిత్తుచేరి అతనికి భాగవతాన్ని ఉపదేశించేడు. వెయ్యిసార్లు వేదాలు తలక్రిందుగా చదివినా, ముక్తిమార్గం సుగమంకాదు. కాని ఒక్క భాగవతం అనే ఈ వేదాన్ని ఒక్కసారి పఠిస్తే ముక్తిమార్గం లభిస్తుంది. అనే ఫలశ్రుతితో ఈ నారద పూర్వజన్మ వృత్తాంతం ముగింపబడింది. మహాభాగవత గ్రంథంలో పైకథ కంతకు అంతరార్థ పరంగా ఆధ్యాత్మిక సాధనామార్గం కన్పిస్తూంది. దానిని వివరిస్తూన్నాను.

'నారదుడు' అంటే-నార=జ్ఞానాన్ని, ద=ఇచ్చేవాడు, లేదా, 'నార' అంటే నర సంబంధమైనది అను అర్థంలో 'నర' అన్నదానికి ఆది వృద్ధిరూపం వచ్చి 'నార' అవుతుంది. 'నౄ' 'హింసాయాం' అనే ధాతువువల్ల 'నర' శబ్దం పుట్టింది. హింసించేది అనగా మృత్యువు అని 'నర' పదానికి అప్పుడు అర్థం వస్తుంది. నరభావమే 'నార' మైంది గాన నారశబ్దానికి మృత్యుభావం అనే అర్థం వస్తుంది. 'ద' 'ఖండన్' అనే ధాతువువల్ల దః : అంటే ఖండించునది అని అర్థం. అనగా పోగొట్టునది అనే అర్థం.

మృత్యుభావాన్ని పోగొట్టేది అంటే నేను చనిపోయేవాడను అనే భావాన్ని పోగొట్టేది అని అర్థం. అప్పుడు నాకు మృత్యువులేదు. నేను అమృత స్వరూపుడను 'అహం బ్రహ్మాస్మి' అనే భావాన్ని కల్గించే జ్ఞానం అని నారద పదంలో మరొకఅర్థం కూడ చెప్పుకోవచ్చు. ఆ నారదుడు అనగా జ్ఞానస్వరూపంలేక బ్రహ్మస్వరూపం అన్న మాట. మొదటిజన్మలో వేదవాదుల ఇంటి దాసీదానికి నారదుడు పుట్టేడు అంటే సాధకునిలో జ్ఞానానికి పూర్వదశ వేదోక్తంగా దేవతల్ని ఉపాసించాలనే దశఅనీ, ఆ వేదోపాసనమే అనంత స్వరూప సాక్షాత్కారాన్ని చివరకు కల్గిస్తుందనీ అంతరార్థం స్పష్టపడుతుంది. ఆ వేద వాదులు తమయింట దాసీపుత్రుని చాతుర్మాస్యం చేసే యోగులకు సేవకోసం వినియోగించేరు అంటే వేదోక్తదైవతోపాసనవల్ల చాతుర్మాస్యంచేసే యోగి పరిచర్య లభిస్తుందన్న మాట. చతుర్ అంటే నాలుగు. అవి ధర్మార్థ కామమోక్షాలు అనే పురుషార్థాలని అర్థం. 'మాస' పదం యోగ్యార్థంలో 'మాస్యం' అవుతుంది. 'మా' అంటే ప్రకృతి అని అర్థం, 'స' అంతకర్మణి అనే ధాతువువల్ల ఏర్పడిన 'స' అన్న పదానికి నశింపచేయుట అని అర్థం. అప్పుడు మాసంఅంటే ప్రకృతిని నశింప చేయడం అని అర్థం. మాసయోగ్యం మాస్యం. అప్పుడు ధర్మార్థకామమోక్షాలనే నాల్గు పురుషార్థాలచేత ప్రకృతిని నశింపచేయడం" అని చాతుర్మాస్యవ్రతం అన్న మాటకు అర్థం వస్తుంది. యోగులు అంటే భగవంతుని గూర్చిన చింతతోకలిసి యున్నవారు అని అర్థం. వారుచేసే వ్రతం ఆ యోగి పరిచర్యలను దాసీపుత్రుడు చేసేడు. 'దాసీ' అంటే భగవంతుని సేవించే ఉపాసనామనోవృత్తి అని అర్థంగదా. పుత్రుడు అంటే నరకాన్నుండి రక్షించడమని, పుత్ + త్ర అనే వ్యుత్పత్త్యర్థం వల్ల వస్తుంది. కాన భగవత్సేవవల్ల నరకాన్ని దాటడం అనే సాధన దాసీపుత్ర పదానికి అర్థం. వేదవాదుల ఇంటిదాసీఅంటే వేదోక్తమైన దేవతా ఉపాసనావృత్తి అన్న మాట. భగవత్సేవవల్ల నరకాన్ని దాటాలనే ఉపాసనా మనోవృత్తియే ధర్మార్థకామ మోక్షాలనే పురుషార్థాలను సక్రమంగా నడుపుతుంది అన్నదే, దాసీపుత్రుడు వేదవాదుల ఆజ్ఞతో చాతుర్మాస్యవ్రతంచేసే యోగుల సేవకు నియోగింపబడినాడనటంలోని అంతరార్థం దాసీపుత్రుడు ఆ యోగుల ఎంగిళ్ళు తిన్నాడంటే వారు అనుభవించి ఆపైని ఇతరులకు ఉపదేశంచేసిన సాధనలను భగవత్సేవచేసే ప్రాథమిక సాధకుడు అనుసరిస్తాడని అర్థం. దానివల్ల కృష్ణ కథాసక్తి కల్గిందంటే 'కృష్ణ' అంటే—

శ్లో॥ "కృషిర్భూవాచకశ్శబ్దః 'ణ'శ్చ నిర్వృతి వాచకః" అనే దానివల్ల భూ సంబంధమైన వాసనలు లేకపోవడమన్నదే కృష్ణపదానికి అర్థం వస్తుంది. సాధన వల్ల సాధకుడు ఐహిక వాసనలనుండే విడుమరి పొందుతాడన్న దే కృష్ణకథాసక్తుడయ్యే

దిన్న దానికి అంతరార్థం. ఐహిక వాసనలు పోవడంతోనే వానికి బ్రహ్మస్వరూపం వస్తుంది. బ్రహ్మ అంటే 'బృంహి' ధాతువునకు విస్తరించడం అర్థం. దానివల్ల బ్రహ్మ అనే పదం ఏర్పడింది. అంటే బ్రహ్మపదానికి సర్వత్ర వ్యాపించి ఉండేది అని అర్థం వస్తుంది. అందువల్ల ఐహిక వాసనా క్షయంతో 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధన సిద్ధిస్తుందన్న అర్థం పై వాక్యానికి అంతరార్థంగా చెప్పుకోవచ్చును. దాసీపుత్రుడు ఆ స్థితిలో ఆజన్మ బ్రహ్మచర్యవ్రతంతో ఉత్తరదిశాముఖుడై త్రిలోకాలు తిరిగేడు అంటే పరబ్రహ్మ స్వరూప సాక్షాత్కారంతో శ్రేష్ఠమైన మార్గానికి అభిముఖుడై త్రిగుణాతీతుడయ్యేడన్న మాట. సప్తస్వరాలు అంటే సప్తధాతువులు,దేహం సప్తధాతువులతో ఏర్పడింది. సప్తస్వరాలు బ్రహ్మాభివ్యంజకాలు అంటే సాధకుని లోపలిదేహం అంతా బ్రహ్మత్వ సిద్ధితో పరిపూర్ణత్వం చెందిందన్న మాట. 'మహతి' అనే వీణ దేహంలోని వెన్నుపూసకు చిహ్నం. దాని ద్వారా కుండలినీ శక్తి సహస్రారంలో ప్రవేశించితే అది ఆనందమయం అవుతుంది. ఆ వెన్నుపూస సప్తధాతువులతో నిర్మించబడింది ఆ ధాతువులు బ్రహ్మాభివ్యంజనస్థితిని పొందడమే మహతీత్వం పొందడం అంటే. 'మహత్' శబ్దం యొక్క స్త్రీలింగరూపం 'మహతి' అవుతుంది. అంటే మహోన్నతస్థితి అని అంతరార్థం. ఆ స్థితిలో విష్ణువు అంటే సర్వత్రవ్యాపకుడై యున్న పరమాత్మ. ఆతనిని పిలిస్తే పలుకుతాడు. అంటే సాధకుడు మనసులో తలచినంత మాత్రంలోనే ఆనంద రూప బ్రహ్మమయుండౌతాడు అని అర్థం. అదే కైవల్యం, అదే మోక్షం, పై అంతరార్థంలో నారద పూర్వజన్మ వృత్తాంతం సాధనా సోపాన పరంపరతో ముక్తిని పొందే గొప్పదైన సాధనను చెప్తూంది.

దాసీపుత్రుడు సర్వత్ర బ్రహ్మను చూచే బ్రహ్మజ్ఞానిగా కాగల్గేడు. అదే చరమ సాధన. అప్పటి కాతడు ఐదేండ్ల వయస్సులో వున్నాడు. ఐదు అంటే పంచ భూతాలు లేక పంచేంద్రియాలు అని అర్థం. ఇంకా మొదటిదశలో సాధకుడు పంచేంద్రియాలతో పంచభూతాత్మక శరీరంతోనే సేవావృత్తితో వుంటాడని అర్థం. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధన సిద్ధించేక జ్ఞానియై, అసంగయోగంతో పంచభూతాలను పంచేంద్రియ వ్యాపారాన్ని నడుపుతూనే ప్రకృతి నిర్వృతుడై, జీవన్ముక్తుడుగా ఉంటాడనే. దాన్ని ఐదేండ్ల వాడన్న దానికి అంతరార్థంగా చెప్పాలి. ఆతని తల్లి గోష్ఠంలో పాలు పితుకుతూండగా పామును త్రొక్కడంవల్ల సర్పదష్టయై మరణించింది. అంటే ఆతనికి జన్మనిచ్చిన దాస్యశక్తియొక్క అవసరం అతనికి తీరిపోయిందన్న మాట. 'గో' పదానికి ఇంద్రియవృత్తి అని అర్థం. గో+స్థ=గోష్ఠం అవుతుంది. ఇంద్రియ

వృత్తికి స్థానమయిన మనస్సు గోష్ఠపదానికి అర్థం. పాలు పితుకుతూండగా అంటే, అమృతత్వసిద్ధికి సాధన చేస్తూన్నప్పుడు అని అర్థం. పాలు అనే పదానికి అమృత పదం పర్యాయ పదంగా వుంది. అమృతం అంటే మోక్షం చావులేనిది జరామరణ వర్జితస్థితి అన్నమాట. మొదటిదశలో ఉపాసనావృత్తితో నుండి మోక్ష సాధన చేస్తూన్నప్పుడు ఆ రెండవదశలో ఉపాసనావృత్తి యొక్క అవసరం తీరుతుందని మాయ నశిస్తుందనీ అర్థం చెప్పుకోవాలి. సర్పాన్ని త్రొక్కడం అంటే 'సర్ప' అంటే వ్యాపించేది అనే వ్యుత్పత్తి చెప్పినప్పుడు భగవంతుని ఆవరించిన మాయ అని దాని కర్థం వస్తుంది. అది కరిచింది; దాసీది చనిపోయింది అంటే మాయావృత్తితో వ్యాపించియున్న అనగా ద్వైత ఉపాసనా వృత్తితో వున్న మనస్సు నశించింది; 'అమనస్క' యోగం సాధకునకు సిద్ధించింది అని అంతరార్థంతో పై సాధనలు చెప్పాలి. ఆ అమనస్కయోగంతో త్రిగుణాతీతుడై సాధకుడు సంచరిస్తాడు అన్నదే దాసీపుత్రుడు అరణ్యాలలో గ్రామాల్లో తిరిగేడన్న దాని అర్థం. అశ్వత్థం క్రింద కూర్చున్నాడంటే 'అశ్వం అంటే' న+శ్వ అనే వ్యుత్పత్తిలో రేపు ఉండనిది అనే అర్థంలో ప్రతినిత్యం మార్పుతో వుండే ప్రకృతి అని అశ్వపదానికి అంతరార్థం. దాని క్రింద కూర్చుండగా ఆకాశవాణి విన్పించిందంటే ప్రకృతిలో అసంగయోగంతో త్రిగుణాతీతుడై సంచరిస్తూండే మనస్సుతో పని లేకుండానే ఏదో దివ్యభావం దానంతట అదే తోస్తుంది అని దానికి అర్థం. 'కుయోగులు' అంటే' 'కు' అంటే భూమి అర్థం. కాన భూ సంబంధం గలవారు. వారు నా స్వరూపం అనగా కృష్ణత్వాన్ని తెలియలేరు అని అర్థం. నా భక్తుడవై ముందు జన్మలో పుడతావు అంటే ముందు సాధనలతో నీవు నన్ను అంటిపెట్టుకొనియే ఉండే స్థితి నీకు లభిస్తుంది. నిరంతరానందాను భావంతో సాయుజ్యం సిద్ధిస్తుంది అనేది, అంతరార్థంగా ఆకాశవాణి చెప్పిన మాటలకు అర్థం చెప్పాలి. అతడు తిరిగి ప్రళయానంతరం బ్రహ్మప్రాణంతో జన్మించేడు అంటే సాధకునిలో సర్వవాసనాక్షయం జరిగిన తర్వాత నిరంతరానందాన్ని సాధకుడు పొందగలిగేడని దాని అర్థం. ప్రళయానంతరం అంటే సమస్తవాసనాక్షయం జరగడంతో అని అంతరార్థం చెప్పాలి. బ్రహ్మప్రాణంతో పుట్టేడు. అంటే బ్రహ్మత్వస్థితితో పుట్టేడు. అనగా బ్రహ్మజ్ఞానంతో పునర్జన్మ పొందేడు అని అర్థం. అందుకే నారదుణ్ణి బ్రహ్మమానసపుత్రుడు అని అంటారు. అంటే బ్రహ్మజ్ఞానంగల మానస వృత్తి కల్గి అందరిని తరింపజేసే జ్ఞానం ఇచ్చేవాడని ఈ విధంగా నారద పదానికి సార్థకమైనది అర్థం. త్రిలోక సంచారి అంటే సత్త్వ రజ స్తమోగుణాలలో లేక స్థూల సూక్ష్మ కారణ శరీరాల్లో బ్రహ్మత్వస్థితితో వుండేవాడని అర్థం.

ఈ కథను పై అంతరార్థాన్ని వ్యాసు డుద్దేశించి వ్రాసింది కాకపోతే ఐదేండ్ల వయస్సులో వానికి యోగుల సేవ ఏమిటి? ఆ సేవలో వాడు కృష్ణ కథా తన్మయుడు కావడమేమిటి? అసలు బ్రహ్మమానస పుత్రునికి పూర్వజన్మ అంటూ వుండడ మేమిటి? ఈ అసందర్భ విషయాలు బాహ్యార్థానికే బొత్తిగా సరిపడవు. వానిమీద చదువరికి విశ్వాసం కల్గదు. అందువల్ల ఇందేదో ఆంతరార్థ పరమైన సాధన వుందని గ్రహించాలి. ఇచ్చట, దాసీ, నారదుడు అన్నవి ఒకే సాధకునిలోని, ఉపాసనా, జ్ఞానములకు పెట్టిన పేర్లుగా తెలియాలి.

సాధకుడు మొదట వేదోక్తమైన ఉపాసనా మార్గంతో సాధన ప్రారంభించాలనీ, తర్వాత ధర్మార్థ కామమోక్షాలనే పురుషార్థాలతో భగవత్సేవతో సాధన చేస్తూంటే ఐహిక వాసనా బంధాలనుండి విముక్తి కల్గుతుందనీ, ఆ పిమ్మట ద్వైతస్థితి ఆతని ప్రకృతి నుండి వీడిపోతుందనీ, ఆ తర్వాత స్వతస్సిద్ధమైన ఆత్మప్రేరణం లభిస్తుందనీ, ఆ పైని సర్వవ్యాపకత్వ భగవత్తత్వాన్ని జీర్ణించుకొని బ్రహ్మజ్ఞానంతో దేహంలోని సప్తధాతువులను భగవన్మయంగా చూడగల్గుతాడనీ, ఆతనికి చివరకు తానే భగవంతుడుగా, భగవంతుడే తానుగా భావనకల్గి అద్వైతంసిద్ధించి ప్రపంచానికి జ్ఞానసందేశం అందిస్తూంటాడనీ, ఈ విధంగా అనేక జన్మలలో గాని, ఒకే జన్మలోకాని సాధకుడు క్రమంగా వర్తించి, ముక్తిని పొందవచ్చుననీ సాధనా సారాంశాలుగా గ్రహించాలి. మనకు ఈ నారద జన్మకథ విస్పష్టమైన సందేశాన్ని అంతరార్థపరంగా ఇస్తోంది. సాధనా బలంతో ఈ జన్మలోనే అన్నిసాధనలు ముగించి ముక్తిని పొంద వచ్చునని దీనివల్ల చెప్పవచ్చు.

# సనకాదుల అవతారాలు

## (పర బ్రహ్మాన్వేషణసాధన)

నారదునిలాగే సనకాదులు కూడ బ్రహ్మమానస పుత్రులే. సనకుడు, సనత్కుమారుడు, సనత్సుజాతీయుడు, సనందనుడు అనువారు నల్వురు. బ్రహ్మర్షులు బ్రహ్మ మానస పుత్రులుగా చెప్పబడ్డారు. విష్ణువు చతుర్వింశతి అవతారాలు ఎత్తేడు. ఆ ఇరువైనాల్గు అవతారాల్లోను సనకాదుల అవతారం కూడా వుంది. 'అవతారం' అంటే పరమాత్మయొక్క అంశలతో జన్మించిన వాడని అర్థం. బ్రహ్మదేవుడు నారదునకు ప్రపంచ ప్రకారం చెప్పినపుడు సనకాదుల ఉత్పత్తి ఈ విధంగా చెప్పబడింది.

బ్రహ్మ కల్పాంతమందు విశ్వాన్ని సృజింపదలచి తపస్సులో 'సన' అని పల్కేడు. అది కారణంగా సనకుడు, సనత్కుమారుడు, సనత్సుజాతీయుడు సనందనుడు అనునల్వురు పుట్టేరు. వారు బ్రహ్మ మానస పుత్రులుగా పేరుబడ్డారు, పోయిన కల్పాంతమందు నశించిన పరబ్రహ్మతత్త్వాన్ని సాంప్రదాయ భంగితో వారు నల్గురూ తిరిగి వ్యాప్తి చేశారు. వారు నల్వురు విష్ణు కళలతో ప్రకాశించేరు. వారు నల్వురు కలిసి ఒక్కరుగా చరిత్ర సృష్టించారు.

బ్రహ్మ తపస్సు చేస్తుండగా 'సన' అనే అక్షరాలు వినపడ్డాయి. ఆ 'సన' శబ్దం నుండి 1. సనకుడు 2. సనత్కుమారుడు 3. సనత్సు జాతీయుడు 4. సనంద నుడు అనేవి పుట్టేయి. వీరు నల్వురుగానున్నా, నల్వురూ కలసి ఒకే బ్రహ్మ స్వరూపం. ఆ బ్రహ్మ స్వరూపం వారి వల్ల వ్యాప్తి చెందింది. ఇది "విష్ణుచతుర్వ్యూహం" అంటారు. అంటే నల్గురు చేతను సర్వవ్యాపక పరమాత్మతత్త్వం బాగా ఊహించ బడిందన్న మాట. ఈ సనకాద్యవతార చరిత్ర భాగవతంలో ఇరువై నాల్గు అవతారాల సంగ్రహ చరిత్రలోను ఇంత మాత్రమే వున్నది. ఈ సనక సనందాదులనే పేర్లు అక్కడక్కడ భాగవతాది పురాణాల్లో కన్పిస్తూంటాయి.

బ్రహ్మతపస్సులో 'సన' అనే శబ్దం పుట్టడ మేమిటి? దానికి అర్ధమేమిటి? 'సన' నుండి సనకుడు, సనత్కుమారుడు వగైరా నల్గురు పుట్టడం వారు నల్వురైనా ఒకరుగానే బ్రహ్మతత్త్వం వ్యాప్తి చేయడం ఏమిటి, దీనిని ఏ విధంగా బాహ్యార్థంతో సమన్వయంచేసి విశ్వాసం కల్గించ గలమో తెలియదు. ఈ సనకాదులు విష్ణువును నగ్న రూపంలో బాలురుగా దర్శించడానికి పోతూంటే జయ విజయులనే వైకుంఠ ద్వార పాలకులు అడ్డగించేరనీ అందుకు వారు కుపితులై భూలోకంలో వారిని జన్మించేటట్లు శపించేరనీ ఈ భాగవతంలో ఉంది. అంతరార్ధపరంగా తప్ప దీనికి బాహ్యార్థంతో నమ్మించే లాగ అర్ధం చెప్పలేము.

'బ్రహ్మ' అంటే సర్వత్ర వ్యాపించిన పరమాత్మతత్త్వం దాన్ని వ్యాపింప చేయడానికే సనకాదు లుత్పత్తి చెందేరు. ఇది ఆలోచిస్తే ఆధ్యాత్మిక తత్త్వం అంతా సంక్షేపంగా ఈ సనకాది చతుర్వ్యూహంలో నిక్షేపింప బడ్డట్టు తోస్తుంది.

'సన' అని బ్రహ్మ తపస్సులో వినబడింది. బ్రహ్మతపస్సు అంటే బ్రహ్మ తత్త్వాన్ని కనుగొనడానికి సాధకుడు చేసే తీవ్రాతి తీవ్రమైన ధ్యాన మన్నమాట.

ఆ ధ్యానంలో సాధకుడు ఏది బ్రహ్మపదార్థం? అని అన్వేషణ చేస్తూ 'సన' అని తన అనుభవాన్ని పైకి పలుకుతాడు. 'సన' అంటే '—' 'సే' అంతకర్మణి అనే ధాతువు యొక్క రూపం 'స' అవుతుంది. అప్పుడు 'స' అంటే నశించేది అని అర్థం 'న' అనేది నఞ్ అర్థకమైన 'న' శబ్దం దానికి కానిది అర్థం. అప్పుడు 'సన' అంటే నశించేది కానిది. అని అర్థం వస్తుంది. స్వార్థంలో 'క' వస్తే అది 'సనక' అనే శబ్దం అవుతుంది.

బ్రహ్మతపస్సులో అంటే బ్రహ్మస్వరూపాన్ని గూర్చిన ఆలోచనలలో మొట్ట మొదట పరబ్రహ్మ స్వరూపం నశించేదికాదనీ అనంతమైనది అనే 'సనక' భావన వచ్చిందన్నమాట. ఆ తర్వాత ఎప్పుడూ నశించనిదేదో అది బ్రహ్మ అని తెలిసికోవ డానికి ప్రకృతిని 'నేతి' 'నేతి' అని నిషేధించుకుంటూ ఆలోచించాలి. నశించేది ప్రకృతి, నశించనిది ఆ ప్రకృతిలోనే ఉన్న పురుషుడు అనేదానిని అనుభవంతో తెలిసి కోవాలి. ఆ విధంగా ఆలోచించినప్పుడు సనత్కుమారుడు కల్గుతాడు. అంటే "సన ఇవ ఆ చరతి ఇతి," ఆచారార్థమున 'క్విప్' ప్రత్యయం చేస్తే "సనత్" అవుతుంది. కు=భూసంబంధమైన అనగా ప్రకృతిని, మారః=నశింపచేసే మానసికస్థితి అనే అర్థం 'కుమార' అనే పదానికి వస్తుంది. అంటే మోక్ష విరోధకమైన భూ ప్రకృతిని అణచి వేసే స్థితి అనేఅర్థం సనత్కుమార పదానికి వస్తుంది. దానితో సనత్సుజాతుడు పుట్టతాడు అంటే బ్రహ్మ నశించేదికాదనీ, ప్రకృతియే నశిస్తుందనీ తెలిసికొనే సాధనలో సుగతికి అనగా ముక్తికి పుట్టుక ఏర్పడుతుంది అని అర్థం. 'జాత' అంటే పుట్టిన అని అర్థం. ఆపైని సనందుడు పుట్టుతాడు అంటే బ్రహ్మ నశించదనీ, ప్రకృతి నశిస్తుందనీ తెలిసి ముక్తిమార్గ సాధనచేస్తే ఆనందరూపంతో కూడిన బ్రహ్మ తత్త్వం వస్తుందన్నమాట. ఈ విధంగా ఇప్పుడు 'సనకా' దులు అనేవి ముక్తి సోపానాలనీ అనగా 'నేతి' 'నేతి' అని భగవన్వేషణా సాధనా సోపాన ప్రక్రియలకు పేర్లు అనీ తెలుస్తుంది. ఈ విధంగా సాధకుడు ప్రకృతిని నిషేధించుకుంటూ పరబ్రహ్మాన్వేషణం చేస్తూండాలి. ఈ విధంగా అర్థం చెప్తే భగవత్పదాన్ని చేర్చే సనకాదులు భగవదవతారాలు అనడానికి సందేహం ఉండదు. భగవ దవతారాలు అంటే సాధకునిలో భగవంతుని అవతరింపజేసేవారు అనే అర్థం సార్థకం కదా!

# దశావతారాలు

## (దశవిధ తత్త్వ సాధన)

ఇంకా పృధు, కపిల, ధ్రువ, హయగ్రీవ, ఋషభ, ధన్వంతరి, మోహిని అనేవి అవతారాలే. మత్స్యావతారాదులు పదికూడ వీనిలోనివే, సనకాదులు నాల్గూ కలిస్తే 21 అవతారాలు అవుతాయి. వీనిలో ముఖ్యములైనవిగా అనాదినుండి అందరి చేత పేర్కొనబడుతున్నవి, దశావతారాలు మాత్రమే. ధ్రువాదుల చరిత్ర ప్రత్యేకంగా వచ్చినప్పుడు ఆయా అవతారాలలోని అంతరార్థం వివరించి తెలియజేస్తాను ప్రస్తుతం పాఠుకలోనున్న దశావతారాలయొక్క అంతరార్థాన్ని సంక్షేపంగా ఇక్కడ చెప్తున్నాను.

శ్లో॥ మత్స్యః కూర్మః వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కల్కిరేవచ॥

అని దశ విధావతారాలు చెప్పబడ్డాయి.

1. మత్స్యావతారము 2. కూర్మావతారము 3. వరహావతారము 4. నారసింహావతారము 5. వామనావతారము 6. పరశురామావతారము 7. శ్రీరామావతారము 8. బలరామావతారము 9. బుద్ధావతారము 10. కల్కిఅవతారము. కృష్ణావతారాన్ని అవతారాల్లో చేర్చలేదు. అది పూర్ణావతారం అన్నారు. కాన దానికి అవతారం అనే పేరు వర్తించదు. పైన పేర్కొనబడిన అవతారాలు విష్ణువుయొక్క అంశలుగా, అనగా భాగములుగా అంశావతారాలు అని పేర్కొనబడ్డాయి. కృష్ణుడు విష్ణువుయొక్క సర్వ స్వరూపమే. కాన పూర్ణావతార మంటారు. దశావతారాల అంతరార్థాలు ఆ పేర్లను బట్టియే మనం తెలిసికోవచ్చును. ఆ పేర్లన్నీ అంతరార్థ గర్భితములైనవిగా సంక్షిప్తం చేయబడ్డా యనిపిస్తూంది.

# 1. మత్స్యావతారం

## (అహంకార మమకార నాశన సాధన)

సోమకాసురుడనే రాక్షసుడు వేదాలు బ్రహ్మనుండి తస్కరించి జలంలో దాక్కొన్నాడు. వానిని విష్ణువు మత్స్యావతారంతో అనగా చేపరూపంలో సముద్ర జలంలో ప్రవేశించి చంపి వేదాలను తిరిగి బ్రహ్మకిచ్చేడు.

'బ్రహ్మ' అంటే ఆనందరూప పరబ్రహ్మ. సోమకుడు అంటే స+ఉమ= సోమ అవుతుంది. ఆపైని స్వార్థంలో 'కప్' ప్రత్యయంవస్తే సోమ అనేది 'సోమక' అవుతుంది. ఉమయాస హితః స-ఉ+మ=సోమః, సోమ పవ సోమకః అని వ్యుత్పత్తి ప్రదర్శనంలో 'ఉ' అంటే ప్రకృతి, 'మా' అంటే సంపద, కాగా 'ఉమ' అంటే ప్రకృతి సంపద అన్నమాట. ఆ ప్రకృతి సంపదయొక్క లంపటంతో కూడియున్నవాడు సోమకుడు అవుతాడు. సోమకుడు అసురుడు అంటే ప్రకృతి సంపదనే నమ్ముకోడంచేత సుగతిని చెందలేనివాడు అని అర్థం. అట్టివాడు బ్రహ్మనుండి ఆనందస్వరూపాన్నుండి అనగా జ్ఞాన తత్త్వ స్వరూపాన్నుండి, వేదాన్ని అంటే జ్ఞానాన్ని అపహరిస్తాడు. ప్రకృతియే నిత్యం అనుకొనేవారు ఆనందరూపాన్ని చెప్పే వేదవిజ్ఞానాన్ని నశింపచేయడానికి యత్నంచేస్తారు అని అర్థం. ఆ విజ్ఞానాన్ని జలంలో దాచేరు. జలం అన్నది మాయకు చిహ్నంగా చెప్పడం కలదు. జలం తనలో మునిగిన వారిని కనబడకుండా చేస్తుంది. అట్లే ఉన్న దాని నిజస్థితిని కనబడకుండా చేసేది మాయకాన జలాన్ని మాయకు చిహ్నంగా గుర్తింపవచ్చు. ప్రకృతి నిత్యమనుకొనేవారు ఆత్మవిజ్ఞానాన్ని చెప్పే వేదాన్ని తలెత్తకుండా అణచి వేస్తూంటారు. వారు సుగతికి పనికిరానివారు అనే సంగతి సోమకాసురుడు బ్రహ్మనుండి వేదాల్ని తస్కరించి జలంలో దాగుకొన్నాడు అన్నదాని అంతరార్థం. ఇక్కడ సాధకునిలోని అజ్ఞాన దశను సోమకాసురుడుగా చెప్పడం జరిగిందని భావించాలి. అందటిని తరింపజేసే సర్వ వ్యాపకమైన విష్ణుతత్త్వం అప్పుడు మత్స్యావతారం ధరించింది సోమకుణ్ణి వధించి వేదాన్ని కాపాడింది.

మత్+స='మత్స' అవుతుంది. 'మత్స' నుండి భావార్థకంలో మాత్స్యరూపం అవుతుంది. మత్=నాది, నేను అనే భావాన్ని, స=నశింపచేసేది. "సే" అంత కర్మణి అనే ధాతువునుండి 'స' అనే శబ్దం నశింపుచేసేది అనే అర్థాన్ని ఇస్తుంది.

ఇప్పుడు నేను నాది అనే అహంకార మమకారాలను నాశంచేసే భగవత్తత్త్వం మత్స్యావతారం అన్నమాట. ఆ సాధన ప్రకృతి నిత్యం అనుకొనే అజ్ఞానాన్ని నాశం చేస్తుంది. మత్స్యావతారం తర్వాతిది కూర్మావతారం.

## 2. కూర్మావతారము

[షడూర్ముల రక్షణ సాధన]

కూర్మం అంటే అంతరార్ధంలో కు+ఊర్మి అని విడదీయాలి. కు=భూ సంబంధమైన, 'ఊర్మి=అంటే' జీవుణ్ణి ఆశ్రయించివుండే షడూర్ములు అని అర్ధం. అవి 1. ఆకలి, 2. దప్పిక, 3. ఆశ, 4. శోకం, 5. మోహం, 6. మరణం అనేవి. ఊర్ములు కలది, ఊర్మము. కౌ=ఊర్మయః యస్యసః (కు+ఊర్మి) కూర్మః అవుతుంది. దానికి భూ సంబంధమైన జీవధర్మం కలది అని అర్ధం సిద్ధిస్తుంది. అమృతంకోసం సముద్రాన్ని వాసుకిని త్రాడుగా చేసి మధిస్తూన్న మందరం నీటిలో మునిగిపోబోతూంటే విష్ణువు కూర్మరూపంతో మందర పర్వతాన్ని తన మూపుపైని మోపి వుంచాడు అన్నది కూర్మావతారకథ, అమృతాన్ని అంటే మోక్షాన్ని, సాధించడానికి దేవతలు అంటే సాధకునిలోని సాత్త్వికవృత్తులు, సముద్రాన్ని అంటే స+ముత్+ర=సముద్ర, అవుతుంది. 'ముత్' అంటే ఆనందరూప పరబ్రహ్మతత్త్వం. స+ముత్ అంటే ఆనందరూప పరబ్రహ్మతత్త్వంతో కూడుకొనియుండు బ్రహ్మానంద సహితస్థితి. దానిని 'ర' అంటే గ్రహించేది (రాతి గృహ్ణాతి ఇతిరః) ఆనందరూప పరబ్రహ్మతో కూడియుండు స్థితిని రాబట్టే భగవత్ ధ్యానమునకు సముద్రం అని పేరు వస్తుంది. 'సముద్ర' పదానికి దేవతా యాథార్థ్య చింతనం అనేది అర్ధంగా గ్రహించాలని నిరుక్తిశాస్త్రం చెప్పింది. మందరానికి వాసుకిని చుట్టి తరచడంతో మందరం మునిగిపోవడం ప్రారంభిస్తుంది. మందరం అంటే క్రిందది పైకి పైది క్రిందికి వచ్చేటట్లు తఱచడం దానికే ధ్యానంలోని భావ సంక్షుబ్ధస్థితి అని అంతరార్ధం వాసుకి అంటే కుండలినీ శక్తి అని అర్ధం కుండలిని సర్పాకారంలో ఉంటుంది. కాన వాసుకి అనే దానికే కుండలినీ శక్తి అనే అర్ధం చెప్ప వచ్చు. మూలాధారంలోని కుండలిని యొక్క ఆరోహణక్రియ భగవంతుని చేర్చే కుంభక ధ్యానంవల్ల లభిస్తుంది. ఆ విధంగా ధ్యానం చేస్తూంటే మందరం అంటే సాధకుని ధ్యానం జలంలో మునిగిపోవడం జరిగింది అంటే సాధన నిలవక

జడత్వంతో నశించిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. అప్పుడు కూర్మరూపంతో మంధరాన్ని ఎత్తాలి. కూర్మరూపం అంటే ప్రకృతి సంబంధమైన షడూర్ముల ధర్మంతో ఆ సాధన మునిగిపోకుండా చెయ్యాలి అంటే భగవంతుని చేరాలని చేసే సాధన నశించకుండా ఫలించేంతవరకు అంటే అమృతత్వం సిద్ధించేవరకు జీవత్వదేహధర్మంతో శరీరాన్ని కాపాడుకొంటూ ఐహిక ప్రవర్తనలో వుండాలి. లేక పోతే సాధన మధ్యలోనే, ఇంకా అమృతప్రాప్తి కాకుండానే సాధకుడు దేహపతనం పొందడంగాని, జడుడూ, ఉన్మత్తుడూ కావడంగాని జరుగుతుంది. ఆ స్థితి రాకుండా దేహాన్ని నిలిపే ఆకలి, ఆశ మొదలగు షడూర్ములను ఆశ్రయించి జీవం వుండేటట్లు శ్రద్ధతీసికోవాలనేదే ఈ కూర్మావతారంలోని సాధనా రహస్యంగా గుర్తించాలి. ఈ కూర్మత్వస్థితి సాధకునికి భగవదాదేశంవల్లనే లభిస్తున్నది అన్నదే విష్ణువు కూర్మ రూపం ధరించాడన్నదాని అంతరార్థం ఈ కూర్మావతారము ముక్తి సిద్ధించేదాకా సాధనలో ప్రకృతి ధర్మాలతో కూడియే భగవదన్వేషణ జరపడం అవసరం అని నొక్కి చెప్తూంది. ఇందుకోసం భగవంతుడు ప్రత్యేకంగా ఒక అవతారమే ఎత్తేడంటే దీని ప్రాముఖ్యం ఎంతో వుంది.

## 3. వరాహావతారకథ

### (భగవన్మనోవృత్తిసంరక్షణ సాధన)

హిరణ్యాక్షుడనే రాక్షసుడు భూమిని చాపచుట్టినట్లు చుట్టివేస్తూంటే విష్ణువు వరాహావతారం ధరించి వాణ్ణి చంపి భూమిని ఉద్ధరించేడు.

హిరణ్య+అక్షుడు = హిరణ్యాక్షుడు అక్షములు అంటే ఇంద్రియాలు, హిరణ్యం అంటే ప్రకృతి అని అర్థం. "హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్" అని ఉపనిషద్వాక్యం. బంగారు పాత్రలో అంటే ప్రకృతి అనే పాత్రచేత సత్యస్వరూపుడైన పరమాత్మ యొక్క ముఖం కప్పివేయబడింది అని దాని అర్థం. హిరణ్యమునందు అనగా ప్రకృతి యందు అక్షుడు=ఇంద్రియ వ్యాపారములు కల వాడు అనే, వ్యుత్పత్తిలో హిరణ్యాక్ష పదానికి ప్రకృతి లంపటత కల్గిన జీవుడు అనే అర్థం వస్తుంది. అతడు భూమిని చాపవలె చుట్టి వేస్తున్నాడంటే భూసంబంధములైన వాంఛలన్నీ పూర్తిగా తానే అనుభవించే అజ్ఞానావస్థలో నున్నాడని అర్థం. 'వరాహం'

అంటే న+హం=అహం అవుతుంది. 'హన' ధాతువు యొక్క రూపం, 'హం' అవుతుంది. చంపేది అని దానికి అర్థం. న+హం=అహం అంటే చంపనిది అని అర్థం. ఇప్పుడు వరం నహంతి, ఇతి వరాహం అనే వ్యుత్పత్తి ప్రదర్శన చెయ్యాలి. 'వరం' అంటే అందరి కంటే శ్రేష్ఠుడైన వానిని అనగా పరమాత్మను, అహం= నశింపు చేయని మనోవృత్తి అని 'వరాహ' పదానికి వ్యుత్పత్త్యర్థం చెప్పితే, భూమియందలి సర్వభోగాలను ఇంద్రియాలతో అనుభవిస్తున్న జీవునిలోని హిరణ్యాక్షత్వాన్ని అంటే ప్రకృతి లంపటత్వాన్ని వరాహ మనోవృత్తిలో అంటే భగవంతుని యందు నాశంకాని స్థితిని అనగా భగవంతుని సదాధ్యానిస్తూ ఉంటూనే ఇంద్రియ భోగాలను అనుభవిస్తూ కేవలం ప్రకృతిపై ఆసక్తిని నశింపు చేశాడు అన్న మాట. సాధకుడు సాధన చేస్తూన్న సమయంలో మూడవదశలో ఇంద్రియ లంపటంతో ప్రకృతి వశుడై వుంటాడు. అప్పుడు భగవంతుడు సాధకునిలోని పరమాత్మ యందలి ఆసక్తిని చూపే ఇంద్రియాశక్తి చావకుండా దుష్టమైన కేవలం ప్రకృతి లంపటత్వాన్ని నశింపుచేస్తాడు అన్న సాధనా రహస్యం వరాహావతార కథలో నిక్షేపింపబడిందని గ్రహించాలి. అంటే నిత్యావపాయని యగు భగవచ్చింతన నశించకుండా, ప్రకృతి భోగాలను భగవద్దృష్టిలో ననుభవించడం అనేది వరాహ సాధన అన్న మాట. సాధకులు తమకు గల హిరణ్యాన్ని భగవద్భక్తులను పోషించడానికి, దేవాలయాలను పోషించడానికి తన సకల భోగాలను భగవత్కైంకర్యానికి వినియోగించాలి. ఆ విధంగా తమ సంపత్తును వినియోగించేవారు వరాహసాధకు లౌతారు. ఇది అహంకార పూర్వకంగాకాక కేవల సాత్త్వికభక్తి పూర్వకంగా జరగాలి. అప్పడే వరాహస్థితి సార్థకమౌతుంది.

# 4. నరసింహావతారకథ

## (బ్రహ్మానంద రక్షణ సాధన)

హిరణ్యకశిపుడు భగవంతుడు ఉన్నా తనకింటే ఘనుడు కాదనుకొన్న అహంభావి. అతని కొడుకు ప్రహ్లాదుడు బాల్యమునుండి హరిభక్తితో నిండినవాడు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని చంపడానికి ఎంతగా ప్రయత్నించినా వాడు చావలేదు. చివరకు విష్ణువు నరసింహావతారం ధరించి స్తంభంనుండి ఆవిర్భవించి హిరణ్యకశిపుని చంపి ప్రహ్లాదుని కాపాడేడు. హిరణ్యకశిపుడు అంటే—" హిరణ్యం అనగా ప్రకృతి, నికశిపుడు= అంటే ఆహారంగా చేసి కొన్నవాడు అని అర్థం. కశిపు శబ్దానికి ఆహారం అనే అర్థంవుంది. ఇప్పుడు హిరణ్యకశిపుడు అంటే ప్రకృతి భోగ లంపటుడు అన్నమాట.

హిరణ్యాక్ష హిరణ్యకశిపులు అన్నదమ్ములుగా సమానగుణాలు కలవారే. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు కొడుకుగా చెప్పడం జరిగింది. వరాహావతారంలో శ్రేష్ఠమైన పరమాత్మ జీవునిలో నశించలేదు. ప్రకృతి యొక్క మాయా గుణానికి వశమైనవాడు. ప్రకృతిలోనే వున్న ఆనంద బ్రహ్మతత్త్వాన్ని సరిగ్గా గ్రహింపలేడు సరిగదా! దానికి విరోధిగా మారి దానిని నశింపు చేయడానికి యత్నిస్తాడు. కాని ఆ ఆనందతత్త్వం వృద్ధి పొందితే ప్రకృతి తత్త్వమే నశిస్తుంది. అందుచేత ప్రకృతి తనలోనే ఉన్న ఆనందతత్త్వాన్ని ప్రకృతి తత్త్వంగల జీవుడు బైటకు ప్రసరింపనీయడు. అదే హిరణ్యకశిపుడు తన కొడుకైన ప్రహ్లాదుణ్ణి తాను చంపడానికి యత్నాలు చేసాడన్న దాని అర్థం సాధకుడు మొదట వరాహ సాధనలో తనలోని పరమాత్మను నశింపు చేయలేడు. ఆ సాధనలో తనకు బ్రహ్మానందతత్త్వం స్వల్పంగా గోచరించినా, దానిని వృద్ధి చేస్తే తన ప్రకృతి భోగాసక్తి నశిస్తుందనే భయంతో ఆ ఆనందతత్త్వాన్ని బైటకు రానీయక తన ఆత్మాభివృద్ధికి తానే ఆటంకం అవుతాడు. భగవద్దర్శనం కావాలనుకుంటూనే ఉన్నా మధ్యలోని ఈ విఘ్నదశను ఇందులో మనం గమనించి అడుగడుగునకు జరిగే విఘ్నాలను అధిగమించాలని గ్రహించాలి. ప్రహ్లాదుడు ఎన్ని హింసలు చేసినా చావలేదు. ఆ ఆనందం విషయాలకు సంబంధించినదికాదు. వాటికి అతీతమైనదీ, నిర్విషయానికి సంబంధించిందీ అవడం దానికి కారణం. ప్రహ్లాద అనగా ప్రకృష్టమైన ఆనందం. అది సాధకునిలో ఎప్పటికైనా విజృంభించి జయం పొందవలసిందే కాని ప్రకృతిచేత చంపబడేది కాదు. ఈ విషయం ప్రహ్లాదుడు హిరణ్యకశిపుడు ఎంత యత్నించినా చావలేదన్న దానికి అంతరార్థంగా గ్రహించాలి. చివరకు నరరూపం, సింహరూపం రెంటినీ ధరించిన విష్ణువు స్తంభంలో అవిర్భవించి హిరణ్యకశిపుణ్ణి చంపేశాడు. 'నర' అన్నది 'నౄ' "హింసాయాం" అను ధాతువల్ల పుట్టినది కాన హింసించునది అని దాని అర్థం. హింసించేది మృత్యువు. 'సింహం' అనగా "హింసాయాం సింహః" అనే వ్యుత్పత్తిలో హింసించేది అనే అర్థంలోనే సింహం అన్నరూపం కూడ ఏర్పడుతుంది. అప్పుడు "నరసింహం" అంటే హింసించేదాన్ని (మృత్యువును). హింసించేది అనగా నాశం చేసేది అనే అర్థం వస్తుంది. అనగా మరణమును పోగొట్టునట్టి మరణరాహిత్యస్థితి అయిన ముక్తి అనే అర్థం నరసింహ పదానికి వస్తుంది. జనన మరణరాహిత్యం వాసనాక్షయంవల్లనే సిద్ధిస్తుంది. కాన నరసింహ పదానికి వాసనాక్షయ సాధనఅనే అర్థాన్ని రాబట్టవచ్చు. అదేమోక్షం: ఆ మోక్షస్థితి స్తంభంలో పుట్టింది. స్తంభం అచలమైనది, నిశ్చలస్థితి అన్నమాట. మనస్సుయొక్క నిశ్చలస్థితికే స్తంభం అనిపేరు. అనగా మనో నిశ్చలతత్త్వం అన్నమాట. నిశ్చలతత్త్వమే

ముక్తికి అనగా వాసనాక్షయం కల్గించడానికి మార్గం 'నిశ్చల తత్త్వే జీవన్ముక్తి' అని శంకరాచార్యుల సుభాషితం ఉంది.

ఈ విధంగా సాధకుడు ప్రహ్లాదుణ్ని చంపడానికి వెంటాడి, శక్యంకాక, గతిలేక ఏమీచేయలేని నిశ్చలస్థితికి వచ్చేడు అంటే సాధకుడు ఆనందతత్త్వాన్ని వెంటాడి నిశ్చలసమాధిని సాధించేడన్న మాట. అప్పుడు బ్రహ్మతత్త్వం బోధపడింది. అదే నృసింహావతార దర్శనం. అంటే, ఎప్పుడు నృసింహావతారస్థితి అంటే వాసనా క్షయస్థితి వచ్చిందో అప్పుడు ప్రహ్లాదుడు రక్షింపబడ్డాడు. అంటే వాసనా క్షయం తర్వాత అఖండానందరూప బ్రహ్మసాయుజ్యస్థితి సాధకుడికి లభిస్తుందన్న మాట. ఈ విధంగా సాధకుడు మొదట్లో ప్రకృతి బద్ధుడుగానున్నా తనలోని పూర్వ వరాహ సాధనవల్ల నశించకుండావున్న ఆనందరేఖను గుర్తించి వాసనా క్షయం పొంది ముక్తుడు కాగలడన్న సాధనాదశను ఈ హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కథలలో స్పష్టంగా అంతరార్థపరంగా మనం చూడగలం. జయవిజయులను శాపజన్మలన్నిటి లోను ఒకే అవతారంతో ఇద్దర్ని వధించినట్లు చెప్పబడింది. ఇక్కడ హిరణ్యాక్ష హిరణ్యకశిపు రూప జయ విజయులను చంపడానికి రెండు అవతారాలు అవసరమైన సంగతి గుర్తించాలి.

## 5. వామనావతారం

(స్థూల సూక్ష్మ విశిష్టతాతత్త్వ సాధన)

దీనినే త్రివిక్రమావతారం అంటారు. బలిచక్రవర్తి ఇంద్రపదవి కోసం యజ్ఞాలు చేస్తాడు. అతణ్ని విష్ణువు వామనావతారంలో మూడడుగుల భూమిని యాచించి భూమ్యాకాశాల్ని తాకే ఆకారం ధరించి రెండడుగులతోనే భూమిని స్వర్గాన్ని కొల్చి మూడవ పాదాన్ని అతని శిరస్సుమీద పెట్టి అతణ్ని అణచివేశాడు.

'బలి' అసురుడు. అసురుడు అంటే మంచిని గ్రహింపనివాడు. అసురులలో బలి అంటే, బలం కలవాడు. అంత చెడ్డవాడు కాదు. అయినా సాత్త్వికుడు మాత్రం కాడు.

'బలి' అంటే వాసనా బలంకల జీవుడు. అతడు ఇంద్రపదవి కోసం యజ్ఞాలు చేశాడు. అంటే బ్రహ్మత్వంకోసం యజ్ఞాలు చేశాడు అని అర్థం. ఇంద్ర పదానికి 'ఇంధతే ప్రకాశతే ఇతి ఇంద్రః' అని వ్యుత్పత్తి ప్రకాశించునది మనస్సు అని గాని,

ప్రకాశించునది పరబ్రహ్మ స్వరూపం అని గాని రెండు అర్ధాలకు కూడ వేదంలో ప్రయోగా లున్నాయి. ఈ సంగతి నిరుక్తి శాస్త్రం చెప్తూంది. ఇక్కడ ఇంద్రపదవి పదానికి బ్రహ్మత్వసిద్ధి అని అంతరార్థం చెప్పాలి.

యజ్ఞాలు వేదోక్తాలు. వేదాలు త్రైగుణ్యాలకే (సత్త్వ రజ స్తమో గుణాలకే,) సంబంధించినది అనగా యజ్ఞాలు త్రిగుణాత్మకములైన సుఖాల్నే ఇవ్వగలవు కాని, ముక్తిని అంటే బ్రహ్మత్వసిద్ధిని ఈయలేవు. బలిచక్రవర్తి ఇంద్రత్వంకోసం అంటే ముక్తికోసం యజ్ఞాలు చేశాడు. వేదోక్తములైన యజ్ఞాలు ప్రత్యక్షంగా ముక్తినీయలేవు అని అందరూ తెలిసికోలేరు. అదితి కశ్యపులకు విష్ణువు వామనాబ్రహ్మచారియై పుట్టి బలిచక్రవర్తిని మూడడుగుల భూమిని యాచించేడు. అదితి అంటే అఖండ ధ్యానస్థితి అని అర్థం. దితం అంటే 'దో' ఖండనే ధాతువువల్ల ఖండితమైనది అని అర్థం. దితంకాని మనోవృత్తి. అదితి అవుతుంది అంటే అఖండస్థితి అంటే అఖండానంద స్థితి అనే అర్థం. 'అదితికి' అన్న పదానికి వస్తుంది. కశ్యపుడంటే, "పశ్యక ఏవ కశ్యపః" అనే వ్యుత్పత్తిలో చూసేవాడు అనే అర్థం వస్తుంది. అప్పుడు అదితి కశ్యపులకు అంటే అఖండధ్యాన స్థితిలో చూచేవారికి అని అర్థం. వామనబ్రహ్మచారి అంటే అణురూప పరబ్రహ్మతత్త్వం. వామన అంటే పొట్టిదైన అనగా అణురూపం అని అర్థము. బ్రహ్మచారి అంటే బ్రహ్మగా చలించువారు అంటే అంతా తానే అని అర్థం వస్తుంది. అణురూప వామన పరబ్రహ్మచారితత్త్వం అంటే అణోరణీయాన్ మహతో మహీయాన్ అనే బ్రహ్మతత్త్వం అన్నమాట. అది యజ్ఞాలవల్ల తెలియ గల్గేదికాదు.

ఆ సంగతి బలికి 'అంటే' జీవుడికి తెలియ జెయ్యాలని వామనావతారంతో అంటే అణుతత్త్వంతో బలిని అనగా వాసనాబలంకల జీవుణ్ని మూడడుగులు యాచించేడు. 1. విశ్వావస్థ 2. తైజసావస్థ 3. ప్రాజ్ఞావస్థ అనేవి మూడూ విష్ణువునకు అంటే పరబ్రహ్మస్థితికి పాదాలు. వీటిని త్రివిక్రమములు అంటారు. విక్రమం అంటే పాదన్యాసం అని అర్థం. ఈ మూడింటినీ స్థూల, సూక్ష్మ, కారణ దేహాలుగా కూడ చెప్తారు. ముక్తి తురీయావస్థ అనగా ఈ మూటిని దాటిన తర్వాత వచ్చేది నాల్గవది అన్నమాట. ముక్తి కోరేవారు ఈ మూడుపాదాలను దాటాలి. అదే వామనుడు బలిచక్రవర్తిని మూడు అడుగులు యాచించాడన్న దానిలోని అంతరార్థం. బలి చక్రవర్తి మూడడుగులూ ఇవ్వడానికి ఒప్పుకొన్నాడు.

అంత వామనుడు అనంతరూపం ధరించేడు, అంటే, అణురూపతత్త్వం

అంతలో మహా రూపం వహించిందన్నమాట. అప్పుడు ఆ మహారూపంతో బలి చక్రవర్తి రాజ్యం అంతా ఒక అడుగులో భూమిని, రెండవ అడుగుతో ఆకాశాన్ని కొలిచివేశాడు.

అంటే బలిచక్రవర్తిలోని విశ్వావస్థను అనగా స్థూలదేహతత్త్వాన్ని ఒక పాదంగాను, తైజసావస్థను అనగా సూక్ష్మదేహతత్త్వాన్ని రెండవ పాదంగాను ఆక్రమించేడు. అంటే బలియొక్క విశ్వతైజసావస్థలను అనగా స్థూల సూక్ష్మదేహాలను భగవన్మయం చేశాడు.

ఇంకొక అడుగు భూమి వామనునకు బలి ఇవ్వాలి అంటే ప్రాజ్ఞావస్థను అనగా కారణదేహాన్ని జీవుడు భగవన్మయం చేయాల్సి వుందన్నమాట. కారణదేహం భగవన్మయం అయితేనే వాసనాక్షయం కల్గి జనన మరణ రాహిత్యం కల్గితేనే తురీయావస్థ అంటే ముక్తి సిద్ధిస్తుంది. కారణ దేహాన్ని త్యజించవలసిందిగా ఆదేశిస్తూ భగవానుడు బలి శిరస్సును మూడవపాదంగా కొలిచేడు అంటే అతని శిరస్సులో కలిగే ప్రకృతి భావనల మూలబీజాలు అంటే కారణదేహం భగవన్మయం చేసేటట్లు జీవుణ్ని భగవంతు డనుగ్రహించే దన్నమాట.

ఈ వామనావతారకథ ఈ విధంగా అవస్థాత్రయాన్ని (దేహత్రయాన్ని) అతిక్రమించి తురీయావస్థను చేరుకోవాలనే సాధనా రహస్యాన్ని చెప్తూంది. ఈ త్రిపాద సాధనచేత పొందబడేవాడు కాన త్రివిక్రముడనే పేరు విష్ణువునకు ఏర్పడింది.

మోక్షరూప బ్రహ్మస్వరూపం నాల్గుపాదాలు కలది. విశ్వతైజస ప్రాజ్ఞావస్థలు మూడుపాదాలు అవి దాటితేనే తురీయావస్థ. ఈ సంగతి పురుషసూక్తం అంటే పరమపురుషుని చెప్పే వేదభాగంలో చెప్పబడే వుంది.

## 6. పరశురామావతారం

(పరమాత్మానంద సంధాన సాధన)

జమదగ్ని కుమారుడు పరశురాముడు. కార్తవీర్యార్జునుడనే సహస్ర బాహువులు గల రాజు జమదగ్నియొక్క కామధేనువుకై అకారణవైరం పెట్టుకొని కామధేనువును హరించేడు. అతనిని పరశురాముడు చంపి కామధేనువును విడిపించి తండ్రి కిచ్చేడు.

తర్వాత ఒకనాడు జలాహరణానికి వెళ్ళి ఆ సరస్సువద్ద క్రీడిస్తున్న గంధర్వ

మిధునాన్ని చూస్తూన్న కారణంగా ఆలస్యంగా వచ్చినందుకు కోపించి జమదగ్ని తన భార్యయైన రేణుకను చంపివేయవలసినదిగా కుమారుడైన పరశురాముణ్ని ఆదేశించేడు. వెంటనే తండ్రిమాట ప్రకారం పరశురాముడు పరశువుతో తల్లిని వధించేడు. అందుకు జమదగ్ని సంతోషించి నీవు వరం కోరుకొమ్మని పరశురామునితో అన్నాడు. 'నా తల్లిని బ్రతికించు' మని పరశురాముడు వరం కోరేడు. వెంటనే రేణుకను జమదగ్ని బ్రతికించేడు.

తర్వాత కార్తవీర్యార్జునుని కుమారులు తమ తండ్రిని చంపిన కారణంగా పరశురామునియొక్క తండ్రి జమదగ్నిని చంపివేశారు.

ఆ విధంగా కార్తవీర్యార్జునుని కుమారులు తన తండ్రిని చంపిన కారణంచేత పరశురాముడు ఆతని కుమారులనేకాక వారు జన్మించిన రాజవంశాన్ని కూడ ఇరవై యొక్కసార్లు దండయాత్ర సలిపి సర్వనాశనం చేశాడు. పరశురాముడు భగవంతుని అవతారం. తన తండ్రిని చంపేడన్న పగను తీర్చుకొనడానికి ఇంత కులహింసాకాండ నిర్వహించిన పరశురాముడు భగవదవతారం అనడం ఏం బాగుంది? లోకంలో పగ తీర్చుకోవడానికై హింసాకృత్యాలు చేసే వారినంతా పరశురామునివలె భగవదవతారాల క్రిందనే జమ చేయవచ్చా? ఇందు అంతరార్థపరంగా ఏదో భగవద్విశేషం ఉండాలి. తప్పదు.

జమత్+అగ్ని=జమదగ్ని. 'జాయతే ఇతిజః, పుట్టేది అనే అర్థంలో 'జ' అవుతుంది. కల్గివున్నది అనే అర్థంలో 'మత్' వస్తుంది. 'జమత్' అంటే పుట్టిన దానితో అంటే జీవునితో కూడివుండేది అనేఅర్థం జమత్ పదానికి చెప్పుకోవాలి. "'అగ్ని' అనేడి అగ్రి=అన్నదానికి ప్రత్యక్షరూపంగా వాడబడింది" అని వేదార్థం చెప్పే నిరుక్తిశాస్త్రం చెప్తూంది. 'అగ్రము' అంటే మొదలు, చివర అని రెండర్థాలూ ఉన్నాయి. కాన 'అగ్రి' అంటే ఆద్యంతములు తానేఅయిన పరమాత్మ అని అర్థం.

జమత్+అగ్ని=జమదగ్ని అంటే, జీవునితో కలిసియున్న పరమాత్మ అని అర్థం వస్తుంది. అప్పుడు వాసనావాసితుడుగా జీవుడుగావున్న పురుషుడు అనగా పరమాత్మ అని జమదగ్ని పదానికి అర్థం వస్తుంది. ఇక్కడ జీవుడు పరమాత్మగా అగుటకు సాధనచేసే సాధకుడు అని జమదగ్ని పదానికి అంతరార్థంగా తెలుసుంది.

కార్తవీర్య+అర్జునుడు=కార్తవీర్యార్జునుడు అంటే, 'ఋజు' వర్తన కలవాడు

అని అర్జునుడు అనే పదానికి అర్థం. 'కృతం వీర్యం యస్యసః కార్తవీర్యః' అని వ్యుత్పత్తి చెప్పాలి. నిర్వర్తింపబడిన వాసనాబలం కలవాడు అని కార్తవీర్య పదానికి అప్పుడు అర్థం వస్తుంది. సుప్రతిష్ఠితమైన శక్తిగల జీవుడు. పూర్వజన్మకృత వాసనా వశంవల్ల ఆతడు ఋజువర్తనుడు అయినాడు అంటే భగవదన్వేషణ చేసేయత్నం ఋజువర్తనం అవుతుంది.

అప్పుడు కార్తవీర్యార్జునుడంటే భగవదన్వేషణచేసే శక్తివంతమైన ఋజువర్తన గల జీవాత్మ అని అర్థం వస్తుంది. ఆతడు సహస్రబాహువులు కలవాడు. బాహువులు రెండు కాన ద్వంద్వములను బాహుపదంచే గ్రహిస్తే అనేక ద్వంద్వాలు అంటే, లాభాలాభాలు, జయాపజయాలు, సుఖదుఃఖాలు, రాగద్వేషాలు మొదలైన అనేకం కలవాడని సహస్రబాహువన్న మాటకు అర్థం. ఈ విధంగా భగవదన్వేషణ జరుపుతూ ద్వంద్వములను విడవలేని సాధకునిలోని అనగా జమదగ్నిలోని జీవుడే సహస్రబాహువైన కార్తవీర్యార్జునుడని పేరు వర్తిస్తుంది. ద్వంద్వాలతోవున్న కారణం చేత సాధకుడెంత భగవదన్వేషణా ఋజువర్తన రూపప్రయత్నం చేసినా ఆతనికి కైవల్యం లభించలేదు.

తర్వాత కార్తవీర్యార్జునుడు జమదగ్ని హోమధేనువగు కామధేనువునుహరించేడు. కామధేనువు అంటే ఏది కోరితే అది లభించే అష్టసిద్ధుల్లోని 'ప్రాకామ్యం' అనే సిద్ధి. ఆ సిద్ధి సాధనలో సాధకులకు లభించేది అది ఇక్కడ సాధకునకు (జమదగ్నికి) సాధనలో గోచరించింది దానిపై వ్యామోహపడింది సాధకునిలోని ఋజుప్రవర్తనతో బలమైన జీవప్రకృతి అన్నదే, కార్తవీర్యార్జునుడు జమదగ్ని హోమధేనువును అపహరించేడన్నదాని అంతరార్థం. ఇక్కడ అంతరార్థంలో సాధకునిలోని కామ్య మనోవృత్తియే కార్తవీర్యార్జునుడుగా చెప్పబడింది. పాత్రలన్నీ సాధకునిలోని మనోవృత్తులే కాని వేర్వేరు వ్యక్తులు కావని గ్రహించాలి. తర్వాత జమదగ్ని పరశురాముని ఆదేశింపగా కార్తవీర్యుని పరశురాముడు చంపేశాడు. సాధకునిలోని అత్యంతము సుగతిని చేర్చే ఆనందస్వరూపమే పరశురాముడు. తర్వాత సాధకుడు తన కామ్యమనోవృత్తిని గుర్తించి, అంటే తాను ప్రాకామ్యసిద్ధితో ముక్తికి దూరమైపోయే ప్రమాదాన్ని గుర్తించి తనలోని పరమాత్మాంశమైన ఆనందతత్త్వాన్ని సాధనతో రెచ్చగొట్టి ప్రాకామ్యసిద్ధిని విడిచివేశాడు అని అంతరార్థం.

తర్వాత జమదగ్ని రేణుక జలాహరణానికి వెళ్ళి గంధర్వమిధునం యొక్క క్రీడను తిలకిస్తూ ఆలస్యంగా వచ్చినందులకు పరశురామునిచేత చంపించేడు. అంటే,

తర్వాత సాధకునిలోని ప్రకృతి శృంగారాసక్త మవటాన్ని గుర్తించి సాధకుడు తిరిగి సాధనతో ఆనందవృత్తిని రెచ్చగొట్టి ఆ ప్రకృతికి తనలో చోటులేకుండా చేసి కొన్నాడని అంతరార్థం చెప్పాలి. 'రేణుక' అంటే రేణువులు కలది. అనగా పర మాణు సంయోగం కల ప్రకృతి అని అర్థం.

పరమాణువుల కలయికతో ప్రకృతిలోని అన్నీ ఏర్పడ్డాయని కణాదతర్క శాస్త్రం చెప్తూంది. ఈ విధంగా తర్వాత పరశురాముడు "తల్లిని బ్రతికించుమని వరం వేడేడంటే, ప్రకృతిని చంపివేయడంవల్ల ముక్తిరాదనీ, ప్రకృతిని తనలోవుంచి తన లోని ఆనందరూప పరమాత్మలో లీనం చేసుకోవాలనీ, అప్పుడే ముక్తి పదానికి అర్థం అనీ సాధకుడు గ్రహించి ప్రకృతిని ఆనందస్వరూపంలో లీనం చేసికొన్నాడనే అంతరార్థాన్ని పరశురాముని వరంవల్ల రేణుకను జమదగ్ని బ్రతికించేడన్న కథాం శంలో గ్రహించాలి.

తర్వాత కార్తవీర్యుని కుమారులు తమ తండ్రిని చంపిన పగచేత జమదగ్నిని తల ఖండించేరు.

పరశురాముడు కార్తవీర్యుని చంపేడన్నదానికి సాధకునిలోని బలమైన వాసనా శక్తిని అణచివేశాడనే కాని పూర్తిగా నాశంచేశాడని అర్థం చెప్పుకోకూడదు. సాధకుడు ముకుడయ్యేవరకు వాసనావృత్తి నశించనే నశించదనే సంగతి గురించాలి.

తర్వాత కార్తవీర్యుని కుమారులు జమదగ్ని శిరస్సు ఖండించేరు. అంటే సాధకునిలో అణగిమణగివున్న వాసనావృత్తులు సాధకుని ప్రలోభ పెట్టుతూ వచ్చేయని అంతరార్థం. జమదగ్నిని చంపివేయడం అనేదానికి వాసనావృత్తులు సాధకునియొక్క సాధనను భ్రష్టం చేశాయని మాత్రం అంతరార్థపరంగా చెప్పుకోవాలి.

తర్వాత పరశురాముడు కార్తవీర్యుని కుమారులను ఆతని వంశాన్ని కూడ ముయ్యేడుసార్లు (3×7=21) దండెత్తి సంహరించేడు. పరసురాముడు పరశ రాముడుగా ప్రత్యక్షీకరణం చేయబడ్డాడు. ఆ పర+సు+రాముడు అన్నదానికి, పర=శ్రేష్ఠమైన, సు=సుగతితో అనగా ముక్తితోగూడిన, రాముడు=ఆనంద స్వరూపమైన పరమాత్మయైనవాడు అనే వ్యుత్పత్తితో అర్థం చెప్పాలి. అప్పుడు పరసురాముడంటే, శ్రేష్ఠమైన ముక్తికి సంబంధించిన ఆనందరూప పరబ్రహ్మం అని అర్థం వస్తుంది.

(8)

సాధకుడైన జీవుడు ద్వంద్వాలతో చిక్కుకొని ప్రలోభాలకు చిక్కుకొని పరమాత్మాన్వేషణతోనే వున్నప్పటికీ భగవంతుడు వానికి కన్పించడు అనేది కార్త్యవీర్యుని వృత్తాంతంవల్ల అంతరార్ధపరంగా తెలుస్తూంది. చిట్టచివరకు సాధకుడు ముక్తుడౌతాడు. పరసురాముడు ముయ్యేడుసార్లు రాజవంశాన్ని కార్తవీర్యార్జున రాజవంశాన్ని దగ్ధం చేశాడు. మూడు సంఖ్యతో గుణించిన ఏడు సంఖ్య ఇరువైయొక్కటి అవుతుంది. సాధకుని యొక్క దేహంలోని సప్తధాతువులను అంటే (1. చీము 2. నెత్తురు 3. మాంసం 4. క్రొవ్వు 5. ఎముక 6. ఎముకలలోని మూలుగు 7. శుక్రం అనేవి.) వీనిలో ప్రతి ఒక్కొక్క ధాతువును సత్త్వరజస్తమోగుణాలు మూడింటితో హెచ్చిస్తే మొత్తం 21 రకాలుగా అవి దేహంలో ప్రకృతిలో వుంటాయి. ఆ ఇరువైయొక్క సప్తధాతు త్రిగుణ ప్రకృతిని నాశం చేస్తేనే జీవునికి వాసనలు విముక్తములై పరమానంద సిద్ధి కల్గుతుంది. ఈ అంతరార్థాన్ని ముయ్యేడుసార్లు కార్త వీర్యవంశాన్ని పరశురాముడు దగ్ధం చేశాడన్నదానికి భావించాలి. భగవదన్వేషణ అంటూ మానకుండా జరిపే సాధకుడు ద్వంద్వ విశిష్టుడై ఉండడంవల్ల పరమాత్మను చూడలేడనీ, సప్తధాతువుల్లోని త్రిగుణాలను పూర్తిగా నాశంచేస్తే ద్వంద్వాలు నశించి సాధకునకు ఆనంద పరమాత్మతో సాయుజ్యం లభిస్తుందనీ, సాధనారహస్యం జమదగ్ని పరశురామావతార కథలో నిక్షేపింపబడి ఉంది. రేణుకా పునర్జన్మలో సాధకుడు ప్రకృతిని తనలోనే వశం చేసుకొని వున్నాడనీ కార్తవీర్యుని వంశ నాశముతో ప్రకృతిలోని సప్తధాతువుల్లోని త్రిగుణాలను నాశంచేసికొన్నారనీ అంతరార్థం చెప్పుకోవడంవల్ల ఇక సాధకుడు చెయ్యవలసిన సాధనలేదు. ఆ కారణంచేత వాసనా ముక్తుడై సాధకుడు కైవల్యం పొందేడని సారాంశం.

## 7. శ్రీరామావతారం

### (దశేంద్రియ విలీనీకరణ సాధన)

దశరధునకు శ్రీరాముడు పుట్టి దశకంఠుణ్ణి చంపినది శ్రీరామావతార కథా సారాంశం.

దశరధుడంటే దశేంద్రియాలతో కూడిన దేహంకల జీవాత్మ అని అర్థం. సాధకుడైన ఆ జీవాత్మలోని పరమాత్మాంశమే శ్రీరాముడు. దశగ్రీవ రావణుడంటే, దశేంద్రియాలనే కంఠాలతో అరిచే ఐహిక భోగలంపటుడైన వాసనాకేంద్రం సాధకుని

లోని ఆ దశేంద్రియ ప్రాబల్యాన్ని పోగొట్టి పరమాత్మ తనలో ఐక్యం చేసుకోవడమే దశకంఠాలు ఛేదించి రాముడు రావణుని సంహరించి అతనికి ముక్తినిచ్చేడన్న కథకు అర్థం. నేను రచించి ప్రకటించిన అంతరార్థ రామాయణంలో ఈ సాధనా క్రమం సవివరంగా ప్రదర్శింపబడి ఉంది. కాన ఇక్కడ అతి సంగ్రహంగా చెప్పడం జరిగింది. కావాలనుకొన్నవారు దానిని పఠించి రామాయణాంతరార్థాన్ని గ్రహింపగలరు.

# 8. బలరామావతారం

(ద్వైతభావనా నాశన సాధన)

బలరామావతారంతో భగవంతుడు ద్వివిదుడనే రాక్షసుని సంహరించేడు. ఈ 'ద్వివిద' రాక్షసుడు ప్రబల ప్రజాసేవకుడైన కారణంచేత వానిని చంపడానికి భగవంతుడు బలరామావతారం ఎత్తినట్లు భాగవతంలో చెప్పబడి ఉంది. బల+రాముడు, బల=మిక్కిలి శ్రేష్ఠమైన, లేక బలమైన రాముడు=ఆనంద రూపము కలవాడు, అనగా పరమాత్మ అని అర్థం లేక "వ బయో రభేదః" అనే దానివల్ల బలపదాన్ని, 'వల' పదంగా చెప్పచ్చు. వలతే వ్యాప్నోతి ఇతి వలః" అనే వ్యుత్పత్తిలో 'వల' అంటే సర్వత్ర వ్యాపించిన మాయ అనగా ప్రకృతి అనే అర్థం వస్తుంది. కాన ప్రకృతి యందు పరమాత్మ భావంతో ఆనందించు సాధన బలరామ సాధన అవుతుంది. ఈ విధంగా కూడ చెప్పుకోవచ్చును. ద్వివిదుడు ఎక్కువ జనకంటకుడు. వానిని బలరాముడు సంహరించేడు. ద్వి+విదుడు=ద్వివిదుడు, ద్వి=ద్వంద్వస్థితిని అనగా భేద భావాన్ని, విదుడు=తెలిసినవాడు. తాను భగవంతుని స్వరూపమే అనికాక, తాను వేఱు భగవంతుడు వేఱు అని ఇద్దరను వేరువేరుగా గుర్తించేవాడు, ద్వైతి అని వ్యుత్పత్తి పరంగా చెప్పుకోవచ్చు. ద్వైతవృత్తి సాయుజ్య ముక్తికి ప్రతిరోధకం అవడం చేత ద్వివిదుడు(అసురుడయ్యేడు.న+సు+ర=అనగా,సు=సుగతిని అనగా సాయుజ్య ముక్తిని, ర=గ్రహించువాడుకాని వాడని అర్థము) ప్రజాకంఠకుడని చెప్పడం జరిగింది ఈ ద్వైతభావాన్ని పోగొట్టాలంటే ఆనందరూప పరమాత్మను బలంగా భావన చెయ్యాలి. అంటే, బలరామావతారంతోనే ద్వైతాన్ని సంహరించాలి. అప్పుడే ద్వైత వృత్తి మనస్సునుండి నశిస్తుంది. కృష్ణావతారం. ఇది మిగిలిన అవతారాల్లాగ అంశావతారంకాక పూర్ణావతారం అవడంవల్ల దశావతారాల్లో చేరలేదు. కాన కృష్ణ జననాదికం వేరుగా దశమస్కంధంలో పూర్వోత్తరభాగాల్లో విపులంగా చెప్పబడింది. కాన అచ్చట అంతరార్థం వివరంగా చెప్తాను.

# 9. బుద్ధావతారం

## (నిర్యాణ సాధన)

కపిల వస్తుపురం పాలించే శుద్ధోదనుడనే రాజుకు మాయావతి అనే స్త్రీయందు సిద్ధార్థుడు అనే వాడు జనించినాడు. ఆతడు బుద్ధుడై (జ్ఞానియై) ధర్మపథాన్ని ప్రచారంచేసి దానివల్లనే ముక్తిని చెప్పి యజ్ఞాలను నిరసించి నిర్వాణ మార్గాన్ని ప్రవచించేడు. అని చరిత్ర ప్రసిద్ధంగా ఉంది. నిర్వాణం అంటే ఆరిపోవటం. జీవుని లోని వాసనలన్నీ ఆరిపోవడమే నిర్యాణం. అదే ముక్తికి అర్థం. యజ్ఞ కర్మా చరణంతో అసురులంతా దేవతల వల్ల వరాల్ని సంపాదించి ప్రజల నేద్పిస్తూంటే దుర్మార్గ చింతతో అనగా స్వార్థంతో చేసే యజ్ఞాపరణం నుండి ప్రజల దృష్టిని తప్పించడానికి బుద్ధు డుదయించినట్లు పురాణకథ చెప్తున్నది. రెండింటి యందూ చివరకు ఒకే ఫలితం నిర్వర్తింపబడివుండడంచేత రెండింటిని అంతరార్థ పరంగా ఒకే దానినిగా స్వీకరించవచ్చు. బుద్ధునిబోధల్లో పరమాత్మ ప్రసక్తి లేని కారణం చేత ఈతనిని నాస్తికుడంటారు. అది సరికాదు. అప్పుడు అతడవతారం ఎట్లు? బుద్ధుడు అంటే 'జ్ఞాని' అని అర్థం. నిర్వాణం అంటే వాసనలను చల్లార్చడం అని అర్థం. అది ప్రధానంగా ధర్మపథం ప్రబోధించేడి. ధర్మ మార్గాచరణతోనే వాసనలు ఆరి పోతాయి. అంటే నిర్వాణం సిద్ధిస్తుంది అనే దాన్ని ప్రధానంగా వ్యాప్తి చేశాడు బుద్ధుడు. వేదాలు యజ్ఞాచరణను ప్రబోధించినవి. అవి త్రైగుణ్య విషయాలు. ఆ విధంగా త్రైగుణ్య విషయాలైన యజ్ఞాలను భగవద్గీత కూడ శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా: నిస్త్రైగుణ్యో భవార్జున అని చెప్పియేవుంది. దానిచేతనే బుద్ధుడు యజ్ఞాది కర్మలు నిర్వాణాన్నిచ్చేవి కావని నిషేధించేడు. స్వార్థరహితంగా చేసే యజ్ఞాలు వేరు. అవి ముక్తి సాధనాలే అయినా యజ్ఞాచరణను అసురులే అంటే సాయుజ్య ముక్తిరూప సుగతిని కోరని వారే చేస్తూండడం చేత వానిని బుద్ధుడు నిషేధించేడు.

బుద్ధుడు కపిలవస్తుపుర వాస్తవ్యుడు. కపిల వస్తువంటే కపిలుడు చెప్పిన సాంఖ్య శాస్త్రం అన్నమాట. ఆ శాస్త్రప్రకారం ఆచరిస్తే వాసనా క్షయం జరుగుతుంది. సాంఖ్యం, భగవంతుని వాసనా క్షయం ద్వారానే సాధించాలని సూటిగా చెప్తూంది. విష్ణువే కపిలావతారం ఎత్తేడు. బుద్ధుడు చేసినపని కూడా అదే. అతడు కపిలవస్తు వాస్తవ్యు డనడంలో కపిల సాంఖ్యవాది అనే అంతరార్థం వస్తుంది. అతడు శుద్ధోదనునికి మాయాదేవి యందు పుట్టేడు. శుద్ధ+ఓదనుడు అంటే శుద్ధసత్త్వ ప్రకృతియే ఓదకంగా

అనగా భోజనం కలవాగు అనగా సత్త్వగుణ పరిపూర్ణుడు అని అర్థం. అతడు మాయను అనగా ప్రకృతిని తనలో ఐక్యం చేసికొన్నవాడు అనగా మాయావృతుడైన భగవంతుడు అని అర్థం. ఆ ప్రకృతి పరమాత్మల నుండి పుట్టినవాడు బుద్ధుడు అంటే జ్ఞాని అని అర్థం. అతడు సిద్ధార్థుడు అంటే సిద్ధించిన కోర్కెలు కలవాడవుతాడనే అర్థం. వాసనా క్షయంవల్ల కోర్కెలను అణచి వెయడం ధర్మమార్గంలో జరుగుతుందని ఈ బుద్ధావ తార కథలోని పరమార్థం ధర్మ మార్గం ముక్తిసోపానాలలో ప్రప్రథమ సోపానంగా అన్ని మతాలు దేశాలు చెప్తాయి.

# 'కల్కి' అవతారం

## (మాయా నివారణ సాధన)

ఇది రాబోయే అవతారంగా చెప్పబడింది. కాన దీనిని గూర్చి ఎక్కువగా గ్రంథాలు చెప్పడానికి వీలులేదు. అంతరార్థం మోక్షంగా కల్కిపదంలో చెప్తారు. 'కల్కి' అనే పదం 'కలనాత్ కలిః' అనే వ్యుత్పత్తిలో కూడుకొని వుండేది అనే అర్థంలో 'కలి' శబ్దానికి మాయ అనే అర్థం వస్తుంది. కలి శబ్దం మీద నుండి కలి, కలికి, కల్కి అనేవి ఏర్పడుతాయి. అప్పుడు మాయావృత్తికి 'కల్కి' అనే స్త్రీలింగ రూపంతో పేరు ఏర్పడుతుంది. ఈ మాయ భగవంతునిదే అని చెప్పడమే కల్కి అవతారంలోని అర్థం. ఈ దశవిధ సాధనల్లో ఇది ఆఖరుది. బుద్ధావతారం తర్వాతిది. బుద్ధసాధన జ్ఞాన సాధన.

జ్ఞానం సాధించిన తర్వాత మాయ తనంత తానే సాధకునకు వశపడుతుంది. అంటే అది సాధకుని భ్రమలో పడవేయలేదు. కల్కి అంటే మాయావృత్తి అని కదా అర్థం.మాయావృత్తి జ్ఞానావస్థితితో సాధకునికి వశ పడుతుందని కాన ఈజన్మలో జ్ఞానం సంపాదించుకోవాలని భవిష్యత్ ఫలితాన్ని చెప్పడమే కల్కి అవతారానికి అంత రార్థం. కల్కి అవతారంలో దుర్మదులైన రాజులను సంహరించడం జరుగుతుంది. అంటే సత్వవాసనలకు క్షయం చేసేవాడు జన్మించటం జరుగుతుందని అర్థం. 'దశ' అంటే అవస్థ అని కూడ అర్థం. పది అవస్థలలో భగవంతుని అవతరింప జేయడమే దశావతార పదానికి అంతరార్థం. ఈవిధంగా దశ అవతారాలు, దశ విధ క్రమ సాధనా అవస్థల్ని చెప్తున్నాయి. మొదటి దశలో ప్రారంభించిన సాధన చివరి దశలో పూర్తి అవుతుంది. మత్స్యావతారంలో ప్రారంభించిన ముక్తి సాధన కలికి అవతారంతో పరిపూర్ణ జ్ఞానం జెంది వాసనా బద్ధుడైన జీవుణ్ణి ముక్తుణ్ణిగా చేస్తుంది.

మత్స్యావతార సాధనలో నేను నాది అనే అహంకార భావం నశించేటట్లు చూచుకోవాలని, ఆ విధంగా అహంకార మమకారాలు చస్తే జ్ఞాన వికాసం కల్గి ప్రకృతి లంపటత్వం తగ్గుతుందని తెలుస్తూంది. రెండవ దశలో కూర్మావతార సాధనలో సాధకుడు ధ్యానం తీవ్రంగా చేసినప్పుడు భగవదన్వేషణ ధ్యానంలో మునిగి పోయి ఒక్కొక్కప్పుడు ఉక్కు తెలియని స్థితి కూడ ఏర్పడుతుంది. అప్పుడు సాధకుడు ధ్యాన సమాధి నుండి ప్రకృతి లోనికి చేరుకొని ప్రకృతిని అనుభవిస్తూనే తర్వాతి సాధన ప్రారంభించాలి. మొదటిదశలో అహంకార మమకారాలు చంపుకొని ప్రకృతి ఆధారంగానే సాధన చేయాలని అట్లావేసే సాధన రెండవదశ అవుతుందనీ, అప్పుడు సమాధి కొంత సిద్ధిస్తుందనీ తెలుస్తూంది మూడవదశలోని వరాహావతార సాధనలో క్రిందటి ప్రకృతిని ఆధారం చేసికొన్నప్పుడు ఆ ప్రకృతి ఇంద్రియాల్లో ఆవేశించి సాత్త్విక భావాల్ని కూడ నాశం చేసే ప్రమాదం ఏర్పడుతుంది. అప్పుడు ప్రకృతి లంపటత్వము శ్రేష్ఠమైన పరమాత్మను చేర్చే సాత్త్విక గుణంయొక్క నాశనానికి దారితీయకుండా చూచుకోవాలనీ, తామసికానికి ప్రకృతి నాశనానికై మాత్రమే సాధన జరిగేటట్లు చూచుకోవాలనీ తెలుస్తూంది. నాల్గవదశలో నరసింహావతార సాధనలో ప్రకృతిని అనుభవించడంతో లోపలనున్న ఆత్మానందాంశము అణచివేయడం కూడ జరుగుతూంది. కాన అప్పుడు సాధకుడు సమాధిలో నిశ్చల తత్త్వాన్ని అవలంబించి సర్వ ప్రకృతిని నాశంచేసి ముక్తిస్థితిని కాపాడుకొని ఆత్మానందాన్ని రక్షించుకోవాలనీ తెలుస్తూంది.ఐదవదశలో వామనావతార సాధనలో అవస్థాత్రయ విముక్తితో తురీయావస్థ చేరుకోవాలని తెలుస్తూంది. ఆరవదశలో పరశురామావతార సాధనలో నాస్తికత్వానికి దారితీస్తుందనీ అపుడు ఆ జీవునిలోని సప్తధాతువుల్లోని త్రిగుణాల్ని నాశంచేసి పరమాత్మాంశను గట్టిగా రక్షించాలని తెలుస్తూంది. ఏడవదశ శ్రీరామావతార సాధన. దీనిలో దశేంద్రియాల నిగ్రహంతో ప్రశాంతత సాధించి దశేంద్రియాలను ఆత్మానందంలో లీనం చెయ్యాలని తెలుస్తూంది. ఎనిమిదవ దశ బలరామావతార సాధనలో ద్వైతబుద్ధిని సగుణాతాధరా తత్త్వాన్ని పోగొట్టాలని తెలుస్తూంది. తొమ్మిదవ దశ బుద్ధావతార సాధన. దీనిలో ధర్మమార్గంలో జ్ఞానం పొందాలనీ తెలుస్తూంది. పదవ దశ కలికి అవతార సాధన. దీనిలో మాయను వాసనాక్షయంతో స్వవశం చేసుకోవాలని అప్పుడే పరమాత్మైక్యం సిద్ధిస్తుందని తెలుస్తూంది. ఈ విధంగా పది అవతారాలు ముక్తిని చేర్చే సాధనాలని అంతరార్థపరంగా మనం తెలిసికోవాలి,

# ధ్రువోపాఖ్యానం

(నిశ్చయతాజ్ఞాన సాధన)

శ్లో॥ స్వాయంభువ స్యాపి మనోః
హరే రంశాంశ జన్మనః

ప్రియవ్రత తోత్తాన పాదౌ
శతరూపా పతే స్సుతౌ
వాసు దేవస్య కలయా
రక్షాయాం జగత స్థితౌ

జాయే ఉత్తాన పాదస్య
సునీతి స్సురుచి స్తయోః
సురుచిః ప్రేయసీ పత్యుః
నేతరా య త్సుతో ధ్రువః

ఏకదా సురుచేః పుత్ర
మంక మారోప్య లాలయన్
ఉత్తమం నా రురుక్షంతం
ధ్రువం రాజా భ్యనందత.

భాగ, 4 స్కం 8 అధ్యా, శ్లో 65

"హరి యొక్క అంశాంశ సంభవుడైన 'స్వాయంబువు' మనువునకు శతరూప అను భార్యవలన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడునను ఇద్దరు కొడుకులు. వాసుదేవుని యొక్క కళ చేత జగత్తును రక్షించుటకు జనించేరు. అందు ఉత్తానపాదునికి సునీతి పెద్దభార్య, సురుచి చిన్నభార్య. వారిద్దఱిలో ఉత్తానపాదునకు సురుచి అంటే ఎక్కువ ప్రేమ. సునీతికి ధ్రువుడను కుమారుడు, సురుచికి ఉత్తముడనే కొడుకు పుట్టేరు. ఒకనాడు సురుచి యింటిలో ఉత్తముని తన తొడపై నిడుకొని ఉత్తానపాదుడు బుజ్జగిస్తూండగా సునీతి కొడుకు ధ్రువుడు వచ్చి తండ్రి తొడ నెక్కుటకు రాబోయాడు కాని తండ్రి ఆతని నాదరించలేదు." అని పై శ్లోకాల కర్థం.

విషయావేదోః' అనగా వేదాలు ప్రకృతికి సంబంధించి త్రిగుణములతో జీవనం సాగించే విషయాలకు చెప్పిన మార్గాలు అవి ముక్తిని చెప్పేవికావని అర్థం. కాన దానిని తెల్పే ప్రియవ్రతుని కథాభాగం ఇచ్చట వివరింపబడలేదు.

ఉత్తానపాదునకు సునీతి మొదటి భార్య. ఇచ్చట నుంచి ఉత్తానపాదుని ముక్తిమార్గ సాధకునిగా చెప్పుకోవాలి. ఉపనిషన్మార్గంలో ముక్తిని సాధించే సాధకుని మనోవృత్తియే, ఉత్తానపాదుడన్న మాట. అతనికి సునీతి అంటే 'సు' అనగా సుగతిని అంటే మోక్షాన్ని 'నీతి' అంటే పొందించే మనోవృత్తి అని అర్థం. నీతము అనగా పొందింపబడినది. అని అర్థం గదా! 'నీతి' అన్నా అదే అర్థం. ఈ విధంగా సునీతి అంటే ముక్తిని పొందించే సాధకునిలోని పరాశక్తి తాలూకు మనోవృత్తి అని అంతరార్థం చెప్పాలి. సు=చక్కని, నీతి=నీతిమార్గం న్యాయమార్గం మంచిదైన జీవన మార్గం అనికూడ చెప్పవచ్చు రెండింటికి ఇంచుమించుగా ఒకటే భావం. ముక్తిని సాధించే వానికి ముందుగా ఉండవలసినది సునీతి అన్న అర్థం. ఉత్తానపాదునికి సునీతి పెద్దభార్య అన్న దానికి అంతరార్థం, సునీతివల్ల ఉత్తానపాదునకు ధ్రువుడు పుట్టేడు. 'ధ్రువ' అంటే' నిశ్చయ జ్ఞానం అనగా యథార్థ జ్ఞానం అనగా అనిశ్చయి మాయావృతం కానిదైన భగవద్విజ్ఞానం అని అర్థం. ముక్తిని సాధించేవాడు మంచి నీతి నిజాయతీ మార్గాల్లో జీవితం సాగిస్తాడనీ, వానికి ఆ నీతి నిజాయతీ జీవితంలో భగవంతుని తెలిసికొనే నిశ్చయ బుద్ధిముందు ఆవిర్భవిస్తుంది. అని అంతరార్థం ధ్రువుడు అంటే నిశ్చయజ్ఞానం. అనగా బుద్ధి. 'నిశ్చయాత్మికా బుద్ధి'. అది లేనిది అనిశ్చయాత్మిక బుద్ధి. సునీతి ఉత్తానపాదులకు ధ్రువుడు జన్మించేడన్న దానికి నీతిమార్గంలోనే ముక్తిని కోరే నిశ్చయాత్మిక బుద్ధి జనిస్తుంది అనే సాధనా రహస్యాన్ని అర్థంగా గ్రహించాలి.

తర్వాత ఉత్తానపాదుడు సురుచి అనే ఇంకో భార్యను పెండ్లాడేడు. ఆమె యందా తనికి మక్కువ యెక్కువ. ఆమెను పెండ్లాడినప్పటినుండి పెద్ద భార్యను, ఆమె బిడ్డను సరిగా చూడ్డం మానేశాడు. ఉత్తాన పాదునకు సురుచి వల్ల ఉత్తముడు జన్మించేడు.

సురుచి అంటే చక్కని రుచి కలది. అనగా ఐహిక భోగలంపటత. అది ఉత్తాన పాదుని రెండవ భార్య. ముక్తిని సాధించే సాధకుడు మొదట్లో నీతిమార్గంలో కొంత భగవద్విజ్ఞానం (ధ్రువజ్ఞానం) వచ్చిన తర్వాత మాయావాసనల ప్రాబల్యంవల్ల

ఆ మార్గం విడిచి ఐహిక భోగలంపటుడు కావడం ఒకప్పుడు జరుగుతుంది అన్న సాధనా విఘ్న దశ ఉత్తాన పాదుడు తర్వాత సురుచిని పెండ్లాడేడన్న దానికి అంతారార్థం. సురుచిని పెండ్లాడేక సునీతిని ధ్రువుని విడిచి వేశాడంటే సాధకుడు ఐహిక భోగలంపటం అలవడ్డంతోనే ముక్తి హేతువైన నీతిని విడిచి వేస్తాడు అంతవరకు కల్గిన భగవద్విజ్ఞానాన్ని లక్ష్యం చెయ్యడు అనేది అంతరార్థపరంగా గ్రహించాలి. సురుచికి ఉత్తముడు పుట్టేడు, ఉత్తముడు అంటే మంచివాడు అని ఇక్కడ అర్థం కాదు. 'ఉతే +తమః' గొప్ప అజ్ఞానం లేక మాయ అని అర్థం. ఈ వ్యుత్పత్తిలో ఇది ఆర్ష ప్రయోగంగా గ్రహించాలి. ఐహిక భోగలంపటతో అంతవరకున్న ధ్రువజ్ఞానం విస్మృతమై గొప్ప అజ్ఞానంలో సాధకుడు పడిపోయి సాధనా భ్రష్టుడౌతాడు అన్నది. ఉత్తముడు పుట్టేడన్నదాని అంతరార్థం.

సాధకులు జాగ్రత్తగా గమనిస్తే ఈ విషయం కొందఱనుభవంలో యథార్థాన్ని నిరూపణ చేసికోగల్గుతారు. వ్యాసమహర్షి సాధనలో భ్రష్టస్థితిని కూడ ప్రదర్శించి సాధకులు ఎట్లు కనుగలిగి ఉండాలో హెచ్చరిక చేస్తూంటాడని ఈ ఉత్తమ జన్మ ప్రకరణాన్ని బట్టి అర్థం చేసుకోవాలి.

"ఒకప్పుడు ఉత్తానపాదుడు సురుచి ఇంట్లో ఉత్తముని తనతొడ మీద నిడుకొని ముద్దులాడుతూండగా మొదటి భార్యకొడుకు ధ్రువుడువచ్చి ఆ తొడపై తానెక్కబోతాడు. కాని ఉత్తానపాదుడు ఆదరించలేదు, అంటే ఈ విధంగా సాధన దిగజారిన స్థితిలో మాయాజ్ఞానంలో భోగలంపటతో మునిగి తేలుతూన్నప్పుడు సాధకునకు హఠాత్తుగా పూర్వపు నీతి నిజాయతీ ప్రవర్తన గుర్తుకు రావడం, దానివల్ల పూర్వం కల్గిన భగవత్సంబంధమైన ధ్రువజ్ఞానం మెఱుపు మెరసినట్లు అతనిలో తోచడం జరుగుతుంది. కాని దానిని సుఖభోగలంపటతా ప్రాబల్యంవల్ల ఆదరించడం జరగదు అన్న సాధనావిఘ్నాన్ని తెల్పే రహస్యం పై కథలో మనకు అంతరార్థ పరంగా ద్యోతక మౌతూంది. ఇది సాధకునకు కలిగే అయోమయ మానసిక స్థితిగా భావించాలి. సుఖ లంపటత ఎంత ఉన్నా, పూర్వ సాధనా ప్రాబల్యం వల్ల భగవద్విజ్ఞానం పూర్తిగా నశించక ఒకప్పుడు సాధకునికి హఠాత్తుగా గుర్తుకువచ్చి సాధన తిరిగి పునరుద్ధరింపబడి అనుకూల స్థితిలోకి మలుపు తిరగడానికి ప్రారంభం జరుగుతుంది. అదే పై కథలో మనకు అంతరార్థపరంగా చెప్పబడుతూంది.

శ్లో॥ తథాచివేర్ష్య మాణంతం
సపత్న్యాస్త నయంధ్రువం
సురుచిః శృణ్వతో రాజ్ఞః

సేర్ష్య మాహాతి గర్వితా
న, వత్స! నృపతే ర్ధిష్ణ్యం
భవానారోఢు మర్హసి

హిత్వామిషంతం పితరం
సన్న వాచంజగా మమాతుః
ప్రిరుదన్ సకాశం

నాన్యంతతః పద్మ పలాశలోచనాత్
దుః ఖచ్ఛిదంతే మృగయామ కంచన
యోమృగ్యతే హస్త గృహీత పద్మయా
శ్రీ యేతరైరంగ! విమృగ్య మాణయా

అర్థం:– ఆ విధంగా ఉత్తానపాదుని తొడ ఎక్కబోతూన్న సవతి బిడ్డను ఈర్ష్యతో చూచి సురుచి ఉత్తానపాదుడు వింటూండగానే 'నీవు నీతండ్రి తొడ మీద ఎక్కడానికి తగవు' అని కసరి పలికింది. చూస్తూ ఊరుకోవడం వల్ల తండ్రిని విడిచి ఏడుస్తూ ధ్రువుడు తల్లి వద్దకు వెళ్ళేడు. అప్పుడు సునీతి "పరమాత్ముడు తప్ప ఈ దుఃఖాన్ని పోగొట్టేవారు లేరు. లక్ష్మీదేవి, ఇతరులూ కూడా ఆ పరమాత్మను నిరంతరం వెతుకుతూనే ఉంటారు. ఆతనిని నీవుకూడ వెదకి ఆశ్రయించు నాయనా!" అని ధ్రువుని ప్రబోధించింది.

సుఖలంపటతో తమోగుణావరణంలో సతమత మగుతూన్న సాధకునికి తిరిగి అతనిలోనే దాగివున్న పరమాత్మకు సంబంధించిన ధ్రువజ్ఞానం ఆకస్మికంగా మెఱుపు వెలిగినట్లుగా తోస్తుంది అన్నదే ఉత్తానపాదుని తొడ ఎక్కడానికి ధ్రువుడు వచ్చే దన్నదాని అంతరార్థం. సురుచి సవతి కొడుకైన ధ్రువుణ్ణి నివారించిందంటే సాధకుని తమోగుణ సంబంధమైన సుఖభోగలాలసత అనేది సాధకునిలోనే ఉన్న ఆ పరాశక్తికి సంబంధించిన మాయామనోవృత్తి సాధకునిలో ఉన్న పరాశక్తికి సంబంధించిన

ఆకస్మిక భగవద్విజ్ఞానాన్ని సాధకుని నుండి దూరం చేయడానికి చేసే ప్రయత్నంగా సురుచి ధ్రువుణ్ణి అడ్డగించిందన్న దానికి అంతరార్ధపరంగా భావించుకోవాలి. ధ్రువుడు తండ్రి ఏమీ మాట్లాడక చూస్తూండగా ఏడుస్తూ సునీతి వద్దకు వెళ్ళేడు. అంటే సాధకుడు తనలోని అపరాశక్తికి లొంగిపోయి కాదనలేక తూష్ణీం స్థితిలో నున్నాడనీ అప్పుడు భగవత్ సంబంధమైన ధ్రువజ్ఞానం తన పుట్టుకకు స్థానమై సాధకునకు ముక్తిని చేకూర్చే సాధకునిలోని సునీతి వృత్తిని పొందింది అని సునీతి వద్దకు ధ్రువుడు వెళ్ళేడన్న దాని అంతరార్ధం తూష్ణీం స్థితి ముక్తి సాధకులలో అనుభవించే సాధనా క్రమానికి చేరిన ఒకానొక మానసిక స్థితి. అటు పరాశక్తిని, ఇటు అపరాశక్తిని కూడ కాదనలేని ఒక మధ్య స్థితికి చెందిన దానినే తూష్ణీంశత అని అంటారు. మంచి చెడ్డల రెంటిని కాదనలేని ఒక చేతగాని తనంతోకూడిన మౌనస్థితి ఇది.

మంచి యందే మనస్సు మొగ్గియున్నా, చెడ్డను కాదని ఎదిరింపలేక ఏమీ చేయలేని చేతకాని ప్రాలుమాలిక తనం పొందడంగా దీన్ని భావించాలి. ఈ తుష్ణీం స్థితిలో నిజానికి పరాశక్తి వైపే సాధకుడు పైకి మొగ్గు తాడేకాని ఆ పరాశక్తిని మాత్రం తననుండి వదల్చుకోలేడు. ఇదొక ముక్తిమార్గం లోనిదే అయిన అనిశ్చిత విఘ్నస్థితిగా భావించాలి. ఇదొకరీతి తపోవిఘ్నమేయైనా, ఈ విఘ్నం చిరకాలం ఉండదు.

తర్వాత సునీతి ధ్రువుణ్ణి 'ఈ దుఃఖస్థితిని పోగొట్టుకోవాలంటే నీవు పరమాత్మను కోరుకోవాలంటుంది. అంటే' ముక్తి కాంక్షతో సాధకునిలో ధ్రువజ్ఞానం నశించకుండా ఉండి ముక్తి స్థితిని పొందాలంటే ఆతని ఆత్మలోనున్న ఆనందరూప పరమాత్మను సాక్షాత్కరించుకోవాలని చేసే నీతిమార్గ ప్రబోధంగా దీన్ని భావించాలి. ఆనందరూప పరమాత్మను ఆతనికి నిత్యానపాయినియైన లక్ష్మీదేవి ఇతరులు కూడ ఎప్పుడూ వెతుక్కుంటూనే ఉంటారని పరమాత్మ యొక్క లక్షణం కూడ ధ్రువునకు సునీతి చెప్పింది. లక్ష్మి అంటే ప్రకృతి అది పరమాత్మలో కూడియే యున్నప్పటికిని అది బ్రహ్మానంద సాక్షాత్కారం పొందాలంటే దాని కోసం జీవునిద్వారా ఎంతో ప్రయత్నంతో అన్వేషణతో వెతుక్కుంటూ ఉంటేనే కాని లభ్యం కాదనీ, ఎంతగా సాధనలో బలం సంపాదించినవారైనా వారెని కర్మవాసనాగుణాలు ఆవరించుకొన్నంత కాలం బ్రహ్మానంద సాక్షాత్కారానికి అన్వేషణ నిత్యం చేస్తూనే ఉండాలనీ సునీతి ఉపదేశంలోని అంతరార్ధం.

కథ:- ధ్రువుడు పరమాత్మను వేడుకోవడానికి అరణ్యానికి వెడతాడు. దారిలో నారదుడు ఎదురుపడి 'ఓం నమోభగవతే వాసుదేవాయ' అనే ద్వాదశాక్షరీ

మంత్రాన్ని అర్ధయుక్తంగా ఉపదేశం చేస్తాడు. ధ్రువుడు మంత్ర జపంలో ఉంటాడు. దేవతలు విష్ణువును తమకు ఊపిరాడడం లేదని మొఱపెట్టుకుంటారు విష్ణువు ధ్రువునకు సాక్షాత్కరిస్తాడు.

ఉత్తానపాదుని కుమారుడు ధ్రువుడు అరణ్యానికి వెళ్ళేడు అంటే ఉన్నత స్థానమైన ముక్తిమార్గాన్ని పయనిస్తున్న సాధకునిలోని నిశ్చయాత్మకమైన బుద్ధి మేల్కొని వాసనలకు ప్రశాంత స్థితిని సాధించడానికై యత్నం చేసింది అని అర్థం. 'అరణ్యం' – రణ్యం అంటే ధ్వనింపదగ్గది. అంటే అంతర్గత వాసనా ధ్వనుల సంక్షోభస్థితి అన్నమాట. న+రణ్యం=అరణ్యం =ధ్వనించనిస్థితి అనగా అంతర్గతంగా కలే వాసనల సంక్షుబ్ధస్థితి లేకపోవుట అన్నమాట. అంటే వాసనా శూన్యమైన అత్యంత మానసిక ప్రశాంతస్థితి అని అరణ్య పదానికి అర్థం. ముక్తిమార్గ సాధకుడు మధ్యలో మాయా ప్రాబల్యానికి లొంగి సుఖలాలసుడై తమోగుణాన్ని పెంచుకొని కూడ మొట్టమొదటి నీతి మార్గంలో కల్గిన ధ్రువబుద్ధి యొక్క ప్రబోధం పొంది ఎప్పుడూ ఇక మాయా ప్రాబల్యానికి వశపడని విధంగా అంతర్గత వాసనా సంక్షుబ్ధస్థితిని ప్రశాంతపఱచడానికి సాధకుడు తీవ్రప్రయత్నంతో తల పడ్డాడనే సాధనాపరమైన అంతరార్థం ధ్రువుని అరణ్యగమనానికి అర్థంగా చెప్పుకోవాలి.

నారదుడెదురై ధ్రువునకు ద్వాదశాక్షరీ మంత్రోపదేశం చేశాడు. నారదుడనగా, నార=జ్ఞానాన్ని, ద=ఇచ్చేవాడు అన్న అర్థంలో జ్ఞానోపదేష్టయైన గురువని అంతరార్థంగా చెప్పుకోవాలి. భగవంతుడే ప్రత్యక్షంగా కరచరణాది విశిష్టుడై గురురూపంతో శిష్యుని వెతుక్కుంటూ వస్తాడు. కాని శిష్యుడు గురువుగా వెతుక్కోనక్కరలేదు.

గురు శబ్దానికి అజ్ఞానం నాశనం చేసేది అనేది ఉత్పత్త్యర్థం కాన అజ్ఞానం నుండి మరలించేందుకు గోచరించే దేదైనా గురువే కావచ్చు. గ్రంథ పఠనం కాని, చూచిన, విన్న సంఘటనగాని గురువు కావచ్చు. ఈ భాగవత గ్రంథంలోనే భిక్షు గీతలో అవధూతయైన భిక్షువు తనకు అజ్ఞాన నాశనానికి తోడ్పడ్డానికి కొన్ని పక్షులు మృగాలు కొన్ని సంఘటనలు గురువులైనట్లు చెప్పబడివుంది. కాన గురువు మనుష్య రూపమే కానక్కర్లేదు. ద్వాదశాక్షరీ మంత్రం నారదుడు ధ్రువునకు ఉపదేశించాడు. 'ద్వాదశాక్షరీ' అంటే పన్నెండు అక్షరాలుగల మంత్రం 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అనేది పన్నెండక్షరాల మంత్రం. మంత్రం అంటే ఆలోచనము అని అర్థం. 'వాసు దేవాయ' అంటే అంతటను వ్యాపించియున్న ప్రకాశరూప పరమాత్మ కొఱకు అని అర్థం. అదే భగవంతుడు అనగా షడ్గుణైశ్వర్య సంపన్నుడు. అతడు

ఓంకారము ముందుగా కలవాడు. ఓం అంటే అ+ఉ+మ్='ఓమ్' అవుతుంది. 'అ' అంటే ప్రత్యక్షంగా మనకు కన్పించే విశ్వస్థితి (ప్రపంచం) అదే స్థూలదేహం 'ఉ' అంటే స్వాప్నిక జగత్తు దీనినే తైజస స్థితి అంటారు. అదే సూక్ష్మదేహం 'మ్' అంటే ప్రాజ్ఞతస్థితి అదే కారణ దేహం. తైజసమైన స్వాప్నిక స్థితికి కారణమైన మూలమైన దేహస్థితి అన్న మాట. మొదటిది విశ్వస్థితి స్థూల దేహానికి సంబంధించినది, రెండవ తైజసస్థితి సూక్ష్మదేహానికి సంబంధించినది. మూడవ ప్రాజ్ఞ స్థితి కారణ దేహానికి సంబంధించినది. కాన ఈ మూడు స్థితులను ఒకదానిలో మరొక దానిని విలీనం చెయ్యాలి. ఆ విధంగా సాధకుడు మూడింటిని విలీనం చేసి చివరి కారణ దేహాన్ని పరబ్రహ్మస్థితిలో ప్రవేశ పెట్టాలి. ఇది ఓంకార జప సాధన. ఈ 'ఓం', భగవంతుడైన అనగా షడ్గుణైశ్వర్య సంపన్నమైన ఆనందరూప పరమాత్మను సాక్షాత్కరింప జేస్తుంది. అని, ఈ 'ఓంనమో భగవతే వాసుదేవాయ' అన్న మంత్రానికి అర్థం. సాధకుడు స్థూల శరీరాన్ని సూక్ష్మ శరీరంలో విలీనం చేసి ఆ సూక్ష్మ శరీరాన్ని కారణ శరీరంలో విలీనం చేసి ఆ కారణ శరీరాన్ని పరబ్రహ్మలో అనగా తురీయ స్థితిలో (నాల్గవ స్థితిలో) ఏకం చెయ్యాలి. అట్లు చేసి తానే షడ్గుణైశ్వర్య సంపన్నుడగు పరమాత్మగా భావించాలి. అప్పుడు పరమాత్మ సాక్షాత్కారం జరుగుతుంది. ఈ విధంగా ధ్రువాత్మకమైన బుద్ధియే, తాను తనలోని జ్ఞాన శక్తితో ఆలోచించి తెలిసికొనడాన్ని జరిగించింది అన్నదే నారదుడు ధ్రువునకు ఓంకార సహితంగా వాసుదేవ మంత్రోపదేశం చేశాడన్న దాని అర్థం. ప్రశాంత స్థితి యొక్క సాధనలో సాధకుని బుద్ధి ఓంకార జపంతో వాసుదేవ మంత్రంలోని అర్థ ధ్యానంతో నిమగ్నమై యుండాలనే సాధనను ఇచ్చట అంతరార్థ పరంగా తెల్సుకోవాలి.

కథ:- తర్వాత ధ్రువుని తీవ్ర తపస్సుతో దేవతలకు ఊపిరి ఆడలేదు. వాయువు స్తంభించి పోయింది. అప్పుడు దేవతలు విష్ణువునకు మొఱ పెట్టుకొనగా విష్ణువు ధ్రువునకు సాక్షాత్కరించేడు. ఆ ధ్రువు డాతనిని ఏ వరాలు కోరనేలేదు. ఆ కోరిక విస్మృతమై పోయింది అని అర్థం.

దేవతలు అంటే - 'దివ్' అనే ధాతువునకు ప్రకాశం అని అర్థం. సాధకునిలో ప్రకాశించే సాత్త్వికవృత్తులు అవి బుద్ధిచేత నడిపింపబడేవి. ఇప్పుడు పరమాత్మ వశుడై యుండిన ధ్రువునకు బుద్ధి నిశ్చలత కల్గి స్తబ్ధత కల్గింది. సాధకునకు భగవత్సాక్షాత్కారం సిద్ధించే ముందు ధ్యాన సమాధిలో వాయు నిరోధం కల్గుతుంది. అప్పుడు మనోవృత్తులకు చలనం ఉండదు అవి భగవత్పరమై యుంటాయి. అదే దేవతలకు

ఊపిరాడలేదన్న దాని అర్థం. విష్ణువు అంటే సర్వ వ్యాపక పరమాత్మ దేవతల ప్రార్థనలో అతడు ధ్రువుని చేరుకొన్నాడు. సాధనలో సాధకునిలోని మనోవృత్తులు నిశ్చల స్థితికి వచ్చినప్పుడే సాధకునిలోనే వున్న పరమాత్మ సాధకుని బుద్ధికి గోచరిస్తుంది. అదే సాత్త్విక వృత్తుల మొరను ఆలించి విష్ణువు ధ్రువునకు సాక్షాత్కరించాడనే దానికి అంతరార్థం. విష్ణువు దేవతలు అంటే సాధకునిలోని ఆనందరూప పరమాత్మకూ, ఆ పరమాత్మను ప్రకాశింపజేసే సత్త్వవృత్తులకూ సంకేత నామములే కాని ఎక్కడో వేఱుగా స్వర్గాది లోకాల్లో ఉన్నవారు మాత్రం కారు. ఈ సంగతి ఉపనిషత్తులన్నీ ఏక కంఠంగా చెప్తూన్నదే.

విష్ణు సాక్షాత్కారంతో ధ్రువునకు తాను కోరవలసిన కోర్కెలను విడిచివేశాడు. అంటే, ఆనందరూప పరమాత్మ సాక్షాత్కారంలో నిస్సంకల్ప స్థితి కల్గుతుంది. నిజానికి ఆ నిస్సంకల్ప స్థితిలోనే ఆనంద సాక్షాత్కారం జరుగుతుంది. నిస్సంకల్ప స్థితి ఆనంద స్థితి ఒకదాని కొకటి పరస్పర సాధనాలుగా వుంటాయి. సంకల్పమే శూన్యమైనపుడు కోర్కెల ప్రస్తావనయే లేదు గదా! అదే ధ్రువునకు తాను తపస్సు చేయుటకు ముందు తనలోగల కోరిక విస్మృతమై పోయిందన్న దానికి అర్థం.

కథ:- తర్వాత విష్ణువు ధ్రువునకు ఇరవై ఆరు వేల సంవత్సరాలు రాజ్యం పాలించిన తర్వాత ధ్రువమండలాన్ని చేరుకొంటావని వరమిచ్చి అదృశ్యుడైనాడు.

26 వేల సంవత్సరాలు అంటే ఇంద్రియాలు, 10 పంచభూత ప్రకృతులు, 5 అంతఃకరణ చతుష్టయం, 4 జీవుడు, 1 పరమాత్మ అని మొత్తం ఇరువై ఆరు తత్త్వాలు. ఈ ఇరువై ఆరు తత్త్వాల అనుభవాన్ని పొంది 'అహం బ్రహ్మాస్మి' అను ఆరోహణా క్రమాన్ని సాధించి దాన్ని విడిచి సాధకుడు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే పూర్ణ యోగంలోని అవరోహణా క్రమాన్ని పొందించడానికి ఈ 26 తత్త్వాలలో బ్రహ్మ తత్త్వాన్ని నిలబెట్టాలి. తర్వాత మోక్షం పొందుతాడు. ధ్రువ మండలం అంటే శాశ్వతమై జననమరణ రాహిత్యమైన కైవల్యం అని అర్థం - ముందుగా సాధకుడు ప్రశాంతి సాధనలో ఆత్మసాక్షాత్కారం సాధించడం 'అహం బ్రహ్మాస్మి' అనే ఆరోహణా మార్గ ఫలితమనీ, 26 తత్త్వాల అనుభవంలో ధ్రువస్థితి పొందడం 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే అవరోహణా మార్గ ఫలితం అనీ, ఈ రెండు మార్గాల తోను కైవల్యం లభిస్తుందని అంతరార్థ రహస్యం తెలిసికోవాలి.

కథ:- తర్వాత ధ్రువుడు ఇంటికి వస్తాడు. అప్పటికీ అతని సవతి తమ్ముడు ఉత్తముడు వేటకు వెళ్ళి యక్షులచే చంపబడి పోతాడు. సురుచి అతనిని వెతకడానికి వెళ్ళి

దారిలో దావా నలానికి గురియై కాలిపోతుంది. అంటే ధ్రువ మనస్థితి ఆనంద రూప పరమాత్మను సాధించడంలో సాధకునిలోని తమోవృత్తి పూర్తిగా నశిస్తుందనీ, ఆ తమో వృత్తికి కారణమైన సుఖభోగ లాలసత జ్ఞాన జ్యోతిలో లీనమైపోతుందనీ, అంతరార్థం ఉత్తముడంటే గొప్ప తమో వృత్తి, యక్షులు అంటే దేవతల జాతిలోని వారు. ఉత్తముణ్ణి యక్షులు చంపేరు అంటే తమోవృత్తి సాత్విక ప్రకాశ వృత్తులలో లీనమై పోయిందన్నమాట. సురుచి అంటే భోగలాలసత, దావాన అంటే అరణ్యంలోని కార్చిచ్చు. ఇక్కడ అరణ్యం అంటే ప్రశాంతస్థితి అన్నదే అర్థం. నిశ్చయాత్మక ధ్రువబుద్ధి (ధ్రువుడు) వాసనలను ప్రశాంతస్థితిని పొందించడంలో సుఖలాలసత ఆ ప్రశాంతస్థితిలో కల్గిన జ్ఞానప్రకాశంలో విలీనమైపోయిందని అర్థం సాధకునిలో అంతర్గతమున్న తమోవృత్తియు దానికి కారణమైన సుఖభోగలాలసతా వృత్తియు నశించి పోతాయి అనే సాధనా రహస్యం ఇక్కడ అంతరార్థపరంగా చెప్పుకోవాలి.

తర్వాత ధ్రువుడు తన తమ్ముడైన ఉత్తముని చంపిన యక్షులను చంపడానికై అన్వేషిస్తాడు. అప్పుడు అతని తాతగారైన స్వాయంభువ మనువు సాక్షాత్కరించి ధ్రువునకు "చంపేవారు, చంపబడేవారు లేరు" అనే తత్త్వాన్ని ఉపదేశిస్తాడు. ధ్రువుడు ఇరువైఆరువేలేండ్లు రాజ్యంపాలించితల్లితోస్వర్గంచేరిధ్రువనక్షత్రంగామారిధ్రువమండలం చేరుతాడు. స్వాయంభువ అంటే జీవుడని పైని చెప్పుకొన్నాము. సాధకునిలోజీవతత్త్వం గోచరించడం తద్వారా కర్త కార్యకారణములనే 'త్రిపుటి' ఒక్కడే అనే తత్త్వం నశించాలని అనుభవపూర్వకంగా తెలియడం జరుగుతుందనీ, ఆపైని సాధకునకు ఇరవైఆరు తత్త్వాల మార్గాలలోను అనుభవంకోసం తిరిగి సునీతి మార్గంలో జీవిస్తాడనీ చివరకు ప్రాణోత్క్రమణంతో జననమరణశూన్యమైన కైవల్యం సాధకుడు పొందుతాడనీ కథాంశానికి అంతరార్థం గ్రహించుకోవాలి. తర్వాత ధ్రువుడు సునీతితోకూడ విమానం ఎక్కి ధ్రువపదం చేరుకొంటాడు. సునీతియే ధ్రువపదానుసంధానానికి మూలకారణం అంటే మంచి నీతి నిజాయితీ ప్రవర్తనా మార్గమే ముక్తికి మూలకారణం అన్నదే తల్లియైన సునీతితోకలిసి విమానమెక్కి వెళ్ళేరన్నదాని అంతరార్థం. ఈ ధ్రువోపాఖ్యానం నీతి నిజాయితీ ప్రవర్తన ముక్తికి ఎంతో ముఖ్యమన్న సంగతిని ధ్రువపరుస్తూంది.

ఈ కథ జరిగినది కాదనుకొనుటకు వాచ్యార్థం చెప్పినప్పుడు నమ్మడానికే వీలు పడని సంఘటనలే తార్కాణం పాత్రలపేర్లుకూడ వ్యుత్పత్త్యర్థములతో వారివారి ప్రవర్తనలకు సరిపడినట్లుండుటవల్ల కూడ ఇది జరిగినది కానే కాదనిపిస్తూంది. మొదటి

వచ్చిన స్వాయంభువు పాత్ర చివరవచ్చుట అంతరార్థపరంగా అవసరముగా కల్పింప బడినదిగా చెప్పడానికి వీలువుంది

ఐదేండ్లు నిండని ధ్రువుడు ఘోర తపస్సు చేశాడనడం నమ్మించడానికి వీలైనది కాదు. అంతరార్థంలో ఐదేండ్లు అన్నది పంచేంద్రియాలను తెల్పేది అన్నప్పుడే అది సరియైనదనిపిస్తుంది.

ముక్తి సాధకుడు ముందు నీతి మార్గంలో బ్రతుకు నేర్చుకోవాలనీ, అప్పుడాతని సంకల్పవికల్పాత్మకమైన మనస్సు, నిశ్చయాత్మక బుద్ధిగా మారడం జరుగుతుంది అనీ, ఆ మార్పు జరిగేముందు సాధకునికి చిత్త విభ్రమణం కల్గి సుఖలంపటత యందు ఆసక్తి, ఆపైని అజ్ఞాన మాయావార్యం ఆవరించడమూ జరుగవచ్చుననీ, సాధకునిలోని నిశ్చయత్మక బుద్ధి ఆసమయంలో మేల్కొని సాధకునికి తోడ్పడుతుందనీ, ఆ తర్వాత సాధకునికి గురు ప్రబోధం సిద్ధిస్తుందనీ, ఆ ప్రబోధంతో సాధకునకు భగవంతుడు అంతటనూ ఉన్నాడను ధ్యానం అలవడుతుందనీ, తర్వాత భగవత్సాక్షాత్కారం లభిస్తుందనీ, ఆపైని తనలోనున్న ఇరువైఆరు తత్త్వాలతోను జ్ఞానమార్గంలో సాధకుడు జీవిస్తాడనీ, ఆ సాధనలలో చిట్టచివరకు 'సర్వంఖల్విదం బ్రహ్మ' భావనతో ప్రాణోత్క్రమణం జరిగి సాధకుడు సచ్చిదానంద పరమాత్మలో లీనమై పోతాడనీ ఈ ధ్రువ కథలోని సాధనా సారాంశంగా మనం గుర్తించాలి.

ఈ విధంగా ధ్రువకథ ఆరోహణా అవరోహణా మార్గాల పూర్ణయోగంలోసాధకుడు కైవల్యం పొందే సాధనలు చెప్తూంది. ఈ సాధనకు మూలకందం నీతి నియతి ప్రవర్తనం అన్నది సాధకులు మఱచి పోరానిది.

## అంగపుత్రుడు వేనరాజు కథ

[మనో, బుద్ధి, చిత్తవృత్తి గుణసాధన]

ధ్రువుని వంశంలో అంగరాజు పుట్టేడు. 'సునీథ' అని అతని భార్య పేరు. ఆమెతో అంగరాజు అశ్వమేధ యజ్ఞం ప్రారంభించేడు. కాని దేవతలాయజ్ఞంలో హవిర్భాగాలందుకోడానికి రాలేదు. అంగరాజు మునులను అందుకు కారణం పృచ్ఛించేడు. వారు 'నీవు అపుత్రుకుడవు కాన దేవతలు నీ ఆహ్వానాన్ని తిరస్కరించేరని' చెప్పేరు.

తర్వాత అంగరాజు పుత్రకామేష్టి చేశాడు. పుత్రుడు పుట్టేడు. వానిపేరు వేన

రాజు. వేనరాజు చిన్నప్పటినుంచి నాస్తికుడై అందరిని బాధించడం యజ్ఞాలు నిషే ధిస్తూ సాధువుల్ని చంపడం మొదలైన పాషండ కృత్యాలకు పాల్పడ్డాడు. అంగరాజు వేనుని ప్రవర్తనను మాన్పలేక, తాను అరణ్యానికి లేచిపోయేడు.

తర్వాత వేనుడు రాజైనాడు. రాజ్యంలో యజ్ఞాది క్రతువులు నిషేధించేడు. సత్పురుషులను బాధించడం ప్రారంభించేడు. మునులు వేనునికి హితబోధ చేశారు కాని వాడు వినలేదు. అంత వారు వేనుని తమ మంత్రశక్తి చేత మృతుణ్ణిగా చేశారు. సునీధ తన యోగ శక్తిచేత తన పుత్రుడైన వేనుని మృతశరీరాన్ని నిల్వచేయించివుంచి, తాను రాజ్యపాలనం చేయబూనింది. అప్పుడు 'రాజ్యం అరాచకమైం'దని మునులు వేనుని ఊరు మథనం [తొడలు మర్దించడం] చేశారు. ఆ మథనంవల్ల నల్లని దేహంతో మరగుజ్జువాడు వికారరూపుడు పుట్టేడు. [ఊరు మథనం కారణంగా వేనునిలోని కల్మషాన్ని మునులు తొలగించి వేశారు. అనే అర్థంలో 'యేనాహ రజ్ఞాయమానోవేన కల్మషముల్బణం' అని మూలంలో వుంది.] వాడు రాజ్యానికి అనర్హుడు కావడంచేత మునులు తిరిగి వేనుని మృతదేహాన్నుండి బాహుమథనం [చేతులు మర్దించడం] చేశారు. దానివల్ల ఒక మిథునం అంటే దంపతులు పుట్టేరు. ఆ దంపతులలోని పురుషుని విష్ణువుగాను స్త్రీని లక్ష్మిగాను మునులు దేవతలు స్తుతించేరు. ఆ పురుషుని పేరు పృథువు, స్త్రీ అతని భార్య. ఆమె పేరు అర్చి.

పృథువు పరిపాలనకు రాగానే భూమి గోరూపాన్ని ధరించి పారి పోజొచ్చింది. అప్పుడు భూమి గొడ్డుపోయి సస్య శూన్యమయింది. పృథుచక్రవర్తి ఆ పారిపోతూన్న గోవును నిలువరించి అభయమిచ్చి దానినుండి ఓషధులు పితికి భూమిని తిరిగి సస్య శ్యామలం చేసి పాలించేడు. తరువాత పృథువు పాలనలో భూమి సకల సస్యభరితం కావడం, సముద్రాలు రత్నాకరాలు కావడం, పంచభూతాలు సకల జనులకు సౌఖ్యకరంగా సంచరించడం చూచి ఇంద్రుడు సహించలేక పొయ్యేడు. పృథుచక్రవర్తికి ఆ ప్రకృతి తలపెట్టి అతడు చేసే అశ్వమేధయాగంలో యజ్ఞాశ్వాన్ని మాయరూపంతో అపహరించేడు. అత్రిమహర్షి ఆ విషయాన్ని తెల్పగా పృథుపుత్రుడు అశ్వాన్ని తిరిగి తెచ్చేడు. రెండవసారి తిరిగి ఇంద్రుడు తమోరూపంతో అశ్వాన్ని హరించేడు. తిరిగి పృథుపుత్రుడు అత్రివల్ల ఆ విషయం తెలిసి అశ్వాన్ని తెచ్చేడు. మూడవసారి ఇంద్రుడు యజ్ఞంలో యజ్ఞవినాశం చెయ్యడానికి పాషండులగు నాస్తికులను ప్రవేశ పెట్టేడు. పృథువు స్వయంగా ఇంద్రుణ్ణి చంపాలని బయలుదేరాడు. అప్పుడు బ్రహ్మ దేవుడు పృథువునకు ప్రత్యక్షమైనాడు. ఆ పిమ్మట విష్ణువు ప్రత్యక్షమైనాడు. ఇంద్రుడు

పృధు చక్రవర్తిని క్షమాభిక్షవేడుకొన్నాడు. పృధువును విష్ణువు వరములిస్తాను కోరు కొమ్మనగా లక్ష్మిపతె విడవకుండ నిన్నెప్పుడు కొల్చుచుండునట్లున్ను, నిరంతరం నీ కధలు వినుచుండునట్లును వరం కోరేడు. తర్వాత విష్ణువుపదేశించిన ధర్మాలతో ప్రజాపాలనం చేసి ముక్తినొందేడు. ఈ పృధుచక్రవర్తి ధ్రువుని వలెనే భగవంతుని ఏకవింశత్యవతారాలలో నొక్కడుగా గణింపబడ్డాడు.

ఈ కధ జరిగిన చరిత్రాంశానికి సరిపడేటిగా హేతువాద దృష్ట్యా కన్పించదు. ముఖ్యంగా చంపివేసిన వేనుని మృతశరీరంలోని ఊరుభాగంను [తొడలను] రాపాడించడ మేమిటి ? తద్వారా నిషాదులు పుట్టడ మేమిటి ? అల్లాగే బాహువుల్ని రాపాడిస్తే పృధు చక్రవర్తి పుట్టుకొని రావడమేమిటి? ఇటువంటి విషయాల్ని నమ్మమంటే ఎవరు నమ్ము తారు. పృధువు భగవదవతారం అతని జనన వృత్తాంతం ఇలా ఉందేమిటి? ఈ అంగ, వేన, పృధు చరిత్రల్లో ఏదో అంతరార్థాన్ని వ్యాసమహర్షి ప్రవేశ పెట్టివుండాలి. లేక పోతే అపనమ్మకానికి తావిచ్చేవిధంగా భగవంతుని గూర్చి చెప్పే భాగవతంలో వ్రాయ డం జరగదు. ప్రతి కధయందలి అంతరార్థం కూడ జీవుడు వాసనావిముక్తుడై భగ వంతునిలో లీనం కావడానికి చేసే సాధనా క్రమాన్నే వివరిస్తూంది. అందుకే అవి భగవంతుని చేర్చేక్రమాన్ని చెప్పే వైభాగవతంలో చోటుచేసికోవడం జరిగింది. పైకి కధలాగ వుంచేనే కాని సాధనాక్రమం జ్ఞాపకకోశంలో [Memorry] నిలబడదు. కధల్లో ఎంత అసందర్భాలు, అసంగతాలు, అశ్లీలాలు చెప్పే ఘట్టాలు ఇమిడిస్తే అంతదృఢంగా అవి జ్ఞాపక కోశంలో [Memorry] తిష్ఠవేస్తాయి. ఈ విధంగా ముక్తినికోరే ప్రజలనుగ్రహించె దృష్టితో వ్యాస వాల్మీకులు కధారూపంలో అధ్యా త్మిక విజ్ఞానాన్ని మనకు భారత భాగవత రామాయణాలుగా ప్రసాదించేరు. ఇక కధ విప్పి అంతరార్థం చెప్తాను.

"ధ్రువుని వంశంలో వాడు అంగరాజు" ధ్రువుడు ఏవిధంగా భగవదైక్యం సాధించేడో అదే విధంగా భగవదైక్యం సాధించేడో అదే విధంగా భగవదైక్యం సాధించి ధ్రువుని వలెనే భగవంతుని ఏకవింశతి [21] అవతారాల్లోను చేర్చి చెప్పబడ్డాడు. 'అంగరాజు' అంటే అంగ=శరీరంచేత, రాజు= ప్రకాశించినవాడు. అంటే శరీరం పొందిన జీవుడు అని అర్థం. వాసనలచే ఆవరింపబడ్డ పరమాత్మయే జీవాత్మ. కర్మ వాసనలచేత జీవుడు శరీరంలో ప్రకాశిస్తాడు. ఏ శరీరంలో ప్రవేశించినా జీవుడు తన కర్మవాసనలను క్రమంగా తొలగించుకొని పరమాత్మను చేరుకోవడానికి ప్రయత్నం జరుపుతూనే వుంటాడు. పరిణామవాదంకూడా ఈ విషయాన్ని ధృవపరుస్తూంది.

అంగరాజుయొక్క భార్య సునీధ-సునీత యనేదే సునీధగా పేర్కొనడం జరిగింది. సు=చక్కగా, నీత=పొందింపబడింది అని అర్ధం. అంటే చక్కగా జీవునిలో పొందింపబడిన సంస్కార విశేషమే సునీత అన్నమాట. పరమాత్మను చేరాలనే తపన గల జీవుడు తన సాత్త్విక కర్మలచే భగవంతుని గ్గూరిన చక్కని సంస్కారం పొందినాడన్నది దాని అర్ధం. అంగరాజుకు భార్య అంటే, జీవునిలో ముక్తిని కోరే చక్కని చిత్త సంస్కారము. ఆతనిచేత భరింపనగినదిగా [భార్యగా] ఉంటూంది అని అంతరార్థపరంగా ఇక్కడ అర్ధం చెప్పుకోవాలి.

అంగరాజు సునీతతోకూడి యజ్ఞాలలో గొప్పదైన అశ్వమేధ యజ్ఞం చేస్తున్నాడు. న+శ్వ=రేపు ఉండనిది. అంటే నిత్యమూ మార్పుచెందేది అనేది 'అశ్వం' అన్న పదానికి అర్ధం అవుతుంది. అంటే అది ప్రకృతి అనే అర్ధాన్నిస్తుంది దానిని నాశనంచేసే బుద్ధియొక్క వ్యాపారం అశ్వమేధం అవుతుంది. ఈ విధమైన వ్యుత్పత్త్యర్థంలో భగవాన్ అరవిందమహర్షి 'వేదనిగూఢ రహస్యం' అనే గ్రంధంలో తెల్పియున్నారు. ఈ విధంగా జీవుడు ఉత్తమ సంస్కారి కావడం వల్లనే ప్రకృతిని పరిహరించి ముక్తిపొందే యత్నం చేస్తున్నాడన్నది, అంగరాజు సునీధతో అశ్వమేధం చేస్తున్నాడన్న దాని అంతరార్థం.

ఏది, ఏది అనే అన్వేషణతో భగవత్తత్త్వాన్ని తెలిసికొనే సాధనకు యజ్ఞం అనే పేరు అర్ధయుక్తంగా ఉంటుంది. యత్+జ్ఞ=యజ్ఞం అవుతుంది. యత్=ఏదో, అనగా పరమాత్మ స్వరూపం ఏదో, జ్ఞం=తెలిసికొనేది అనగా భగవంతుని తెలిసికోవడమనేది యజ్ఞానికి వ్యుత్పత్త్యర్ధం. భగవంతుని తెలిసికొనే విధానాలలో అశ్వమేధం అన్నిటికన్న గొప్పది. అనగా ప్రకృతిని తనలో నాశం అనగా లీనం చేసికోవడమనే సాధన చాల గొప్పది అని భావం. ఈ అశ్వమేధ సాధనలు నూరు అనగా అనేకసార్లు చేస్తే పరమాత్మయే తానౌతాడు [ఇంద్రుడౌతాడు] అంగరాజు చేసే యజ్ఞంలో దేవతలు హవిస్సుగా అందుకోవడానికి రాలేదు. దేవతలు అంటే మనలో ప్రకాశించే సాత్త్విక వృత్తులు అని ఆధ్యాత్మికార్థం వుంది. దివ్ అనే ధాతువునకు 'ప్రకాశం' అర్ధం కాన సాధకునిలో ప్రకాశాన్ని ఇచ్చేవి అగుటచే సాత్త్విక వృత్తుల్ని దేవతలని పేర్కొనడం జరిగింది. సాధకుడు చేసే ప్రకృతి వశీకార సాధనాభ్యాసంలో ఆతనిలోని సాత్త్విక ప్రవృత్తులు ఆతని పనికి సహకరించలేవని దేవతలు యజ్ఞంలో ఆహూతులందు కోవడానికి రాలేదన్నదానికి అంతరార్ధం. అప్పుడు అంగరాజు అందుకు కారణం మునులను ప్రశ్నించేడు. మునులంటే సాధకునిలో నున్న మౌనవృత్తులు. కాన

సాధకుడు మౌనంతో బుద్ధిని కేంద్రీకరించి ఆలోచనా వృత్తులను ప్రసరింపజేసేడు అని దాని అర్థం.

అప్పుడు మునులు 'నీవు అపుత్త్రిక దోషదూషితుడ'వగుటచే దేవతలు నీ ఆహుతులనందుకోలేదని చెప్పేరు. అపుత్త్రికుడు అంటే ఇక్కడ పిల్లలు లేనివారు అని కాదు అర్థం. పుత్+త్ర=పుత్త్రి. 'పుత్' అంటే నరకం, 'త్ర' అంటే రక్షించడం అర్థం. నరకాన్నుండి రక్షించడం అంటే తామసిక మనోవృత్తులు నరకాన్నిస్తాయి కనుక ఆ పాప మనోవృత్తులనుంచి రక్షింపబడాలి అంటే తామసిక ప్రవృత్తి అడ్డు రాకుండా సాధకుడు దానిని అణచి ఉంచుకోవాలి అని అర్థం. ఇక్కడ సాధకుని మనస్సు ఎంత సాత్త్వికవృత్తితో భగవత్సంస్కారం కలదియైనా వాసనాబలం చేత సాధకుని మనస్సులో ఐహికములైన తామసిక వృత్తులుకూడ బలంగానే వుండియే ఉన్నాయి. ఆ తామసిక వృత్తులు తమ్ము నశింపుచేస్తాయనే కారణంచేత సాత్త్విక మనో వృత్తులు పైకి రాలేదు అదే దేవతలు ఆహుతులందుకోలేదన్న దాని అంతరార్థం. ఆ సంగతి సాధకుడు మౌనధ్యానం వల్ల తెలిసికొన్నాడన్నదే మునులు చెప్పేరన్న దానికి అర్థంగా గ్రహించాలి.

అప్పుడు అంగరాజు పుత్త్రికామేష్టి చేశాడు. అంటే సాధనలతో తామసిక ప్రవృత్తులు పోవడానికి యత్నం జరిపించేడని అర్థం. అప్పుడు అతనికి వేనరాజు పుట్టేడు. వా+ఈ+ఇన=వేన అని విడదీయాలి ముందు; ఈ+ఇన='ఈన' రూపంచేసి, ఆ తర్వాత వా+ఈన=వేన అని రూపనిష్పత్తి జరిపించవచ్చు. 'వా' అంటే వికల్పం అని అర్థం. వికల్పం అంటే ఒకసారి వుండి ఇంకోసారి వుండక పోవడం అనగా ద్వైధీభావం అని అర్థం. ఒకసారి ఒక విధంగా వుండి మరొకసారి ఆ విధంగా వుండనిది మనస్సు కనుకనే 'వికల్పాత్మకం మనః' అని చెప్పబడివుంది. మనస్సులో ఒకరకం సంకల్పాలు పుట్టి అంతలోనే అవి నాశం అవుతూంటాయి కాన 'వా' అనగా సంకల్ప వికల్ప రూపమైన మనస్సు అని అంతరార్థపరంగా చెప్పాలి. 'ఈ'=అంటే కోరిక, అంటే మనస్సులోని వృత్తి 'ఈ' అవుతుంది. 'ఇన' అంటే రాజు, అనగా పాలించేవాడు అని అర్థం. ఇప్పుడు 'వేన' అంటే సంకల్పవికల్పాత్మకమైన కోరికలను పాలించే మనస్సు అని అంతరార్థపరంగా చెప్పాలి. అంగరాజు పుత్త్రికామేష్టి చేస్తే వేనుడు పుట్టేడంటే' జీవుడు నరకాన్నుంచి తప్పించుకోవాలనే ప్రయత్నంలో సాధనకు మనస్సు వల్ల తనలో జరిగే వైకల్పికపు సంగతిని గుర్తించేడు అనేది అంతరార్థం.

వేనుడు నాస్తికుడై చాలా దుర్మార్గుడై అందరిని బాధిస్తూంటే అంగరాజు బెంగతో అరణ్యాలు పట్టి పోయెను. అంటే మనస్సు అనేక వికల్పాలతో సాత్త్విక వృత్తులను బాధిస్తూంటే జీవుడు భరించలేక ప్రశాంత చిత్తంకోసం అభ్యాసం సాగింప చేసేదని అర్థం. న + రణ్యం=అరణ్యం, రణ్యం అంటే ధ్వనింపదగ్గది. అరణ్యం అంటే ధ్వనింపనిది అంటే చిత్త ప్రశాంతత్వం అనే అర్థం వస్తుంది. అరణ్యానికి వెళ్ళేరంటే ప్రశాంతత సాధించడానికి పూనుకొన్నారన్నది అంతరార్థంగా గ్రహించాలి.

ఆ తర్వాత వేనుణ్ణి మునులు చంపేశారు. అంటే జీవుడు చిత్త ప్రశాంతతకు అభ్యాసం చేయడంవల్ల సాధకునిలో సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు అణచివేయ బడింది అనే అంతరార్థం గ్రహించాలి. సునీథ ఆ వేన మృత శరీరాన్ని యోగశక్తి చేత నిల్వ వుంచి తాను రాజ్యం చేసింది అంటే సాధకునిలోని సంస్కారంవల్ల పైకి నశించినట్లు కన్పడియున్నా సంకల్ప వికల్పాత్మకమైన ఆ మనస్సు జీవునిలో అణచ బడి దాగియే యుండి అది జీవిస్తుంది అని అర్థం. ఇంకా సాధకునిలో ఐహిక మనో వృత్తి చోటుచేసికొనియే యుంటుందని భావం.

అప్పుడు మునులు వేనుని మృత శరీరంలోని ఊరువులను మథించేరు. అప్పుడు నల్లని పొట్టి వికారరూపంగల నిషాదుడు జన్మించేడు. ఊరు అన్నదానికి తొడ అని అర్థం. ఇక్కడ తొడలను మర్దించేరు అని బాహ్యార్థం. 'ఊరు' అంటే భగవంతుడని అర్థం. 'ఉరుక్రము'డని భగవంతునకు విష్ణుసహస్ర నామాల్లో పేరు వుంది. 'ఉరు' అనే భగవత్పరమైన పదానికి 'ఊరు' అని ప్రత్యక్షీకరణం చేయబడింది. అంటే సాధకునిలోని మౌన సాధనాభ్యాసంతో భగవద్ధర్మాన్ని వెలుపరచడం జరిగింది అన్న మాట. మథనం అంటే ప్రబల ఆలోచన. దానివల్ల నల్లనివాడు అంటే సాధకునిలో తమోగుణం బైటకు వచ్చింది అని అంతరార్థం చెప్పాలి. ఊరు మథనం అంటే తొడను మర్దించుట అని వాచ్యార్థం. అంతరార్థంలో 'ఉరుమథనం' అని చెప్పుకోవాలి. ఉరు అంటే గొప్పవాడైన పరమాత్మ అనికూడ అర్థం చెప్పవచ్చు. ఊరు మథనం అంటే పరమాత్మను గూర్చిన ప్రబలమైన ఆలోచనలు చేయడం అని అంతరార్థ పర మైన అర్థం చెప్పాలి. ఈ విధంగా ఉచ్చారణ సామ్యంతో ఒక పదాన్ని మరొక శబ్దంగా చెప్పడానికి వేదభాష్యంలో ఎన్నో ఉదాహరణలున్నాయి. * ఆ నల్లని వాణ్ణి

---

* వేదంలో భగవంతుడు అనే అర్థాన్ని చెప్పే 'అగ్రి' అనే పదం 'అగ్ని' గాను, ముక్తి సుఖం అనే అర్థాన్ని చెప్పే 'శర' అనే పదం 'చర్మ' గాను ప్రత్యక్షీకరణం కోసం మార్పు చేయబడ్డాయని వేదార్థం చెప్పే 'భారత నిరుక్తి' అనే గ్రంథంలో వుంది.

నిషాదుడు అన్నారు. నిర్గతః సాదః యస్మాత్సః=నిషాదః అనే వ్యుత్పత్త్యర్థంలో స్వేచ్ఛత వీడిపోయినది అనే అర్థంలో తమోగుణం అని అంతరార్థం చెప్పవచ్చు. తమోగుణానికే నల్లని పొట్టి వికారరూపం గల నిషాదుడన్నది ప్రత్యక్షీకరణం చేయబడిందనాలి. సాధకునిలో భగవత్పరమైన ఆలోచన సాగించడంతో అతనిలోని తమోగుణం బైటికి పోయిందన్న అంతరార్థం గ్రహించాలి. నిషాదుడు రాజ్యపాలనకు అనర్హుడు కావడం వల్ల మునులు వానిని విడిచివేసి తిరిగి వేన మృతదేహంలో బాహు మథనం జరిపించేరు అంటే ముక్తి పొందే కార్యాచరణంలో తమోగుణం పనికిరాని కారణంగా జీవునిలోని సంకల్ప వికల్పాత్మక మనస్సునుండి పుట్టిన తమోగుణాన్ని బైటకు వెల్వరించి సాధకుడు దానిని విడిచివైచినాడు అని అర్థం. ఆ తర్వాత బాహు మథనం అంటే 'బహు' శబ్దానికి బ్రహ్మ అనేది అర్థం అనగా బహు స్వరూపమైన ప్రకృతి అర్థం. ఆ ప్రకృతి యే పరమాత్మ కావడంవల్ల బాహుమథనం అంటే ప్రకృతి రూప పరమాత్మను గూర్చిన ఆలోచనా ప్రబలయిత్నం అన్న మాట. 'ఊరు' పదానికి ఊరు పదంలాగే 'బహు' పదాన్ని ప్రత్యక్షీకరణం చెయ్యడానికి 'బాహు' పదం ప్రయోగింపబడింది. ఈ రీతిగా నిర్గుణాలను సుగుణాలుగా ప్రత్యక్షీకరణం చెయ్యడం వేదంలోనే వున్నదని నిరుక్తశాస్త్రం నిరూపిస్తూంది. ఇప్పుడు మునులు బాహుమథనం చెయ్యడంలో ఒక 'మిథునం' అంటే దంపతులు జనించేరు. అందు పురుషుని పేరు పృథువు. స్త్రీ పేరు అర్చి.

భగవదన్వేషణం చేస్తూన్న ప్రశాంత చిత్త వృత్తులు రెండవసారి ప్రకృతిరూప పరమాత్మను గూర్చి ఆలోచనా యత్నం ప్రబలంగా చెయ్యగా వేన శరీరంనుండి అనగా సంకల్పవికల్పాత్మక మనస్సునుండి ఈసారి 'పృథువు' అనగా 'మహత్తత్వం' అనగా నిశ్చయాత్మకమైన బుద్ధియు 'అర్చి'యు అనగా ఆ బుద్ధిని అనుసరించియుండే జ్ఞానదీప్తియు కల్గేయి, అని పై వాక్యానికి అంతరార్థం. పృథువు అంటే 'పెద్దదైనది' అని అర్థం వుంది. 'అర్చి' అంటే ప్రకాశ కిరణం అని అర్థం వుంది. మహత్ అన్నా పెద్దదైనది అనే అర్థం వుండడంవల్ల పృథువు పదానికి మహత్త్వం అనే అర్థం చెప్పవచ్చు. మహత్తత్వం అంటే 'బుద్ధి' అనే తత్త్వం అని శాస్త్రం చెప్తూంది. బుద్ధి అనాహత చక్రానికి భూమికగా యోగశాస్త్రం చెప్తూంది. భగవదన్వేషణంలో ఈ విధంగా సాధకుడు సంకల్ప వికల్పాత్మకమైన తన మనస్సునుండి ముందుగా వికల్పాత్మకమైన తమోగుణాన్ని వెల్వరించి దానిని విడిచివైచి ఆపైని నిశ్చయాత్మకమైన బుద్ధిని అనగా పృథువునూ, దానిని అనుసరించిన అర్చినీ అనగా జ్ఞానదీప్తినీ పొందేడన్న మాట.

సాధకుడైన జీవుడు తనలోని పూర్వజన్మ సంస్కారంతో కూడికొని ముక్తిని పొందేందుకు యత్నిస్తూ ప్రకృతిని అంటి వుండే వాసనా మనోవృత్తుల్ని విడిచివేయ డానికి సాధనలు జరుపుతూంటాడు. అప్పుడాతనిలోనుండి సాత్విక వృత్తులు అతని లోని తామసిక వృత్తుల భయంచేత కాదనలేక ఆతనికి తోడ్పడజాలవు ఆ సంగతిని గుర్తించి సాధకుడు తాను తనలోని తామసిక గుణాన్ని ముందు అణచివేయడానికి చేసిన భగవదన్వేషణా ప్రబల యత్నంవల్ల, ఆతనిలోని సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు పైకి లేస్తుంది అది అతని తామసిక వృత్తిలోనికి దింపి నాస్తికత్వాన్ని ప్రకో పింప జేసేది కావడంవల్ల అప్పుడు సాధకులోని ప్రశాంతమౌన మనోవృత్తులు ఆసంకల్ప వికల్పాత్మక మనస్సు అణచివేస్తాయనీ, అప్పుడు సాధకునిలో నున్న పూర్వజన్మ సంస్కారబలం ఆ సంకల్ప వికల్పాత్మకా మనస్సును పూర్తిగా నాశం కానీకుండా నిర్వారిస్తుందనీ, ఆ తర్వాత సాధకునిలోని మౌన ప్రశాంత వృత్తులు సాధకుని సంకల్ప వికల్పాత్మక మనస్సునుంకి నిశ్చయాత్మకమైన సాత్త్వికబుద్ధి తత్త్వంగా బైటకు రాబట్టే 'ఉరు' ప్రయత్నం చేస్తాయనీ, ఆ ప్రయత్నంలో ముందుగా ఆ సంకల్ప వికల్పాత్మక మనస్సునుండి తామసికతత్త్వం బైటకు వచ్చి సాధకుని విడిచిపోతుందని ఆ తర్వాత తిరిగి సాధకునిలోని మౌన ప్రశాంత వృత్తులు తిరిగి ప్రయత్నం చేస్తాయినీ అప్పుడు ఆ సంకల్ప వికల్పాత్మక మనస్సునుండి నిశ్చయాత్మకమైన బుద్ధియు దాన్ని ప్రదీప్తం చేసే జ్ఞాన దీప్తియు వెలికి వస్తాయనీ, బుద్ధియే మహత్తత్వం నీపై కథకంతకు సాధనాపరంగా అంతరార్థం గ్రహించాలి. ఆ స్థాయికి సాధకుడు వస్తే ఇంక అతనికి పతనం అనేది వుండదు. ఏమైనా కొన్ని అవాంతరాలు విఘ్నాలుగా వచ్చినా వానిని సాధకునిలోని బుద్ధితత్త్వం పరిహరించి ముక్తిని పొందించే సాధనలు చేయించి సిద్ధిని పొందిస్తుంది. ఈ విధమైన అంతరార్థ సాధనా రహస్యం పృథు చక్రవర్తి జననం వరకు గల పై కథలో మనకు అందుతూంది. అనాహత చక్రాన్ని కనుక కుండలినీ శక్తి చేరుకొంటే సాధకునికి ఇక పతనం ఉండనే ఉండదు. న+ఆహతం=అనాహతం అనగా పెద్దదెబ్బ ఏమీ ఇక రాని స్థితి గలది అని యోగశాస్త్ర పరమైన అర్థం. అనాహత చక్ర భూమి కయే బుద్ధి. కాన జ్ఞానమార్గంలో బుద్ధి తత్త్వాన్ని చేరుకొన్న సాధకునకూ యోగ మార్గంలో కుండలినీ శక్తిని అనాహత చక్రాన్ని చేర్చిన సాధకునకూ ఇక పైకి చేరు కోవడానికి అరోహణమే తప్ప మరేమీ పెద్ద పెద్ద విఘ్నాలంతగా ఉండవని యోగ జ్ఞాన మార్గముల రహస్యం ఇందు తెలియజేయబడుతుందని భావించాలి.

పృథు చక్రవర్తి పరిపాలన ప్రారంభించడంలో భూమి గోరూపాన్ని ధరించి పారిపోతూంది అంటే సాధకునిలోని నిశ్చయాత్మకమైన బుద్ధి తన జ్ఞానదీప్తితో ముక్తికై భగవత్సాధనలు చేయడం ప్రారంభించడంతో సాధకునిలోని భూసంబంధమైన అనగా ఐహికమైన ప్రవృత్తి అణగిపోతుంది అనే అంతరార్థం గ్రహించాలి ఇక్కడ భూమి ఐహిక ప్రవృత్తికి సంకేతం. గో అన్నదానికి ఇంద్రియ ప్రవృత్తి అనే అర్థం వుంది. వాచ్యార్థంలో గోవు అనగా ఆవు అనేది అర్థమైనా అంతరార్థంలో ఇంద్రియ వ్యాపారం అనే అర్థం చెప్పాలి. బుద్ధి ద్వారా ఇంద్రియవ్యాపారం అంతా అణగి ఐహిక వాంఛలు అడుగంటుతాయి అని పై వాక్యాలకు అర్థం చెప్పుకోవాలి.

అప్పుడు భూమిలో ఓషధీ బీజాలు నశించి పంటలు పండవు. దానితో ప్రజలు హాహాకారం చేస్తూ బాధపడుతారు. అప్పుడు పృథువు పారిపోతూన్న గోవును వెంటాడి దాన్ని ఆపి దాని నుండి ఓషధుల్ని పితుకుతాడు. అప్పుడు భూమి సస్యశ్యామలం అవుతుంది. అంటే సాధకుడు తనలోపల ఐహిక వాంఛలుగల ఇంద్రియ వృత్తిని అణచి అవి తనకు వశపడే విధంగా అసంగవృత్తి సాధనతో అన్ని సుఖాలు అనుభవిస్తూంటాడు. అనే అంతరార్థాన్ని పై గోదోహన కథ బైటపెట్టుతూందిగా భావించాలి.

తర్వాత ఇంద్రుడు పృథుచక్రవర్తి రాజ్యం సుభిక్షంగా నడిపించటం చూచి అసూయపడతాడు. అతడు తలపెట్టిన 101వ అశ్వమేధ యజ్ఞంలోని యజ్ఞాశ్వాన్ని మాయం చేస్తాడు.

ఇంద్రుడు అంటే మనస్సు అని మనం లోగడ చెప్పుకొన్నాం. బుద్ధి పని చేస్తూన్నా లోలోపల అణచి వేయబడి సాధకునిలోనే వున్న మనస్సు తాను సాధకునికి కనుపించకుండా మాయతో సాధకుణ్ణి ముక్తి సాధన నుండి దిగజారుస్తూనే వుంటుంది. ఎప్పటికప్పుడు సాధకుడు బుద్ధిబలంతో మనస్సు ఆడే ఆటను తెలిసికొని దాన్ని కట్టి వేస్తూనే వుండాలి. బుద్ధిని కన్నుగ్రామిచాటుచాటున నక్కి వున్న మనస్సు సాధకుని భగవదైక్యాను సంధాన సాధనలో ప్రకృతిని సాధకుడు వశం చేసుకొని అనుభవించ డాన్ని నిరోధిస్తుంది అన్నదే పైన చెప్పిన యజ్ఞాశ్వాపహరణకు అంతరార్థం. పోయిన అశ్వాన్ని తిరిగి తీసికొని రావడానికి పృథువు తన కుమారుని పంపేడు. అతనికి అత్రి మహర్షి ఇంద్రుని మాయాస్థితిని తెలియజేశాడు. దానితో పృథుకుమారుడు ఇంద్రుని వెంటాడేడు ఇంద్రుడు అశ్వాన్ని విడిచి పారిపోయేడు.

ఇక్కడ పృధుకుమారుడండే బుద్ధితత్త్వం వల్ల పుట్టిన చిత్త్వం. చిత్ + త్వం= చిత్త్వం అవుతుంది. త్వ అనేది భావార్థక ప్రత్యయం: చిత్ అంటే జ్ఞానం. చిత్త్వం అంటే జ్ఞానభావం. అది బుద్ధివల్ల కల్గుతుంది. మనోబుద్ధి చిత్తాహంకారలనేవి అంతః కరణ చతుష్టయం అంటారు. ఒకదాని నుండి మఱొకటి ఆవిర్భవించేవి. అవి అన్నీ నిజానికి ఒకటే తత్త్వంగలవి. కాని పనులు అవి చేసేటప్పుడు అవి ఆపనులను బట్టి ఆయా నామాలు పొందుతాయి.

బుద్ధి తత్త్వం నుండి పుట్టిన చిత్‌తత్త్వం ఇంద్రుని జయించడానికి నియమింప బడింది. పృధువంటే బుద్ధితత్త్వం కదా చిత్ తత్త్వమే పృధుకుమారుడంటే బుద్ధినుండే చిత్ జ్ఞానం పుట్టుతుందిగదా! ఇచ్చట పృధుకుమారుని పేరు చెప్పక పోవడంలోనే బుద్ధి నుండి పుట్టే చిత్‌తత్త్వం అని అంతరార్థ పరంగా స్ఫురిస్తుంది. ఆ చిత్‌తత్త్వానికి 'అత్రి' కనిపించేడు అత్రి అనగా త్రిగుణాతీతస్థితి అజ్ఞాన దీప్తితో మేల్కొంది అని అంతరార్థం చెప్పాలి న+త్రి = అత్రి అవుతుంది మూడు లేనిది అనగా త్రిగుణాలులేని స్థితి అదే. సత్త్వరజస్తమోగుణాలకు త్రిగుణాలకు త్రిగుణాలు అనిపేరు. త్రిగుణాతీత స్థితిని పొందిన చిత్‌తత్త్వం. ముందు, మనస్సు శక్తి హీనమైనదవడం చేత దానినెదిరించలేక మాయమైపోతుంది. అప్పుడు ప్రకృతి సాధకునికి వశపడి పోతుంది అనేది ఇంద్ర మాయాప్రవర్తనకు అశ్వపునరాహరణానికి అంతరార్థంగా చెప్పుకోవాలి.

ఆ తర్వాత పృధువు తిరిగి ఆ అశ్వంతో అశ్వమేధ యజ్ఞం తలపెట్టేడు. అప్పుడు మళ్ళీ ఇంద్రుడు తమో ఆవరణం కల్పించి అశ్వాన్ని కన్పించకుండా చేసి పారిపోతాడు. అంటే సాధకుని మనస్సు ఇంకా తమోగుణంతో ముక్తి సాధనకు విఘ్నప్రయత్నం మానలేదన్నమాట. తిరిగి పృధువుయొక్క పుత్రుడు అత్రి ఉప దేశంతోనే ఇంద్రుని చంపకుండా అశ్వాన్ని తెస్తాడు అంటే తిరిగి త్రిగుణాతీత స్థితిలో ప్రకృతిని సాధకుడు చిత్‌తత్త్వంతో [జ్ఞానంతో] వశపరచుకొంటాడు. అనే అర్థాన్నే తిరిగి చెప్పాలి. ఈ విధంగా మనస్సు, దుశ్చేష్టలు ఎన్ని చేసినా సాధకుడు లొంగకుండా, దాన్ని చంపకుండానే తన ముక్తి సాధనను సాగించుకోవాలి అన్నమాట.

తర్వాత ఇంద్రుడు చేసేదిలేక పృధువు యొక్క రాజ్యంలో పాషండ మతస్థు లను ప్రవేశపెట్టి దేవుడు లేడని యజ్ఞాలు చేయకూడదని ప్రచారం చేయిస్తాడు. దానితో పృధువు యొక్క యజ్ఞాన్ని దిగజార్చే విఘ్నాలెన్నెన్నో సిద్ధమౌతాయి.

అప్పుడు పృధువు తానే స్వయంగా ఇంద్రునిమీదికి లంఘిస్తాడు. అతనికి చతుర్ముఖ బ్రహ్మ ఎదురై ధర్మోపదేశం చేస్తాడు. తర్వాత విష్ణువు ప్రత్యక్షమై ఇంద్రునిచేత పృధుచక్రవర్తికి క్షమాపణ చెప్పిస్తాడు. పృధువు యజ్ఞ సాధనలతో ముక్తి పొందుతాడు.

పృధువు అనగా సాధకునిలోని బుద్ధితత్త్వం. అది తనకు జన్మకారణమైన మనస్సు, తాను కోరే ముక్తికి నాశం చేయనీయకుండా మనస్సును ఎదిర్చి జయం పొంది. తర్వాత చతుర్ముఖ బ్రహ్మ పృధువునకు ధర్మోపదేశం చేశాడు అంటే మనో జయంతో చతుర్వేద తత్త్వం సాధకునిలో ఉద్బుద్ధమౌతుందనేది అంతరార్థ పరంగా చెప్పాలి. ఆ తర్వాతనే వేదవేద్యుడైన విష్ణువు పృధువుకు ప్రత్యక్షమౌతాడు అంటే చతుర్వేద తత్త్వ పరిజ్ఞానంతో విష్ణువు అనగా సర్వవ్యాపక పరమాత్మతత్త్వం బుద్ధి గోచరమౌతుందన్నమాట. దీనితో సాధకుని ముక్తి సాధన పూర్ణత్వం పొందుతుంది. జీవుడు పరమాత్మ సాక్షాత్కారానుభవం పొందుతాడు. అనే అంతరార్థ రహస్యంపైని చెప్పిన బ్రహ్మ విష్ణు ప్రత్యక్ష కథా భాగంలో తెలుస్తుంది.

ఆ తర్వాత విష్ణువు వరాల్ని వేడుకోవలసిందిగా పృధుచక్రవర్తిని అడుగుతాడు. పృధుచక్రవర్తి ఏ వరాలూ కోరకుండా "లక్ష్మీదేవి నిన్ను అనుసరించి వుండేటట్లు నేను నిన్ను విడవకుండా అనుసరిస్తూ సేవించి వుండాలనీ, నీకథలు నిరంతరం వేయి చెవులతో వింటూండాలని కోరుతాడు. తర్వాత చాలా కాలం పృధుచక్రవర్తి రాజ్యపాలనంచేసి కైవల్య ముక్తిని చేరుకొంటాడు.

సాధకునకు పరమాత్మ తత్త్వ సాక్షాత్కారానుభూతి కల్గేక నిస్సంగత్వంతో, ఐహిక ప్రవృత్తులతో ఉన్నా అవి వాసనలను పుట్టింపవనీ, సాధకుడు ప్రాణోత్క్రమణం వరకు పరమాత్మ తత్త్వాన్ని విడవకుండా ఆరాధిస్తూండాలనీ అందుకై నిరంతరం భగవత్తత్త్వాన్ని చెప్పే కథలు వింటూండాలనీ అట్లావుంటేనే ఆ తత్త్వం నిలబడి వుంటుందనీ, ఆవిధంగా జీవిస్తూ సర్వసుఖాలు నిస్సంగతత్త్వంలో అనుభవించి ప్రాణోత్క్రమణ సమయంలో భగవచ్చింత నిలబడివున్న కారణం చేత 'యాంతే మతిస్సాగతి:' చిట్టచివరికి ఏది మనస్సులో ఉంటుందో అదే గతి కాన జన్మ రాహిత్యం పొంది కైవల్య ముక్తిని సాధకుడు పొందుతాడనీ అంతరార్థపరంగా సాధనా రహస్యం పైకథావాక్యాల్లో నిక్షేపింపబడింది. సాధకుడైన జీవుడు కైవల్య ముక్తిని పొందడానికి ఉండే మనో, బుద్ధి, చిత్త, త్రిగుణ సాధనా ప్రణాళికా క్రమం అంతా ఈ అంగ, వేన, పృధు చక్రవర్తుల మూడు కథలతోను పరోక్షం చెయ్యబడింది.

అంగరాజు ధ్రువుని వంశంలో వాడని చెప్పడం వల్ల ధ్రువుని చరిత్ర కూడ ఇదే విధమైన ముక్తి సాధన చెప్పేదిగా ఉందని గ్రాహించాలి. పృధువు, ధ్రువుడు కూడ భగవంతుని ఏక వింశత్యవతారాల (21) అవతారాలలోనున్న వారే అవడంలో భగవదైక్యం పొందించే సాధనలే ఆ అవతారాలని ఆ సాధనలు అన్నీ ఇరువై యొక్కటిగా ప్రసిద్ధి పొందాయని తెలిసికోవాలి. దాన్నిబట్టి చూస్తే అవతారం అంటే దిగుట అనే అర్థంలో జీవునిలోనికి పరమాత్మతత్త్వం దిగిరావడం అనగా జీవుడు పరమాత్మగా రూపింపబడడమే అనే అర్థం ప్రస్ఫుటమౌతూందిగా భావించాలి. అన్ని అవతారాల కథలకు అన్నిరకాల ముక్తి సాధనలపరంగా అంతరార్థాలు ఉన్నాయి. ఈ కథకు ఫలశ్రుతిని చెప్తూ ఈ కథ విన్నవారికి ముక్తి ప్రాప్తిస్తుందని వ్యాసమహర్షి కథ పూర్తిచేయడంలోనే ఇందు అంతరార్థ పరంగా ముక్తి నుపదేశించే సాధనలున్నాయని స్పష్టంగానే తెలుస్తూంది.

సాధనా సారాంశము :—

సాధకుడు మనోవిజయంతో, బుద్ధితత్త్వంతో, జ్ఞానాన్ని పొంది యుండాలి. ఆపైని సత్త్వరజస్తమోగుణాలకు లోబడి పోకుండా అతీతంగా ఉండాలి. ఆ స్థాయికి చేరుకొంటే ఇక ముందు సాధనల పతనస్థితి వుండదు. అప్పుడు మనస్సుయొక్క మాయాజాలాన్ని సులువుగా అర్థం చేసికొని సాధకుడు చీకాకులన్నిటినీ తొలగించు కోగల్గుతాడు. ఆ తర్వాత పరమేశ్వరానుగ్రహంతో వేద రహస్యం అనుభూతికి వస్తుంది. ఆపైని వేదవేద్యుడైన పరమాత్మ యొక్క సాక్షాత్కారానుభవంతో సాయుజ్య ముక్తి చేకూరుతుంది. ఈసాధనా సారాంశం అంగ, వేన, పృధు చక్రవర్తుల చరిత్రలలో నిక్షేపింపబడివుంది.

# పురంజనోపాఖ్యానం.

## (సత్కర్మానుష్ఠాన సాధన)

పూర్వం పురంజనుడనే రాజుండేవాడు. అతనికి విజ్ఞాతుడనే పేరుగల స్నేహితుడున్నాడు. పురంజనుడు తన సఖుడితో కలిసి తనకు అనుకూలమైన పురం కోసం భూమి అంతటా గాలించేడు. చివరకు హిమవత్పర్వత దక్షిణ సానువులందు ఒక పురాన్ని చూచేడు. అది తొమ్మిది కవాటాలు గలది. మంచి అందంగా అతనికి

కన్పించింది. అందులోని ఇళ్ళు ఇనుము వెండి బంగారు వర్ణముల గోపురాలతో నున్నాయి. అన్ని సౌకర్యాలు అందులో ఇమిడివున్నాయి. ఆ పట్టణ బాహ్యోద్యాన ద్వారం వద్ద ఒక స్త్రీ నిలబడియుంది. దాని పేరు ప్రమదోత్తమ. ఆమెకు పదుకొండుమంది భృత్యులున్నారు. వారు ఆమె ఆజ్ఞల కెదురుచూస్తున్నారు. వారిలో ఒకడు నాయకుడు మిగిలిన పది మందికి ఒక్కొక్కని ఆధీనంలో నూరేసి మంది పనికత్తెలు చొప్పున అనుచరులున్నారు. ఉద్యానద్వారాన్ని కాపలాకాస్తూ ఐదుతలల పాముకటి పడగలెత్తి అక్కడ వుంది.

ఆ స్త్రీ చాలా అందంగా వుంది. ఆమెను చూచి రాజు మోహపడి "నీవు ఎవ్వరి దానవు? తల్లితండ్రి యెవరు? ఎందుకిచ్చటనున్నావు? ఈ పట్టణం సంగతి ఏమిటి? నీ వెంటనున్న ఈ పదుకొండు మహా భటులెవరు? వారివెంట ఆ స్త్రీ ఎవరు? ఎదురుగా ఆ పామేమిటి? నీవెవరి కోసం నిరీక్షిస్తున్నావు?" ఈ విధంగా పురంజనుడు ఆమెయందు దాసక్తితో ప్రాధేయ పడుతూ అడిగేడు. ఆ సుందరి పురంజనుణ్ణి ప్రేమోన్మత్తుణ్ణిగా చేస్తూ చూస్తూ "నా తండ్రి యెవరో నాకుతెలియదు ఇక్కడనున్న నన్నుతప్ప 'నా' అన్నవారిని నేనింకెవ్వరిని ఎఱుగను. ఈ పట్టణాన్ని ఎవరు కట్టేరో అసలునాకు తెలియదు. ఈ చెలికాండ్రు, చెలికత్తెలు నాకు సేవలుచేస్తున్నారు. నేను నిద్రిస్తూన్నప్పుడు ఈ ఐదుతలల పాము ఈ పట్టణాన్ని కాపలా కాస్తూంటుంది. నా అదృష్టంవల్ల నీవు వచ్చేవు. నన్ను పెండ్లాడి, నీ ఇష్టంవచ్చినట్లు ఈ పట్టణంలోని సర్వ కామోప భోగాల్ని అనుభవించు. రాజా! నీవు ఈ నవకూట పట్టణంలో హాయిగా నివసించు. నేనిచ్చేసుఖాలతో నూరేండ్లు నాతో ఈ పట్టణంలో ఉండచ్చు" అని పలికింది.

ఈ విధంగా వారిద్దరు పరస్పర ప్రణయావేశ చిత్తులై ఆ పురంలో ప్రవేశించేరు. ఆ పురానికి ఏడు ద్వారాలు పై భాగంలోను, రెండు ద్వారాలు క్రింద భాగంలోను ఉన్నాయి. పై ద్వారాల్లో ఐదు ద్వారాలు తూర్పు ముఖంగానూ, దక్షిణ ముఖంగా ఒక ద్వారమూ ఉత్తరముఖంగా మఱోద్వారమూ వున్నాయి. పడమటి వైపుగా రెండుద్వారాలు ఉన్నాయి.

పురంజనుడు ఆయా ద్వారాల వెంటబడి, తన ప్రేయసి ఏమిచేస్తే అట్లు వర్తిస్తూన్నాడు. ఆమె తిన్నప్పుడు తానూ తింటాడు, త్రాగినప్పుడు త్రాగుతాడు, ఆమె ఆడుతే ఆడుతాడు, పాడితే పాడుతాడు, ఏడిస్తే ఏడుస్తాడు, నవ్వితే నవ్వుతాడు, మాట్లాడుతే మాట్లాడుతాడు ఈ విధంగా ఆమెయే ప్రపంచంగా, ఆమెచేత వంచింపబడి ఆమె ననుసరిస్తూ ఆమెచేత ఆడిస్తూన్న క్రీడా మృగంలాగ తయారైనాడు.

ఒకప్పుడు పురంజనుడు వేటకు వెళ్ళి వివిధ మృగాలను వేటాడి వచ్చి తన విరహం కారణంగా తన ప్రేయసియైన 'పురంజని' (ప్రమదోత్తమ) భూమి మీద పడి పొరలుతూ ఏడుస్తూ వుండడం చూచాడు. ఆమెను లేవదీసి పాదాలు పట్టుకొని బ్రతిమాలగా ఆమె అనుగ్రహించి అతణ్ణి శృంగార రతి క్రీడలలో తేలించింది. ఈ విధంగా చాలా కాలం గడిచింది. పురంజనుడి యౌవన కాలం అంతా ఒక్క క్షణం లాగ గడిచిపోయింది.

పురంజనుడు పురంజని యందు పదకొండువందల మంది కొడుకులను కనడంతో సగం ఆయుష్యం గతించింది. తర్వాత నూటపది మంది ఆడ బిడ్డల్ని కన్నాడు. అతడు మగపిల్లలకు ఆడపిల్లలకు పెండ్లిండ్లుచేశాడు. కొడుకులందరికీ ఒక్కొక్క రికి నూర్గురేసి చొప్పున పుత్రులు పుట్టేరు. పురంజనుడు ముసలివాడయ్యేడు. చండవేగుడనే శత్రురాజు సుకాసితులైన (తెల్లనివారు, నల్లనివారు) తన ఏడు వందల ఇరవైమంది అనుచరులతో వారివారి భార్యలతో కలిసి పురంజనుడి రాజ్యాన్ని ఆక్రమించి ప్రతినిత్యం భ్రష్టం చేయసాగేరు.

ప్రజాగరుడనే పురంజనుడి పురాధ్యక్షుడు ఆ 720 మందినితో కూడికొని యున్న వాని నెదరించి తాను ఒక్కడూ వారందరి తోటీ నూరు సంవత్సరాలు పోరాడి డస్సిపోయెడు. తర్వాత 'కాలకన్య' అను నొకతె భయప్రజ్వరులను యవనేశ్వరుల నాయకత్వాన యవన సేనలతో గూడి కొనివచ్చి ఐదు పడగల ముసలి పాముచే రక్షితమవుతూన్న ఆ పురంజన పురాన్ని ఆక్రమించి నానాభీభత్సము చేసి వేసింది.

అప్పుడు పురంజనుడు ఎంతో వ్యాకులచిత్తుడై బహు విధములైన మహా బాధలు పడ్డాడు. అంత గొప్ప కుటుంబీకుడూ కాలకన్యా వశుండై నష్టసంపదుడూ, వినష్ట మతీయై పోయేడు. అప్పుడు ఆ ముసలి పురంజనుణ్ణి పుత్రులు, పౌత్రులు దౌహిత్రులు చీదరించుకోవడం ప్రారంభించేరు. ఆ కారణం చేతనే అతడు తన పురంలో నివసించ లేకపోయేడు. అప్పుడు ప్రజ్వరుడాతనిని పట్టుకొన్నాడు. అతని పురాన్ని కాల్చి వేయసాగేరు. ఆ పురంజను సంతతి వారెవ్వరూ పురంజనుడికి తోడ్పడలేకపోయేరు. అంత పురంజనుడు తన ప్రేయ్యసిని విడిచిపోలేక పోలేక ఆమెయూ పుత్రులూ తన్ను విడియుండలేరని దుఃఖ శోకాతి రేకంతో బాధపడుతూండగా పురంజనుని పురాన్ని పాలించే ఐదు పడగల పాము తోక ముడిచి పారిపోయింది. దానితో పురంజనుడు భార్యానుగతమైన చిత్తంతో లోకం విడిచిపోయేరు. ఆ కారణం చేత పురంజనుడు ఆడుజన్మమొంది విదర్భ రాజుకు కూతురుగా వైదర్భి అనే పేరుతో

జన్మించేడు. ఆ వైదర్భిని మలయకేతువు అనే రాజు పెండ్లాడి ఆమెతో చిరకాలం మలయకేతువు యజ్ఞాలు చేసి, పుణ్యకార్యాలు చేసి సుఖించి చివరికి యతియై అరణ్యాల్లో నివసించేడు. అతని భార్య వైదర్భియు అతనిని విడువక అంటి పెట్టుకొనియే యుంది మలయకేతువు మరణం పొందేడు. అతణ్ణి అనుగమించడానికి వైదర్భి చితి పేర్చుకొని అందు దుమక బోయింది. అప్పుడొక బ్రాహ్మణు డామెకు ప్రత్యక్షమై ఆమె నోదార్చేడు. ఆమె ఆ బ్రాహ్మణుని 'నీవెవ్వడ' వని ప్రశ్నింపగా అతడు ఇట్లన్నాడు

"ఈ సృష్టికి పూర్వం నీవెవరితో స్నేహంగా ఉండేవాడవో వాడినే నేను. పూర్వం మన మిద్దరం మానససరో నివాసులమైన సఖులము. నీవు కామభోగరతుడవై నన్ను విడిచి నవద్వారపురం చేరుకొన్నావు. ఆ పురంలోని కామినితో కూడి నీవు నష్టస్మృతివై ఇట్టి పాపిష్ఠి దశకు వచ్చేవు. కాన నీవు వైదర్భివి కావు, ఈ మృతుడు నీకు భర్తయూ కాడు. పూర్వజన్మలో పురుషుడవైన నీవు ప్రాణోత్క్రమణ వేళ భార్యాచింతతో నున్నావు కాన స్త్రీ రూపం సిద్ధించింది. ఇంతకూ ఇదంతా నా మాయా ప్రభావం. నన్ను విడిచి పెట్టడం వల్ల నీకు గల్గిన అవస్థ యేమిటి. మనం ఇద్దరం నిజానికి ఒకే రూపం గల వారం సుమా ! నేనే నీవు కాని, నీవు అన్యుడవు కావు, అని తెలియ జెప్పడంతో వైదర్భిజ్ఞానానుభూతి కలిగి ముక్తి నందింది. ఈ కథకు అంతరార్థం కూడ ఈ క్రింది విధంగా వ్యాస భగవానుడే వ్రాసేడు. పురంజనుడు పురుష ప్రకృతియైన జీవుడు అతని సఖ్యుడైన అవిజ్ఞాతుడు ఆత్మ. 'పురం' దేహం. అహంకార, మమకార కారణమైన బుద్ధి యొక్క ప్రకృతియే పురమందలి స్త్రీ. ఆమె పేరు ప్రమదోత్తమ. ప్ర+మద+ఉత్+తమః అని విడదీస్తే ఎక్కువ అహంకార మమకారాల మదం కల్గిన గొప్ప తమోగుణం అనే వ్యుత్పత్తిరీత్యా చెప్పవచ్చు. (తమస్ శబ్దం సమాసంలో అకారాంతం కావడం అర్ధప్రయోగం) దాని సఖులు జ్ఞానేంద్రియ కర్మేంద్రియా గుణాలు. సఖీజనంబులు ఆ ఇంద్రియ వృత్తుల యొక్క ఉపవృత్తులు. పంచ ఫణముల ఫణి ప్రాణ, అపాన, ఉదాన, సమాన, వ్యానములనే ఐదు పేర్లు గల ప్రాణం. ఏకాదశ మహా భటులు దశేంద్రియ నాయకుడైన మనస్సుతో దశేంద్రియములూ కలిసి పదునొకండుగురు. నవద్వారాలు, కన్నులు రెండు, చెవులు రెండు, ముక్కు రంధ్రాలు రెండు, నోరు ఒకటి మలమూత్ర విసర్జన స్థానాలు రెండు కలసిన నవరంధ్రాలు, వాని చుట్టూగా వున్న పాంచాల దేశాలనగా పంచభూత విషయాలు. అక్షినాసాస్యము లైదూ ప్రాగ్ద్వారాలు

దక్షిణోత్తర దిశలందలి చెవులు దక్షిణోత్తర ద్వారాలు. మలమూత్ర విసర్జన స్థానాలు పశ్చిమ దిక్కునందలి ద్వారాలు చండవేగుడు కాలవేగం. కాలాన్ని తెల్పే సంవత్సరంలోని నలుపు తెలుపు గల రాత్రింబవళ్ళు 720 భృత్యాలు పురంబు చితాను పరచడం అంటే ఆయుష్షును హరించడం అని అర్థం. కాలకన్య యనగా కాలం వల్ల కల్గిన ముసలితనం. యవన నాయకుడనగా మృత్యువు. యవనుని అనుచరు లగు యవన సైనికులనగా ఆది వ్యాధులు. ప్రజ్వరు డనగా శీతోష్ణరూపం గల తీవ్ర జ్వరము భయుండనగా ప్రాణ భయం, అంటే మృత్యు భీతి. ఈ పురంజనో పాఖ్యానం ఇంకా విస్తరంగా వాచ్యార్థం చెప్పి దానికి అంతరార్థం కూడ విస్తారంగా ప్రదర్శించి వ్యాసమహర్షియే వ్రాసేడు. దీనిని బట్టి చూస్తే వ్యాసమహర్షిలో ఆతని కథలలో అంతరార్థం నిగూఢంగా ఉంచాలనే వ్యంగ్య కవితా ప్రయత్నం దాగా వుందనీ, ఆతడు చెప్పిన కథలన్నిటినీ అంతరార్థపరంగా వ్యాఖ్యానించుకోడానికి అనుగుణంగానే వ్రాసేడనీ మనకు తెలుస్తూంది. ఈ పురంజనోపాఖ్యానంలో అంత రార్థం తానే విప్పి చెప్పడం తాను ఉదాహరణ కోసమూ, పాఠకులకు అన్ని కథల్లోను ఈ రీతిగా అంతరార్థ ప్రబోధం కల్గించడం కోసమూ జరిపించి వుంటాడని కూడ మనం సులభంగానే గ్రహించవచ్చు.

పురంజనుడంటే, పురం=దేహము గూర్చి. జనుడు=పుట్టినవాడు అనే వ్యుత్ప త్యర్థంలో జన్మవాసనల కారణంగా గల జీవుడు అనేది అర్థం. వాసనాబద్ధుడైన జీవుడు తన వాసనల కనుకూలమైన దేహం వెతుక్కుంటూ దేహధారణం చెయ్యడమే పురం జనుని పురాన్వేషణంలోని అంతరార్థం. అవిజ్ఞాతుడంటే స్పష్టంగా తెలియబడని వాడని అర్థం. అనగా పరమాత్మ అనీ అతణ్ణి తెలియడం అశక్యంఅని అంతరార్థం. జీవుడు పరమాత్మతో కూడి ప్రకృతిలో ప్రవేశించడమే విజ్ఞాతునితో పురంజనుడు పురంలో ప్రకాశించడమంటే, అహంకార మమకారాత్మక బుద్ధిచేత ఆకర్షింపబడి శరీరంలో ప్రవేశించడమే ప్రమదోత్తమ ద్వారా పురంలో ప్రవేశించడం అన్నదానికి అంతరార్థం. చివరకు జీవుడు వైదర్భిగా పుట్టడమనేదానికి తిరిగి వాసనానుకూలంగా మరణకాలమునందలి వాసనా ప్రాబల్యంతో జీవుడు పునర్జన్మ మొందినా డన్నది అంతరార్థం. చితిలోపడే వైదర్భికి బ్రాహ్మణుడు కనుపడడం జీవుడికి పరమాత్మ అనుభూతి కల్గడం అన్నది అంతరార్థంగా చెప్పుకోవాలి.

మలయకేతువుకు వైదర్భి భార్య అయిందంటే, రెండవ జన్మలో జీవుడు వైదర్భిగాను అహంకార మమకారాత్మక వాసనాబద్ధమైన బుద్ధి మలయకేతువుగాను

చెప్పబడ్డం జరిగిందని మనం గుర్తించాలి. యజ్ఞం అంటే భగవద్విజ్ఞానం అనే అర్థం లోగడ చెప్పుకొనేయున్నాం. మలయకేతువు యజ్ఞాలు చేసేడు. వైదర్భి ఆతని ననుసరించియేయుంది అంటే భగవద్విజ్ఞాన వాసనలను జీవుడు అంటియున్నాడని అంతరార్థం చెప్పుకోవాలి. ఆ భగవద్విజ్ఞాన వాసనయే జీవునకు ఆత్మానుభూతి కల్గించి ముక్తిని చేకూర్చింది అన్నదే వైదర్భి చితిలోపడే సమయంలో బ్రాహ్మణుడు పూర్వ జన్మ వృత్తాంతం చెప్పేడన్న దానికి పురంజనుడు ముక్తిని పొందేడన్నదానికి అంత రార్థంగా చెప్పుకోవాలి. ఈ విధంగా జీవుడు పరమాత్మైక్యం పొందడమనే ఈ పురంజనోపాఖ్యానాన్ని నారదుడు ప్రాచీన బర్హికి చెప్పేడు.

నారదుడంటే జ్ఞానప్రదాతయగు గురువు అని లోగడ చెప్పుకొన్నాం ఆ గురువు ప్రత్యక్ష మాన గురువు కానక్కరలేదనీ, గ్రంథపఠన విజ్ఞానంగాని లేక ఏదైనా సంఘటనానుభవంగాని కూడ గురువే కావచ్చుననీ గ్రహించాలి

ప్రాచీన బర్హిం అంటే, సనాతనంనుండి అనగా అనాదినుండి వ్యాపించి యున్న ధర్మం అని అర్థం-ప్రాచీన=సనాతన కాలంనుండి అనగా అనాదినుండి, బర్హ=వ్యాపించియున్నది అనగా వేదధర్మం అని అర్థం. ప్రాచీన బర్హం కలవాడు ప్రాచీన బర్హి అనే పేరు కలవా డవుతాడు. అంటే వేదధర్మానుష్ఠానం కలవాడని అర్థం. ప్రాచీన బర్హికి నారదుడు జీవపరిభ్రమణంలో ముక్తినిపొందే విషయం చెప్పే డంటే వేదధర్మానుష్ఠానం కలవానికి జ్ఞానంవల్ల ముక్తి లభిస్తుంది అనేది గురువు సాధకులకు చెప్తాడు అని నారదుడు ప్రాచీన బర్హికి పురంజనోపాఖ్యానం చెప్పేడన్న దానిలోని అంతరార్థం.

ఈ కథలో మిగిలిన కథల్లో మోస్తరు ఆధ్యాత్మిక జ్ఞాన సాధనలతో నిమిత్తం లేకుండా కూడ, కర్మవాసనలవల్ల కల్గిన జన్మబంధాల్ని సత్కర్మలతోనే భేదించి తద్వారా పరమేశ్వరానుభూతితో కల్గిన జ్ఞానంతో ముక్తుడు కావచ్చుననే కర్మరహ స్యాన్ని వ్యాసమహర్షి తెల్పియున్నారు. చివరకు మాత్రం 'జ్ఞానాదేవతు కైవల్యం' అనే సూక్తి ప్రకారమే జ్ఞానంవల్లనే ముక్తి లభించినట్లు కూడ ఈ కథలో బ్రాహ్మణోప దేశంవల్ల తెలియజేయడం జరిగింది. కర్మ ప్రత్యక్షంగా కైవల్యాన్నీయలేదనీ, కర్మ ద్వారా జ్ఞానప్రాప్తి కల్గిన తర్వాతనే ముక్తి లభిస్తుందనీ జ్ఞాన ప్రాధాన్యాన్ని విడవ కుండానే కర్మకె ప్రాధాన్యం చూపించడంలో వ్యాసమహర్షి ఎంతో సాధకులకు కైవల్య సాధనకు అతి సులభోపాయాన్ని ఈ కథలో ప్రదర్శించడం మనం గమ నించదగిన చిత్రం.

అయితే ఈ కర్మయోగంలో ఒక చిక్కు మాత్రం వుంది. ఆ సంగతి కూడ ప్రాచీన బర్హికి నారదుడు చెప్తూన్నట్లు వ్యాసమహర్షి సాధకులను హెచ్చరిస్తూ ఈ విధంగా వ్రాసేరు.

శ్లో॥ క్షుత్పరీతో యథాదీనః
సారమేయో గృహం గృహం
చరన్ విందతి యత్ దిష్ఠం
దండ మోదన మేవ వా
తథా కామాశ యోజీవః
ఉచ్చావచ పథా భ్రమన్
ఉపర్యధో వామధ్యే వా
యాతి దిష్ఠం ప్రియా ప్రియం

శ్లో॥ యథాహి పురుషో భారం
శిరసా గురు ముద్వహన్
తం స్కంధేనస అధత్తే
తథా సర్వాః ప్రతిక్రియాః

శ్లో॥ నైకాంతతః ప్రతీకారః
కర్మణాం కర్మ కేవలం
ద్వయం హ్యా విద్యో పస్పృతం
స్వప్నం స్వప్న ఇవానఘ !

తా॥ ఆకలిచే బాధపడుతూన్న కుక్క దైన్యంగా ప్రతి ఇంటికి తిరుగుతూంటుంది. దాని అదృష్టం పండితే అన్నం దొరుకుతే తింటుంది లేకపోతే కర్ర దెబ్బలు తింటుంది. అల్లాగే కాంక్షలు గల జీవుడు ఉత్తమ కర్మలు చేస్తూన్నప్పుడు వాని అదృష్టంవల్ల ఆ ఉత్తమ కర్మలు మొదటి భాగంలోనో, మధ్యనో, చిట్టచివరో వాసనారహితంగా అంటే అసంగయోగంతో జరిగి, ముక్తి లభించనూవచ్చు. లేదా సంగంతో వాసనలు బలంగా అంటి జననమరణ పరిభ్రమణమూ కల్గవచ్చు.

నెత్తిమీద బరువు ఎక్కువై బాధ కల్గినప్పుడు మోపు మోసేవాడు ఆ బరువును భుజంమీదికి మార్చుకుంటాడు, బరువు నెత్తిమీదనుండి భుజానికి వచ్చి నెత్తిబాధ తగ్గిం

దన్న మాటేకాని అసలు బరువు బరువులాగే మోస్తాడు భారవాహకుడు. అల్లాగే దుష్కర్మల దుఃఖపరిణామం సత్కర్మలవల్ల కొంత తగ్గినట్లు కన్పించినా అసలు కర్మపరిణామఫలం మాత్రం యధాతథంగా జన్మలనిచ్చేదిగానే ఉండడంవల్ల కేవలం సత్కర్మాచరణం ముక్తినివ్వలేదని తాత్పర్యం.

కనుక కర్మవాసనలు పోవడానికి కేవలం కర్మలు మాత్రం ప్రత్యక్ష కారణాలు కావు. నిద్రలో ఒక కలలో కల్గిన దుఃఖం మెలకువరాగానే అసత్యమే అయినట్లు దుష్కర్మల్ని సత్కర్మలు పూర్తిగా నాశం చేస్తాయనడానికి వీల్లేదు. దుష్కర్మలూ సత్కర్మలూ రెండూకూడ సంగంతో చేసినపుడు అజ్ఞానంతో అనగా మాయతో చేసేవే అవుతాయి. కాన వానికి పూర్తి వాసనా నాశక శక్తి ప్రత్యక్షంగా ఉండదు. ఏదో మొదట్లోనో నడిమిలోనో చిట్టచివరనో ఆ సత్కర్మలవల్ల జ్ఞానోదయం కల్గితే అప్పుడు మాత్రం అవి పూర్తి వాసనా నాశన కారణాలై ముక్తి హేతువులూ అవుతాయి.

ఈ విధంగా నారదుడు ప్రాచీన బర్హికి చెప్పినట్లు వ్యాసమహర్షి కంఠోక్తిగానే 'జ్ఞానాదేవతు కైవల్యం' అనే సిద్ధాంతాన్ని సమర్థించేడుగా భావించాలి.

# అంతరార్థ భాగవతం

## పంచమ స్కంధం

## జడభరతోపాఖ్యానం

### ( అసంగయోగ సాధన )

భరతుడనే రాజు ప్రజాపాలనం ధర్మం తప్పకుండా నడిపించి రాజ్యాన్ని బిడ్డల కప్పగించి యెట్టి సంగం లేకుండా అడవియందు ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేస్తూ ముక్తికాముడై జీవిస్తూండేవాడు.

ఒకనాడా భరతుడు నదిలో స్నానం చేస్తూండగా హఠాత్తుగా సింహ ధ్వనికి భయపడి, జలం త్రాగడానికై వచ్చిన గర్భిణియగు లేడి కడుపు నుండి ఒక హరిణ శిశువు జారి జలంలో పడి తేలుతూండడం చూచేడు. వెంటనే భరతు డార్ద్ర హృదయంతో దానిని రక్షించి తన ఆశ్రమంలో పెంచి పెద్దదాన్ని చేశాడు. దాని

పెంపకంతో దాని మీద ఆతనికి విడవరాని మమకారం కలిగింది. దానిని విడిచి క్షణం కూడ ఉండలేకపోయేవాడు. దాని పోషణ పరిచర్యతో కాలం గడుపుతూ సమస్త ముక్తి హేతువులగు తపోధ్యానానిది నిష్ఠలను తృణప్రాయంగా విడిచివేశాడు.

ఒకనాడా లేడి అతణ్ణి విడిచి అడవిలోనికి పారిపోయింది. దానితో భరత మునికి మతి చలించింది. దాని విరహాన్ని భరించలేక ఆ హరిణార్భకాన్నే తలుస్తూ ప్రాణాలు విడిచేడు ఆ కారణంగా అతనికి మఱుచటి జన్మలో లేడి జన్మ సంప్రాప్తిం చింది. ఆ లేడి జన్మలో అతనికి పూర్వజన్మ జ్ఞానం వుంది. తన పూర్వ జన్మలో జరిగిన తప్పిదాన్ని గుర్తించి ఆ హరిణ జన్మలో సర్వము విడిచి రాలిపడిన పండు టాకులు మాత్రం తింటూ జీవనం గడిపి ప్రాణం విడిచేడు.

ఆ తర్వాత భరతుడు అంగీరసుడనే పేర బ్రాహ్మణునికి కొడుకై పుట్టేడు. అంగీరసునికి మొదటి భార్య యందు తొమ్మండుగురు కొడుకులు. రెండవ భార్య యందు ఒక పురుషుడు ఒక స్త్రీయు జన్మించేరు. ఆ రెండవ భార్య కుమారుడే భరతుడు. అంగీరసుడు చనిపోయేడు. భరతుడు మొదటి నుండి ప్రపంచ విరక్తుడై బధిర, జడ, మూక, ఉన్మత్తుకులాగు తిరుగుతూ వచ్చేడు. సవతిసోదరు లాతనిని నీతిగా చూడక ఆతనిని వ్యవసాయ క్షేత్రమునకు కావలిగాచుటకు నియమించేరు. భరతుడు భిక్షాటనంతో జీవిస్తూ, జడునివలె నుంటూ, ముక్తి నిష్ఠ విడువక జీవిస్తూ వచ్చేడు.

ఒకనాడు వృషలుడను రాజు సంతానకాముడై కాళికాదేవికి నర పశువును బలి యివ్వడానికి నిశ్చయించి దిక్కు మొక్కు లేని ఈ జడ భరతుణ్ణి తీసికొని వచ్చి కాళికి బలివ్వడానికి భృత్యులను నియోగించేడు. అంత జడ భరతుడు కాళియందు, చంప వచ్చిన భృత్యులందు, చంప నెత్తిన కత్తి యందు, తన యందు పరమాత్మ భావ నిష్ఠుడై నిలబడ్డాడు. అప్పుడు కాళి భరతుని చంపవచ్చిన భృత్యుల తలలను నరికి వేసింది. జడభరతుడు తిరిగి తన పొలంలో యథాస్థానానికి పోయి వీరాసనం మీద కూర్చుండి బ్రహ్మనిష్ఠుడై యుండిపోయేడు.

ఇట్లా వుండగా ఒకప్పుడు రాహూగణుడను రాజు కపిల మహర్షి యొద్దకు తత్త్వోపదేశం పొందడానికై పల్లకీ మీద వెళ్ళుతున్నాడు. అతని పల్లకీ భరతుడు చేను కావలి కాచుచున్న చోటు నుండి పోతూంది. పల్లకీని మోసే బోయీలు భరతుణ్ణి చూచి తమతో పల్లకీ మోయడానికి పనికి వస్తాడని బైటకు లాగి బోయిగా నియమించేరు.

భరతుని మనస్సు పరమాత్మతో కలిసిపోయి యున్న కారణం చేత సరిగా పల్లకీని మోయలేక తొట్రుపాటు అడుగులు వేస్తూ వచ్చేడు. రాజైన రాహూగణుడు ఆ సంగతి చూచి భరతుణ్ణి బోయీగా భావించి ఆతణ్ణి కసరి దుర్భాష లాడేడు.

అప్పుడు భరతుడు ఆ జన్మయే తన ఆఖరు జన్మ యగుట గుర్తించి అహంకార శూన్యుడై రాజునకు వేదాంత ధర్మాలు ఉపదేశించాడు. రాజాతనని క్షమాపణము వేడి ఆతనివల్ల సమస్త ముక్తిసాధనా క్రమాలు తెలిసికొని తరించేడు. తర్వాత భరతుడు ముక్తిని పొందేడు.

ఈ కథలో అంతరార్థం చెప్పవలసింది లేదు. ఈ కథ కర్మ వాసనలు ఎట్లు పరిణమిస్తాయో విప్పి చెప్పింది. పుణ్యకర్మలతో ముక్తిసాధనలు నడిపిన వారు కూడ చివరకు ఏదో ప్రబలమైన కర్మవాసనచే తిరిగి జన్మం పొందుతారనీ, మృగంగా పుట్టిన జన్మలో కూడ పూర్వజన్మ జ్ఞానంతో తరించడం జరుగుతూంటుందని, అసంగ యోగం ఒక్కటే కర్మవాసనలు నశింపు చేయగలదనీ, అసంగయోగం జీవితాంతం వరకూ నడిపినపుడు మరణకాలంలో జన్మవాసనలేవీ స్ఫురింపవనీ, అదే మోక్షహేతువనీ ముక్తిమార్గానికి అసంగయోగ ప్రాధాన్యాన్ని వివరించడమే ఈ కథాకల్పనకు కారణంగా గమనించాలి. అసంగయోగంవల్ల జ్ఞానావిర్భావమూ, జ్ఞానావిర్భావంవల్ల అసంగయోగమూ లభించడానికి పరస్పర కారణాలుగా తెలిసికొని అసంగంతో జ్ఞానాన్ని, జ్ఞానంతో అసంగతత్త్వాన్ని సాధకులు అలవరించుకోవాలి.

భరతుడంటే జీవుడు. 'భరత' అంటే బరువు యొక్క భావం అని అర్థం. భారం వహించడం అన్నమాట. 'భరత'కలవాడు భరతుడు అవుతాడు. వాసనాభారం వహించిన జీవుడు ఇచ్చట భరతుడుగా చెప్పబడ్డాడు భరతుడు రెండు మనుష్య జన్మలలోను భరతుడుగానే పేరు పెట్టబడ్డాడు దానినిబట్టి భరత శబ్దానికి అంతరార్థం వుందనీ, వాసనాభారం వహించే జీవుడని దానికి అంతరార్థమనీ తెలిసికోవాలి. రెండవజన్మలో అంగిరసుడు అనేవాడు భరతుని తండ్రి అంగము అనేదే స్వార్థంలో అణ్ ప్రత్యయం చేస్తే దేహము అనే అర్థంలో ఆంగము అవుతుంది. ఆంగము అంటే దేహం అన్న మాట. ఆంగము కలది 'ఆంగ్లి' అని అవుతుంది. 'రసం' అంటే జన్మనిచ్చే వాసన అని అర్థం వుంది కాన దేహధారణకు కారణరూపమైన వాసనయే అంగిరసుడంటే. ఆ వాసనా రూపం వల్లనే జీవుడు పుట్టేడు. అతడే భరతుడనే అంతరార్థం ఇందు

వస్తుంది. అదే అంగిరసుని పుత్రుడు భరతుడన్న కథా వాక్యానికి అర్థంగా భావించాలి.

అంగిరసునకు ఇద్దరు భార్యలు. అనగా అపరాశక్తి, పరాశక్తి. వాసనలు రెండురకాలు. తిరిగి తిరిగి జన్మనిచ్చేవి ఒక రకం వాసనలు అవి అపరాశక్తివి. ముక్తినిచ్చే సత్కర్మవాసనలు మరొక రకం అవి పరాశక్తివి. మొదటిది ప్రవృత్తి మార్గం కలది. రెండవది నివృత్తిమార్గం కలది. అంగిరసునికి మొదటి భార్యవల్ల తొమ్మండుగురు బిడ్డలు కల్గేరు. అంటే అపరాశక్తివల్ల * నవవిధములైన రసములు పుట్టే యన్నమాట. అవే కర్మవాసనా ప్రాబల్యం కల్గి 'పునరపి జననం పునరపి మరణం' కల జన్మ పరిభ్రమణం ఇచ్చే నవరసాల కర్మలు. అవి అపరాశక్తి యొక్క ప్రవృత్తి మార్గం వల్లనే కల్గుతాయనేదే అంగిరసునికి ప్రథమ భార్యయందు తొమ్మండుగురు కొడుకులు పుట్టేరన్న దాని అంతరార్థంగా భావించవచ్చు. అంగిరసుని రెండవ భార్య అనగా పరాశక్తి యొక్క మార్గం వెంటనే ఆ జన్మలోనే ముక్తి నివ్వగల సత్కర్మ వాసనలు దానివల్ల ఫలిస్తాయి. ఆమెవల్ల పురుషుడు స్త్రీ పుట్టేరు. పురుషుడు అంటే జీవుని తనలోనికి చేర్చుకొనే పరమాత్మ. స్త్రీ అంటే ఆ పరమాత్మ వుండడానికి కారణమైన జీవునియొక్క సాత్త్వికగుణ ప్రకృతి అని అంతరార్థం. ప్రకృతి పురుష వివేకంతో ఆ జన్మలో సత్కర్మవాసనా నాశం కల్గి ముక్తి లభిస్తుందని చెప్పడానికే ముక్తి నొందవలసిన భరతుడు అంగిరసుని రెండవ భార్యకు అనగా పరాశక్తికి పుత్రుడుగా పుట్టేడని చెప్పడం జరిగింది. అంగిరసుని మొదటిభార్య బిడ్డలు భరతుని ఆదరింపలేదని చెప్పడం, అపరాశక్తికి సంభవించిన ఐహికములైన వాసనలేవీ భరతుణ్ణి అంటియుండలేదని చెప్పడమే అని భావించాలి.

ఈ విధమైన అంతరార్థమే లేకపోతే అంగిరసుడనే పేరుగల, ఆతనికి ఇద్దరు భార్యలున్నారని చెప్పడం, మొదటి భార్యకు తొమ్మండుగురు కొడుకులని చెప్పడం ఇవన్నీ బాహ్యార్థంలో అవసరమైనవి కావు. కథలో చెప్పవలసిన పనియేమీ లేదు. వ్యర్థంగా వ్యాసుడు చరిత్రపరంగా చెప్పేడనడం అవివేకమూలమే అవుతుంది. పైగా ఇది చరిత్ర అనడం పొసగేది కాదుకూడ.

---

* 1. శృంగారం 2. హాస్యం 3. వీరం 4. కరుణ 5. భయానకం 6. రౌద్రం 7. అద్భుతం 8. భీభత్సం 9. శోకం.

షష్ఠ స్కంధం

# అజామీళోపాఖ్యానం

(పశ్చాత్తాప స్మరణ సాధన)

పూర్వం అజామీళుడనే బ్రాహ్మణు డొకడుండేవాడు. ఆతడు చేయని పాప కార్యం లేదు. ఆతనికి కులటయను దాసీ భార్య. ఆమెవల్ల పదిమంది బిడ్డల్ని కన్నాడు. అతనికి భార్యా బిడ్డలపైగల మమకార మింతింత యనరానిది. కాలక్రమంలో ఆతడు ముసలివాడయ్యేడు. రోగంతో మంచం పట్టేడు. ఆతని ఆఖరు కొడుకు పేరు నారాయణుడు. అతనినే పిలుస్తూ ఆతని చేతనే అన్ని పనులు చేయించుకుంటూ నిత్యం అతణ్ణి తనవెంట నుండేటట్లు చేసికొన్నాడు. చిట్టచివరకు అజామీళుడికి మరణ కాలం ఆసన్నమైంది. ఆతని భార్యకూడ ముసలిదైంది. ఆమె కూడ నారాయణుని చేతనే సేవలు చేయించుకుంటూ వుంది. అంత్యకాలంలో మృత్యుభటులు ముగ్గురు అజామీళుని చుట్టుముట్టేరు. వారి భయంకర వికార చేష్టలు చూచి అజామీళుడు భయ భ్రాంతుడై భయనివారణకై 'నారాయణా'! 'నారాయణా'! 'నారాయణా'! అని ముమ్మారు ఆక్రోశించేడు.

ఆ 'నారాయణా' అనే ఆక్రందనధ్వని విష్ణు లోకంలోని విష్ణుదూతల చెవులకు సోకింది. వారు తమ ప్రభువు నెవరో భక్తుడు పిలుస్తున్నాడని వెంటనే అజామీళు నింట్లో చేరుకొన్నారు. చుట్టుముట్టియున్న యమకింకరుల్ని త్రోసివేసి అజామీళుణ్ణి వారు తమ వశం చేసికొని విమానం ఎక్కించి వైకుంఠానికి తీసికొని పోసాగేరు.

యమభటులు, అజామీళుడు చేసిన పాపకృత్యాలు చెప్పి ఆ పాప ఫలితంగా శిక్షల్ననుభవించడానికి తమలోకానికి తీసికొని పోవడానికై వచ్చేమని అడ్డు తగి లేరు. విష్ణుకింకరులు వారికి అజామీళుని బాల్యకథ ఈ విధంగా చెప్పి ఆతడు తమ లోకానికే రాదగ్గ అర్హత వాడని నిరూపణం చేశారు.

"ఈ అజామీళుడు కోటి బ్రాహ్మణ జన్మలెత్తి పుణ్యాలు చేసినవాడే. కాని ఆతనికి ఏ జన్మలోనూ అంత్యకాలంలో జ్ఞానప్రాప్తి వాసన యొక్క సంబంధం లేకుండా పోయిన కారణంచేత ముక్తి రాలేదు. ఈ జన్మలో కూడ అతడు యౌవ నారంభం వరకు వేదాధ్యయనాది సత్కర్మలతోనే జీవించేడు. ఎన్నో పుణ్యవ్రతాలూ చేశాడు. యౌవనారంభదశలో అడవికి సమిధలు తెచ్చుకొనడానికై పోయి అక్కడ

ఒక స్త్రీని తగులుకొన్నాడు. ఎన్ని జన్మలలో ఎన్ని పుణ్యకార్యాలు చేసినా ఆతనిలో కామవాంఛ పోనేలేదు. ఆకారణంగా ఆ కులహీన స్త్రీకి వశుడై సమస్త బ్రాహ్మణ కృత్యాలూ విడిచివైచేడు. ఆమెతో పదిమంది పుత్రులను పొందేడు. ఆతని చివరి పుత్రుడికి నారాయణుడనే పేరు పెట్టుకొన్నాడు. ఆతడు ముసలితనంలో నారాయణుని విడువనే లేదు.

ఆకాలంలో ఆతనికి పూర్వకాలంలో తాను చేసిన సత్కార్యాలు గుర్తుకు వచ్చి తర్వాత జరిగిన దుర్వృత్తికి తీరని పశ్చాత్తాప వ్యథని పొందేడు. ముక్తికై ఆరాటపడ్డాడు. ఆ పశ్చాత్తాపంతో ఆతనిలోని వాసనలన్నీ దగ్ధమైపోయాయి. అంత్యకాలంలో జ్ఞానోదయమైంది. ఇప్పుడు భగవచ్చింతతోనే వుండి నారాయణ నామస్మరణంతో మరణించేడు. అందుచేత ఆతడు మా విష్ణులోకానికి రావడానికి అర్హుడు. ఇది ధర్మసూక్ష్మం అని విష్ణుకింకరులు చెప్పి అజామీళుణ్ణి వైకుంఠానికి తీసికొనిపోయేరు.

పూర్వం చెప్పిన పురంజనోపాఖ్యానంలోను, జడభరతోపాఖ్యానంలోను ఒక జన్మలోని సంస్కారం మరొక జన్మలో ఉద్బుద్ధమై జ్ఞానప్రాప్తి నొంది ముక్తిని పొందిన సంగతి వ్యాసభగవానుడు అంతరార్థపరంగా చెప్పేడు. ఇప్పుడు ఒకే జన్మలో మొదటి దశలోని పుణ్య వాసనాసంస్కారం రెండవదశలోనే ఉద్బుద్ధమై పశ్చాత్తాపాగ్ని చేత యావద్వాసనా నాశనమూ జరిగి ప్రాణోత్క్రమణకాలంలో జ్ఞానోదయమై ముక్తిని పొందిన కథగా ఈ అజామీళోపాఖ్యానం చెప్పేడు.

అజామీళుడు అంటే అజ+అమీళుడు అని విడదీస్తే

'నజాయతే ఇతి అజః.' అజ=పుట్టుకలేని అనగా అథవ్రుడైన పరమాత్మను గూర్చి అమీళుడు=కన్నులు మూసికొననివాడు అనగా ఇష్టము కలవాడని అర్థం. మీలనము అంటే కన్నులు మూసికొనుట, 'మీలః' అంటే కన్నులు మూసికొన్న వాడు, అమీలః అంటే కన్నులు మూసికొననివాడు, కన్నులు మూసికొనడంఅంటే తెలిసికొన నిష్టం లేకపోవడం, అమీలుడు అంటే తెలిసికొనుట యందు ఇష్టత కలవాడు అనేది అర్థం. ఇప్పుడు అజ+అమీలుడు అనగా అనాదియైన పరమాత్మను తెలిసికొనుట యందు ఆసక్తి కలవాడు అనగా జీవుడు అని అజామీళ పదానికి అంతరార్థపరంగా అర్థం చెప్పవలసివుంది. పరమాత్మనే చేరుకోవాలనే తపన జీవాత్మకు సహజంగానే వుంటుంది. అట్టి ముక్తి సంస్కారంగల అజామీళుడు ఇక్కడ సాధకుడు. ఆతడు బ్రాహ్మణుడు. అంటే, "బ్రహ్మనయతి ఇతి బ్రాహ్మణః" అనే వ్యుత్పత్త్యర్థంలో బ్రహ్మను అనగా పరమాత్మను పొందేవాడు అని అర్థం. బ్రహ్మను పొందే సాధకుడు

ఇక్కడ అజామీళుడన్న అర్థం. ఆతడు బ్రాహ్మణుడని చెప్పడంలోనే వుంది. అతడు కులటయగు దాసీనివరించేదు కు+అట=కులట. (కులే అటతి అనేవ్యుత్పత్తిలోకులటా) అనేది పరరూప సంధిరూపం అవుతుంది. "కు" అనేదానికి భూమి అని అర్థం, 'ల' అంటే "లాతి గృహ్ణాతి ఇతిః' అవుతుంది. ఈవిధంగా భూసంబంధమైన అనగా ఐహికమైన వాసనలను, గ్రహించు మనోవృత్తికి 'కులం' అన్న పదం సార్థకమౌతుంది. 'కులే అటతి ఇతికులటే' అనగా భూసంబంధమైన వాసనలందుకు తిరుగు వద్ది ఐహికమనోవృత్తి కులటా పదానికి అంతరార్థంగా చెప్పాలి. అది 'దాసీ' గా చెప్పబడింది. భగవద్దాసవృత్తికే దాసీ అని పేరుకు ఇక్కడ అర్థం భూసంబంధమైన వాసనలయందున్నా భగవంతుని సేవించే భావంకూడా కల్గివున్న మానసిక వృత్తికే కులటయగు దాసీ అన్నపదానికి అంతరార్థంగా గ్రహించాలి. అజామీళుడు అనగా పరమాత్మను విడవకుండా ఉండే సాధకుడు వాసనావశంవల్ల ఐహిక భోగలంపటనలో చిక్కుకొన్నాడనీ, అయినా భగవద్ధ్యాస వృత్తిమానలేదనీ అజామీళుడు కులటయైన దాసీతో మదనాతుడై వున్నాడన్నదాని అంతరార్థం.

ఆతనికి పదిమంది పుత్రులు అంటే నవద్వారాలు+మనస్సుమొత్తం పది ఇంద్రియాలు ఆతనిని ఆశ్రయించి వున్నాయన్నమాట నారాయణుడు చిన్నవాడు ఆఖరివాడు. 'నారం అయనం యస్యసః, నారాయణః,' అనే వ్యుత్పత్తి చెప్తే, నారం= జ్ఞానం, ఆయనం అనగా స్థానముగా గలవాడు, నారాయణుడు, జ్ఞానస్వరూపుడని దాని అర్థం. అజామీళుని దశేంద్రియాల్లో ఆఖరుది మనస్సు అని అంతరార్థపరంగా చెప్పుకొన్నప్పుడు అది నారాయణ నామం గలది. అంటే ఆ మనస్సు జ్ఞానస్థానకారణమైనది అన్నమాట. నారాయణుడు చిన్నవాడు ఆఖరువాడు అంటే ఆ సాధకునిలో మనస్సునకు గల జ్ఞానం చిన్న దీపకళికలాగ అల్పంగానే వెలుగుతూ వుందనీ, అది మిగిలిన చక్షురాది నవద్వారాల వాసనల ముందు పని చేయలేకపోయినా, నాశంమాత్రం కాకుండా అంత్యకాలంలో ప్రత్యక్షమై సర్వవాసనలను పశ్చాత్తాపాగ్నిలో దగ్ధం చేయించి సాధకునికి ముక్తిని సాధించిందనీ అంతరార్థపరంగా, ఆఖరుదశలో అజామీళుడు నారాయణ స్మరణతో ముక్తిని పొందేడన్న కథాభాగానికి అంతరార్థం గ్రహించాలి. అజామీళునకు చివరదశలో యమభటులు ముగ్గురు తీసికొనిపోవడానికి వచ్చేరు అంటే- యమము అనగా అంతరింద్రియ నిగ్రహం, భటులనగా చెప్పేపని చేసేకింకరులు. వారు ముగ్గురు అనగా సత్త్వరజస్తమోగుణాలకు సంబంధించినవారు, అంటే— అంత్యకాలంలో జ్ఞానదీప్తి కల్గినప్పుడు సాధకునిలో జన్మనిచ్చే సత్త్వరజస్తమోగుణాలు

మూడూ నిగ్రహముతో వుంటాయని, ఆ కారణం చేతనే వాసనా నాశనం కల్గి ముక్తి చేకూరుతుందనీ పై కథాంశానికి అంతరార్థపరమైన రహస్యం గుర్తించాలి. ఈవిధంగా సాధకుడు ఒకే జన్మలో మొదట్లో సత్ప్రవర్తకుడైతే తర్వాత భ్రష్టుడైనా చివరకు పశ్చాత్తాపంతో ముక్తుడు కావచ్చుననీ ఈ కథ అంతరార్థపరంగా చెప్తూంది.

# చిత్రకేతూపాఖ్యానం

## (మంత్రయైక్యసాధన)

పూర్వం చిత్రకేతుడనే రాజుండేవాడు. అతనికి కోటిమంది భార్యలున్నారు. కాని ఎవ్వరియందు కూడ అతనికి సంతతి కలుగనేలేదు. ఆతనియొద్ద కొకనాడు అంగిరసుడను మునివచ్చి పుత్రలాభమ్మునకై పుత్రకామేష్టి చేయించి యజ్ఞశేషమున ఆతని పట్టమహిషియగు కృతద్యుతి అను నామెకివ్వడం వల్ల పుత్రోదయం జరిగింది.

చిత్రకేతువు ఆ పుత్రుని మీద మోహాతిశయంతో పట్టమహిషియైన కృతద్యుతి యింటిలోనే నివాసం ఉంటూ వచ్చేడు. అందువల్ల మిగిలిన భార్యలు ఈర్ష్యాగ్రస్తురాండ్రై ఆ పుత్రుడికి విషమిచ్చి చంపివేశారు.

రాజదంపతులు బాలుని మృతదేహం వీడలేక ఆతనిపైబడి ఘోరమని ఏడ్వసాగేరు. అంతట అంగిరసుడు నారదునితో కలసి అక్కడకు వచ్చేడు. నారదుడు చిత్రకేతునకు ఉపనిషదర్థం బోధించేడు. మృతశిశువు చేత పరకాయ ప్రవేశం చేయించి ఆతనిచేత కూడ చిత్రకేతునకు విరక్తి మార్గాన్ని ఉపదేశింపజేశాడు. తర్వాత నారదుడు "సప్తరాత్రులు గడిస్తే నీవు భగవంతుని చేరుకొంటా"వని చెప్పి ఒక మంత్రాన్ని చిత్రకేతువు కుపదేశించేడు.

చిత్రకేతువు నారదోపదిష్టమైన మంత్రాన్ని సప్తరాత్రులూ దీక్షగా జపంచేసేడు. అంత విష్ణువాతనికి ప్రత్యక్షమైనాడు. నాటినుండి చిత్రకేతువు అపారమైన విష్ణుభక్తి కలిగి సంకీర్తనాదులు చేస్తు రాజ్యపాలనం చేస్తున్నాడు. ఒకనాడు చిత్రకేతువు కైలాసానికి వెళ్ళేడు. బ్రహ్మాది దేవతలతోను, నారదాది మునులతోను పరివేష్టించి, గౌరిని దేహంలో భాగంగా కౌగలించుకొని కూర్చుండిన మహాదేవుణ్ణి జూచి పకపక నవ్వి స్త్రీని కౌగలించుకొని సిగ్గులేక సభలో అవిష్టుడై నాడని అపహాస్యం చేశాడు. నారద బ్రహ్మాదులు శివుణ్ణి హర్షిస్తూన్నందుకు వారినికూడ నిందించేడు. అంత గౌరి వానిని

చూచి కోపించి నీవు 'అధః పాపేయ సలయోనిం ఆ సురీంయాహి దుర్మతే' ఓ దుర్మార్గుడా! నీవు నీచమైన అసురగర్భాన్ని పుట్టుతావని చిత్రకేతుని శపించింది. అది విని చిత్రకేతువు ప్రశాంతంగా గౌరిని చూచి 'విష్ణుభక్తులు శాపకోపాదులు సమ చిత్తంతో జూస్తారు కావున నీ శాపానికి నేను భయపడడంలేదు గాని నీకు కోపంబు తెప్పించిన నా అజ్ఞతకు నొచ్చుకొన్నానని సాష్టాంగపడి వినయోక్తులు పలికి ఆమెను కోపాన్నుండి తేర్చి ప్రశాంతచిత్తనుగా చేసి వెళ్ళిపోయేడు.

తర్వాత ఈశ్వరుడు గౌరికి చిత్రకేతునిలోని విష్ణుతత్త్వాన్ని వివరించి చెప్పి తానుకూడ నిరంతరమూ విష్ణుభక్తుడుగానే వుండుటను తెలియజేసి, "చిత్రకేతువు ప్రతిశాప మీయదానికి శక్తిగలవాడైనా కూడ తనలోపాన్ని తాను గుర్తించి నిన్ను ప్రశాంత పరిచిన చందం మెచ్చుకోదగివుంది" అని విశదీకరించేడు.

తర్వాత చిత్రకేతువు వృత్రాసురుడై పుట్టేడు. ఈ చిత్రకేతూపాఖ్యానాన్ని విన్నవారూ, చదివినవారూ సకలదుఃఖాలు పోయి, సకల సుఖాలు అనుభవిస్తారని ఫల శ్రుతితో వ్యాసుడీ కథ ముగించేడు.

ఈ కథలో చిత్రకేతునకు కోటిమంది భార్యలని చెప్పడం వల్లనే కథ చాలా అసత్యంగా తోస్తూవుంది. అతని పట్టమహిషి పేరు కృతద్యుతి. ఈ పేరు ఏదో అవ సరంగా పెట్టబడినట్లు కనిపిస్తూంది.

రెండవ అసంబద్ధమైన విషయం చిత్రకేతువు ఈశ్వరుణ్ణి దూషించడం, పార్వతి శపించడం; ఈశ్వరుడు చిత్రకేతువును కొనియాడడం అనేవి కూడ అసంగ తాలుగానే కన్పిస్తాయి. మనుష్యుడు సజీవంగా శివలోకం వెళ్ళడమూ విష్ణుభక్తుడైన మనుష్యుడు పరమేశ్వరుణ్ణి అపహసించే మనోదార్ఢ్యం పొందడమూ, పార్వతి వంటి మహాతల్లికికూడ కోపం రావడమూ, శపించడమూ ఇవన్నీ అసందర్భాలే. ముఖ్యంగా పరమేశ్వరుడు తన్ను అపహసించినవాణ్ణి గూర్చి తన భార్యతో గొప్పగా సమర్థిం చడం అనేది మరీ అసందర్భంగా వుంది. ఈ కథ చదివినా, విన్నా పాపాలు పోతా యనడం ఏమిటి? ఇందులో ఏముంది. విశ్వాస జనకమైన మాటగా ఇది కన్పించదు. ఈ అసంగత విషయాలు, పాపనాశనం కల్గిస్తాయన్న వ్యాసమహర్షి ప్రతిజ్ఞా వాక్యం ఆధారంగా ఆలోచించి చూస్తే ఈ కథలో పాపనాశనం కల్గించే అంతరార్థం నిక్షే పింపబడివుండి వుండాలని అనిపిస్తూంది. ఇందున్న ఆ అంతరార్థం ఏమిటో వివ రిస్తాను.

చిత్రకేతువు అన్న మాట. చిత్+త్ర+కేతువు అని విడదీసి చిత్త్రికేతువుగా ఆ పదాన్ని తెలిసికోవాలి. 'చిత్' అంటే జ్ఞానం 'త్ర' అంటే రక్షించునట్టి, కేతువు=జెండా కలవాడు అనగా బిరుదు కలవాడు ముఖ్యుడు అని వ్యుత్పత్త్యర్థంలో జ్ఞానాన్ని రక్షించేవారిలో ప్రధానుడు చిత్త్రికేతువు అని అర్థాన్ని తెలుసుకోవచ్చు. జ్ఞానాన్ని రక్షించి తద్వారా తరించాలనే తపనగల జీవుడు ఈ కథలో సాధకుడుగా చెప్పడమే చిత్త్రికేతువనే రాజున్నాడన్న వాక్యానికి అంతరార్థం భావించాలి. ఆతనికి కోటిమంది భార్యలు అంటే భార్య అన్న దానికి భరింపదగినది అని అర్థం కోటి అనగా లెక్కింప శక్యంకాని సంఖ్య అని అర్థం లెక్కింప శక్యంకాని ఐహిక మనోవ్యాపారాలే చిత్రకేతుని కోటిమందిభార్యలంటే అందగ్రమహిషి పేరు కృతద్యుతి కృతద్యుతి అంటే చేయబడిన ప్రకాశం కలది అనగా సత్కర్మలచేత పొందబడిన సాధకునిలోని జ్ఞానం ఆ అసంఖ్యాక మనోవృత్తులపై అధికారం చెలాయించే పట్టపురాణి అన్న మాట.

ఆతనికి ఏ భార్యయందునుకూడ సంతతి కలుగలేదు అంటే అన్నిరకాల ఐహిక మనోవృత్తులు తనలో నున్నప్పటికీ జ్ఞానాన్ని రక్షించుకోవడంలో ముఖ్యుడు కావడంవల్ల సాధకునకు ఆ ఐహిక మనోవృత్తులు ఏవీకూడ పునర్జన్మ వాసనను కల్గించనేలేదు అనే అంతరార్థం ఇచ్చట చెప్పాలి కృతద్యుతి అన్ని వృత్తులను మించిన జ్ఞానవృత్తి కావడంవల్ల మిగిలిన అసంఖ్యాకములైన ఐహిక వృత్తులలోని తామసగుణ ప్రాబల్యం అణగిపోయి వుందనీ, ఆ కారణంగా కృతద్యుతిని అగ్రమహిషిగా చెప్పబడిందనీ అంత రార్థపరంగా చెప్పాలి.

అంగిరసుడు వచ్చి యజ్ఞం చేయించేడు. అప్పుడు పుత్త్రుడు పుట్టేడు. అంగిరసుడు అంటే - శరీరమందలి వాసనాస్వరూపం అన్నమాట. అంగి అంటే అంగములు కలది. శరీరం, రసం అంటే వాసన యజ్ఞం అంటే యద్+జ్ఞ అనే వ్యుత్పత్తి ప్రదర్శనంలో, యత్=ఏదో అనగా నిర్ణయింపశక్యంకాని అనిర్వాచ్య పరమాత్మను, జ్ఞ=తెలిసికోవడం అని అర్థం - ఈ విధంగా పరమాత్మాన్వేషణా జ్ఞానం యజ్ఞపదానికి అంతరార్థం. పుత్+త్ర=పుత్త్రి అవుతోంది 'పుత్' అంటే నరకంనుండి, త్ర=రక్షించేది అనేది పుత్త్రి పదానికి అర్థం. అదే మోక్షేచ్ఛ అని అంతరార్థపరంగా అర్థం.

దేహంలోని వాసనాశంవల్ల చిత్త్రికేతువుకు కృతద్యుతి వల్ల పుత్రుడు పుట్టేడు. జ్ఞానంచేత తరించాలనే తపనగల సాధకుడైన జీవునకు వాసనానాశంచే ఆతనిలోని జ్ఞాన

ప్రకాశశక్తి మోహేచ్ఛ జనించింది అనే అంతరార్థం అంగిరసునివల్ల యజ్ఞంద్వారా కృతద్యుతి చిత్రకేతువులకు పుత్రలాభం కల్గిందన్నదాని అంతరార్థంగా మనం గ్రహించవచ్చు.

తర్వాత కోటిమంది భార్యలూ కలసి చిత్రకేతువు తమ్మాదరించుట లేదని ఆతని పుత్రుణ్ణి చంపేశారు. అంటే మోహేచ్ఛతో జ్ఞానదీప్తిని విడువకుండుటచే మిగిలిన ఐహిక వృత్తులవైపు సాధకుడగు జీవుడు ఉపేక్ష వహించిన కారణంచేత ఆతనిలోని ఐహిక వృత్తులన్నీ తమకు అడ్డుగా వున్న సాధకునిలోని మోహేచ్ఛను నాశం చేసేయి అనే అర్థంపై పుత్రవిధ్వంస కథా భాగానికి అంతరార్థం.

సాధకునిలోని మోహేచ్ఛను సాధకునిలోని ఐహిక ప్రవృత్తులు ధ్వంసం చేస్తాయనే సాధనా విఘ్నకార్య రహస్యం అవసరంగా ఇచ్చట చెప్పబడిందనాలి.

తర్వాత నారదుడు వచ్చాడు. వైరాగ్యోపదేశం చేసి, తరించడానికై సప్తరాత్ర జపదీక్షతో మంత్రాన్నిచ్చేడు. అంటే–నారదుడంటే జ్ఞానోపదేష్టయైన గురువని లోగడ పెక్కుసార్లు చెప్పుకొన్నాం. మంత్రం అంటే భగవంతుని గూర్చిన ఆలోచన, జపం అంటే అర్థభావనం చేయడం. సప్తరాత్రులంటే సప్తధాతువుల్లో నున్న తామసిక లక్షణాలు అని అర్థం. సప్తరాత్ర జపదీక్ష అంటే సప్తధాతువులందు గల తామసిక శక్తులను మంత్రం యొక్క అర్థ భావనతో నాశం చేసి జ్ఞానసిద్ధిని పొందడం అన్నది అర్థం. ఈ విధంగా చిత్రకేతువు గురూపదేశంతో సప్తరాత్ర జపదీక్ష జరిపి మంత్రసిద్ధి పొందేడు. ఆ మంత్రం సగుణారాధనా మంత్రం అయి వుంటుంది. కనుకనే సాధకునకు విష్ణువుపైనే భక్తి కుదిరి శివుడు, పార్వతి కలిసి వుండడం ప్రకృతి పురుషుల ఐక్యానుసంధానంగా తెలియలేక విష్ణువందనార్చాస్యాదులతోను విష్ణు పాదమ్యే అంటే సామాన్యముక్తిని పొందగల్గేడు

ఆతడు ఒకప్పుడు శివుడు శక్తిని కౌగలించుకొని ఏకశరీరుడై వుండడం చూచి శివుణ్ణి అపహాస్యం చేశేడు అంటే సగుణంలోని ద్వైత భావనతోనే సిద్ధుడైన సాధకుడు నిర్గుణ అద్వైతాన్ని భావించలేక అద్వైతాన్ని కాదన్నాడన్నమాట. అందుచేతనే ఆతనికి అసురభావం సిద్ధించింది. సురభావం కానిది అసురభావం అవుతుంది. 'సు'=సుగతిని అనగా మోక్షమును, 'ర'=గ్రహించు భావము సురభావానికి అర్థం. అది కానిది అసురభావం అంటే మోక్షాన్ని గ్రహించలేని భావాన్ని పొందుతావని పార్వతి ఇచ్చిన నీచాసురయోనిలో పుట్టావన్న శాపానికి అర్థం అంటే

సగుణ భావనతో ద్వైతారాధనలో మోక్షం లభించదని సాధకులకు చేసే ఒక హెచ్చరికగా ఈ పార్వతీ శాపకల్పనకు అంతరార్థం చెప్పాలి.

సగుణంతో ద్వైతుడైన చిత్రకేతువునకు పుత్రమరణం సంభవించడమనే దానికి ద్వైతంలో సాయుజ్యముక్తి లేదు కాన మోక్షేచ్ఛ అనే అర్థంగల పుత్రశబ్దం అచ్చట ఉండడానికి అవకాశం లేదనే అంతరార్థం కూడ చెప్పుకోవచ్చు. ఈ యర్థం స్ఫురించాలనే చిత్రకేతువునకు పుత్రమరణం వ్యాసమహర్షి కావాలనే చెప్పేడు. లేక పోతే నారదుడు పుత్రుని బ్రతికించడానికి శక్తి లేనివాడు కాదు. ఎన్నోచోట్ల నారదుడు పుత్రుల్ని బ్రతికించినట్లు ఉదాహరణ లున్నాయి కూడ.

చిత్రకేతువు పార్వతి శాపానికి భయపడలేదు అంటే సగుణ ద్వైతంలో కూడ జ్ఞానోదయం చిట్టచివరకు కల్గి సారూప్యముక్తితో తరించవచ్చుననే విశిష్టాద్వైత పరమార్థం కూడ ఇందు అంతరార్థపరంగా చెప్పబడిందిగా గ్రహించాలి. తిరిగి పార్వతిపై కోపించక ఆమెను ప్రశాంత చిత్తురాలిగా జేసి చిత్రకేతువు వెళ్ళిపోయేడు. అంటే సగుణంలోని ద్వైత విశిష్టా సిద్ధాంతాలు అద్వైతులు చెప్పే మోక్షాన్ని తృణీకరించరనీ, అలాగని తమ సగుణంమీద విశ్వాసం వారికి ఇసుమంత కూడ వదల వలసిన అవసరం లేదనీ మతత్రయ సామరస్యం ఇచ్చట వ్యాసమహర్షి వివరించేదని చెప్పక తప్పదు. తర్వాత పార్వతితో శివుడు తాను విష్ణుభక్తుడనయి యున్నానని చెప్పడం ద్వైతంలోని విశిష్టభక్తి సిద్ధాంతానికి ముక్తి రాకపోదనీ, విష్ణువంటే సర్వ వ్యాపకుడనే అర్థమూ, భక్తుడు అంటే సర్వవ్యాపక పరమాత్మ సిద్ధాంతంతో కలిసి వుండే మనో వృత్తి వాడనీ, సర్వం ఖల్విదం బ్రహ్మ అనే అద్వైత సాధన అవుతుందనీ, ఈ విధంగా విష్ణుభక్తి అన్నా అద్వైతం అన్నా ఒకటే అర్థమనీ విశదం చేసినాడు వ్యాస భగవానుడు. ఈ విధంగా అద్వైతుల సాయుజ్యముక్తినీ, విశిష్టాద్వైతుల సరూప్య ముక్తినీ అభేదంగా చెప్పి ఈ కథ ద్వైతాద్వైవిశిష్టాద్వైత సమన్వయాన్ని చెప్తూన్న కారణంచేత విన్నవారూ చదివినవారూ పాపాలనుండి విముక్తి పొందుతారని ఫలశ్రుతితో ముగింపబడిందిగా అంతరార్థ సారాంశం మనం గ్రహించక తప్పదు.

చిత్రకేతువు పార్వతి శాపంవల్ల వృత్రాసురుడై పుట్టి ఇంద్ర పట్టణాన్ని ఆవరించేడు. వృతము అంటే ఆవరించునది అనగా మాయ అని అర్థం. ఇంద్రుడు

అంటే మనస్సు అని పరమాత్మ అనీ కూడ అర్థాలున్నాయి. మనస్సును, లేక పరమాత్మను మాయ ఆవరించి వుంటుంది అనే మాయావాద ప్రాధాన్యతగల అద్వైత సిద్ధాంతాన్ని చెప్తూందిగా కూడ మనం వృత్రాసురజన్మకు అంతరార్థం చెప్పడం సముచితంగానే వుంటుంది. సగుణంలో ద్వైతులు కూడ విష్ణువును మాయ ఆవరించి వుంటుందని చెప్తూనే వున్నారు. మాయయే ప్రకృతి అదియే శివవామార్ధమైన శక్తి. శక్తి లేని శివుడు లేడు. శివుడు లేనిదే శక్తి లేదు. అట్లే మాయావరణంలేని విష్ణువు గాని, విష్ణుపరీతలతాని మాయగాని లేదు. ఇది ప్రకృతి పురుషుల కలయిక. వ్యావహారికంలో జగత్తు సత్యం, పరమార్థకంలో జగత్తు మిథ్య అద్వైతం ద్వైతం ఈ విధంగా పొత్తుగల్గనీక వృత్రాసురుని పూర్వజన్మ చరిత్ర అనగా విష్ణుభక్తుడైన చిత్రకేతుకథను స్మరిస్తే పాపాలు పోతాయంటే సగుణా రాధనా ఫలితంగా పాపాలూ పోతాయి అన్నాడే కాని ముక్తి వస్తుంది అని ఫలశ్రుతిలో అనలేదు. జీవుడు తాను ఎంత జ్ఞానం గ్రహించడంలో శ్రేష్ఠుడైనా (చిత్రకేతువైనా) సగుణారాధనతో ద్వైతమునే చరించేడు. ఆ కారణంచేత సాయుజ్యముక్తి రాలేదు. మాయావరణంతో విష్ణువును విడవకుండానే వున్నాడు. అంటే సమీప్య, సాలోక్య, ముక్తుల నందగల్గినవాడనీ, మాయ కూడ ప్రకృతిగా విష్ణురూపమే కాని అన్యం కాకపోవడంవల్ల సారూప్య ముక్తిని కూడ పొందగల్గేడనీ, అంతరార్థపరమైన రహస్యంగా మనం ఇచ్చట గ్రహించాలి. ఈ విధంగా సగుణము నిర్గుణంలాగ సాయుజ్యముక్తిని సాధించకపోయినా సగుణంలోని సారూప్యముక్తి సాయుజ్య ముక్తితో సమానమైన స్థానాన్నే చెప్తూందనీ, కేవల సాయుజ్యం పొందాలన్నా సగుణారాధనలోని సారూప్య సిద్ధిని పొందవలసి వుంటుందనీ, లేక, సగుణాన్ని అనుభవించి ఆ పైని జ్ఞానంతో దానిని వదలివేసి నిర్గుణారాధనలో సాయుజ్యం పొందడం జరుగుతుందనీ, సాధకులు తమ తమ జ్ఞాన గ్రహణ పటుత్వ తారతమ్యాన్ని పట్టి ఈ మార్గాన్ని నిర్ణయించుకోవాలే కాని సగుణారాధన, నిర్గుణారాధన కంటే తక్కువని చెప్పడం అవివేకమే అవుతుంది. సగుణం లేనిదే నిర్గుణం సిద్ధించదు. సగుణమార్గం నిర్గుణమార్గారోహణకు సోపాన మార్గంగా పెద్దలందఱూ అంగీకరించేరనీ, ఈ కారణంగా ద్వైతా ద్వైతాలకు ఏకత్వమే కాని విరోధం కానీ లేదనీ పై కథవల్ల గ్రహించాలి. ఇక్కడ ద్వైతాద్వైత విశిష్టాద్వైతాల భేదం కొంత అతిసంగ్రహంగా వివరిస్తాను.

# ద్వైతమత సిద్ధాంతం

ఇందు భగవత్తత్వం రెండు విధాలు : 1. ఈశ్వరుడు, 2. చిత్, అచిత్‌రూప ప్రపంచం. ఈ భేదం చేతనే భగవంతునకు ద్వివిధ భేదం సిద్ధిస్తూంది. ఇది ఆనంద తీర్థులవారు స్థాపించిన మతం.

# విశిష్టాద్వైత సిద్ధాంతం

ప్రపంచము సత్యమేకాన జీవునకు ఈశ్వరునకు భేదం వాస్తవికమే. 1. జీవుడు అణురూపుడు. 2. ఈశ్వరుడు చిద్రూపుడగు జీవుడు. 3. అచిత్తు అనగా జడమగు ప్రపంచము మొత్తం. ఇంక తత్త్వాలు మూడు. మొదటిదైన ఈశ్వర తత్త్వానికీ, రెండవ మూడవ తత్త్వాలైన చిత్, అచిత్ తత్త్వాలకూ శరీరి, శరీర భావం ఒప్పాలి. చిత్, అచిత్ తత్త్వాలకు స్థూల సూక్ష్మములు అనే రెండు అవస్థలు వుంటాయి. ప్రపంచస్థితిలో ఈశ్వరుడు సూక్ష్మ చిత్తుతోనూ సూక్ష్మ అచిత్తుతోను కలసి వుంటాడు కాన స్థూల చిద చిత్ విశిష్టుడగు ఈశ్వరునకూ సూక్ష్మ చిద చిద్విశిష్టుడైన ఈశ్వరునకూ భేదమేలేదు. ఈ విధంగా విశిష్ట ద్వైత అద్వైతం చెప్పబడింది. కాన విశిష్టాద్వైతం అనే పేరు ఆ మతానికి సిద్ధించింది. ఇది రామానుజ సిద్ధాంతం.

# అద్వైత మతం

జగదుత్పత్తి స్థితి లయాలకు పరమేశ్వరుడే కారణం. మట్టియే కుండ, ప్రమిద, మూకుడు మొదలగు భిన్నరూపాలైనట్లు పరమేశ్వరుడే నానావిధ ప్రపంచ రూపంగా భాసిస్తున్నాడు. కాన ప్రపంచమనేది ఈశ్వరునికన్న భిన్నమైనదికాదు. అది మిథ్య. లేక మాయ లేక భ్రాంతి లేక అజ్ఞానం అంతే. మట్టికి కుండకు వ్యావహారికంలో భేదమున్నా, పరమార్థంలో భేదం లేనట్లే. ప్రకృతి పురుషులకు వ్యావహారికంలో భేదం వున్నా పరమార్థంలో మాత్రం ఏమీ భేదం లేదు. ఆత్మసత్య జ్ఞానానంద స్వరూపం

ఆత్మ భావం యొక్క అనుభూతియే మోక్షం అంటే. స్వప్నంలోని వస్తువు స్వప్న కాలంలో సత్యమైనట్లు జగత్తు ప్రాతిభాసిక సత్యం మాత్రమే కాని పారమార్థిక సత్యం కాదు. మెలకువ రావడంతో స్వప్నం అసత్యమైనదనిపించినట్లే జ్ఞానోదయం కాగానే జగత్తు మిథ్య అని అనిపిస్తుంది. ఈ విధంగా, జగత్తునకూ ఈశ్వరునకూ అద్వైతం అనగా రెండుగా లేకపోవడం సిద్ధిస్తూంది. కాన ఈ మతానికి అద్వైత మతం అని పేరు. ఇది శంకరాచార్యులవారి సిద్ధాంతం. ప్రధానంగా ఇది మాయావాదం మీద నిలబెట్టబడి వుంది.

వ్యాసభగవానుడు చెప్పిన ఒకే బ్రహ్మ సూత్ర గ్రంథానికి, భగవద్గీతకూ శ్రీ శంకరాచార్యులవారూ, శ్రీ రామానుజాచార్యులవారూ, శ్రీ పూర్ణ ప్రజ్ఞాచార్యుల వారూ ముగ్గురూ కూడ మూడు విధాలుగా భాష్యాలు వ్రాశేరు. వారి ముగ్గురకే మూలం వ్యాసభగవానుని రచనలే. ఆ మూడు విభిన్నాభిప్రాయాలే. అవే అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతాలు. అంటే ఒకే వ్యాస సిద్ధాంతాలు మూడు విధాలుగా అర్థాల్ని ఇస్తున్నాయి. అందుచే వ్యాసుడు మత త్రయాన్ని అభేదంగానే చెప్పిన వాడని చెప్పాలి. అందువల్ల అజ్ఞానంతో తగవులాట కూడదు. ఈ మూడు మతాలూ కూడ భారతదేశంలో వ్యాప్తిలో వున్నాయి. ఎవరి జ్ఞాన పరిణామాన్ని పట్టి వారి మత త్రయాల్లో తమకిష్టమైన దాన్ని అనుసరిస్తున్నారు. 'మతం' అంటే ఇష్టం. కాన ఎవరి ఇష్టం వారిది. అంటే జన్మ ప్రాతిపదిక మీద కాక జ్ఞాన ప్రాతిక మీద ఇష్టం జరగాలి. అంతే కాన ఒకరినొకరు అర్థం చేసుకొని, ఏమతంలో పుట్టినా అన్ని మతాల విజ్ఞానాన్ని అందఱూ సమబుద్ధితో అవగాహనం చేసికోవాలి.

ఒకడే వ్యాసుడు మూడు విభిన్నమతాలు తానై చెప్పడం అసంగతం. కాన ఇవి విభిన్న మతాలు కానే కావనీ ఒకే మతానికి మూడూ మూడు సోపాన మార్గాలని మనం గ్రహించక తప్పదు. ఈ విధంగా వ్యాసుడు భేదవాది కాదని అభేద వాదియే అని మనం తెలిసికోవాలి. మతత్రయానికి గురువు వ్యాసమహర్షియే కాన అందఱూ ఒక గురువు వద్ద అధ్యయనం జరిపే వివిధ తరగతుల విద్యార్థులంగా భావించాలి.

## స ప్త స్కం ధ ం

# ప్రహ్లాదోపాఖ్యానం

## (బ్రహ్మానంద రక్షణ సాధన)

ఒకప్పుడు బ్రహ్మమానస పుత్రులైన సనక సనందనాదులు మూడు లోకాల్లో సంచరిస్తూ అయిదేండ్ల బాలుర రూపాలతో దిగంబరులై హరిని దర్శించడానికి బయలుదేరారు. వైకుంఠ ద్వారాన్ని ప్రవేశిస్తూండగా అక్కడి ద్వారపాలకులు జయ విజయులనే వారు వారిని వెళ్ళకుండా అడ్డగించేరు. అందులకు వారు కోపించి జయ విజయుల్ని 'భూమిమీద అసురులై పుట్టండి' అని శపించేరు. జయ విజయులు ఆ మునుల్ని వేడుకోగా 'మూడు జన్మలలో మీరు ముక్తులు కాగల' రని వారను గ్రహం చూపేరు. జయ విజయులు మొదటి జన్మలో హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగా దితి గర్భాన్న పుట్టేరు. రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగాను, మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగాను పుట్టేరు. తర్వాత వారు వైకుంఠం చేరుకొన్నారు. హిరణ్యకశిపుడు తన తమ్ముణ్ణి హరి వధించేడనే కోపంతో హరి ఎక్కడనున్నాడో వెదకి సంహరించాలని బయల్దేరేడు. బ్రాహ్మణ గోయజ్ఞ సాధుసత్త్వ గుణులతో హరి యుంటాడని విని వారిని బాధించడం ప్రారంభించేడు.

తర్వాత తపస్సుచేసి బ్రహ్మవల్ల దేనివల్లను చావులేకుండ వరాలు పొందేడు. అప్పటికే ఆతని భార్యయైన లీలావతి గర్భం ధరించి వుండి. తర్వాత ప్రహ్లాదుణ్ణి గన్నది. ప్రహ్లాదుడు హరి భక్తుడుగా పుట్టేడు. ప్రహ్లాదుడు అయిదేండ్ల బాలుడుగా నుండగా ఆతణ్ణి హరిభక్తినుండి మాన్పించటానికి హిరణ్యకశిపుడు నానా బాధలు పెట్టేడు. పాముచేత కరిపించేడు, ఏనుగులచేత త్రొక్కించేడు, మంటల్లో పడవేశాడు, పర్వతం మీదనుండి త్రోయించేడు, సముద్రంలోనికి విసరివేయించాడు కాని ప్రహ్లాదుడు చెక్కుచెదరలేదు. చివరకు హిరణ్యకశిపుడు 'ఈ స్తంభంలో హరిని చూపించు' అని గద్దించి పలికి సభామంటపంలోని స్తంభాన్ని తన్నేను. ఆ స్తంభంలో నుండి నరసింహావతారం వెల్వడి హిరణ్యకశిపుణ్ణి చంపివేసింది. హిరణ్యకశిపుకు నరసింహుని చేతిలో ముక్తి పొందేడు.

ఈ కథలో సనక సనందనాదులు ఐదేండ్ల బాలురై నగ్నంగా విష్ణువును దర్శించడం ఏమిటి ? అదేమి సరదా వారికి ? జయ విజయుల్ని మూడు జన్మలు

భూలోకంలో పుట్టమనడ మేమిటి ? వారు మూడు జన్మల్లోనూ అన్నదమ్ములుగానే జన్మించడ మేమిటి ? హిరణ్యకశిపుడు అయిదేండ్ల కొడుకును చంపబూనడ మేమిటి ? చంపలేకపోవడ మేమిటి ? స్తంభంలో నరుడు సింహము కూడ కాని వికారరూపం పుట్టడమేమిటి ? హిరణ్యకశిపుడు నరసింహాకృతిలో లీనమై పోవడమేమిటి ? ఈ కథ అంతా జరిగిన చరిత్రయే ననడానికి పైని చెప్పిన అసంబద్ధాలైన విషయాల్ని హేతువాదరీత్యా నమ్మలేం.

హేతువుతో తప్ప మనస్సును గ్రుడ్డిగా నమ్మమనడం సరైన పద్ధతికాదు గదా! నిజం తేల్చకుండా వట్టి గ్రుడ్డి నమ్మకాలతో సత్య ఫలితాల్ని రాబట్టగలమా ? వ్యాసాది మహర్షులు గ్రుడ్డి నమ్మకాన్ని పుట్టించడానికే ఈ కథలు వ్రాస్తే వారు సాధించే దేమిటి ? ముక్తి ప్రతిపాదకమైన విషయమంతా హేతువాద శాస్త్రబద్ధమైయే వుండాలి. ముక్తికి సంబంధించినదంతా ఆధ్యాత్మికమే కాని అన్యంకాదు గదా ! అధి+ఆత్మ= అధ్యాత్మ అవుతుంది. ఆత్మయందు జరిగేది అని దానికి అర్థం. ఆత్మయందు ఏమి జరుగుతుందో ఏది జరిగితే ముక్తి సిద్ధిస్తుందో తెలిసికోవడమే ఆధ్యాత్మిక విజ్ఞానం అంటే. పైకి కథకోసం ఎట్లాను కనపడినా అంతరార్థపరంగా ఆధ్యాత్మిక విజ్ఞానం అందించడం భారత భాగవత రామాయణాల్లో జరిగింది. పై కథకు అంతరార్థపరంగా కలిగే ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని అందిస్తాను.

'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యపి హితం ముఖం' అన్నది ఉపనిషద్వాక్యం. సత్యపదార్థం కన్పించకుండా బంగారుపాత్రతో దాని ముఖం మూసివేయబడింది అని అని అర్థం. 'హిరణ్మయం' అంటే ప్రకృతి అని అర్థం. ప్రకృతి సౌఖ్యాల ఆసక్తితో సతమతమవుతూ జీవుడు పరమాత్మను తెలిసికోలేక పోతున్నాడు అని పై ఉపనిషత్తు వాక్యానికి సారాంశం. ఇప్పుడు హిరణ్యకశిపుడు అంటే, హిరణ్యం అనగా ప్రకృతి కశిపుడు అనగా ఆహారంగా కలవాడు హిరణ్యకశిపుడు అనే పదానికి వ్యుత్పత్త్యర్థం చెప్పుకొంటే ప్రకృతి లంపటతతో ఆనందించే జీవుడు అనేదే హిరణ్యకశిపు దన్నదానికి అంతరార్థపరమైన అర్థం. హిరణ్యకశిపుని తమ్ముడు హిరణ్యాక్షుడు. హిరణ్యము అంటే ప్రకృతి. అక్షములందు అంటే ఇంద్రియములందు గలవాడు హిరణ్యాక్షుడు అంటే ఇంద్రియలోలుడు అని అర్థం. ఈ విధంగా హిరణ్యకశిపు, హిరణ్యాక్షు లిద్దరి ఆ పేర్లకు ప్రకృతి లోలత్వంగల జీవుడన్నది ఒకే అర్థం. వారిద్దరూ అన్న తమ్ములుగా పుట్టేరు.

వీరు పూర్వజన్మలో జయ విజయులనే వైకుంఠ ద్వారం కాసే ద్వారపాలకులు. వికుంఠము యొక్క భావమే వైకుంఠం. కుంఠం అంటే వ్యర్థమైనది అని అర్థం. విగతమైన కుంఠము గలది వికుంఠమౌతుంది, వ్యర్థముకానిది అన్నమాట భగవంతుని చేరే జీవుడు జన్మ పరిభ్రమణంలో చివరి స్థాయికి వచ్చేక ఇక వారి జన్మ వ్యర్థంకాక అంటే సాధనల్లో పతనం పొందక చర చర పరమాత్మలోనికి చేరడమే జరుగుతుంది. అదే వైకుంఠం చేరుకోవడమంటే ద్వారపాలకులు, ద్వి+అర=ద్వార అవుతుంది. రెండు భాగాల్ని కల్గించునది ద్వారం అన్నమాట. ద్వారానికి ఈవల ప్రదేశం ఒక భాగం, ఆవల ప్రదేశం మరొక భాగం ఉంటుంది. రెండింటికి మధ్యనున్న కారణంగా అది రెంటికి చేరి ద్వారం వుంటుంది.

ఇక్కడ అంతరార్థపరంగా ద్వారం అంటే, అటు పరమాత్మలో కలిసిపోయే స్థితికి ఇటు ఐహిక భోగస్థితికి మధ్యవుండే ఆధ్యాత్మిక స్థితి. అదే ద్వారక అన్న పదానికి కూడ అంతరార్థం. ఇక్కడ ద్వారపాలకులంటే ద్వైతాద్వైత స్థితుల మధ్యలో నున్న సాధకులన్నమాట. జయ విజయులు వైకుంఠ ద్వారపాలకులు అంటే ద్వైతస్థితి విడిచి అద్వైత మోక్షస్థితికి దగ్గఱలోనున్న వ్యర్థంకాని సాధకులు అన్నమాట. జ+య=జయ, జ=అంటే పుట్టడం అని అర్థం, య=అంటే (యాతి ఇతియః) నడువడం అని అర్థం. జన్మలతో సాధన ఇంకా నడువ వలసియున్న సాధకునకు జయుడనే పేరు. విజయుడంటే విగతమైన అనగా పోయిన జన్మ వాసనలు కలవాడని అర్థం. అంటే జన్మ పరిభ్రమణం దాటిన సాధకుడు అని అర్థం. రెండూ ఒకే సాధకునిలోని సాధనలుగా అనగా జయుడై విజయుడైన ఒకే సాధకుడుగా చెప్తే జన్మలు గడుస్తూ ఆ జన్మ పరిభ్రమణం దాటిన స్థితిని పొందాలనే సాధకుడు జయ విజయ అనే ఏక పదాన్ని పొందుతారు. ఇక్కడ జయ విజయుల్ని ఇద్దఱుగా చెప్పినా ఒకే సాధకునిలోని ఒకే సాధనా సోపాన గమనస్థితిని చెప్పే విశిష్ట పదంగా దాన్ని గ్రహించాలి. ఎక్కడ పుట్టినా ఒకే పనిచేసే అన్నదమ్ములుగా ఒకే తల్లి బిడ్డలుగానే చెప్పబడడం జరిగింది.

సాలోక్యం, సమీప్యం, సారూప్యం, సాయుజ్యం అనే వానిని గూర్చి అంతరార్థపరంగా కూడ మనం ఇచ్చట వివేచించి తెలిసి కోవాలి. సగుణోపాసన చెప్పే ద్వైత విశిష్టాద్వైతాలు సాయుజ్య ముక్తిని ఎందుకు చెప్పలేదో కూడ ఇక్కడే తెలిసికోవడం ముఖ్యం. ద్వైతం, విశిష్టాద్వైతం కూడ పరమాత్మను, ప్రకృతిని రెండుగా వేరుగా భావించడం వల్ల రెండూ ఐక్యం పొందడమనేది జరిగేదే కాదు గదా!

సాయుజ్యం అంటే కలిసిపోవడ మనేది అర్థం కాన సాయుజ్యం, కైవల్యం అనేది ఆ సగుణ సాధన మార్గంలో కన్పించేవికావు కాన భక్తుడు సగుణా రాధనతో భగవదనుగ్రహం అంటే భగవంతుని లోకాన్ని పొందవచ్చు. సమీపంలోనే కూడ ఉండవచ్చు. ఆఖరుకు అతని రూపం వంటి రూపం కూడ అతని అనుగ్రహ విశేషం వల్ల పొందనూ వచ్చు. అతని రూపం కూడ పొందినా అతడు వేరుగా నుంటాడు. తానూ వేరుగానే ఉంటాడు. అతనిలో తాను లీనం కావడం అనే కైవల్యం పొందడం, సాయుజ్యం పొందడం అనే తురీయ ముక్తి అనగా సాయుజ్యం. ఆ రెండు మతాల్లోను పొసగనే పొసగదు.

ఇక అద్వైతంలో, పరమాత్మతప్ప రెండో వస్తువు విడిగా లేనేలేదు. ప్రకృతి మిథ్య. లేనిదే ఉన్నట్లుగా కన్పిస్తూంది 'అహం బ్రహ్మాస్మి', 'సోఽహం', 'సర్వం ఖల్విదం బ్రహ్మ', 'ప్రజ్ఞానం బ్రహ్మ', 'ఆనందో బ్రహ్మ' 'తత్త్వమసి' అనేవి అద్వైతానికి ధ్యేయాలు. ప్రకృతి స్వప్నం వంటిది లేనిదే స్వప్నం. కాని జరిగినట్లు కన్పిస్తూ తద్వారా భయ సంతోషాలు కూడ తోపిస్తూన్నట్టే, లేని జగత్తే భ్రాంతి కారణంగా ఉన్నట్లు భాసిస్తూ భయసంతోషాదులు కల్గిస్తూంది. మెలకువ వచ్చినప్పుడు స్వప్నం, మిథ్య యైనట్లే, జ్ఞానం కల్గగానే జగత్తు మిథ్య అవుతుంది. ఇది అద్వైత సిద్ధాంతం. ఈ సిద్ధాంతంలో ఒక్క బ్రహ్మతప్ప, రెండవ వస్తువే లేనపుడు, భగవంతునికి లోకం. దాన్ని పొందడం, భగవంతు డొకచోట వుండడం వాని సమీపంలో నివసించడం భగవంతునికి ఒక రూపం వుండడం. దాన్ని పొంది వేఱుగా ఉండడం అనే సాలోక్య, సమీప్య, సారూప్య ముక్తులు అద్వైతంలో ఎట్లావుంటాయి? మఱి వారి మతంలో అముక్తుల కర్థం వేఱు. అముక్తులూ లేనప్పుడు అద్వైతంలో వానికోసం సాధనలు ఎట్లా వుంటాయి?

అసలు ముక్తి అంటే విడిచి పెట్టుట అనేకదా అర్థం! ముచ్ త్యాగే (to give up) అనే ధాతువుపైని 'ముక్తి' అనే రూపం అవుతుంది. అయితే విడిచి పెట్టేది ఏమిటి? జన్మల్లోని కర్మల వల్ల జీవునకు అనగా మనస్సుకు (జీవుడన్నా, మనస్సన్నా, ప్రాణమన్నా శ్రీ రమణ మహర్షి ఒక్కటిగానే చెప్పేరు) అంటుకొన్న శృంగారాదిరస వాసనలు విడిచి పోవడానికి అసంగ యోగం, అమనస్కయోగం, నిశ్చలతత్త్వం అనేవి సాధనలతో అభ్యసించాలి. వాసనలు పూర్తిగా విడిచి పోతే సాధకునకు ప్రకృతి మిథ్యగా కన్పించే ప్రజ్ఞానం కల్గుతుంది,

నిర్విషయానందం కల్గుతుంది. ఆ అనుభవాన్నే 'ప్రజ్ఞానం బ్రహ్మ' "ఆనందో బ్రహ్మ" అన్న బ్రహ్మ సూత్రాలు చెప్తున్నాయి.

పరిపూర్ణంగా వాసనలు విడుమక కాకుండా తామసిక వాసనలు మాత్రం పోతే పరమాత్మని సాధకుడు తాను కనుగొంటున్నాననే అనుభవం కల్గుతుంది. 'ఆలోకం' అంటే, ఆ+లోకం=ఆలోకం అవుతుంది. లోక్యతే ఇతిలోకం అనే వ్యుత్పత్త్యర్థంతో చూడబడేది 'లోకం' అన్న పదానికి అర్థం,-'ఆ' అన్న దానికి 'సమంతాత్' అర్థం అనగా పూర్తిగా అని అర్థం, స+ఆ+లోకం= సాలోకం అంటే పూర్ణంగా భగవంతుని చూచే సాధనా స్థితితో కూడి యుండడం అని అర్థం. 'స' అన్నదానికి కూడి యుండటం అని అర్థం. సాలోకము యొక్క భావమే 'సాలోక్యం' అవుతుంది.

దీన్ని ఈ విధంగా వివరిస్తే సాలోక్యం అనగా పూర్తిగా భగవద్భావన చేయడం అనే సాధనాస్థితి అనేదే అర్థం. ఇప్పుడిది సాయుజ్య ముక్తి స్థితిలోని మొదటి మెట్టు అన్నమాట. అంతేకాని దేవుని వేరే లోకమూ లేదు. అందులో మనం కూర్చోడమూ లేదు. ఇది సాలోక్యసాధన వల్ల కలిగే తామస వాసనా విముక్తి యొక్క ఒకానొక స్థితి అన్న మాట. ఇల్లాగే సమీప్య ముక్తి, పూర్ణ ముక్తి సాధనలోని రెండవ మెట్టు భగవద్భావన నిరంతరం సిద్ధించడంతో భగవంతుని సమీపంలోనే జీవుడు ఉంటూన్న భావన కల్గుతుంది. అప్పుడు రాజస వాసనలు వీడి పోతాయి. ఇది సమీప్యముక్తికి అంతరార్థం. అంతేకాని భగవంతుడు ఒక చోట కూర్చుండనూ కూర్చుండడు. మనం వాని ప్రక్క కూర్చోడం అనేది లేదు.

ఇక సారూప్య ముక్తి అంటే భగవంతుని తత్త్వం ఏమిటో అదే తత్త్వం తాను పొంది జీవిస్తూవున్నాననే సాధనానుభూతికే ఆ పేరు పెట్టబడింది. ఈ అనుభూతి సాత్విక వాసనలు వీడిపోయినప్పుడు వస్తుంది.

ఈ మూడు రకాల వాసనలు ముక్తి నందితే కల్గేది సాయుజ్య ముక్తియే. తనకంటే భిన్నుడొకడు లేడనే 'అహం బ్రహ్మాస్మి' స్థితి అప్పుడు వస్తుంది. దాని వెంబడినే సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే భావన త్రోసికుంటూ వస్తుంది. అదే ముక్తి, అదే కైవల్యం, అదే మోక్షం, అదే సాయుజ్యం.

ఇప్పుడు ద్వైత, విశిష్టాద్వైత అద్వైత సాధనలలోని సాధనాసోపానాలుగా చతుర్విధముక్తులు అర్థమౌతాయి. మొదటి సోపానం ఎక్కనిదే రెండవ మెట్టు

ఎక్కలేనేలేము. రెండవ మెట్టు అధిరోహించకుండా మూడవమెట్టు చేరనేలేము. మూడూ ఎక్కితేనే నాల్గవ మెట్టు ఎక్కి అద్వైత మోక్ష సౌధం చేరడం జరుగుతుంది.

ఈ కారణంగా ఒక మెట్టు కంటే మరొక పైనున్న మెట్టు హెచ్చుకాదు. క్రింద మెట్టు లొచ్చుకాదు. అన్నీ ఎక్కవలసినవే. ఈ విధమైన సాధనా త్రయం చెప్పడానికే జయ విజయులు అనగా జన్మలుగడిచి ముక్తిని చేరే సాధకులు మూడు జన్మలు పొందవలసిన శాపం పొంది భూమిపైని పుట్టేరని వ్యాసభగవానునిచే చెప్పబడిందిగా అంతరార్థపరంగా అర్థం చేసికోవాలి.

ఇప్పుడు జయ విజయులు జంట విడువకుండా వుండే ఒకే సాధనచేసే సాధకుడైన జీవాత్మ అని అర్థం చేసికోవచ్చు. వారు వైకుంఠ ద్వారాన్ని కాస్తున్నారే కాని విష్ణువును అంటే సర్వవ్యాపకతత్వాన్ని చేరి యుండలేదు అంటే 'సాలోక్య, సమీప్య, సారూప్య ముక్తులుపొందే సగుణసాధనలు చేస్తూన్న ద్వైతస్థితిగల సాధకుడు జీవుడన్న అర్థం 'జయ విజయ' అనే విశేషణ విశిష్ట పదానికి అర్థం. వారింకా జన్మలు పొందవలసియే యుంది. సగుణారాధనతో కొంత సాధన లోగడ జన్మల్లో జరిగింది. ఇకమూడు జన్మల్లో త్రిగుణవాసనాలూ, ద్వైతస్థితీ విడిచి వేయాలి. అదే మూడు జన్మలలో వైరంతో భగవంతుని చేరుకోడమంటే భగవతత్వ విరుద్ధములైన త్రిగుణాలు భగవదైక్యానికి విరోధాలే. ఆ త్రిగుణాలను విడుపుదల పొందించే సాధనయే విరోధంతో భగవదైక్య సాధన అంటే.

సనక, సనందన పదాలను మనం సనక సనందనాద్యవతార కథతో అంతరార్థం చెప్పుకొన్నాం. సనకఅన్నా, సనందనఅన్నా భగవదైక్య భావనాస్థితికి మారు పదాలే అని ఆ సందర్భంలో చెప్పుకొన్నాం.

జన్మల నెత్తుతూ సాధన చేస్తూన్న జయ విజయ సాధకులకు భగవదైక్య స్థితి అనగా సాయుజ్యముక్తిని చేర్చాలనే భగవదాకాంక్ష సనక సనందాదులు వైకుంఠ ద్వారాన్ని ప్రవేశించబోయారన్న దాని అంతరార్థం. వారు ఐదేండ్ల బాలురుగా నగ్నంగా ఉన్నారనడంలో భగవదైక్య భావనలో వారిలోని పంచభూత ప్రవృత్తులలోను మాయఅనే ఆవరణం మాత్రమూ కానరాదని అంతరార్థపరంగా గ్రహించాలి. ఆ భగవదైక్య భావన తమలో ప్రవేశించడాన్ని జయ విజయ సాధన తనలో నిలుపుకోలేక పోవడమే వారిని జయ విజయులు అడ్డగించడం అంటే. ఇంక త్రిగుణాతీత స్థితి, ద్వైతాతీత స్థితి సాధకునకు రాని కారణంచేత ఆ భగవదైక్య భావం నిలబాటు చేసికోవడం జరగలేదు. అప్పుడు భగవదైక్యానికి తమలోని త్రిగుణ వాసనల

రాహిత్యానికి భగవత్ప్రేరణతో సాధకుడు పూనుకోవడమే మూడుజన్మలు ఎత్తడంఅనే శాపమివ్వడం అంటే. భూమిలో జన్మింపారంటే, సుగతిని చేరడానికి వాసనా విముక్తి పొందాలంటే ఐహిక వాసనలకు కారణమైన భూలోకమునే ఆధారం చేసికోవాలి కదా !

ఈ విధంగా మొదటిజన్మలో తామస వాసనల విముక్తికై దితిగర్భంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జయ విజయులు కశ్యపబ్రహ్మకు పుట్టేరు. 'పశ్యక ఇతి కశ్యపః' అని 'కశ్యప' పదాన్ని తలక్రిందుచేసి వ్యుత్పత్త్యర్థం ప్రదర్శించేరు నిఘంటువు కారులు. పశ్యకుడంటే చూచేవాడు. అనగా భగవంతుని కనుగొనే సాధనా దృక్పథం అన్నమాట అదే కశ్యపుడని పేర్కొనబడింది. అతని పెద్దభార్య 'దితి' అనే పేరుగలది. రెండవ భార్య అదితి అనే పేరుగలది 'ద' ఖండనే' అనేధాతువు వల్ల 'దితము' అంటే ఖండితమైన అనగా ద్వైతమైన మనోవృత్తి అని అర్థం. దానికే స్త్రీ వివక్షలో జీప్ ప్రత్యయం చేస్తే 'దితి' అని అవుతుంది. దితము కానిది అదితి అంటే ఖండితముగాని మనోవృత్తి అనగా అఖండ మనోవృత్తి లేక అద్వైత మనోవృత్తి అని దానికి అర్థం. కశ్యపునకు అనగా భగవంతునిచూచే సాధనా దృక్పథానికి అఖండ మనోవృత్తి; ఖండ మనోవృత్తి అనేవి రెండు విధానా లున్నాయన్నమాట. సరిగ్గా నిరంతరమూ భగవంతుని నిలుపలేని మనోవృత్తి అదితి. అదే ద్వైత మనోవృత్తి.

దానివల్ల కల్గే భావాలు ఐహిక భోగలంపటతతో గూడియే భగవంతుని చేరాలనే మనోవృత్తులు. అవే అసురులు. అసురులంటే సాయుజ్య ముక్తిని గ్రహించలేని స్థితిలోవున్న మనోభావాలు అని అర్థం. మనస్సు నిలకడ లేకుండా అనిశ్చలత్వంతో భగవంతుని ఆరాధించే స్థితిలో ఐహికవృత్తులు సాధకునిలో ప్రాధాన్యం వహిస్తాయి. అవి దైవాన్నికూడ ఆరాధిస్తూ వుంటాయి. ఈ విధమైన ఖండిత మనోవృత్తితో ద్వైత స్థితితో ఎంతకాలం దైవాన్ని ఆరాధించినా సంపదలు వస్తే వస్తాయేమో కాని ముక్తి మాత్రం రాదు. అసురులు సర్వసంపదలు పొందినా ముక్తిని పొందలేరు. కశ్యప బ్రహ్మకు దితి గర్భంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జయ విజయులు పుట్టేరన్న దానికి జీవుడు జన్మ పరిభ్రమణంలో ఖండిత మనోవృత్తితో భగవదారాధనలో నుండి ప్రకృతి భోగపరాయణుడై యుండి కూడ మూడు జన్మలలో మోక్షాన్ని చేరడానికి మొదటి జన్మనొందేదని అంతరార్థం గ్రహించాలి.

లీలావతి హిరణ్యకశిపుని భార్య. లీలావతి ప్రహ్లాదుని కన్నది. 'లీల' అనగా

భగవంతుని ఏహాస అని అర్థం. 'ప్రహ్లాద' అంటే శ్రేష్ఠమైన ఆనందము అని అర్థం. అంటే బ్రహ్మానందం ప్రహ్లాద పదానికి అర్థంగా గ్రహించాలి. ప్రకృతిలోలుడైన జీవికి ప్రహ్లాదునివల్లే భగవత్తింల నుంచి ఆత్మానందావిర్భావం కూడ ఆవిర్భవించింది అని ఆ వాక్యానికి అర్థం. ఆ ఆత్మానందం తనలో వున్నప్పటికీ ప్రకృతి లంపటత్వం యొక్క ప్రాబల్యం ఆ ఆనందాన్ని పైకి రానీకుండా మూసివేసింది. 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం' సత్య పదార్థమైన ఆనందాన్ని ప్రకృతి కప్పివేస్తుంది. అన్న ఉపనిషద్వాక్యానికి ఇదే తాత్పర్యం. ఆత్మానందం తనలోనేవున్నా ప్రకృతి యొక్క ఆవరణం చేత జీవుడు వానిని చేరలేడు కాని ఆ ఆత్మానందాన్ని వెమకాలనే తపనను మాత్రం జీవుడు విడిచిపెట్టడు. జీవుని గమ్యం పరమాత్మను చేరడమే కదా!

పరమాత్మను అన్వేషించడానికి వేదాంతశాస్త్రం రెండుమార్గాలు ఉపదేశించింది. ఒకటి ప్రకృతిలోని ప్రతి వస్తువును ఇది భగవంతుడుకాదు, ఇది భగవంతుడుకాదు అని 'నఇతి'='నేతి' అనే మాటచేత నిషేధించుకొంటూ చివరకు 'నేను' (అహం) అనేది 'బ్రహ్మ' అని గ్రహించడం ఒకటి. ఇది 'అహం బ్రహ్మ ఉస్మి సాధన' రెండవది ప్రకృతిలోని ప్రతి వస్తువులోనూ బ్రహ్మవున్నాడనే భావనతో ఇది బ్రహ్మము, ఇది బ్రహ్మము అని అన్నిటిని బ్రహ్మగా భావించడం. మొదటి సాధన సిద్ధిస్తేనే రెండవ సాధన సిద్ధిస్తుంది. రెండూ కలిస్తేనే పూర్ణముక్తి వస్తుంది.

హిరణ్యకశిపు హిరణ్యాక్షులు జీవునిలోని ద్వంద్వ గుణాలు. రెండూ కలసి ఒకే జీవ భ్రమణం సాగిస్తాయి. హిరణ్యాక్షుడు భూమిని చాపచుట్టగా చుట్టివేస్తూంటే విష్ణువు వరాహావతారంతో సంహరించేడు. హిరణ్య+ అక్షుడు అంటే ప్రకృతి లోలత్వంగల ఇంద్రియాలు గలవాడు అని అర్థం చెప్పుకొనియే వున్నాము.

అతడు భూమిని చుట్టివేస్తున్నాడంటే ఐహిక భోగములందు ప్రబలమైన లంపటతతో వున్నాడన్న మాట. అతనిని విష్ణువు వరాహావతారంతో సంహరించేడు. వర+అహ+అవతారం=వరాహావతారం అవుతుంది. 'హ' అంటే చంపడం, న+హ='అహ' అంటే, చంపకపోవడం అని అర్థం. 'వర' అంటే శ్రేష్ఠమైనది అని అర్థం. అప్పుడు వరాహ అంటే శ్రేష్ఠమైన వానిని చంపకపోవడం అని అర్థం. సర్వ వ్యాపకుడైన పరమాత్మను చేరాలనుకొనే జీవుడు తనలోని శ్రేష్ఠమైన మనోవృత్తుల్ని నాశం చేయకుండా చూచుకుంటూ తనలోని, ఐహిక లంపటత్వాన్ని ఉపసంహరించు కోవడమన్న ముక్తి సాధనకై విష్ణుమూర్తి వరాహావతారం ధాల్చి హిరణ్యాక్షుణ్ణి చంపే డన్నదాని యొక్క అంతరార్థంగా గ్రహించాలి.

ఈ విధంగా ఒక సాధనతో జీవునిలో ద్వంద్వ వృత్తిలోని ఒక విధమైన ఐహికవృత్తి నశించింది అన్నది జయ విజయు లిద్దరిలో ఒకడైన హిరణ్యాక్షుడు వరాహావతారం వల్ల నశించడం అన్నదానిలోని అంతరార్థం.

ఇక జీవునిలో ప్రహ్లాదత్వం కన్పించడం దాన్ని గుర్తించడానికి జీవుడుచేసే సాధనాక్రమం ద్వంద్వ వృత్తిలోని రెండవ వృత్తియొక్క వ్యాపారాన్ని హిరణ్యకశిపుని చరిత్రగా చెప్పడం జరిగింది.

హిరణ్యకశిపుడు భగవంతుని చేరాలి అనే భావాలతో జరిగించే బ్రాహ్మణ ధర్మాల్ని, తపస్సుల్ని, యజ్ఞాల్ని వాటిలో భగవంతుడు లేడని తేల్చడానికే వెదకి వెదకి నాశం చేశాడు వాటిని. అంటే భగవదన్వేషణా సాధనలలో నొకటియైన 'నేతి' 'నేతి' అనే ప్రక్రియ నిషేధపూర్వకమైన సాధనకు జీవుడు ఉపక్రమించేడన్నమాట. ఎచ్చట భగవంతుడున్నాడని అందఱూ నమ్ముతున్నారో వాని నన్నిటినీ పరిశీలించి వీటిలో ఎచ్చట కూడ భగవంతుడు లేడని నిషేధించుకుంటూ పోవడమన్న 'నేతి' 'నేతి' అనే సాధనాభ్యాసమే హిరణ్యకశిపుడు సత్కృత్యాల్ని నాశం చేస్తూ వచ్చేడన్న దాని అంతరార్థంగా భావించాలి. తనలోనే వున్న భగవదంశమైన ఆనందావిర్భావాన్ని గుర్తించలేకపోవడం అనే లోపం ఈ సాధనతో జతపడి వుంది. కాని, ఈ సాధన పూర్తిఅయ్యే చిట్టచివరి కాలంలో తనలోనే వున్న ఆనందరూప పరబ్రహ్మన్ని సాధకుడు 'అహం బ్రహ్మాస్మి' అని గుర్తించడం జరుగుతుంది. అదే ప్రహ్లాదుని ద్వారా భగవత్సాక్షాత్కారం హిరణ్యకశిపుడు పొందేడన్న దానికి అంతరార్థం.

ఈ లోపులో తనలో పొటమరిస్తూ తన్ను విడవకుండా ప్రబోధిస్తూ అనుసరిస్తూన్న బ్రహ్మానందతత్త్వాన్ని సాధకుడు గుర్తించకపోవడమే కాక అది బ్రహ్మానందం అని తెలియలేక దానిని నాశం చెయ్యడానికి కూడ మాయావశంవల్ల ప్రబలంగా యత్నిస్తాడు. అదే తన కొడుకైన ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపుడు నీటిలో పడవైచి, పర్వతాల మీదనుండి త్రోయించి, అగ్నిలో ఉరికించి, పాములచేత కరిపించి, ఏనుగులచేత త్రొక్కించి బాధించేడన్న దాని అంతరార్థం.

ఎన్నిచేసినా ప్రహ్లాదుడు చావలేదు. అంటే బ్రహ్మానందతత్త్వం చంపబడేది కాదు. అదే 'అహం' తత్త్వం. న+హం=చచ్చేదికాదు అనే అర్థంలో 'అహం' అవుతుందని చెప్పకొనే వున్నాం. అది చంపబడేదికాదని తెలిసేక జీవునకు 'అహం బ్రహ్మాస్మి' చావులేనిది ఆనందతత్త్వం అనే అనుభూతికి వస్తుంది. 'అహం తత్త్వమే బ్రహ్మానందం'. అదే ప్రహ్లాదుడు. కనుకనే ప్రహ్లాదుడు ఎన్నిచేసినా చావలేదు.

ఇక స్తంభంలో నరసింహావతారం విర్భావం జరగడం ఏమిటో అంతరార్థ పరంగా వివరిస్తాను.

'స్తంభం' అనేది నిశ్చలమైనది అనే అర్థం గలది. నిశ్చలమైన మనస్తత్వం అన్నదే ఇక్కడ స్తంభ పదానికి అంతరార్థం. ఇంతవరకూ జీవుడు ఇదికాదు, ఇది కాదు అంటూ భగవదన్వేషణ చేయడం అనేది చంచల మనస్తత్వంతో భగవంతుని వెదుకడం జరిగింది. దానివల్ల లాభంలేక, ఇప్పుడు జీవుడు ఆ చంచలత్వాన్ని వదలి వేసి నిశ్చలత్వ స్థితికి వచ్చేడు అన్నది లేదా వాయుస్తంభనతో కుంభకయోగంలో భగవంతుని తెల్సికోవచ్చునని ఈ స్తంభంలో భగవంతుని చూపిస్తావా అని ప్రహ్లాదుని హిరణ్యకశిపు దడిగిన ప్రశ్నలోని అంతరార్థంగా జ్ఞానపరంగాను, యోగపరంగానూ అన్వయించుకోవచ్చును.

స్తంభంలో నరసింహావతారం ప్రత్యక్షమైంది. మొండెం నరాకారం, తల సింహాకారం ఈ విధంగా విష్ణువు అవతరించేడు. నరుడూ, మృగమూ కాని రూపం పుట్టడం ఏమిటి? ఇది జరిగేదేనా? అసంబద్ధ విషయం కాదా! వాచ్యార్థంలో హిరణ్యకశిపుకు నరులవల్లనూ, మృగాలవల్లనూ కూడ చావులేని వరం పొందేడు కాన కేవల నరుడూ కేవల మృగమూ కాని రూపాన్ని భగవంతుడు ఎత్తవలసి వచ్చిందని బాహ్యార్థంలో చెప్తారు. సగుణారాధనలో చెప్పుకొనే అర్థం అది నిర్గుణ సాధనలో అద్వైతపరంగా అది సరిపడదు.

'నృ హింసాయాం' అనే ధాతువునకు హింసించేది అనే అర్థంలో 'నర' అనే పదం అవుతుంది. అంటే మరణ స్వభావం కల్గినది అని అర్థం. ఇక, సింహ పదానికి వ్యుత్పత్తిని ప్రదర్శించేటప్పుడు 'సింహ' అనే దానిని తలక్రిందు చేసి "హింసాయాం సింహః" అని సింహ పదానికి వ్యుత్పత్త్యర్థం చెప్పేరు వ్యాకరణ శాస్త్రజ్ఞులు. అంటే హింసించునది అనే అర్థంలో 'సింహ' అనే పదం అవుతుంది.

ఇప్పుడు నరపదానికీ హింసించునది మరణం అనేది అర్థం. సింహ పదానికి నాశం చేయునది అనేదే అర్థం కాగా ఈ రెండు పదాల కలయికవల్ల మరణాన్ని నాశం చేసేది అనగా కైవల్యం, లేక ముక్తి, లేక వాసనారాహిత్యం అనే అర్థంలో 'నరసింహ' పదం సార్థకమౌతుంది. నరసింహావతారం అంటే ముక్తిని జీవునిలో అవతరింపజేయడం అనగా జీవుని ముక్తిని పొందించడం అనేదే అర్థం. ఈ ముక్తి స్తంభం వల్ల కల్గింది అంటే మనస్సుయొక్క నిశ్చల వృత్తివల్లగాని లేక వాయు స్తంభనతో కుంభకంచేసి మనోనాశం చేయడంవల్ల గాని కల్గింది అన్నమాట.

ఈ విధంగా ఐహిక భోగ లంపటత కల జీవుడు భగవల్లీలవల్ల తనలోనే వున్న అహంతత్త్వాన్ని అనగా బ్రహ్మానంద తత్త్వాన్ని యోగజ్ఞాన మార్గాల్లోని నిశ్చల మనో వృత్తితో తెలిసికొని జీవుడు జన్మమరణ పరిభ్రమణం నాశం చేసికొని ముక్తావస్థను పొందుతాడు అనేది హిరణ్యకశిపు ప్రహ్లాదుల చరిత్రల్లో మనకు అంతరార్థ సారాంశంగా కన్పిస్తూంది. రామావతారంతో రావణ కుంభకర్ణులను, కృష్ణావతారంలో శిశుపాల దంతి వక్త్రులను చంపివేయడం జరిగింది. ఇక్కడకూడ పైవారివలెనే ఒకే ఐహిక ప్రవృత్తి గల రెండు జన్మవాసనలను ఒకే అవతారంలో చంపివేయక విడిగా విధిగాహిరణ్యాక్షుణ్ణి ముందు చంపవలసి వచ్చిన పని ఏమిటి! అనే ప్రశ్న ఇక్కడ వస్తుంది. జీవునిలో ముందుగా ఆతనిలోని ఐహికప్రవృత్తిని వుంచుతూనే భగవంతుని చేర్చే శ్రేష్ఠమైన సుగుణాలు చావకుండా చూడడం అనేది సాధనలోని మొదటిది. అదే వరాహ సాధన (వర+అహ) అదే వరాహావతారంతో చెప్పబడింది.

ఆ పైని నృసింహావతారంతో ముక్తి రావడం రెండవ సాధన చరమ సాధన నిశ్చలతత్త్వ సాధన. దానితోనే జీవన్ముక్తి లభిస్తుంది. శ్రీ శంకరాచార్యులవారు 'సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥ అని భజగోవింద శ్లోకాల్లో నిశ్చలతత్త్వ సోపానక్రమాన్ని వ్రాసేరు. సత్సంగం మొదటి సాధన. అదే వరాహావతార రహస్యం. ఆ సత్సంగత్వంతో నిస్సంగత్వం సిద్ధిస్తుంది, నిస్సంగత్వంతో నిర్మోహత్వం అంటే అజ్ఞాన నాశం లభిస్తుంది. నిర్మోహత్వంతో నిశ్చలతత్త్వం సిద్ధిస్తుంది. ఇదంతా రెండవ సాధనలోనిది.

ఈ సాధనలు మొదటి దాని తర్వాత రెండవది అభ్యాసం చెయ్యాలి. సత్సంగత్వం ద్వైతసాధన, నిస్సంగత్వం, నిర్మోహత్వం నిశ్చలతత్త్వం అద్వైతసాధనగా భావించాలి. సత్సంగత్వం సోపానక్రమంగా నిశ్చల తత్త్వాన్ని చేరుకొంటుంది. ఆ నిశ్చల తత్త్వంతో జీవన్ముక్తి సిద్ధిస్తుంది. అంటే ద్వైతతత్వంతో సాధన ప్రారంభిస్తేనే అద్వైతసిద్ధి సులభమౌతుందనే రహస్యం హిరణ్యాక్షుణ్ణి విడిగా హిరణ్యకశిపుణ్ణి విడిగాను అవతారాలెత్తి సంహరించడంలోని సాధనా రహస్యాన్ని అంతరార్థంగా గ్రహించాలి. జయ విజయులు భగవంతుని చేరాలనే తపనతో పూర్వజన్మలలో కొంత జ్ఞాన సంస్కారం సంపాదించేరు. వారిలోని ఆ జ్ఞాన భాగాన్ని రక్షిస్తూ మిగిలిన త్రిగుణాహంకారాత్మక అజ్ఞానాన్ని భగవంతుడు నశింపు చేయాల్సివుంది. కనుకనే హిరణ్యాక్షుణ్ణి వరాహావతారమెత్తి, హిరణ్యకశిపుణ్ణి నరసింహావతారమెత్తి చంపవలసి వచ్చింది ఈ సంగతి అంతరార్థపరంగా చెప్తేనే తప్ప బాహ్యంతో తెలియదు.

భాగవతంలో అన్ని కథలకన్నా ప్రహ్లాదోపాఖ్యానం మిన్నయైనది. పోతన్న గారు ప్రహ్లాదుని పాత్రలో భక్తిని పరవళ్ళు త్రొక్కించేడు. అదంతా ఇంచుమించు సగుణ ప్రధానంగానే వుంది. నరసింహావతార కథ ముక్తిదాయకం కాన సర్వులకూ కావలసినది. కాననే లక్ష్మీ నృసింహ దేవాలయాలు మన ఆంధ్రదేశంలో పెక్కుచోట్ల ఉన్నాయి. ముక్తి సాధనయే ఈ దేవాలయాల్లోని అర్చావతార రహస్యం ఏమిటో తెలిసికోవాలి.

లక్ష కలిసి, లక్ష్మి అవుతుంది. అంటే చిహ్నంగా వున్నది అని అర్థం. భగవంతుని చిహ్నమే అయిన ప్రకృతికే 'లక్ష్మి' అని పేరు. ప్రకృతి పురుషుని వీడి యుండదు. అనేదే లక్ష్మీని నృసింహునితో కలిసే అర్చామూర్తుల ప్రతిష్ఠించడంలోని అర్థం.

విశాఖపట్టణం జిల్లాలో సింహాచలం క్షేత్రంలో వరాహలక్ష్మీ నరసింహస్వామి ప్రతిష్ఠింపబడ్డాడు. వరాహావతారంతో హిరణ్యాక్షుణ్ణి వధించి నృసింహావతారంలో హిరణ్యకశిపుణ్ణి చంపినప్పుడే సాధకునికి ముక్తి కల్గుతుందని మనం అంతరార్థ పరంగా చెప్పుకొంటున్నాం. కాన ఇద్దటి కథ ఒక్కటిగానే చెప్పబడడం సబబు. అట్లే అర్చామూర్తులలో ఇద్దరను ఒకే అంశంతో అర్చామూర్తిల్లో ప్రవర్తించడం కూడ చాల సముచితమైన పని.

ఈ విధంగా సింహాచల క్షేత్ర ప్రతిష్ఠ జరిగింది. ఈ అర్చామూర్తి యొక్క ప్రతిష్ఠాపనము అంతరార్థ రహస్యాన్ని అనుసరించి జరిగిందనిపిస్తూంది. లేకపోతే వరాహావతారంతో వేరే అర్చామూర్తిని సృష్టించి వేరే క్షేత్రంలో ప్రతిష్ఠించడం జరిగి వుండాలి అట్లు జరక్కుండా రెండవతారాల ప్రయోజనం ఒకే సాధనలో తెల్పబడడం జరిగిందనే సంగతి అంతరార్థపరంగానే అవగాహన అవుతుంది. ఆ అవగాహనతోనే సింహాచలంలో వరాహలక్ష్మీ నృసింహస్వామిని ఒకే స్వామిగా ప్రతిష్ఠింపబడడం జరిగింది.

నల్గొండజిల్లా యాదగిరిగుట్ట పైని లక్ష్మీ నృసింహస్వామి ఆలయంలో జ్వాలా యోగానంద లక్ష్మీ నృసింహస్వాముల అర్చామూర్తుల త్రయం ఒకే గుహలో ఏక దేవతారాధనగా ప్రతిష్ఠింపబడి వుంది. ఒక కొండగుహలో, పైభాగాన్ని జ్వాల వెలిగించి ఆ ప్రక్కగా ఉన్న రెండు తలల పామురూపాన్ని జ్వాలా నరసింహస్వామి గాను, దానికి కొంచెం దిగువ తపస్సు చేస్తూన్నట్లున్న ఒక మూర్తిని యోగానంద నృసింహస్వామిగాను, దాని ప్రక్క లక్ష్మీదేవిని తొడపై నిడుకొని నరసింహాకారంతో

వున్న అర్చామూర్తిని లక్ష్మీనృసింహస్వామిగాను మొత్తం మూర్తిత్రయాన్ని ఒకే అవ తారంగా అర్చకులు ధూప దీపాభిషేకాదులతో అర్చనలు జరుపుతారు. ఏమిటిది? రెండు తలల పాము ఆకారం, దానిముందు అర్చకులు వెలిగించిన దీపం, ఆ రెండూ కలిసి జ్వాలా నరసింహస్వామి అంటారు. ఈ జ్వాలా నరసింహస్వామి యొక్క అవతారం ఎక్కడ వుంది? తర్వాత తపస్సు చేస్తూన్నట్లున్న అర్చామూర్తిని యోగా నంద నరసింహస్వామి అంటారు. ఈ యోగానందునకుగాని, పైనున్న శేషాకారానికి గాని నరసింహరూపం లేనిదే వానికి నరసింహ స్వాములనే పేరు ఎట్లు సిద్ధిస్తుంది?

ఇప్పుడు (ఈ రచనా కాలంలో) నేను ఆ దేవాలయానికి ఏర్పడిన ధర్మకర్త లలో ఒకడనైయున్నాను. ఐదేండ్ల క్రితం ధర్మకర్తగా ప్రమాణ స్వీకారం చేసిన మొదటినాడు ప్రథమ పర్యాయంగా ఆ అర్చామూర్తులను చూచేను. అందలి అర్థ మేమిటో అర్చకుల నడిగేను. కాని సరైన తృప్తికరమైన సమాధానం నాకు రాలేదు. తర్వాత అంతరార్థబుద్ధితో ఆలోచించేను అంతరార్థంలో నాకు మూడు అర్చా మూర్తుల తత్త్వం బోధపడింది. ఇది అంతరార్థపరంగా హిరణ్యాక్ష హిరణ్యకశిపు ప్రహ్లాద నృసింహవ పాత్రలను తెలుపుతూన్న అర్చామూర్తులుగా నాకు స్పష్టపడింది.

రెండు తలల పాము హిరణ్యాక్ష హిరణ్యకశిపులైన జయ విజయులు వారి ముందు జ్వాల వారిలో సనకసనందనులు వెలిగించిన జ్ఞానదీప్తి. యోగం అనగా భగ వంతునితో కలయికగల ప్రహ్లాదుడు. ప్రహ్లాద పదం ఆనందం అనే అర్థమిచ్చే పదం. యోగానంద పదం. దైవంవల్ల హిరణ్యకశిపునికి కల్గిన బ్రహ్మానంద యోగరూపమే ఆ యోగానందుడంటే. అదే ప్రహ్లాదరూపం.

ఆపైని లక్ష్మితో కూడిన నృసింహస్వామి అంటే, ప్రకృతితో కలిసి వున్న పరబ్రహ్మ స్వరూప ముక్తిస్థానం. ఈ విధంగా జ్ఞానసాధనా రహస్యాన్ని వెల్లడిస్తూంది. ఆ అర్చామూర్తిత్రయం అని నాకనిపించింది. లేదా యోగ పరంగా చెప్పితే మూలలోనున్న ఆ పాము మనలోని మూలాధారచక్రంలోని కుండలినీశక్తి అది జ్వాల మాలకులంగా ఉంటుందన్నది వేదోక్తికమైనవిషయం. దాని ముందుంచిన జ్వాల అదే అర్థాన్నిస్తుంది. రెండు తలలు సుఖదుఃఖాది ద్వంద్వ గుణాలను తెల్పేవి. యోగంలో అనగా కుంభక యోగంలో కలిగే అమనస్కనతా స్థితిలోని ఆనందమే

యోగానందరూపం. అజ్ఞానాన్ని విడిచి జ్ఞానదీప్తిగల కుండలినీ శక్తి కుంభక యోగంతో సహస్రారంలోని ఆనందరూపాన్ని పొందగానే భగవంతుని చిహ్నంగా అది ఏర్పడిందనడమే లక్ష్మీరూపం అంటే. అదే ప్రకృతి. నృసింహరూపం ఆ లక్ష్మిని తనలో నిముడ్చుకోవడమే తొడమీద నుంచుకోవడం. అంటే ఈ విధంతో మరణ రాహిత్యమే, అనగా ముక్తిపొందడమే నృసింహరూపం. ఈ ప్రకారం యోగపరంగా చెప్పే ముక్తి రహస్యాన్ని కూడ ఈ అర్చామూర్తులు ఏకత్ర ఒకే గుహలో ఒకే ఆవతారంగా అర్చనలు పొందడంలోని అంతరార్థం. లేకపోతే ఆ విధము లైన మూడుమూర్తుల కల్పనకు ఏమీ అర్థమే లేదు.

ఈ విధమైన జ్ఞాన యోగ పద్ధతులు భక్తులకు ప్రబోధించడానికే ఈ మూర్తి త్రయ నారసింహ ప్రతిష్ఠ యాదగిరి గుట్ట క్షేత్రంలో జరిగింది. ఈ అర్చామూర్తుల అంతరార్థ రహస్యాన్ని సాధకులకు భక్తుల ఉపయోగార్థం నేను ఒక పద్యంలో వ్రాసి ఆ గుహద్వారం వద్ద శిలా ఫలకంపై చెక్కించి ప్రతిష్ఠింపజేశాను. ఆ పద్యం ఈ క్రింద ఉదహరిస్తున్నాను.

ఈ యాదాద్రియె దేవ,
మీ గుహమన, స్పందున్న శేషాహియే
మాయా కుండలినీ మహా,
స్పదియె సుమ్మా జ్వాల మాలకుల
శ్రీ, యానందము నొందు యోగమున
లక్ష్మీరూపమై విష్ణుతోన్
'శ్రీ యోగం' బను త్వద్రహస్యమిది
లక్ష్మీ నారసింహ ప్రభూ!

పై పద్యానికి అర్థం కూడ ఆ శిలాఫలకం మీద వివరించబడి వుంది.

(పై పద్యం నేను రచించిన 'తారావళి' అనే నృసింహ స్తోత్రం లోనిది. ఆ తారావళి అనే చిన్న పుస్తకం శ్రీ నృసింహ స్వామి దేవస్థానం వారి పుస్తక విక్రయ శాలలో 0-50 పైసలకు లభిస్తుంది. కావలసినవారు వారికి వ్రాసి తెప్పించుకోవచ్చు.)

# త్రిపురాసుర సంహారం

## (దేహత్రియ, త్రిగుణ, విజయ సాధన)

ఇంద్రుని భయంచే అసురులు మయుణ్ణి శరణు పొందేరు. మయుడు అసురులకు ఇనుము, వెండి, బంగారములతో ఎవ్వరికీ భేదింప శక్యంకాని విధంగా మూడు పట్టణాలు నిర్మించి అసురుల కిచ్చేడు. ఆ పట్టణాల్లో దాగికొని అసురులు దుర్భేద్యులై దేవతల్ని బాధిస్తూ వచ్చేరు. అసురులను పట్టుకోవడానికి త్రిపురాలు అభేద్యములు కావడం వల్ల దేవతలకు వినాశం ప్రాప్తించింది. అప్పుడు సురలందరూ శంకరుని వద్ద తమ పాట్లు విన్నవించుకొన్నారు.

శంకరుడంత బయలు వెడలి త్రిపురములపై సూర్య తేజస్సగం బాణాల్ని అఖండ వర్షంగా కురిపించేడు. దానితో అసురులా పట్టణాలలో నుండలేక పోయేరు. అప్పుడు మయుడు తనయోగ మహిమచేత ఒక సిద్ధరసకూపం నిర్మించి అందులో దైత్యులను ప్రవేశింప జేశాడు. ఆ కూపమందలి రససిద్ధిచే దైత్యులు బలపడి గోపధ్వజుడైన శంకరు నెదిరించేరు. శంకరునకు ఏమి చెయ్యాలో తోచలేదు. అది చూచి విష్ణువు బ్రహ్మను దూడగా చేసికొని తాను గోరూపం ధరించి ఆ కూపంలోని రసాన్ని అంతాత్రాగి వేసేడు. ఆ పైని మయుడేమియు చేయలేక పోయేడు. అప్పుడు విష్ణువు శంకరునికి బాణంగా మారేడు. ఆ బాణం ప్రయోగించడంతో త్రిపురాలు ఒక్కక్షణంలో కాలిపోయి భస్మీపటలమై పోయేయి. అంతరార్థ పరంగా ఈ త్రిపురాసుర విజయకథ, త్రిగుణవిజయ సాధనను తెలియ జేస్తుంది.

ఇంద్రుడంటే 'ఇంధతే ఇతి ఇంద్రః' ప్రకాశించునది అను అర్థంలో సాధకునిలోని 'మనస్సు' అని అంతరార్థపరంగా చెప్పుకోవాలి. అసురులు అంటే సుగతిని గ్రహించనివి అనే అర్థంలో సత్త్వరజస్తమోగుణాల మనోవృత్తులు అసుర పదానికి అర్థం. త్రిపురాలు అంటే స్థూల సూక్ష్మ కారణ దేహాలు. సత్త్వరజస్తమో గుణ ప్రకృతులతో కూడుకొని వుంటాయి. ఇనుము, వెండి, బంగారాలతో పురాలు నిర్మింపబడ్డాయి అంటే తమోగుణంతోను, సత్త్వగుణంతోను, రజోగుణంతోను స్థూల సూక్ష్మ కారణ దేహాలు ప్రవర్తిస్తున్నాయన్న మాట. ఇనుము నల్లగా ఉంటుంది, గట్టిగా వుంటుంది కాన తమోగుణంగా చెప్పుకోవాలి. వెండి తెల్లగా ఉండేదికాన సత్త్వగుణంగా గ్రహించాలి. బంగారు పసుపు కలిసిన ఎఱుపురంగుగా ఉంటుంతె కాన రజోగుణంగా చెప్పుకోవచ్చు.

సాధకుని మనస్సులోని త్రిగుణ వృత్తులు కొన్ని సురులు, కొన్ని అసురులు. ముక్తిని కోరే మనోవృత్తులు సురులుగా, ముక్తిని నాశంచేసే ఐహిక సుఖాలను కోరే మనోవృత్తులు అసురులుగా చెప్పుకోవాలి. సురులకు అసురులు భయపడ్డారు. వారు మయుని ఆశ్రయించారు. మాయనే మయుడని చెప్పుకోవాలి. మయుడు త్రిపురాలు నిర్మించి అసురులను అందు ప్రవేశపెట్టేడు. అంటే ముక్తిని కోరే మనోవృత్తులకు భయపడి ఐహిక వృత్తులు త్రిగుణాలు త్రిపురాలుగా తమ్ము కాపాడుతూంటే అందులో ఉండే ముక్తి మనోవృత్తులకు లొంగకుండా బలపడ్డాయి. మాయాబలం వల్ల వానికి శక్తి వచ్చింది. యోగవిఘ్నంగా మయుడు అన్న పదానికి గంధర్వుడు అనే అర్థం వుంది. గంధర్వ నగరి అంటే ఇంద్రజాల విద్యతో నిర్మించిన మాయా నగరం అనే అర్థం భాషలోను, వాడుకలోను కూడా వుంది.

ఆ ప్రకారంగా 'మయ' శబ్దమే మాయ అనే అర్థాన్ని ఇచ్చేదిగా వుంది. సురులకు అసురులకు నిత్యం యుద్ధం జరుగుతూనే వుంటుంది. ఒకరి నాశానికి మరొకరు ప్రయత్నిస్తూంటారు అంటే ముక్తిని కోరే మనోవృత్తులకు ముక్తిని కోరని మనోవృత్తులకు నిరంతరం సంఘర్షణ సాధకునిలో జరుగుతూనే వుంటుంది. సురులు అసురులను జయించడం జరగకుండా మయుడు అభేద్యములైన త్రిపురాలను అసురులకు నిర్మించి యిచ్చేడు. దానితో వారు బలంపొందేరు అంటే మాయ కారణంగా కల్గిన సత్త్వ రజస్తమో గుణాలవల్ల అసుర వృత్తులు బలపడతాయి అని అంతరార్థం గ్రహించాలి.

సురులు శంకరుణ్ణి శరణు వేడేరు. శంకరుడు అంటే 'శం' అంటే మోక్ష సుఖం, కరుడు అంటే చేసేవాడు అందే ముక్తి ప్రదమైన సాధకునిలోని విజ్ఞానము అని అర్థం చెప్పుకోవాలి. ముక్తి వృత్తులు ఐహిక వృత్తులు బలపడ్డంతో తమ కోర్కె సాగించడానికి జ్ఞానాశ్రయం పొందే యన్నది సురులు శంకరుని సురలు వేడే రక్ష దాని అర్థం. రక్షించడానికై శంకరుడు సూర్యతేజస్సుగల బాణపరంపర చేత త్రిపురాలను కప్పివేశాడు అంటే సాధకునిలోని విజ్ఞానము ఆతని ముక్తినికోరే మనోవృత్తుల మొరనాలించి సూర్యతేజస్సుగల బాణవర్షం అఖండంగా త్రిపురాలపై కురిపించేడు అంటే విజ్ఞానము జ్ఞానదీప్తి గల మనోభావాలను ఎడతెగని విధంగా ఐహిక వృత్తులపై ప్రసరింపజేసి సాధకునిలోని సత్త్వరజస్తమో గుణాలను ముక్తి కడ్డు రానట్లు కదలకుండా ఆపునించినాడు అని అర్థం అంటే నిశ్చల తత్త్వంలోనికి సాధకుని ఐహిక వృత్తుల్ని తెచ్చిందన్న మాట.

అప్పుడు మయుడు రస కూపాల్ని నిర్మించి ఆ కూపంలో అసురులను ప్రవేశింప జేశాడు అంటే 'రసం' అంటే వాసనలు, రసకూపం అంటే వాసనా కేంద్రమైన అజ్ఞాన లయం. అదే మూలాధార చక్రం అంటే కూపం అంటే కు+ఊ+పం=కూపం అవుతుంది. కు=భూమి యందలి, ఊ=ప్రకృతిని అనగా ఐహిక ప్రకృతిని, ప=పోషించున యై, ఐహిక వృత్తుల్ని నాశం కాకుండా పోషించు నీతమోనిలయమైన అజ్ఞానం మూలధారమే అనగా కారణ దేహమే రస కూపం అన్నమాట. అది రసమయం అంటే జీవుడు పూర్వ జన్మలలో చేసిన కర్మల వల్ల కల్గిన వాసనలతో నిండి యున్నది అన్నమాట. అసురులు అంటే ఐహిక ప్రకృతి లోలత్వంగల మనోవృత్తులు. అవి వాసనలను బట్టియే బ్రతికి వుంటాయి. ఆ వాసనలు మాయా అజ్ఞాన కల్పితములు. మయుడు రస కూపంలో అసురులను నింపేడు అంటే మాయా వాసనా కేంద్రంలో సాధకుని పాప వృత్తుల్ని నిక్షేపించడం జరిగిందన్నది అంతరార్థంగా గ్రహించాలి. ఎంతగా విజ్ఞానం కల్గినా వాసనలు తమ మూల ప్రకృతి మాత్రం విడవవు. అవి పరమాత్మ దర్శనం కలినపుడే నశిసాయి.

గోపధ్వజుడైన శంకరునకు ఏమీ తోచలేదు. గోపధ్వజుడు అంటే గోవులకు రాజైన నది అనగా వృషభం ధ్వజంగా కలవాడని బాహ్యార్థం. అంతరార్థంలో 'గో' అంటే ఇంద్రియములు. ఇంద్రియ వృత్తులను పాలించే విజ్ఞానం 'గోప' పదానికి అర్థం. ఇంద్రియ పాలనయే ధ్వజంగా తన్ను తెల్పే ముఖ్య చిహ్నముగా కలది జ్ఞానం. ధ్వజ పర్యాయ పదాలన్నిటికి ముఖ్యం; శ్రేష్ఠ అనే అర్థాలున్నాయి. విజ్ఞానం ఇంద్రియాలకు ఆహారం, అనగా విషయాసక్తి లేకుండా చేసి ఆ ఇంద్రియ వృత్తుల్ని మార్పు చేయగలదే కాని పూర్తిగా నాశనం చెయ్యలేదు. శ్లో॥ విషయాః విని వర్తంతే నిరాహారస్య దేహినః రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే' అన్న భగవద్గీతా శ్లోకం దీన్ని బలపరుస్తుంది. ఆ కారణం చేత రస కూపంలో దాగి యుండిన త్రిగుణ వాసనలను నశింపు చెయ్యడం సాధకునిలోని విజ్ఞానానికి శక్యం లేదు. వాటిని నశింపు చేసే మార్గం దానికి తోచలేదు అన్నదే శంకరునకు ఏమీతోచని తికమక స్థితి కల్గిందన్నదాని అంతరార్థం.

అప్పుడు ముక్తిని కల్గించే సాధనకు సాధకునిలోని సర్వవ్యాపియైన పరబ్రహ్మ స్వరూపం విజ్ఞానానికి గోచరించింది అనడమే విష్ణువు శంకరునికి తోడ్పడ్డాడనడం లోని అంతరార్థం అప్పుడు విష్ణువు ఈశ్వరునికి బాణంగా ఏర్పడ్డాడు. ఆ బాణంతో

ఈశ్వరుడు త్రిపురాలను దహించేడు అంటే సర్వవ్యాపక పరమాత్మ ధర్మంతో అనగా 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధనాభ్యాసముతో సాధకుడు త్రిగుణాలను పరమాత్మగానే అర్థం చేసికొన్నాడని అంతరార్థం.

అప్పుడు పరమాత్మ సాక్షాత్కారంతో సాధకునిలోని త్రిగుణాలు నశిస్తాయని, ఇది త్రిపుర సంహారం అంటే విశ్వ, తైజస, ప్రాజ్ఞావస్థలనే స్థూల సూక్ష్మ కారణ దేహాలలో వుండే సత్త్వరజస్తమోగుణాలను నాశం చేసినపుడే తురీయావస్థ అనగా నాల్గవ అవస్థ మోక్షం, ముక్తావస్థ లేక జీవన్ముక్తి దేహస్థితి వస్తుందని చెప్పడమే ఇందు జరిగింది. ఇది చిట్ట చివరది 'సర్వం ఖల్విదం' అనే జ్ఞాన సాధనాభ్యాసంగా గ్రహించాలి.

ఇక్కడ శివకేశవులకు అభేద స్థితి చెప్పబడడం విశేషం అంటే విజ్ఞానస్థితి, సర్వవ్యాపక స్థితి ఒకటే అని గ్రహించాలి. ఇరువుర అనుగ్రహం కలిసి వచ్చినపుడే త్రిగుణాతీత స్థితితో కైవల్యం సిద్ధిస్తుందని కూడ గ్రహించాలి. విష్ణువు గో రూపం ధరించి బ్రహ్మను దూడగా చేసి రస కూపంలోని రసాన్ని పానం చేశాడు. 'గో' అంటే ఇంద్రియాలు అర్థం. ఇంద్రియాల క్రింద ఇంద్రియ రూపంలోనే ఉన్నవాడు సర్వవ్యాపక పరమాత్మ. ఇంద్రియాల క్రిందనే వున్నవాడు అనే అర్థంలో అధోక్షజుడని పరమాత్మకు పేరు కూడ వుంది. బ్రహ్మ అనగా వేదం అనగా ఉపనిషత్ జ్ఞానం. దూడ తల్లిపొదుగును చేరితే పాలు వస్తాయి. వేదంతో పరమాత్మను గ్రహించే ప్రయత్నంచేస్తే ఇంద్రియరూపుడైన పరమాత్మ సాధకునిలోని రస వాసనల్ని నాశం చేస్తాడన్నదే విష్ణువు గోవుగా బ్రహ్మ దూడగా రస కూపంలోని రసాన్ని త్రాగివేయడం జరిగిందన్న దాని అంతరార్థం.

సాధన :-

సాధకుడు తనలోనున్న ఐహిక భోగలంపటత కల్గిన మనోవృత్తుల్ని నాశం చేస్తేనే ముక్తి లభిస్తుంది అందుకు స్థూల సూక్ష్మ కారణ దేహాల్లోను సత్త్వ రజస్తమో గుణాల్ని విజ్ఞాన దీప్తితో మార్పు చెయ్యాలి, ఆ తర్వాత కారణ దేహంలోని రసమును (వాసనలను) పరమాత్మ స్వరూపములుగా భావిస్తూ 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధన సాగించాలి. అప్పుడు పరమాత్మ సాధకునిలో ప్రతి అణువు రూపంలోను ఉన్నాడన్న భావం అనుభూతికి రాగానే కారణదేహం దానిలోని రసములతో సహా నశిస్తుంది. కారణ దేహం నశిస్తే జన్మ కారణం మిగలదు. ముక్తి సిద్ధిస్తుంది. ఈ కారణదేహ నాశానికి ఉపనిషద్విజ్ఞానం తోడ్పడుతుంది. ఆ ఉపనిషద్విజ్ఞానంతోనే

'సర్వం ఖల్విదం' భావన వస్తుంది. తాన వాసనా నాశనం ముక్తికి ముఖ్యం. దానికి ఉపనిషద్వి జ్ఞానానుభూతి అవసరం. దానితో 'సర్వం ఖల్విదం బ్రహ్మ' జ్ఞానం కల్గు తుంది అని సాధనా సారాంశం ఈ త్రిపుర దహన కథలో అంతరార్ధ పరంగా చెప్పబడింది.

# అంతరార్ధ భాగవతం

## అష్టమస్కంధం

# గజేంద్ర మోక్షం

(జనన మరణ పరిభ్రమణ వినాశన సాధన)

క్షీరసముద్రంలో త్రికూటమనే పర్వతం వుంది. అది యోజనామతం కలిగి వుంది. అది ఇనుము బంగారు వెండి శిఖరాలు కలిగి వుంది అందు దశ లక్ష కోటి సంఖ్య ఆడు ఏనుగులతోను వాటికి కల్గిన పిల్ల ఏనుగులతోను ఒక గజేంద్రుడు నివసిస్తున్నాడు. ఆ గజేంద్రుడు ఒక రోజున వేసవి కాలంలో వేడికి తాళలేక తన పరివారంతో ఆ కొండమీదనున్న ఒక సరోవరంలో ఒళ్లెరగకుండా జలక్రీడలాడడం సాగించేడు.

శ్లో॥ తంతత్ర కశ్చి న్నృప! దైవ చోదితో
గ్రాహో బలీయాన్ చరణే రుషాఒగ్రహీత్

అప్పుడు దైవప్రేరణచేత ఒక గ్రాహం (మొసలి) దాని కాలు పట్టుకుంది. ఏనుగులన్నీ ఆ సంగతి తెలిసికొని గట్టెక్కి, దీనంగా చూడసాగేయి. ప్రక్క ప్రక్కనే వున్న అవి గజేంద్రున కేమీ సాయపడలేక పోయేయి. గజేంద్రుడు మొసలి పట్టును విడిపించుకోడానికి దానితో వేయి సంవత్సరాలు పోరాడేడు కాని లాభం లేకపోయింది. ప్రాణాలు పోతూన్న సమయంలో గజేంద్రుడు బుద్ధిని భగవంతుని పైని ఈ విధంగా కేంద్రీకరించి,

శ్లో॥ నమామితే జ్ఞాతయ ఆ తురంగజాః
కుతః కరిణ్యః ప్రభవంతి మోచితుం
గ్రాహేణ పాశేన విధాతురావృతో
ప్యహం చ తంయామి పరంపరాయణం
యః కశ్చనే శోబలినోంత కోరగాత్
ప్రచండ వేగా దభిధావతో భృశం
భీతం ప్రపన్నం పరిపాతి యద్భయాత్
మృత్యుః ప్రధా వత్యరణం తమీమహి

అర్థం:- నా జ్ఞాతులే నన్ను రక్షించ లేకున్నారు. నా భార్యలు ఏమి చేయగలరు? విధిచేత మొసలికి పట్టు బడ్డ నేను 'ఏ పరమేశ్వరుడు గొప్పవేగంతో పరుగెత్తుకొని వచ్చి మృత్యు సర్పం నుంచి భయపడి ఆశ్రయించిన వారిని రక్షిస్తాడో ఆతని శరణు వేడుతాను.

ఈ విధంగా బుద్ధిలో భగవంతుని నిల్పి గజేంద్రుడు ఈ విధంగా ప్రార్థిం చేడు.

శ్లో॥ ఓం నమో భగవతే తస్మై యతఏతచ్చి దాత్మకం
పురుషా యాది దేవాయ పిరే శాయాభిధీ మహి॥
యస్మిన్ని దంయతశ్చేదం యేనేదంయ ఇదం స్వయం
యోఒస్మాత్ పరస్మాత్ పరః తం ప్రపద్యే స్వయం భువమ్
యస్స్వాత్మ నీదం నిజ హయ యార్పితం
క్వచిద్విభాతం క్వచతత్తి రోహితం
అవిద్ధ దృక్సా క్ష్యుభయంత దీక్షతో
సఆత్మ మూలోఒవతుమాం పరాత్పరః
కాలేన పంచత్వ మితేషు కృత్స్నశో
లోకేషు పాలేషు చసర్వ హేతుషు
తమస్తదాఒఒ సీద్గహనం గభీరం
యస్తస్య పారేఒభి విరాజతే విభుః
నయస్యదేవా ఋషయః పదం విదుః
జంతుః పునః కోఒ ర్హతి గంతు మీరితుం

యథా నటస్యాకృతి భిర్వి చేష్టితో
దురత్యయామి క్రమణః సుహాఽవతు
దిదృక్ష వోయస్య పదం సుమంగళం
విముక్త సంగా మునయస్సు సాధవః
చరంత్యలోక వ్రత మ ప్రణంవనే
భూతాత్మ భూతా స్సుహృదస్స మేగతిః
నవిద్యతే యస్యన జన్మ కర్మనా
ననామ రూపం గుణ దోష ఏవనా!

తథాపి లోకాఽప్యయ సంభవాయయ
స్వమాయయా తాన్యను కాల మృచ్ఛతి
తస్మై నమః పరేశాయ బ్రహ్మణే ఽనంతశక్తయే
అరూపా యోరు రూపాయనమ ఆశ్చర్య కర్మణే
నమ ఆత్మ ప్రదీపాయ సాక్షిణే పరమాత్మనే
నయోగిరాం విదూరాయ మవసిశ్చేత సామపి
సత్యేన ప్రతిం భ్యాయ నైష్కర్మ్యేణవి పశ్చితా
నమః కైవల్య నాథాయ నిర్వాణ సుఖ సంవిదే

నమశ్శాంతాయ ధీరాయ మూఢాయ గుణధర్మణే
నిర్విశేషాయ సౌమ్యాయ నమో జ్ఞాన ఘుథ నాయచ
క్షేత్రజ్ఞాయ నమస్తుభ్యం సర్వాధ్యక్షాయ సాక్షిణే
పురుషాయాత్మ మూలాయ మూలప్రకృతయే నమః
సర్వేంద్రియ గుణద్రష్ట్రే సర్వప్రత్యయ హేతవే
అసతాభాయ యోక్తాయ సదా భాసాయతే నమః
నమో నమస్తే ఖిలకారణాయ నిష్కారణాయాద్భుత కారణాయ
సర్వాగమామ్నాయ మహార్ణవాయ
గుణారణిచ్ఛన్న చిదూష్మపాయ
తతోభ విస్ఫూర్జిత మానసాయ
నైష్కర్మ్య భావేన వివర్జితాగమ
స్వయం ప్రకాశాయ నమస్కరోమి

మాదృ క్కృపన్న పశుపాశ విమోక్షణాయ
ముక్తాయ భూరి కరుణాయ నమోఽలయాయ
స్వాంశేన సర్వ తను భృన్మనసి ప్రతీత
ప్రత్యగ్దృశే భగవతే బృహతే నమస్తే
ఆత్మాత్మ జాప్త గృహ విత్తజనే షుసక్తైః
ర్దుష్ప్రాపణాయ గుణసంగ వివర్జితాయ
ముక్తాత్మభిః స్వహృదయే పరిభావితాయ
జ్ఞానాత్మనే భగవతే నమ ఈశ్వరాయ
యం ధర్మ కామార్థ విముక్తి కామాః
భజంతి ఇష్టాంగతి మాప్నువంతి
కింత్వా శిషోరాత్యపి దేహ మవ్యయం
కరోతుమేఽద భ్రదయో విమోక్షణం
ఏకాంతి నోయస్యన కశ్చనార్థం
వాంఛంతియే వైభగవత్ ప్రపన్నాః
అత్యద్భుతం తచ్చరితం సుమంగళం
గాయంత ఆనంద సముద్ర మగ్నాః
తమక్షరం బ్రహ్మపరం పరేశ మవ్యక్త మధ్యాత్మిక యోగ గమ్య
మనంత మాద్యం పరిపూర్ణ మీడే
యస్య బ్రహ్మాదయో దేవాః వేదా లోకాశ్చరాచరాః
నామ రూప విభేదేన ఫల్గ్వ్యాచ కలయా కృతాః
యథార్చిషోగ్నేః సవితుర్గ భస్తయో
నిర్యాంతి సంయాంత్స సకృత్స్వరోచిష
వఖాయ తోయం గుణ సంప్రవాహో
బుద్ధిర్మనః ఖాని శరీర సర్గః
నవైన దేవాసుర మర్త్యతిర్యక్
నస్త్రీ నషంతోన పుమాన్ నజంతుః
నా యంగుణః కరసన్న చాసత్
నిషేధ శేషో జయతా దశేషః

జిజీవిషే నాహమి హాము యాకిమ్
అంతర్యహిశ్చా వృతయే భయోన్యా
ఇచ్ఛామి కాలేనవయస్య విప్లవః
తస్యాత్మ లోకా కరణస్య మోక్షం
సోఽహం విశ్వ సృజాం విశ్వం మవిశ్వం విశ్వవేదనం
విశ్వాత్మాన మజం బ్రహ్మ ప్రణతోఽస్మి పరంపదం
యోగ రంధిత కర్మాణో హృదియోగే విభావితే
యోగి సూయం ప్రపశ్యంత యోగేశం తం నతోస్మ్యహం
నమో నమస్తుభ్య మసహ్య దేహ శక్తి త్రయా యాఖిల ధీగుణాయ
ప్రపన్న పాలాయ దురంత శక్తయే
కదింద్రియాణా మనవాప్య వర్త్మనే
నాయం వేద స్వమాత్మానం యచ్ఛక్త్యాహం ధియాహితం
తంమ రత్యయ మాహాత్మ్యం భగవంత మితోఽస్మ్యహం

శ్రీ శుక ఉవాచ—

ఏవం గజేంద్ర ముపవర్ణిత నిర్విశేషం
బ్రహ్మాదయో వివిధ లింగ చిదాభి మానాః
నేతేయ దోపస సృపుః నిఖిలాత్మక త్వాత్
తత్రాఖిలా మరమయో హరి రావి రాసేత్

తంద్వదాత ముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్యది విజైః సహసం స్తువద్భిః
ఛందో మయేన గరుడేన సమూహ్యమానః
చక్రా యుధోఽభ్యగమ దాశుయతో గజేంద్రః

సోఽంత స్సరస్యురు బలేన గృహేత ఆర్తో
దృష్ట్యా గరుత్మతి హరింఖ ఉపాత్త చక్రం
ఉత్క్షిప్య సాంబుజ కరంగి రమాహ కృచ్ఛ్రాత్
'నారాయణాఖిల గురో భగవన్నమస్తే'॥

తం వీక్ష్య పీడిత మజః సహసాఽవతీర్య
స గ్రాహమాశు సరసః కృప యోజ్జహార
గ్రాహాద్విపాటిత ముఖా దరిణా గజేంద్రం
సంపశ్యతాం హరి రమూము చదుస్రియాణాం.

ఈ గజేంద్ర మోక్షణ కథకు అంతరార్థ పరంగానే ప్రయోజనం వుంది. గజేంద్రుడు అంటే ఏనుగులకు రాజు. అది జంతువు. దానికి పది లక్షల కోట్ల భార్యలు; అందరి వల్ల బిడ్డలు. సరస్సులో దాని కాలు మొసలి పట్టుకుంటే దానిని విడిపించుకోడానికి వెయ్యేండ్లు మొసలితో పోరాడింది చివరకు నిర్గుణ పరమాత్మను వేడుకొంది. పరమాత్మ దానికి మోక్షం ప్రసాదించేదు. ఎంత పెద్ద జంతువైనా పది లక్షల కోట్ల భార్యలేమిటి దానికి; మొసలి కాలు పట్టుకుంటే వెయ్యేండ్లు దానితో యుద్ధం చెయ్యడ మేమిటి? జంతువు నిర్గుణ పరమాత్మను ధ్యానించడమేమిటి? ఇదంతా జరిగిందా? జరిగితే వ్యాసుడు చూచేడా? జంతువులోని నిర్గుణ ధ్యానం వ్యాసునికి వినిపిస్తే అదే ధ్యానాన్ని మరచి పోకుండా తు-చ తప్పకుండా వ్రాసి కొన్నాడా? కథంతా హేతువాదంతో పరిశీలిస్తే అసంబద్ధంగానే వుంది. అయితే అసంబంధ కథను ఎందుకు చెప్పేడు వ్యాసుడు; దీన్ని మనం అంతరార్థ పరంగా అన్వయించు కోక తప్పదు.

క్షీర సముద్రంలో త్రికూట పర్వతం. క్షీరం అంటే పాలు అవి తెల్లగా వుండేవి. అంటే సత్వగుణం అన్న దానికి సంకేతం ఆ పాలి. సముద్రం-ముత్+రం=ముద్రం, ముత్ అంటే ఆనందం, 'ర' అంటే (రాతి ఇతిరః) 'ర' అన్న దానికి గ్రహించడం అని అర్థం. స+ముద్రం=ఆనందాన్ని గ్రహించడంతో కూడినది.అంటే ఆనంద రూప పరమాత్మను చేరడానికి చేసే సాధనా యత్నం కలిగి యున్నది. క్షీర సముద్రం అంటే ఇప్పుడు ఆనందరూప పరమాత్మను గ్రహించే టందుకు యత్నం చేసే సత్త్వ గుణం అన్నది అంతరార్థ పరంగా గ్రహించాలి. దాని యందు త్రికూట పర్వతం వుంది. విశ్వ, తైజసిక ప్రాజ్ఞములనే దేహాత్రయం అనే మూడు శిఖరాలుగల జీవాత్మ వున్నదని పై క్షీర సముద్రంలో త్రికూట పర్వత మున్న దన్న దాని కంతరార్థం.

గ+జ+ఇంద్రుడు=గజేంద్రుడు. 'గచ్ఛతి ఇతిగః' అనే వ్యుత్పత్త్యర్థంలో నిరంతర గమన శీలం గలది అని అర్థం 'జ' అంటే 'జాయతే ఇతిజః'=నిరంతర జనన శీలం కలది అని అర్థం-ఇంద్ర అంటే 'ఇంధతే ప్రకాశతే ఇతి ఇంద్రః'

అంటే మిలమిల లాడుతూ (జ్ఞాన దీపకళితో) వుండే మనస్సు అని అర్థం. ఇప్పుడు గజేంద్రుడు అంటే జనన మరణ పరిభ్రమణం కల్గి భగవంతుని చేరాలనే జ్ఞాన దీప్తితో కూడుకొన్న మనస్సు. అదే జీవుడు, ఇచ్చట ముక్తి సాధకుడు అని అర్థం. ఆ సాధకుడు స్వాత్త్విక గుణంతో భగవంతుని చేరుకోవానికి తనలో గుప్తంగా వున్న దేహత్రయంతో కలిసి వున్నాడన్నదే క్షీర సముద్ర మధ్యగల త్రికూట పర్వతం పైని గజేంద్రుడున్నాడన్న దాని అంతరార్థం. పది లక్షల కోట్ల భార్యలు అన్నిటికి పిల్లలు అంటే పది ఇంద్రియాలు వాని అసంఖ్యాక వృత్తులతో, వాటి వల్ల కలిగిన ఉప వృత్తులతో ఆ జీవుడున్నాడన్న మాట. ఈ విధంగా దేహత్రయ వృత్తులతో వాని ఉప వృత్తులతో జీవిస్తూ సాధకుడు ఒకప్పుడు మాయలో పడి మాయా శక్తి చేత అధో గతికి లాగి వేయబడడం జరిగింది అన్నదే జలక్రీడలాడు తూంటే 'గ్రాహం' పట్టుకొంది అన్నదాని అంతరార్థం. 'గ్రాహో బలీయాన్ చరణం రుషాఒగ్రహీత్' అని వ్యాసుడు ఇచ్చట మొసలికి "గ్రాహం" అని ప్రయోగించేడు. గ్రాహం అంటే గ్రహించేది అని అర్థం. అది జలంలో ఉండేది జలంలో ప్రవేశించిన దాని రూపం కనిపించదు. అది రూపాన్ని ఆవరించి వేసి వుంటుంది. ఈ లక్షణం జలాన్ని మాయకు ఉపమానం చెప్తారు. అట్లాగే వస్త్రం కూడ దేహాన్ని కన్పించనీయదు. కాన దానిని కూడ మాయకు ఉపమానంగా చెప్తారు. జలంలోని గ్రాహం, జలక్రీడ లాడుతున్న గజేంద్రుణ్ణి పట్టుకొని లాక్కుపోతుంది. అంటే భగవంతుని చేరాలనే జీవుడు అజ్ఞానంలో పడి మాయతో ఆటలాడు తూంటే ఆ జీవుణ్ణి మాయా కల్పితమైన శక్తి అధోగతికి తీసికొని పోతుంది అని అంతరార్థం.

అప్పుడు గజేంద్రుడు సర్వమూ విడిచి బుద్ధినంతా భగవత్పరం చేసి నిర్గుణ పరమాత్మను ధ్యానించేడు. అంత క్రితం ఎట్లా సంచరించినా జీవుడు పూర్వ జన్మ పుణ్య వాసనల బలం చేత ప్రాణోత్క్రమణ కాలంలో నిర్గుణ పరమాత్మను ధ్యానించ గల్గుతాడు అన్న ఆధ్యాత్మిక సారాంశ రహస్యాన్ని గజేంద్రుని నిర్గుణ ధ్యానం వల్ల మనం బోధ పడుచు కోవాలి.

గజేంద్రుని మొఱవిని 'హరి' అచ్చటకు వచ్చేడు. (హరి రాని దాసీత్) అంటే అజ్ఞానాన్ని హరింప జేసే భగవచ్ఛక్తి సాధకునకుకల్గింది అన్న మాట 'హరి' పదానికి హరించునది అని అర్థం సాధకునిలో వాసనలవల్ల కల్గిన అజ్ఞానం పూర్తిగా హరించినపుడు మోక్షప్రాప్తి కల్గుతుంది అసలీ గజేంద్రుడు పూర్వ జన్మలో ఇంద్రద్యుమ్నుడనే రాజు. ఆతడు తన యొద్దకు అగస్త్యముని వస్తే పట్కారించలేమ ఆ

కారణం చేత అగస్త్యుడు నీవు గజమై పుట్టుతావని శపించేడు. ఆ ఇంద్రద్యుమ్నుడే ఈ గజేంద్రుడు.

ఇంద్రద్యుమ్నుడు అంటే "దుమ్నం" అనగా ప్రకాశం, ఇంద్ర అంటే మనస్సు. ఇంద్రద్యుమ్నుడు అంటే ప్రకాశమానమైన మనస్సుగల జీవుడు. మనస్సును సాధనలచే పరిశుద్ధ పఱచిన సాధకుడన్న మాట. అతని వద్దకు అగస్త్యుడు వచ్చేడు. 'నగచ్ఛతి ఇతి అగః' అంటే నిశ్చల పరమాత్మ తత్త్వం అని అర్థం. 'స్థ' అంటే ఉండడం అని అర్థం నిశ్చల తత్త్వంతో ఉండడమన్నది అగస్థ పదానికి అర్థం. దాని మీద భావార్థక ప్రత్యయం చేస్తే 'అగస్త్య' అవుతుంది. అప్పుడు నిశ్చల తత్త్వం యొక్క భావం అన్నది అగస్త్య పదానికి అంతరార్థంగా గ్రహించాలి.

ఇంద్రద్యుమ్నుడు దగ్గఱకు అగస్త్యుడు వచ్చేడంటే మనస్సును సాధనలతో శుద్ధ పరచి వుంచిన సాధకుడగు జీవునకు నిశ్చల తత్త్వం గోచరిస్తుంది అనే సాధనా రహస్యం అంతరార్థ పరంగా ఇచ్చట చెప్పుకోవాలి. 'అగస్త్యుని సత్కరించలేదు' అంటే సాధకుడు సాధనలో గోచరించిన ఆ నిశ్చలతత్త్వాన్ని తనలో నిల్వరించుకో లేక పోయేడని అర్థం. నిశ్చల తత్త్వాన్ని సాధకుడు శాశ్వతంగా నిల్వరించుకొనే వరకు దేహాత్రయాతీత స్థితి రాదనీ, ఆ దేహాత్రయాతీత స్థితిని నిశ్చల తత్త్వం సాధించి నపుడే సిద్ధిస్తుందనీ, అంతవరకు దేహాత్రయ గుణాలతో జనన మరణాలతో సత మతమౌతుండాల్సిందే అనీ, అదే గజజన్మ ఇంద్రద్యుమ్ననకు శాపంగా ప్రాప్తించడం అనే దానిలోని అంతరార్థం అనీ గ్రహించాలి. ఇక్కడ గజేంద్రుని పూర్వజన్మ అన్నది పూర్వకృత సంస్కారం అనే అర్థంలో వాడబడిందిగా గ్రహించాలి. నిశ్చల తత్త్వంతోనే నిర్గుణ పరమాత్మ ధ్యానం జరుగుతుంది. నిర్గుణ పరమాత్మ జ్ఞానంలోనే మోక్షం సిద్ధిస్తుందనీ కూడ గ్రహించాలి.

ఈ విధంగా గజేంద్ర మోక్షంలో ఒకే జన్మలో దేహాత్రయ వాసనలును అనుభవిస్తూనే పూర్వ సాధనా సంస్కార బలం వల్ల ప్రాణోత్క్రమణ కాలంలో నిర్గుణ పరమాత్మ యందు నిశ్చలతత్త్వంతో ఉండడం సంభవించి ముక్తి పొందడం లభిస్తుందనేది అంతరార్థ పరంగా చెప్పుకోవాలి.

పోతన్నగారు భక్తుడు ఆ కారణంచే గజేంద్రుని కథ అంతా భక్తి పరంగా విపులీ కరించేడు. ఆ భక్తి తన్మయతలో నిర్గుణ పరమాత్మను వర్ణించినా అది సగుణ

తత్త్వంతో బోధించబడి వున్న కారణం చేత వ్యాస మహర్షి ప్రతిపాదించిన నిర్గుణ తత్త్వం సాధకులకు అందీయడం అంత సమర్థవంతంగా జరగలేదు. భక్తుడు విష్ణువును రూప ధ్యానంలో ఆరాధించడం సగుణానికి చెందుతుంది. అదే పరమాత్మను ముక్తి సాధకుడు స్తుతించడం నిర్గుణానికి చెందుతుంది. సగుణ స్తుతిలో నిర్గుణం కూడ ఇతపడి వున్నా నిర్గుణంలో సగుణం వుండదు. అక్కడక్కడ వ్యాసునిలో కూడ సగుణ ద్యోతకములైన పదాలకు అంతరార్థ పరంగా నిర్గుణంగానే అర్థం చెప్పుకోవాలి. పాఠకులకు వ్యాసుని నిర్గుణ ధ్యానం ఎట్లా వుంటుందో తెలియడానికి మూలంలోని శ్లోకాలను ఇందులో ఉదహరించడం జరిగింది. వానికి అర్థం గ్రంథ విస్తర భీతి చేత విడవబడింది. పోతన పద్యాల కంటే వ్యాసుని శ్లోకాలు సాధకునకు బాగా తోడ్పాడు తాయని నా అభిప్రాయం.

# క్షీర సముద్ర మథనం

## (సాత్విక గుణ మథన సాధన)

దుర్వాసుని శాపంవల్ల ఇంద్రునితో కూడ దేవతలకు యజ్ఞభాగాలు లేకుండా పోయాయి. రాక్షసులు దేవరాజ్యాన్ని ఆక్రమించేరు. ఆ కారణంచేత దేవతలు బ్రహ్మను ముందుంచుకొని వైకుంఠానికి వెళ్ళి హరిని స్తుతించేరు.

శ్లో॥ ఏవం స్తుత స్సుర గణైర్భగవాన్ హరిరీశ్వరః
తేషా మావిర భూద్రాజన్ ! సహస్రార్కోదయ ద్యుతిః

దేవగణంచేత స్తుతింపబడి భగవంతుడగు హరి వేయి సూర్యుల కాంతితో వారి ముందు సాక్షాత్కరించి ఈ విధంగా చెప్పేడు. "మీరు రాక్షసులతో సంధి చేసికోండి. వారితో కలిసి అమృతోత్పాదనకు క్షీర సముద్ర మథనానికి తొందరగా యత్నించండి. మంథర పర్వతాన్ని కవ్వంచేసి వాసుకిని త్రాడుగావేసి క్షీరసాగరాన్ని మథించండి నేను సాయపడతాను. కాలకూటం వచ్చినా భయపడకండి. దేనికీ ప్రలోభ పడకండి" అని చెప్పి హరి అంతర్ధానమైనాడు. ఇంద్రుడు దైత్యుల వద్దకు వెళ్ళి మృదు సంభాషణ సాగించేడు. త్రిపుర వాసులగు దైత్యులు ఇంద్రుని మాటల కిష్టపడి క్షీరసాగర మథనానికి సిద్ధపడ్డారు. దేవతలు, అసురులు కనకాచలాన్ని ఊడబెరికేరు. కాని మోసుకొని రాలేకపోయేరు.

అప్పుడు హరి గరుడుని చేత ఆపర్వతాన్ని మోయించి ఒక్క-చేత్తో సముద్రంలో పడేశాడు. తర్వాత దేవతలు రాక్షసులు నాగరాజైన వాసుకినిచేరి అమృతంలో నీకు భాగమిస్తామని చెప్పి త్రాడుగాచేసి మంధరాన్ని కవ్వంగాచేసి సముద్ర మథనం సాగించేరు. దాని క్రింద ఏ ఆధారంలేని కారణంచేత మంధరం నీటిలో మునిగి పోవడానికి సిద్ధమైంది. అప్పుడు శ్రీహరి కచ్ఛపరూపాన్ని ధరించి దాని క్రింద నిలిచి మంధరం మునగకుండా క్షీరసాగర మథనం సాగేటట్లు చేసేడు. ఆ సముద్ర మథనంలో ముందుగా హాలాహలం అనే విషం పుట్టుకొచ్చింది. దేవతలు ఈశ్వరుణ్ణి ప్రార్థించగా మహా శివుడు దాన్నిపట్టి కంఠం మధ్యలో నిల్వరించేడు. తర్వాత కామధేనువు పుట్టింది. దాన్ని ఋషులు స్వీకరించేరు. తర్వాత ఉచ్చైశ్శ్రవమనే గుర్రం పుట్టింది. దానిని బలి అనే దైత్యరాజు స్వీకరించేడు.

తర్వాత ఐరావతం అనే ఏనుగు పుట్టింది. దాన్ని ఇంద్రుడు తీసికొన్నాడు. తర్వాత కౌస్తుభం అనే రత్నం పుట్టింది. దానిని విష్ణువు స్వీకరించేడు. తర్వాత పారిజాతం, అప్సరసలు తర్వాత శ్రీదేవి పుట్టేరు. శ్రీదేవిని దేవదానవులంతా అర్చించేరు. ఆమె స్వయంగా వెళ్ళి ముకుందుని ఉరః స్థలాన్ని అధిష్ఠించింది. తర్వాత వారుణీదేవి పుట్టింది. దాన్ని రాక్షసులు స్వీకరించేరు. తర్వాత ధన్వంతరి పుట్టేడు. తర్వాత అమృతభాండం పుట్టింది. దాన్ని దేవతల కందకుండా రాక్షసులు లాక్కొని పోతూన్నారు. దానిని చూచి దేవతలు విష్ణువుకు మొర పెట్టుకొన్నారు. విష్ణువు మోహినీ రూపం ధరించి దేవాసురుల ముందు సాక్షాత్కరించేడు. మోహినిని చూచి వారు మోహంచెంది "మేము కశ్యపదాయాదులము మాకు నీవు ఈ అమృతాన్ని పంచిపెట్టవలసిం"దని అమృత కలశమును దైత్యులామె చేతికిచ్చేరు. మోహిని రెండు పంక్తులుగా కూర్చున్న దేవాసురులలో దేవపంక్తికి ముందు అమృతం త్రాగిస్తూ రాక్షస పంక్తుల్ని మోహ దృష్టితో చూస్తూ మాయ చేస్తూండడం చూచి స్వర్భానువు అనేవాడు రాక్షస పంక్తిని విడిచి దేవపంక్తిలోనికి చేరేడు.

ఆ సంగతి సూర్యచంద్రులు మోహినికి సూచించేరు. స్వర్భానువు తన చేతిలో పడిన అమృతం త్రాగుతూండగా మోహినీరూప విష్ణువు చక్రంతో వాని శిరస్సును ఖండించేడు. ఆతడే రెండు ఖండాలై అమృత స్పర్శవల్ల రెండుగా రాహుకేతువులనే పేరుతో సూర్యచంద్రులను నేటికీ గ్రహణం చేస్తూంటాడు. ఈ క్షీర సాగర మథనం కథ విన్నా చదివినా ముక్తి వస్తుందట. అని ఫలశ్రుతితో కథ ముగిసింది ఈ కథలో అట్టి ముక్తిసాధనేముంది ? దుర్వాసుడు శాంతంగా ఉండవలసిన మునిగదా ! అతడు

ఇంద్రుని శపించడమేమిటి ? దేవతలు బ్రహ్మను ముందుంచుకొని హరిని ప్రార్థిస్తే హరి వారి నుద్ధరించేడంటే ముని శాపాన్ని బ్రహ్మ త్రిప్పలేడా! హరి త్రిప్పగలడా! రాక్షసులు, దేవతలు ఒకరి నొకరు చంపుకొనే వైరం కలవారెందుకయ్యేరు ? ఒకే తండ్రి బిడ్డలకింత వైరమా ? వారు దేవతలతో కలిసి అమృతోత్పాదన కిష్టపడతారా? పాల సముద్రం ఏమిటి అసలు పాలుగోవులనుండి పుట్టినవి కదా, అవి సముద్రంగా ఎట్లా వుంటాయి ? ఆ పాలలో చావును పోగొట్టే అమృతపు కుండ వుండడమేమిటి ? పామును త్రాడుచేసి పర్వతాన్ని కవ్వం చేయడం జరిగే పనేనా ? అమృతం ఉండ వలసిన చోట విషం పుట్టడమేమిటి ? విషమూ, అమృతమూ ఒకేచానిలో వుంటాయా? కామధేనువు శ్రీదేవి వగైరాలు ఇన్నాళ్ళు సముద్రంలో వున్నారా ? ఇవన్నీ అసంగ తములైన వసడానికి సందేహమేముంటుంది ?. ఈ విషయాలు ఆలోచించి చూస్తే ఇందులో ముక్తినిచ్చే అంతరార్ధం నిక్షిప్తమై వుండాలి లేకపోతే పఠ్రింతిలో ముక్తి వస్తుందనడం సరిపడదు. చూద్దాం. ఏం వుందో దీనిలో.

దుర్ + వాసస్ అనగా దుష్టమైన బట్ట (వాసస్) కలవాడు దుర్వాసుడు. అని దాని వ్యుత్పత్త్యర్థం. శరీరాన్ని మఱుగుపరిచేది బట్ట, జ్ఞానాన్ని మఱుగుపరిచేది మాయ. బట్ట ఉన్నదాన్ని మఱుగుపరిచే గుణం కలవవడంచేత దానిని మాయకు ఉపమాన పదంగా వాడడం గ్రంథాల్లో వుంది. ఆ ప్రకారం దుష్టమైన మాయావరణానికే దుర్వాసుడనే పేరు చెప్పబడిందనాలి. ఇంద్రుడంటే మనస్సు అని లోగడ చెప్పుకొని వున్నాం. దాని నాశ్రయించిన జ్ఞానవృత్తులే దేవతలు. దేవతలు అంటే జీవుని మనస్సులోని ప్రకాశమానమైన జ్ఞానవృత్తులు అని అర్థం చెప్పాలి. దేవతలను దుర్వాసుడు శపించేడు అంటే మాయి జ్ఞాన మనోవృత్తులను ఆవరించి వాటివల్ల ముక్తి ప్రవృత్తి జరక్కుండా చేసిందని అర్థం. ఇక్కడ ముక్తి పొందాలనే కాంక్షగల సాధకుడైన జీవుని లోని మనోవృత్తులు మాయచే ఆవరింపబడి మనస్సుతోకూడ తమ ప్రకాశాన్ని కోల్పోయాయి అన్నది దుర్వాసుని శాపంచేత దేవతలు ఇంద్రునితో సహా స్వర్గరాజ్యం కోల్పోయారన్నదాని అంతరార్థం. దేవతలు బ్రహ్మను ముందుంచుకొని హరియైన విష్ణువును స్తుతించేరు. బ్రహ్మ పదం వేదానికి అర్థం. హరి అంటే వాసనలను నశింపజేసే పరమాత్మ యొక్క శక్తి అని అర్థం. విష్ణువు అంటే సర్వత్ర వ్యాపించే పరమాత్మ అని అర్థం.

ఈ విధంగా హరి, విష్ణువు అనేవి వాసనా నాశక సర్వవ్యాపక పరమాత్మ శక్తిని తెలిపేవి. వేదం పరమాత్మ తత్త్వాన్ని తెలిపేది. వేదోక్త విధులాచరించి సాధకుని

లోని జ్ఞానవృత్తులు వాసనాశనం పొంది సర్వవ్యాపక పరమాత్మను పొందేటందుకు యత్నించడమే దేవతలు బ్రహ్మను ముందుంచుకొని హరిరూప విష్ణువును స్తుతించడ మంటే. ఆ హరి సహస్రార్క ద్యుతిలో ప్రత్యక్షమైనాడు. సూర్యుడనగా జ్ఞానదీప్తికి అర్థం. ఆ జ్ఞానదీప్తి వేయి మనోవృత్తులుగా ప్రకాశిస్తూ ముక్తినికోరే జ్ఞానవృత్తుల్ని వాసనా వరమునుండి విడిపించడానికి పరమాత్మ ఆదుకొంది అన్నమాట. "మీరు రాక్షసులతో సఖ్యపడండి వారితో కలిసి క్షీరసాగరాన్ని మథించండి అమృతం వస్తుం"దని హరి వారి నాదేశించేడు.

రాక్షసులు అంటే 'సే' అంతకర్మణి అనే ధాతువు వల్ల 'స' అంటే నాశం చేసేది. రక్ష యొక్క భావార్థకరూపమే 'రాక్ష' రాక్షమును అనగా రక్షణభావమును అంతం చేసేది 'రాక్షస' అని అవుతుంది. ఈ విధంగా ముక్తిని నాశంచేసే తామస వృత్తులకు రాక్షసులనే అర్థం వ్యుత్పత్తి పరంగా చెప్పవచ్చు. క్షీరసముద్రం—అంటే భగవంతుని తమలో గ్రహింపజేసే సాత్త్విక మనోవ్యాపారం అనే అర్థం లోగడ చెప్పుకొన్నాం. సాత్త్విక మనోవ్యాపారంలో అంతర్గతంగా కొంత తమోవృత్తి కూడ చేరుకొని వుంటుంది. ఆ తమోవృత్తులతో విరోధపడక సఖ్యంగా వుంటూ వాటి సాయంతోనే సాత్త్విక గుణాన్ని మథిస్తేనే ముక్తినిచ్చే జ్ఞానం కల్గుతుంది. అదే దేవత లకు రాక్షసులతో కలిసి సఖ్యపడి క్షీర సముద్రాన్ని మథించండి అమృతం వస్తుందని అనేదానికి అంతరార్థం.

అమృతము అంటే మృతి లేనిది. అంటే జనన మరణ రాహిత్యాన్నిచ్చే ముక్తియే అమృత పదానికి అర్థం. అని సాత్త్విక వృత్తుల తామసిక వృత్తులను పొత్తు కల్గించి తమలో భేదంలేని రీతిని కలుపుకొని మథనం చేస్తే అంటే నిరంతరం ఆత్మ ధ్యానం సాగిస్తే ముక్తిమార్గం ద్యోతక మౌతుంది. కాని తమోవృత్తుల్ని కలుపుకోక కాదని సాత్త్విక వృత్తులు మాత్రమే ముక్తిని సాధించడానికి యత్నిస్తే ఆ తమో వృత్తులు ఆ యత్నానికి విఘ్నం చేస్తాయనీ కాన కేవల సాత్త్విక వృత్తులు చాలవనే ముక్తి రహస్యం విష్ణువు దేవతలకు రాక్షసుల్ని కలుపుకోండి అని చెప్పిన దానిలో మనకు అంతరార్థ పరంగా ద్యోతక మవుతూంది. రాక్షసులు దేవతలు ఒకే తండ్రి బిడ్డలైనట్లే తామసిక సాత్త్విక వృత్తులు రెండూ కూడ ఒక సాధకుని మనస్సు కారణంగా పుట్టినవే. అవి విడిగా కాక కలిసి వుండేటట్లు సాధన చెయ్యడమే దేవా సురులు కలిసి అమృతము కోసం క్షీరసాగర మథనం సాగించేరన్న దానిలోని సాధనా రహస్యం.

"క్షీరసముద్రం మథించడానికి, కనక పర్వతాన్ని కవ్వంగా చేసికోండి.

'వాసుకి అనే పామును త్రాడుగా చేసికోండి' అని కూడ హరి దేవతలకు చెప్పేడు. కనకా చలాన్ని మంధరంగా చేయడం అంటే-క+న+క+ఆ చలం=బంగారు కొండ అని అర్థం. బంగారు పదం ప్రకృతికి పర్యాయ పదం అని లోగడ 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం' అని ఉపనిషద్వాక్యానికి తాత్పర్యంగా చెప్పుకొన్నాం. వాసుకి అన్నదానికి 'వస్' ధాతువునకు స్వార్థంలో 'కప్' ప్రత్యయం చేత రూపం చేయవచ్చు. 'వస్' అన్నదానికి ఉండడం అర్థం. వాసుకి అంటే అంతటా ఆవరించి వుండే మాయ అని అర్థం. అది పాము రూపంలో మూలాధారంలో కుండలిని అనే పేరుతో ఉంటుందని యోగ శాస్త్రజ్ఞులు చెప్తారు ఆ మాయను కనకాచలానికి అంటే ప్రకృతికి చుట్టబెట్టి సాత్త్విక వృత్తిని తామసిక వృత్తుంతో సఖ్యపరచి సముద్రాన్ని అంటే భగవద్భావాన్ని మథిస్తే గ్రహించే యత్నంతో అనగా భగవచ్చింతనంగల ఆలోచనా పరం పరలు సాగిస్తే **అమృతం** అంటే జనన మరణ రాహిత్య రూపముక్తి విజ్ఞానం లభిస్తుంది అన్నది పై వాక్యాలకు అంతరార్థంగా ద్యోతక మవుతుంది.

దేవదానవులు కనకాచలాన్ని మోసుకొని రాలేకపోతే గరుడుని మీద మోయించి తెచ్చి ఒక్కచేత్తో హరి క్షీర సముద్రంలో పడేశాడు. అంటే ప్రకృతిని సాత్త్విక వృత్తులు, తామసిక వృత్తులు కూడ కదల్చలేవనీ, గరుత్మంతుడు అంటే వేదం కాన గరుత్మంతుడు మోసేదన్న దానికి వేదవిజ్ఞానం. ఆ ప్రకృతిలాగి ఊడదీసి ఎత్తేసెయ్యగల సామర్థ్యం కలిగి వుందనీ అంతరార్థ పరంగా చెప్పాలి. ఛందోమయుడు గరుత్మంతుడుగా ప్రసిద్ధి వుంది అంటే వేదాలే గరుడుడన్నమాట. హరి అంటే వాసనా రాహిత్యం కల్గించే జ్ఞానం అన్నమాట. ఒక్కచేత్తో సముద్రంలో పడేసేడంటే ఒక్కచేత్తో అంటే అద్వైత సాధనతో అన్నమాట. సముద్రంలో పడేసింది అంటే ఆనంద రూప భగవంతుని గ్రహించేందుకు యత్నం అద్వైతంతోనే ప్రయత్నించాలి అనే అంతరార్థం ఇందులో వుందనాలి.

అప్పుడు మంధరం తన క్రింద ఆధారంలేక సముద్రంలో దిగబడిపోతూంది. అప్పుడు హరి, కచ్ఛపం లేక కూర్మంగా మారి దాన్ని నిలబెట్టేడు అంటే మాయను ప్రకృతికి చుట్టబెట్టి సాత్త్విక వృత్తులు తామసిక వృత్తుల తోడ్పాటుతో భగవద్ధ్యానాన్ని విస్తరింపజేసే సాధన చేస్తూంటే, ఆ సాధనా కాలంలో ఆ ధ్యానంలోని ప్రకృతి క్రిందకి దిగబడి పోవడం ప్రారంభిస్తుంది అంటే ధ్యానం నిలబడక క్రుంగిపోవడం జరుగుతూంటుంది అనే సాధనా విఘ్నం జరుగుతుందని అంతరార్థ పరంగా చెప్పాలి.

'కచ్ఛేపి బతి ఇతి కచ్ఛపం' అవుతుంది. కచ్ఛం అంటే నీటిఒడ్డు అని అర్థం. నీటి ఒడ్డుఉన్న నాచును తింటుంది అక్కడకు చేరి నీరు త్రాగుతుంది. కాన కచ్ఛపం అని తాబేలుకు వ్యుత్పత్తి పరమైన అర్థం. ఇక్కడ మంథరం మునిగిపోతుంటే తాబేలు దానికి ఆధారంగా నిలిచింది అంటే ఆనందరూప పరమాత్మని గ్రహించే తీవ్ర సాధనలో నున్నప్పుడు సాధకునికి మాయలో ప్రకృతిని కన్పించని అయోమయస్థితి ఏర్పడి సాధన యొక్క ప్రకృతి మునిగి పోతూంటే సాధకుడు తిరిగి భగవంతుని శరణాగతి పొందడంతో ఐహిక ప్రవృత్తిని ఆధారం చేసికొని తిరిగి సాధనలో నిలబడతాడు అనేది ఇక్కడ కూర్మావతార ఘట్టంలో మంథర పర్వతం మునిగిపోతూంటే హరిని వేడుకోవడంవల్ల హరి కూర్మావతారం ఎత్తి మంథర పర్వతాన్ని మోసేదన్న దానికి అంతరార్థంగా గ్రహించాలి.

ఇది ఎంతో గొప్ప సాధనానుభవ రహస్యంగా గుర్తించాలి. 'కూర్మం' అన్నా కచ్ఛపం అన్నా ఒకటే అర్థం వస్తుంది. కు + ఊర్మి = కూర్మి కూర్మలు కలది. కు = భూ సంబంధములైన, ఊర్మి = ఆకలి, దాహము, ఆశ, లోభము మొదలగు షడూర్మలు కలది జీవుడు అనే అర్థంలో కూర్మం అని వ్యుత్పత్తి పరంగా మనం వెనుకటి స్కంధంలో దశావతార ప్రస్తావనలో చెప్పుకొన్నాం. కచ్ఛప కూర్మ పదాలు రెండిటి వ్యుత్పత్తుల వల్లనూ ఒకే భావం వస్తూంది కూర్మస్థితి లేక కచ్ఛపస్థితి. ఈ సాధనావస్థలో ముఖ్యమైనది అంటే సాధకుడు ధ్యానంలో మునిగి పోకుండా తిరిగి ప్రకృతిలోనికి వస్తూండమనేది హరి కరుణవల్ల కలుగవలసిందే; అంటే వాసనా విముక్తి రూప పరమాత్మ యొక్క అనుగ్రహం వల్ల జరుగవలసిందే. దేవతల కోర్కెపైని హరి కూర్మావతారం ధరించేదన్న దానికి పై చెప్పినదే అర్థం.

ఏదైన పని నిరంతరం సాగించవలసి వచ్చినప్పుడు మధ్య మధ్య విశ్రాంతి పొందితేనే తప్ప లేకపోతే ఆ పనిలో నిరంతర ధ్యానస్థితివల్ల అయోమయస్థితి కల్గుతుందన్న విషయం ఈ కూర్మావతార ప్రసంగంవల్ల గ్రహించుకోవాలి. ఆ తర్వాత ఇంకో గొప్ప విఘ్నం ప్రాప్తిస్తుంది అదే హాలాహలం పుట్టడం. హ+ఆ+ల=హాల అవుతుంది. 'హా' అంటే నాశం చేసేది అని అర్థం. 'హన' ధాతువూపు. దానిని 'లాతి గృహ్ణాతి ఇతిలం' దానిని గ్రహించునది 'ఆ' సమంతాత్ అన్న అర్థం ఇస్తుంది. అంటే పూర్తిగా అని అర్థం.

పూర్తిగా నాశం కల్గించేది 'హాలం' అన్నది అవుతుంది. న+హాలం, హాలము కానిది అనగా నాశం కల్గించనిది. అనే అర్థంలో 'అహాలం' అనే రూపం అవుతుంది.

హాల+అహాలం=హాలాహాలం అని అవుతుంది అంటే నాశం కల్గించేది నాశ కల్గించనిది అవేకూడ అయిన ఒక విఘ్నం ఎదురైంది. అంటే ఆనందరూప భగవద్గ్రహణంలో నాస్తిక ఆస్తిక లక్షణాలు రెండూ హాలాహలస్థితి అన్నమాట. అది సాధకుని ఆవరిస్తుంది. సాధనా సిద్ధి రాబోయే ముందు సాధకునిలో భగవంతుడున్నాడా లేదా అనే సందేహస్థితితో తికమిక కల్గి సాధనను భ్రష్టం చేస్తుంది. ఇది కూడ సాధనా విఘ్న రహస్యాల్లో ఒకటి అని తెలిసికోవాలి.

సాధకుని తికమిక పెట్టడం కోసం దేహాధారమైన చేవకి ప్రకృతి కన్పించక మున్గిపోవడం, దైవం లేదేమో అనే సందేహాత్మక నాస్తిక దర్శనాల తార్కిక బుద్ధితో సాధకుడు ఒకసారి లోబడడం మరొకసారి ఆస్తిక దర్శనాల విజ్ఞానానికి మొగ్గు చూపడం అనే ద్వంద్వస్థితిలో పడడం జరుగుతుంది. ఆ సమయంలో భగవంతుని సాయం అర్థించాలి అప్పుడు భగవంతుడు ఆదుకొంటాడు. అదే శివుని దేవతలు ప్రార్థించడం శివుడు ఆ హాలాహలాన్ని తన కంఠంలో నిల్వరించి వుంచడం అన్న దానికి అంతరార్థంగా గ్రహించాలి. ఆస్తిక దర్శనాలు నాస్తిక దర్శనాలు అనేవి రెండూ ఋషులు వ్రాసినవే అయినా వానిని వివేచనా దృష్టితో చూస్తే నాస్తిక దర్శనాలు పూర్వపక్షంగా కన్పిస్తాయి. కాని ఆ విధంగా అద్వైతపరంగా అన్వయించుకోకపోతే నాస్తికతత్త్వం అలముకొని సాధకుణ్ణి భ్రష్టం చేస్తుంది.

అద్వైతం సాయుజ్య ముక్తితత్వ ప్రతిపాదకం కాన దానికి ఆస్తిక నాస్తిక దర్శనాలు రెండూ బంధించనూలేవు సంధించనూలేవు. ఆ రెండిటిని అది మధ్యగా ఉదాసీన బుద్ధితో చూస్తూ ఉంటుంది. అదే శివుడు క్రిందకీ పైకీ కూడ పోకుండా గళంలో నిగ్రహించేదంటే శివం అంటే మోక్ష సుఖం అంటే ముక్తి సాధనకు అద్వైత సాధకుడు దైవానుగ్రహంతో ఆస్తిక నాస్తిక వాదాలకు కట్టుబడడు అనేదే పై శివానుగ్రహానికి, విష నిగ్రహానికి అర్థం. తర్వాత పుట్టిన కామధేనువును ఋషులు స్వీకరించేరు. కామధేనువు అంటే కోరిన కోర్కెలను సిద్ధింపజేసే సిద్ధి. అది సాత్త్విక వృత్తి యొక్క మథనంలో ఆవిర్భవిస్తుంది. సాధకులను సిద్ధుల లాభం చేత ప్రలోభం కల్గించే విఘ్నాలు ఏర్పడి సాధనను భ్రష్టం చేస్తూంటాయి.

ఆ సిద్ధులను సాధకునిలోని ఋషిత్వం వహించిన అనంగ మనోవృత్తులు స్వీకరించేయి అని కామధేనువును ఋషులు స్వీకరించేరన్న దాని అంతరార్థం. ఋషిత్వం అంటే సర్వసంగపరిత్యాగంతో భగవద్ధ్యానం అని అర్థం. నిస్సంగస్థితి అని అర్థం. నిస్సంగ వృత్తులలో ఎన్ని కామములు అనుభవించినా అవి ముక్తికి

అద్దురావు కాన ఆ విధంగా జెప్పడం జరిగింది. తర్వాత ఉచ్చైశ్శ్రవం అనే అశ్వం పుట్టింది. 'శ్వ' అంటే 'రేపు' అని అర్ధం. 'అశ్వం' అంటే రేపటికి ఉండనిది అంటే నిత్యం మారుతూ ఉండేది అనే అర్ధంలో ప్రకృతి అని లోగడ చెప్పుకొన్నాం. ఉచ్చైశ్శ్రవస్సు అంటే గొప్ప ప్రఖ్యాతి అని అర్ధం.

ఈ విధంగా మిక్కిలి పేరు ప్రతిష్ఠలు పొందాలనే ప్రకృతి స్వభావానికి ఉచ్చైశ్శ్రవస్సనే అశ్వం అని పేరు. సాత్త్విక వృత్తులను మధనం జరిపినపుడు వానిలో నుండి పేరు ప్రతిష్ఠలు పొందాలనే కాంక్ష ఒకటి ఉద్భూతమవుతుంది. ఉచ్చైశ్శ్రవస్సును బలి అనే దైత్యరాజు స్వీకరించేడు. బలి అంటే తామస మనస్సు అనేది అర్ధం. లేదా 'వబయోర భేదః' అనే దానిచేత వ, బ లకు భేదం లేని కారణం చేత 'బలిః' అనేది 'వలిః' అని చెప్పుకోవచ్చు. అప్పుడు, వలతే = చుట్టుకొని యున్నది. అనే అర్ధంలో 'వలిః' అవుతుంది నిత్యము చుట్టుకొని యుండేది 'మాయ' కాన 'వలిః' అంటే మాయకు అంతరార్ధం చెప్పుకోవచ్చు. అశ్వమైన ఉచ్చైశ్శ్రవము అనగా అనిత్యములైన పేరు ప్రతిష్ఠలు మాయచే స్వీకరింపబడేవి. కాన ఆ పేరు ప్రతిష్ఠలను అజ్ఞాన కారణమైన తామస గుణాలివిగా గ్రహించి మాయకే వానిని వదలి వేయడమే 'బలి' అనే దైత్యరాజు ఉచ్చైశ్శ్రవమును స్వీకరించాడన్న దాని అంతరార్ధంగా భావించాలి. దాన్ని అజ్ఞానంగా భావించాలన్నదే దైత్యరాజగు బలికి వదలివేయ బడిందన్న దానికి అర్ధం.

తర్వాత ఐరావతం అనే తెల్లని ఏనుగు పుట్టింది. దానిని ఇంద్రుడు స్వీకరించేడు. 'ఈం, రాతి గృహ్ణాతి ఇతి ఈరం' అవుతుంది 'ఈరం' అంటే బుద్ధిని, రాతి = గ్రహించుట అనే మనోవ్యాపారం ఈ రా ఆను దానిమీద కలది అనే అర్ధం మతుప్ ప్రత్యయం చేస్తే 'ఈరావతం' అవుతుంది. దానికి స్వార్ధంలో అణ్ ప్రత్యయం చేర్చగా ఆది వృద్ధి వచ్చి 'ఐరావతం' అని అవుతుంది. అంటే బుద్ధిని గ్రహించే వ్యాపారం కలది బుద్ధితత్త్వం అని దానికి అర్ధం బుద్ధి అనేది మనస్సును క్రిందికి దిగజార్చకుండా ఉన్నత స్థితికి తీసికొని వెళ్ళేది. బుద్ధి తత్త్వం కల్గిన తర్వాత సాధనలో పతనం వుండదు ఆ బుద్ధి తత్త్వమును అంటే ఆ ఐరావతం తెల్లనిది అనగా శుద్ధ సత్త్వ సంబంధమైనది. దానిని ఇంద్రుడు అనగా సాధకునిలోని జీవుడు స్వీకరించింది. అనగా సాత్త్విక మధనంలో బుద్ధి ఆవిర్భవిస్తుంది. దానిని సాధకుడు స్వీకరిస్తాడు అనే అంతరార్ధ రహస్యం ఇందులో వుంది.

తర్వాత అప్సరసలు పుట్టేరు, అప్ = నీటియందు సరసః = వ్యాపించి

యుండునవి. అవి భగవత్ సంబంధమైన శక్తులు. ముందు నీటిని సృష్టించి యందు భగవంతుడు తన శక్తిని ఉంచాడు. అని 'అప ఏవస సర్జా దౌతాసు వీర్యే మపా సృజత్' అని శ్రుతి చెప్తూంది. ఆ అప్సరసలు (భగవత్ శక్తులు) దేవతలకు అనగా సాత్త్విక గుణాలకు చేరేయి.

తర్వాత కౌస్తుభం, శ్రీదేవి పుట్టేరు. వానిని విష్ణువు స్వీకరించేడు. 'కు' అంటే భూమి అని అర్థం. స్తుభ = అంటే పూజించుట అని అర్థం. 'కుస్తుభ' అంటే భూమి యందలి జనుల యొక్క పూజ అని అర్థం. 'కుస్తుభ' అనేదే స్వార్థమందు అణ్ ప్రత్యయం చేయగా ఆదివృద్ధి వచ్చి 'కౌస్తుభ' అనే రూపం అవుతుంది. భూమి యందలి జనుల పూజ అనే అర్థం దానికి వుంది. ఆ కౌస్తుభాన్ని విష్ణువు స్వీకరించేడు. సాత్త్విక వృత్తి మధనంతో భూ ప్రజల పూజ లభిస్తుంది. దానిని సాధకుడు తనలోని సర్వవ్యాపక పరమాత్మకు అనగా విష్ణువుకు సమర్పించేను. అనేది ఇక్కడ అంతరార్థపరంగా చెప్పాలి.

శ్రీ అంటే 'శ్రా హిం సాయాం' అనే ధాతువు నుండి నశించే ప్రకృతి సంపద అని అర్థం. అది స్వయంగానే ముకుందుని చేరుకొన్నది. ముకుందుడు అంటే మోక్షం ఇచ్చే వానిని అని అర్థం. అనగా పరమాత్మను తానై చేరుకొన్నది. శ్రీ అనగా ప్రకృతి 'లక్ష్మి' అనిపించుకొంటుంది. లక్ష్మి అనగా చిహ్నం అని అర్థం పరమాత్మ యొక్క రూపమే ప్రకృతి కాన అది పరమాత్మనే ఆశ్రయించి యుండి లక్ష్మి అనిపించుకొంది.

తర్వాత 'పారిజాతం' పుట్టింది. 'పరితః జాయతే ఇతి పారిజాతం' అంతటను ఉండే భగవచ్ఛక్తి అని అర్థం. దానిని దేవతలు అనగా జ్ఞానదీప్తినిచ్చే మనోవృత్తులు స్వీకరించేయి. సాత్త్విక వృత్తి యొక్క మధనంలో అంతటా భగవచ్ఛక్తి పుట్టి వుంది అనే భావం స్ఫురిస్తుంది దానిని జ్ఞానదీప్తి గ్రహిస్తుంది అనే అంతరార్థం పారిజాతాన్ని దేవతలు స్వీకరించేరన్న దాని అర్థం.

ఆ తర్వాత 'వారుణి' అంటే ప్రమత్త గుణం బయలుదేరుతుంది. దానిని రాక్షసులు గ్రహించేరు. అంటే సాధకుడు తనలోని తామసిక వృత్తికి ప్రమత్తతను అర్పించేడన్న మాట. మత్తు కల్గడం తామస లక్షణం. అది జ్ఞానులు స్వీకరించరు. జ్ఞానులెప్పుడు అప్రమత్తులు గానే ఉంటారు. అజ్ఞానులే ప్రమత్తులుగా వుంటారు.

తర్వాత ధన్వంతరి పుట్టేడు. అతడు ఔషధములచే ఆయుష్యమును వృద్ధి చేయు ఆయుర్వేద కర్త. అతడు విష్ణువు యొక్క అవతారాలలో ఒకడు. ధన్వంతరి

కాదు, ధన్వంథరి అనాలి. 'ధన్వం' అంటే బాణాలను 'ధరి' అంటే ధరించి వుండేది శరధి అనగా అమ్ముల పొది. బాణాలతో దుష్టులను హరించి శిష్ట రక్షణ చేసినట్లే ఔషధాలతో వ్యాధులను హరింపజేసి భగవద్ధ్యానం సిద్ధించే వరకు ఆయుర్దాయమును పెంచుకోవాలి.

ఆయుర్దాయం ఎంత కాలం వుంటే అంతకాలం భగవదారాధన చెయ్యడం సంభవిస్తుంది. భగవంతుడు ప్రజలకు ఆయువు పెంచడానికి ఆయుర్విజ్ఞానాన్ని (ఆయుర్వేదాన్ని) ప్రసాదించేడు. అదే ధన్వంతరి అవతారం. ఔషధములనే బాణాలను ధరించిన అమ్ముల పొదివంటిది ఆయుర్వేదం అనే అర్ధంలో ధన్వంధరి రూపానికి అంతరార్థం చెప్పుకోవాలి; సాత్విక వృత్తి మథనం జరిగేటప్పుడు అనగా పరమాత్మను అన్వేషించే యత్నం జరిగేటప్పుడు సాధకునకు దైవానుగ్రహం వల్ల రోగాలు ఏవీ రావనీ, ఆయుర్దాయం అతను కావాలను కొన్నంత కాలం వృద్ధి అవుతూనే వుంటుందనీ క్షీరసాగర మథనంలో భగవద్రూపుడైన ధన్వంధరి పుట్టేడన్న దాని అంతరార్థం. యోగులు కుంభకంలో నుండి భగవంతుని ధ్యానం చేస్తూన్నప్పుడు వారి శరీరానికి శైథిల్యం వుండదు. వారి చుట్టూ పుట్టలు చెట్లు మొలిచినా దాని ఆరోగ్యం భంగం కాదు. ఆయువు పోవడం అనేది అసలే వుండదు. కనుకనే యోగులు వందలాది సంవత్సరాలు బ్రతికి వుండడం మనం ఇప్పటికీ వింటూనే వున్నాం. ఇది యోగ రహస్యంగా భావించాలి.

ఆ తర్వాత చిట్టచివరకు అమృతం పుట్టింది అనగా చావులేని స్థితి అనగా నిత్యానంద స్థితి ముక్తి స్థితి కల్గుతుంది అన్నదే చివరకు అమృతం లభించిందని చెప్పడంలోని అర్థం.

అమృతాన్ని రాక్షసులు అపహరిస్తూండగా మోహిని అవతరించింది. రాక్షసులు అనగా తామసిక వృత్తులు సాత్విక వృత్తులకు అమృత స్థితి అనగా ముక్తి రాకుండా అడ్డు నిలుస్తాయి అన్నదే రాక్షసులు అమృత భాండం హరించేరన్న దాని అంతరార్థం. అప్పుడు మోహిని వారిని ఆకర్షించింది. అది విష్ణువు యొక్క అవతారం.

మా+ఊహ= 'మోహం' అవుతుంది. మోహం కలిగించేది 'మోహిని' అవుతుంది. 'మా' అంటే లేనిది అనగా మాయ, మాయను సంబంధించిన తలంపులు మోహం అన్న మాటకు అర్థం మాయలో పడవేసేది మోహిని అన్న మాటకు అర్థం. సుగతిని కోరని అసురులకు మాయాప్రకృతి యందే ఆసక్తి కల్గుతుంది. ఆ మాయా

స క్తితో వారు దొరికిన అమృతాన్ని కూడ వికుస్తారు అదే మోహిని కన్పించగానే ఆమె చేతిలో రాక్షసులు అమృత భాండాన్ని పెట్టేరన్న దాని అంతరార్థం. అంటే అంతలోనే సాధకునిలోని తామసిక వృత్తులు సాత్త్విక వృత్తుల నుండి అమృతాన్ని అపహరించి అంతలోనే మాయా ప్రకృతి సుఖాలకు వశపడి పోయారనే అంతరార్థ రహస్యం ఇందులో ఇమిడి వుండి.

చివరి దశలో సాత్త్విక వృత్తులకు భగవత్కృపతో మాయా ప్రకృతి యొక్క తోడ్పాటు ఉంటుంది ఆ కారణం చేత విష్ణురూప మోహిని అమృతాన్ని దేవతలకే పంచింది అని చెప్పుకోవాలి. రాక్షసుల పంక్తి నుండి స్వర్భానువు దేవ పంక్తికి చేరాడు అంటే తామసికవృత్తులలో కూడ ఒక్కొక్క వృత్తి అమృతమైన సుఖాన్ని ఆశించేది వుంటుంది. అదే స్వర్భానువు. అంటే స్వర్గమును గూర్చిన ప్రకాశ మనోవృత్తి అని దానికి అంతరార్థం చెప్పాలి. ఆ స్వర్గేచ్ఛగలది తామసిక వృత్తియే. అది స్వర్గ సుఖాలను చావు లేకుండా అనుభవించాలని కోరేది. దానికి ముక్తి కోరిక వుండదు. కాన అమృతం లోనకి దిగకుండానే విష్ణురూప మోహిని దానిని సుదర్శనంతో ఖండించి వేసింది. సుదర్శనం అంటే చక్కని జ్ఞానం కల్గించే దర్శన శాస్త్రాలు అని అర్థం. అవే షడ్దర్శనాలు అనబడే శాస్త్రాలు. ఆ దర్శనాల్లో కొన్ని నాస్తిక దర్శనాలు, కొన్ని ఆస్తిక దర్శనాలు ఉన్నాయి. ఆ రెండు విధాల జ్ఞానమే స్వర్భాను పదానికి అర్థం అవి స్వర్గ సుఖాల్ని కూడ చెప్తాయి.

స్వర్భానువు సుదర్శనం చేత ఖండింపబడి రెండు ఖండాలుగా ఏర్పడినా రెండూ జీవించే వున్నాయి అంటే దర్శనాలని రెండుగా విభజింపబడి నప్పటికి రెండూ ప్రజల చేత ఆదరింపబడుతూనే వున్నాయని దాని అంతరార్థం. ఒక ఖండం సూర్యుణ్ణి రెండవ ఖండం చంద్రుణ్ణి ఆవరించి వేస్తాయి. సూరి పదం నుండి సూర్య పదం ఏర్పడుతుంది. సూర్య అంటే కర్మప్రతిపాదక వేద విజ్ఞానం అని అంతరార్థ పరంగా చెప్పుకోవాలి. సూర్యుడు కర్మ సాక్షి 'చది' అహ్లాదే ధాతువు వల్ల చంద్ర పదం పుట్టుతుంది. ఆహ్లాదం అంటే పూర్తియైన ఆనందం అని అర్థం అఖండ సంపూర్ణానందం ఉపనిషత్తుల వల్ల (వేదాంతము వల్ల) లభిస్తుంది. రెండిటినీ స్వర్భానువు ఆవరిస్తుంది. అంటే స్వర్గాది సుఖలు వేద కర్మాచరణం వల్లను ముక్తి విజ్ఞానం ఉపనిషద్విజ్ఞానం వల్లను లభిస్తాయని అర్థం.

ఈ విధంగా సాత్త్విక వృత్తితో భగవదన్వేషణ జరుపుతే కష్టాలు తొలగి సకల సుఖాలు కలిగి చివరకు పరమాత్మానందంలో సాధకుడు లీనమై ముక్తుడౌతాడు అనే

అంతరార్థ జ్ఞానరహస్యాన్ని ఈ క్షీర సముద్ర మధనం కూర్మావతార ఘట్టం, మోహిని అవతార ఘట్టం మనకు విశదం చేస్తున్నాయి. కనుకనే ఈ కథ భుక్తి ముక్తి దాయకంగా ఫల[శు]తిలో వ్యాసమహర్షి నిర్దేశించడం జరిగింది.

సా ధ న :

సాధకుడు సాత్త్వీక గుణంతోనే ముక్తి సాధించాలి. తామస శక్తులు తలెత్తి నపుడు వానిని బుజ్జగిస్తూ తనకు వానిని తోర్పాటు చేసికొంటూ ప్రకృతిలో మాయా వరణంలో మెలకువతో జీవిస్తూండాలి. అప్పుడు ధ్యాన సాధన జరిగే కాలంలో ధ్యానం ఒకప్పుడు సాగకపోతే కొంతసేపు ధ్యానం నిలిపి ఐహిక విషయాలు అనుభవంతో గడిపి తిరిగి ధ్యానం ప్రారంభించాలి. ఇదే కూర్మం మంధరం దిగకుండా ఆదు కోవడంలోని అంతరార్థ రహస్యం. ఆ తర్వాత ధ్యానం ఎంత సాగించినా లాభం కల్గనట్లు అనిపించి అసలు దేవుడున్నాడా లేదా? అనే సంశయం సాధకునకు పుట్టు కొస్తుంది. ఆ సంశయాన్ని స్వీకరించనూ కూడదు. అసలు విడిచి వేయనూ కూడదు దానిని పైకి తేలకుండా క్రిందకు పోకుండా అణిచి ఉంచాలి. ఇది విఘ్నదశలలో ప్రధానమైనది. ఇదే హాలాహలం పుట్టడం దాన్ని శివుడు కంఠంలో అది వుంచడం అన్న దాని అంతరార్థ సారాంశం.

తర్వాత అనేక సిద్ధులు లభిస్తాయి. వాటిని కాదని త్రోసివేయక తనలోని ప్రకృతి శక్తులలో ఇముడ్చుకోవాలి. అవే కౌస్తుభాదులు పుట్టడం వానిని విష్ణువు మొదలైన వారు స్వీకరించడం అన్న దానిలోని అంతరార్థ సారాంశం. చిట్టచివరకు అఖండ సచ్చిదానంద రూప పరమాత్మ స్వాధీనమౌతుంది. అప్పుడు సాధకుని లోని తామస శక్తులన్ని పుంజుకొని వానిని స్వాత్త్వీక వృత్తుల కందకుండా చేస్తాయి. అప్పుడు సాధకుడు తనలో సర్వత్ర అనగా తనలోని తామసిక శక్తులలో కూడా వ్యాపించి యున్న పరిమాత్మను ఏకాగ్రతతో ధ్యానిస్తే తామసిక శక్తులకు మాయ ఆవరిస్తుంది. అమృతం అనగా జనన మరణ రాహిత్య ముక్తావస్థ సాధకుని స్వాత్త్వీక వృత్తులకు లభిస్తుంది. ఇది క్షీర సాగర మధన కథలోని సాధనా రహస్యం. ఇది చాలా శ్రేయస్కరమైనదీ సులభమైనదీ యైన సాధన.

ఇది దేవతలకు హరి కరుణతో అమృతాన్ని ప్రసాదించిన కథ. అట్లే ఇది సాత్త్విక గుణవృత్తులు గలవారికి హరి కరుణతో మోక్షాన్ని ప్రసాదించే ముఖ్యసాధన.

వామన చరిత్ర, మత్స్యావతార చరిత్ర

అనే ఈ కథలు రెండూ 4 వ స్కంధంలో అవతారాలు అనే శీర్షికలోనే విపులంగా చర్చించడం వల్ల తిరిగి చెప్పడం అప్రస్తుతమని ఈ స్కంధంలో వదలి వేయడమైనది. కూర్మావతార కథ. క్షీర సాగర మధన కథతో జోడింపబడి మూలంలో తిరిగి చెప్పబడుటచే కూర్మావతార కథా, జయ విజయుల శాప వృత్తాంతంతో జోడింప బడి మూలంలో తిరిగి చెప్పబడుటచే, వరాహావతార కథ, నృసింహావతార కథా కూడ, నాల్గవ స్కంధంలో అవతారాలలో చెప్పబడినవే యైన, మరి కొన్ని విశేషాలు చెప్ప బడుట చేత పునరావృత్తమునే అయినా ఇందు వివరించక తప్పనూలేదు. పాఠకులు ఆయా కథలు తిరిగి తిరిగి వృత్తములైనందుకు విసువు నందవలదని ప్రార్థించుచున్నాను. ఆధ్యాత్మికము గంభీరమైన వస్తువగుటచేత కొన్ని కొన్ని యెడల చెప్పినవే పునః పున ఆ వృత్తములు కాక తప్పదు.

అట్లు చెప్పుటవల్ల ఒక చోట నున్నది మరొక చోట అనుసంధా నందు కోవలసిన శ్రమ పాఠకులకు తప్పుతుంది కాన పాఠకులుపయోగం కోసం కొన్ని విషయాలు పునరావృత్తములు కావాలనియే చేయబడినవి. కాన ఇందులకు పాఠకులు మన్నింతురు గాక !

# అంతరార్ధ భాగవతం

## నవస్కంధం (బ్రహ్మ వాచ దర్శనం)

# అంబరీషో పాఖ్యానం

## (ద్వాదశీవ్రత సాధన)

సప్తద్వీపవతియైన భూమిని సంపదలతో పాలిస్తూ అంబరీషుడనే రాజు ద్వాదశీ వ్రతం చేస్తూ కృష్ణుని ఆరాధిస్తూండేవాడు. "ఆరిరాధయిషః కృష్ణం" అని వ్యాసుడు అంబరీషుణ్ణి కృష్ణారాధకుణ్ణిగా చెప్పేడు. అతని వద్దకు ఒక ద్వాదశినాడు దుర్వాసుడనే ముని అతిథిగా వచ్చేడు. ఆ ముని యమునా నదిలో స్నానం చెయ్యడానికి వెళ్ళి ఎప్పటికీ రాలేదు. ద్వాదశి ఇక ఒక గడియసేపు మాత్రమే ఉందనగా అంబరీషుడు

వ్రతలోపం రాకుండా విప్రులు చెప్పిన ప్రకారం నీటిని పానం చేసి ద్వాదశీవ్రతం నిర్వ ర్తించేడు. దుర్వాసుడు తాను రాకుండా వ్రతం పూర్తి చేసినందులకు మండిపడి జటను పీకి కృత్యగా అభిమంత్రించి అంబరీషునిపైకి ప్రయోగించేడు. అది భూమిని కంపింప జేస్తూ అగ్నిజ్వాలతో వచ్చింది. దాన్ని చూచి అంబరీషుడు ఒక్క అడుగుకూడ వెనుకకు కదలలేదు. వెంటనే సుదర్శన చక్రం ఆవిర్భవించి ఆ కృత్యను సంహారం చేసి దుర్వాసుని వెంటబడింది.

దుర్వాసుడు సుదర్శనాన్ని తప్పించుకోవడానికి మూడు లోకాలు తిరిగేడు. కాని అది తన్ను వెన్నంటియే వుంది. దుర్వాసుడు చివరకు విష్ణువును చేరి వేడు కొన్నాడు. అప్పుడు విష్ణువు 'నేను భక్తపరతంత్రుడను కాన నేను నా భక్తునికి ద్రోహం చేసిన నిన్ను రక్షింపలేను. నీవు అంబరీషునే వేడుకో' అని పంపివేశాడు. అంతట గతిలేక దుర్వాసుడు వెళ్ళి అంబరీషుని పాదాలు పట్టుకొన్నాడు. అంత అంబరీషుడు సుదర్శన చక్రాన్ని ప్రార్థించగా అది తిరిగి వెళ్ళిపోయింది.

తర్వాత అంబరీషుడు రాజ్యం విడిచి అరణ్యానికి పోయి తపస్సుచేసి వాసు దేవుని చేరుకొన్నాడు.

ఈ అంబరీషుని చరిత్ర చదివినవారు, విన్నవారు భగవంతుని కీర్తిస్తూ, ధ్యానిస్తూ ముక్తి పొందుతారు. అని ఫలశ్రుతి చెప్పబడింది.

సప్త ద్వీపవతియైన భూమిని సర్వసంపదలతో అంబరీషుడు పాలిస్తూన్నాడు. అతడు కృష్ణుని సేవిస్తూన్నాడు. 'అంబరం' అంటే ఆకాశం. 'అంబరం అస్య అస్తి ఇతి' 'అంబరి' అవుతుంది. ఆకాశం రూపంగా కలవాడు భగవంతుడు అని 'అంబరి' అనే పదానికి వ్యుత్పత్త్యర్థం చెప్పాలి.

'పంచభూతాలు' అంటారు కాని పద్ధాకాశ, వాయువులకు రెండింటికి భూత సంజ్ఞ సిద్ధించదు. భూతం అంటే పుట్టినది అని అర్థం. వ్యక్తమైన దానినే అనగా కంటికి కనిపించే దానినే భూతం (పుట్టినది) అని చెప్పాలి. ఆకాశమూ, వాయువూ సహజ సిద్ధములే కాని పుట్టినవి కావు. అవి కంటికి కన్పించవు. 'ఆకాశం బ్రహ్మ' అని బ్రహ్మ సూత్రాల్లో చెప్పబడివుంది. వాయువుకూడ అంతే. ఈ రెండూ పోతే మిగిలిన పృధి వ్యాపస్తేజస్సులే భూతాలు. ఈ త్రివృత్కరణమునే (మూడింటిని) బ్రహ్మసూత్రములు భూతములుగా చెప్పివున్నాయి.

కాన ఆకాశం స్వయం సిద్ధమైన బ్రహ్మస్వరూపం అన్నమాట. ఆ బ్రహ్మ స్వరూపం జ్ఞానరూపమే అనాలి. కాన 'అంబరి' అనుమాట కర్థం జ్ఞానరూప పర

మాత్మ అన్న మాట అంబరి యందు 'ఈష' కలవాడు అంబరీషుడౌతాడు. 'ఈష' అంటే కోరిక. జ్ఞానమందు కోరికగలవాడు అంబరీషుడు. అనగా జ్ఞానంతో తరించా లనే జీవుడు అన్నది అంబరీషుడు అన్న మాట కంతరార్థంగా చెప్పాలి. అతడు 'సప్త ద్వీపములతో కూడిన భూమిని పాలిస్తున్నాడు. అంటే సప్త ధాతువులతో నిర్మితమైన దేహం కల్గి వున్నాడని అర్థం అంబరీషుడు సకల సంపదలను అనుభవిస్తూన్నాడు అంటే జ్ఞాన తృష్ణతో సాధకుడు ఇంద్రియ వ్యాపారముల జరుపుకొంటున్నాడని అర్థం. జ్ఞానం అనేది అసంగయోగంతోనేకాని అలవడదు కాన సాధకుడు అసంగయోగంతో అంటి అంటని రీతిగా సకలేంద్రియ భోగాలను అనుభవిస్తూన్నాడు అని ఇక్కడ అర్థం.

అతడు కృష్ణుణ్ణి సేవిస్తూ ద్వాదశీవ్రతం నిష్ఠతో జరుపుతున్నాడు. అంబ రీషుడు కృష్ణుని ఆరాధిస్తున్నాడు అనే అర్థంలో 'ఆరి రాధ యిషః కృష్ణం' అని వ్యాసుడు అన్నాడు. కృష్ణుడు అంటే ద్వాపర యుగం లోని కృష్ణుడనే అర్థం ఇక్కడ పొసగదు. కృష్ణుడు ద్వాపర యుగం లోని వాడే అయినప్పుడు కృష్ణుడు అంబ రీషుని కాలంలో ఎట్లుంటాడు? ఆ కారణంచేత * "కృషిర్భూవాచకశ్శబ్దః ణశ్చనిర్వృతి వాచకం తయోరైక్యం పరబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే" అనే దాన్నిపట్టి ఇచ్చట కృష్ణ పదానికి పరబ్రహ్మ స్వరూపం అనే అర్థం చెప్పాలి కాని అవతార కృష్ణుడు అర్థం కాదు. ఇంక ద్వాదశీవ్రతం నేడు ప్రజలు ఆచరించే విధానం ఇక్కడ తెలియజేస్తు న్నాను.

ద్వాదశీ వ్రతం నిష్ఠగా చేసేవారు ప్రతి దశమి తిథినాడు ఏకభుక్తం చేస్తారు అంటే పగటిపూట మాత్రం భోజనంచేస్తారు. ఏకాదశినాడు ఏమీ తినకుండా పూర్ణంగా ఉపవాసం ఉంటారు. ఉపవాసం అంటే నిరాహారంతో వుండడం అనేదే ఆచరణలో అర్థంగా వుంది ద్వాదశినాడు. ద్వాదశి తిథి ఉండగా అనగా ద్వాదశి గడియలు దాట కుండా బ్రాహ్మణులకు భోజనం పెట్టి తాము సంపూర్ణంగా తృప్తిగా భోజనం చేస్తారు. ఇది ద్వాదశి వ్రతంగా నేటికీ అమలు చేయబడుతూంది.

పై చెప్పిన ఈ ద్వాదశీ వ్రతానికి అంతరార్థం వుంది. బాహ్యార్థంలో భోజన నియమమే ప్రధానంగా చేసే వ్రతంలో భగవత్ప్రీతి కల్గడం అనేది అసంభవం.

---

* 'కృషి' ధాతువునకు భూమి అర్థం "ణ" అంటే "న" అన్నదానికి లేకపోవుట అని అర్థం కాన "కృష్ణ" అంటే భూ సంబంధమైన వాసనలు లేని తత్త్వం అనగా నిర్వృతి తత్త్వం అన్న మాట. అనగా పరబ్రహ్మ స్వరూపం అని పై శ్లోకానికి అర్థం.

ద్వాదశీ వ్రతంవల్ల విష్ణువు సంతుష్టుడై ముక్తి నిస్తాడనేది బాహ్యార్థ ప్రకారం చేసే వ్రతం వల్ల జరిగేది కాదు. 'ద్వాదశి' అంటే పన్నెండవది అని అర్థం - పది ఇంద్రియాలు, పదనొకండవది మనస్సు లేక జీవుడు. పన్నెండవది పరమాత్మ. ఇవన్నీ మనలో నున్నవే. పన్నెండవది యగు పరమాత్మను గూర్చి దీక్షగా ధ్యానం నడుపడమే ద్వాదశీ వ్రతం అంటే ఈ వ్రతం నడిపేవారు దశమినాడు ఏకభుక్తం చెయ్యాలి. ఏకాదశినాడు నిరాహారంగా ఉండాలి. ద్వాదశి మించి పోకుండా పూర్ణాహారం స్వీకరించాలి. ముందు దశమినాడు ఏకభుక్తం చెయ్యాలి. దశమి అంటే పది ఇంద్రియాలు అన్న మాట. సాధకుడు ఈ పది ఇంద్రియాలు కోరినదంతా అనుభవింపనీయక సగం సగం మాత్రమే వాని కోరికలు తీరుస్తూ ఇంద్రియ నిగ్రహంతో జీవించాలి అన్నది 'దశమినాడు ఏక భుక్తం చెయ్యాలి' అన్నదాని అంతరార్థం.

ఆ విధంగా ఇంద్రియాలు పదింటిని ముందు అదుపులో పెట్టాలి. ఆ పైని ఏకాదశినాడు నిరాహారం అంటే పదకొండవది అయిన మనస్సును ఏ విషయం మీదికి పోకుండా కట్టివెయ్యాలి అన్నమాట. ఇంద్రియ నిగ్రహంతో మనోనిశ్చలత సాధకుడు సంపాదించాలని దానికి అంతరార్థం. సాధకుడు 'ద్వాదశి గడియల్లో ద్వాదశినాడు పూర్ణాహారం తీసికోవాలి' అంటే పన్నెండవది యగు పరమాత్మ తత్త్వం తనలో ఆవిర్భవించినపుడు, ఆ ఆవిర్భావం తనలో తొలగిపోకుండా ఆ పరమాత్మ ధ్యానాన్ని సంపూర్ణంగా నిలువరించుకోవాలి అన్నది దాని అర్థం.

అసంగయోగంతో జీవిస్తూ మొదట ఇంద్రియ నిగ్రహ సాధన తర్వాత మనో నిశ్చలతా సాధన ఆ తర్వాత పరమాత్మను గూర్చిన పూర్ణ ధ్యాన సాధన, వీనిని సాధకుడు తన జీవితంలో దీక్షగా నడిపించు కోవడమన్నదే ద్వాదశీ వ్రతం అంటే. ఈ వ్రతం నిష్ఠగా చేస్తే కృష్ణుడు అంటే నిర్వృతితత్త్వరూప పరమాత్మ సంతుష్టుడై అన్ని రకాల మాయా కార్యములను తన తత్త్వంతో దాటించి కైవల్య ముక్తినిస్తాడు.

అంబరీషుడు ద్వాదశీవ్రతం నిష్ఠగా జరిపిస్తూండగా ఒకప్పుడు దుర్వాసుడు అతిథిగా అంబరీషుని వద్దకు వచ్చేడు. అతడాతనిని ద్వాదశీ పారణానికి (భోజనానికి) నిమంత్రణం చేశాడు అంటే తనతోకూడ భుజించడానికి కోరేడు.

దుర్వాసుడు, దుర్ + వాసస్ = యస్య: దుర్వాసా:' అనే వ్యుత్పత్త్యర్థంలో చెడ్డదైన వాసస్సు కలవాడు దుర్వాసుడవుతాడు. వాసస్సు అంటే బట్ట. బట్ట మాయకు పర్యాయంగా వాడడం వుంది. బట్ట ఒంటిని కన్పించకుండా చేస్తుంది. మాయ పరమాత్మను గోచరింపకుండా చేస్తుంది. ఈ లక్షణ సామ్యంతో బట్ట మాయకు పర్యాయపదంగా

కవులు వాడుతూండడం వుంది. దుర్ = అంటే చెడ్డదైన వాసస్; మాయ అనేది కల వాడు దుర్వాసుడు. ఆతడు ద్వాదశీవ్రతం చేసే అంబరీషుని వద్దకు అతిథిగా వచ్చేడు. అతిధి అంటే తిథి నియమం లేకుండా పిలువకుండానే భోజనానికి వచ్చినవాడు. భగవద్ధ్యానం నిష్ఠగా జరిపించే సాధకుని పరీక్షించడానికి హఠాత్తుగా మాయ అవరిస్తుం దనే సాధనా విఘ్న రహస్యం ఈ దుర్వాసుని ఆగమనానికి అర్థంగా అంతరార్థపరంగా చెప్పాలి.

ఆతణ్ణి తనతో సహ పంక్తిని ద్వాదశీ పారణం జరుపుటకు అంబరీషుడు కోరేడు. దుర్వాసుడు యమునా నదిలో మునిగి కూర్చున్నాడు. అంబరీషుడు అనగా పర బ్రహ్మాన్వేషకుడైన సాధకుడు. దుర్వాసుణ్ణి ద్వాదశీ పారణకు నిమంత్రణం చేశాడంటే సాధకుడు తనకోని పండ్రెండవ తత్త్వమైన పరమాత్మ ననుభవానికి తెచ్చుకొనేటప్పుడు మాయను కూడ ఆ పరమాత్మ పంక్తిని నిలిపే సాధనకు పూనుకొన్నాడన్న మాట అంటే' మాయా ప్రకృతి పరమాత్మ కన్న భిన్నం కాదనే సంగతి సాధకుడు గుర్తించేడన్న మాట. దుర్వాసుడు యమునా నదిలో మునిగి కూర్చున్నాడు ద్వాదశీ గడియలు దాటేవరకు రానేలేదు.

యమునానది నీరు నలుపు. ఆ కారణం చేత ఇక్కడ తమోగుణం యమునా జలంగా పోల్చబడింది. మాయ తమోగుణ స్వరూపం భగవంతుని అనుభవానికి సాధకు నకు మాయ తోడు పడలేదనడమే దుర్వాసుడు యమునలో మునిగి అంబరీషునితో ద్వాదశీపారణ సమయానికి రాలేదన్న దాని అంతరార్థం.

తర్వాత దుర్వాసుడు అంబరీషునిపైని శక్తిని ప్రయోగించేడు అంటే మాయ సాధకుని వశపఱుచుకోవడానికి తీవ్రంగా యత్నించిందని అర్థం

శక్తిని చూచి అంబరీషుడు తన కాలు కదుపనైన లేదు. ఇక్కడ వ్యాసుడు

శ్లో॥ తామాపతంతీం జ్వలతీ
మసిహస్తాం పదాభువం
వేపయంతీం సముద్వీక్ష్య
న చచాలపదాన్ నృపః

అన్నాడు. చేత్తో కత్తిపట్టుకొని, మండిపడుతూ, భూమిని తన పాదాలతో వణకించివేస్తూ తన పైకి వస్తూన్న ఆ శక్తిని చూచి అంబరీషుడు, కాలు కూడ కదుపలేదు అని దాని అర్థం. అంటే భగవంతుని అన్వేషణలో నిష్ఠతో వున్న సాధకుడు మాయా

ప్రాగల్భ్యం ఎంతగా తనమీద పడినా కించిత్తు కూడ చలింపడు అనే సాధనా రహస్యం ఇందు స్పష్ట పఱచబడిందనాలి.

తర్వాత భగవత్ప్రేరితమై సుదర్శన చక్రం ఆవిర్భవించింది. అంబరీషుడు ఏమీ భగవంతుని వేడుకోనక్కర లేకుండానే భగవంతుడు సాధకునిలోని మాయా నాశనానికి సుదర్శనాన్ని పంపించేడు. అంటే సాధకునిలోని భగవతత్త్వం మేల్కొని సాధకుని లోని మాయమీద చక్కని జ్ఞానదృష్టిని ఆవిర్భవింపజేసిం దన్నమాట. సు=చక్కని, దర్శనం=దృష్టి అని సుదర్శన పదానికి అంతరార్థం. దుర్వాసుడు మూడు లోకాలు తిరిగినా, "దిక్కు కన్పించలేదు సాధకుని జ్ఞాన దృష్టితో అతనిలోని మాయాప్రకృతి దిక్కు లేకుండా పోయిందన్నమాట. జ్ఞాన దర్శనంతో త్రిగుణాలలో ఎక్కడ కూడ దాక్కొనే అవకాశం మాయా ప్రకృతికి వుండదన్నదే మూడు లోకాలలోనూ కూడ రక్షణ దుర్వాసునకు లభింపలేదన్న దాని అర్థం దుర్వాసుడు తర్వాత విష్ణువు వద్దకు వెళ్ళి వేడుకొన్నాడు. విష్ణువు నేను భక్త పరతంత్రుడను కాన నేను రక్షణ నీయలేను. నా భక్తుని ఆశ్రయించుమన్నాడు. అంటే మాయ సర్వవ్యాపక పరమాత్మను ఆవ రించియే యుంటుంది. అన్నది విష్ణువు దగ్గరకు దుర్వాసుడు వెళ్ళేడు. అన్నదాని అంతరార్థం విష్ణువు తన్ను మాయ ఆవరించినా, తన భక్తులు తన్ను చేరుకోవడానికి ఆ మాయావరణాన్ని తొలగించుకొనే శక్తి తన భక్తులకే ఇస్తాడు తానై తొలగించడం అనేది లేదు. అన్నదే తాను భక్త పరతంత్రుణ్ణని, తన భక్తుణ్ణే వేడుకొమ్మని చెప్పడం లోని అంతరార్థం.

తర్వాత అంబరీషుని దుర్వాసుడు వేడుకొంటాడు. అంబరీషుడు సుదర్శనాన్ని స్తుతిస్తాడు. దుర్వాసుడు వెళ్ళిపోతాడు. తర్వాత అంబరీషుడు రాజ్యం విడిచి అరణ్యంలో తపస్సుచేసి కైవల్య ముక్తిని పొందుతాడు.

సాధకునిలో కల్గిన జ్ఞాన పరిణతి వల్లనే అతడు తనలోనే వున్న మాయను తొల గించుకోడానికి తాను జ్ఞానదృష్టియొక్క సంపూర్ణావిర్భావాన్ని తనలో నిలుపుకొంటాడు. అప్పుడు మాయాజ్ఞానంలో పూర్ణంగా విలీనమైపోతుంది అదే అంబరీషుడు సుదర్శనాన్ని స్తుతించడం దుర్వాసుడు రక్షించబడటం అన్నదాని యొక్క అంతరార్థం. తర్వాత సాధకుడు జ్ఞానదృష్టితో చిరకాలం శాంతిగా జీవించి కైవల్యం పొందడమన్నదే అంబ రీషుడు అరణ్యంలో తపస్సుచేసి ముక్తి సాధించేడన్న దాని అంతరార్థం. అరణ్యం అంటే, న+రణ్యం=అరణ్యం అవుతుంది. రణ్యం అంటే ధ్వనించేది అని అర్థం. అరణ్యం అంటే ధ్వని లేనిది అనగా ప్రశాంతి అని అర్థం. ఇక్కడ వ్యాసుడు అంబ

రీషుని చేత చేయించి సుదర్శన స్తుతి సాధకులకు ఎంతో ఉపయోగకరమైనది. అందులో ఎక్కడా సుదర్శనం కేవలం ఆయుధంగాను, అన్ని ఆయుధాల్లాంటి ఆయుధంగా చెప్ప బడనే లేదు. సు=చక్కని, దర్శనం=దృష్టి అనగా జ్ఞానాన్ని అనే అర్థాన్నీ ఇచ్చేది అనే అర్థం గలదిగా ఆ స్తోత్రం వుంది. దాన్ని పాఠకులగు సాధకుల ఉపయోగార్థం ఇందు తాత్పర్య సహితంగా ఉదహరిస్తున్నాను.

శ్లో॥ త్వ మగ్నిర్భగవాన్ సూర్యః
త్వం సోమో జ్యోతిషాంపతి;
త్వమా పస్త్వం క్షితిర్వ్యోమ
వాయుర్మా త్రేంద్రియాణిచ

సుదర్శన ! నమస్తుభ్యం
సహస్రారాచ్యుత ప్రియ !

సర్వాస్త్ర ఘాతిన్ విప్రాయ
స్వస్తిభూయా ఇడ స్పతే !

త్వం ధర్మస్త్వ మమృతం సత్యం
త్వం యజ్ఞో ఒఖిల యజ్ఞభుక్

త్వం లోకపాల స్సర్వాత్మా
త్వం తేజః పౌరుషం పరం

నమస్సునా భాఖిలధర్మ సేతవే
హ్యధర్మ శీలాసుర ధూమకేతవే

త్రైలోక్య గోపాయ విశుద్ధ వర్చసే
మనోజవా యాద్భుత కర్మణే గృణే

త్వత్తేజసా ధర్మమయేన సంహితం
తమః ప్రకా శశ్చధృతో మహాత్మనాం

దురత్యయస్తే మహిమాగిరాం పతే !
త్వద్రూపమే తత్ సదసత్ పరావరం

యదా విసృష్టస్త్వ మనంజనే నవై
బలం ప్రవిష్టో ఒజితదైత్య దానవం

బాహూ దరోర్వంఘ్రి శిరోధరాణి
వృశ్చన్నజ స్రం ప్రధనే విరాజసే
సత్యం జగత్త్రాణ ఖల ప్రహాణయే
నిరూపిత స్సర్వసహో గదా భృతా

విప్రస్యచాస్మత్కుల దేవతేన
విధేహి భద్రం తదనుగ్రహోహినః

యద్యస్తిదత్త మిష్టం వా
స్వధర్మోవాస్వ నిష్ఠితః
కులం మోవిప్రదైవం చేత్
ద్విజోభవతు విజ్వరః

యదిమో భగవాన్ ప్రీతః
ఏకస్సర్వ గుణాశ్రయః
సర్వభూతాత్మ భావేన
ద్విజోభవతు విజ్వరః

తా॥ నీవు అగ్ని భగవానుడవు, నీవు సూర్యుడవు, నీవు నక్షత్రాధీశుడవగు సోముడవు, నీవు జలరూపుడవు, నీవు భూమివి, నీవు ఆకాశమవు, నీవు వాయువు, నీవుపంచభూతములు; వానిగుణములు కూడ నీవే. నీవు ఇంద్రియములు, సహస్రార చక్రంలో నాశనంలేని పరమాత్మకు ప్రియుడవు,నీవు సుదర్శనుడవు, నీకు నమస్కారం. నీవు సర్వాస్త్రములను నాశం చేస్తావు. ఈ బ్రాహ్మణుని రక్షించు. నీవు సర్వభూమిని పాలించుతావు. నీవు ధర్మము. నీవు అమృతము, నీవు సత్యము, యజ్ఞము నీవు. యజ్ఞ భోక్తవు నీవు, నీవు లోకపాలుడవు. సర్వాత్మవు. నీవు పరమ పురుషుని తేజస్సువు. నీవు సునాభుడవు. సకల ధర్మములకు సేతువు. అధర్మశీలురైన అసురులకు నాశకుడవు. మూడులోకాలను రక్షించుదువు. విశుద్ధ కాంతివి. నీవు మనోవేగము గలవానివి. అద్భుత కర్మ గలవాడవు. ఇట్టి నీకు నమస్కరిస్తున్నాను. ధర్మమయమైన నీ తేజస్సుచే, తమస్సు అణిగిపోతుంది. మహాత్ములకు నీ వల్ల ప్రకాశం కల్గుతుంది. బ్రహ్మదేవుడు కూడ నీ మహిమలు అతిక్రమించలేడు. మంచిచెడ్డల ఆవరణం రూపవత్తూ నీ రూపమే. నిరంజనుడగు వాని చేత నీవు ఉపయోగింప బడినప్పుడు వానికి బలము, ప్రతిష్ఠ, రాక్షస విజయము సిద్ధిస్తుండి. యుద్ధంలో నీవు శత్రువుల బాహువులను, పొట్టలను, తొడలను,

పాదాలను, తలలను నరికివేసావు. జగతును రక్షించటానికి దుష్టులను శిక్షించటానికి నీవు సమర్థుడవు అని భగవంతునిచేత నిర్ణయించబడి యున్నావు. మా కులదేవత రక్షించినట్లు నీవు ఈ విప్రుని రక్షింపుము. నేను సమర్పించినను నీకు ప్రియమైన దేదైన నున్నచో, నా ధర్మాన్ని నేను సరిగా నిర్వర్తించియే యున్నచో, ఇప్పుడే మా కుల దైవమైనచో ఈ ద్విజుడు బాధారహితుడగు గాక: సర్వగుణాశ్రయుడై అద్వితీయుడైన పరమాత్మ సర్వభూతాత్మ భావనచేత నా యందు సంతుష్టి పొందియున్నచో తప్పక ఈ ద్విజుడు బాధారహితుడగు గాక !

మామూలుగా ఆయుధాన్ని వేడుకోవడం అనేది వుండదు. ఆయుధానికి ఆ ప్రార్ధనను వినే శక్తి వుండదు గదా: అచేతనమైన ఆయుధాన్ని వేడుకోవడమేమిటి? దీనిని పట్టమే అది ఆయుధం కాదని, అది సాధకులలోనే వున్న జ్ఞాన దృక్పథం అని మనం గ్రహించాలి. ఆ జ్ఞాన దృక్పథాన్ని పెంచుకొనడానికి చేసే సాధనలలో ఈ సుదర్శనస్తుతి సాధన ఒకటిగా భావించాలి. ఈ విధంగా సాధకుడు తనలోనున్న సుదర్శనాన్ని తాను గుర్తించడమే ఈ సుదర్శనస్తుతిలోని అంతర్యంగా గ్రహించాలి. కనుకనే ఈ స్తుతి అంటే జ్ఞానపదం గానుండని గ్రహించాలి.

# హరిశ్చంద్రోపాఖ్యానం

## [ప్రకృత్యనుభవ సాధన]

సూర్యవంశంలో సత్యవంతుడనే వానికి త్రిశంకుడు పుట్టేడు. గురువగు వశిష్ఠుని శాపంవల్ల ఆతడు చండాలుడైనాడు. విశ్వామిత్రునివల్ల శరీరంతో స్వర్గానికి వెళ్ళేడు. ఇప్పుడు కూడ ఆకాశం మీద వున్నాడు. దేవతలు క్రిందికి త్రోసివేస్తే తల క్రిందుగా పడుతూ విశ్వామిత్రుని బలంవల్ల అట్లాగే నిలిచిపోయేడు. ఆతని కొడుకు హరిశ్చంద్రుడు. ఈతని గూర్చిన కారణంగానే విశ్వామిత్ర వశిష్ఠుల కలహం చిరకాలం జరిగింది.

ఈ హరిశ్చంద్రుడు సంతానం కొరకు నారదోపదేశంతో వరుణుని "నాకు కొడుకు పుట్టినట్లైతే వానితోనే, నీకు యజ్ఞం చేస్తాను అని ప్రార్థించేడు. వరుణుని అనుగ్రహంతో హరిశ్చంద్రుడుకి 'రోహితు'డనే వాడు పుట్టేడు. వెంటనే వరుణుడు వానిని

తనకు సమర్పించమని హరిశ్చంద్రుణ్ణి కోరేడు. 'నిర్దశ'డైన తర్వాత అంటే పది రోజులు పురుటి రోజులు గడిచేక శుచిగా ఉన్నప్పుడు నీకు సమర్పిస్తానని హరిశ్చంద్రుడు వరుణునికి చెప్పేడు. తర్వాత అడిగితే పాలదంతాలు వచ్చేక అని, తర్వాత రెండవసారి దంతాలు వచ్చేక అని, తర్వాత కవచధారణ వయస్సు వచ్చేక అని, హరిశ్చంద్రుడు గడువులు కోరుతూ కాలం గడుపుతూ వచ్చేడు. తన్ను వరుణుని కిచ్చేస్తాడనే సంగతి తెలిసి 'రోహితుడు' అరణ్యానికి పారిపోయేడు. వరుణుడు కోపించి హరిశ్చంద్రుడికి జలోదర రోగం కల్గించేడు.

అరణ్యంలో ఏడాది గడిపి ఇంటికి రావాలనుకుంటూన్న రోహితుని ఇంద్రుడు విప్రవేషంలో కనుపించి ఇంకా ఇంటికి వెళ్ళవద్దని, మరో ఐదు సంవత్సరాలు అరణ్యంలో వుండేటట్లు చేసేడు. ఆరవ సంవత్సరం రోహితుడు అజీగర్తుడనే బ్రాహ్మణుని యొక్క బాలుణ్ణికొని తనతో తోడుకొని ఇంటికి వచ్చి తండ్రిని ఆ బాలుణ్ణి తనకు బదులుగా యజ్ఞంలో వరుణున కర్పించి మాట నిలుపుకొమ్మని చెప్పేడు. ఆ బ్రాహ్మణ బాలుని పేరు శునశ్శేపుడు. హరిశ్చంద్రుడు వానిని యజ్ఞపశువుగా జేసి వరుణుని గూర్చి యజ్ఞం తలపెట్టేడు. విశ్వామిత్రుడు ఆ యజ్ఞంలో ఒక పురోహితుడుగా నున్నాడు. ఆనరయజ్ఞం ప్రారంభించడంతో వరుణుడనుగ్రహించి హరిశ్చంద్రుని జలోదర రోగంనుండి విముక్తుణ్ణిచేశాడు. విశ్వామిత్రమంత్ర బలంవల్ల శునశ్శేపుడు వధ్యస్థానంనుండి ఇంద్రానుగ్రహం పొంది స్వర్ణరథం ఎక్కి ఇంద్రలోకానికి వెళ్ళిపోయేడు. తర్వాత హరిశ్చంద్రుని సత్యవ్రతానికి మెచ్చుకొని విశ్వామిత్రుడు ఆతనికి, ఆతని భార్యకు బిడ్డనికి అవిహతమైన మోక్షగతిని ప్రసాదించేడు.

హరిశ్చంద్రుడు విశ్వామిత్రానుగ్రహం పొంది మనస్సును భూమిపై నిలిపి ఆపైని జలం పైని, ఆపైని అగ్నిపైని, ఆపైని ఆకాశమునందు, ఆపైని వాయువు నందు ధారణతో పంచభూతాల్లోను లీనంచేసి, ఆపైని సర్వభూతములందు నుండే పరమాత్మ యందు నిలిపి ఆ పరమాత్మయందు జ్ఞాన కళను ధ్యానించి ఆ జ్ఞాన కళను అజ్ఞానావరణం తప్పించుకొని, నిర్వాణ సుఖంతో వాసనా బంధము విడిచి ముక్తుడైనాడు.

ఈ కథలో బాహ్యార్థంలో అన్నీ అసంభవ విషయాలుగానే కన్పిస్తాయి. త్రిశంకువు బొందితో స్వర్గానికి వెళ్ళడంటే-ఆ సంకల్పం నెరవేరేదేనా ? విశ్వామిత్రుడు తలక్రిందుగా పడిపోతూన్న త్రిశంకుణ్ణి అక్కడే నిలబెట్టేయడం జరిగే పనేనా ? హరిశ్చంద్రుడు సంతానం కల్గితే వరుణుని కిచ్చివేస్తానని వాగ్దానం చెయ్యడమెందుకు ?

కావాలని కోరిన సంతానాన్ని తిరిగి ఇచ్చేస్తానని వెట్టి వాగ్దానం ఏమిటి ? రోహితుడు శునశ్శేపుణ్ణి కొని తేవడం, వానితో నరమేధ యజ్ఞం తండ్రి చేత చేయించడం వరుణునికి అనుగ్రహం కల్గడం అసంబద్ధాలుగా లేవా ! ఈ కథ కంతకు ఏదో అంతరార్థం వుండాలని పై అసంబద్ధ విషయాల వల్లనే తోస్తూంది.

సత్యవంతుని కొడుకు త్రిశంకువు. 'శంకువు' అని అర్థం అంటే 'శం' అంటే సుఖము 'కు' అంటే భూమి కాన 'శంకు' అన్నదానికి భూసంబంధ సుఖేచ్ఛ ఈషణము, అనగా సుఖం కోరే కోరిక, త్రిశంకు అంటే ఈషణత్రయం అని అర్థం సత్యవంతుని కొడుకు త్రిశంకువు అన్నదానికి సత్య పదార్థాన్ని అనగా ముక్తిని అన్వేషించే సాధకుడున్నాడనీ, ఆతనిలో షణత్రయం నశించనేలేదు అనీ అర్థం. ఈషణత్రయంతో కూడి వుండియే భగవదన్వేషణ చేసే సాధకుడు ఒకడున్నాడని చెప్పడమే త్రిశంకువు సత్యవంతుని కొడుకు అని చెప్పడంలోని అంతరార్థంగా భావించాలి.

దారేషణ, ధనేషణ, పుత్రేషణ కల సాధకుడు త్రిశంకువు. ఆతడు బొందితో స్వర్గాన్ని అభిలషించేడు. అంటే ఆ ఈషణత్రయలతో కూడిన కోరికలు ఉంటూండగానే ఇంద్రలోకం కావాలని అనుకొన్నాడు. ఇంద్రపదం మనస్సును చెప్తుందని లోగడ ఎన్నో సార్లు చెప్పుకొన్నాం. కోరికలు విడవని మనస్సుతోనే భగవంతుని చేరాలనే సాధకుని కోరిక త్రిశంకువు బొందితో స్వర్గం చేరాలని కోరేడన్న దానికి అర్థం. అది సాధ్యం కాదని స్వగురువైన వశిష్ఠుడు చెప్పేడు. వశి+స్థః వశిష్ఠ దౌతుంది. వశియై యుండువాడు అనగా మనస్సు ఇంద్రియ ప్రలోభం పొందకుండా వశంలో ఉన్నవాడు అని అర్థం. ఇంద్రియ నిగ్రహంతో తప్ప ఇంద్రియ వాంఛలతో భగవదన్వేషణ శక్యం కాదనడమే వశిష్ఠుడన్న మాట కర్థం. వశిష్ఠుడు త్రిశంకువును ఛండాల రూపం పొందుతావని శపించేడు అంటే ఈషణత్రయంతో దైవాన్ని ప్రాప్తించాలనే వాడు తమోగుణం పొందుతాడని ఆ శాపానికి అర్థం. విశ్వామిత్రుడు త్రిశంకువును స్వర్గానికి తన మంత్రబలం చేత పంపేడు. విశ్వ+మిత్రుడు అన్నది విశ్వామిత్రుడు అవుతుంది. విశ్వ పదానికి మిత్ర పదం పరంగా ఉంటే దీర్ఘం వ్యాకరణ విశేష సూత్రం వల్ల వస్తుంది. విశ్వ అంటే ప్రకృతిలో మిత్రుడుని అనగా భగవంతుని చూచి కలిసి వుండేవాడు అనగా ప్రకృతిలో అంతర్లీనంగా ఉండే భగవత్ శక్తిని గుర్తించే సాధనకే విశ్వామిత్రుడని పేరు. త్రిశంకువు అంటే ఈషణత్రయం కలవాడు అని కదా అర్థం ప్రకృతిలోని ఈషణత్రయాన్ని భగవత్స్వ

రూపంగా అనగా భగవత్ శక్తిగా చూడగల్గుతే ఇంద్రియ నిగ్రహంతో వేరే పని లేకుండానే మనస్సును సాధించి భగవంతుని చేరగల్గుతాడు అనే సాధనను ఇక్కడ త్రిశంకువు అనగా ఈషణత్రయం కల సాధకుడు చేపట్టేడని విశ్వామిత్రుని మంత్ర బలంతో త్రిశంకువు స్వర్గాన్ని చేరేడన్న దానికి అంతరార్థం. మొదట్లో ఇంద్రియ నిగ్రహం సంపాదించి ఆ పిమ్మట సర్వ ప్రకృతిలోను భగవత్ శక్తిని చూచే సాధన చేస్తే ఆ సాధన నిలబడుతుందే కాని ఇంద్రియాల వశంలోనే తాను వుండి బలవంతంగా తాత్కాలిక మనోనిగ్రహం పొంది ప్రకృతిలో భగవత్ శక్తిని చూడగల్గినా ఆ సాధన ఇంద్రియ నిగ్రహం నిలబడని కారణం చేత స్థిరంగా భగవంతుని చూడలేక పతనమౌతుందీ ఆ రకం సాధన తలక్రిందు సాధన ఔతుంది అన్నదే విశ్వామిత్ర బలంతో త్రిశంకువు స్వర్గానికి వెళ్ళినా తలక్రిందుగా త్రోసివేయబడ్డాడన్న దానిలోని అంతరార్థం. తర్వాత సాధకుడు విశ్వామిత్ర బలంతో అక్కడే ఉండిపోయేడన్న దానికి, ఈషణత్రయంతో కూడిన భగవదన్వేషణ సాధన పతన స్థితిలోనే అట్లాగే వుండిపోతుంది కాని సక్రమ స్థితికి ఎన్నటికీ రాలేదనే అంతరార్థం చెప్పాలి

త్రిశంకువునకు హరిశ్చంద్రుడు కొడుకు. 'హరి' అంటే ఇంద్రియ ప్రవృత్తులను హరించే మనోవృత్తి, 'చంద్రుడు' అంటే 'చది' 'ఆహ్లాదే' అను ధాతువు వల్ల ఆనందం కల్గించేది అని అర్థంలో నిర్విషయానంద మనోవృత్తి అర్థం. సాధకుడు త్రిశంకువై యుండి విశ్వామిత్ర సాధనతో అనగా ప్రకృతిని భగవంతునిగా చూచే సాధనతో తర్వాత ఇంద్రియ వృత్తులను హరింపజేసి జ్ఞానానందం పొందగల్గేడని త్రిశంకు సుతుడు హరిశ్చంద్రుడన్న దానికి అంతరార్థం. 'హరిశ్చంద్ర పదం' ప్రథమావిభక్తితో (ఆర్ష ప్రయోగంగా) అలుక్సమాసం అవుతుంది.

హరిశ్చంద్రుడు సంతానం కోసం వరుణుణ్ణి కోరి ఆ సంతానం కల్గుతే దాన్ని నీ కొఱకు యజ్ఞపశువుగా సమర్పిస్తానన్నాడు. "అంటే సాధకుడు ఎంతగా నిర్విషయ జ్ఞానం సంపాదించినా అతనికి ఈషణత్రయం జన్మ కారణం కావడంవల్ల ప్రకృతిని అనుభవించాలనే కోరిక అంతర్గతంగా వుండితీరుతుంది అన్నదే హరిశ్చంద్రుడు సంతానార్థియైనాడన్న దానికి అంతరార్థం.

సాధకుడు ఇంకా సాధనలో పూర్ణత పొందలేదని తాత్కాలికంగానే ఇంద్రియ నిగ్రహం కల్గి తద్వారా నిర్విషయానందం తాత్కాలికంగానే పొందే స్థితి మాత్రం పొందేడని పై దానికి సాధనాపరంగా అర్థం చేసికోవాలి. తన కోరిక తీరడానికి వరుణుణ్ణి నారదోపదేశంతో అర్థించేడు. నారదుడు అంటే జ్ఞాన ప్రదుడైన గురువు

అని లోగడ వ్యుత్పత్త్యర్థంలో చెప్పుకొనియే వున్నాం. సాధకునిలోని జ్ఞానం సాధకునకు గురువుగా ఏర్పడి సాధకునిలో ప్రకృతి విషయ వాంఛలు అనుభవంలో తీరితేనేకాని సాధన ఫలించదని ఉద్బోధించడమే హరిశ్చంద్రునికి సంతానం కావాలనే కోరిక కల్గించన్న దాని అంతరార్థం.

సంతానం అంటే సమూహం అని అర్థం. అంటే ఇంద్రియ విషయ వృత్తుల సమూహం అని అంతరార్థపరంగా చెప్పాలి. వరుణుడు జలదేవత—జలం అంటే జడం అన్న దాని రూపం (లడ యోర భేదః) జగం అంటే ప్రకృతి. ప్రకృతికి సంబంధించిన విషయానుభవం కోరడమే వరుణుని సంతానం కోరడమంటే, సంతానం కలిగేక దానితోనే నీకు యజ్ఞం చేస్తాననడం ఏమిటంటే—త్రిశంకువు సత్యవంతుని కొడుకు (సత్యం అంటే పరమాత్మ) కావడం అనగా ఈషణత్రయంతో కూడినా పరమాత్మాన్వేషణా వృత్తి సాధకుని విడిచిపెట్టి యుండని కారణం చేత సాధకుడు తాత్కాలిక ఇంద్రియ నిగ్రహంతో నిర్విషయానందం అనుభవిస్తూన్న స్థితిలో నున్నవాడు.

కాన ఆతడు ప్రకృతి విషయానుభవ వాంఛలననుభవించి ఆపైని ఆ వాంఛలను ప్రకృతికే విడిచి వేసి నిర్విషయానందాన్ని స్థిరంగా పొందాలని కోరుతూంటాడు. ఆ విధంగా సాధన చెయ్యవలసిందని అతనిలోని జ్ఞానం అతనికి గురువుగా ప్రబోధించింది. అందుచేత సాధకుడు తాను ప్రకృతివల్ల పొందిన అనుభవం భగవదన్వేషణకే అర్పించాలని తలచడం అన్నదే ఇక్కడ హరిశ్చంద్రుడు తనకు సంతానం కల్గితే వరుణునికే దానిని సమర్పించుకొంటానని వరుణునికి మాట ఇవ్వడంలోని అంతరార్థంగా సాధనా రహస్యాన్ని సాధకులు గుర్తించాలి.

హరిశ్చంద్రునికి తర్వాత 'రోహితుడు' పుట్టేడు. ర+ఉ+హితుడు= రోహితుడు అని విడదీయాలి. ర=గ్రహించు అని అర్థం, 'ఉ' అంటే ప్రకృతి అని అర్థం. ఇప్పుడు 'రో' అంటే ప్రకృతిలోనున్న పరమాత్మయందు హితుడు= ఇష్టముకల అనగా ప్రకృతిని గ్రహించే భగవంతుని యందు ప్రియమైన సాధన అని రోహిత పదానికి అంతరార్థం. సాధకుని కోరిక ప్రకారం అతని సాధనలో ఇంద్రియ విషయ వాంఛానుభవంతో పరమాత్మాన్వేషణ ప్రారంభమైనది అని అంతరార్థపరంగా రోహితుని జననమునకు అంతరార్థం చెప్పాలి. తర్వాత నిర్దిష్టమైన తర్వాత (పది రోజులు గడిచేక) వరుణుని కిస్తానని హరిశ్చంద్రుడు గడువు పెట్టేడు.

'సర్ధశే' అంటే పది ఇంద్రియాల అనుభవం తీరిన తర్వాత అని అంతరార్థం. సాధనలో ఇంద్రియానుభవంతో ఇంద్రియ వాంఛలు విడుదల చెయ్యాలన్నీ విడుదల చెయ్యాలి అనే సాధనా రహస్యాన్ని ఇందు అంతరార్థపరంగా గ్రహించాలి. తర్వాత దంతాలు రావడం, అవి ఊడిపోయి తిరిగి రావడం వరకు వరుణుని కివ్వకుండా గడువులు కోరడం అన్నది.

ఇంద్రియానుభవం పూర్తికావాలని ఆ అనుభవం అంతా తిరిగి మాయా ప్రకృతిలో లీనం చెయ్యాలనీ అప్పుడే సాధన పూర్తి ఔతుందనీ చెప్పడమే దానికి అర్థం. కవచం తొడిగే వయస్సు వచ్చేక ఇస్త్రానవరం తన్ను ఇంద్రియ వాంఛలు అనుభవంలో విడిచివేసి వాటివల్ల రక్షణ జరిగే వరకు సాధనపూర్తి కాదని సాధకుడు అనుకోవడమే ఆఖరుసారి గడువు కోరడానికి అర్థం. వరుణుడు హరిశ్చంద్రుని వద్దాన భంగానికి కోపించి జలోదర రోగం వచ్చేటట్లు చేశాడు అంటే జడమే జలం (లడ యోర భేదః) కాన జడత్వాన్ని అనగా మాయావరణం సాధకుని సాధనలో కల్పింపబడిందన్న మాట.

రోహితుడు అరణ్యానికి వెళ్ళి అయిదు సంవత్సరాలున్నాడు అంటే ప్రకృతిలోని భగవంతుని చూచే సాధన పంచభూతాలలోని ప్రకృతిని భగవద్దృష్టితో ప్రశాంతి పొందించే సాధన జరిగింది అనేది అర్థం. అయిదు సంవత్సరాలు పంచ భూతాలకు సంకేతం.

అరణ్యం అంటే ప్రశాంత స్థితి అనే అర్థం లోగడ వ్యుత్పత్తిపరంగా చెప్పు కొనియే వున్నాం. సాధకుడు సాధనతో ఇంద్రియానుభవాన్నీ, పంచభూతాలతోను అనుభవించి ప్రశాంత స్థితిని పొంది తిరిగి ఆ ప్రకృతియొక్క అనుభవాన్ని ప్రకృతికే సమర్పించా లనుకొన్నాడన్నదే రోహితుడు అరణ్యాన్నుండి వరుణుని యజ్ఞం జరిపించ డానికి వచ్చేడన్నదాని అర్థం. వచ్చేటప్పుడు రోహితుడు అజీగర్తుని కొడుకును శునశ్శేపుని యజ్ఞపశువుగా తెచ్చేడు. 'గర్తం' అంటే గొయ్యి అని అర్థం. అనగా తమోగుణ ప్రకృతికి సంకేతంగా చెప్పాలి. 'అజ' అంటే "నజాయతే ఇతి అజః" అనే వ్యుత్పత్త్యర్థంలో పుట్టుక లేని పరమాత్మ అని అర్థం.

అజముగా అనగా పరమాత్మగా చేయబడిన గర్తము తమోగుణం అన్నప్పుడు అజీగర్త అనే రూపం వస్తుంది అంటే పరబ్రహ్మ పదార్థంగా ప్రకృతిలోని తమో గుణాన్ని గుర్తించడమనే సుగతి జ్ఞాన వృత్తికే అజగర్తుడని పేరు. అజగర్త పదమే అజీగర్తం అయింది. ఆ జ్ఞానవృత్తికి పుట్టినది శునశ్శేపుడు, శునః=సుఖమైన,

శేపుడు=కాంతి గలవాడు అనగా ముక్తి సుఖ సంబంధమైన జ్ఞానప్రకాశం అనే అర్థం సాధనాపరంగా అంతరార్థం. చెప్పాలి.

ఇప్పుడు 'శునః' అంటే సుఖమైన 'శేఫః' అంటే కాంతి అని అర్థం. ఇప్పుడు శునశ్శేఫ పదానికి ముక్తి సుఖరూపమైన ఉజ్వల జ్ఞాన స్వభావం అని అర్థం. జ్ఞాన ప్రకృతి యొక్క ఉజ్వల స్వభావం పరమాత్మవల్లనే కల్గినదిగా సాధకుడు గుర్తించి ప్రకృతిని ప్రకృతిలోనే లీనం చెయ్యవలచడమే అజీగర్తుని కొడుకైన శునశ్శేపుని రోహితుడు, హరిశ్చంద్రునిచే వరుణునకు సమర్పింప జేయడానికి తెచ్చేదన్న దానిలోని అంత రార్థం. ఆపైని విశ్వామిత్రుడు పౌరోహిత్యం చేశాడు. అతని మంత్రబలం వల్ల వరుణుడు మెచ్చుకొన్నాడు. శునశ్శేపుని వరుణుడు తిరిగి ఇచ్చివేశాడు.

అంటే విశ్వామిత్ర సాధన అనగా ప్రకృతిలో పరమేశ్వరుడున్నాడు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధన సాధకునకు ఫలించినదనీ ప్రకృతి సాధకుని అను గ్రహించి సాధకుడు ప్రకృతిలోనున్నా అతని సాధన నాశం కాకుండా చేసిందనీ, తర్వాత సాధకుడు పంచభూతాలలో ఒకదానిలో ఒకటి లీనం చేసి బ్రహ్మ జ్ఞానం పొంది విషయ వాసనా రహితుడై జీవన్ముక్తి పొందేడని ఈ కథకు అంతరార్థ పరంగా ప్రకృత్యనుభవం అనే సాధనతో ముక్తిని పొందటాన్ని చెప్తూంది.

ఇందులో ఈషణత్రయంతో కూడికొని సాధకుడు ప్రకృతి యందు లోలుడై నప్పటికీ ప్రకృతిలోనే పరమాత్మను చూచే సాధనను అభ్యసించగలడనీ, ఆ విధంగా ముక్తుడు కాగలడనీ ఒక చక్కని నిగూఢమైన సాధనా పరంపర కన్పిస్తూంది. సాధ కులు దీనిని సాధిస్తే ఇటు ప్రకృతిని అనుభవిస్తూనే అటు పరమాత్మను దర్శించుకో వచ్చును.

## శ్రీరామ చరిత్ర

### (దశేంద్రియ విలీనీకరణ సాధన)

శ్రీరామచరిత్ర సూర్యవంశ రాజ చరిత్ర లోనిది. అంతరార్థ రామాయణం అనే గ్రంథం నాచేత వ్రాయబడింది. దాని వలన విపులంగా రామకథకు అంతకూ అంత రార్థం తెలిసికోవలసిందని కోరుతూ ఇక్కడ దానిని గ్రంథ విస్తర భీతిచే వ్రాయలేదని మనవి చేస్తూ పాఠకుల్ని క్షమింప వేడుకొంటున్నాను.

# తారాచంద్రుల ప్రణయ చరిత్ర

## (ఉపనిషత్ జ్ఞాన సాధన)

బృహస్పతి దేవగురువు. అతనికి తార భార్య. అత్రి మహర్షి యొక్క కంటి నుండి పుట్టినాడు చంద్రుడు. అతడు సోముడు. బృహస్పతి భార్యయైన తార అను దానిని అతడు అపహరించేడు. బృహస్పతి ఎంత యాచించినా చంద్రుడు తారను విడిచిపెట్టలేదు. ఆ కారణంగా దేవతలందఱు బృహస్పతిని ఆదుకొన్నారు. రాక్షసులు చంద్రుణ్ణి ఆదుకొన్నారు. ఈ విధంగా తారా నిమిత్తంగా దేవదానవ యుద్ధం తలెత్తింది. అప్పుడు బ్రహ్మదేవుడు మధ్యవర్తిత్వం నెరపి సోమునిచేత తారను బృహస్పతి కిప్పించేడు. అప్పటికి తార గర్భవతియై యుండి. బృహస్పతి యింటనే బిడ్డను కనింది.

ఆ బిడ్డ నాకు పుట్టేడని చంద్రుడూ, నాకు పుట్టేడని బృహస్పతీ ఇద్దరూ తగవులాడేరు. ఎవరికి పుట్టేడో చెప్పడానికి తార సిగ్గుపడింది. ఎవరూ ఆమెను నిల దీసి అడగలేకనూ పోయేరు. అప్పుడు ఆ బిడ్డయే తల్లిని అందరి సమక్షాన అడిగింది. ఆమె చెప్పలేదు. అంతట బ్రహ్మ రహస్యంగా పిలిచి తారను నిజస్థితి చెప్పమన్నాడు. ఆమె మెల్లగా బ్రహ్మ చెవిలో చంద్రునికి కన్నానని చెప్పింది. అప్పుడు బ్రహ్మ ఆ బిడ్డను చంద్రున కిప్పించేడు. తారను బృహస్పతి కిప్పించేడు. ఆ బిడ్డకు బ్రహ్మ బుధుడు అని పేరు పెట్టేడు. ఈ విధంగా బుధుడు చంద్రుని కుమారుడుగా ప్రసిద్ధి పొందేడు.

"బృహతః బ్రహ్మణః మంత్రస్య స్వామీ ఇతి బృహస్పతిః" అని సాయణ భాష్యంలో మంత్రస్వామి లేక మంత్రపతి, అని బృహస్పతి పదానికి వ్యుత్పత్త్యర్థం చెప్పబడింది. మంత్ర మనగా వేదములోనిది 'బృహత్' అంటే వాక్కు, బృహత్‌కి పతి గాన బృహత్పతి అని కూడ వ్యుత్పత్తి చెప్పబడిఉంది. వాక్కు అనగా వేద వాక్కు అనియే అర్థం. వేదవాక్కులకు పతి బృహస్పతి. ఈ విధంగా సమస్త వేదము బృహస్పతి పదానికి అర్థంగా చెప్పవచ్చు. ఈ విధంగా బృహస్పతి అంటే 'వేదస్వరూపం' అన్నమాట. అతడు దేవగురువు. వేదంలోని యజ్ఞయాగాదులచే, దేవతా జన్మలు కల్గుతాయి కనుక దేవత్వానికి అతడు గురువు అనగా జనకుడు అన్న మాట. యజ్ఞాదులచే దేవత్వాన్ని ఇప్పించే సాధకునిలోని వేదమార్గాచరణాన్ని బృహస్పతి పదం ఇక్కడ అంతరార్థపరంగా చెప్తుందనాలి.

అత్రి కంటినుండి పుట్టినవాడు చంద్రుడు. అత్రి అంటే న + త్రి = అత్రి

అవుతుంది. 'త్రి' అంటే మూడు అని అర్థం. సత్త్వరజస్తమో గుణాలు మూటికి త్రిగుణాలని పేరు, త్రిగుణములు లేని స్థితికి అనగా సాధకునిలో త్రిగుణాతీత స్థితికి 'అత్రి' అని అంతరార్థపరంగా అర్థం చెప్పుకోవాలి. 'కన్ను' అంటే దృష్టి లేక జ్ఞాన దృక్పథమనుండి అని అర్థం. అత్రి కంటినుండి అంటే సాధకునిలోని త్రిగుణాతీత జ్ఞాన దృక్పథం వల్ల 'చంద్రుడు' పుట్టేడు. 'చది' ఆహ్లాదే' అను ధాతువు వల్ల చంద్రుడు అంటే ఆహ్లాదము అనగా పరమాత్మానందము అనే అర్థం వస్తుంది. సాధకునిలోని త్రిగుణాతీత జ్ఞాన దృష్టివల్ల పరమాత్మానందం పుట్టుకొనివస్తుంది అని అత్రి కంటినుండి చంద్రుడు పుట్టేడన్న దానికి అంతరార్థం. ఆత్మానందాన్ని పుట్టించేది ఉపనిషన్మార్గం లేక వేదాంత మార్గం కావున ఇక్కడ చంద్ర పదానికి వేదాంత మార్గం వల్ల కలిగే ఆనందం అని అర్థం చెప్పుకోవాలి.

బృహస్పతి అంటే వేదం. చంద్రుడు అంటే వేదాంతం వల్ల కల్గే లేక ఉపనిషన్మార్గం వల్ల కలిగే ఆనందం అని తేలింది.

'తార' అంటే 'తరతి' ఇతి 'తారా' అనే వ్యుత్పత్త్యర్థంలో సాధకునిలోని తరించాలనే తపన అనగా ముక్తినికోరే కాంక్ష అని అర్థం చెప్పుకోవాలి.

సాధకుడు నీలో తరించాలనే కాంక్ష ఏర్పడి ఆ తరుణంకోసం అతడు వేద మార్గాన్ని అనుసరిస్తున్నాడన్నదే బృహస్పతితో తార కాపురం చేస్తూంది అనగా అతని భార్యగా ఉన్నది అన్నదానికి అంతరార్థంగా భావించాలి.

సాధకునిలోని తరించాలనే కోర్కె ముందు వేదమార్గాన్ని చేపట్టింది. ఆ వేద మార్గం దేవతలచే ఆరాధింపబడుతుంది. దేవతలంటే సాధకునిలోని సాత్త్వికవృత్తులు. ఆ సాత్వికవృత్తులు యజ్ఞయాగాది వేదానుష్ఠానం వల్ల ప్రకాశం పొందుతాయి. 'దివ్' ధాతువునకు ప్రకాశం అర్థం కాన దేవతలనగా సాధకునిలో వేదమార్గం వల్ల ప్రకాశించే సాత్త్వికవృత్తులు అని చెప్పుకోవచ్చు.

బృహస్పతి దేవగురువన్నదానికి అర్థం. వేదమార్గం సాత్త్వికవృత్తులకు ప్రకాశం కల్గించేది అని అంతరార్థం. ఆ బృహస్పతికి తార భార్య అంటే సాధకునిలోని ముక్తి కాంక్ష వేదమార్గాన్ని అనుసరిస్తుంది అని చెప్పాలి. కొంతకాలం తర్వాత తార చంద్రునిపై మమకారం చూపింది. చంద్రుడామెను తనతో తీసికొనిపోయేడు. యజ్ఞయాగాది ప్రవర్తకమైన కేవల వేద మార్గంలో ముక్తినిచ్చి జన్మరాహిత్యంతో తరింపజేసే అవకాశంలేదు. 'త్రైగుణ్య విషయాః వేదాః' అని భగవద్గీతలో నున్నది గదా!

వేదాలు త్రిగుణాలకు సంబంధించేవే కాన త్రిగుణాతీత స్థితితోనే పొందవలసిన ముక్తి త్రిగుణ స్థితికి సంబంధించిన వేదాలకి లొంగదు.

తార బృహస్పతిని వదలివేసి అత్రి పుత్రుడైన చంద్రుణ్ణి ప్రేమించింది. తారను చంద్రుడు చేపట్టేడు అంటే, వేదమార్గం త్రైగుణ్య విషయమార్గం మాత్రమే కావడంవల్ల ఆ వేదమార్గాన్ని వదలివేసి సాధకునిలోని తరించాలనే ముక్తికాంక్ష త్రిగుణాతీత స్థితికి జన్మించిన వేదాంత మార్గాన్ని అనగా ఉపనిషన్మార్గాన్ని చేపట్టింది. ఆ సాధకునిలోని ఉపనిషన్మార్గం సాధకుని ముక్తికాంక్షను పండించడానికి తాను స్వీకరించింది అని అంతరార్థం ఇక్కడ చెప్పుకోవాలి.

చంద్రుడు తారను తీసికొనిపోవడంలో దేవతలు సాత్త్విక వృత్తులు చంద్రునితో జగడమాడి బృహస్పతి పక్షాన్ని బలపరిచేరు. రాక్షసులంటే సాధకునిలోని తమో వృత్తులు దేవతలు కాదన్నదానిని ఔనని కలహకారణం పెంచడానికి మాత్రమే చంద్రుని పక్షాన్ని ఆమకొన్నారు. ఈ విధంగా దేవ రాక్షస యుద్ధం స్థిరమైంది. దేవతలంటే సాత్త్విక వృత్తులు, రాక్షసులంటే తామసిక వృత్తులు. రెండిటికీ ఎప్పుడూ వైరం జరుగుతూనే వుంటుంది.

వేదమార్గంతో దేవతలు యజ్ఞాలలో ఆహుతు లందుకుంటున్నారు కాన బృహస్పతి పక్షం వారిది. దేవతలను కాదనడమే వారికి ప్రధానం కాన చంద్ర పక్షం రాక్షసులది. దానితో దేవ దానవ యుద్ధం స్థిరమైంది అంటే సాధకునిలోని తామసిక వృత్తులు సాధకునిలోని సాత్త్విక వృత్తులు తార కారణంగా అనగా తరించాలనే ముక్తికాంక్ష కారణంగా ఒక వృత్తిని మఱొక వృత్తి నాశంచేసే స్థితి సాధకునిలో ఏర్పడిందన్న మాట. అప్పుడు బ్రహ్మ మధ్యవర్తిత్వం చేశాడు.

'బ్రహ్మ' అంటే పరమాత్మ స్వరూపం. ఆ పరమాత్మ స్వరూపం వేదాలకీ వేదాంతాలకీ కూడ ఆప్తమైనదే. అంటే వేదమార్గంతో మనశ్శుద్ధి సంపాదించి తద్వారా ఉపనిషన్మార్గంలో సాధకుడు సాధనలుచేసి ప్రకాశించి ముక్తిని పొందాలి. అందుచేత బ్రహ్మ పదార్థం వేద వేదాంత మార్గాలు రెండింటికీ కూడ సంబంధించిందిగా చెప్పడమే బ్రహ్మ మధ్యవర్తిత్వంలోని అంతరార్థం.

బ్రహ్మ తారను పిలిచి 'నీకు కలిగిన గర్భం బృహస్పతి వల్లనా, చంద్రుని వల్లనా ఎవరివల్ల జరిగిం'దని అడగ్గానే తార 'చంద్రునివల్ల' అని చెప్పింది. అంటే నీకోర్కె పూర్తి కావడానికి వేదం కారణమా ? ఉపనిషన్మార్గం కారణమా? అని ప్రశ్నిస్తే ఉపనిషన్మార్గమే నన్ను తరింపజేసింది అని సాధకునిలోని ముక్తికాంక్ష మనోవృత్తి

నిశ్చయ పరచింది అన్నమాట. ఆ బిడ్డకు బ్రహ్మ 'బుధుడు' అని నామకరణం చేశాడు. బుధుడు అంటే 'జ్ఞాని' అని అర్థం. పరమాత్మయే ముక్తికి ఫలం. 'జ్ఞానం' గుర్తించడం జరిగిందన్నమాట. వేదం ద్వారా మనశ్శుద్ధి కల్గుతుంది. కాన ముక్తితో తరించదలచినవారు ఉపనిషన్మార్గాన్ని జ్ఞానం పొంది ముక్తిని పొందగల్గినా, ఇతరులకు మార్గదర్శిత్వం కోసం సర్వసామాన్యంగా అందరూ తాము మొదటి వేదమార్గాన్ని నడవాలి. దానిని విసర్జించడం అన్నది కూడదు అన్నదే తారను తిరిగి బ్రహ్మ బృహస్పతి కిప్పించడంలోని అంతరార్థంగా గ్రహించాలి.

జ్ఞానం ఉపనిషన్మార్గాన్ని విడిచి వుండదనడమే చంద్రునకు బుధుణ్ణిప్పించడం లోని అర్థం అని అంతరార్థపరంగా తెలిసికోవాలి. ముక్తిని కోరే సాధకుడు ముందు వేదమార్గానుసరణంతో మనస్శుద్ధి సాధించాలి. ఆ తర్వాత ఉపనిషన్మార్గంతో జ్ఞానాన్ని సాధించాలి. ఆ జ్ఞానానికి పరమాత్మయొక్క ఆదరణం లభిస్తుంది అన్న సాధనా సారాంశం ఈ తారాచంద్రుల ప్రణయగాధకు అంతరార్థంగా మనం గ్రహించాలి.

కేవల బాహ్యార్థమై ప్రమాణమనుకొంటే దేవగురువైన బృహస్పతి భార్య తార వ్యభిచరించిందనడం, చంద్రుడికి బిడ్డను కని వానికిచ్చివేసి తర్వాత బృహస్పతితో కాపురం చేసికొందనడం బ్రహ్మదేవుడు ఈ రంకుగాధలో మధ్యవర్తిత్వం చేసేదనడం ఎంత జుగుప్సాకరములైన విషయాలు! ఇంతటి అశ్లీల చరిత్రలు భాగవతంలో చోటు చేసికోవడానికి వ్యాసమహర్షి ఎందుకు సంకల్పించినట్లు? అంతరార్థపరంగా మహోత్కృష్టమైన ముక్తిసాధనకు ఉపనిషన్మార్గానికి ప్రాధాన్యమివ్వడానికే ఈ కల్పన చేయబడిందనక తప్పదు.

# యయాతి చరిత్ర

## [అసంగ యోగ సాధన]

వృషపర్వుడు రాక్షస రాజు. అతని కూతురు శర్మిష్ఠ. వృషపర్వుని గురువు శుక్రుడు. శుక్రుని కూతురు దేవయాని.

శర్మిష్ఠ తన చెలికత్తెలతోను, దేవయానితోను కలిసి ఒక సరస్సులో స్నానాలు చేసి బైటకు వచ్చి బట్టలు కట్టుకోవడంలో, పొరపాటున శర్మిష్ఠ దేవయాని బట్ట కట్టుకొంది. అందుకు దేవయాని కోపపడింది. శర్మిష్ఠ దేవయానిని ఒక కూపంలోనికి త్రోసివేసి వెళ్ళిపోయింది.

యయాతి అనే రాజు ఆ మార్గాన్ని వెడుతూ దేవయానిని కూపంనుండి బైటకు తీసేడు. దేవయాని యయాతిని ప్రేమించి పెండ్లాడింది.

దేవయానిని శర్మిష్ఠ కూపంలో పడవేసినందుకు వృషపర్వుడు శుక్రుని క్షమార్పణ వేడుకొని ఆతని కోరికపైని దేవయానిని సంతృప్తి పఱచడానికి శర్మిష్ఠను దేవయానికి దాసీగా నియమించేడు.

దేవయాని వలన యయాతికి యదు తుర్వసులను వారిద్దరు కొడుకులు జన్మించేరు. తర్వాత దేవయాని బహిష్ఠయై దూరంగా వున్నపుడు శర్మిష్ఠ కోరికపైని యయాతి ఆమెతో రహస్యంగా కలిసి రతిక్రీడలు సాగించేడు. శర్మిష్ఠకు యయాతి వల్ల ద్రుహ్యుడు, అనువు, పూరువు నను ముగ్గురు బిడ్డల్ని కన్నాడు

శుక్రుడు ఆ కారణంగా యయాతిని ముసలివాడుగా అవుతావని శపించేడు. యయాతి శుక్రుణ్ణి శాపవిముక్తికై ప్రార్థింపగా 'నీ బిడ్డలలో నెవరైనా వారి యౌవనము నీకిస్తే నీవు ఆ యౌవనమును స్వీకరింప గలవు' అని శాపవిముక్తిని చెప్పేడు.

ఆతని బిడ్డ లెవ్వరును ఆతనికి తమ యౌవనము నీయలేదు. 'పురువు' అను శర్మిష్ఠ కొడుకు మాత్ర మిచ్చుట కంగీకరించేడు.

యయాతి ఆ యౌవనముతో దేవయానితో క్రీడించి చివరకు విరక్తుడై ఆత్మనిష్ఠుడై ముక్తి నందేడు.

వృషపర్వుడు, వృషమనగా ధర్మం అని అర్థం. పర్వమనగా పండువు ధర్మము పండువుగా భావించువాడు, 'వృషపర్వుడు' అవుతాడు. అనగా సాధకుని లోని ధర్మస్వరూపమునకే 'వృషపర్వ' అని పేరుగా అంతరార్థం చెప్పుకోవాలి ఆతని కుమార్తె శర్మిష్ఠ. శర్మము అనగా మోక్ష సుఖము. మోక్షసుఖ మందాసక్తికల మనోవృత్తి అనుఅర్థంలో 'శర్మి' అవుతుంది. శర్మియందు 'స్థ' అనగా ఉండుట అర్థంలో మోక్ష సుఖం కోరే సాధకుని మనోవృత్తి శర్మిష్ఠ అను పదానికి అంతరార్థంగా తెలిసికోవాలి రాక్షసుడనగా తామసికవృత్తి యనికదా అంతరార్థం చెప్పుకొన్నాం. సాధకునిలోని తామసికవృత్తికి పూర్వజన్మ వాసనా ఫలితంగా ధర్మాసక్తి కల్గిందని, ఆ ధర్మాసక్తి నుండి మోక్షకాంక్ష ప్రభవిందనీ, వృషపర్వుడను రాక్షస రాజుకు శర్మిష్ఠ కూతురై వుంది అన్నదానికి అంతరార్థం చెప్పుకోవచ్చు. ఆ వృషపర్వునకు శుక్రుడు 'గురువు', 'శుక్' అంటే దుఃఖమును, 'ర' అంటే దహించునది. 'ర' అనుదానికి అగ్ని అనే అర్థం వుంది. కాన ధర్మాసక్తికి దుఃఖహరణమైన విషయము ఆరాధనీయమైనదిగా

ఉంటుందనే అర్థం. వృషపర్వునకు శుక్రుడు గురువు అన్నదానికి అంతరార్థంగ చెప్పవచ్చు.

శుక్రునకు దేవయాని కూతురు. దుఃఖహరమైన మనోవృత్తివల్ల దేవమార్గం అనగా సుఖమార్గం కల్గుతుంది అనేది అంతరార్థం.

'యయాతి' అనగా 'యాతి ఇతి యః' నడుచుచున్నాడు (వర్తమానం) అను అర్థంలో 'య' అనే శబ్దం నిష్పన్నమౌతుంది. యాతం అంటే జరిగిపోయినది అని అర్థం. యాతము కలది అనగా జరిగిపోయిన (భూతము) కలది అను అర్థంలో 'యాతి' అవుతుంది ఇప్పుడు 'యశ్చ అసే యావిశ్చ' అవుతుంది. అంటే జన్మలు పూర్వం కొన్ని ఎత్తి ప్రస్తుత జన్మలో కర్మానుభవమును నడుపుచున్న జీవుడు అనే అర్థం అంతరార్థపరంగా యయాతి పదానికి వస్తుంది.

ఇక్కడ యయాతి ముక్తి సాధకుడై జన్మలు నడుపుచున్న సాధకుడైన జీవుడు అని అర్థం. ఆతనిలోనివే వృషపర్వవృత్తివల్ల కల్గిన శర్మిష్ఠవృత్తి అనగా ధర్మాసక్తివల్ల కల్గిన ముక్తి కాంక్ష, శుక్రునివల్ల కల్గిన దేవయాని అనగా దుఃఖహరమైన మనోవృత్తి వల్ల కల్గిన దేవతాలోకయాన కాంక్షకూడ. అంటే ముక్తి సాధకుడు కొన్ని గత జన్మలలో కొన్ని వాసనలు నాశం చేసికొని, దేవలోకం పొందాలనే కాంక్షను, ముక్తిని పొందాలనే కాంక్షను రెండిటిని కల్గి వర్తమానంలో సాధన చేస్తున్నాడు అని అర్థం గ్రహించాలి. ఆ సాధకుడే యయాతి అని పిలువబడుతున్నాడని అంతరార్థపరంగా చెప్పుకోవాలి.

మోక్షాసక్తికి, దేవలోక నివాసాసక్తికి అనగా సుఖానుభవ స్థితికి రెండింటికి పరస్పర వైరభావం వుంది. దేవలోకాసక్తి ఉంటే ముక్తిరాదు, ముక్తిమీద ఆసక్తి ఉంటే దేవలోక నివాసం అనగా సుఖానుభవస్థితి ప్రాప్తించదు. ఈ విధంగా పరస్పర వైరం వున్నా ఆ రెండింటినీ కూడ అనుభవించాలని ప్రతి జీవునకు కూడ కాంక్ష వుంటుంది. ఆ రెండు కాంక్షలను పూరిచేసికోవడమనే సాధన ఈ యయాతి చరిత్రలో అంతరార్థపరంగా నిక్షేపింపబడింది. అంతరార్థపరంగా ఈ కథను బాగా ఆలకించండి.

దేవయాని శర్మిష్ఠ చేత కూపంలో త్రోసివేయబడింది. కు+ఉ+ప='కూప' అవుతుంది. 'కు' అనగా భూమి, 'ఉ' అనగా ప్రకృతి, 'ప' అనగా పోషించుట. ఇప్పుడు భూసంబంధమైన ప్రకృతిని పోషించే మనస్థితి అని కూప పదానికి అంత రార్థపరంగా చెప్పాలి. సాధకునిలోని ముక్తి మనోవృత్తి, సుఖానుభవ మనోవృత్తిని

భూలోక ప్రకృతి లంపటతతో చిక్కుకొని నశించేటట్లు చేసింది అన్నదే శర్మిష్ఠ దేవయానిని కూపంలో పడద్రోసిందన్న దాని అంతరార్థం.

యయాతి కూపం నుండి దేవయానిని వెల్వరించేడు అంటే సాధకుడు సుఖానుభవం కోరినవాడు కాన ఆ సుఖానుభవాన్ని ఉద్ధరించే ప్రకృతి సుఖ లంపటతకు చిక్కుకున్నాడని అంతరార్థం. తర్వాత 'శర్మిష్ఠ' దేవయానికి దాసీగా ఏర్పడింది అంటే సాధకుడు సుఖభోగ లంపటతకు వాసనా ప్రాబల్యం వల్ల చిక్కుకొనగా, ఆతనిలోని మోక్షాసక్తి ఆతనిని విడవలేక ఆతడు ఐహిక సుఖాసక్తిని అనుభవించ డాన్ని సహించి అదను దొరికినప్పుడు తాను చోటు చేసికొని ప్రవేశించడానికి ఆతని లోనే దాగివుండి అని దానికి అర్థం చెప్పుకోవాలి.

తర్వాత . దేవయాని బహిష్ఠయైనపుడు యయాతి శర్మిష్ఠతో రతిక్రీడలు సలిపేడు బహిష్ఠ అనగా రజస్వలయై వెలుపల వుండినది అని బాహ్యార్థం-సాధకుని వీడి దూరంగా ఉంది అని అంతరార్థం. సాధకునిలోని సుఖాసక్తి ఒకప్పుడు దూరమై యున్నప్పుడు సాధకుడు తనలోనే దాగియున్న అదనుకై వేచియున్న మోక్షాసక్తితో సాధనలు జరిపి ముక్తి సంబంధంగా ఆనందిస్తాడు అన్నదే దేవయాని తన్ను విడిచి వున్నప్పుడు శర్మిష్ఠను యయాతి కలిసి రతిక్రీడ జరిపేడన్నదాని అంతరార్థం. సాధకునిలోని మనోవృత్తులు పైస్థాయి నుండి క్రిందిస్థాయికి, క్రిందస్థాయి నుండి పై స్థాయికి తిరుగుతూండడం జరుగుతూంటుందని సాధనా రహస్యాన్ని దీనివల్ల గ్రహించాలి. శర్మిష్ఠను యయాతి కలియడం అన్నదానిలో సాధకుడు క్రింది స్థితి నుండి ఉచ్చస్థితికి ఇప్పుడు వచ్చేడనే సాధనను అర్థంగా గ్రహించాలి.

తర్వాత శుక్రుడు శపించేడు. ఆ పైని తిరిగి శాపవిమోచనం కూడ చెప్పేడు అంటే దుఃఖహరమై సుఖకరమైన మనోవృత్తి ఉద్దిక్తమై సాధకుణ్ణి ముక్తి నుండి దూరం చేయడానికి యత్నిస్తుందనేది శాపం ఇవ్వడంలోని అంతరార్థం. ఇది సాధనా విఘ్నదశను చెప్తూంది. తర్వాత సాధకుడు ఆ విఘ్నం నుండి తేరుకొని ఉన్నతస్థితి నందుకొనడం శాప విముక్తికి అర్థంగా గ్రహించాలి. ఈ విధంగా తిరిగి పతన స్థితికి రావడం అనేది తిరిగి దానిని అధిగమించి ఉన్నత స్థితి నందుకోవడమన్నది శాపం ఇవ్వడం శాప విముక్తిని చెప్పడం అన్నదానిలో సాధనా రహస్యంగా గ్రహించాలి.

సాధకుడు తర్వాత సుఖానుభవస్థితి చిరకాలం అనుభవించేడు. ఆ సుఖాను భవాన్ని మోక్షాసక్తిని విడవకుండానే అనుభవించవచ్చుననీ, అందుకు మోక్షసాధనా మనోవృత్తి సహకరిస్తుంది అని చెప్పడమే శర్మిష్ఠ పుత్రుడైన పూరువు అను వాని

వల్లనే యయాతి పునర్యౌవనాన్ని పొందేడన్న దానిలోని అంతరార్థంగా భావించాలి. సాధకుడు మోక్షాసక్తి విడవకుండా ఐహిక భోగానుభవించటం అనే అసంగయోగ సాధనను ఇక్కడ మనం గుర్తించాలి. మోక్షాసక్తి విడవకుండా వుంటే తర్వాత సాధకుడు అనుభవంలో సుఖాభిలాష యందు విరక్తి చెందుతాడు. అదే అసంగయోగ సాధనకు దారి తీస్తుంది. ఆ తర్వాత విరక్తితో సాధకుడు ఆత్మాభిముఖుడౌతాడు అన్నదే యయాతి చిరకాలం దేవయానితో పునర్యౌవనంతో క్రీడించి విరక్తుడై ఆత్మాభిరతుడై ముక్తి నొందేడు అన్న దానికి అంతరార్థం. ఈ విధంగా యయాతి చరిత్ర సాధకునిలోని ఐహిక సుఖాసక్తితో కూడి యుండి కూడ మోక్ష సుఖం పొందడం అనే సాధన మనకు తెల్పుతూంది.

యయాతి దేవయాని పుత్రుడైన యదువు వల్ల యాదవ వంశం శాశ్వతంగా నిలిచింది. అల్లాగే శర్మిష్ఠ పుత్రుడైన పూరుని వల్ల పౌరవవంశం శాశ్వతమై రాజ్యాల్ని పాలించింది. దేవయాని వంశం అనగా దేవలోకాలను పయనించే సాధనలు ముక్తి మార్గాన్ని అనుగమించే సాధనలు రెండూ కూడ జీవులలో విడిచి పెట్టకుండా కలకాలం వుండేవే. అవి రెండూ శ్రేష్ఠములే యైనప్పటియూ మనం ఆ రెండు వంశాల ప్రాబల్యాన్ని అంతరార్థపరంగా వ్యాఖ్యానించాలి. యదుకులంలో పరమాత్మయైన కృష్ణుడు పుట్టేడు అంటే దేవమార్గ సుఖం నుండి ముక్తి మార్గం ఉత్పన్నమౌతుందని చెప్పుకోవచ్చు. పూరుకులంలో ధర్మ ప్రజాపాలనం చేసి సుఖభోగాలనుభవించిన చక్రవర్తులు జన్మించేరు. అంటే ముక్తి మార్గం ధర్మం విడకుండా అసంగయోగంతో సర్వసుఖాల్ని అనుభవింప జేస్తుందని కూడ చెప్పుకోవచ్చు. ఈ విధంగా యయాతి కథ ఉభయ తారకమైన సాధనా మార్గాల్ని చెప్తూండిగా భావించాలి.

## భరద్వాజ జననం

### (హఠయోగ సాధన)

భరతుని (శకుంతలా దుష్యంతుల కుమారుడు)కి ముగ్గురు భార్యలు. వారు ముగ్గురూ కూడ తమకు కలిగిన బిడ్డలు తమ భర్తకు తగ్గవారు కాని కారణం చేత వారిని చంపి వేశారు. అందుచేత భరతు డపుత్రికుడైన కారణం చేత పుత్రార్థియై ఒకప్పుడు యజ్ఞం చేస్తున్నాడు.

ఇల్లా వుండగా ఈ సమయంలో దేవలోకంలో బృహస్పతి తన అన్నగారైన

ఉతథ్యుడను వాని భార్యను మమత అనే దాన్ని బలాత్కారించి రమించేడు. ఆమె పూర్ణ గర్భిణి. ఆమె కడుపులో ఎదిగియున్న బిడ్డ బృహస్పతి విసర్జించిన వీర్యాన్ని యోని లోపలికి చేరకుండా బైటకు నెట్టి వేసింది. మమత కూడ బైటకు వచ్చివేసిన వీర్యం తిరిగి యోని లోనికి చేరడానికి వీలు లేకుండా యోని యంచులను గట్టిగా బిగించింది. ఆ కారణంగా ఆ వీర్యం క్రింద పడింది. బృహస్పతి తన వీర్యాన్ని నెట్టి వేసిన కారణంగా కోపించి ఆ లోపలి బిడ్డను పుట్టుగుడ్డి వాడగునట్లు శపించేడు. ఆ బిడ్డ పేరు దీర్ఘతముడు.

బృహస్పతి వీర్యం క్రిందపడ వెంటనే ఒక మగ శిశువైంది. ఆ శిశువును అక్కడనే వదలి వేసి మమతా బృహస్పతులు ఇద్దరూ ద్వాజంభర, "ద్వాజంభర" అని తగువు లాడుకుంటూ వెళ్ళి పోయేరు. ద్వాజ=మన ఇద్దరకు పుట్టిన ఈ బాలుని భర=నీవు తీసికొని పోయి పోషించు అన్నది ద్వాజంభర పదానికి అర్థం. వారు ఈ విధంగా ద్వాజంభర ద్వాజులని వాదులాడుకొంటూ అవ్యవహితంగా ఉచ్చరించిన ఆ 'ద్వాజంభర' అనుమాట 'భరద్వాజ' అని అచ్చట మరుత్తులను వారికి వినబడింది. ఆ బిడ్డను మరుత్తులు భరద్వాజుడు అని పేరు పెట్టి తీసికొనిపోయి పుత్రార్థియై యజ్ఞం చేస్తున్న భరతున కిచ్చేరు. మమత బిడ్డను విడిచిపోతూ 'వితథుడు' అంటే వ్యర్థుడైనవాడు అని ఆ బిడ్డను పేర్కొంది. మమతకు ఉతథ్యుని వల్ల పుట్టిన బిడ్డ దీర్ఘతముడుగా పేర్కొనబడ్డాడు. దీర్ఘమైన తమస్సు గలవాడు అంటే పుట్టుగుడ్డి వాడు అని అర్థం. ఈ కథ అంతా ఎంతగా జుగుప్సాకరంగా ఉందో చూడండి. అందఱకూ తండ్రి వంటివాడు బృహస్పతి తనికి అన్న పెండ్లాము తల్లి వంటిది. ఆమె పూర్ణ గర్భిణి. ఆమెను దేవగురువు బృహస్పతి బలాత్కారించి రమించేడా? ఆ వీర్యం భరద్వాజుడైనాడా? భరద్వాజుడు నాకు గోత్ర ప్రవర్తకుడు. శ్రీరామునకు ప్రప్రథమంగా అరణ్య గమనంలోను తిరిగి అయోధ్య గమనంలోనుకూడ ఆశ్రయమిచ్చి విందు చేశాడు. ఈ భరద్వాజ మహామునీంద్రుని జన్మకథ ఇంత అశ్లీలకరంగా ఉందా? ఈ కథలో అంతరార్థమే లేకపోతే ఇది భాగవతంలో ఎట్లా ఉంటుంది. దీని అంతరార్థం చెప్తాను గమనించండి.

భరతుడు అంటే "భరస్య భావః భరతా, భరతా అస్య అస్తి ఇతి భరతః" వాసనా భారాన్ని వహిస్తున్న జీవుడు అని దానికి అర్థం. అతడు ముక్తి సాధకుడు. అతనికి ముగ్గురు భార్యలు. వారు సత్త్వరజస్తమో గుణాలు. తమకు పుట్టిన బిడ్డలు భరతునకు తగ్గవారు కారని వారు బిడ్డల్ని చంపేశారు. ముక్తి సాధకుడు తనలోని

సత్త్వరజస్తమో గుణాల నుండి పుట్టిన మనోవృత్తుల్ని తాను కోరే ముక్తికి తగినవి కాక పోవుటచేత వానిని సాధనలతో నాశం చేశాడు అనే అంతరార్థం. అతడా ఒడ్డల్ని అతని భార్యలు తగ్గవారు కారని ఉద్దేశించేడన్న దానికి ఇక్కడ చెప్పుకోవాలి. భరతుడు పుత్త్రికామంతో యజ్ఞం చేస్తున్నాడు. పుత్+త్ర=పుత్ర అవుతుంది.

నరకాన్నుండి రక్షించే ముక్తి అన్నదే పుత్రుడుగా ఇక్కడ అర్థం చెప్పుకోవాలి. ముక్తి కాంక్షతో సాధకుడు యజ్ఞం చేస్తున్నాడు. యద్+జ్ఞ=యజ్ఞ అవుతుంది. యత్=అంటే ఎవరు పరమాత్మయో వానిని, జ్ఞ=తెలిసికోవడం అన్న వ్యుత్పత్తిలో యజ్ఞ పదానికి పరమాత్మను తెలిసికొనే సాధన అని అర్థం. సాధకుడు ముక్తికై జ్ఞాన మార్గంలో పరమాత్మాన్వేషణా సాధన చేస్తున్నాడన్న మాట.

ఇక ఈ సమయంలో అనగా ఈ సాధనా సమయంలో బృహస్పతి అంటే సాధకునిలోని పరమాత్మ అని అర్థం. బృహస్పతి పదానికి వేదం అనీ పరమాత్మ అనీ కూడ అర్థం వున్నట్లు వేదభాష్యం చెప్తూంది. లోగడ కూడ ఈ అర్థాన్ని చెప్పుకొనియే యున్నాం. ఉతథ్యుడు అంటే ఉ=ప్రకృతిని, తథ్యుడు=శాశ్వతమని తలచే సాధకునిలోని మనోవృత్తి అని అర్థం. అనగా సాధకునిలోని మాయ అని అర్థం సాధకునిలోని మాయా ప్రకృతియే ఉతథ్యుడన్న మాట. అతని భార్య మమత. మమత అంటే సాధకునిలోని "నాది నాది" అనే భావం. అదే మమకారం అన్న మాట.

మాయా ప్రకృతికి మమకారం వశపడి వుంటుందన్నదే ఉతథ్యుని భార్య మమత అనే దాని అంతరార్థం. భార్య అంటే భరింప తగినది అని కదా అర్థం! బృహస్పతికి ఉతథ్యుడు అన్నగారు అంటే పరమాత్మను ఆవరించి ముందుగా మాయ తెరగా ఉంటుంది. కాన మాయను పరమాత్మకు జ్యేష్ఠభ్రాతగా చెప్పబడింది. మమత పూర్ణగర్భిణి అంటే-ప్రకృతి యొక్క మాయచే పూర్తిగా పెరిగియున్న అజ్ఞానం లేక, తమోవృత్తి తనలో గలది అని అర్థం. బృహస్పతి ఉతథ్యుని భార్యయైన మమతను బలాత్కారంగా రమించేడు. అంటే సాధకుడు చేస్తూన్న జ్ఞాన సాధనా విశిష్ట పరమాత్మ భావం సాధకునిలోని జగత్సత్యం అనే ఉతథ్య భావన వల్ల పోషింప బడ్డ మమకారంలోని అజ్ఞాన తమోవృత్తిలో బలాత్కారంగా ప్రవేశించింది అన్న మాట. అప్పుడు ఆ తమోవృత్తి బ్రహ్మజ్ఞాన వృత్తిని లోనికి ప్రవేశింపకుండా నెట్టి వేస్తునే సాధనా విస్మృతిని ప్రదర్శించడమే మమత గర్భంలోని బిడ్డ బృహస్పతి వీర్యాన్ని

నెట్టివేసింపన్న దాని అంతరార్థంగా భావించాలి. మమత కూడ అందుకు తోడ్పడింది అన్న దానికి మమకార భావం తమోగుణోద్యమానికి సహకరించింది అనే అంత రార్థంగా చెప్పాలి.

మమత గర్భంలోని బిడ్డ దీర్ఘతముడైనాడు అన్నదానికి దీర్ఘమైన తమో గుణమే ఆ బిడ్డ అనేది అంతరార్థంగా స్పష్టపడుతూంది. ప్రకృతితోడి మమత వల్ల కల్గేది శాశ్వతమైన తమోగుణం అని గ్రహించాలి. బృహస్పతి వీర్యం వ్యర్థంగా నశించక బిడ్డయైంది అంటే సాధకునిలోని ఆత్మవిజ్ఞానం ఎట్టి ప్రతిబంధకాలు ఎదు ర్కొన్నా అది నశించక జీవించియే వుంటుంది అనే అర్థం గ్రహించాలి.

బిడ్డను ఇద్దఱూ విడిచి పోయేరు. బృహస్పతి వీర్యంవల్ల కల్గిన ఆ బిడ్డ పూర్తిగా ప్రకృతి యొక్క మాయకూ మమకారానికీ పుట్టింది కాకపోవడం వల్ల తనది కాదని మమకార వృత్తి వదలివేసింది. అది మమతా యోని ప్రేరణంచేత విసర్జింపబడిన కారణంగా కేవల జ్ఞాన స్వరూపం కాకపోవడం వల్ల పరమాత్మకు సంబంధించిన మనోవృత్తి దానిని తనది కాని దానిగా విసర్జించింది. ఈ విధంగా మమతా బృహస్పతుల సంబంధం వల్ల అనగా మాయా ప్రకృతియొక్క పరమాత్మ జ్ఞానముయొక్క సంయోగం కల్గిన ఆ బిడ్డ భరద్వాజుడు అయ్యేడు. భర=బరువైన, ద్వా=మాయా పరమాత్మ వృత్తులు రెండింటివల్ల, జ=పుట్టినది. ఇక్కడ హఠయోగం అనేది భరద్వాజ పదానికి అంతరార్థపరంగా అర్థం చెప్పాలి.

హఠయోగ సాధకుడు వాయువును బలాత్కారంగా కుంభింపజేసే కుంభక ప్రాణాయామంలో నిర్వృత్తి రూపమైన పరమాత్మానందాన్ని పొందుతాడు. ఆ ప్రాణా యామం విడిచినపుడు ఆ యోగ సాధకుడు మామూలు మాయా ప్రకృతిని పొంది యుంటాడు. ఈ విధంగా హఠయోగం పరమాత్మానుభూతిని పొందుతూనే ఐహిక ప్రవృత్తితోనూ కూడి వుంటుంది.

కేవల జ్ఞాన సాధకుడు ఎప్పుడూ పరమాత్మ వృత్తితోనే వుంటాడు. యోగి కుంభక సాధనతో తనలో నిలబడిన ఆత్మానందాన్ని అనుభవంతో కుంభకం విడిచి నప్పుడు కూడ నిల్వరించుకొనే సాధనలను చెయ్యాలి. లేకపోతే పాక్షికానందం తప్ప శాశ్వతానందస్థితి రాదు. ఇక్కడ భరతుడు అనగా సాధకుడు ముందు యోగ సాధన చేసి దాని ద్వారా ముక్తి సాధనకు పూనుకొన్నాడు అని మనం గ్రహించాలి

యోగ సాధనలో త్రిగుణాలను నిగ్రహించి ముక్తిని పొందే ప్రణాళికా మార్గం వుంది. అవి సాధకులకు సులభంగా సుసాధ్యంగా ఉంటుంది. హఠయోగ సాధనలో

ఈ పాశిక కుంభక ప్రాణాయామం ఫలిస్తే అష్టసిద్ధులు లభిస్తాయి. అష్టసిద్ధులు లభించగానే తాము భగవత శక్తులు పొందినట్లు యోగులు భావించి పూర్ణయోగ దృష్టి విడిచేస్తుంటారు చాలామంది సాధకులు. ఆ కారణంచేత హఠయోగం వ్యర్థమైపోతుంది. హఠయోగంతో ఆత్మజ్ఞానం నిల్వరించుకోకుండా భ్రమలోపడి వ్యర్థులై (వితథులై) పోతారు సాధకులు అనే అర్థం. మమత వెళ్ళిపోతూ ఆ బిడ్డను 'వితథుడు' అని పేర్కొనడం వల్ల స్ఫురిస్తూంది. 'వితథుడు' అంటే వ్యర్థుడు అని అర్థం. మమకార వృత్తిని అది జయించి ముక్తిని పొందింపలేదు అనేదే మమత ఆ విధంగా అన్నదాని భావంగా గ్రహించాలి.

ఇప్పుడు బృహస్పతి అన్న భార్యను బలాత్కరించి రమించేదంటే సాధకుని లోని పరమాత్మతత్త్వం సాధకునిలో పేరుకొనియున్న మాయా ప్రకృతిని నమ్ముకొని మమకారాలకు పుట్టిన తమోగుణాన్ని హఠయోగంతో బలాత్కారంగా కుంభకంతో లోపలి తమోవృత్తుల్ని పరమాత్మ వృత్తులతో లీనం చేసే ప్రయత్నం అనేది అంత రార్థంగా వస్తుంది మాయా ప్రకృతి మమకారాల వల్ల పుట్టిన తమోవృత్తి ఎందుకు పనికిరాని తమోగుణం అని అదే దీర్ఘతముడని అంతరార్థపరంగా తెలుస్తూంది. బృహస్పతి వీర్యం మమత యొక్క యోని సంపర్కంవల్ల క్రిందపడి బిడ్డ కావడం సాధకునిలోని పరమాత్మాన్వేషణ సాధన ప్రకృతి సాయంతో హఠయోగ సాధనగా భరద్వాజుడైందని అంతరార్థపరంగా తెలుస్తూంది. ఈ హఠయోగ సాధన పర మాత్మను నిలుపుకోడానికి ఉద్దేశించబడిందన్నది ప్రధానంగా గుర్తించాలి.

భరతునకు మరుత్తులు భరద్వాజుణ్ణి ఇచ్చేరు. భరద్వాజుని దత్తునిగా గొనుటచేత భరతవంశం భారతవంశంగా భరతుడు పాలించిన ఖండం భారతఖండంగా ప్రసిద్ధి పొందింది.

భరద్వాజుడు అంటే హఠయోగంగా చెప్పుకొన్నాం. హఠయోగం ఇటు ప్రకృతికి అటు పరమాత్మకు మధ్యగా అనుసంధానకర్తగా ఉంటుంది. కేవలం ప్రకృతిని విడవలేక పరమాత్మ సాయుజ్యం కోరే సాధకులకు హఠయోగంవంటి ప్రశస్తమైన సాధనలేదు.

భరతుని భార్యలు ముగ్గురు సత్త్వరజస్తమో గుణాలు అని కదా అంతరార్థం చెప్పుకొన్నాం. వారు తమకు పుట్టిన బిడ్డలు భరతునికి తగ్గవారు కాదని చంపివేశారు. అంటే తాము త్రిగుణాలు తమకు ప్రకృతి మీదనే ఆశక్తి. తమ్ము పాలించే భరతుడు పరమాత్మను అన్వేషించే సాధకుడు. తమ త్రిగుణాలకు పుట్టిన వృత్తులు సాధకుడగు

భరతుని సాధనకు ఉపకరించేవికావు. అందుచే ఆ వృత్తులు నశింపు చేయబడ్డాయి. తర్వాత మరుత్తులు అనగా వాయువులు అనగా కుంభక గత వాయువులు భరద్వాజుణ్ణి ఇస్తే ఆతనివల్ల భరతుడు అనగా సాధకుడు ఆతనిలోని త్రిగుణాలు కూడ తృప్తి పడ్డాయి హఠయోగం ముక్తి సాధనకు ప్రకృతి అనుభవానికి కూడ పనికివచ్చేది కాననే భరతుడు ఆతని భార్యలు ఆ బిడ్డలను వంశోద్ధారకునిగా స్వీకరించేరని అర్థం చెప్పుకోవాలి. భారతవంశం భారతఖండం భరద్వాజుని ద్వారా శాశ్వతత్వం పొందిం దంటే హఠయోగం ద్వారా భరతభూమి, భరతభూమిలోని భారతీయులు పేరు ప్రఖ్యాతులు పొందేరన్న మాట.

## వ్యాస వంశ చరిత్ర

### [త్రిగుణాతీత స్థితి సాధన]

వ్యాసుని పుట్టుకతో ప్రారంభించి పరీక్షిత్తు పుట్టుక వరకు భారత కథ ఈ స్కంధంలో అతి సంగ్రహంగా చెప్పబడింది. ఈ భారతగాథలో అశ్లీల విషయాలు పెక్కుచోట్ల ఉన్నా వాటిని అంతరార్ధపరంగా చూస్తే చక్కని సాధనలు గోచరిస్తున్నాయి. ఆ కారణంగా ఇది మూలంలో అతి సంగ్రహంగానే వున్నా విడచి వేయక అంతరార్ధపరంగా చెప్పక తప్పదని భావించి కొంత వివరంగానే ముఖ్య కథ వివరించి దానికి అంతరార్థం చెప్తున్నాను.

"వ్యాసాయ విష్ణురూపాయ
వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మ నిధియే
వాసిష్ఠాయ నమో నమః"

అని వ్యాసమహర్షిని భగవత్స్వరూపంగానే అంతా స్తుతిస్తారు.

వ్యాసమహర్షిని ఆధ్యాత్మిక రంగానికే ప్రతీక అని చెప్పాలి. వేదరాశిని క్రమ బద్ధం చేసి వేదవాఙ్మయాన్ని ఇతిహాస పురాణాలుగా నిర్మించి వ్యాసుడు వేదవ్యాసుడని పిలువబడ్డాడు. బ్రహ్మసూత్రాల్ని రచించినవాడు వ్యాసుడు. భారతాన్ని పంచమ వేదంగా చేసినవాడు వ్యాసుడు. భగవద్గీత రచించినవాడు వ్యాసుడు. షడ్దర్శనమిది

పురాణాల్ని వ్రాసినవాడు వ్యాసుడు. ఎన్నెన్ని వ్రాసినా తృప్తిపడక వ్యాసుడు భాగవతాన్ని వ్రాసి, అనేక కథల్ని సాధనగా కృష్ణలీలల్నిగా ఆధ్యాత్మిక సాధనలుగా రచించినాడు. ఇంతగా చెప్పడ మెందుకు? వ్యాసుడు లేనిదే భారతీయ వేదాంతానికి అస్తిత్వమే లేదని చెప్పవచ్చు. రామానుజ మధ్వమతకర్తలు వ్యాసుని మాటల్నే మూలములుగా తాము శిరసావహించి ఎవరికి వారు స్వమతపరంగా వానికి వ్యాఖ్యలు వ్రాసుకొన్నారు

ఇంతటి వ్యాసుని పుట్టుక, వంశచరిత్ర ఎలా వున్నదో చూడండి. అతని పుట్టుక మొదలుకొని మనుమల పరంపర వరకూ నడిచిన వంశకథే భారత కథ అంటే. ఆ భారతకథ ఆయనే వ్రాసుకొన్నాడు. అది పంచమ వేద మన్నాడు. ఆ కథకి 'జయం' అని నామకరణం చేశాడు (సంస్కృత భారతానికి జయం అనే పేరు)

అతని వంశ చరిత్ర సంగ్రహంగా చెప్తాను వినండి.

దాశరాజు అనే పల్లె రాజున్నాడు అతని కూతురు పేరు సత్యవతి ఒళ్ళంతా చేపలకంపు కొట్టుతుందనే అర్థంలో మత్స్యగంధి అనే మరోపేరు వాడుకలో ఉంది. ఆ అమ్మాయి తండ్రి ఆజ్ఞతో జనాన్ని నది దాటించడానికి నావ నడుపుతూ ఉండేది. ఒకప్పుడు పరాశరమహర్షి నావనాటుతూ మత్స్యగంధిని చూచి మోహించి తనతో కలువమన్నాడు. ఆమె ఒప్పుకుంది. పరాశరుడు ఆమె శరీరంనుండి వచ్చే చేపల కంపు పోగొట్టాడు. యోజన దూరం (8 మైళ్లు) వరకూ మంచి వాసనల్ని వ్యాపింప చేసేటట్టు చేశాడు. నావలో తమ కలయికను ఎవరూ చూడకుండా దట్టమైన పొగమంచు కల్పించాడు. పరాశర సంగమంతో సత్యవతికి సద్యోగర్భం కలిగి జటా కమండలధారియైన వ్యాసమహర్షి పుట్టుకొచ్చాడు. సత్యవతికి వ్యాసోదయం వల్ల కన్యాత్వం దూషితం కాకుండా వరమనుగ్రహించి పరాశరుడు వెళ్ళిపోయాడు. వ్యాసుడు కూడా ఎప్పుడు కోరితే అప్పుడు సంకల్ప మాత్రంతో వచ్చి ఆజ్ఞను నిర్వహించడానికి తల్లికి వరమిచ్చి తపస్సు చేసికోడానికి వెళ్ళిపోయాడు

ఆ తర్వాత శంతనుడు వేటకు వచ్చి యోజనగంధిని ఆమె శరీర సుగంధ వాసనబట్టి అన్వేషించుకుంటూ వచ్చాడు. యోజనగంధిని తన్ను పెండ్లాడుమని కోరినాడు భారత చక్రవర్తి. ఆమె తన వివాహం తనతండ్రి ఇష్టప్రకారం జరుగాలని యోజనగంధిని తనకిచ్చి పెండ్లి చేయవలసినదిగా దాశరాజును అర్థించాడు శంతనుడు. శంతనునికి అంతక్రితమే గంగాదేవి వల్ల పుట్టిన దేవవ్రతుడనే కొడుకు

న్నాడు. దేవవ్రతుడు "రాజ్యం తాను చేయననీ, అసలు తాను పెండ్లే చేసుకోననీ" ప్రతిజ్ఞ చేసిన తర్వాతనే సత్యవతికి దాశరాజు శంతనునితో వివాహం జరిపించేడు.

తర్వాత శంతనునివల్ల సత్యవతికి చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అనే ఇద్దరు బిడ్డలు కలిగేరు. వారికి అంబిక అంబాలికలతో పెండ్లి జరిగింది చిత్రాంగద విచిత్ర వీర్యులు అకాలంలో నిస్సంతుగా చనిపోయారు. ఆ పిమ్మట సత్యవతి వ్యాసుని స్మరించి రప్పించి మరదండ్రవల్ల సంతానం కనవలసినదిగా ఆదేశించింది. వ్యాసునితో సంగమించడంవల్ల అంబికకు ధృతరాష్ట్రుడు (గుడ్డివాడు) పుట్టేడు. అంబాలికకు పాండురోగంతో పాండురాజు పుట్టాడు వాళ్ళు అంగవికారం కారణంగా రాజ్యార్హులు కాకపోవడంతో సత్యవతి వ్యాసునితో అంబికను తిరిగి కలవమన్నది. ఆమె తన దాసీదానికి తన (అంబిక) వేషంవేసి వ్యాసునితో సంగమింప పంపింది. దానికి విదురుడు పుట్టేడు. కాలం గడిచిన తర్వాత ధృతరాష్ట్రునికి నూరుగురు బిడ్డలు, పాండురాజుకు ఐదుగురు కొడుకులు పుట్టేరు. ధృతరాష్ట్ర, పాండురాజుల సంతానం చివరవరకు పరస్పర కలహంతోనే జీవించి, చిట్ట చివరికి యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో ధార్తరాష్ట్రులు నాశన మయ్యారు. గెలిచిన పాండు కుమారులు కూడా రాజ్యం చేసింది లేదు. మహాప్రస్థానానికి వెళ్ళిపోయేరు

ఇదీ భారత కథ, దాశరాజు పల్లెవాడా? అతని కూతురు సత్యవతితో పరాశర మహర్షి సంగమించి వదలివేశాడా? అప్పటికప్పుడే జటాకమండలాలతో వ్యాసుడు ఆ సత్యవతికి పుట్టాడా? ఆ తర్వాత సత్యవతికి శంతన మహారాజుతో మారు మనువు జరిగిందా? వ్యాసమహర్షి అంతటివాడు మరదండ్రతో సంగమించి బిడ్డలను కన్నాడా? ఆ వ్యాసమహర్షి మనుమలు ఆస్తికోసం పోరాడు కొని యుద్ధంచేసి మరణించేరా? వ్యాసమహర్షి వంశ చరిత్ర యిల్లా ఉండేమిటి? ఇది వేదం ఎల్లా అయింది? దీనికి 'జయం' అని పేరేమిటి? ఇదంతా చారిత్రాత్మిక సత్యమని నమ్మగలమా? దీనిలో ఏదో అంతరార్థ ముండితీరాలి. పైన చెప్పిన వ్యాసుని కథలోని పేర్లకు వ్యుత్పత్త్యర్థాల సహాయంతో అంతరార్థాన్ని చక్కగా విడదీయవచ్చు.

దాశరాజు అంటే పల్లెరాజు అని కాదు అర్థం. పది ఇంద్రియములచే ప్రకాశించే జీవుడన్నదే దశరాజు. 'దశరాజు' అన్నదానికి 'అణ్' ప్రత్యయం చేస్తే 'దాశరాజు' యని అవుతుంది. దాశరాజు కూతురు సత్యవతి సత్యవతి అంటే జీవుడిలో ఉండే సత్యపరమైన, అంటే నిత్యానిత్య వస్తు వివేకపరమైన సత్య మనోవృత్తి అన్నమాట. అది నావ నడుపుతూంది. అంటే జనన మరణ పరిభ్రమణమనే సాగరాన్ని దాటడానికి

సాధన చేస్తోందన్న మాట పరమాత్మైక్యం సాధించే దృష్టితో నిత్యానిత్య వివేక దృక్పథముతో సంచరించ బూనుకొనడం జీవుడు ముక్తిని సాధించడానికి ప్రప్రథమ సాధనము.

ఈ మొదటి సాధనా విషయాన్ని దాశరాజు కూతురు నావను నడుపుతూండన్న కథ స్పష్టపరుస్తోంది. తర్వాత సత్యవతికి పరాశర సంగమం కలిగింది. పరాశరుడంటే భగవంతుడు అని అర్థం. (పరశ్చ అనే అశరశ్చ) పర+అశరుడు=పరుడు అంటే అందరికన్న మొదటివాడును శ్రేష్ఠుడును అయినవాడు అని అర్థం. పరుడంటే అందరి కంటె మొదటివాడు అని అర్థం, అశరుడు అంటే నాశనం లేనివాడు అని అర్థం. కాగా, ఆద్యంతములు లేనివాడు అని పరాశరుడు అన్నమాటకు అర్థం వస్తుంది. దాశరాజు కూతురు సత్యవతి నావ నడుపుచుండగా పరాశరునితో సంగమం కలిగింది, అన్న దానికి నిత్యానిత్య వివేకంతో సత్యపథాన్వేషణ చేస్తూ జనన మరణ పరిభ్రమణం దాటాలని యత్నం చేసే సాధకునిలో, భగవచ్ఛక్తి ప్రవేశిస్తుంది అన్నది అంతరార్థం. వెంటనే వేదవ్యాసమహర్షి పుట్టుక వచ్చాడంటే భగవచ్ఛక్తి ప్రవేశించడంతో సాధకునిలో జ్ఞానోదయం కలిగిందన్నమాట.

వేదవ్యాసుడంటే వేదాలను వివరించినవాడు అని అర్థం. 'వివ్యాస వేదాన్ ఇతి వ్యాసః' అని వ్యుత్పత్త్యర్థం కదా! వేదములంటే జ్ఞానం. జ్ఞాన వివరణమే వ్యాసుడన్నమాట. ఆ జ్ఞానం పరమాత్మ యొక్క అనుగ్రహంవల్ల కల్గుతుందన్నదే వ్యాస జన్మకు అర్థం. పరాశర సంగమం ఎవరికంటా పడకుండా సృష్టించిన పొగమంచును భగవంతుని యోగ మాయావరణంగా గుర్తింపవచ్చు. సత్యవతికి వ్యాసుడు పుట్టి కన్యాత్వం దూషితం కాకుండా చేశాడంటే సాధకునిలో జ్ఞానోదయమైనా, యింకా సాధనా దశలోనే ఉండడంవల్ల అప్పుడప్పు డుపయోగపడే జ్ఞానమే కాని సంపూర్ణజ్ఞాన స్వరూపము ఇంకా సాధకునకు సంక్రమించలేదని సాధకునిలో అహంకార దశ పోలేదనీ అది ఇంకా అలాగే ఉందని అంతరార్థం చెప్పుకోవాలి. జ్ఞానోదయం తాత్కాలికమైనా ఈ సాధన ముక్తిమార్గంలో సాధకుడు జ్ఞానదశకు చేరుకొంటూన్న రెండవ మెట్టు దాటాడని చెప్పవచ్చును.

జ్ఞానోదయానికి సంబంధించిన ఈ సాధనా దశలోనే గురువు శిష్యుణ్ణి వెతుక్కుంటూవచ్చి తనకు ఆ సాధకుణ్ణి శిష్యుణ్ణిగా చేసికొని ఉన్నత సాధనామార్గంలో ప్రవేశ పెడుతాడు. ఇలా గురువు శిష్యుణ్ని ఉన్నత సాధనా మార్గంలో కొన్ని పరీక్షలు చేసిన మీదటనే ప్రవేశ పెడుతాడు. శంతనుడు అంటే "శంతనోతి ఇతి శంతనః" ఇతి అని

కాని లేక శం, తనుః యస్యసః 'శంతనుః' అని కాని వ్యుత్పత్తులు చెప్పచ్చు. 'శం' అనందాన్ని, తనోతి కల్గించేవాడు కాన శంతనుడు అని వ్యుత్పత్త్యర్థము లేక సుఖమే తనయొక్క స్వరూపముగా గలవాడు శంతనుడు అని కాని వ్యుత్పత్త్యర్థం చెప్పితే ఆనందమార్గాన్ని చూపించే గురువే శంతనుడు అవుతాడు. అంటే ముక్తికి గురువు అని ఇచ్చట అర్థం. సత్యవతి యొక్క శరీర సువాసనచేత అంటే ఆమెలోని సత్య పరమైన పూర్వజన్మ వాసనా వ్యాప్తిచేత సత్యవతిని వెతుక్కుంటూ, శంతనుడు అంటే గురువు వచ్చేడు అని అర్థం. తానే ఆమెను తనకిచ్చి పెండ్లి చేయవలసినదని కోరాడంటే గురువు అంతర్ముఖీకృతం చేసిన సాధనలలో యోగ్యతగల శిష్యుని తనవశం చేసికోడానికి ఆతనిని అర్థించాడన్న మాట.

శంతనునికి దేవవ్రతుడనే కుమారుడున్నాడు. అంటే గురువువద్ద అంతర్ముఖీకృతం నుండి వున్న ఐహిక పౌర లౌకిక సుఖ సాధనాలైన యజ్ఞయాగాది కర్మకాండలను చెప్పే వేదం వున్నదన్నదే అతనికి కుమారుడు దేవవ్రతు డున్నదానికి అంతరార్థం. సత్యవతి అంటే కేవలం జ్ఞానమార్గంలో – పరమేశ్వరైక్యం పొందాలనే మనోవృత్తి అని అర్థం కనుక దానికి కర్మకాండతో గూడిన వేదంతో ప్రమేయం ఉండదు. ఎట్టి ఐహిక సుఖభోగాలు అనుభవించాలనే ఆకాంక్ష దానికిలేదు. కనుకనే గురువు అంటే శంతనుడు వచ్చి సత్యవతిని అనగా సాధకుని తనకు వశపర్చవలసినదిగా దాశరాజును జీవుణ్ని కోరినపుడు నాకు మీదగ్గర ఉన్న కర్మకాండ జ్ఞానంతో ఎట్టి ఇహాముష్మిక సుఖాలు కల్గించనని అంగీకరిస్తేనే అంటే కేవల జ్ఞానమార్గం మాత్రం ఉపదేశించి సాధన చేయిస్తేనే వశపుస్తానంటాడు. అంటే కేవలం జ్ఞానమార్గాన్ని వేదాంతాన్ని ప్రసాదించవలసిందిగా గురువును సాధకుడు అర్థిస్తాడన్నదే దాశరాజు షరతు కోరడ మందలి అంతరార్థం.

దాశరాజు దేవవ్రతునికి రాజ్యార్హత లేకుండా మాత్రమే కాక సంతానోత్పాదక సాధనమైన వివాహ ప్రసక్తి లేకుండా కూడ చేసిన తర్వాతనే సత్యవతికి శంతనునితో వివాహం జరిపించడం జరిగిందన్నదానికి ఇహాముష్మిక సుఖలోలతలో పడవేయకుండా గురువును కేవలం జ్ఞానమార్గంతో తరింప చేయడానికి సాధకుడు వేడుకోవడమూ అందుకు గురువు అంగీకరించడమూ ఆ తర్వాతనే శిష్యుడు గురువుకు వశపడడం జరిగిందనేదే అంతరార్థం.

ఉత్తమ సాధకుడు ఇహాముష్మిక ఫలభోగ విరాగంతో గురువును ఈవిధంగా కోరుతాడు. గురు శిష్య సంబంధం సత్యవతీశంతనుల భార్యాభర్తృ సంబంధంగా ఇక్కడ

కథాలంకారం కోసం చెప్పబడింది అంతే. అటు తర్వాత గురువు సాధనలు చేయించడంలో సాధకునికి అణిమాద్యష్ట సిద్ధులు కలుగుతాయి. వాటికి సాధకుడు ప్రలోభపడకుండా ఉన్నప్పుడే జ్ఞానమార్గంలో సాధకుడు పయనిస్తాడు సత్యవతికి శంతనునివల్ల చిత్రాంగ విచిత్ర వీర్యులు కలిగారన్నదానికి గురువువల్ల విచిత్ర వీర్య, చిత్రాంగద శక్తులు, అంటే చిత్రమైన బలాన్నీ, శరీరాన్నీ ఇచ్చే శక్తులు అనగా అష్టసిద్ధులలో చిత్రాంగద శక్తులు అంటే అణిమ, గరిమ, లఘిమ మొదలైన శక్తులన్నమాట. విచిత్ర వీర్య శక్తులు అంటే ఈశత్వము, వశత్వము, ప్రాకామ్యము, పరకాయ ప్రవేశము మొదలైన శక్తులన్నమాట. ఇవన్నీ సాధకుడికి కల్గేయి అన్నమాట

ఈ విధంగా శక్తులు కల్గడంలో ప్రకృతితో సంబంధం పెట్టుకున్నా, ఎట్టి ప్రయోజనమూ అనగా స్వార్థమూ వానివల్ల పొందకుండా సాధకుడు తనలోనే ఆ శక్తుల్ని విలీనం చేసుకోవాలి. అప్పుడే సాధకుడు ముక్తి మార్గంలోని చివరిమెట్టు ఎక్కగలుగుతాడు. ప్రకృతితో సంబంధం కల్గి వాటిని వినియోగించుకొన్నా సాధకుడు భ్రష్టుడౌతాడు. ప్రకృతికి సాధకుడు వశపడిపోతే సాధకునిలో దేహాత్మభావం అంటే దేహ సౌఖ్యమే ఆత్మ సౌఖ్యం అనే భావం పోతేనన్నమాట. అది పోయినప్పుడే అతనికి పరమాత్మ స్వరూపం అవగతమౌతుంది.

అంబికఅన్నా అంబాలిక అన్నా తల్లిఅని అర్ధం ప్రకృతి అన్నిటిని సృజించేది కాన అది జగజ్జనని ఔతుంది. ఈ విధంగా అంబిక, అంబాలికలన్న రెండు పదాలకు ప్రకృతి అనే అర్థం చెప్పవచ్చు. వారికి పెండ్లి చేసినా వారికి సంతానం చిత్రాంగద విచిత్ర వీర్యులకు కల్గలేదన్న దానికి సాధకునికి కల్గిన సిద్ధులకు ప్రకృతితో సంబంధం కల్గించినా ఎట్టి స్వార్థము సృష్టింపబడలేదన్నది అంతరార్థపరంగా చెప్పాలి. దీనితో సాధకుడు పై ఘట్టంలోని ఒక మెట్టు దాటాడన్నమాట. గురు సహాయంతో, మాయా శక్తులు కలగడంతోను, అవి తన్ను లొంగతీయలేకపోవడంతోనూ, సాధకునికి పరీక్షా ఘట్టం విజయవంతంగా దాటిందన్నమాట. తర్వాత సాధకునికి గురు సహాయం అవసరంలేదు. తర్వాత సాధకుడు తనలో జన్మనిచ్చే సాత్త్వికి, రాజసిక, తామసిక, వాసనలను జ్ఞాన సహాయంతో ఉద్బుద్ధం చేసి నాశనం జరిగించాలి. అప్పుడే వాసనా రాహిత్యంతో పునరావృత్తి రహితమైన మోక్షం సిద్ధిస్తుంది.

సత్యవతి వ్యాసుని రప్పించి అంబిక, అంబాలికలయందు ధృతరాష్ట్రుని పాండురాజును కనునట్లు చేసిందంటే సాధకుడు జ్ఞానాహంకృతితో ప్రకృతితో

సంబంధం కల్గించుకొని తమోగుణాన్ని రజోగుణాన్ని ఉద్బుద్ధం చేసేదన్న మాట. తమోగుణమే-గుడ్డివాడగు ధృతరాష్ట్రుడు. రజోగుణం పాండురోగం గల పాండు రాజు. తర్వాత సత్యవతి తన దాసీదాన్ని వ్యాసునితో సంగమింప పంపినది. దానికి విదురుడు పుట్టాడు. 'దాసీ' అంటే యిక్కడ సాధకునిలోని భగవద్దాస్యం సలిపే మనోవృత్తి అన్న మాట. ఆ భగవద్దాస్యవృత్తికి వ్యాసునితో అంటే జ్ఞానంతో సంగమం గలగడంతో విదురుడు అంటే సత్వగుణంతో గల్గిన జ్ఞానం ఉద్బుద్ధమైన దన్న మాట. 'విదుర' పదానికి జ్ఞానావిర్భావం అన్నదే అర్థం.

పుట్టుగ్రుడ్డివాడగు ధృతరాష్ట్రునికి నూరుగురు సంతానం. వాళ్ళు దుర్మార్గ ప్రవర్తకులు. అంటే జన్మలకు కారణాలైన తమోగుణ వాసనావృత్తులే వారు అన్న మాట. ధర్మగుణములో రాజస వృత్తివల్ల కలిగే పంచేంద్రియ వృత్తులు ఏకమై సంయమంగా నడుస్తాయి అన్నదే ధర్మరాజు యొక్క అదుపులో పాండవులు సంచరించేరన్న దానికి అర్థం. రజోగుణం వల్ల కల్గిన వృత్తులు సత్త్వగుణం యొక్క అదుపునకు లొంగివుంటాయి. అదే విదురుని మాట పాండవులు పాటించేవారన్న దానికి అర్థం. అట్టి సాత్త్విక సంపత్తి ధర్మానురక్తి కలవాటికి భగవత్ సహాయం లభి స్తుందనడమే పాండవులకు శ్రీకృష్ణసహాయం అండగా ఉన్నదన్న దానికి అర్థం బ్రహ్మజ్ఞానియైన సాధకునిలోని రజోగుణ వృత్తులూ, తమోగుణ వృత్తులూ సాత్త్విక వృత్తులూ త్రిగుణ వృత్తులూ కూడ తమలో తాము పోరి చివరకు సాధకుని ఆ జ్ఞానా గ్నిలో అన్నీ నశిస్తాయి.

ధార్తరాష్ట్రులు, పాండవులు తమలో తాము కలహించడం పాండవులు జయించడం చివరికి పాండవులు కూడా రాజ్యం చెయ్యక మహాప్రస్థానానికి (మోక్షానికి) పోవడం జ్ఞానమార్గంలో సాధకునిలో ఉద్బుద్ధములైన, తామసిక, రాజసిక, సాత్త్విక గుణాలు తామంతట తాము కలహించి నశించిపోవడం, మోక్షసౌధాన్ని అధిరోహించడం అనే అంతరార్థాన్ని చెపుతున్నాయి. ఈ విధంగా మహాభారతం 'జయం' అనిపించుకొన్నది. అంటే సాధకుడు సాధించిన మోక్ష సాధనా విజయం అన్న మాట. అప్పుడు 'జయం' అనేది వ్యాసభగవానుని భారతానికి సార్థకమయినదిగా భావించాలి. నాలుగు వేదాలలోని సారాంశమైన ముక్తి విజయం ఈ భారత కథారూపంలో వ్యాసునిచే చెప్పబడినది. గనుకనే భారతం పంచమ వేదం అనిపించుకొంది. సాధకుడు జనన మరణ సాగరాన్ని దాటే కోరికతో సత్యపర మైన తృష్ణతో సాధన చేస్తూంటే భగవదనుగ్రహం కలుగుతుందనీ, తద్వారా జ్ఞానో

దయం జరుగుతుందనీ, తర్వాత సాధకునిలోని ఇహాముత్ర ఫల విరాగం చూచి గురువు తానై వచ్చి సాధనలలో అతనికి అణిమాద్యష్ట సిద్ధులు కలిగిస్తాడనీ, ఆ సిద్ధులకు ప్రకృతితో సంబంధం వున్నా, స్వార్థాని కుపయోగపడకుండా సాధకుడు తనలోనే లీనం చేసికుంటాడనీ, ఆపైని జ్ఞాన సహాయంతో తామసిక, రాజసిక, సాత్త్వికములనే త్రిగుణాల్ని జ్ఞానాగ్నిలో వేచిన విత్తులవలె తిరిగి జన్మనిచ్చే శక్తి లేనిదిగా నశింప చేస్తాడనీ ఆపైని సాధకుడికి మోక్షం లభిస్తుందనీ, మహాభారతంలోని కథ కంతటికీ సాధనాపరమైన అంతరార్థంగా గ్రహించాలి. ఈ విధంగా మహాభారతం మోక్ష ప్రతిపాదక మహాగ్రంథ రూపం అవడంవల్లనే పంచమ వేదమైనదిగా గ్రహించాలి.

శ్లో॥ కానీ నస్యమునేః స్వసోదర వధూవైధవ్య విధ్వంసినః
నప్తారః ఖలుగోళకస్య తనయాః, కుండాస్తథా పాండవాః
ఏతే చాపి సమానయోని రసికా స్స్వైదైక జాతాః భువి
తచ్చారిత్ర మఘౌఘ నాశకమహో ! ధర్మస్య సూక్ష్మగతిః॥

అని, ఏకవినోటినుండి పలుకబడిందో ! బాహ్యార్థంలో భారత కథ ఎంత మలినంగా వుందో ఈ శ్లోకం సంగ్రహంగా స్పష్టం చేస్తూంది. దాని అర్థం చెప్తున్నాను. వ్యాసుడు కన్యకకు పుట్టినాడు. ఆతడు ముని. అతడు తన సోదరుల భార్యలకు వైధవ్యము వదల్చినాడు అంటే వారికి సంతానం కన్నాడు. అతని మనుమలు కొందఱు (ధార్తరాష్ట్రులు) గోళకులు, కొందఱు (పాండవులు) కుండులునై యున్నారు. పాండవులు అన్నదమ్ములంతా కలిసి ఒక్కరైనే పెండ్లాడి ఆమెతోనే అందఱూ రమించేరు. ఈ రకంగా వున్న వ్యాసవంశ భారత చరిత్ర చదివినా; విన్నా పాపాలు పోతాయి. ఆహా ! ధర్మసూక్ష్మం ఎల్లా వుందో. గోళకులు అనగా, మొదటి భర్త చనిపోయిన తర్వాత రెండవ భర్తకు కల్గినవారు. గాంధారికి ముందు పెండ్లి అయి ఆ భర్త చనిపోయిన తర్వాత ధృతరాష్ట్రునితో వివాహమైందిట. కుండులు అనగా భర్త వుండగా జారుని వల్ల పుట్టినవారు. కుంతికి మాద్రికి యమ వాయు ఇంద్ర అశ్వని దేవతలవల్ల పుట్టిన పాండవు లట్టివారు.

పై శ్లోకం భారతంలోని బాహ్యార్థం ఎంతో అసహ్యకరంగా వుందని చెప్తూనే అది మోక్ష ప్రతిపాదకమైందని కూడ చెప్పి ఆశ్చర్యాన్ని వెళ్ళడిస్తూంది. భారతం మోక్ష ప్రతిపాదకం అనడానికి బాహ్యార్థ ప్రకారం కాదనీ, ఏదో అంతరార్థం అందులో వుందనీ ఆ శ్లోక రచనలోని ఉద్దేశం.

# నలమహారాజు చరిత్ర

## (పూర్ణ యోగ సాధన)

నలమహారాజు కథ భారతంలో అరణ్య పర్వంలో వివరంగా చెప్పబడింది. భాగవతంలో చంద్ర వంశాను వర్ణనలలో నొకచోట నల కథ అతి సంగ్రహంగా చెప్పబడింది. విపులంగా తెలియడానికై భారతకథ ననుసరించి అంతరార్థం ఇక్కడ విపులంగా చెప్పాను.

శ్లో॥ కర్కోటకస్యనాగస్య
దమయంత్యాః నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః
కీర్తనం కలినాశనం॥

అని ఫలశ్రుతి చెప్పబడింది.

నల కథలోని అన్నిపాత్రలూ కూడ కలినాశనం కలిగించేవిగానే చెప్పబడ్డాయి. నలకథలో అసలు కలినాశనానికి తగ్గ కథా వస్తువు ఏముంది? నలుడు దమయంతిని ప్రేమించి పెండ్లాడడం, హంస రాయబారం నడుపటం, దిక్పాలురు దమయంతీ వివాహాని కడ్డు తగులడం, నల రాయబారం, నలుడు జూదమాడి రాజ్యభ్రష్టుడు కావడం, తాను ప్రేమించి పెండ్లాడిన దమయంతిని అడవిలో ఒంటరిగా విడివివేయడం, కర్కోటమనేపాము నలుణ్ణి కఱవడం, వికారరూపం పొంది బాహుకుడనే పేరుపెట్టుకొని నలుడు ఋతుపర్ణుడనే రాజును సేవించడం, తిరిగి పునస్స్వయంవరంలో దమయంతిని నలుడు పొందడం. ఇవి నలకథలోని విషయాలు; ఇందులో కలిహరణం చేయగల మహత్త్వ ప్రతిపాదకాలైన విషయం ఏవీ కానరాదే: మఱి నలకథ కలిహరణం ఆ మాటను యెట్లు సరిపడుతుంది? ఇది జరిగిన చరిత్ర యంటామా? అందలి యసందర్భ విషయాలు పాము మింగి బ్రతకడం లాంటివి అది సత్యచరిత్ర కాదని చెప్పుతున్నాయే:

భారతం పంచమ వేదం అని ప్రసిద్ధి పొందింది. దానికి వేదతుల్యత్వం చెప్పబడింది. భారతం వేదం చెప్పిన ముక్తిని చెప్పంది ముక్తిని గూర్చి చెప్తేనే భారతం వేదతుల్యం అవుతుంది. అందుచేత భారతకథ అంతా ముక్తినే చెప్తూందని అంత

రార్ధపరంగా ఆలోచించినపుడు స్పష్టపడుతూంది. ఈ నలకథ పాపనాశకం అని పేర్పడ్డది. నలకథకు బాహ్యార్థంలో పాపనాశక శక్తి లేనేలేదు. అంతరార్థంలోనే అది తప్పకుండా ముక్తి సాధనలను చెప్తూంది కాన అది పాపనాశకమే కాగలదు. ఇందున్న అంతరార్థం తెల్పి ఆ అంతరార్థము ఎట్లా ముక్తి సాధనమౌతుందో సాధనా భాగం వివరించి చెప్తాను. భారతాన్ననుసరించిన కథ భాగవతంలో సంగ్రహంగా చెప్పబడి వుండి దాన్ని భారతోక్తంగా వివరించి అంతరార్థం వివరిస్తాను.

# సాధనా ప్రథమ భాగం

"నలుడను పేరుగల రాజొకడు కలడు"

'నలుడు' ఈ పేరేమిటి? ప్రతిపేరూ ఏదో ఒక ధాత్వర్థాన్ననుసరించియే యుంటుంది. అర్థవంతం కాని శబ్దమే యుండదు. పదం యొక్క వ్యుత్పత్తిని పరికిస్తేనే దాని అర్థం తేటతెల్లమవుతుంది. ఇచ్చట నలపదంలోని 'న' కారము, 'కాదు' 'లేదు' అర్థము నిస్తూంచి 'ల', "లాతి గృహ్ణాతి ఇతి 'లః' " అనే వ్యుత్పత్తిలో గ్రహించునది అని దానికి అర్థం. కనుక 'న+లః'=నలః, అంటే గ్రహించుట లేనివాడు. అనగా నేతి, నేతి (న+ఇతి) ఇది పరమాత్మకాదు, ఇది పరమాత్మకాదు అని ప్రకృతిలోని సమస్తమును నిషేధిస్తూ దేనిని అంటకుండ అసంగతత్వంతో సాధన చేయు సాధకుడు 'నలు' డన్నమాటకు అర్థంగా గ్రహించాలి.

'నేతి', 'నేతి' అని సర్వ ప్రకృతిని నిషేధిస్తూ పరమాత్మాన్వేషణ జరిపే సాధన ఒకటి ఆధ్యాత్మిక సాధనలలో నొకటిగా వుంది. ఈ సాధనతో తనలోపలి ఇంద్రియాలను, మనస్సునూ కూడ నిషేధిస్తూ చిట్టచివరకు తనలోనున్న 'అహం' స్ఫూర్తిని పరమాత్మగా గుర్తిస్తూ సాధకుడు 'సోఽహం' భావం పొందడం ఈ సాధనా ఫలితంగా చెప్పబడింది. ఈ సాధన నలసాధన అవుతుంది అన్నదే నలుడనే రాజున్నాడు అన్నదాని అంతరార్థం.

ప్రత్యక్షంలో ఒకరి నొకరు చూడకపోయినా నలుడికి దమయంతి మీద, దమయంతికి నలుడి మీద పెండ్లి చేసికోవాలనే ప్రేమ కలిగినది.

'దమయంతి' అన్నపదానికి బాహ్య మనోవృత్తులను నిగ్రహించునట్టి మనో వృత్తి అని అర్థం. "నిగ్రహో బాహ్యవృత్తీనాం దమఇత్యభి ధీయతే" అను శబ్దార్థ

నిర్ణయం వల్ల బాహ్యవృత్తులను నిగ్రహించు సాధకునిలోని మనోవృత్తి దమయంతి అవుతుంది.

'నల' పదం అసంగతత్వంతో మోక్షాన్ని సాధించే సాధకుని తెలిపే పదం. అసంగతత్వానికి ఇంద్రియ నిగ్రహం తోడ్పాటు నిరంతరమూ కావలసి వుంది. కాన మోక్ష ప్రాప్తికై అసంగత్వ సాధకుడు ఇంద్రియ నిగ్రహం యొక్క తోడ్పాటు కోరడం అత్యంత సహజం అన్నదే నలుడికి దమయంతిని చూడకుండానే సహజానురాగం కల్గింది అన్నదానిలోని అంతరార్థం. దమయంతి అను మనోవృత్తికి (ఇంద్రియ నిగ్రహవృత్తికి) ఫలం అసంగత్వాన్ని సాధించుటయే. అందుచేతనే దమయంతికి కూడ నలునిమీద సహజ ప్రేమ కల్గిందని చెప్పబడింది. నల దమయంతీ సాధనలు రెండూ కలిసి ఏకం కావడం అన్నది మోక్ష సాధనల్లో అత్యంతావశ్యక మైన సాధన అనే సంగతి నలదమయంతుల అన్యోన్యానురాగ కథనంవల్ల అంత రార్థపరంగా తెలిసికోవాలి–

కథ :– 'హంసను పట్టుకొన్నాడు నలుడు.'

'సోఽహం' అనునది తల్లక్రిందులైనపుడు 'హంసో' అని అవుతుంది. 'హంసో' అనునది 'హంసః' యొక్క రూపమే. కొన్ని పదములిట్లు తల్లక్రిందులు చేసి వ్యుత్పత్త్యర్థాలు చెప్పడం భాషలోను వేదములోను కూడ కలదు. 'హంస' మానస సరస్సులో సంచరించేది. అంటే మానసమున అంటే మనస్సునందు 'సోఽహం' భావము నలసాధనవల్ల కలుగుతుంది అన్నది అంతరార్థంతో చెప్పుకోవాలి.

'సోఽహం' అనగా 'అహం'=నేను అనబడేది సః=ఆ పరమాత్మ అని అర్థం 'సః' అనుదానికి అతడు అని అర్థం. ఎవడో ఫలానివాడు అని నిర్వచనము చేయడానికి వీలులేని 'సః' అన్న మాట.కాన 'సః' అనునది అనిర్వచనీయ పరమాత్మను తెల్పే పదం అవుతుంది. అహం అనేదానికి న+హం అన్న వ్యుత్పత్తితో 'హంతి ఇతి హం' అనగా నశించేది అని అర్థం. 'నఞ్' అనేది సమాసంలో 'అ' అని మారుతుంది. 'న' కానిది అనే అర్థంలో వచ్చేది. ఈ రకంగా 'అహం' అంటే నశించేది కానిదైన సత్యపదార్థం అనగా పరమాత్మ అని అర్థం.

ఈ విధంగా 'సోఽహం' అంటే త్రికాలాబాధ్యమైన సత్యస్వరూపమైన పరమాత్మయే. అదే మనలో 'అహం' అనేది. అది హృదయగుహలో వుంటుంది. ఈ 'సోఽహం' భావమే నిర్విషయానందానుభూతి నిస్తుంది. ఆ అనుభూతి సాధ

కునిలో మేల్కొన్నదనడమే 'నలుఁడు హంసను పట్టుకొన్నా' డనుదాని యందలి అంతరార్థ సారాంశంగా భావించాలి.

'నల దమయంతుల మనోనురాగము దృఢపడుటకు హంస రాయబారము నడపినది.'

ఇంద్రియ నిగ్రహం 'సోఽహం' భావం వల్ల స్థిరపడుతుంది. అసంగవృత్తి 'సోఽహం' భావం యొక్క సాయంతో ఇంద్రియ నిగ్రహాన్ని శాశ్వతంగా తనలో కుదుర్చుకొంటుంది. ఇంద్రియ నిగ్రహానికీ, అసంగవృత్తికి మధ్య 'సోఽహం' భావం అనుసంధాన కర్తగా వుంటుంది. ఇంద్రియ నిగ్రహం దమయంతి. నలుడు అసంగవృత్తి. హంస 'సోఽహం' భావం ఇప్పుడు నల దమయంతుల మధ్య దృఢాను రాగానికి హంస రాయబారం నడిపిందనగా ఇంద్రియ నిగ్రహ, నిష్కామ యోగములకు 'సోఽహం' భావ చింతనము సాధకునకు సహాయకారిగా నుంటుంది అన్నది అంతరార్థంగా తెలియబడుతూంది. ఇది సాధనా మార్గంలోని తొలిదశ. పై కథాభాగం ఈ ముక్తి సాధనా ప్రథమ ఘట్టాన్ని చెప్తూన్న తొలిదశగా గ్రహించాలి.

మొదటి సాధన యొక్క రెండవ భాగము :—

ప్రథమ ఘట్టంలో రెండవ దశలో సాధకునిలోని అపరాశక్తితో అంటే నీచ మనస్సుతో సాధకుని పరాశక్తిని అనగా ఉన్నత మనస్సును అడ్డగించే సంకుల సమరం ప్రారంభమవుతుంది. ప్రతివాని మనస్సులోను 'పర' 'అపర' అను రెండు ప్రకృతి శక్తు లుంటాయి 'పరా' శక్తి పరమాత్మాను సంధానానికి విరక్తి వైపు మొగ్గగా 'అపరా' శక్తి ఐహిక విషయానందం వైపు రక్తికి దారి తీయిస్తుంది. సాధకుడే విషయం అప్రమత్తతతో గమనించి తనలోని పరాశక్తికి విజయం సాధిస్తేనే ముక్తి లభిస్తుంది. పై సాధనా విషయం ఈ క్రింది కథా భాగంలో పరోక్షం చెయ్యబడి వుంది.

ఇంద్ర, అగ్ని, యమ, వరుణులు నలుడు దమయంతిని పెండ్లాడకుండా వుండడానికి ప్రబలయత్నాలు చేసేరు. దమయంతిని తమలో ఏ ఒక్కరినైనను సరే వరించేటట్లు చేయవలసిందిగా నలుణ్ణే రాయబారిగా నియమించి దమయంతి వద్దకు పంపించేరు.

ఇంద్రలోకం స్వర్గం. అది సర్వకామాల్ని తీరుస్తుంది. కాన ఇంద్రుణ్ని కామమునకు సంకేతంగా చెప్పవచ్చు. క్రోధం అగ్నిలాగ తన్నాశ్రయించిన వార్ని సర్వనాశం చేస్తుంది. కాన అగ్నిని క్రోధానికి సంజ్ఞగా చెప్పవచ్చు. అరిషడ్వర్గాల్లో లోభం అన్నిటికన్న నరక హేతువు. కాన లోభము యముడికి మారుపేరుగా చెప్పుకోవాలి. మోహమావరిస్తే నిజరూపం మఱుగున పడిపోతుంది. అట్లే జలంలో నున్నప్పుడు నిజదేహం మఱుగున పడుతుంది. ఈ లక్షణం వల్ల జలాన్ని మోహానికి సంకేత మనవచ్చు. జలాధి దేవత వరుణుడు. కాన వరుణుడు మోహానికి మారుగా చెప్పబడిందని గ్రహించాలి. కామ క్రోధ లోభ మోహాలు సాధకునిలో అసంగవృత్తిని ఇంద్రియ నిగ్రహ వృత్తితో కలవకుండా చెడగొట్టడమన్నదే ఇంద్ర, అగ్ని, యమ, వరుణులు దమయంతి నలునికి దక్కకుండా జేయుటకు సర్వవిధాల యత్నించడంలోని అంతరార్థంగా గ్రహించాలి. ఇంద్రాదులు దమయంతి సౌందర్యానికి ముగ్ధులై దమయంతిని పెళ్ళాడాలని వచ్చినారు అని మూలంలో నున్నది బాహ్యార్థంలో ఆ విధంగా కధకు ఆకర్షణ కోసం చెప్పబడింది అంతే. కాకపోతే దిక్పాలురు దమయంతి నలుణ్ని కాక తమలో ఏ ఒక్కర్ని వరించినా సరే అని ఐకమత్యంగా ఉండడం అనేది సహజం కానేకాదు. వారి నల్గురికీ కూడ దమయంతి నలుడికి దక్కకుండా చెయ్యడమే ధ్యేయంగా వుంది. దమయంతి ఎవరికి వారికే పెండ్లాముగా తనకే కావాలని, తనకే కావాలని వారిలో ఏ ఒక్కరికి వుండకపోగా తమలో ఎవరికి ఆమె పెండ్లామైనా సరే అనుకోవడం కామవృత్తికి లక్షణం కాదు గదా! నలుడికి పెండ్లాం కాకుంటే చాలునన్నది నలునిపై గల ద్వేషం నల్గురికీ సమంగానే వుందనడం అంతరార్థంలోనే సరిపడుతుంది కాని బాహ్యార్థంలో అది అసంగతమైన విషయమే అవుతుంది. ఆ కామక్రోధాదులను నలవృత్తి దమయంతీ వృత్తితో జతపడకుండా చెయ్యడం అనేది సహజ వైర లక్షణమై వుండడం అన్నది ముక్తి సాధనా దశలోని విఘ్నదశగా సాధకులు గుర్తించి ఇంద్రాది దిక్పాలురు 'నలుని' దమయంతి యొద్దకు తమలో నొకని వరించుటకు రాయబారం నడుపవలసినదిగా కోరి ఒప్పించి పంపించేరు.

దిక్పాలుర కోరిక పైని నలుడు రాయబారాన్ని నడిపించేడు కాని దమయంతి దిక్పాలురను పెండ్లాడడానికి సుతరామూ ఇష్టపడలేదు.

ఎంతగా అసంగయోగాన్ని ఇంద్రియ దమనం కోసం సాధన చేస్తూన్నప్పటికీ ఒక్కొక్కప్పుడు తనకు తెలిసికూడా సాత్త్విక వృత్తితో పరోపకారార్థ మనుకొని కామాది అరిషడ్వర్గం యొక్క కోరికను సాధకుడు కాదని లేకపోవడం అనే ఒకానొక

సాధనా దౌర్బల్య స్థితికి సాధకుడు లోబడి పోతూంటాడు. అదే ఇంద్రాదులు కోరడం వల్ల నలుడు కాదనలేక రాయబారాన్ని అంగీకరించి నడిపేదన్న దాని అంతరార్థంగా గ్రహించాలి. ఆ విధంగా అరిషడ్వర్గాలకు సాధకుడు లోబడిపోయిన సందర్భంలో దైవం అతని పూర్వసాధన కారణంగా అతణ్ణి సాధనా భ్రష్టుణ్ణి కాకుండా కాపాడుతాడు. అదే నలుడెంతగా రాయబారం చిత్తశుద్ధితో నడిపినా దేవత లెంతెంత గొప్పవారైనా దమయంతి మాత్రం నలుణ్ణే తప్ప మరెవ్వరినీ అంగీకరించక పోవడంలోని హేతువుగా మనం గ్రహించాలి.

ఇంద్రియ నిగ్రహవృత్తికీ అనగా దమయంతీ వృత్తికి ఆ కామ క్రోధ లోభ మోహముల తాత్కాలిక సుఖస్థితులు అసలు కిట్టనేకిట్టవు. సాధకునిలోని ఇంద్రియ నిగ్రహవృత్తి ఎప్పుడూ అసంగ నల వృత్తితోనే తనకు మనుగడ వుందని గ్రహిస్తుంది. దమయంతి నలునే తప్ప దిక్పాలుర నిష్టపడలేదనడంలోని అంతరార్థం ఇదే. ఇది సాధకునకు అతని సాధనలకు దైవం తోడ్పాటు వల్ల కల్గిన సత్ఫలితంగా గ్రహించాల్సి వుంది.

దిక్పాలురు తాము ఇక చేసేది లేక నలరూపాల్ని ధరించి స్వయంవర మంటపంలో కూర్చుండి దమయంతిని మభ్యపెట్టగా దమయంతి ఆ మోసగాండ్రైన దిక్పాలురనే అనుగ్రహింపవేడుకొని వారి అనుగ్రహంతోనే నిజ నలుణ్ని తెలిసి కోరి అతణ్ణి వరించింది.

సాధకునిలోని అపరాశక్తి ప్రోత్సాహంతో కామక్రోధాదులు తమ నిజరూపాలతో ఇంద్రియ నిగ్రహ శక్తిని అసంగతత్త్వం నుండి విడదీయశక్యం కాదనే సంగతి గుర్తించినపుడు అవి అసంగ లక్షణాల్నే తామూ ఇష్టపడునట్లు పైకి కన్పిస్తూ అనగా తాము సాధకుని కెట్టి హానిని కల్గింపకపోగా పైగా, సాధనకు తోడ్పడే రీతిగానే కన్పట్టి సాధకుని వంచించుటకు యత్నిస్తాయి. ఒక్కొక్కప్పుడు వంచనతో ఈ కామక్రోధాదులు ఏదో సాధకుడు తలపెట్టిన సత్కార్యాలకు తాము తోడ్పడి సాధించుటకుగాను తల యెత్తుతూ ఆ సత్కార్యాల్ని సాధించిన పిమ్మట అవి సాధకునిలో చోటు చేసికొని విడవక తమ ఉనికిని సాధకునిలో స్థిరపరచుకొని క్రమంగా 'అపర' శక్తి యొక్క ప్రోత్సాహంతో సాధకుని ముక్తి సాధనను భ్రష్టం చేస్తూంటాయి. ఈ విషయాలు సాధకులగు పాఠకులు తమ తమ అనుభూతులతో తెలిసికొన్నప్పుడు దిక్పాలురు నలరూపం ధరించి స్వయంవర మంటపంలో

కూర్చున్నారన్న దాని అంతరార్థం సులువుగానే బోధపడుతుంది. ఎంత చెప్పినా దిక్పాలుర ఈ సాధనానుభవం వల్లనేగాని స్పష్టంగా తెలియబడదు.

స్వయంవర మంటపంలో ఇంద్ర, యమ, అగ్ని, వరుణులు నల రూపము ధరించి నలుని ప్రక్కన కూర్చుండినపుడు దమయంతి వారిలో నిజ నలు డెవ్వడో తెలియలేక దిగులుపడి, ఆర్తితో -

"సురలార ! నలు నెఱుంగు విధము నా కెఱుంగ జేయుచూ, మీరు స్వ స్వరూప ధరులగుండ"ని పరిదేవనము చేసింది. అంత దేవతలు దాని పరిదేవనం విని కరుణించేరు.

దేవతలు తాము నలరూపాలతో దమయంతిని మోసపుచ్చడానికి తలచిన వారైనా, ఆమె పరిదేవనాన్ని విని కరుణించేరు.

కామ క్రోధ లోభ మోహాలు సత్త్వగుణం యొక్క ముసుగులో సాధకునిలో నుండి పైకి చూచేవారికి తాము సత్త్వగుణములమే యని భ్రమ పెట్టుచున్న వే యైనను, సాధకుడు తమ్ము అణచుటకై పగతోగాక శోకించుచు అనునయించుచు బ్రతిమలాడు చున్నప్పుడు అవి కరుణించి తామై సాధకుని వదలి వీడిపోతాయి. ఇదే ఇంద్రియ దమ నమునకై సాధకు లవలంబింపదగిన అనునయ పద్ధతి అందే. ఇంద్రియ వేగాన్ని ఈ అనునయ పద్ధతితోనే తగ్గించాలి. కాని బలాత్కార దమన పద్ధతి పనికిరాదు. సాధకుని లోని ఈ అనునయ దమన పద్ధతియే ఇంద్రాదులను గూర్చి దమయంతి పరిదేవనము చేయడం అన్న దానిలోని అంతరార్థం.

తర్వాత, కలి ప్రేరణంతో పుష్కరుండను నలునిసోదరుడు అక్ష ప్రియుడైన నలునితో జూదమాడి యాతనిని రాజ్యభ్రష్టుణిగా జేసేడు. నలుడు దమ యంతితో అరణ్యానికి పోతూ పుర బాహ్య ప్రదేశాన మూడురోజు లహోరాత్రాలు ఉపవాసం చేసి గడిపేడు.

'కలి' యనగా అపరా ప్రకృతి. నీచస్థితికి గొనిపోవు మనః ప్రకృతి అదే అపరాశక్తి అదే పాపదేవత. అక్షము లనగా ఇంద్రియాలు అని అంతరార్థం. జూద మాడు పాచికలని బాహ్యార్థం. నలుడు అక్షప్రియుడు అందే జూదమాడు పాచికలయం దిష్టము కలవాడని బాహ్యార్థం. ఇంద్రియ విషయములను బాధనక (అసంగవృత్తితో) అనుభవించువాడని అంతరార్థం. అసంగవృత్తితో అతిక్రమించగల్గినప్పుడు విష యాలను త్రోసివేయవలసిన పనిలేదు. అసంగస్థితి యందు విషయవాసనలు సాధకుని

యంటనే లేవు. అప్పుడు విషయములతో సంగము లేదను సంగతి సాధకునకే తెలి యును కాని బాహ్యవృత్తిని చూచి పైవారాతనిని విషయ లాలసునిగా భావిస్తారు. ఆ విధంగా నలుడు నిజంగా అక్షప్రియుడనుకొని పుష్కరుడు నలుని అక్షద్యూతము నకు (పాచికలాటకు) ఆహ్వానించేడు. అంటే నలుడు ఇంద్రియలోలుడని పుష్కరుడు భావించడంచేత జూదానికి ఆహ్వానింపబడ్డాడని బాహ్యార్థం.

పుష్కరుడు అంటే ఇంద్రియ వాంఛలను పోషించు అపరాశక్తి యొక్క ఒక నీచ మనోవృత్తి. 'పుష్' ధాతువునకు పోషణ మర్థం. కరుడనగా చేయువాడని అర్థం. అతడు నలుని సోదరుడు. నలుడనగా ఏమియు గ్రహింపని అసంగవృత్తి అని కదా అర్థం చెప్పుకొన్నాము. ఏమియు గ్రహింపని మనోవృత్తి సాధకునిలోని పరాశక్తికి సంబంధించినది. పరాశక్తి అపరాశక్తి కూడ ఒకే భగవంతుని వల్ల పుట్టేయి. కాన ఏమియు గ్రహింపని అసంగ మనోవృత్తి, అన్నిటిని గ్రహించు పుష్కర మనోవృత్తి రెండూ అన్నదమ్ములే. నలపుష్కరు లన్నదమ్ములుగా చెప్పడంలోని అంతరార్థమిదే. మొదటిది విరక్తికి కారణం, రెండవది అనురక్తికి కారణం. ఒకరనిన మఱొకరికి అసలు కిట్టదు. దాయాదులగుటచే ఒకరి పచ్చ మఱొకరికి కిట్టదు. అని చెప్పడానికి అన్న దమ్ముల సంబంధం కథలో చెప్పబడింది. అది ఒకదాని నొకటి నాశము చేసికోవ డానికి యత్నిస్తూంటాయి. పుష్కరుడు నలునితో జూదమాడి నలుణ్ణి రాజ్యభ్రష్టుడిగా జేసేడు. సాధకుడు అసంగవృత్తితో విషయాల్ని అన్నిటిని అనుభవించుచుండుటయే నలుడేలే రాజ్యమన్నమాట. ఆ రాజ్యాన్ని పుష్కరుడు తన వశం చేసికొన్నాడు అనగా సాధకునిలో అపరాశక్తి ప్రోత్సాహంతో అసంగవృత్తితో జరిగే విషయాను భవం కూడ లేకుండా చేయబడిందన్నమాట. సాధకుడు అపరాశక్తిని అనగా మాయను తన్ను వశపరచుకొనుదానినిగా గుర్తెరిగి తానే విషయానుభవాన్ని పూర్తిగా వదలివైచినా డన్నదే నలుడు రాజ్యమును జూదంలో కోల్పోయినాడను దానిలోని అంతరార్థం.

పుర బాహ్యమనగా దేహమునకు వెలుపల అని అర్థం. పురము దేహముగాను, దేహములోని పరమాత్మను పురుషునిగాను చెప్తుతారు. 'పురిశేతే ఇతి పురుషః' పురమున శయనించి యుండువాడు అని పురుష పదమునకు వ్యుత్పత్తి చెప్పబడింది. పురబాహ్య ప్రదేశంలో మూడు అహోరాత్రాలు ఉపవాసం చేసేడు. నలుడు అంటే సాధకుడు దేహానికి బైట సత్త్వరజస్తమో గుణములలోని ద్వంద్వ వృత్తులను (సుఖ దుఃఖాదులను) విడిచివేసినాడని అర్థం. మూడుపదము గుణత్రయమునకును, అహోరాత్రములు ద్వంద్వ

ములకును వ్యంజకములుగా భావించాలి. ఉపవసించుట యనగా భోజనం చేయక పోవడం- అంటే త్యజించుట అను అర్ధకంగా ఉపవాస పదాన్ని ఉపయోగించినట్లు గ్రహించాలి.

సాధకుడు ఈ విధంగా విషయాల అనుభవాన్ని పూర్తిగా వదలుటయే కాక తనలోని త్రిగుణాల్ని వాని ద్వంద్వాల్ని కూడ దేహంలో లేకుండా విడిచివేసి పై స్థాయి సాధనకు జేరుకున్నాడన్న మాట.

తర్వాత నలుడు బుభుక్షాపీడితుడై హిరణ్మయ పక్షాలతో తన ముందట ఎగురుతూన్న పక్షుల్ని చూచి యవ్వి తనకు భక్ష్యములు కానగునని వానిని పట్టు కోవడానికోసం తాను కట్టుకొన్న పుట్టంబు విప్పి వానిపైని వేసేడు అవి యా బట్టతో సహా ఆకాశం పైకెగసి పోయేయి.

గుణత్రయమూ ద్వంద్వాలూ సాధకుణ్ని వీడిపోవడం తోనే ఆతనిలోని మాయ దగ్ధమైన వస్త్రంలాగ నామ మాత్రంగా నిలిచి యుంటుంది. మాయతోకూడి అంత వరకూ, ప్రకృతి సంబంధం సాధకున కింకనూ మిగిలి యుంటుంది. అది కూడ నశించిన తర్వాత సాధకునిలో అజ్ఞానావరణం పూర్తిగా తొలగి జ్ఞాన స్వరూపంగా సాధకుడు మారిపోతాడు.

హిరణ్మయ పక్షులు అనగా బంగారు రెక్కలు గల పక్షులు అని బాహ్యార్థం. ఇచ్చట హిరణ్మయ పదం విశ్వవ్యాప్తమైన మాయను తెల్పుతుంది. "హిరణ్మయేన పాత్రేణ। సత్యస్యాపి హితం ముఖం" అని ఉపనిషత్తులో చెప్పబడి వుండి 'బంగారు పాత్రచేత సత్యస్వరూపమైన పరమాత్మ యొక్క ముఖం కప్పివేయబడింది.' అని దాని యర్థం. అంటే మాయావరణం చేత పరమాత్మ స్వరూపం గోచరింప బడటం లేదని భావం. పై ఉపనిషద్వాక్యంలో 'హిరణ్మయ పదం' విశ్వవ్యాప్తమైన మాయను తెలుపుతుండడం వల్ల ఇచ్చటి హిరణ్మయ పదానికి మాయ అనే అర్ధాన్ని సులువుగానే చెప్పుకోవచ్చు. సాధకుడు బుభుక్షాపీడితుడై హిరణ్మయ పక్షులపైని తాను కట్టిన వస్త్రం విప్పివేశాడు. 'భోక్తుమ్ ఇచ్ఛా బుభుక్షా' అనగా, అనుభవించ వలెనను కోరిక అనగా ఆకలి బుభుక్ష యనబడుతుంది. సాధకునికి అనుభవించాలనే కోరిక ఒక్కటి మాత్రం ఇంకా అప్పటికి వుంది. ఏమిటా కోరిక? భగవత్స్వరూప సాక్షాత్కారం పొందాలన్నదే ఆతనిలోని కోరిక. అది తప్ప వేఱు కోర్కె లేదు. అందుకు మాయావరణం అడ్డుగా వుంది. తాను కట్టుకొన్న వస్త్రాన్ని సాధ కుని ఆవరించియున్న మాయావరణానికి వ్యంజకంగా చెప్పాలి. బట్ట శరీరాన్ని

కన్పించనీయకుండా అచ్ఛాదించినట్లు మాయజీవుణ్ణి భగవంతుణ్ని కన్పించకుండా అచ్ఛాదించి యుంకడం రెండింటిలోను గల పోలిక కాన విశ్వవ్యాప్తమైన మాయతో తనలోనున్న మాయను కలిపివేసి మాయావరణం నుండి పూర్తిగా సాధకుడు తొలగిపోయినా డన్నదే తన కట్టు పుట్టాన్ని హిరణ్మయ పక్షులపై వెయ్యగా అవి దానిని తమలో కొనిపోయేయన్న దానిలోని అంతరార్ధంగా భావించాలి.

దీనితో సాధకునిలో మాయావరణం పూర్తిగా తొలగిపోయి లోనిసత్యస్వరూప మైన పరమాత్మ గోచరించిందన్న మాట ఈపైని సాధకుడికి ఇంద్రియ నిగ్రహ వృత్తి యొక్క అనగా దమయంతి యొక్క అవసరమే లేదు. మాయ ఆవరించి యున్నంత వరకే ఇంద్రియాల్ని అదుపులో నుంచవలసిన అవసరం.

తరువాత నలుడు దమయంతి నిద్రిస్తూవుండగా ఆపెను విడిచివేసి వెళ్ళిపోయేడు.

మాయ పోయి పరమాత్మ సాక్షాత్కార సిద్ధితో ఇక ఇంద్రియ నిగ్రహ వృత్తి యొక్క పనిలేదు. కాన సాధకుడు ఆ మనోవృత్తిని విడిచివేసినాడన్నదే దమ యంతీ పరిత్యాగానికి అంతరార్ధంగా గ్రహించాలి.

పిమ్మట నలుడు ఘోరారణ్యం లోపల ప్రవేశించి తిరిగేడు.

ఇచ్చట అరణ్యమనగా అడవియని అర్ధం కాదు 'రణము' అనగా ధ్వని. 'రణ యోగ్యం రణ్యం' ఆ ధ్వని యోగ్యమైనది రణ్యం అన్న మాట కర్ధం అది కానిది అరణ్యం. ధ్వని లేనిది అని అర్ధం. మనసులో నెట్టి భావ సంచలనమూ లేని గొప్ప ప్రశాంత స్థితి అన్నదే ఘోరారణ్య పదానికి అంతరార్ధంగా గ్రహించాలి. ఇచ్చట సాధకుడికి మాయానాశంతో ఇంద్రియ వృత్తి పోయి అమనస్కత సిద్ధించి గొప్ప ప్రశాంత స్థితిలో నున్నాడన్నదే నలుడు ఘోరారణ్యంలో ప్రవేశించేడను దాని కంతరార్ధం. మనస్సు నశించుటతో ప్రశాంతత ఏర్పడుతుంది అదే ఆనందధామము. 'యోబుద్ధేః పరతస్తుసః' అన్నది అదే. దానితో సాధకుడు 'అహం బ్రహ్మాస్మి' అను స్థితిని పూర్తిగా సాధించినా డన్న మాట. అంతతో చాలదు . ఇంకనూ పూర్ణయోగం సాధింపబడలేదు. పూర్ణయోగానికి 'అహం బ్రహ్మాస్మి' అనుస్థితి ఒక పాక్షిక స్థితి మాత్రమే అంటే ఒక వైపు మాత్రమే. రెండవవైపు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను స్థితిని సాధించవలసి వుంది. సాధకుడు పైస్థాయీ సాధనలతో దానిని కూడ సాధించాలి. ఆ స్థితి సాధించిననాడికి ఇక పతనం లేదు. మొదటిది ఆరోహణాక్రమంలో 'ఇది

బ్రహ్మము కాదు. ఇది బ్రహ్మము కాదు' అని 'నేతి' వాక్యాలతో ప్రతిదానిని నిషేధించుకొనుచు ఇంద్రియములకు, మనస్సుకు, బుద్ధికి వెనుక అనగా ప్రకృతి యొక్క వెనుకనున్న అధోక్షజుని అనగా పరమాత్మను వెదికి వెదికి పట్టుకొనేదే ఆరోహణా సాధన. అదే ఈ అహం బ్రహ్మాస్మి సాధన అంటే. ఆరోహణలో ప్రకృతినంతా విడిచివైచి సాధించిన ఆ పరమాత్మను ప్రకృతితో అనుసంధానము చేసి తిరిగి, ప్రకృతి అంతా భగవత్స్వరూపమే అని క్రిందికి అవరోహణ చేస్తూ బుద్ధిలో నుండి మనస్సులోనికి, మనసు నుండి ఇంద్రియాలకి, ఇంద్రియాల నుండి విషయాల్లోనికి అనగా సర్వప్రకృతి లోనికి దిగివచ్చి అన్నిటినీ కూడ పరమాత్మగానే గుర్తింప గల్గిన సాధనయే అవరోహణా సాధన. అదే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను సాధన అంటే ఇది అవరోహణా క్రమము. ఇది రెండవ సాధనను పూర్తిచేసి మూడవ ఘట్టానికి చేర్చేది.

సాధనలోని మూడవ ఘట్టం.

పరమాత్మతో సంపూర్ణైక్యాన్ని అనుభవిస్తూ అట్టి ఐక్యస్థితి యందే సాధకుడు బ్రతికియుండు పర్యంతమూ ప్రకృతితోకూడి వుండాలి అప్పుడుగాని పూర్ణయోగం సిద్ధి పొంది విజయవంతంగా పరిసమాప్తమైనట్లు కాదు. పూర్ణయోగంలోని అవరోహణా క్రమం చేతనే ఈ సిద్ధి విజయవంతం కాగలదు. మొదటిది జ్ఞాన సంపాదనము. రెండవది ఆ సంపాదించిన జ్ఞానము యొక్క ప్రయోగానుభవమూ అనిపించుకో గలదు రెండును కలసి పూర్ణయోగ మవుతుంది.

అరణ్యంలో నలుణ్ణి కర్కోటకమనే పాము కఱచింది. కాని నలుడు చావలేదు. ఆతని శరీరరూపం వికారాన్ని చెందింది. అప్పటినుండి నలుడు 'బాహుక' డనుపేరు పొందేడు.

మూలాధార చక్రంలో 'కుండలిని' సర్పాకారంలో మూడున్నర చుట్లుగ చుట్టుకొని నిద్రిస్తూంటుంది ఆ కుండలిని యొక్క సుస్వరూపం పూర్ణంగా తెలిసి కొన్నవాడు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధన యొక్క యనుభవం పొందగల్గుతాడు. ఈ కుండలనీ శక్తియే ప్రాణ, సూత్రాత్మ, హిరణ్య గర్భ, అపర వణవ, మాయ ప్రకృతి, ప్రాణ శక్తి, దుర్గ, సీత, రాధ ఇత్యాది నామాలతో గ్రంథాల్లో వర్ణింప బడింది ఇదే జీవుని యొక్క స్థూల సూక్ష్మ కారణ రూపిణి, అని శ్రీ శ్రీ గురు గీతా

---

అధం + అక్ష+జ=ఇంద్రియాల వెనుక పుట్టేది. పరమాత్మ.

గ్రంథమున శంకరుడు పార్వతికి స్కాంద పురాణంలో చెప్పినట్లు వ్రాయబడింది. (శ్రీ శ్రీ గురు గీత నాచే టీకా తాత్పర్య వివరణములు వ్రాయబడి ప్రకటింపబడింది)

కర్కోటకమనే పాము నలుని కాటు వేసిందంటే కుండలినీ శక్తిలోనికి అనగా మూల ప్రకృతిలోనికి పూర్తిగా సాధకుడు దిగివచ్చినా డన్నమాట. అప్పు డాతని రూపం వికృతి చెందిందంటే తానే పరబ్రహ్మ స్వరూపమనుకొనే సాధకుడు అంటే 'అహం బ్రహ్మాస్మి' సాధనా సాధకుడు ప్రకృతి యంతయు పరబ్రహ్మ స్వరూపమే అను భావముతో అనుభవం పొంది మార్పును పొందినాడని యర్థం. ఇప్పుడు నలుడు బాహుకుడైనాడు అనగా ప్రకృతి స్వరూపుడైనా డన్నమాట. సాధకునిలో దీనితో ప్రకృతి, పురుష స్వరూపముల కైక్యాను సంధానము జరిగింది. సాధనలో చరమ దశ ప్రారంభమైన దన్నమాట.

'బహు' అనగా సమస్తమైనది, అనగా విశ్వం అని అర్థం. 'బహు' శబ్దం మీద స్వార్థంలో 'క' ప్రత్యయం చేస్తే 'బహుక' అని అవుతుంది. ఆ 'బహుక' శబ్దం పైని స్వార్థమున 'బహుక ఏవ బాహుకః' అనే అర్థంలో 'ప్రజ్ఞాద్యణ్' అని సూత్రం వల్ల 'అణ్' ప్రత్యయం వస్తే 'బాహుకుడు' అనే రూపం అవుతుంది. అప్పుడు 'బహు' అంటే ఏమి అర్థమో 'బాహుక' అన్నా అదే అర్థం. విశ్వస్వరూపుడుగా సాధకునకు కలిగిన పేరే 'బాహుకు'డన్నది పరమాత్మ విశ్వస్వరూపుడు. పరమాత్మ స్వరూపం బాహుకునకు సిద్ధించిందన్నమాట.

కర్కోటకుడు నలుని కాటువేసి 'బ్రహ్మ విత్త్వంచ భవితా, మత్ప్రసాదాత్, నరాధిప' అని అన్నట్లు వ్యాసుని భారతంలో వుంది. అంటే 'నీవు నా అనుగ్రహం వల్ల (కాటు వేయడం వల్ల) బ్రహ్మవేత్తవు కాగలవు' అని అర్థం. కర్కోటకుని 'కాటు' నలునకు బ్రహ్మ జ్ఞానమును కల్గించునదన్నమాట. కర్కోటకుడు పామే అయినచో ఆతని కాటువల్ల నలుడికి బ్రహ్మ జ్ఞానం వచ్చుట ఏమిటి? కర్కోటకు డనగా కుండలినీ రూపిణియైన మహా మాయా ప్రకృతి అనే అర్థం చెప్పుకోక తప్పదు. ప్రకృతి యొక్క అనుగ్రహం వల్ల అంటే ప్రకృతి సాధకుణ్ణి తన మాయలో పడవేయక అనుగ్రహించినపుడు సాధకుడు పూర్ణబ్రహ్మ జ్ఞాన సంపన్నుడు అవుతాడు. కర్కోటక సర్పానికి ప్రకృతి అనే అర్థం చెప్పినప్పుడే దాని దయవల్ల బ్రహ్మవేత్వత కల్గుతుందని చెప్పుటకు వీలుపడుతూంది. పాముగా చెప్పుటవల్లనే కుండలినీ రూపాన్ని పట్టి కర్కోటక పదం ప్రకృతిగా గ్రహించడానికి వీలుపడుతూంది కాన ఇచ్చట ప్రకృతియే కర్కోటక నాగమునకు వ్యంజకమైన పదం అని అనక తీరదు. 'సర్వం

ఖల్విదం బ్రహ్మ' ప్రకృతిలో అంతా బ్రహ్మయే కాన బ్రహ్మవేత్త అనగా సర్వ ప్రకృతిని పరమాత్మగా తెలిసికొన్న సాధకుడు అని అర్థం. 'బృంహ్' ధాతువు యొక్క రూపము 'బ్రహ్మ' అగును. 'బృంహ్' ధాతువునకు అంతట వ్యాపించి యుండడం అనేది అర్థం. కాగా బ్రహ్మ అంటే సర్వత్ర వ్యాపించియున్న పరమాత్మ అనేది అర్థం. సాధనుడు బాహుకుడు అయినాడంటే 'సోఽహం' భావంతో ప్రారంభించిన సాధకుని సాధన 'సర్వం ఖల్విదం' సాధనతో ఫలించిందన్నమాట. ఆరోహణా అవరోహణా మార్గాల్లో సాధకుడు పూర్ణయోగంలో సిద్ధిని పొందేడన్నమాట.

తర్వాత నలుడు తన బ్రతుకును సాగించడానికి ఋతుపర్ణుడను రాజు నాశ్రయించేడు.

ఋతుపర్ణ శబ్దము, ఋతు, పర్ణ అనే రెండు శబ్దాలతో నేర్పడింది. ఋతువు కాలవాచకము. పర్ణము అనగా ఆచ్ఛాదనము చేయునది అని అర్థం.

ఋతువులు పర్ణములుగా కలవాడు ఋతుపర్ణుడు. అంటే ఋతువులతో కూడిన వాడు ఋతుకర్త. కాల స్వరూపుడైన ఆదిత్య భగవానుడే ఋతుపర్ణుడను రాజునకు సంకేతంగా చెప్పబడిందనాలి. ఆదిత్యుడు జ్యోతిస్వరూపుడు. ఆ జ్యోతిస్వరూప మునకు మధ్యలో పరమాత్మ ఉన్నాడు. 'ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణః' అన్న పరమాత్మ అతడే. జ్యోతి అనేది అంధకార నివర్తకం. ఆ లక్షణంతో అజ్ఞానమును నివర్తింపజేయునట్టి జ్ఞాన స్వరూపమే ఆదిత్య భగవానుడుగా చెప్పబడుతున్నాడు. జ్ఞాన మధ్యమున నుండువాడు. లేక జ్ఞానాంతర్గతుడు నైనవాడు పరమాత్మ. ఆ ఆదిత్య పరమాత్మయే ఋతుపర్ణ పదంతో చెప్పబడింది. బాహుకుడు ఋతుపర్ణుణి తాను నివసించడానికి ఆశ్రయంగా చేసికొన్నాడంటే సర్వప్రకృతి యొక్క స్వరూపం పరమాత్మగా నెరిగిన సాధకుడు అఖండానంద స్వరూపజ్ఞానంలో విలీనమైనాడని యంతరార్థం చెప్పకోవాలి.

తర్వాత బాహుకునిలోనున్న అశ్వహృదయమనే విద్యను ఋతుపర్ణుడూ, ఋతుపర్ణునిలోనున్న 'అక్షహృదయ' మనే విద్యను బాహుకుడూ ఒకరి కొకరు ఇచ్చి పుచ్చుకున్నారు. ఇచట అశ్వహృదయ విద్యయనగా గుఱ్ఱముల యొక్క స్వభావాల్ని తెలిపే విద్యయని బాహ్యార్థం. అల్లాగే అక్ష హృదయమనగా జూదమాడు పాచికలలోని కిటుకు తెలిపే విద్య అని బాహ్యార్థం. వానికి ఇచ్చట అంతరార్థం చెప్పకోవాలి.

న+శ్వ అను వ్యుత్పత్తిలో 'అశ్వము' అని అవుతుంది. 'శ్వ' అనగా రేపు అని అర్థం. రేపు ఉండనిది 'అశ్వము' అంటే శాశ్వతం కానిది. అనగా ఎప్పటి

కప్పుకు మార్పునొందుతూ నశించు స్వభావంగల ప్రకృతియే అశ్వమన్న మాట. దాని యొక్క తత్త్వమును దెలుపు జ్ఞానము అశ్వ హృదయ విద్య యవుతుంది. బాహుకుడు ప్రకృతి స్వరూపుడే. కాన ప్రకృతి యొక్క తత్త్వం పూర్ణంగా నెఱిగినవాడు. సాధకుని లోని ఆ ప్రకృతి తత్త్వ విజ్ఞానమే అశ్వహృదయం. అంటే అదే ప్రకృతితత్త్వం అన్న మాట. ప్రకృతి తత్త్వం జడత్వరూపం, పరమాత్మతత్త్వం చైతన్యరూపం.

అక్ష హృదయ విద్య యేమిటి? 'అక్షము' అనగా ఇంద్రియాలు అని అర్థం కూడ వున్నది. వాని హృదయం అనగా వాని మూలతత్త్వం. అనగా వానిని కదలించు చైతన్యరూప పరమాత్మ యొక్క తత్త్వమన్న మాట. దానిని తెల్పు జ్ఞానమే అక్ష హృదయ విద్య. ఋతుపర్ణు డనగా జ్యోతి స్వరూప జ్ఞాన పరమాత్మయని కదా అర్థం చెప్పుకొన్నాం. ఆ పరమాత్మ యొక్క తత్త్వం అంటే చైతన్యతత్త్వ మన్న మాట. ప్రకృతి తత్త్వాన్ని చైతన్యరూప పరమాత్మ తత్త్వంలోనూ, ఆ చైతన్యరూప పరమాత్మ తత్త్వాన్ని జడస్వరూపమైన ప్రకృతి తత్త్వంలోను సాధకుడు చూడగల్గడమే బాహుకుడూ, ఋతుపర్ణుడూ. ఇద్దరూ ఒకరినుండి మరొకరు అశ్వ, అక్షయ హృదయములనే విద్యలను మార్పిడి చేసికొన్నారన్న మాట. అనగా ప్రకృతి పురుషుల కేకత్వసిద్ధిని అనుభూతితో సాధకుడు తెలిసికొనగల్గినాడని అంతరార్థ పరమైన తాత్పర్యార్థం. ఇక సాధకుడు సాధించవలసిన పని ఏమీలేదు. దీనితో సాధకుడు ఆరోహణావరోహణా క్రమములు రెండింటిలోను పూర్ణయోగము సాధించేడు.

అక్ష హృదయాన్ని అనగా ఇంద్రియ ప్రచోదనా రహస్యాన్ని గ్రహింపవలె నంటే సాధకుడు తాను ముందుగా ప్రకృతి రహస్యం అంటే అశ్వహృదయం యొక్క తోడ్పాటుతోనే గుర్తించాలి. పరమాత్మ తత్త్వం ప్రకృతి లోపలి అంతర్గతంగా వుండి. కాన ప్రకృతితత్త్వం తన్ను వీడినపుడే సాధకునకు పరమాత్మ తత్త్వం అగుపిస్తుంది అనేది సాధకుడు తన అశ్వహృదయాన్నిచ్చివేసి అక్ష హృదయాన్ని తాను స్వీకరించడంలోని అంతరార్థ రహస్యంగా సాధకులు భావించాల్సి వుంటుంది.

తర్వాత దమయంతి నలుని గానక అడివితో నానా కష్టాలుపడి చివరకు తండ్రి యింటికి చేరింది. పునస్స్వయంవరంతో నలుణ్ణి తిరిగి పొందింది. నలదమయంతులు చిరకాలం రాజ్యసుఖములను పొందేరు అను కథకు సాధకునిలోని ఇంద్రియ నిగ్రహ వృత్తి (దమయంతీ వృత్తి) అవరోహణాక్రమంలో సాధకునిలో ఇక నుండవలసిన పనిలేని కారణంచేత ఆ ఇంద్రియవృత్తి తాను పుట్టిన చోటుకే చేరికొన్నదనీ, చివరకు

అవరోహణాసిద్ధిని సాధకుడు సాధించిన తర్వాత తనవల్ల సాధకునకు ఎట్టి అవరోధం లేని కారణంచేత ఈ పైని తానై అతనిని తిరిగి చేరినదనీ సర్వ విషయాన్ని సహజంగానే ఇంద్రియనిగ్రహవృత్తితో సాధకుడు సర్వప్రకృతినీ భగవద్రూపంగా గ్రహించి సర్వ సౌఖ్యాల్ని అసంగవృత్తితో అనుభవించి, చివరకు ప్రాణోత్క్రమణతో విశ్వగత చైతన్య పరమాత్మలో విలీనమై జనన మరణ రాహిత్యాన్ని పొందగల్గినాడని పున స్వయంవరంలో దమయంతిని పెండ్లాడి నలుడు చిరకాలం రాజ్యంచేసి మరణించాడన్న దానికి అంతరార్థంగా భావించాలి.

శ్లో॥ కర్కోటకస్య నాగస్య
దమయంత్యాః నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః
కీర్తినం కలినాశనమ్

అనేది పై అంతరార్థ కథనం వల్లనే సార్థకమౌతూంది.

సాధనా సారాంశం:- సాధకుడు అసంగయోగంతో ఇంద్రియ నిగ్రహవృత్తితో 'సోహం' సాధనతో 'అహం బ్రహ్మాస్మి' అనే ఆరోహణాక్రమంలో విజయంపొంది మాయా పరిత్యాగంతో ఇంద్రియవృత్తి నాశంపొంది 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే అవరోహణాక్రమంతో కూడి విజయం పొందాలి. అదే నలుడు హంసను పట్టుకొని, దమయంతిని పెండ్లాడి అరణ్యంలో హిరణ్యపక్షులపైని కట్టుబట్ట విప్పి వైచి దమయంతిని విడిచి కర్కోటకం కాటుతో బాహుకుడై తిరిగి దమయంతితో కలిసి సుఖించేదన్న కథలోని అంతరార్థ సారాంశం.

---

# దశమస్కంధం

# అంతరార్థ భాగవతం

## (బ్రహ్మ విద్యా దర్పణం)

## పూర్వ భాగం

శ్లో॥ యదోశ్చ ధర్మశీలస్య
నితరాం మునిసత్తమ!
తత్రాంశే నావతీర్ణస్య
విష్ణోః కార్యాణి శంస నః

తా॥ "ఓ ముని సత్తమా! శుకమహర్షీ! అత్యంతము ధర్మశీలుడైన 'యదువు' అనువాని యొక్క చరిత్ర నాకు చెప్పగోర్తాను. ఆ 'యదు' వంశంలో సాక్షాత్తు విష్ణువు అవతరించేడు కదా! ఆ అవతార కథలు నాకు వినిపించండి."

అని పరీక్షిత్తు శుకమహర్షిని ప్రార్థించడంతో దశమ స్కంధం ప్రారంభ మౌతుంది.

యదువు యయాతికి దేవయానివల్ల కల్గిన మొదటి కొడుకు. తండ్రికి తన యౌవనం ఇవ్వడానికి నిరాకరించిన వారిలో మొదటివాడు. ఈ విధంగా పిత్రాజ్ఞోల్లం ఘనం చేసినవాడు ధర్మశీలుడు ఎల్లాగౌతాడు? మరి అట్లాంటప్పుడు వ్యాసమహర్షి యదువును ధర్మశీలుడని ఎట్లా పేర్కొన్నాడు? దీనిలోని వ్యాసభగవానుని అంతర్యం ఏమిటో మనం తెలిసికోవాలి. ఆ అంతర్యాన్ని భాగవతానికి వ్యాఖ్య వ్రాసినవారంతా పేర్కొన్నారు. వారిల్లా వ్యాఖ్యానించేరు.

'యదువు మిక్కిలి ధర్మశీలుడు. తండ్రియైన యయాతి తన్ను యౌవనం ఇమ్మని యాచించినప్పుడు ఆతడావిధంగా ఇవ్వకపోవడమే ఆతనిధర్మశీలునిగా పేర్కొన డానికి తగివుంది. ఏమంటే యదువు దేవయాని కొడుకు. యదువు తన యౌవనాన్ని యయాతికిస్తే ఆ యౌవనం ఆతని తల్లియైన దేవయానితో రతిక్రీడ సల్పడానికి ఉపయోగపడుతుంది. అందుకే తండ్రి యౌవనాన్ని యాచిస్తున్నాడు. అట్లా తనతల్లితో తన యౌవనం రతిక్రీడలు సల్పడం అత్యంతం పాపహేతువైన అధర్మం కాదా! తండ్రి

యాజ్ఞను ఉల్లంఘించడం అనేది అధర్మమేయైనా అది మాతృద్రోహం చేయడం అనే మహా అధర్మాన్ని నిరోధిస్తున్నప్పుడు అధర్మం కాదు సరిగదా, గొప్ప ధర్మమే అవుతుంది. ఆ కారణం చేతనే యదువు ధర్మశీలుడు' ఇంత ఉద్దేశం కడుపులో పెట్టుకొనే వ్యాసమహర్షి యదువునకు ధర్మశీలుడనే విశేషణం తగిలించేడు. అంతటి ధర్మశీలుడైన యదువు యొక్క వంశమే యాదవ వంశం. ఆ వంశం ధర్మశీలమైంది కాబట్టే విష్ణువు కృష్ణుడుగా ఆ వంశంలో అవతరించి మహోత్కృష్ట కార్యాలు చేసేడు. ఆ మహోత్కృష్ట కార్యాలు చెప్పేదే భాగవతంలోని దశమస్కంధం. ఇది రెండు భాగాలుగా చెప్పబడింది. మొదటి భాగం శ్రీ కృష్ణుని జననం మొదలుకొని బాల్య లీలలకు సంబంధించింది. రెండవ భాగం కృష్ణుని యౌవనాది దశలలో చేసిన కార్యాలను చెప్పేది. భాగవతానికి దశమ స్కంధంలోని పూర్వోత్తర భాగాలు రెండూ వన్నెతెచ్చే గొప్ప మహాత్మ్యాన్ని పొందివున్నాయి.

## ద శ మ స్కం ధ ం

# అంతరార్ధ భాగవతం

## (బ్రహ్మ విద్యా దర్పణం)

## పూర్వ భాగం

పూర్వం రాక్షసుల పరిపాలనాన్ని భరించలేక భూమి 'గో' రూపం ధరించి బ్రహ్మదేవునితో మొఱపెట్టుకోగా బ్రహ్మ దేవతలలో కలిసి క్షీరసముద్ర తీరంలో ఆది పురుషుని పురుష సూక్తమంత్రాలతో స్తుతించి తాను అద్భుత సమాధిస్థితిని పొందేడు. ఆ సమాధిస్థితిలో బ్రహ్మదేవుడు ఆకాశాన్నుండి తనకు విన్పించిన మాట ననుసరించి "అమరులారా! మీరు మీ దివ్యాంశాలతో యదుకులంతో భూమిపైని పుట్టండి. ఆది పురుషుడు మహావిష్ణువు వసుదేవునికి పుత్రుడై జన్మిస్తాడు. దేవతాస్త్రీలు గోపికలుగా హరిపూజార్థము భూమిపైని పుట్టుతారు. హరికి అగ్రజుడైయున్న శేషుడు హరితో కూడ భూమియందు పుట్టి భూమినంతా ఆవరిస్తాడు. అప్పుడు భూమియొక్క భారం తొలగుతుంది" అని పల్కి భూమిని ఓదార్చి బ్రహ్మదేవుడు అదృశ్యుడయ్యేడు.

రాక్షసులంటే— 'రక్ష' అనేపదం స్వార్థంలో 'రాక్ష' అవుతుంది. 'స్యే'

అంతకర్మణి అనేధాతువు యొక్క రూపం 'స' అవుతుంది. అప్పుడు రాక్ష=రక్షణను, స=నశింప జేసేవారు అని రాక్షసులనే పదానికి వ్యుత్పత్త్యర్థం వస్తుంది. భగవంతుని చేరాలనే సాధకునిలోని సద్వృత్తులకు రక్షణ లేకుండా చేసే తామసిక వృత్తులకు రాక్షసులనే పేరు అంతరార్థపరంగా ఈ విధంగా చెప్పాలి. భూమి గోరూపం ధరించింది. భూమి అంటే త్రిగుణ వృత్తులు అన్నీ నిలవడానికి అనువైన సాధకుని మానసిక కేంద్రం అని అర్థం. అది గోరూపం ధరించింది. 'గో' అంటే ఇక్కడ ఇంద్రియము అని అర్థం. భూమి గోరూపం ధరించిందంటే సమస్త ఇంద్రియ ప్రవృత్తుల్ని నిలువరించే స్థితిని మనసు పొందిందనీ బ్రహ్మ అంటే పరమేశ్వరు నన్వేషించే సాధకునిలోని ఆత్మజ్ఞానం అని అర్థం.

బ్రహ్మతో గోరూపం ధరించిన భూమి 'రాక్షసభారం భరించలేకుండా వున్నా' నని మొఱపెట్టుకొన్నదంటే- సాధకునిలోని పరమేశ్వరు నన్వేషించే బ్రహ్మజ్ఞాన వృత్తితో సాధకునిలోని మనస్సు ఇంద్రియ వృత్తుల రూపం పొంది భగవంతుని చేరాలనే తనలోని సత్త్వ వృత్తుల్ని తనలోని తామసిక వృత్తులు నాశం చేస్తున్నాయనీ దానిని తీర్చే ఉపాయం చూడవలసిందనీ చెప్పుకొన్నది. అనగా అట్టి భావన సాధకునకు కల్గిందని అర్థం. ఇదంతా పరమాత్మైక్యం కోసం సాధకుని మనసులో జరిగే సంక్షోభస్థితిని అంతరార్థపరంగా మనకు తెల్పుతూందని గ్రహించాలి.

బ్రహ్మ దేవతలతో కలిసి క్షీరసముద్ర తీరంలో ఆది పురుషుని పురుష సూక్తంతో ధ్యానించగా ఆతడు అద్భుత సమాధిస్థితిని పొందేడు. అంటే-

దేవతలతో అనగా సాధకునిలోని సాత్త్వికవృత్తులతో క్షీరసముద్ర తీరం అంటే స్వచ్ఛమైన ఆనందరూప పరమాత్మను గ్రహించే చింతనం అని అర్థం. క్షీరం అన్న పదం స్వచ్ఛత్వాన్ని తెల్పుతుంది. 'ముత్' అంటే ఆనందం. స+ముత్ అంటే ఆనందరూపంతో కూడుకొన్న పరమాత్మ అని అర్థం. 'ర' అంటే గ్రహించడం అని అర్థం. అనగా ధ్యానం అని అర్థం. ఈ విధంగా స+ముత్+ర=సముద్ర అవుతుంది. సాధకునిలోని జ్ఞానవృత్తి సాధకునిలోని సత్త్వవృత్తులతోకలిసి స్వచ్ఛమైన ఆత్మానందరూప పరమాత్మ యొక్క ధ్యానాన్ని సాగించింది అన్నది బ్రహ్మ దేవతలతో క్షీరసముద్ర తీరం చేరుకొన్నాడన్నదాని అంతరార్థం.

విష్ణువు అనగా సర్వవ్యాపక రూప పరమాత్మ. ఆతని అన్న శేషుడు అనగా సర్వవ్యాపకుడైన పరమాత్మను ఆవరించి యుండే ప్రకృతి అన్నమాట. అమరులు అంటే చావులేనివారు. అనగా సాధకునిలోని సత్త్వవృత్తులు. ఆ సత్త్వ

వృత్తులు పరమాత్మను ఆసరించి వుండడమే విష్ణువు యొక్క అవతారంతో దేవతలు భూమి మీద పుట్టడం అంటే. గోపికలంటే ఇంద్రియవృత్తులు. గోప పదానికి ఇంద్రియం అనే అర్థం వుంది. వారే దేవతాస్త్రీలు అంటే సత్త్వగుణ వృత్తులకు సంబంధించిన వన్నమాట.

సాధకునిలోని ఇంద్రియవృత్తుల కేంద్రం తామసిక వృత్తుల సంఘర్షణను తట్టుకోలేక తనలోని ఆత్మజ్ఞానంయొక్క తోడ్పాటుతో సర్వవ్యాపక పరమాత్మ తనలోని తామసిక భావాన్ని తొలగిస్తుందనీ, అందుకు తనలో సత్త్వవృత్తులు తోడ్పడాలనీ ఆవిధంగా తాను సాధన సాగించాలనీ ఒకానొక ప్రబోధం పొందడమే బ్రహ్మతో భూమి మొరపెట్టుకోవడం. బ్రహ్మ సమాధిస్థితిని పొంది ఆ సమాధిలో విష్ణువు యొక్క అవతరణం తెలిసికొని చెప్పడం అన్న పై కథకు అంతరార్థ సారాంశంగా చెప్పుకోవాలి.

# శ్రీకృష్ణ జననం

(నిర్వృతి తత్త్వావిర్భావ సాధన) లేక

వాసనారహిత తత్త్వావిర్భావ సాధన

'మధు' అంటే తీయనిది. అనగా ఆనందం అర్థం. 'ర' అంటే గ్రహించడం అర్థం. కాన 'మధుర' అంటే మనస్సు అని అర్థం. అనగా శాశ్వతానందమైన ముక్తిని కోరే మనస్సు 'మధుర' అనబడుతుంది. ఇది యాదవ రాజులకు రాజధాని. యదు వృష్ణి భోజక అంధకములనేవి యాదవ వంశాలు. యాదవ వంశంలో శూరసేనుడనే రాజున్నాడు. ఆతనికి వసుదేవుడు కొడుకు. ఆతనికి ఆనక దుందుభియనే మరొక పేరు కూడ వుంది. దేవకుడనే మరో పేరుగల ఉగ్రసేనుడనే రాజుయొక్క కూతురు దేవకి. వసుదేవుడు దేవకిని పెండ్లాడి ఆపెతో తన పురానికి రథమెక్కి వెళ్ళేటప్పుడు దేవకి అన్న కంసుడు అనేవాడు ఆ రథాన్ని తోలుతున్నాడు. కొంతదూరం వెళ్ళేక ఆకాశవాణి 'కంసా! నీవు నీ చెల్లెలియొక్క అష్టమ గర్భమందు పుట్టేవానిచేత చంప బడతావు సుమా!' అని పలికింది. అది విన్న వెంటనే కంసుడు చెల్లెలి జుట్టు పట్టుకొని తల తెగవేయడానికి కత్తెత్తేడు. వసుదేవు డాతనిని వారించి దేవకికి పుట్టే బిడ్డల్ని కంసుడికి అప్పగించడానికి ఒప్పందం చేసికొన్న మీదట కంసుడా ప్రయత్నం మానేడు.

దేవకీ వసుదేవులను చెఱలో పెట్టేడు. తన తండ్రియైన ఉగ్రసేనుణ్ని కూడ తన కడ్డురాకుండా వుండడానికి చెఱసాలలో పెట్టి రాజ్యం తాను కైవసం చేసికొన్నాడు. దేవకికి పుట్టిన ప్రతిబిడ్డను కంసుడు పుడుటకోనే వధిస్తూ వచ్చేడు. దేవకిలో నిఖిలదేవ భావ మేర్పడింది. ప్రతియేట బిడ్డలను గన్నది. ఎనమండుగురు మగబిడ్డలను చివరికొక ఆడు బిడ్డను గన్నది. ఆరుగురు బిడ్డలను కంసుడు వధించిన తర్వాత ఏడవ గర్భంలో హరియొక్క తేజస్సు ప్రవేశించింది. శేషాఖ్య వహించిన అనంతునితో సహా హరి తేజస్సు దేవకి గర్భంలో చేరడంతో అమితమైన ఆనందం దేవకిలో కల్గింది.

విష్ణువు తన్ననుసరించి యుండే యోగమాయ వల్ల దేవకి కడుపులోని గర్భ మును రెండుగా సంకర్షణము చేయించి అందుండి శేషాఖ్యయగు అంశంగల పిండాన్ని గోకులంలో (గొల్లపల్లెలో) నున్న వసుదేవుని భార్యలలో నొకతెయగు రోహిణీదేవి యొక్క గర్భంలో ఉంచేటట్లు చేసేడు. యోగమాయను నందుని భార్యయగు యశోద గర్భంలో పుట్టేటట్లు నియమించేడు. ఆ విధంగా రోహిణి గర్భమందు పుట్టినవాడు బలరాముడను పేరు వహించేడు. గర్భ సంకర్షణవల్ల కల్గేడు కాన సంకర్షణుడనే పేరు కూడ అతని కేర్పడింది.

తర్వాత దేవకీ గర్భాన్ని పరమాత్మ జన్మించేడు. బ్రహ్మాదులాతనిని నిర్గుణ పరబ్రహ్మగా నుతించేరు. వసుదేవ దేవకు లమితానందం పొంది స్తుతించేరు. ఆ రాత్రి వసుదేవుడు పరమాత్మయొక్క ఆదేశంతో ఆ బాలుని కాళిందీ నది దాటించి నంద గోవ్రజంలో (గొల్లపల్లెలో) అప్పుడే ఆడుబిడ్డను ప్రసవించిన నందుని భార్యయగు యశోద యొక్క ప్రక్కలో పరుండబెట్టి ఆపె బిడ్డను తెచ్చి దేవకి ప్రక్కన పరుండ బెట్టేడు. విష్ణు మాయవల్ల వసుదేవునకు కారాగారం తల్పులు వాటంతట అవే తెరచి కొన్నాయి. అవే మూయబడ్డాయి. కాళిందీనది రెండు పాయలై తనమధ్యనుండి నడిచి వెళ్ళడానికి వసుదేవునకు దారినిచ్చింది. తెల్లవారిన తర్వాత కంసుడు వచ్చి దేవకి ప్రక్కలోని ఆడుబిడ్డను లాగుకొని క్రిందనున్న రాతిమీద పడేటట్లు పైకెగురవేసేడు. ఆ బిడ్డ యోగమాయ కావడంవల్ల క్రిందపడక పైకెగసిపోయి 'నిన్ను చంపేవాడు వ్రేపల్లెలో పెరుగుతూనే యున్నాడురా' అని పలికి మాయమైపోయింది. ఆ యోగ మాయయే 'భద్రకాళి' అని 'దుర్గ' అని 'శక్తి' అని ఎన్నో పేర్లతో నేటికీ పూజింప బడుతూంది.

యదువంశంలో అంటే ధర్మశీలంగల సాధకునిలో అని అంతరార్థం. యత్+ఉ='యదు' అని అవుతుంది. 'యత్' అంటే ఏది అని అర్థం. పరమాత్మ

ఏదో, మనోవాక్కులకు తెలియబడునట్టిది కాదు. అనిర్వాచ్యమైనదేదో అది, కాన ఏది అనే అర్థంగల 'యత్' పదం అనిర్వాచ్య పరమాత్మకు మారుగా వాడబడిందిగా గ్రహించాలి. 'ఉ' అంటే ప్రకృతి, ప్రకృతిలో ఉండేదే అనిర్వాచ్య పరమాత్మ అనే అర్థాన్ని 'యదు' పదం యొక్క వ్యుత్పత్తి ప్రవర్తనం వల్ల గ్రహించవచ్చు. ప్రకృతిలో నుండే పురుషుడు పరమాత్మ అన్న అర్థం యదు పదం వల్ల సిద్ధిస్తుంది. ఆ పరమాత్మకు తమలో ఆవిర్భవింపచేసికొన్న వంశం యాదవవంశం అవుతుంది. అందులో శూరసేనుడు అనే రాజు ఉన్నాడు. "శసయోరభేదః" అని చెప్తే శూరసేనుడు, సూరసేనుడుగా చెప్పవచ్చు. సూర అంటే సూర్యుడు అనగా తన మధ్యభాగంలో నారాయణుని నిల్పుకొన్న ఆదిత్య భగవానుడు. ఆదిత్యుడు జ్ఞానదీప్తికి ప్రతీక. అతని సేన అంటే జ్ఞాన సంబంధమైన సాధకునిలోని మనోవృత్తులు. ఇప్పుడు సూరసేన పదాన్ని సాధకునిలోని జ్ఞాన దీప్తులను తెల్పేదిగా గ్రహింపవచ్చు. అతనికి వసుదేవుడు కుమారుడు. వసుదేవుడనగా 'వసు' అన్నదానికి బంగారం అర్థం. హిరణ్మయం అంటే ప్రకృతి అనే అర్థం వుండి కాగా బంగారం అర్థం కల వసు మొదలగు బంగారు పర్యాయ పదాలకు ప్రకృతి అనే అర్థం వస్తుంది. 'దివ్' ధాతువునకు ప్రకాశం అర్థంకాగా వసుదేవ పదానికి ప్రకృతిలో ప్రకాశించే పరమాత్మ అనే అర్థం అంతరార్థపరంగా చెప్పుకోవాలి.

సాధకునిలో నివసించు పరమాత్మయే వసుదేవుడన్నమాట. ఆ పరమాత్మ సూరసేనుని కొడుకు అంటే ఆ పరమాత్మ భావం జ్ఞాన దీప్తివల్ల కల్గేది అని అర్థం. వసుదేవునకు 'ఆనకదుందుభి' అనే మరో పేరు వుంది. ఇదేదో అర్థం కల పదం కాకపోతే మనిషికి రెండో పేరు ఎందుకు వుంటుంది? ఆనకదుందుభి అనేది అంతరార్థపరంగా చెప్పుకోవడం కోసమే వ్యాసమహర్షి నిర్దేశించేడనక తప్పదు. లేకపోతే వాచ్యార్థంలో అది అర్థంలేని వ్యర్థ నామమే అవుతుంది.

'క' అంటే సుఖం. 'న+క' 'నక' అంటే సుఖం కానిది ఇక్కడ న కారం నఞ అనేదికాక నఞ్ అర్థంలోనున్న 'న' శబ్దం అవుతుంది. 'నక' అంటే దుఃఖం అని అర్థం. 'అనక' అంటే 'నక' కానిది అనగా దుఃఖంకానిది అంటే ఎప్పుడూ దుఃఖం లేనిది ముక్తిసుఖం అనే అర్థం వస్తుంది. అదే శాశ్వత సుఖం ముక్తిసుఖం. 'అనక' అనేదే స్వార్థంలో అణ్ ప్రత్యయం చేస్తే అది వృద్ధి వచ్చి 'ఆనక' అవుతుంది. అంటే శాశ్వతమైన ముక్తి సుఖం అనే అర్థాన్ని 'ఆనక' పదం వల్ల వస్తుంది. దుందుభి అంటే ధ్వనింపజేసే వాద్యం. ఆనకమును అనగా ముక్తి సుఖాన్ని ధ్వనింపజేసేది

వృద్ధి చేసేశక్తియైన మనోవృత్తి అని ఆనక దుందుభి పదానికి వ్యుత్పత్యర్థంతో ప్రకృతిలో వసించే దీప్తి అనే అర్థంగల వసుదేవ పదానికి సమానార్థకమై పర్యాయపదమే అవుతుంది ఇంత అంతరార్థాన్ని ఉద్దేశించియే వసుదేవుణ్ని అనకదుందుభి అని కూడ వ్యాసమహర్షి రెండవ పేరుతో పేర్కొన్నాడు. వాచ్యార్థంలో రెండవ పేరు లేకపోతే కథకేమీ అడ్డురాదు దానిలో అంతరార్థం వుందని స్ఫురింపజెయ్యడానికే వ్యాసమహర్షి ఈవిధంగా ఉద్దేశించేడనక తప్పదు.

దేవకుడనే పేరుగల ఉగ్రసేనుడికి కంసుడు, దేవకి అనే ఇద్దరు సంతానం. ఉగ్రసేనుడంటే భయంకరమైన పరివారం కలవాడని అర్థం. అప్పుడు సాధకునిలోని తామసవృత్తులు ఉగ్రసేన పదానికి అర్థంగా చెప్పుకోవాలి. అతనికి దేవకుడనే పేరు కూడ వుంది. 'దేవ' అంటే ప్రకాశించేది, 'క' అంటే ముక్తి సుఖం అనే వ్యుత్పత్త్యర్థంలో ఆ సాధకునిలో తామసిక ఉగ్ర వృత్తులున్నప్పటికీ ముక్తిని గూర్చిన జ్ఞాన దీప్తినిచ్చే మనోవృత్తులు కూడ చోటు చేసికొనియే వున్నాయన్న అర్థం 'దేవక' పదం వల్ల గ్రహించాలి. అంటే సాధకునిలో తామసిక ప్రకోపం వున్నా ముక్తికాంక్ష కూడ సమంగానే వుందన్నమాట. వానికి కంసుడు కొడుకూ, దేవకి అనే కూతురూ ఉన్నారు.

'కం' అంటే ముక్తి సుఖాన్ని, 'స' అంటే నశింపుచేసేది అని అర్థం. ముక్తి వృత్తుల్ని వృద్ధిపొందకుండా చేసే సాధకునిలోని ఒక అసరా ప్రకృతికే కంసుడు అనిపేరు. దేవకి అనే కూతురుంది. అంటే సాధకునిలోనే జ్ఞాన దీప్తితో కల్గే ముక్తిని గూర్చిన మనోవృత్తికూడ కలదని అర్థం. దేవ=ప్రకాశించునట్టి 'క' సుఖం అనగా ముక్తి సుఖం కల మనోవృత్తి అనే వ్యుత్పత్త్యర్థంలో జీప్ ప్రత్యయం చేస్తే దేవకి అనే పదం సిద్ధిస్తుంది.

ఇక్కడ పాఠకులు జాగ్రత్తగా గమనించాలి. ఒకే సాధకునిలో ముక్తిని కోరే సాత్త్వికమనోవృత్తి. దానిని నాశం చేసే తామసిక మనోవృత్తి కూడా ఎట్లాగు ఉంటాయి ? అనే సాధనం పొందకూడదు. మన అనుభవంలో చూచుకొంటే నిజానికి మంచిని కోరుతూనే ఏదో ప్రలోభం వల్ల బలాత్కారంగా చెడ్డను కూడ ఆచరిస్తూండే ద్వంద్వ ప్రవృత్తి పని చేస్తూండడం గమనించగలం. చెడ్డను ప్రోత్సహించేది అపరాశక్తి, మంచిని ప్రోత్సహించేది పరాశక్తి. ఈ రెండు శక్తులూ ఒకదానితో ఒకటి పోరు సల్పుతూనే ఒకే సాధకునిలో ఉంటాయి. సాధకుడు సాధనా బలంవల్ల పరాశక్తిని

వృద్ధిపొందించి అపరాశక్తిని సాధనలతో చివరకు నశింపుచేసి ముక్తిని సాధించాలి. అందుకే సాధనా మార్గం అంతా ఏర్పడింది. సాధకునిలోని ఉగ్రసేనత్వము దేవకీత్వమూ అనే రెండు వృత్తుల్లోను ఒకటి అపరాశక్తికి, రెండవది పరాశక్తికి పర్యాయములుగా చెప్పుకోవాలి. సాధకునిలోని అపరాశక్తిని వల్ల పుట్టిన మనోవృత్తి 'కంస' వృత్తి. పరాశక్తి వల్ల పుట్టిన మనోవృత్తి దేవకా వృత్తి. ఇప్పుడు మనం ఈ కథలో ఉగ్రసేనుడు సాధకుణ్ణిగా తెలిసికోవాలి. ఈ కథలో వచ్చే వసుదేవ దేవకులు, నంద యశోదలు వారి గోపికా పరివారమూ కూడ సాధకునిలోని పరాశక్తి యొక్క పరివారమనీ, అవి ముక్తిని సాధించే సాత్త్విక మనోవృత్తులకు మారు పేర్లనీ, కంసుడు, పూతన, బక, తృణావర్త శకటాసురాదులు సాధకునిలోని అపరాశక్తి యొక్క పరివారమనీ అవి ముక్తిని నిరోధించే తామసిక మనోవృత్తులకు మారుపేర్లనీ చివరకు ఉగ్రసేనుని పట్టాభిషేకంతో సాధన పూర్తి అవుతుందనీ గ్రహించాలి.

దేవకుడనే ఉగ్రసేనుని కుమార్తెయైన దేవకితో సూరసేనుని కుమారుడైన ఆనకదుందుభి అనే వసుదేవునకు పెండ్లి జరిగింది. అంటే సాధకునిలోని ముక్తిసుఖాన్ని కోరే మనోవృత్తి సాధకునిలోనే వున్న పరమాత్మను ఆరాధిస్తూవుంది అనేది ఇందలి అంతరార్థంగా గ్రహించాలి.

దేవకీ వసుదేవులను కంసుడు రథం ఎక్కించుకొని వెడుతూన్నాడు. అపరాశక్తి పరాశక్తిని తనకు తెలియకుండానే అంతర్గతంగా ఆరాధించటం జరుగుతూనే వుంటుంది. నిజానికి అపరాశక్తి పరాశక్తి వల్ల జనించినదే. కాని బహిర్గతంగా దానితో విరోధంగా పోరాడుతూంటుంది. అయినా పరాశక్తిని మోసికొని పోతూనే వుంటుంది. ఆ అంతర్గత భావంతో సాధకునిలోని అపరాశక్తి తనకు తెలియకుండానే పరాశక్తి పైని ఆసక్తిని చూపటం జరగడమే దేవకిని కంసుడు రథంపై ఎక్కించుకొని వెడుతున్నాడన్న దానిలోని భావం. అంత అశరీరవాణి "దేవకి యొక్క అష్టమ గర్భం నిన్ను వధిస్తుందని పల్కింది" అశరీరవాణి వినడం అంటే ఎవరూ చెప్పకుండనే తనంతట తనకు హఠాత్తుగా మనస్సులో తోచడమే. ముక్తి సుఖాన్ని నాశం చేసే అపరాశక్తి, తనతోనే వున్న దేవకీ వసుదేవ వృత్తుల సంగమం వల్ల కల్గే ఎనిమిదవ తత్త్వం పరమాత్మతత్త్వం అనీ అది తన్ను నాశం చేస్తుందనీ కంసవృత్తి హఠాత్తుగా గుర్తించిందన్న మాట. ఇంద్రియాలు అయిదు వాని పైది మనస్సు ఒకటి ఆ మనస్సుకు పైది బుద్ధి ఒకటీ, ఆ బుద్ధికి పైది ఎనిమిదవ తత్త్వం అహంతత్త్వం. అది అనిర్వాచ్య పరమాత్మ తత్త్వం. అహంబ్రహ్మాస్మి అనే మహావాక్యంలోని 'అహం' అనేది దేహం

వర్గతమైన అహం స్ఫూర్తి బ్రహ్మతత్త్వం దాన్ని గుర్తించడమే 'అహం బ్రహ్మాస్మి' సాధనా ఫలితం. అది ఆనందరూప పరబ్రహ్మ తత్త్వం, కంస వృత్తి అంటే బ్రహ్మానంద నాశకరమైన అపరాశక్తి యొక్క వృత్తి. సాధకునిలోని కంసవృత్తికి సాధకునిలోనే వున్న అహంవృత్తికీ బద్ధవైరం. అష్టమతత్త్వం ముక్తి సుఖాన్ని నాశం చేసే అపరాశక్తి యొక్క కంసవృత్తిని నశింపు చేస్తుంది. అనేదే అశరీరవాణి దేవకి యొక్క అష్టమ గర్భం కంసుని చంపుతుందన్న దాని యొక్క అంతరార్థం.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహుః
ఇంద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధిః
యో బుద్ధేః పరతస్తుసః

అనే భగవద్గీతా శ్లోకంలోని 'సః' అనే సాధకునిలోని ఎనిమిదవ తత్త్వం అనీ, అది పరమాత్మ తత్త్వం అనీ పై విషయాన్ని సుబోధం చేస్తుంది.

సాధకునిలోని బుద్ధితత్త్వం ఏడవది. మొదటి ఆరు అనగా పంచేంద్రియాలూ, మనస్సూ అనేవి ఆరు ప్రకృతికి సంబంధించినవి. అవి ప్రకృతి సంబంధంగా అపరాశక్తికి ఎక్కువగా వశపడి వుంటాయి. ఏడవ తత్త్వమైన బుద్ధి తత్త్వం అపరాశక్తికి వశపడేది కాదు. అది పరాశక్తితో సంబంధించియే వుంటుంది. ఆ బుద్ధితత్త్వమే తిరిగి రెండు రూపాలు ధరిస్తుంది. ఒకటి 'చిత్' తత్త్వం. రెండవది అహం తత్త్వం. రెండూ పరమేశ్వర తత్త్వాలే. చిత్ తత్త్వం సర్వ ప్రకృతియందూ ఉండేది. ప్రకృతిని కదలించుతూండే చైతన్య శక్తి అదే. రెండవది 'అహం' తత్త్వం. 'సోఽహం' అనగా ఆ అహం తత్త్వమే 'సః' అనగా అనిర్వాచ్య పరమాత్మ తత్త్వం అని అర్థం. ఈ తత్త్వాలన్నీ సాధకునిలోనివే. సాధకుడు బుద్ధి తత్త్వాన్ని అనగా అనాహత చక్రాన్ని పొందితే ఇక పతనం వుండదు. అనాహతం అంటే పతనం లేనిదనే కదా అర్థం.

"కంసుడు అప్పుడు స్వనాశాన్ని గుర్తించి దేవకికి పుట్టిన ఆరుగురు బిడ్డల్ని నాశం చేసేడు" అంటే-సాధకునిలోని అపరాశక్తి పంచేంద్రియాల్లోను, మనస్సులోనూ భగవంతుని చేరాలని వుండే ఆసక్తిని నాశం చేసిందని అంతరార్థం చెప్పుకోవాలి.

ఇక్కడ సాధకుడు ఈ విధంగా పంచేంద్రియాలలోను, మనస్సులోను భగ

వచ్చింత ఏమీ లేకుండా చేసేశాడన్నది కంసుడు దేవకి వసుదేవులకు పుట్టిన ఆర్గురు బిడ్డల్ని చంపేశాడన్న దానిలోని అంతరార్థం.

ఈ కథలో ఉగ్రసేనుని యొక్క బిడ్డలేయైన కంసునకూ దేవకికి స్వభావం లోనే వైరుధ్యం ఏర్పడడం చెప్పడం సాధకునిలోని పరా అపరా అనే శక్తులకు జరిగే పోరాటంగా అంతరార్థపరంగా గ్రహించాలి. ఈ విధంగా సాధకుడు ఉగ్రసేనుడుగా గ్రహింపబడడం గుర్తించాలి.

సాధకునిలో పరా అపరా శక్తులున్నాయనీ, పరాశక్తిని అపరాశక్తి నాశంచేసే యత్నం చేస్తుందనీ, ఆ యత్నంలో పంచేంద్రియాల్లోను, మనస్సులోను, పరాశక్తికి కల్గినవేయైన భగవద్వృత్తులగుటచేత, వానిని అపరాశక్తి నాశంచేసి సాధకునిలోని ఇంద్రియ వ్యాపారాన్ని, మనోవ్యాపారాన్ని, భగవత్పరం కాకుండా చేసి వేయడం జరిగిందనీ మనకు ఉగ్రసేనునకు దేవకి, కంసులు బిడ్డలనీ, కంసుడు దేవకి యొక్క అష్టమ గర్భంలో తన్ను చంపేవాడు పుట్టుతాడనే సంగతి ఆకాశవాణి వల్ల విని ఆపెకు కల్గిన ఆర్గురు బిడ్డల్ని తనకు ఎనిమిదవ వానివల్ల తప్ప మిగతావారి వల్ల నాశం లేదనుకొన్నా కూడ క్రోధావేశంతో వారిని కూడ చంపేశాడనీ చెప్పిన కథలోని అంతరార్థములుగా మనం గ్రహించాలి.

"దేవకికి ఏడవ గర్భాన్ని దైవాజ్ఞ ప్రకారం యోగమాయ, సంకర్షణం చేసి అనగా రెండు భాగాలుగా ఆకర్షించి మొదటి భాగాన్ని నందగోవ్రజంలో నున్న వసుదేవుని తాలూకు మరొక భార్యయైన రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టింది. ఏడవసారి దేవకికి గర్భస్రావం జరిగిన కారణంగా బిడ్డ ఏడవ గర్భానికి కల్గలేదని కంసుడు అనుకొన్నాడు.

తర్వాత ఆ విధంగా రోహిణీ దేవికి కల్గిన బిడ్డ పేరు బలరాముడు. అతడు సంకర్షణం వల్ల కల్గినవాడు కాన సంకర్షణుడని పేరు పొందేడు రెండవ భాగం తిరిగి దేవకీ గర్భంలోనే యోగమాయచే ప్రవేశపెట్టబడింది ఆ భాగం పెరిగి తర్వాత దేవకికి కల్గినది ఎనిమిదవ గర్భాన్ని కల్గిన బిడ్డ యన్నమాట. ఆ బిడ్డను దైవ ప్రేరణతో వసుదేవుడు రాత్రి కాళిందీ నదిని దాటి నందగోవ్రజంలో నందుని భార్యయైన యశోద ప్రక్కలో పరుండబెట్టి ఆపె ప్రక్కలో అప్పుడే పుట్టిన యోగమాయా రూపిణి యగు ఆడు బిడ్డను తీసికొనివచ్చి దేవకియొక్క ప్రక్కలో పరుండబెట్టేడు. ఆ ఆడుబిడ్డ యోగమాయ యొక్క సృష్టియే. తర్వాత కంసుడు రావడం ఆ బిడ్డను చంపడానికి పై కెగరవేయడం, అది ఆకాశంలో కెగిరి కంసుణ్ణి చంపేవాడు వేరేచోట

పెరుగుతున్నాడని పల్కడం జరిగింది." ఏడవ గర్భాన్ని రెండుగా సంకర్షణం చేసిన ఒక భాగం రోహిణి గర్భంలో ఉంచడమంటే ఏడవతత్వమైన బుద్ధి రెండుగా మారి ఒకటి సాధకునిలోని ప్రకృతి రూపంలోను, రెండవది "నిర్వృత్తి" రూపంలో రోహిణి అంటే పైకి పెరిగేది అని అర్థం. నిత్యమూ పైకి పెరగడం అనే లక్షణం ప్రకృతి లక్షణం, అందు జనించిన భగవదంశమైన విశ్వం అంతా అఖండానంద తత్వంతో కూడిన బలరామావతారం. అదే శేషావతారం లేక సంకర్షణావతారం. శేషం అంటే విశ్వ ప్రకృతి అని అర్థం. శేషి అంటే ఆ విశ్వ ప్రకృతిలో ఉండే పరమాత్మ అని అర్థం. పరమాత్మను ప్రకృతి తనలో వహిస్తూంటుంది అన్నదే శేషశాయియై పర మాత్ముడుంటాడన్న దాని భావం.

వైష్ణవ గ్రంథాల్లోని శేష శేషి భావం ప్రకృతి పురుషుల సంయోగాన్ని (కలయి కను) చెప్తుంది. 'ప్రకృతి ర్బలీయసీ' అనగా ప్రకృతి బలమైనది. అది ఆనంద రూప పరమాత్మను బలంగా వహిస్తూంటుంది. బలరాముడనే పేరులో బ్రహ్మానంద రూపం అనే అర్థాన్ని గ్రహించాలి. 'రామ' అంటే ఆనందం కాన బలరామ అంటే ప్రకృతి యొక్క ప్రబలమైన ఆనంద పరమాత్మ అనేది అర్థంగా గ్రహించాలి. ప్రకృతిలోని పరమాత్మను గ్రహించడం అనే సాధనయే అఖండ బ్రహ్మానంద సాధన అదే బలరామావతారంలో చెప్పబడింది.

ఈ అంతర్గార్థాలన్నీ వ్యాస మహర్షి ఉద్దేశించినవే కాకపోతే కంసుని భయంతో నందగోవ్రజంలో తలదాచుకొన్న వసుదేవుని భార్యలలో నొకతెయగు రోహిణికి కంస కారాగారంలో నున్న వసుదేవునితో సంయోగం అసంభవమై యుండగా ఆమెకు బిడ్డ ఎట్లు కల్గడం సంభవిస్తుంది? ఇటువంటి అసందర్భ విషయాలు జ్ఞానపరమైన అంతరార్థాల్ని బహిర్గతం చేస్తూన్నాయి.

దేవకి గర్భంలో పుట్టి నందయశోదల పెంపుడు బిడ్డయైన వాని పేరు కృష్ణుడు. 'కృష్' ధాతువు నకు భూమి అర్థం. 'న' అంటే లేకపోవడం అని అర్థం. భూసంబంధమైన వాసనలు లేని నిర్విషయ ఆనంద భావానికే 'కృష్ణ' దని పేరు. ఆ ఆనంద రూప కృష్ణుడు దేవకి కడుపున పుట్టేడు. దేవకి అంటే ప్రకాశ మానమైన ముక్తికి సంబంధించిన జ్ఞానం అని లోగడ చెప్పుకొన్నాం. ఆ విధంగా పరమాత్మ సాధకులకు జ్ఞానగర్భంలో పుట్టుతాడని గ్రహించాలి. నందుడనగా ఆనందమనే అర్థం. యశోద అంటే, 'యశస్' అన్నదానికి ఆహారం అనే అర్థం వుంది 'ద' అంటే ఇవ్వడం అర్థం. ఆహారమిచ్చి పెంచేది యశోద అవు

తుంది. ఆమె నందుని భార్య. కాన ఆనందరూప పరమాత్మ ధ్యానంతో పెంచబడిన నిర్వృతి స్వరూపుడుగా కృష్ణుడు ఉంటాడు. అనగా భూసంబంధ వాసనలు లేని కృష్ణరూప పరమాత్మ అనే అంతరార్థం ఇక్కడ గ్రహించాలి. బలరామ కృష్ణులు ఇద్దరూ గోవ్రజంలోనే పెరిగేరు అంటే, గోవ్రజం అంటే ఇంద్రియ సమూహం అని అర్థం. ఇంద్రియ వ్యాపారం ప్రకృతి పురుషులకు నివాసం అనే అంతరార్థం దీనికి చెప్పుకోవాలి.

కంసుడు చంపడానికై పైకెగురవేసిన ఆడు శిశువు పైకెగిరిపోయింది. అది భద్రఅని, కాళి అని, దుర్గఅనీ, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయా, నారాయణి, ఈశాని, శారద అని నేటికి అనేక పేర్లతో పూజింప బడుతూంది. కాలము యొక్క స్త్రీలింగ రూపమే కాళి అనేది, దుర్గ అంటే —'దుఃఖేన, గంతుంశక్యా ఇతి దుర్గా', అనే వ్యుత్పత్తిలో అతి కష్టం మీద తెలిసికొనదగినది అనేది అర్థం. విజయ మిచ్చేదిగా విజయ అనీ, విష్ణువు యొక్క అంశగా వైష్ణవి, మాధవి, కృష్ణ, నారాయణి అనీ భూమి సంబంధమైన ఆనందమిచ్చేదిగా 'కుముద' అనీ, భయంకరమైనదిగా 'చండిక' అని, అవివాహితగా అనగా తనకొక భర్త అనే వాడు లేనిది అనే అర్థంతో కన్యక యని, ఈశ్వర సంబంధమైనదిగా ఈశాని అని, మాయాస్వరూపంగా మాయ అనీ ఆ పేర్లకు అర్థాలు. ఈ విధంగా కృష్ణావతార ఘట్టం సాధకులలోని వాసనా నిర్వృత్తి అనే సాధన వల్ల కలిగే ఆనంద రూప పర మాత్మ యొక్క ఆవిర్భావంగా అంతరార్థంతో గ్రహించాలి.

ప్రకృతి పురుషులు ఒకరిని వీడి ఒకరుండరు. వారి ఐక్యస్వరూపం తెల్పడానికే బలరామ కృష్ణులు ఒకే గర్భాన్ని రెండుగా చేయడం ఒకే చోట పెరగడం అనే కథాంశాలు సృష్టించబడ్డాయి బుద్ధియే, ప్రకృతి పురుషుల తత్త్వాలైన చిత్, అహం కారములనే రూపాన్ని ధరించేది కావడం కూడ పై ఐక్యతత్త్వాన్ని బలపరుస్తూంది. అంతరార్థపరంగా కాకపోతే దేవకి గర్భాన్ని సంకర్షణం చేసి రోహిణీ గర్భంలో ప్రవేశపెట్టడం అన్నది వాచ్యార్థంలో ఏమీ పొసగని విషయం. అల్లా చెప్పవలసిన అవసరం కథకు ఏ మాత్రమూ లేదు. ఇటువంటి అసంగబద్ధ విషయాలు అంతరార్థపరంగా ఏదో మహార్థం ఇందులో ప్రవేశపెట్టబడి వుందని చెప్పడానికే వ్యాసభగవానుడు కథలో ప్రవేశపెట్టేడని చెప్పక తప్పదు. ఏడవ తత్త్వమైన బుద్ధి తత్త్వంలో జ్ఞాన మార్గంలో సాధకుడు ప్రవేశిస్తే చాలు తప్పక సిద్ధుడౌతాడు. అదే విధంగా యోగమార్గంలో యోగపరంగా మూలాధార చక్రంలోని ప్రకృతి రూపిణి

యైన కుండలినీ శక్తి బుద్ధిభూమికయైన అనాహత చక్రంలోకి చేరితే ఏడవ చక్రమైన సహస్రారంలో ఉన్న పరమాత్మను పొంది తప్పక సిద్ధిని పొందడం జరుగుతుందనే యోగసాధన కూడ కృష్ణావతారపరంగా ఇందులో ద్యోతకమౌతూంది. వ్యాసభాగవతానికి వ్యాఖ్యానాలన్నీ సగుణరూప భగవత్పరమైనవి. ఆ కారణంచేత అవి చెప్పిన అర్థాలు కేవలం విశ్వాసాన్ని కల్పించడానికి భక్తి మార్గాన్ని చెప్పేవే కాని జ్ఞానమార్గ యోగమార్గ సాధనాన్ని చెప్పేవిగా లేవు. ఈ కృష్ణావతార ఘట్టం కూడ ఆ విధంగా విశ్వాసాన్ని చెప్పేదిగా చెప్తే అది నిర్గుణ సాధనకు పనికిరాదు. అంతరార్థపరమైన జ్ఞానసాధన మాత్రమే ముక్తిని కల్గించేది.

తర్వాత నందగోవ్రజంలో కృష్ణుణ్ణి చంపడానికై కంసునిచేత పూతన శకటాసురుడు, తృణావర్తుడు, వత్సాసుర బకాసురులు మొదలగు వారిని పంపబడడం, వారిని బాలకృష్ణుడు నాశనం చేయడం అన్నవి సాధకునిలోని అపరాశక్తి, పరాశక్తిని నాశనం చేయడానికి చేసే సాధనా విఘ్నకార్యాలుగా గ్రహించాలి. ఎన్ని విఘ్నాలు వచ్చినా బుద్ధిస్థాయికి చేరుకొన్న సాధకునికి సాధన మాత్రం నాశం అనేది పొందదన్నది అంతరార్థపరంగా గ్రహించుకోవాలి.

# శ్రీ కృష్ణుని బాల్యలీలలు

## (నిర్వృతి మార్గ సాధనా ప్రారంభ విశేషాలు)

గోపికలిండ్లలో దొంగడుగా బాలకృష్ణుణ్ణి చిత్రించి ఆతడు దధిక్షీరమ్ములను నవనీతమును హరించినాడని చెప్పిన కథల్ని అంతరార్థపరంగా అర్థం చేసికోవాలి. 'గో' అంటే ఇంద్రియవృత్తి అని అర్థం, 'ప' అంటే పోషించుటయని అర్థం. అప్పుడు గోపకులన్నా, గోపికలన్నా, ఇంద్రియ వృత్తులను వృద్ధి పొందించే కామ క్రోధ లోభ మోహాది అరిషడ్వర్గములనీ లేక ప్రకృతి వ్యామోహం కల్గించే సత్త్వ రజస్తమో గుణాలనీ అంతరార్థం చెప్పుకోవాలి. గోపికల యిండ్లలోని పాలు పెరుగు వెన్న అనేవి సాత్త్విక వృత్తులకు సంబంధించిన ఇంద్రియ వ్యామోహ విషయాలు. వానిని హరించేవాడు కృష్ణుడు. కృష్ణ పదానికి భూసంబంధమైన వ్యామోహములు

లేని నిర్వృతి తత్త్వంగా మనం అర్థం చెప్పుకొనియున్నాం. ఆ అర్థంలో చూచి నప్పుడు ఆ నిర్వృతి తత్త్వం పాలు, పెరుగు, వెన్న హరించింది అంటే ఆ పాలు, పెరుగు, వెన్నలకు మామూలు అర్థాలు కాక భూ సంబంధ విషయ వ్యావృత్తులు అనే అర్థం చెప్పక తప్పదు గదా! అవి స్వచ్ఛమై తెల్లనివైన వస్తువులగుటనే శుద్ధమైన సత్త్వ గుణ సంబంధములైన ప్రకృతి విషయ వ్యామోహ లక్షణాలని కూడ చెప్పక తప్పదు. 'నవనీతం' అన్న పదానికి నవ=క్రొత్తగా, నీతం=తీయబడినది అనే వ్యుత్పత్త్యర్థంతో అంతరార్థాల్ని చెప్తే అప్పుడు క్రొత్తగా ఏర్పడిన కర్మసంబంధం అనగా ప్రారబ్ధకర్మ బంధం అనే అంతరార్థం నవనీత పదానికి చెప్పుకోవచ్చు. కృష్ణుడు చిన్నతనంలో గోపకులిండ్లలో చేసిన దొంగపనులన్నిటినీ ఇదే విధంగా సాధకులలోని భూ సంబంధము లైన వ్యామోహాలు తొలగించడం అనే కృష్ణతత్త్వ సాధనలుగా అంతరార్థపరంగా చెప్పుకోవాలి. బాలకృష్ణుడు మట్టితిని ఆ తిన్న మట్టి నోటిలో విశ్వరూపం చూపించ డంలో విశ్వము యొక్క రూపాన్ని పరమాత్మనుగా చూడాలనీ అనగా ప్రకృతిలో పరమాత్మను దర్శించాలనే సాధనను చెప్పడంగా గ్రహించాలి. ఈ విధంగా బాల కృష్ణ లీలలన్నీ ఇక్కడ తడివి వాటికన్నిటికి విడివిడిగా అంతరార్థాలు వ్రాయడం ఏమంత అవసరమైనదిగా భావించకపోవడంవల్ల వానిని సాధకుల ఊహకు వదలివేసి వివరంగా తెలుపనందుకు పాఠకులు మన్నింతురు గాక!

వ్యాసుడు సంస్కృతంలో మూల భాగవతంలో వ్రాయని వెన్నెన్నో అసంబ ద్ధములైనవీ అశ్లీలార్థకములైనవీ కృష్ణలీలలుగా పోతన గారి తెలుగు భాగవతంలో కుప్ప తెప్పలుగ గోపికలు చెప్పినవిగా కల్పించి వ్రాయబడ్డాయి. వానికి మూలం లేనప్పుడు ఆ విధంగా నీచమనోభావాలుకల జుగుప్సాకర విషయాలు సామాన్యులగు పాటకపు ప్రజల కాకర్షంగా వుంతదాసికై ఆ విధంగా చిత్రించడం ఆతని భక్తి తత్త్వా నికి కూడ తగినట్లు లేదు. బహుశః అవి పోతన వివేక ప్రక్షిప్తములేమో అనిపిస్తూంది. ఆలోచిస్తే లీలలు కొన్ని మహాత్మ్యాన్ని తెలుపడానికనీ వేదాంతా జిజ్ఞాసువులగు పాఠకులు సంస్కృత మూలంవల్లనే అనువైన అర్థం తెలిసికోవలసి వుంటుందని మనవి జేస్తూన్నాను.

ఇక్కడ కొన్ని కృష్ణలీలలలో వ్యాసుడు వ్రాసిన శ్లోకాల్లోని అంతరార్థ ద్యోతక వాక్యాల్ని ఉదహరిస్తూ వాటిలోని అంతరార్థాల్ని వివరిస్తాను.

# ఊలూఖల బంధనం

( ప్రకృతి పురుష విజ్ఞాన సాధన )

బాలకృష్ణుణ్ణి ఇటూ అటూ పోకుండా యశోద ఉలూఖల బంధనం చేయడానికి దామం తెచ్చింది అనగా కృష్ణుణ్ణి రోటికి కట్టి వుంచడానికి దామాన్ని అనగా దూడల మెడలకు కట్టే పలుపు త్రాటిని తెచ్చింది. ఆ త్రాటి యొక్క ఒక చివర భాగం రోటికి కట్టింది. రెండవ చివర భాగం బాలకృష్ణుడి నడుముకు కట్టడానికి యత్నించింది.

శ్లో॥ తద్దామ, బధ్యమానస్య
స్వార్భకస్య, కృతాగసః
ద్వ్యంగుళోనమ భూత్తేన
సందదేఽన్యత్ర గోపికా

యదాసేత్త దపిన్యూనం
తేనాన్యదపిసందధే
తదపి ద్వ్యంగుళం న్యూనం
యద్యదాదాయ బంధనం

ఏవం స్వగేహ దామాని
యశోదా సందధా త్యపి
గోపీనాం సుస్మయం తీనాం
స్మయంతీ విస్మితాఽ భవత్

స్వమాతుః స్విన్న గాత్రాయాః
విస్రస్త కవర స్రజః
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః
కృపయాఽ సేతస్వబంధనే

తా॥ తప్పుడు పనులు చేస్తూవున్న తన బిడ్డను నడుము కట్టివేసి వుంచడానికి యశోద తెచ్చిన ఆ పలుపు రెండంగుళాలు పొట్టిదైంది. ఇంకో పెద్ద పలుపు తెచ్చి కట్టబోతే అది కూడా రెండంగుళాలు తగ్గి వుంది. మరొకటి తెచ్చింది అదీ

అల్లాగే రెండంగుళాలే తగ్గి వుంది. ఇంట్లో వున్న ఆవుల పలుపు త్రాళ్ళన్నీ తెచ్చి చూచింది. అన్నీ అల్లాగే రెండంగుళాలే తగ్గి వుండడం వల్ల గోపికలు యశోద కూడ చాలా ఆశ్చర్యపడ్డారు. వాళ్ళు ఆ బిడ్డను కట్టడానికి నానా తిప్పలు పడ్డారు. శక్యం కాలేదు యశోదకు చెమట పుట్టింది మెడలోని హారాలు జారి క్రింద ఊడి పడ్డాయి. తల్లి యొక్క అవస్థ చూచి జాలిపడి బాలకృష్ణుడు తన బంధనానికి తానై లోబడ్డాడు,

ఇందులో ఒకదానికంటె మరొకటి పొడుగ్గా వున్న ఎన్నెన్ని పొడుగాటి పలుపు త్రాళ్ళు కట్టడానికి తెచ్చినా ప్రతిది కూడ రెండంగుళాలే తక్కువ కావడం అనేది అమితమైన ఆశ్చర్యకరమైన విషయం. ఇక్కడ అంతరార్థపరమైన మహ ద్విషయం వుంది.

'అంగుళం' అంటే 'అంగం,'లా తిఒగృహ్ణాతి ఇతి అంగుళం, అనే వ్యుత్పత్తిలో శరీరమును పొంది వుండేది అని అర్థం వస్తుంది. అంగ పదానికి శరీరం అర్థం. 'ల' అంటే గ్రహించేది అని అర్థం. శరీరాన్ని గ్రహించి వుండేవి జీవాత్మ పరమాత్మలు అనే ప్రకృతి పురుషులనబడేవి. వాసనా బద్ధమైన జీవాత్మ, దాన్ని నడిపే పరమాత్మ. ఇవి రెండూ శరీరాన్ని ఆశ్రయించి వుంటాయి. రెండంగుళాలు అంటే శరీరంలో వున్న ప్రకృతి పురుషుల ద్వంద్వ స్థితి అని అర్థం. "ఆ రెంటిని గూర్చిన విజ్ఞానం ఇక్కడ కొఱవడిందనీ, ఆ రెంటి యొక్క జ్ఞానస్థితి వస్తేనే పరమాత్మ కట్టువడుతుందనీ, అంతవరకు పరమాత్మ లొంగడం జరుగదనీ ; ఆ జ్ఞానం ఎప్పుడు పొందితే పరమాత్మ అప్పుడు అందుతాడు" అనీ, పరమాత్మ జ్ఞాన విషయాన్ని అంతరార్థపరంగా గుర్తింపజెయ్యడమే బాలకృష్ణుణి కట్టడానికి తెచ్చిన అన్ని త్రాళ్లూకూడ రెండు అంగుళాలే తగ్గివున్నాయన్న దానిలోని రహస్యమని సాధకులు గ్రహించాలి. గోపికలంటే ఇంద్రియ వృత్తుల్ని పోషించే గుణాలుగా లోగడ చెప్పుకొన్నాం. ఇంద్రియ వృత్తులలో ప్రకృతి పురుష విజ్ఞానం వుండదు. ఆ లోపం వల్లనే పరమాత్మ వాటిచేత బంధింపబడడు. ఆ విజ్ఞానాన్ని పొందడానికి ఇంద్రియ వృత్తులతో చేసే సాధనలే పొడుగాటి పలుపు త్రాళ్లు తెచ్చి కట్ట డానికి చేసే ప్రయత్నాలంటే. ఆ ప్రయత్నంలో అనగా ఆ సాధనలో తికమకపడుతూ సతమత మౌతూ దిక్కుతోచని స్థితిలో సాధకులున్నప్పుడు పరమాత్మ వారికి తనంత తానుగానే స్వాధీనుడౌతాడు. అదే యశోదకు స్వయంగా బాలకృష్ణుడు బంధనానికి లోబడ్డాడన్న దానిలోని అంతరార్థంగా సాధనా రహస్యాన్ని గ్రహించాలి.




'అంగ' అనే అర్థంలో 'అంగు' అనే ఉకారాంత రూపం వుంది. అంగుష్ఠం అన్న ప్రయోగంలో కూడ అది కన్పిస్తూంది. అంగ శబ్దానికి శరీరావయవం అనీ, శరీరం అనీ కూడ అర్థాలున్నాయి. అట్లాగే అంగు శబ్దానికి శరీరావయవం అనేకాక శరీరం అని కూడ అర్థం చెప్పచ్చు. నా అంతరార్థ రామాయణంలో అంగుళీయక ప్రదానం అనే సుందరకాండ ఘట్టంలో ఈ విషయం ఇంకా విపులంగా చర్చించబడి వుంది.

# యమళార్జున వృక్షా భంగం

( సాత్త్విక ద్వంద్వ వినాశన సాధన )

తర్వాత బాలకృష్ణుడు తన మొలకు కట్టబడిన రోటిని ఈడ్చుకొంటూ యమళార్జున వృక్షాల నడుమగా అనగా రెండుగా అంటుకొని వున్న మద్ది చెట్లు రోటిని పోనివ్వడంతో అవి పెళపెళ విరిగిపడిపోయేయి. 'యమళ' అంటే జంట అని అర్థం. అర్జున అనే పదం ఋజు అనే పదం నుండి సాధింపబడుతుంది. ఋజు అంటే సక్రమ ధర్మ మార్గం అని అర్థం. అప్పుడు అర్జున అంటే ధర్మప్రవర్తకము అనే అర్థాన్నిస్తుంది. అది యమళము అనగా ద్వంద్వస్థితి గలది. ఇప్పుడు యమళార్జునము అంటే సత్త్వగుణంతో సూటిగా సంచరించే సాధకులలోని ద్వంద్వ గుణ స్థితి అన్నమాట. సాత్త్విక గుణంతో సాధనచేస్తూన్న సాధకులలోనున్న ద్వంద్వాలను నాశం చెయ్యడమే యమళార్జున వృక్ష భంగంలోని అంతరార్థం. కృష్ణ తత్త్వం అనగా నివృత్తి మార్గం ద్వంద్వములను పరిశింపు చేస్తుంది అనే సాధనా రహస్యం ఈ లీలలో మనకు స్పష్టపడుతూంది.

# కృష్ణుడు గోపకులతో చల్దులు ఆరగించుట

( సంచిత కర్మ నాశన సాధన )

బృందావనంలో గోపబాలురతో కలిసి కృష్ణుడు చల్ది అన్నం ఆరగించేడు -

చల్ది అన్నం అంటే క్రితంరోజున వండిన అహారం అని అర్థం. అంటే క్రితం జన్మలలోని కర్మవాసనలు, అనగా సంచిత కర్మలు అని అంతరార్థం చెప్పుకోవాలి. 'నవనీతం' అంటే ప్రారబ్ధకర్మ అని లోగడ చెప్పుకొన్నాం. ఇప్పుడు 'చల్ది'

అంటే సంచిత కర్మ అని చెప్పుకొంటున్నాం. ఈ విధంగా గోపకులలోని అనగా కృష్ణతత్త్వ సాధకులలోని సంచిత కర్మవాసనలూ ప్రారబ్ధ కర్మవాసనలూ కూడ నిర్వృతి తత్త్వ సాధనలతో తరించడం జరుగుతుంది. ఇక్కడ కృష్ణుడు చల్దులారగించడంలో సాధకునిలోని సంచిత కర్మవాసనలు నశించడం అనే అంతరార్థాన్ని సులువుగా అర్థం చేసికోవచ్చు.

## గోవులూ, గోపకులూ మాయమగుట

(స్వస్వరూప జ్ఞాన సాధన)

బృందావనంలో బ్రహ్మదేవుని యొక్క మాయచేత మాయమైన గోవులయొక్క గోపకులయొక్క రూపాలను తాను ధరించి కృష్ణుడు గోపికల ఇండ్లకు తానే గోగోపక రూపాలతో వచ్చేడు అనే కృష్ణలీలలో ఇంద్రియ వృత్తులు పాలించే అరిషడ్వర్గాల యొక్క మనోవృత్తులూ, వానికి సంబంధించిన మనోవృత్తులూ స్వప్నలక్షణాల్ని విడిచి కృష్ణ భక్తితో అనగా నిర్వృతి సాధనతో బ్రహ్మజ్ఞానంతో అన్నిటినీ భగవద్వృత్తులుగా చూడగల్గేయనే అంతరార్థం వుందని గ్రహించాలి. లేదా బ్రహ్మ అన్నిటినీ మాయం చేశాడు అంటే 'అహం బ్రహ్మాస్మి' అనే సాధనలో అన్నిటినీ నశ్వరములుగా భావించడం జరుగుతుందనీ, కృష్ణుడు తాను అన్నిటి రూపం ధరించేడు, అంటే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధనలో అన్నీ భగవద్రూపాలుగానే భావించడం జరుగుతుందనీ, ఈ రెండిటిలోను 'సర్వం ఖల్విదం బ్రహ్మ' భావన శ్రేష్ఠమైనదని పైకథలోని అంతరార్థంగా భావించాలి.

## కాళియ మర్ధనం

(తమోగుణ మర్దన సాధన)

కాళింది (యమునా) నదివల్ల ఏర్పడిన ఒక పెద్దమడుగులో 'కాళియు' డనే ఒక విషసర్పం నివసిస్తూవుండి. కాళియుడున్న హ్రదం మీదుగా ఆకాశంలో ఎగిరే పక్షులు ఆ హ్రదంపైకి వెడితేచాలు కాళియుని విషాగ్నికి అవి మాడిపోవలసిందే. తీర మందలి జంతువులూ వృక్షాలూ కాలి భస్మమైపోవలసిందే. ఒకనాడు బాలకృష్ణుడు కదంబ వృక్షం పైనుండి ఆ హ్రాదంలోని కాళియసర్పం యొక్క పడగల పైకురికి వాటి మీద

నిలబడి తాండవనృత్యం చేశాడు. కృష్ణపద ఘాతముతో కాళియుని పడగలు చితికి పోయేయి. అంత కాళియుడూ ఆతని భార్యలు అతని సంతానము కృష్ణుణ్ని దీనంగా వేడుకొన్నాయి. ఆ సర్వస్తుతి అంతా నిర్గుణ పరమాత్మ పరంగానే వుంది.

బాలకృష్ణు డంత అనుగ్రహించి :-

శ్లో॥ నాత్రస్థేయం త్వయాసర్ప!
సముద్రం యాహి, మాచిరమ్

స్వజ్ఞాత్య పత్య దారాద్యో
గోన్నభి ర్భుజ్యతాంనదీ

ఏతత్ సంస్మర న్మర్త్యః
తుభ్యం మదను శాసనం

కీర్తి యన్ను భయోస్సంధ్యోః
నయుష్మద్భయ మాప్నుయాత్

మద్భయాత్ నసువర్ణస్త్వాం
నాద్యాత్ మత్పాదలాంఛితమ్!

తా॥ ఓ సర్పమా! నీవు ఇక్కడ వుండడానికి వీల్లేదు. నీవు నీ భార్యా పుత్ర మిత్ర బంధుజ్ఞాతులతో సహా ఇక్కడి నుండి వెళ్ళిపోయి సముద్రంలో నివసించాలి. ఈ నది ఇప్పటి నుండి గోవులచే నరులచే స్వేచ్ఛగా అనుభవింపబడుతుంది. ఎవరైతే ఈ కాళియ మర్దన కథను స్మరిస్తారో ఎవరు ఉభయ సంధ్యలలోను దీన్ని కీర్తిస్తారో వారికి సర్ప భయం ఎన్నడూ ఉండకుండు గాక! నా భయం చేత నీ తలల పైని నా అడుగుల చిహ్నాలున్న కారణం చేత సుపర్ణుడు (గరుడ పక్షి) నిన్ను ముట్టకుండుగాక!

బాలుడు విషసర్పం తలలపై నాట్యమాడడం ఏమిటి? ఆతని కాలి త్రొక్కుడులకు తాళలేక భార్యాబిడ్డలతో అది ఆ బాలుణ్ని స్తుతించడం ఏమిటి? ఆ స్తుతి ఆ బాలుణ్ని గాక నిర్గుణ పరబ్రహ్మని చెప్పేదిగా ఉండడమేమిటి? బాలుడు ఆ సర్పాన్ని ఆ మడుగు విడిచి సముద్రంలో ఉండమనడం ఏమిటి? బాలుడి పాదాల ముద్రలు శాశ్వతంగా నాగుపాముల సంతతి తమ తల మీద ధరించడ మేమిటి? పాములను తన్నుకొని పోయే గరుత్మంతుడు కృష్ణ పాదాలున్న పాముల్ని చూచి కృష్ణ భయం

వల్ల ముట్టక పోవడమేమిటి? ఈ కథ చదివినా విన్నా పాపాలు పోవడమేమిటి? ఇవన్నీ నమ్మడం ఎల్లాగ? ఈ అప నమ్మకాలకు కారణాలైన కథా విషయాల్లో ఏవో అంతరార్థాల్ని చెప్తూన్నాయనక తప్పదు. ఈ కాళియ మర్దనం కృష్ణ లీలల్లో ఒక ప్రధాన ఘట్టం కూడా.

'కాళియుడు' అనే పదానికి వ్యుత్పత్త్యర్థం చూద్దాం. 'కలనాత్ కలిః' ఆవరించి వుండుట అనే అర్థం వల్ల 'కలి' అనే రూపం ఏర్పడింది. ఆవరించి వుండేది మాయ. 'కలిం యాతి ప్రాప్నోతి ఇతి కలియః' కలిని అనగా మాయావరణమును పొంది యున్నది అనే అర్థంలో 'కలియ' అవుతుంది. మాయావరణాన్ని పొందియుండేది ముఖ్యంగా తమోగుణం. కాన 'కలియుడు' అంటే తమోగుణం అని అర్థం వస్తుంది. 'కలియ' అనే పదం పైని స్వార్థమందు 'అణ్' ప్రత్యయం చేస్తే ఆదివృద్ధి వచ్చి 'కాలియుడు' అని రూపం ఏర్పడుతుంది.

కలియుడు అంటే ఏది అర్థమో కాళియుడన్నా అదే అర్థం. ఇప్పుడు కాలియుడంటే తమోగుణం అని అర్థం. అది విషసర్పం లాంటిది. అది కాటు వేస్తే చావవలసిందే. కాన పాము రూపం తమోగుణానికి చెప్పబడింది ఆ పాము కాళిందీ నదీ హ్రదంలో నివసిస్తూంది. కాలము యొక్క స్థితి కలది అనే అర్థంలో స్త్రీ లింగ రూపంగా 'కాలి' అవుతుంది. 'కాలింద దాతి ఇతి కాళింది' అవుతుంది. అనగా కాలమును స్థితి నడిపేది. కాల్రకమము అన్నమాట. కాలం ముందుకు సాగిపోవడమే కాని అది వెనక్కి మర్లదు. అల్లాగే నీటి ప్రవాహం ముందుకు సాగిపోతూంటుందే కాని వెనక్కి మర్లదు ఈ సామ్యం వల్ల కాల్రకమాన్ని నదితో పోల్చడం జరిగింది. ఆ నది కాలింద నది అని ఏర్పడింది. కాలంలో తమోగుణం యొక్క నడక ప్రాధాన్యం వహిస్తుంది కాన కాళిందీ జలం నలుపుగా వుంటుంది. కాన అది తమోగుణ ప్రవాహాన్ని అంతరార్థపరంగా తెలియజేయడానికి సరిపోతుంది

'ఆ కాళిందీ హ్రదం గట్టుపై నొక కదంబ వృక్షం వుంది' కత్ + అంబా = 'కదంబ' అవుతుంది. అంబా పదం ప్రకృతిని చెప్పేది అని లోగడ చెప్పుకొన్నాం. 'కత్' అంటే చెడ్డదైన అని అర్థం చెడ్డదైన ప్రకృతి కలది అనే అర్థంలో 'కదంబం' అని అవుతుంది 'కృష్ణ' పదం ఐహిక వాసనారహితమైన పరతత్త్వం అనేది అర్థంగా వ్యుత్పత్తి ప్రదర్శనంలో లోగడ చెప్పుకొనియే వున్నాం

ఇప్పుడు కాళింది హ్రదం తీరాన నున్న కదంబ వృక్షం ఎక్కి దాని మీద నుండి కృష్ణుడు కాళియ సర్పం మీదికి ఉరికి నాట్యం చేసేదంటే——

కాలక్రమంలో (కాళిందీ తీరంలో) ప్రకృతిని అధిరోహించి (కదంబ వృక్షాన్ని ఎక్కి) దాన్నుండి మాయావరణం గల తమోగుణాన్ని అణగద్రొక్కుతూన్నది సాధకునిలోని కృష్ణతత్త్వ సాధన అనే అంతరార్థం పైవాక్యంలో గ్రహించాలి.

కాళియుడు కృష్ణ పదఘాతములు తట్టుకోలేక భార్యా బిడ్డలతో కూడి కృష్ణుణ్ని స్తుతించి వెళ్ళిపోయేను "అంటే ఐహిక వాసనారహిత తత్త్వం (కృష్ణతత్త్వం) యొక్క సాధనలతో సాధకునిలోని తమోగుణ వృత్తులన్నీ నాశమైపోయి నిర్గుణతత్త్వంలో వాటంతట అవి విలీనమై పోతాయి" అని అంతరార్థం. అప్పుడు సాధకునిలోని నిర్గుణ పరతత్త్వం యొక్క ఆవిర్భావమే కాళియుని నిర్గుణ స్తోత్రానికి అర్థం—ఆ నిర్గుణతత్త్వం ఎట్లాంటిదో ఆ స్తుతి శ్లోకాలు తెల్పుతున్నాయి కాన, అది కృష్ణతత్త్వావిర్భావ స్తుతియే అనాలి.

తర్వాత కృష్ణుడు కాళియుని ఇక్కడ నుండి విడిచి నీవు నీ కుటుంబంతో సహా సముద్రంలో వుండుమని ఆదేశించేడు.

సముద్రం అంటే ఆత్మానందాన్ని గ్రహించే దేవతాయాథార్థ్య చింతన సాధన అని లోగడ వ్యుత్పత్తి ప్రదర్శన పూర్వకంగా చెప్పుకొనియే వున్నాం కాన కృష్ణుని ఆదేశంతో అనగా ఆ వాసనా రహితత్త్వ స్థితితో తమోగుణం సాధకుని ఆత్మానంద గ్రహణంలో దేవతాయాథార్థ్య చింత నిమగ్నమై వుంటుంది అనే సాధనా రహస్యం కృష్ణుడు కాళియునకు చేసిన నియమంలో ద్యోతకమౌతుంది.

కృష్ణ పాదాలున్న కారణం చేత గరుత్మంతుడు ఆ నాగజాతి సర్పాల్ని ముట్టడు అంటే—కృష్ణ తత్త్వాన్ని సాధిస్తూన్న సాధకునకు ఆతనిలోనున్న తమోగుణం యొక్క వినాశానికి వేదంలోని కర్మకాండలు ఆచరించ వలసిన పని అసలే వుండదు అని అంతరార్థం వస్తుంది. గరుత్మంతుడు అంటే వేదం అర్థం. గరుత్మంతుడు చంధోమయుడని వేదంలోను భాషలోను కూడ ప్రయోగా లున్నాయి. వేదకర్మలు మనశ్శుద్ధిని కల్గించడం ద్వారా సాధకునిలోని తమోగుణాన్ని పోగొట్టుతాయి. సాధకులు తమోగుణ నాశానికై మనశ్శుద్ధిని సాధించడానికి వేదకర్మలు ఆచరించడం అనేవి సాధనా ప్రథమ ఘట్టంలో సాగించాల్సి వుంది. కాని సాధకుడు కృష్ణ తత్త్వాన్ని అంటే వాసనారహిత తత్త్వాన్ని సాగిస్తూన్నప్పుడు ఆతనికి మనశ్శుద్ధితో తమోగుణ నాశానికి కోసం వేఱుగా వేదకర్మాచరణావశ్యకత వుండదనే సాధనా పురోగమన రహస్యం గరుత్మంతుడు కృష్ణ పాదాలున్న సర్పాల్ని ముట్టడని చెప్పడంలోని అంత రార్థంగా గుర్తించాలి.

ఈ విధమైన అంతరార్థాలతో కాళీయ మర్దన కథను అర్థం చేసికొని సాధన చేసేవారిలో తమోగుణం శీఘ్రమే నశిస్తుంది. వాసనా రహిత స్థితి ఏర్పడి నిర్గుణ పరమాత్మ తత్త్వం అందుతుంది. అప్పుడు వేదకర్మాచరణావశ్యకత వుండదు. సరాసరి వేదాంతమార్గ గమనంతో ముక్తి కల్గుతుంది. కనుకనే ఈ కాళీయ మర్దన కథ విన్నవారికి, చదివిన వారికి పాపాలు పోతాయి. మోక్షం వస్తుంది అన్న ఫలశ్రుతి చెప్పబడింది కేవలం బాహ్యార్థంలోనే అయితే ఈ కథ పాపనాశనం చేయడానికి గాని, ముక్తి నివ్వడానికిగాని శక్తి కలది ఎట్లౌతుంది?

కృష్ణ లీలలలో ఈ కాళీయ మర్దనలీల చాల ముఖ్యమైనది. ఇది ముక్తి సాధనను సూటిగా తెలిపే అంతరార్థాన్ని కల్గివుంది. ప్రకృతి నుండి తమోగుణ రాహిత్యంతో నిర్గుణ పరతత్త్వావిర్భావం అనే సాధనలు ఇందు చెప్పబడడం వల్ల దీనికి ప్రాధాన్యం చెప్పడం జరిగింది.

కాళీయు డొనర్చిన-దశ శ్లోకీ స్తుతి :-

శ్లో॥ నమస్తుభ్యం భగవతే। పురుషాయ మహాత్మనే
భూతా వాసాయ భూతాయ। పరాయ పరమాత్మనే

జ్ఞాన విజ్ఞాన నిధయే। బ్రహ్మణేఽనంత శక్తియే
అగుణాయా వికారాయ। నమస్తే ప్రాకృతాయ చ

కాలాయ కాలనాభాయ। కాలావయవ సాక్షిణే
విశ్వాయతదు పద్రష్ట్రే। తత్కర్త్రే విశ్వహేతవే

భూత మాత్రేంద్రియ ప్రాణ। మనోబుద్ధ్యాశ యాత్మనే
త్రిగుణే నాభిమానేన। గూఢ స్వాత్మానుభూతయే

నమోఽనంతాయ సూక్ష్మాయ। కూటస్థాయ విపశ్చితే
నానా వాదాను రోధాయ। వాచ్య వాచక శక్తియే

నమః ప్రమథ మూలాయ। కపయే శాస్త్ర యోనయే
ప్రవృత్తాయ నివృత్తాయ। నిగమాయ నమో నమః

నమః కృష్ణాయ రామాయ। వాసుదేవ సుతాయచ
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ। సాత్వతాం పతయే నమః

నమోగుణ ప్రతీక్షాయ। గుణాత్మాచ్ఛాద నాయచ
గుణవత్యు పలక్షాయ। గుణద్రష్ట్రే స్వసం విదే
అవ్యాకృత విహారాయ। సర్వవ్యాకృత సిద్ధయే
హృషీకేశ నమస్తేఽస్తు। మునయే మౌనశాలినే
పరావర గుణజ్ఞాయ। సర్వార్థ్య జ్ఞాయతే నమః
అవిద్యాయచ విద్యాయ। తద్ద్రష్ట్రేఽస్యచ హేతవే

తా॥ నీవు అందరిలో నున్న గొప్ప ఆత్మరూపుడవు. అన్ని దేహాల్లోను నీవు ఉన్నావు. పుట్టిన రూపాలన్నీ నిజానికి నీవే. అందుండే వాడవూ నీవే. జ్ఞానమూ దాని అనుభవ విజ్ఞానమూ నీవే. అంతట వ్యాపించిన బ్రహ్మయూ, అంతములేని శక్తియూ సత్త్వరజస్తమో రూప త్రిగుణ వికారాలుకూడ నీవే త్రిగుణాతీతుడవూ నీవే. ప్రకృతి యొక్క రూపమూ నీదే. ప్రకృతికి అతీతుడవూ నీవే. కాలము యొక్క మొదలు మధ్య చివర అంతా నీవే. నీవే ప్రపంచం. ప్రపంచాన్ని సృష్టించిందీ నీవే. దాన్ని చూచే వాడవూ నీవే. నడిపించేవాడవు నీవే. పంచ భూతాలూ, వాటి గుణాలూ, ఇంద్రియాలూ, ప్రాణమూ, బుద్ధీ వాసనారూపాలూ నీవే. వీటి అన్నిటిలోనూ సాధకులకు ఆత్మానుభూతి కొఱకు నిగూఢంగా ఉన్నదీ నీవే. అన్నిటికన్నా స్థూలరూపుడవూ నీవే. సూక్ష్మరూపుడవూ నీవే, నిశ్చలుడవై అన్ని చలన క్రియలకు ఆధారుడవైన కూటస్థుడవూ నీవే. ఆలోచన నీవే. ఆలోచించువాడవు నీవే. నిన్నుగూర్చి అందఱు అన్నివిధాల వాదించడానికి ఆధారమైన అన్ని శాస్త్రాలలోని మాటలూ నీవే మాట్లాడు వాడవూ నీవే. అన్ని దేశాలలో అన్ని మతాలలో అన్ని కాలాల్లో అందఱి నమస్కారాలను అందుకొనే వాడవూ నీవే. ముక్తిసుఖం ఇచ్చేది నీవే ఐహిక ప్రవృత్తివి నీవే, నివృత్తివీ నీవే, వేదాలు నీవే, వేదాంతాలూ నీవే. ఐహిక వాసనా నివృత్తి రూప కృష్ణతత్త్వమూ నీవే. పరమానందరూప రామతత్త్వమూ నీవే. జ్ఞాన ప్రకాశమువల్ల లభ్యమయ్యే వాడవు నీవే. ఆ గొప్ప జ్ఞాన ప్రకాశమూ నీవే. ఏ శక్తిచేతనూ అడ్డుపెట్ట శక్యం కానివాడవూ నీవే. అన్ని శక్తులూ నీవే. సత్త్వగుణ కల వారికి రక్షకుడవూ నీవే. సత్త్వగుణమూ నీవే. గుణములను వెల్లడి పరచి వానికి సంతోషించువాడవూ నీవే. గుణాలతో కప్పివేసేవాడవూ నీవే. గుణవంతులయందు కనుపడు వాడవు నీవే. గుణములను చూచేవాడవూ తెలిసికొనేవాడవూ నీవే. ప్రకృతి సంతటినీ వ్యాపించి గోచరించువాడవూ నీవే, ప్రకృతినంతా కాదని అవాఙ్మానస గోచరుడవూ నీవే.

ఇంద్రియాలను పాలించువాడవూ నీవే. ఇంద్రియాలూ నీవే. మౌనంవల్ల తెలియతగ్గ వాడవూ నీవే. మౌనశాలివీ నీవే. శ్రేష్ఠులలోను, నీచులలోను కూడ ఉన్నవాడవూ నీవే. ప్రపంచమూ నీవే. ప్రపంచాతీతుడవూ నీవే. ప్రపంచ ద్రష్టవూ నీవే. దాని కారణుడవూ నీవే. అట్టి నీకు నమస్కారము.

ఈ దశ శ్లోకీస్తుతి అద్వైత పరమాత్మను సూటిగా తెల్పుతూంది కాన ఈ శ్లోకములు అర్థయుక్తంగా పఠించి సాధకులు తరించుదురు గాక!

## దావాగ్ని నిర్వాపణ కథ

### (సాంసారిక ఘోర తాప నివారణ సాధన)

ఒకప్పుడు రామకృష్ణులూ గోప బాలురూ గోవులను అడవిలో మేపుతూంటగా దావాగ్ని అడివిని కాల్చివేస్తూండడం జరిగింది. గోపబాలురూ గోవులూ కృష్ణుని చుట్టూ చేరి రక్షించవలసిందిగా మొఱపెట్టుకొన్నారు. కృష్ణుడు వారిని అందరిని "ఒక్కసారి మీరు మీ అక్షులను మూసికోండి" అన్నాడు. అందఱూ అట్లాగు చేసేరు కృష్ణుడు యోగ స్వరూపుడై ఆ దావాగ్నిని మ్రింగివేశాడు. అంతా ఆనందంతో గోవుల్ని తోలుకొని సురక్షితంగా ఇండ్లకు చేరుకొన్నారు.

అరణ్యంలో పుట్టిన అగ్ని అంటే ప్రశాంతికి భంగంకల్గించే ఘోర సంసారిక తాప సమస్యలు అని అర్థం చెప్పాలి. ఆ సమస్యలు హఠాత్తుగా వస్తాయి. వచ్చినప్పుడు భగవంతుని స్మరించాలి తప్ప గత్యంతరం లేదు అన్నదే కృష్ణుణి గోపకులు ఆవేదనతో వేడుకొన్నదాని అంతరార్థం. అక్షపదం, అక్షము కలది అనే అర్థాన్ని ఇస్తుంది. 'అక్షము' అంటే ఇంద్రియం అర్థం. 'అక్ష' అనగా అక్షము కలది అని అర్థం. అంటే ఇంద్రియ ప్రవృత్తి కలది అంటే మనోహి హేతు స్సర్వేషాం ఇంద్రియాణాం ప్రవర్తనే" అనే దానివల్ల మనస్సు అర్థం అవుతుంది. 'మీ అక్షులు మూయండి' అంటే మీ మనస్సులను పనిచేయకుండా అమనస్కస్థితి ఒక్కసారిగా పొందండి' అని సాధకులకు కలిగే భగవత్ప్రబోధమే కృష్ణుని ఆదేశానికి అంతరార్థంగా భావించాలి.

కృష్ణుడు యోగస్వరూపు డయ్యేడంటే సాధకునిలోని ఐహిక వాంఛా రహిత స్థితియే కృష్ణ స్థితి అమనస్కస్థితి యోగంవల్లనే కల్గుతుంది. ఆ అమనస్కస్థితిలో

ఏలాంటి సంసారిక తాపాలు తాపం ఈయలేవు. భగవంతునితో అవి ఐక్యం పొందు తాయి అని అర్థం. యోగం అంటే కలయిక అని అర్థం. నిర్వృతి తత్త్వంతో భగ వంతునితో కలిసియుండే మానసిక మౌనస్థితికే యోగం అని పేరు. ఈ యోగం అక్షులు మూసికొన్నప్పుడే సిద్ధిస్తుంది. అంటే అమనస్కత కల్గినప్పుడే కల్గుతుంది.

అప్పుడే బాధలు సాధకుని బాధించలేవు అనే సాధనా రహస్యం ఈ దావాగ్ని నిర్వాపణ కథ తెల్పుతూ 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః' అనే వేదాంత కీలకం కూడ వెల్లడింపబడిందిగా గ్రహించాలి. మామూలుగా కూడ మనం ధ్యానం పొందడానికి కన్నులు మూస్తూ వుంటాము. కన్నులు మూసి భగవద్ధ్యానం చెయ్యాలన్నప్పుడు ఇంద్రియ వ్యాపారాలు చేసే మానసిక వృత్తుల్ని ఆపివెయ్యాలి అన్నదే అర్థంగా అక్కడకూడ తెలిసికోవాలి.

# గోపికా వస్త్రాపహరణం

## (మాయావరణ నివారణ సాధన)

మార్గశీర్ష మాసమున మొదటి దినమునుండీ కూడ కన్యకలగు గోపికలు కాళిందీ నదిలో స్నానమాడి ఆ నదీతీరాన కాత్యాయినీ వ్రతం చేస్తున్నారు. కాత్యా యినీ విగ్రహాన్ని ఇసుకలో నిర్మించి దానిని పూజించి నైవేద్యం పెట్టి కాత్యాయినీ దేవీ! మాయారూపిణీ! తల్లీ! మాకు అందరికి నందగోప సుతుడైన కృష్ణుడు మగడుగా చేయుము అని ప్రాతః కాల సమయాల్లో ప్రతిదినం ప్రార్థిస్తూంటారు. ప్రాతః వ్రతాంత దినమున నందవ్రజ మందలి గోపకన్యకలు అందరూ కలిసి యమునా నదికి స్నానానికి వెళ్ళేరు. అక్కడ గట్టుపైని తమ కట్టు బట్టలు విడిచి నదిలో జలక్రీడ లాడుతున్నారు. ఆ సమయం చూచి బాలకృష్ణుడు మెల్లగ వారు చూడకుండ వచ్చి గట్టుమీద నున్న బట్టలు పట్టుకొని తీరమందున్న కదంబ వృక్షం పైకెక్కి కూర్చుని గోపికలను చూచి నవ్వుతూ కృష్ణుడు—

శ్లో॥ అత్రా గోత్యా బలాః! కామం
స్వం స్వం వాసః ప్ర గృహ్యతాం
సత్యం బ్రువాణి, నోనర్మ
యద్యూయం వ్రత కర్శితాః

భవత్యో యదిమేదాస్యః
మయోక్తం వాకరి ష్యథ
అత్రా గత్య స్వవా సాంసి
ప్రతీచ్ఛంతు శుచిస్మితాః

తా॥ "మీరు స్వేచ్ఛగా నా వద్దకు వచ్చి మీ మీ బట్టలు తీసికోండి. మీరు వ్రతంతో కృశించియున్నారు. నేను హాస్యానికి చెప్పడంలేదు. నిజం చెప్తూన్నాను. మీరు నా దాస్యం చేసేవారేయైతే నేను చెప్పినట్లు చెయ్యండి. ఇక్కడకు వచ్చి మీ మీ బట్టలు శుచిస్మితలై (చక్కని చిరునవ్వు కలవారై) తీసికోండి." ఆ మాటలు విని మొదట్లో సిగ్గుపడి జంకుతూ ఒక చేత్తో యోనిభాగం కప్పుకొని ఒక చెయ్యెత్తి కృష్ణుని చేతిలో బట్టలు అందుకోడానికి మెల్లగా దగ్గఱకు వచ్చేరు.

అప్పుడు కృష్ణుడు "గోపికలారా! మీరు ఇన్నాళ్ళు వ్రతంచేస్తూ వివస్త్రలై స్నానం చెయ్యడం వ్రత లక్షణం కాదు. ఆ పాప పరిహారానికై మీరు రెండుచేతులూ పైకెత్తి నమస్కరించి మీ అధోవస్త్రాల్ని (లంగాలను) తీసికోండి." అని అచ్యుతుడనగానే గోపికలు వివస్త్రలై నదీజలంలో ప్రవేశించి స్నానం చెయ్యడంవల్ల వ్రతం భగ్నమై పోవడానికి భయపడిపోయి చేతులతోనూ యోనిభాగాల్ని కప్పుకొనియే గట్టు పైకెక్కేరు. అంత కృష్ణుడు తిరిగి వారినుద్దేశించి 'మీరు వ్రతం చెడకుండ ఫలితం పొందాలంటే మీ చేతులను రెండింటినీ నెత్తిపైకెత్తి నమస్కరించి మీ అధోవస్త్రాలను (పరికిణీలను) తీసికోండి' అని గట్టిగా పల్కేడు. గోపికలు మారు పల్కక రెండుచేతులూ నెత్తి పైకెత్తి నమస్కరించేరు కృష్ణుడు వారి బట్టల్ని వారి కిచ్చేసేడు.

ఆ విధంగా వంచింపబడినా, ఆక్షేపింపబడినా, ఆడింపబడినా, కట్టుకొన్న బట్టలు అపహరింపబడినా ఆ గోపకన్యలు తమ ప్రియుడైన కృష్ణుని స్పర్శతో ఒడలు పులకరించి ఆనందించేరే కాని మనస్సులో కూడ కించిత్తు ఏమీ బాధపడలేదు. ఆత డిచ్చిన బట్టలు కట్టుకొని ఆతనివైపు సిగ్గుతో చిరునవ్వు నవ్వుతూ చూస్తూ అతని పాదాల్ని తగిలేటట్లుగా దగ్గఱకు చేరి నమస్కారాలు చేసేరు. అప్పుడు వారితో కృష్ణు డిట్లు అన్నాడు.—

శ్లో॥ సంకల్పో విదిత స్సాధ్వ్యః!
భవతీనాం మదర్చనం
మయానుమోదిత స్సోఽసౌ
సత్యోభవితు మర్హతి

నమయ్యా వేశితధియాం
కామః కామాయ కల్పతే
భర్జితాః క్వథితాః ధానాః
ప్రాయో బీజాయనే ష్యతే
యాతా బలాః వ్రజం సిద్ధాః
మయైమాః రంస్యథక్షపాః

తా॥ "ఓ సాధ్వులారా ! నన్ను మీరు అర్చించడంలోని మీ సంకల్పం నాకు తెలిసింది. నాకు సంతోషం కల్గింది. మీ సంకల్పం తప్పకుండా ఫలిస్తుంది. అనుమానం లేదు. వేచి, దంచిన ధాన్యం అటుకులుగా మారిన తర్వాత అవి విత్తనాలుగా మొల కరించవు. అట్లే నాయందు బుద్ధినుంచి నా సేవ చేసిన వారి కోర్కెలు జన్మవాసనలను కల్గించకుండా ఫలిస్తాయేకాని తిరిగి అవి విషయ వాసనలను సృష్టించవు. అప్పుడు వారికి మోక్షమే సిద్ధిస్తుంది. మీరు గోకులానికి వెళ్ళండి. మీ కోర్కెలు ఫలించడానికి మీరు మునుముందు రాత్రులందు నాతో కలిసి రమిస్తారు.

ఈ విధంగా చెప్పడంతో గోపకన్యకలు ఎంతో సంతుష్టితో గోకులానికి వెళ్ళి పోయేరు.

భాగవతంలో ఈ గోపికా వస్త్రాపహరణం అనేది అర్థంకాని విచిత్రమైన మనోహర ఘట్టం. బాహ్యార్థం ఎంతో శృంగార లంపటతాశ్లీల మట్టాన్ని ప్రదర్శి స్తుంది. గోపికా వస్త్రాపహరణ కాలంలో శ్రీకృష్ణుడు పౌగండ వయస్సులోని వాడుగా చెప్పబడింది. పౌగండ వయస్సు అంటే ఐదవ సంవత్సరం మొదలుకొని తొమ్మిదవ సంవత్సరం వరకు. అప్పటికి కృష్ణునకు ఏడవ సంవత్సరం. గోపికలు ఆతణ్ణి తమ భర్తగా చేయవలసిందని దేవిని కోరేరంటే వారు కృష్ణుని కంటే చిన్నవారనాలి కదా! తమకంటే చిన్నవానిని తాము పెండ్లాడడం కోరడం అశాస్త్రీయం కదా !

మీరు నా వద్దకు వచ్చి మీ అధోవస్త్రాల్ని (లంగాల్ని) తీసికొంటే మీ వ్రతం ఫలిస్తుందన్నాడు అంటే మీరు నన్నే భర్తగా కోరుకుంటున్నారు. కాన మీ మర్మావయవాలు నాకు చూపండి అనే వాంఛతో రెండు చేతులెత్తి మ్రొక్కండి అంటూ కొంటెగా అడిగేడంటే గోపికలు తాము కోరినవాడు తమకు దక్కడమే తమ వ్రత ఫలం కాన, వ్రతం చెడకుండా వుండాలని ఆతనికి నగ్నంగా సమీపించి యోనిభాగం చేతులతో కప్పుకోకుండా ఆతడు అంగీకరించే విధంగా ఆతని కోర్కె ప్రకారం

ఆతని వద్దనుండి వస్త్రాలు పుచ్చుకొన్నారంటే, పాదాలు స్పృశించి పులకించేరంటే, ముందు రాత్రులలో కృష్ణుడు వారితో రతివాంఛను ప్రకటించేదంటే, మీరు నాతో రాత్రుళ్ళు రమిస్తారని స్పష్టంగా కృష్ణుడు వారికి చెప్పేదంటే, ఏమనాలి ? ఇదంతా వాచ్యార్థంలో అసంబద్ధమైనదే కదా !

ఈ కథ ఇంత ఏహ్యంగా ఉందేమిటి ? కృష్ణుడికి జారత్వ లక్షణం చెప్పడానికి హిందూమతవ్యాప్తి నిరోధానికి అన్యమత ప్రచారకులచేత ఈ గోపికా వస్త్రాపహరణ ఘట్టం ఉపహరించడం జరుగుతూంది. ఇందులో బాహ్యార్థంలోనే అవిశ్వసనీయమైన విషయాలున్నాయి. ఐదేండ్లవాడు తనకంటే చిన్నవారైన బాలికల గుహ్యావయాలు చూడాలని కోరడం ఉంటుందా ? పసిపిల్లలైన ఆడపిల్లలు సిగ్గుపడడం ఏమిటి ? ఈ ఘట్టాన్ని చిత్రాల్లో చూపించేవారు గోపికలను అశ్లీలుగా చిత్రించేరు. మరీ అన్యాయం! ఇందులో అంతరార్థమే లేకపోతే ఈ ఘట్టం ఇన్ని నమ్మకీలలేని అవకతవకలతో భగవంతుని చెప్పే భాగవతంలో చేర్పడం జరిగేదేకాదు. ఇందులో ఎంతో ముక్తి సాధనా రహస్యం అంతర్గర్భితంగా ఉంది. చూడండి వివరిస్తున్నాను.

'గోపిక' అంటే ఇంద్రియ విషయాలన్నుగ్రహించే మనోవృత్తులని లోగడ అనేకసార్లు చెప్పుకొనియున్నాం. 'కృష్ణు' డంటే ఐహిక వాసనా విరహితమైన అనగా నిర్వృతి ముక్తి తత్త్వం అని కూడ చాలసార్లు చెప్పుకొనియే యున్నాం. వస్త్రము అనేది మాయావరణానికి పర్యాయ పదము అనీ, కాళింది అంటే తమోగుణమని కూడ చెప్పుకొనియే ఉన్నాం.

గోపికలు నందగోప సుతుడైన కృష్ణుణ్ణి భర్తగా పొందాలని వ్రతం చేస్తూన్నారంటే విషయ మనోవృత్తులు, (గోపికలు) ఆనందవృత్తికి కల్గే (నందగోపునికి కల్గిన) వాసనా విరహితముక్తి తత్త్వాన్ని (కృష్ణుణ్ణి) చేరడానికి సాధకులు చేసే సాధనా క్రమం సాగిస్తున్నారన్నమాట. నందగోపుని కొడుకు కృష్ణుడు అంటే ఆనందవృత్తివల్ల కలిగే వాసనా రహిత తత్త్వం అన్నమాట. అందుకు మాయను ఒత్తుగించుకోవడమే వివస్త్రలు కావడం అన్నదాని అంతరార్థం. మాయను ఒత్తిగించుకొన్నా తిరిగి అంతలోనే తమోగుణంతో మాయ ఆవరిస్తూనే వుంటుంది. అన్నదే కాళిందీ నదిలో కంఠం వరకు గోపికలు దిగివున్నారన్న దాని అర్థం. కృష్ణుడు వచ్చి బట్టలు ఎత్తికొనిపోయి చెట్టెక్కి కూర్చున్నాడంటే వారు కోరిన వాసనా విరహితముక్తితత్త్వం (కృష్ణతత్త్వం) వారికి అందజేయడానికై వారు తిరిగి వాసనలను పొందకుండా చేయడం అనే అంతరార్థం కృష్ణుడు చేసిన వస్త్రాపహరణానికి అర్థంగా ఇందులో కన్పిస్తూంది. మీరు

వివస్త్రలై జలంలో దిగి వ్రతభంగం పొందే పనిచేశారంటే మాయను విడిచి (వస్త్రాలు విడిచి) వాసనా విరహిత తత్త్వం (కృష్ణుని)తో చేరడానికి సాధనలు చేస్తూ కూడ తిరిగి మాయలోనే (కాళింద జలంలోనే) పడ్డారు. కాన వివస్త్రలుగా పైకి గట్టెక్కి, నా వద్ద నుండి బట్టలు గ్రహిస్తేనే మీకు వ్రతఫలం దక్కుతుంది అని అన్నాడు. అంటే ఆ విధంగా సాధకులకు వాసనా రహిత తత్త్వోపాసనము వల్ల (కృష్ణ తత్త్వోపాసనం వచ్చి) అంతః ప్రబోధం కల్గిందన్న మాట.

గోపికలు యోని భాగాల్ని చేతులతో కప్పికొని గట్టెక్కారు. అంటే యోని అంటే పుట్టుకకు హేయమైనది అని అర్థం. కాన ఇక్కడ సాధకులకు జనన మరణ జనక వాసనా వ్యాపారమే యోని పదానికి అర్థం. ఎంతెంత సాధనలు చేసినా ఏవేవో జనన మరణ కారణమైన వాసనలు నిలిచిపోయేటట్లు కర్మవశంచేత సాధకులు దాచుతూనే వుంటారనే రహస్యం యోని భాగాలను గోపికలు ఆచ్ఛాదించుకొని గట్టెక్కారన్న దానిలో అంతరార్థం ధ్వనిస్తూంది మీరు "నాకు చేతులెత్తి మ్రొక్కి మీ అధో వస్త్రాలను స్వీకరించండి" అని కృష్ణుడన్నాడంటే మీ మీ జన్మ వాసనా కారణములైన మనోవృత్తులను అంటిపెట్టుకొని వుండడం మానేసి (యోనిని కప్పుకోవడాన్ని విడిచి) ఐహికవాంఛా రహిత తత్త్వాన్ని ఉపాసించాలి. కృష్ణుణ్ణి చేరుకోవాలి అనే అంతః ప్రబోధం సాధకులకు సాధన యొక్క చిట్టచివర కల్గుతుందన్న సాధనా రహస్యం ఇందులో మనం అంతరార్థపరంగా గ్రహించాలి. అయితే తిరిగి కృష్ణునివల్ల బట్టలు గ్రహించేరంటే మాయ సాధకులకు ఆవరిస్తుందన్న అర్థం కూడ రావచ్చు కాని ఆ వస్త్రాలు కృష్ణుని చేతినుండి అందుకొన్నవి కావడంవల్ల ఐహిక వాంఛారహిత తత్త్వం సాధకునిలో స్థిరంగా నెలకొన్న పిదప సాధకుడు కర్మలతో కూడివున్న మాయాతాన్యాలకు కట్టుబడని అసంగస్థితితో కూడియే ఆ కర్మలు చేస్తాడు. కాన అతను మాయలో నున్నప్పటికీ అతనికి మాయ బంధించదు అనే అంతరార్థాన్ని ఇందులో మనం సూక్ష్మంగా గ్రహించాలి. ఈ విధంగా అంతరార్థపరంగా కృష్ణ తత్త్వాన్ని చెప్పుకోవడం జరిగినప్పుడే చిట్టచివర గోపికలు పాదాలు స్పృశించి వెళ్ళిపోయేటప్పుడు కృష్ణుడు చెప్పిన చివరి వాక్యాలు అంతరార్థపరంగా సాధనలకు సరిపడి వుంటాయి.

"నాతో జతపడిన మీ బుద్ధులు ఏ కోరిక కోరినా అవి వేచిన, దంచిన ధాన్యం మొలకెత్తని విధంగా, జనన మరణ హేతువులు కావు" అని చెప్పడంలో పై అంతరార్థం స్పష్టపరచబడిందనాలి.

'మీను రాత్రులు నాతో రమిస్తారు' అనడంలో సాధకులలో తమోగుణం ఆవరించినప్పుడు వారిని కృష్ణతత్త్వం అనగా నిర్వృతి తత్త్వం ఆవేశించి బాధలేకుండ సాధకులు ముక్తావస్థను పొందుతారు. అనే గొప్ప సాధనా పరమైన రహస్యార్థం ఇందులో నిక్షేపింపబడిందనక తప్పదు. ఇక్కడ మునుముందు రాత్రుల యందలి చీకటి నలుపు గుణం కలది కాన అది ముందు ముందు సాధకులకు ఆవేశించే తమో గుణానికి సంకేతంగా వాడబడిందని అంతరార్థపరంగా తెలిసికోవలసి వుంది.

గోపికా వస్త్రాపహరణంలో కృష్ణుడు ఏడేండ్ల వయస్సు వాడంటే ఐహిక విషయ రాహిత్యం అనగా నిర్వృతి సాధన అప్పుడు సాధకులలోని సప్తధాతువులలోను నెలకొనివున్నదిగా భావించాలి. గోపికలు 5 లేక 6 ఏండ్ల వారైయుండాలంటే సాధకునిలోని వాసనా వృత్తులు పంచేంద్రియాలకు, అరిషడ్వర్గాలకు సంబంధించినవై యుంటాయనే అంతరార్థం కూడ ఇక్కడ మనం భావించాలి. ఈ విధంగా గోపికా వస్త్రాపహరణ ఘట్టం సాధకులలోని మాయావరణ నివారణ సాధనను తెల్పుతూంది. కాన ఇది ఎంతో అత్యవసరంగా భాగవతంలో వ్యాసమహర్షిచే వ్యంగ్యార్థపరంగా వ్రాయబడింది. ఇది సాధకుల కెంతో ఉపయోగకరమైన ఘటం.

## యజ్ఞపత్ని ఉద్ధరణం

### (కర్మ, యోగ, జ్ఞాన, త్రయ సాధన)

వేసవిలో ఒకనాడు బలరామ కృష్ణులతో కూడి అడవిలో గోవుల్ని కాస్తూ గోపకులు ఎండబడి, ఆకలికి తాళలేక 'మాకు విపరీతంగా ఆకలివేస్తుంది రామా! కృష్ణా! మా ఆకలి బాధ తీర్చండి' అని బలరామ కృష్ణుల్ని వేడుకొన్నారు. అంత కృష్ణుడు అక్కడకు దగ్గరలో బ్రాహ్మణులు 'అంగిరసం' అనే పేరుగల యజ్ఞం చేస్తున్నారని విని అక్కడకు వెళ్ళి మాపేరు చెప్పి అన్నమడగండి 'వారు పెడ్తారు'. అని చెప్పేడు. వాళ్ళు అల్లాగే వెళ్ళి బ్రాహ్మణుల్ని "రామకృష్ణులు ఆకలితో అడవిలో ఉన్నారు. మిమ్ము అన్నం అడిగి తెమ్మన్నారు." అని అడిగేరు. దానికి వారు 'ఔ' నని కాని 'కా' దని కాని చెప్పక ఉపేక్షించి ఊరుకున్నారు. గోపకులు నిరాశజెంది తిరిగి రామ కృష్ణుల వద్దకు వచ్చి ఆ సంగతి చెప్పేరు.

అంతవారు "మీరు మళ్ళీ వెళ్ళి యజ్ఞశాలలో యజ్ఞం చేసే బ్రాహ్మణుల భార్యలుండే చోటికి వెళ్ళి వారికి మా పేరు చెప్పి అడగండి వారు పెడ్తారు." అని మరల

పంపేరు. గోపకులు యజ్ఞశాలలో యజ్ఞపత్నులున్న ప్రత్యేక భాగంలోకి వెళ్ళి వారిని "రామకృష్ణులు ఆకలితో నుండి మిమ్ము అడిగి అన్నం తెమ్మన్నా" రని అడిగేరు. ఆ మ ట విన గానే నిత్యమూ తాము కోరుకొనే రామకృష్ణులు తమ సమీపంలో కేవచ్చేరని సంతోషపడి ఆ యజ్ఞ పత్నులు వెంటనే చతుర్విధాన్నములను పాత్రలలో నింపికొని సముద్రుణ్ని సమీపించే నదీప్రవాహాల్లాగు తొందరగా వెళ్ళడానికి అతి వేగగమనంతో బయలుదేరేరు. వారి భర్తలు, వారి సోదరులు, వారి కుమారులు ఎంత అడ్డుపెట్టినా వారు వినక ఆగక చిరకాలం నుండి కాంక్షిస్తూన్న రామకృష్ణులున్న చోటికి చరచర నడిచి వెళ్ళిపోయేరు.

యమునా నదీ తీరంలోని వనంలో అశోకవృక్ష మండపంలో గోపకులతోను అన్నయగు బలరామునితోను కలిసివున్న కృష్ణుణ్ని "భూద్రంతో త్రాగళ్ళా"లట్లుగా చూచేరు. కృష్ణుడు వారికి స్వాగతం పల్కేడు. తర్వాత వారుతెచ్చిన ఆహారం తిని మీరింక మీ భర్తలున్న చోటికి వెళ్ళండి. మీరు వారి దగ్గఱనుండేనే కాని వారి యజ్ఞం పూర్తికాదు" అని కృష్ణుడు వారితో అన్నాడు. అట్లు వెళ్ళడానికి వారు నిరాకరించి "నిన్ను పొంది మేము తిరిగి వెళ్ళడం జరగదు. ఇప్పుడు మేము వెడితే మమ్ము మా భర్తలుగాని, తల్లిదండ్రులు గాని, పిల్లలు గాని, మేనమామలు మొదలగు బంధువులు గాని ఎల్లాగా. స్వీకరింపరు. నీ పాదాల వద్దనే ఉండిపోతాం" అని దీనంగా పల్కేరు.

అంత కృష్ణుడు 'మిమ్ము మీ భర్తలు గాని, బిడ్డలుగాని, బంధువులు గాని, లోకులుగాని, ఎవ్వరూ కాదనరు. నా భావంతో కూడి వుంటే దేవతలు కూడ మిమ్ము ఆదరిస్తారు. మీరు నాభావంతో వుండి త్వరలోనే నన్ను కలుస్తారు నిత్యం నన్ను పొంది వుండండి. మీ ఇండ్లకు తిరిగి వెళ్ళండి. అని పంపివేసేడు. వారు యజ్ఞవాటికకు వెళ్ళేరు. ఎవ్వరూ వారిని కాదన లేదు.

రామకృష్ణుల కోసం యజ్ఞ పత్నులు భర్తలు చెప్పినా వినక వెళ్ళేటప్పుడు ఒక బ్రాహ్మణుని భార్య మాత్రం వారితో రాలేకపోయింది. ఆపె భర్త ఆపెను ఇంట్లో నుండి కదలనీయక గదిలో పెట్టి తాళం వేసేడు. ఆపె రామకృష్ణ ధ్యానంతో ఆ గదిలోనే దేహం విడిచివేసింది.

అటు పిమ్మట యజ్ఞపత్నుల యొక్క భర్తలు తాము తమ భార్యలను నివారించి నందుకు పరితాపం చెందేరు. తమ భార్యలలోని కృష్ణ భక్తిని చూచి తమకది అబ్బ నందుకు సంతాపపడ్డారు. తమ జన్మల యొక్క ఘనతను, తమ పాండిత్య బలాన్ని,

తమ తపస్స్వాధ్యాయాన్ని, దీక్షను కృష్ణ భక్తికి వ్యతిరేకమైనందుకు నిందించుకొన్నారు. కాని కంస భయం చేత రామకృష్ణులను చూడడానికి మాత్రం వారు వెళ్ళ లేకపోయేరు.

గోపకులకు ఆకలివేస్తే రామకృష్ణులు వారిని యజ్ఞం చేసే చోట తమ పేరు చెప్తే భోజనం దొరుకుతుందనడం ఏమిటి? గోప బాలురైన వారి పేరుకు అంత ఖ్యాతి ఉందా? మగవారు గోపకుల కోరికను ఔననో కాదనో అనక ఉదాసీనత వహించడ మేమిటి? యజ్ఞ పత్నులు రామకృష్ణుల పేరు చెప్పడంతోనే చతుర్విధాన్నాలు పట్టు కొని ఆనందంతో వెళ్ళవలసిన పని ఏమివచ్చింది? తమ భర్తలు, కొడుకులు, బంధువులూ కూడా వద్దన్నా వాళ్ళు వినిపించుకోకుండా పోవడ మేమిటి? రామకృష్ణుల వద్ద నుండి వారు తిరిగి రాగానే మొదట్లో నిషేధించిన వారంతా సంతోషపడడం దేనికి? తమ పత్నుల్ని నిషేధించి నందుకు పశ్చాత్తాపం పొందడమేమిటి? ఒక బ్రాహ్మణుడు మాత్రం తనభార్యను గదిలో బంధించడమేమిటి? అంత మాత్రాన ఆమె రామకృష్ణ పరవశతతో దేహం విడిచి వేయడమేమిటి? రామకృష్ణుల్ని చూడాలని బ్రాహ్మణులు అనుకొన్నా కంస భయంతో మానుకోవడం ఏమిటి? తమపత్నులు రామకృష్ణుల వద్దకు వెడితేలేని కంస భయం తాము వెళ్ళడానికి ఆటంకం వచ్చిందా? ఇదంతా హేతుబద్ధంగా ఉందా? బాహ్యార్థంలో తలాతోక లేని ఈ కథను భాగవతంలో వ్రాయబడడాన్ని ఎట్లు సమర్థిస్తాము? ఈ ప్రశ్న లన్నిటికి అంతరార్థపరంగా హేతు బద్ధమైన సమాధానం వుంది, చూడండి.

'గోపకు' లంటే సాధకునిలోని విషయాల్ని పోషించే మనోవృత్తులని కదా! అర్థం చెప్పుకొని వున్నాం. వారికి ఆకలి వేయడం అంటే సాధకునిలోని మనో వృత్తులు విషయ వాంఛ నణచుకో లేనంతగా వాసనా ప్రాబల్యాన్ని పొందేయన్న మాట. అప్పుడు ఆకలి నివారణకు వారు కృష్ణుణ్ని, రాముణ్ని ఆశ్రయించేరు అంటే—కృష్ణుడు అన్న పదానికి నిర్వృతితత్త్వం అనగా విషయ వాంఛా విరహిత తత్త్వం, బలరాముడు అంటే బ్రహ్మానందతత్త్వం అని కదా లోగడ మనం చెప్పుకొని వున్నాం.

సాధకులు తమలోని వాసనాప్రాబల్యం వల్ల తాము అణచలేనంతగా విషయ వాంఛలు చేరినప్పుడు నిర్విషయానంద తత్త్వసాధనకు సంక్రమించాలన్నమాట. కృష్ణ పదం నిర్వృతి తత్త్వాన్ని, రామ పదం ఆనందతత్త్వాన్ని చెప్పేమాటలు గదా! కృష్ణుడు, రాముడు ఒకే గర్భంలోని జంట బిడ్డలు కాక వారొకరిని విడిచి మరొకరుండరు. అదే విధంగా నిర్విషయత్వ భావనతో ఆనందావిర్భావం విధిగా కల్గుతుంది. ఆనందావిర్భా వంతో నిర్విషయత్వం స్థిరపడి ఉంటుంది.

ఈ విధంగా రామకృష్ణ సాధన జంట తత్త్వ సాధన వారిపేరు చెప్తే భోజనం లభిస్తుందంటే ఆ సాధనలను మనసులో భావిస్తే చాలు అంత్రకితం అణచలేని విధంగా బాధిస్తూ వున్న విషయాలు ఆ సాధనలలో తమంత తాము లీనమై ఆనంద మయములై నిర్వృతి సుఖాన్ని కలిగిస్తాయి అని అంతరార్థపరంగా పై విషయాన్ని గ్రహించాల్సి వుంది.

బ్రాహ్మణులు అనగా వేదవిహిత కర్మకాండలతో దేవతలను మెప్పించి వరాల్ని పొందే వేద మార్గంలోని సాధనలన్నమాట. బ్రాహ్మణులు అంటే బ్రహ్మ పదానికి వేదం అర్థం కాన, బ్రహ్మ నయతి ఇతి బ్రాహ్మణః అనే వ్యుత్పత్త్యర్థంలో వేదమార్గాన్ని సాధనలు నడిపించేవి అని అర్థం. వేదంలో బ్రాహ్మణములనే భాగము లివే త్రైగుణ్య విషయాః వేదాః అని భగవద్గీతలో ఉంది. వేదాలు సత్త్వరజస్తమోగుణ విషయాలకు సంబంధించినవి. వాని వల్ల ప్రకృతిలోని ఫలితాల్ని పొందవచ్చు.

ఆ విధంగా ప్రకృతి లాభాలకి యజ్ఞాలు చేస్తారు. వారు గోపకులు రామకృష్ణుల పేరు చెప్పితే బ్రాహ్మణులు ఔననసూ లేదు, కాదననూ లేదు. అంటే రామకృష్ణ తత్త్వాలు ముక్తి సాధకాలు కాని రక్తి భుక్తి సాధనాలు కావు. వేదమార్గంలో యజ్ఞాలు చేసేవారు రక్తి, భుక్తి ప్రియులు, వారికి ముక్తిమార్గం తాము కోరే కోరికలను నాశనకరమైంది. అది గొప్పదే అని తెలిసినా వారు తమలోని వాసనల బలంచేత నిర్విషయానంద తత్త్వాలను ఔనని శ్లాఘించనూ శ్లాఘించరు. కాదని నిందించనూ నిందించరు. ఈ విషయంలో వారు ఔదాసీన్యంగా ఉంటారు. అదే బ్రాహ్మణులు గోపకులు రామకృష్ణు లన్నం తెమ్మన్నారని అడిగినప్పుడు వారి మాటల్ని ఉపేక్షించేరన్న దానిలోని అంతరార్థం.

తర్వాత బ్రాహ్మణుల భార్యలు రామకృష్ణుల పేరు విన్నంతనే గోపకుల్ని ఆదరించి వారివెంట చతుర్విధాన్నాలు పట్టుకొని ఆనందంతో వెళ్ళేరు." అంటే—బ్రాహ్మణుని భార్య అను అర్థంలో బ్రాహ్మణి అవుతుంది. లేదా పతి యొక్క స్త్రీ పత్ని అని అవుతుంది. బ్రాహ్మణుడంటే వేదాల్ని నడిపించే వాడని కదా అర్థం. అతనిచే భరింపదగినది అతని భార్య అంటే వేదాలచేత పోషింపదగినది పరమాత్మను గూర్చిన వేదాంత మార్గం అదే ఉపనిషన్మార్గం అదే ముక్తి తత్త్వం అన్నమాట. ఇప్పుడు బ్రాహ్మణ భార్యలు అంటే వేదాల్లో అంతర్గర్భితంగా చెప్పబడివున్న ముక్తి తత్త్వాన్ని సారాంశంగా వివరించే జ్ఞాన మార్గగాములైన ఉపనిషత్తులు అనే అంతరార్థాన్ని గ్రహించాలి.

ఉపనిషత్తులుకి వేదాంతాలనే పేరు వుంది. వేదం కర్మకాండపరంగా చెప్పిన సంగతుల్లోనున్న అంతరార్ధం ఉపనిషత్తులు జ్ఞానపరంగా వివరణ చేసేయి. అంటే వేదంలో పైకి ప్రకృతి శక్తుల్ని వశపఱచుకొనే యజ్ఞాది కర్మభాగం అర్థంగా కన్పిస్తూన్నా, అదే కర్మభాగాన్ని అంతరార్ధపరంగా విడదీస్తే జ్ఞాన మార్గం అర్థమౌతుంది.

భాగవతంలోని కథలుపైకి బాహ్యార్ధంలో భక్తిమార్గాన్ని బోధించేవిగా కన్పించినా అంతరార్ధపరంగా అవి ముక్తిమార్గాన్ని ఎట్లా బోధిస్తూన్నాయో అట్లాగే వేదంలోని దేవతా అనుగ్రహాన్ని కల్గించి భక్తి సాధనగా ఆ అంతరార్ధపరంగా ముక్తి మార్గాన్ని బోధిస్తూన్నాయి- ఆ అర్థాల సారాంశమే వేదాంతం లేక ఉపనిషత్తులు. అవే ఇక్కడ బ్రాహ్మణ భార్యలు లేక యజ్ఞపత్నులు అన్నమాటకు అర్థాలుగా గ్రహించాలి బాహ్యార్ధంలో వేదోక్త కర్మకాండ ముక్తిని ఉపేక్షించినప్పటికీ ఆ ముక్తి మార్గాన్ని ఉపనిషత్తులు స్వీకరించేయి అన్నదే యజ్ఞంచేసే బ్రాహ్మణులు అనగా వేదాలు ఔనని కాదని అనక ఉపేక్షించిన గోపకులు అనగా ఇంద్రియాలు చెప్పిన రామకృష్ణ సాధనను అనగా నిర్విషయానంద సాధనలకు బ్రాహ్మణ స్త్రీలు లేక యజ్ఞపత్నులు అనగా జ్ఞానమార్గం చెప్పే ఉపనిషత్తులు స్వీకరించేయి అని సాధకులు గ్రహించవలసిన అర్థం యజ్ఞపత్నులను బంధువులంతా నిషేధించేరు అంటే వేదానికి కర్మపరంగా అర్థం చెప్పిన భాష్యాలు వాటిని బలపఱచిన షడంగాలు, వగైరా కర్మ కాండ పరమైన వ్యాఖ్యలు ముక్తి తత్త్వం వైపు సాధకులు వెళ్ళకుండా అడ్డు కట్టలుగా నిలుస్తున్నాయి అనేది అంతరార్ధం. ముక్తి మార్గం, కర్మ మార్గాన్ని త్రోసిపారవేయడమే బ్రాహ్మణ స్త్రీలు తమవారి మాట కాదని రామకృష్ణుల వద్దకు రావడమనే దాని అంతరార్ధం. చతుర్విధాన్నాలు తీసుకొని వెళ్ళేరు. అంటే విశ్వ, తైజస, ప్రాజ్ఞ ముక్తావస్థలనే నాల్గు రూపాలలో నున్న పరమాత్మ తత్త్వాన్ని తమతో తీసుకొని వెళ్ళేరన్నమాట.

రామకృష్ణులు యజ్ఞపత్నుల ఆహారాల్ని స్వీకరించి వారిని వారి భర్తల వద్దకు వెళ్ళిపోవలసిందిగా ఆదేశించేరు. అంటే సాధకులు నిర్వృతిలోనున్న భావనలోనే ఉంటే వేదాలు చెప్పే యజ్ఞకర్మలలోని అర్థం కూడ అదే అనే సంగతి గ్రహిస్తారు. కాన వేదవాదులు ఉపనిషత్తులకు వ్యతిరేకులు కారు అని చెప్పడమే దాని అంతరార్ధం. అంటే నిజానికి వేదల్లోని కర్మభాగం, జ్ఞానభాగం వేఱు వేఱుగా పైకి కన్పించినా రెండూ ఒక్కటే కాన వేదమును వ్యాప్తి చేసేవారు వేదాంత వ్యాప్తికి గాని

వేదాంతాన్ని వ్యాప్తి చేసేవారు వేదవ్యాప్తికిగాని అడ్డుతగులరాదు, అని అందఱూ గ్రహించాలి.

ఒక బ్రాహ్మణ స్త్రీని గదిలో పెట్టి నిర్బంధించడం. ఆమె కృష్ణ భక్తితో దేహం విడవడం అంటే నిర్వృతి ఆనందాన్ని ఉపనిషత్తులకు సంబంధించిన జ్ఞానమార్గంతోకాక భౌతిక సాధనలకు సంబంధించియున్న ఒకానొక అష్టాంగ యోగశాస్త్రం ప్రాణాయామంతో కుంభకం చేసే మార్గానికి ప్రాధాన్యం ఇచ్చిందన్నది ఒక బ్రాహ్మణి గదిలో నిర్బంధించబడిందన్న దానికి అంతరార్థపరంగా వ్యాఖ్యానించాలి. అప్పుడు ముక్తి మార్గాన్నే కోరుతూవుండే సాధకునిలోని జ్ఞాన వృత్తి బలాత్కారంగా ప్రాణాయామంతో కుంభకంలో వుండి అందువల్ల మనోవృత్తులన్నిటినీ నాశంచేసి అమనస్కత సిద్ధించగా ఆ నిర్వృతితో కైవల్యాన్ని అనగా ఆనందధామాన్ని చేరుకొంది అన్నది ఆ బ్రాహ్మణి ఆ గదిలోనే కైవల్యంపొందింది అన్నదాని అంతరార్థంగా గ్రహించాలి.

ఈ విధంగా కర్మ మార్గం, యోగ మార్గం, జ్ఞాన మార్గమూ మూడూ కూడ ఒక దానిలో ఒకటి అనుసంధింపబడి వున్నాయనీ, అవి అన్నీ ముక్తిదాయకములే అయినా జ్ఞాన మార్గానికి అనగా ఉపనిషన్మార్గానికి ప్రాధాన్యం ఉందని ఈ కథ మనకు ముక్త కంఠంగా అంతరార్థపరంగా బోధిస్తూంది.

"తమలో రామకృష్ణుల్ని చూడాలనే కోరికవున్నా యజ్ఞంచేసే బ్రహ్మణులు కంస భయం చేత ఆ పని చెయ్యలేకపోయేరు." కంసుడంటే సాధకునిలోని ముక్తి భావాన్ని హింసించే అపరాశక్తి అనే అర్థం లోగడ చెప్పుకొన్నాం.

ఐహిక సుఖలాభాలకు వేద కర్మలాచరించే త్రిగుణాలతో కట్టబడిన సాధకులు ముక్తి మార్గం గొప్పదని తెలిసికొన్నప్పటికీ కూడ తమలోని అపరాశక్తి యొక్క ప్రాబల్యంచేత ఐహిక సుఖ వాసనలకు లొంగివున్న కారణం చేత ముక్తిమార్గాన్ని సాధించడానికి పూనుకొనలేదనే అంతరార్ధ రహస్యం కంస భయంవల్ల అన్నదానిలో గ్రహించాలి.

ఎప్పుడో ఒకప్పుడు ఆ త్రిగుణకర్మ సాధకులు కూడ తాము కర్మలవల్ల పొందే సుఖాలూ, దేవతానుగ్రహాలూ కూడ తమకు కొంత కాలం మాత్రమే తాత్కాలిక సంతుష్టి నీయగలవనీ, శాశ్వతానందాన్ని అవి ఈయిలేవనీ, జ్ఞాన మార్గం ఒక్కటే శాశ్వతానందం కల్గించేదనీ అనుభవాలవల్ల తెలిసికొని ముక్తి మార్గాన్ని నడవడానికి సిద్ధపడతాడని కూడ మనం ఈ కథలో ఉపసంహార సారాంశం గ్రహించాల్సి వుంటుంది.

# గోవర్ధనోద్ధరణం

(మనో గర్వనిర్వాపణ సాధన)

మేఘాలకు ప్రభువైన ఇంద్రుడు తాము గోవుల్ని మేపే గోవర్ధన పర్వతంమీద వర్షాలు కురిపించి పంటలు పండించడానికోసమై నంద వ్రజంలోని గోపకులు ఏటేట ఇంద్రయాగాన్ని చేస్తూంటారు. ఒకప్పుడు కృష్ణుడు నందుడు మొదలగు వృద్ధ గోపకులకు నచ్చచెప్పి ఇంద్రయాగాన్ని నిరోధించేడు. "గోవులను బ్రాహ్మణులను పర్వతాలను ఉద్దేశించి చేసే యజ్ఞం నాకు సమ్మతం. కాన మనం ఇంద్రుణ్ణి కొలవడం మానివేసి ఈ పర్వతాన్ని కొలిచే వ్రతం చేద్దాం" అని కృష్ణుడు చెప్పగా అంతా ఆమోదించి ప్రదక్షిణంతో అచల వ్రతం చేయడం ఆరంభించేరు. "అహో! పశ్యత! శైలోఽసౌ, రూపీనోఽనుగ్రహం వ్యధాత్ అహా! చూడండి ఈ శైలం మనయొక్క ప్రతిరూపం. ఇదే మనపై దయచూపిస్తుంది" అని అంతా పర్వతాన్ని ధ్యానిస్తూ అచల వ్రతం చేసేరు. తన్ను ఆరాధించడం మానివేసినందుకు ఇంద్రుడు కోపించి ఆ పర్వతం పైని పెద్దగా రాళ్ళవర్షం కురిపించేడు. దానితో గోపకులు భయపడి కృష్ణుణ్ని ప్రార్థించేరు. కృష్ణుడు ఆ గోవర్ధన పర్వతాన్ని పెరికి ఒక చేత్తో పైకెత్తి గొడుగులాగు ఏడురోజులు ఎత్తిపట్టుకొని ఆ పర్వతం పెరికిన విశాలమైన గోతిభాగంలో గోపకులను నివసింప జేసేడు.

దానితో రాళ్ళవర్షం గోపకుల నేమీ బాధించలేదు. ఎంత రాళ్లవర్షం కురిసినా అది ఆ పర్వతం మీదనుండి క్రిందికి జారిపోయిందే కాని పర్వతం క్రింద గోతిభాగంలోవున్న గోవుల్ని గాని, గోపకుల్ని కాని ఏమీ బాధించలేదు ఆ కారణం చేత ఇంద్రుడు కృష్ణుని మాహాత్మ్యం తెలిసికొని అతణ్ని కొనియాడి గర్వం విడిచి "గోవిందః ఇతిలోకే, త్వాం, గాస్యంతి భువిమానవాః" నిన్ను లోకులు 'గోవిందు' డని కీర్తిస్తారని గోవింద పదాన్ని కృష్ణుడికి బిరుదుగా ఇచ్చి వెళ్ళిపోయేడు. 'నిర్వైరా, న్యభవం స్తాతః క్రూరాణ్యపి నిసర్గతః' అని శుకుడు గోవర్ధన పర్వతోద్ధరణానికి కృష్ణ మాహాత్మ్యం వల్ల సహజ శత్రువులు కూడ వైరభావంవిడిచి పెట్టాయని ఫల శ్రుతి పల్కి ఈ కథను ముగించేడు.

ఈ గోవర్ధనోద్ధరణ కథకు అంతరార్థం చెప్పుకొందాం.

'గో' పదానికి ఇంద్రియవృత్తి అని అర్థం చెప్పుకొనే వున్నాం. 'వర్ధనం' అంటే వృద్ధి పొందించడం అనే అర్థమూ, నాశనం చెయ్యడమనే అర్థమూ, రెండూ

కూడా వున్నాయి. ఇంద్రుడు అనే పదానికి మనస్సు అనే అర్థాన్ని వ్యుత్పత్తి ప్రవర్తనంతో లోగడనే చెప్పుకొని వున్నాం. ఇంద్రుణ్ణి కొలిస్తే అంటే మనస్సును ప్రోత్సహిస్తే పంటలు పండుతాయి అంటే మనస్సు ఇంద్రియాలమీద రాజు కాన మనస్సును బాగా హెచ్చరిస్తే ఇంద్రియాలచేత అది కోర్కెలు ఫలింపజేస్తుంది.

గోపకులు పంటలకోసం ఇంద్రయాగం చేస్తూంటారు అంటే సాధకునిలోని ఇంద్రియ వృత్తులు కోర్కెలు ఫలింపజేయడానికి మనస్సును రెచ్చగొట్తాయి అని అర్థం. కృష్ణుడు గోపకులు ఇంద్రయాగం చేస్తామంటే ఇంద్రయాగాన్ని నిషేధించేడు అంటే సాధకునిలోని నిర్వృతితత్త్వం మనస్సును ఇంద్రియాలచేత రెచ్చగొట్టబడడాన్ని ఆపివేయిస్తుందన్నమాట.

కృష్ణుడు గోబ్రాహ్మణా పర్వతాదులను అర్చించాలని ఇంద్రయాగానికి బదులుగా గోవర్ధన శైలానికే పూజలు చేద్దామన్నాడంటే కృష్ణుడు అంటే వృత్తిరహిత తత్త్వం వల్ల గోవుల్ని అంటే ఇంద్రియాల్ని, బ్రాహ్మణులంటే వేదాలను, పర్వతాల్ని అంటే నిశ్చలతత్త్వాన్ని ఆరాధించాలని సాధకునకు మానసిక ప్రబోధం కల్గిందన్నది అంతరార్థపరంగా గ్రహించాలి.

ఇంద్రియాల్ని పైకి రెచ్చిపోకుండా అనునయ పద్ధతితో సాధకునకు సహకరించే విధంగా ప్రోత్సహించడమే గోవుల్ని ఆరాధించడం అన్నదాని అంతరార్థ భావం. బ్రహ్మపదం వేదాన్ని చెప్పేది కాన బ్రాహ్మణపదం వేదాన్ని పొందడం అనే అర్థాన్నిస్తుంది. కాన వేదాల్లోని అంతర్నిగూఢ తత్త్వమైన నిర్వృతి (మనస్సును ఏదీ ఆవరించకుండా వుంచడం) తత్త్వాల్ని పొందడం అనేది బ్రాహ్మణ పూజకు అర్థం. అది ఆరాధనం అంటే పర్వతం కదలనిది. దానికి కదలనిది అనే అర్థంలో 'అచలం' అనేది పర్యాయపదంగా కూడ వుంది.

మనస్సును కదలకుండా తద్వారా ఇంద్రియ వృత్తుల్ని రేగకుండా చెయ్యడమనే నిశ్చలతత్త్వ సాధనమే గోవర్ధన అచలం ఆరాధనకు అర్థం. వర్ధన పదానికి నాశం చెయ్యడమనే అర్థంతో గోవర్ధనం అంటే ఇంద్రియ వృత్తుల్ని రేగకుండా చెయ్యడం అని అర్థం. గోబ్రాహ్మణాచలములనే ఈ మూడు సాధనలు కృష్ణభక్తి వల్లనే అనగా విషయవాంఛా రాహిత్యతత్త్వాన్ని పొందడం వల్లనే కల్గుతాయి అనే సాధకులలోని అంతఃప్రబోధమే కృష్ణుడు గోబ్రాహ్మణాది సమారాధన చేద్దామని చెప్పడంలోని అంతరార్థంగా గ్రహించాలి.

ఇంద్రుడు పర్వతారాధనకు ఆగ్రహించి రాళ్ళవర్షం కురిపించేడు అంటే నిశ్చలతత్త్వ సాధన చేసేటప్పుడు మనస్సుచేసే విఘ్నకార్యాలుగా రాళ్ళ వర్షాన్ని గుర్తించాలి. కృష్ణుడు గోవులకు గోపకులకు హాని కల్గకుండా గోవర్ధన పర్వతాన్ని పెకలించి పైకి గొడుగులాగు ఎత్తి పట్టుకొన్నాడంటే సాధకునిలోని విషయ రాహిత్య తత్త్వం మనస్సుచేసే విఘ్నాలు ఇంద్రియాలకు సోకకుండా ఇంద్రియాల్ని రెచ్చగొట్టే మనస్సునకు అవి అందకుండా మనస్సుకు ఆవలనున్న నిశ్చలబుద్ధి తత్త్వాన్ని సాధకులు ఆశ్రయించాలనీ, అప్పుడు జ్ఞానోదయంతో ఇంద్రియాలు మనస్సుచేసే విఘ్నాలనుండి తప్పింపబడతాయనీ సాధనా ప్రబోధాన్ని ఇందు అంతరార్థపరంగా గ్రహించాలి.

"మనసస్తు పరాబుద్ధి" అని గీతావాక్యం ప్రకారం బుద్ధి మనస్సునకు పైనుండి మనస్సును అడ్డగిస్తుంది అని తెలిసికోవాలి 'బుధ్ జ్ఞానే' అనే ధాతువువల్ల బుద్ధి అనే రూపం ఏర్పడింది కాన జ్ఞానానికే బుద్ధి అని పేరు. జ్ఞాన దృక్పథంతో కూడి వున్నప్పుడు ఇంద్రియాలు మనస్సుచేత ప్రేరేపింపబడవనే సాధనా రహస్యాన్ని ఇక్కడ సాధకులగు పాఠకులు గుర్తించాలి. ఇది అనుభవంలో ప్రతి సాధకునకు తెలిసిన సంగతే.

కృష్ణుడు ఏడురోజులు గోవర్ధన పర్వతాన్ని ఒక్కచేత్తో ఎత్తి వుంచాడు అంటే సాధకునిలోని సప్త ధాతువుల్లోను కృష్ణతత్త్వం అనగా విషయవాంఛా రాహిత్యతత్త్వం నెలకొనివుండనీ, అది అద్వైత స్థితికి కల్గే సాధనా చరమస్థితి అనీ సాధకులు గ్రహించాలి. ఒక చేత్తో అంటే రెండవది లేకుండా అనగా అద్వైతంతో అనే అర్థం ఇక్కడ గ్రహించాలి కృష్ణుడు 'అహో! పర్వతశైలోయం రూపోనోఽను గ్రహం వ్యధాత్' అని ఈ అచలం మనయొక్క ప్రతిబింబం అని అన్నాడంటే మనలోని నిశ్చలతత్త్వం ఈ శైలంలాగు కదలకుండా వుండాలి. ఈ నిశ్చల సాధనయే మనలను అనుగ్రహిస్తుంది అన్న దానిని అంతరార్థపరంగా భావించాలి.

గోవర్ధన పర్వతాన్ని పెకలించగా ఏర్పడిన గర్త (గోయి) భాగంలోనికి గోవుల్ని, గోపకుల్ని చేరండి 'అని కృష్ణుడు అన్నాడంటే' ఇంద్రియ వృత్తుల్ని వాటి ఉపవృత్తుల్ని హృదయ గుహలోనున్న నిశ్చల పరతత్త్వ సాన్నిధ్యంలో చేర్చాలి అని సాధకులకు చేసే ప్రబోధంగా గ్రహించాలి. హృదయగుహలో పరమాత్మతత్త్వం నివసిస్తూ వుంటుంది. అదే ప్రశాంతస్థితి నిస్తుందనీ, ఆ ప్రశాంతస్థితియే ఆనంద

ధామమనీ, శ్రీ రమణమహర్షులవారు కూడ చెప్పేరు. ఈ రమణ రహస్యాన్ని పై కృష్ణ వాక్యాలకు అర్థంగా గ్రహించాలి.

కృష్ణుణ్ణి "గోవింద ఇతిలోకే త్వాం గాస్యంతి భువి మానవాః" గోవిందుడని నిన్ను లోకులు కొనియాడుతారని ఇంద్రుడన్నాడంటే ఇంద్రియ వృత్తులను తెలిసికొనే తత్త్వం కృష్ణభక్తి తత్త్వం అనీ ఆ విషయ రాహిత్యతత్త్వాన్ని సాధకుల మనస్సు అనుభవిస్తుందని చెప్పడంగా ఇంద్రస్తుతికి అర్థం గ్రహించవచ్చును.

శ్రీ శుకుడు పరీక్షిత్తునకు కథ ముగిస్తూ 'నిర్వైరాణ్యభవం స్తాత ! క్రూరాణ్యపి నిసర్గతః' అన్నాడు సహజంగా అతి క్రూరములైన భావాలు కూడ కృష్ణతత్త్వంతో పరస్పరం విరోధం లేకుండా స్నేహంగా ఉంటాయి అన్నాడన్నమాట. విషయ వాంఛా రహిత తత్త్వం సాధిస్తే మనస్సులో కామక్రోధాదులన్నీ శాంత భావంతో అన్యోన్య మైత్రితో సంచరిస్తాయి అనీ, అదే పరమ ప్రశాంతి నిలయ సాధన అని గోవర్ధనోద్ధరణ కథా సారాంశంగా మనం గ్రహించాలి.

## పాఠకుల సందేహములు, వాని నివారణ

ఇక ఈ దశమస్కంధం పూర్వార్ధంలో రాబోయే గొప్ప ఘట్టం 'రాసలీలా' ఘట్టం. ఇది భాగవతం మొత్తం అంతలోను కూడ చాల ప్రధానమైన ఘట్టం. ఇందులో జీవతత్త్వం బ్రహ్మతత్త్వంలో లీనమైపోవడం అనే సాధన చెప్పబడివుంది. ఆ కారణంగా దీనికున్న ప్రాధాన్యం ఇంతింతకాదు. భాగవతాన్ని వ్యతిరేకంగా విమర్శించే దుర్విమర్శలకు కూడ ఇది ప్రధాన ఘట్టమే. కృష్ణునకు జారత్వాన్ని అంటగట్టే విష విమర్శనలు అన్నీ ఈ ఘట్టాన్ని ఆధారం చేసికొని వుంటాయి.

ఈ రాసలీలా ఘట్టాన్ని ప్రవేశపెట్టే ముందు కృష్ణుడు అసలు అవతార మానవరూపం కానేకాదనీ, అది ఒక ఆధ్యాత్మిక తత్త్వం అనీ ఆ తత్త్వాన్ని ఆకళింపు చుకొని అనుభూతికి తెచ్చుకోవడమే భాగవత పరమోద్దేశమనీ చెప్పేవారి దృష్టిని ఇక్కడ పాఠకులకు వివరించడం ఆవశ్యకమని భావిస్తూ పురాణాల కవులనుండి నేటి కవుల వరకు కృష్ణ పదానికి ఏ విధంగా అర్థాలు చెప్పేరో సోదాహరణంగా ఇక్కడ వివరిస్తాను.

శ్లో॥ స ఆత్మా, సపరం బ్రహ్మ కృష్ణ ఇత్యభి ధీయతే
కృషిస్తద్భక్తి వచనో, నశ్చతద్దాస్య వాచకః
భక్తిదాస్య ప్రదాతాయః సచకృష్ణః ప్రకీర్తితః
సకృష్ణః సర్వస్రష్టా ఽఽ ఏక ఏవహి॥

(దేవీ భాగవతం 8 స్కం, 2 అధ్యా, 22 శ్లో)

"కృష్ణ శబ్దోహి యోగ రూఢ్యా గోలోక
వాసీ దేవతాయాం రూఢః। కేవలం యోగా
ర్థ మాదాయతు పరమాత్మని ప్రయుక్తః ఏవం।"

నీలకంఠయ వ్యాఖ్య.

ఆత్మ, పర్బ్రహ్మ అనే అర్ధాలు 'కృష్ణ' పదంతో చెప్పబడుతూన్నాయి. 'కృషి' అను ధాతువునకు భక్తి అని అర్ధం. 'న' అనేది 'దాస్య' ము అనే అర్ధాన్నిస్తుంది. కాన భక్తి దాస్యాన్నిచ్చేవాడు అని కృష్ణ పదానికి వ్యుత్పత్త్యర్థం. ఆ కృష్ణుడే అన్నిటిని ఆదిలో సృజించేడు. అతడు అద్వైతరూపం అని దేవీ భాగవతంలో చెప్పబడి వుంది.

"'కృష్ణ' అనే శబ్దం వ్యుత్పత్త్యర్థంచేత ప్రసిద్ధమైనది. గోలోకంలోని దేవత అన్న అర్ధంలో కృష్ణ శబ్దం స్థిరపడింది. (గోలోకం అంటే ఇంద్రియ వృత్తుల సమూహం) ఈ విధంగా కేవలం వ్యుత్పత్త్యర్థం-మీద ఆధారపడి 'కృష్ణ' శబ్దం ఈ విధంగా పరమాత్మ అను అర్ధమందు ప్రయోగింపబడింది" అని నీలకంఠయ వ్యాఖ్యాలో వుంది.

శ్లో॥ కృషి ర్భూవాచక శ్శబ్దః ణశ్చ నిర్వృతి వాచకః
తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభి ధీయతీ
ఏవం శాస్త్ర ప్రసిద్ధ త్వాత్ కృష్ణోబ్రహ్మైవ నాపరః
జీవస్యై వతు బ్రహ్మత్వం స్ఫుటమౌ పనిషన్మతే
అధ్యాత్మావ సథం కృత్వాజీవో కృష్ణా బ్రహ్మత్మ నాస్థితః
సఏవాహమితి జ్ఞాతుం ఆఖ్యాసై సత్వ ముచ్యతే
నాభిరతను మధ్యానాం దేవక్యా నాస్య విద్యతే
పతిత్వం వాకిశోరత్వం సర్వ మాతల్పితం జడాః ?

కాంతాషోడశ సాహస్రం కళాసుపరి కల్ప్యతే
నాడీ శతే చాష్టదిక్షు శేషమష్టోత్తరం శతం
కళానాడీ దిశస్సర్వాః ఆధ్యాత్మని ప్రతిష్ఠతాః
ఆత్మనశ్చ కళాదీనాం అతో దాంపత్య వర్ణనం
అన్యథా ఘోర సంసార వర్ణనాత్ కిం ప్రయోజనం ?
అతోఽధ్యాత్మం పురస్కృత్య ఆత్మలాభాయ వైదికే
లౌకికే సర్వమాఖ్యాతం తత్త్వమేకం పరోక్షతః
పురాణానాం హి ప్రామాణ్యం వేదార్థ పరిబృంహణం
సలేశామర్థవత్త్వం స్యాత్ అర్థాంతర పరిగ్రహే
లోకాశ్చలోకి పాలాశ్చ ఆత్మచాప్య ఖిలం జగత్
అధ్యాత్మ స్థిత మిత్యేవ చైతరే యేహి శ్రూయతే
నరామో, నచకృష్ణో, సీతా, వానాపి, రుక్మిణీ
శారీరక స్యమీమాంసా ఆఖ్యానైర్బ హుభిః కృతాః
న యుక్త్యా కల్పితమిదం నాపూర్వ మిహ బోధితం
పూర్వైర్వ్యాఖ్యాతృభిః సమ్యగ్భాషితం జ్ఞాపితం మదా
'సోపాధిక బ్రహ్మ విద్యా దర్పణం.'

తా॥ 'కృషిః' అనే ధాతువుకు భూ వాచక శబ్దం అర్థం. 'న' అనేది నిర్వృతి (ఆవరణం లేనిది) వాచకం. ఆ రెండింటి కలయికయే 'కృష్ణ' శబ్దం. అంటే భూ సంబంధమైన విషయావరణం లేనిది అన్నది 'కృష్ణ' అనబడుతుంది. అదే పరబ్రహ్మ తత్త్వం అంటే. ఈ విధంగా శాస్త్రం చెప్తూంది. కృష్ణుడు పరబ్రహ్మయే కాని మరొ కడు కానేకాదు. బ్రహ్మ అంటే మనలోని జీవుడే అని ఉపనిషత్తులు చెప్తున్నాయి.

దేహంలో మనస్సునందు నివాస మేర్పరచుకొన్న జీవుడే కృష్ణుడుగా వున్నాడు. 'సోఽహం' భావంతో అనగా నేను అనుకొనే 'అహం స్ఫూర్తియే' ఆ పరబ్రహ్మం అని తెలియడంకోసమే జీవుణ్ణి కృష్ణుడుగా చెప్పి కృష్ణ కథలు కట్టి తత్త్వాన్ని ప్రబోధించేరు మహర్షులు. అంతేకాని గోపికలు కృష్ణుని భార్యలూ కారు, కృష్ణుడికి దేవకీదేవి తల్లీకాదు, ఓ మందబుద్ధులారా ! ఇదంతా కల్పనయే కాని నిజం కాదు నమ్మండి. పదహారువేల గోపికలంటే దేహంలోని పదహారువేల సంఖ్య గల కళలు అని అర్థం.

దేహంలో ప్రకాశించే జ్ఞానజ్యోతి యొక్క కిరణాలే ఆ కళలంటే, నూట ఎనిమండ్రుగురు భార్యలంటే దేహంలోని నాడులు నూరు. నూర్గురుగాను దేహంలోని ఎనిమిదివైపుల దిక్కులు ఎనమండుగురు అష్టమహిషులగాను మొత్తం 108 గురు కృష్ణుడికి భార్యలుగా చెప్పబడ్డారు. ఎనిమిది దిక్కులు అష్టమహిషులుగా పేర్కొనబడ్డారు. దేహంలోని కళలూ, నాడులూ, దిక్కులూ అన్నీ అధ్యాత్మ విషయాలుగా ప్రసిద్ధములై యున్నాయి.

దేహంలోని పరమాత్మకు దేహంలోని కళలు నాడులు మొదలైనవి భార్యలుగా ఉపమానంతో వ్యంగ్యం కోసం చెప్పబడ్డాయి. అంటే భార్య భర్తచేత పోషింపబడేది అల్లాగే పరమాత్మచేత (చైతన్యంచేత) నాడులూ, కళలూ, జీవింపబడతాయని అర్థం. ఈ విధంగా గోపికలకు కృష్ణునికి దాంపత్యం కల్పింపబడింది. అంతేకాని నిజం కాదు. ఇదే అర్థం కాకపోతే ఇన్నివేలమంది భార్యలతో నున్న ఒకని సంసారాన్నే కృష్ణ కథగా భాగవతంలో చెప్పడంవల్ల ఈ ఘోరమైన సంసార వర్ణనం చేయడంవల్ల వ్యాసమహర్షి ఏం ప్రయోజనం సాధించినట్లు ? జరిగిన కథే ఐతే మాత్రం ఈ కథ వల్ల ప్రజలకు ఏం సందేశం ఇవ్వబడింది ? భాగవతంలో దానికి చోటేమిటి? ప్రజలు ఈ సంసారిక వర్ణనలు చదివి, విని ఏమి సాధించినట్లు ?

పరమాత్మను సాధించడంకోసం సాధకుల ఉపయోగంకోసం మనస్సులో జరిగే వానిని అధ్యాత్మ పురస్కరించుకొని వేదంలోను లౌకిక పురాణాల్లోను కూడ అద్వైతతత్వాన్ని పరోక్షంచేసి కథలుగా చెప్పబడ్డాయి. పురాణాలకు ప్రామాణ్యం వేదార్థాన్ని విస్తరింపజెయ్యడమే. అందుకోసం అంతరార్థం గర్భితంగా చేసి ప్రజలలో జరుగుచున్న చరిత్ర రీతిగా చెప్తే వారికి సులభంగా తెలియవస్తుందని కథలుగా చెప్పేరు.

ఆ కథల్లోంచి వేదాంతార్థం తీసికొనగల్గినపుడే వానికి ప్రయోజనం వుంటుంది. "లోకములూ, లోకాధీశులూ; అఖిలజగత్తూ ఆత్మయే. ఇవన్నీ మనలో ఉన్నవే. ఇవి పరోక్షంచేసి కథలుగా కల్పించబడి చెప్పబడ్డాయి" అని ఐతరీ యోపనిషత్తు స్పష్టంగానే చెప్తూంది కూడ. రాముడూ లేడు, కృష్ణుడూ లేడు, సీతా లేదు, రుక్మిణీ లేదు ఇదంతా శారీరక మీమాంసయే. (వ్యాసుడు వ్రాసిన బ్రహ్మ సూత్రాలకు శారీరక మీమాంస అనే మరో పేరు కూడా వుండి అన్నప్పుడు మనం అసలే అది మాన్నించనక్కరలేదు.) ఈ శారీరక మీమాంసయే అనేక కథలుగా సృష్టించి చెప్పబడింది.

"ఈ పై విషయం యావత్తూ నేను స్వయంగా చెప్పిన కల్పన కాదు. ఇది పూర్వంచేత చెప్పబడిందే కాని ఈనాడు చెప్తూన్నది కానేకాదు. వారు చెప్పినదే నేనూ చెప్పేను. పూర్వ వ్యాఖ్యాతలు చక్కగా ఈ పై విషయాల్ని స్పష్టం చేసి వుంచారు. వాటినే నేను మీకు జ్ఞాపకం చేస్తున్నాను అంతే" అని 'సోపాధిక బ్రహ్మ విద్యా దర్పణం' అనే సంస్కృత గ్రంథంలో చెప్పబడి వుంది ఆ గ్రంథాన్ని స్వయం ప్రకాశ బ్రహ్మానంద స్వాముల వారు వ్రాశేరు. ఈ గ్రంథం సంస్కృత భాషలో వుంది. ఇది "ద్వినవత్య పస్కృతన వశతోత్తర చతుస్సహస్రేమ కల్యబ్దేషు వ్యతీతేషు ఖరనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధషష్ఠ్యం సమాప్తి మభాజాత అని అందులో వ్రాయ బడి వుంది అనగా కల్యాద్యబ్ద సంఖ్య 4992 లో ఖర సంవత్సరంలో ఆశ్వియుజ శుద్ధ షష్ఠి రోజున ఈ గ్రంథం పూర్తి చేయబడింది అని అందులో వుంది. ఈ గ్రంథాన్ని 1891 వ సంవత్సరంలోని అక్టోబరు నెల 8 వ తేదీని మద్రాసులోని నీలారెడ్డి అప్పైలకు అనే ప్రెస్సులో ముద్రింపబడిందిగా అందులోనే వుంది. దాని ప్రాచీనతను తెల్పడానికే పై విషయాలు మీకు తెల్పడం జరిగింది 'మహర్షి' 'అరవింద ఘోష' కృష్ణుణ్ణి గూర్చి ఇల్లా అన్నాడు– "వెన్నను దొంగలించిన కారణం చేత కృష్ణుడు 'నవనీత చోరుడు' అని పేరు పడ్డాడు. కృష్ణుడు ఏమి దొంగతనం చేసేడు? దీనికి ముందు ఒక ప్రశ్న వేసికోవాలి : అతడు దొంగలించిన వస్తువు అసలు అతని దేనా? లేక ప్రతి వారికి సంబంధించిందా ?

గోపికలు తమలో దాచి వుంచింది నిజానికి పరమాత్మదే. అది తమలో నిగూఢంగా వుందని వాళ్ళకు తెలియదు. అది పరమాత్మదే అని కూడ వారెప్పుడూ అనుకోలేదు కూడ అది వారిలో, వారి సొంతంగానే ఉంది.

కృష్ణుడి మీద ముఖ్యంగా ఉన్న అపవాదు 'అతడు గోపికలతో నిత్యం సంపర్కం కల్గి వుంటాడన్నది' కృష్ణుడు ఇతరుల భార్యలతో క్రీడిస్తూండడం అనేది ఎట్లా సాధ్యపడేది ? శాస్త్రీయ గ్రంథాలు 'కృష్ణుడు బృందావనంలో గోపికలతో క్రీడించేడు' అని అన్నీ ముక్త కంఠంతో వర్ణించేయి. అందులో ముఖ్యమైనది భాగ వతం దశమస్కంధం పూర్వార్ధంలో చెప్పబడ్డ 'రాసక్రీడలు' వీనినే 'రాస లీలలు' అని కూడ అంటారు.

భాగవతంలో నూరు, లేక నూటపది, కోట్ల ( 100 or 110 crores ) గోపికలు కృష్ణునితో క్రీడించేరని వుంది. బహుశః ఆ సంఖ్య ప్రపంచంలో వున్న సర్వ జీవరాశి యొక్క సంఖ్య అనే భావం అయివుంటుంది. ఇందులో గోపికా

స్త్రీలు కృష్ణుడు వేణునాదం చేస్తూంటే ప్రక్క ప్రక్కగా నిలుచుండి గీతాలు పాడుతూ నాట్యం చేశారు. ఆ నాట్యంలో వారు తమ అందచందాలతో ఆతనిని కౌగలించు కొన్నారు కూడ.

అందరూ యమునా సైకత స్థలంలో సమావేశమై కృష్ణుణ్ణి సంకీర్తనం చేశారు. అందులో ఒక గోపిక పాడిన గీతం ఈ క్రింది విధంగా వుంది.

'ప్రియుడా! నీవు గొల్లపిల్లవాడవు కావు. నీవు అందఱి జీవుల్లోను ఉండే 'అంతస్సాక్షివి' (అంతరాత్మవు) నీవు ప్రపంచోద్ధరణ కోసం గోపాలకుడవుగా వున్నావు. మఱొక గోపిక ఈ క్రింద విధంగా పాడింది.

"నీ అధరామృతం మాకు ప్రసాదించు. అది మాలో ప్రేమజ్యోతిగా ప్రకాశిస్తుంది. అది మాకు ఇతర విషయానందాల మీద ఆసక్తిని నశింపు చేస్తుంది."

ఈ విధంగా ప్రతి గోపికా స్త్రీ కూడ తానొక్కతే కృష్ణుణ్ని తమలో వుంచు కోడానికి అర్హత కల్గినట్లు కన్పిస్తూంది.

'రాస లీలలు' కూడ ఒక అంతరార్థ గర్భితమైన కథ (Allegory) ఇది సమస్త జీవకోటికి భగవంతుని యందున్న ప్రేమ గాథగా అర్థమౌతుంది. గోపికలే జీవాత్మలు, ప్రతి జీవిలోను ఉండే చైతన్యరూప జీవాత్మలు. ఆ జీవాత్మలన్నీ పరమాత్మలో చేరుకొని కైవల్యం పొందాలనే తపనతో ఉన్నాయి. కృష్ణుడు ఆత్మా రాముడు. అంటే జీవాత్మలలో ఉండే అఖండానందాన్ని కల్గించే పరంజ్యోతి. 'వాసు దేవుడు' అనే ఆతని పేరు ఎవనిలో అన్ని జీవాత్మలు నివసించి ఉంటాయో లేక అన్ని జీవాత్మలలోనూ ఎవడు నివసించి వుంటాడో వానికి 'వాసుదేవు' డని పేరు

'రాసక్రీడ' అంటే దివ్యజ్యోతి యొక్క క్రీడారంగం (sports) అనేది తప్ప మఱొకటి అర్థం కాదు. ఆ క్రీడారంగంలో ఎక్కడ పడితే అక్కడ ప్రతి ఆటగాళ్ళు ప్రక్క ప్రక్క చేరుకొనే వుంటారు.

("రాధ కూడ గోపికా స్త్రీలలో ఒక్కర్తె. ఆమె భర్త పేరు అయనఘోషుడు. ఆమె కృష్ణునకు మిక్కిలి ఇష్టురాలు. రాధ అంటే ఆరాధనం అని అర్థం, ఆమె అయన ఘోషుని భార్య అంటే- 'ఘోష' అంటే గొల్లపల్లె, 'అయన' అంటే తిరుగుట అని అర్థం. గొల్లపల్లెలో అందఱితోను తిఱుగాడుతూ వుండే భగవదా రాధనా వృత్తియే అయనఘోషుని భార్య రాధ అన్నదానికి అంతరార్థం.)

కృష్ణునకు 16008 గురు భార్యలు ఉన్నారని కూడ వుంది. వారందరితో ప్రతినిత్యం కృష్ణుడు ఉంటూన్నా, ఆతడు నిత్య బ్రహ్మచారి అని చెప్పబడ్డాడు.

ఈ విషయాలన్నీ ఉన్నత దృక్పథంతో చూస్తే ఈ నగ్న శృంగార కథలన్నీ పరమాత్మతో ప్రేమానుబంధం కల్గిన జీవాత్మలు పరమాత్మలో ఐక్యం కావడాన్ని చెప్పే సాధనలుగానే అన్వయించక తప్పదు.

'కృష్ణ' అంటే 'కర్షయతి ఇతి కృష్ణః' అనే వ్యుత్పత్తితో, జీవాత్మలను ఆకర్షించే పరతత్త్వంగా అర్థం చెప్పాలి."

పైని వ్రాసినవి అరవిందుని మాటలు. అవి ఇంగ్లీషులో **'The Illustrated weekly of India'** అనే వార పత్రికలో 27 ఆగష్టు 1972లో ప్రకటింపబడిన ఆంగ్ల వ్యాసానికి అనువాదం చేయబడిందిగా పాఠకులు గ్రహింతురు గాక!

అరవిందుడు ఇంకోచోట హిందూమతాన్ని గూర్చి చెప్తూ, "అన్ని ఇతర మతాలకు భిన్నమైనది హిందూమతం. ఇతర సర్వ ప్రపంచ మతాలకు అనగా స్వదేశీయ పరదేశీయ మతాలకు కేవలం కొన్ని నమ్మకాలు ప్రధానం. శ్రద్ధ, ఆరాధనా విధానాలతో పరిమితములైనవే అవి అన్నీ కూడ.

కాని హిందూ ధర్మం ఒకానొక ప్రత్యక్ష జీవన విధానాన్ని చెప్తూంది. మానవాళి విముక్తికి ఈ భారతదేశంలో అవలంబింపబడుతూన్న ధర్మమే అది. భారతదేశం ప్రపంచంలో యావన్మానవాళి కోసమే తన సందేశాన్నిస్తోంది. అంతే కాని తన కొఱకు మాత్రం పరిమితమైనది ఆ సందేశం కాదు.

పై అభిప్రాయాలు పాఠకులలో అద్వైత దృష్టి దృఢపడడానికి ఇంతగా వ్రాసేను. గ్రంథ విస్తరణకు పాఠకులు నన్ను మన్నిస్తారు గాక!

(ప్రథమ ఘట్టం)

# రాసక్రీడలు

(జీవ బ్రహ్మైక్య సాధన)

శ్లో॥ విషయాః వినివర్తంతే
నిరాహారస్య దేహినః
రసవర్జం, రసోఽప్యస్య
పరం దృష్ట్వా నివర్తతే

అని వ్యాసుడు కృష్ణుని చేత అర్జునునకు చెప్పించిన భగవద్గీతలో 2వ అధ్యా 58 శ్లోకంగా చెప్పబడింది.

"ఆహారం వేసి పోషించకపోతే విషయాలు తమంతట తామే వెనక్కి పోతాయి. కాని ఆ విషయాలకు సంబంధించి 'రసం' అంటే వాసనా బీజం మాత్రం పరమాత్మను దర్శించిన అనుభవం కల్గినపుడే సాధకుణ్ణి విడిచిపెట్టి పోతుంది. అని పై శ్లోకానికి భావం. 'రసోవైసః' అని శాస్త్రం చెప్తూంది. రస అంటే 'అనిర్వాచ్యమైన ఆ పరమాత్మయే' అని దాని భావం. ఈ ప్రకారం 'రస' పదం యొక్క అర్థంలోనే స్వార్థమందు 'అణ్' ప్రత్యయం వచ్చిన రూపమే అయిన 'రాస' పదానికి జన్మ వాసనా కారణం అనీ, పరమాత్మ అనీ కూడ అర్థం వస్తుంది. ఇప్పుడు 'రాసక్రీడ' అంటే వాసనా జన్మ కారణాలైన మూలరస బీజముల యొక్క ఆనందరూప పరబ్రహ్మ స్వరూపం యొక్క క్రీడలు అని అర్థం. సాధకునిలోని వాసనా బీజములు ఆనంద రూప పరబ్రహ్మంతో లీనం కావడమునకు జరిపే సాధనయే జీవబ్రహ్మైక్య సాధన అంటే.

సాధకునిలో, ఎంతగా సాధన చేసినా, భగవద్గీతా శ్లోకంలో చెప్పినట్లు 'రసం' మిగిలియే యుంటుంది. ఆ మిగిలిన రసాన్ని కూడ ఓడ్చి వేస్తేనే కాని ముక్తి కల్గదు. అందుకు పరమాత్మ యొక్క తోడ్పాటు కావలసిందే కాని సాధకుని కేవల సాధన వల్లనే జరిగే పని కాదది. సాధకుడు విషయ వాసనలను పెంచే పనులు చేయకుండా ఉండడమే అతని యావత్తు సాధన ఆపైని సాధకునిలో మిగిలిపోయిన రసాన్ని పరమాత్మ తనలో ఐక్యం చేసికొంటాడు. రసస్వరూపుడే పరమాత్మ. (రసో వైసః) కనుక తన స్వరూపంలో సాధకునిలోని రసం సమూలం ఓడ్చివేయడమే ఐక్యం చేసికోవడమూ, మోక్షం ఇవ్వడమూ అంటే అదే రాసక్రీడల్లో చెప్పబడింది. బాహ్యార్థంలో 'రసం' అంటే శృంగార రసం అర్థం. బాహ్యానికి రాసక్రీడలు గోపికలతో కృష్ణుడు శృంగారసాస్వాదం చేయడమనేదే అర్థం.

దశమస్కంధం పూర్వార్థంలోని 29వ అధ్యాయం మొదలుకొని 33వ అధ్యాయం వరకు వున్న అయిదు అధ్యాయములకు 'రాస పంచాధ్యాయి' అని పేరు. రాసక్రీడలు ఈ అయిదు అధ్యాయములలోను చెప్పబడ్డాయి. కాన ఆ పేరు వానికి వచ్చింది. భాగవతంలో రాసక్రీడలకు ఆధ్యాత్మికంగా చాల ప్రాధాన్యం వుంది.

శరత్కాల మగుటచే వికసించిన మల్లికలు గల ఆ రాత్రులను చూచి కృష్ణుడు యోగమాయాశ్రితుడై రమించుటకై ఆసక్తి పడ్డాడు. ఆ ఆసక్తితో ఒక శరద్రాత్రి

యందు బృందావనంలో శ్రీకృష్ణుడు వేణుగానం చేయడం ప్రారంభించేడు. జగన్మోహనమైన ఆ వేణుగానాన్ని ఆలించి గోకులంలో నివసిస్తూన్న గోపికాస్త్రీలు పరవశలై తమ తమ పనులు అక్కడి వక్కడ విడిచివేసి బృందావనానికి చేరుకొన్నారు.

దూడలను విప్పి ఆవులను పాలు పితుకుట మానివేసిన కొందఱు, పాలు పితికి వానిని కాచుట మానివేసిన కొందఱు, కాచిన పాలు బిడ్డలకు త్రాగించుట మానివేసి కొందఱు, ఇండ్లకు వచ్చిన పతులకు పరిచర్యలు మానివేసి కొందఱు, తింటూ తింటూన్న అన్నం తినడం మానివేసి కొందఱు, అలంకరించుకొనే పని మానివేసి కొందఱు, వంటలు వండుట విడిచివేసి కొందఱు, అందఱు తమ్ము తమ సోదరులు, తల్లిదండ్రులు, భర్తలు, అత్త మామలు వారించుచున్నను వినిపించుకొనకమన్మథోద్రేకం నోర్వలేక త్వర త్వర పరువులిడి బృందావనం చేరుకొన్నారు.

గోపాల కృష్ణుడు వారిని చూచి "ఇక్కడెందుకు వచ్చేరు మీరు? ఇది సింహ శార్దూలాదులు తిరిగే రాత్రివేళ. యమునా నదీ తీరమందలి ఈ అరణ్యానికి ఇప్పుడు ఎందుకు వచ్చేరు? మీ మగవారిని, తల్లిదండ్రుల్ని, బిడ్డల్ని సేవించడం విడిచి యిటు రావడం భావ్యం కాదు? ఇది కూడని పని. మీ మీ యిండ్లకు పొండి?" అని కసరి హితం చెప్పేడు. వారు ఆ మాటల్ని వినలేదు. శ్రీకృష్ణుని విడిచి వారు తిరిగి పోలేమన్నారు. తమ పంచబాణుని తాపం చల్లార్చ వలసిందిగా కృష్ణుణ్ని ప్రాధేయ పడ్డారు.

అంత కృష్ణుడు వారితో కలిసి రమించేడు. కొందర్ని కొంటె చూపులతో చూచి, కొందర్ని బట్టలు పట్టుకొని లాగి, కొందర్ని జడలు పట్టుకొని లాగి, వడ్డాణములు ఊడలాగు నవుములు లాగి, కౌగలించి, స్తనములంటి, నఖక్షతాలు చేసి అధరాలు ముద్దాడి పానంచేసి, వారిలోని మన్మథ తాపాన్ని చల్లార్చుటకు నానా విధాల వారితో క్రీడించేడు.

ఈ విధంగా వారితో క్రీడిస్తూ క్రీడిస్తూ కృష్ణుడు అంతలో అంతర్ధానమయ్యేడు. గోపికలు వాని కోసం అడవి అంతా గాలించేరు. చెట్లను, పుట్టలను కృష్ణుని జాడను గూర్చి వెర్రిగా అడిగేరు.

తర్వాత వారందఱు బాలకృష్ణ డిన్నాళ్ళూ యదుకులంలో చేసిన చేష్టలను తలచుకొని, పూతనావధాది ఘట్టాల్ని అన్నీ తాము పాత్రధారులుగా నాటకాల్ని ప్రదర్శించేరు. తిర్గుతూ, తిర్గుతూ అటు తర్వాత ఒక చోట ఇద్దరు నడిచి వెళ్ళినట్లున్న

కొన్ని యడుగుల జాడలు చూచి కృష్ణుడు ఎవతెనో ఒక గోపికను తనతో తీసికొని పోయినట్లు గుర్తించేరు. ఆ గోపిక 'ఎవరై వుంటుందా!' అని వచ్చిన వాదంవఖని అడుగుకుంటూ గాలించేరు. చివరకు అది * 'రాధ' యని తేల్చుకొన్నారు. రాధతో కృష్ణుడు విహరించిన చిహ్నాల వెంటబడి ఇంకా వెదకటం సాగించేరు.

ఒకచోట రాధ ఒక్కతే విచారంగా కూర్చుండడం చూచేరు. ఆమెను అందఱూ గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నించేరు. ఆమె తన్ను కూడ వంచించి కృష్ణుడు మాయమై పోయేడని చెప్పి యేడ్చింది.

ఆ పిమ్మట గోపికలు అందఱూ కలిసి కృష్ణుడి గుణగాథలు కీర్తిస్తూ గీతాలు పాడేరు. అంతలో కృష్ణుడు వారిమధ్య ప్రత్యక్షమయ్యేడు. అంత అందఱ గోపికలతోను కలిసి కృష్ణుడు రాసక్రీడలు జరిగించేడు.

గోపిక ప్రక్క కృష్ణుడు తిరిగి గోపిక ఆమె ప్రక్క తిరిగి కృష్ణుడు ఈ విధంగా అసంఖ్యాకములైన రూపాలతో ప్రతి గోపికతోనూ కృష్ణుడు కలిసి మండలా కారంగా ఏర్పడి నృత్యం చేసేడు. ఆ నృత్యమే రాసలీలా నృత్యం. దాన్ని భాగవతంలో అయిదు అధ్యాయాల్లో వ్యాసమహర్షి వ్రాసేడు.

యమునా తీరారణ్యంలో రాత్రి కృష్ణుడు గోపికలతో నిజంగానే క్రీడించాలనే వేణుగానంతో వారిని పిలిచేడా? ఆ గానం విని గోకులంలోని స్త్రీలంతా నిజంగా మన్మధ మోహంతోనే ప్రక్కల్లోని భర్తలను ప్రక్కల్లోని బిడ్డల్ని కూడ విడిచి కృష్ణుణ్ణి చేరుకొన్నారా? ఇది జరిగే పనేనా? జరిగితే ఈ పనికి ఎవరు హర్షిస్తారని భాగవతం లాంటి పవిత్ర గ్రంథంలో వ్యాసుడు వ్రాసేడు?

గోపికలను తానై వేణుగానంతో కావాలని పిలిచి, వాళ్ళు వస్తే, 'మీరెందుకు వచ్చేరు. మీరు మీ భర్తలను, అత్తమామలను, తల్లిదండ్రులను వారు వెళ్ళద్దంటూంటే వారి మాటల్ని కాదని రావచ్చునా! మీ యిళ్ళకు మీరు పొండ'ని కృష్ణుడు వారిని తిరస్కరించేడా? కావాలని రమ్మని పిలిచి తిరస్కరించడం ఏమిటి?

అందరి గోపికా స్త్రీలతోనూ ఒక్కడు ఒక్క రాత్రి రమించేడా? ఏమిటీ రంకు పురాణం? ఇది అంతా కృష్ణుని లీలలనడం కృష్ణుడికిచ్చే గౌరవానికి ఏమి తగివుంది? ఏదో ఏదో తికమిక చేసి తమకే నిజంగా అర్థం కాని రీతిగా సగుణం నిల్పడానికి భగవల్లీల లంటూ వ్యాఖ్యాతలు వ్యాఖ్యానాలు చేశారు. అసలు భాగవతానికి మొత్తానికే

* 'రాధ' అనే పేరు వ్యాసుడు మూలంలో వ్రాయలేదు కాని వ్యాఖ్యాతలు ఊహాగానం చేసి వ్రాసేరు. ఒక గోపిక అని మాత్రమే మూలంలో వుంది.

అంతరార్థపరంగా విప్పి చెప్పుకొంటేనేగాని వ్యాసమహర్షి ఈ ఘట్టంలో సర్వం చేసి కోలేము. ఈ రాస పంచాధ్యాయిలో కొన్ని శ్లోకాల్లో సగుణ నిర్గుణ రూపం కలగలుపు చేసి వ్యాసుడు చెప్పినట్లు కన్పిస్తుంది. సగుణంగా కన్పించిన దానిలో కూడ అంతరార్థ పరంగా నిర్గుణపరంగా చెప్పుకొంటేనే, తికమిక లేకుండా సరాసరిగా ఒకే అర్థం అందుతుంది. ఈ పంచాధ్యాయిలో ఎక్కడ సగుణం వుందో ఎక్కడ అశ్లీలాదిక విషయాలున్నాయో ఆ యా స్థలాల్లో మాత్రం మూల శ్లోకాలు కూడ ఉదహరించి అంతరార్థం వ్రాస్తాను.

## ప్రథమ ఘట్టం

# రాస పంచాధ్యాయి

## దశమ స్కంధం పూర్వార్థం 29 అధ్యాయం

[పంచకోశాల్లోని జీవుని వృత్తులు బ్రహ్మైక్యం పొందుట]

శ్లో॥ భగవానపి, తాః రాత్రీః
శరదోత్ఫుల్ల మల్లికాః
వీక్ష్యరం తుం మనశ్చక్రే
యోగమాయా ముపాశ్రితః

"భగవంతుడు కూడ శరదృతువుచే వికసించిన మల్లికలుగల ఆ రాత్రులను ఆనందించేందుకు యోగమాయతో కూడిన వాడైనాడు" అని తాత్పర్యం. మార్గశీర్ష మాసంలో జరిగిన గోపికా వస్త్రాపహరణంలో గోపికాస్త్రీలను సాగనంపుతూ కృష్ణుడు "మయేమాః దంస్యతే క్షపాః" ఈ రాత్రులు నాతో మీరు రమిస్తారు అని చెప్పేడు. ఆ మాట నిజం చేయడానికే కృష్ణుడు ఈ శరత్కాల రాత్రులందు ఆ గోపికలతో రమించడానికి నిశ్చయించేడు.

యోగమాయతో గోపికలతో క్రీడించేడని చెప్పడం ఏమిటి? అతడు మానవ రూపుడై యున్నప్పుడు యోగమాయ ఎక్కడిది! మార్గశిర మాసంలో ఏడేండ్లు దాటిన వాడై ఇప్పుడు ఆ ఏడాది తర్వాత వచ్చిన ఆశ్వయుజ మాసానికి ఇప్పుడు తొమ్మిదేండ్ల వాడు కావచ్చు. అంత చిన్న వయస్సులో తన కంటె చిన్న వయస్సులోని గోపికా

స్త్రీలతో రమించడ మేమిటి? 'భగవానపి' (భగవంతుడు కూడ) అనడం దేనికి? కృష్ణుడు భగవంతుడే అయినా కూడ గోపికలతో రమించేడనడంలో ఏమి బాగుంది? వెనుకటి సంవత్సరంలో వస్త్రాపహరణంలో చెప్పిన రాత్రులకే ఈ శరద్రాత్రులు అర్థం అని వ్యాఖ్యాతలు వ్రాసేరు. ఆ వస్త్రాపహరణకాలంలో చెప్పిన రాత్రులు ఈ శరద్రాత్రులు అవడానికి ఏ విధంగా సమన్వయం చెప్పాలి? పైగా శరత్కాలంలో మల్లెపూలు వికసించడం అసంభవం కాదా! దానికి వ్యాఖ్యాతలు "కృష్ణుని మహిమ వల్ల బృందావనంలో అన్ని కాలాల్లోను అన్ని పువ్వులూ పూస్తాయి" అని కారణం వ్రాయడంలోను, కృష్ణుణ్ని భగవంతుడుగా చెప్పడంలోను, అతడు గోపికలను రమించ డానికి పూను కొనడంలోను, మానవుడుగా చెప్పడంలోను ఈ పరస్పర విరుద్ధ ద్వంద్వ వైఖరికి ఎట్లా సమన్వయం? కేవల మానవుడుగా సగుణంగా పరమాత్మను చెప్తే, కేవలం భగవంతుడుగా నిర్గుణంగా చెప్పే యోగమాయాదులకు తావులేదు. కేవలం భగవంతుడుగా నిర్గుణ పరమాత్మగా చెప్తే గొల్లస్త్రీల పొందుకు సంబంధం వుండదు. ఒకచోట నిర్గుణ పరమాత్మగా భగవంతుడుగా ప్రవర్తించడం, ఇంకొకచోట మానవ మాత్రుడుగా ప్రవర్తించడం, రెండూ ఒకే శ్లోకంలో ఎట్లు సమన్వయింప బడుతాయి? అంతా సగుణపరంగా చెప్పడానికే శక్యం కాదు కాని, అంతరార్థపరంగా అంతా నిర్గుణ పరంగా శ్లోకాన్ని అన్వయించి అర్థం చెప్పవచ్చు. వ్యాస భగవానుడు అంతర్గర్భితంగా అంతా నిర్గుణ బ్రహ్మపరంగానే వుండేటట్లు వ్రాసేడు. మనం మా కించిజ్ఞత వల్ల సగుణంగా అన్వయించుకొని తికమక పడుతున్నాం. చూడండి ఈ శ్లోకానికి అంతరార్థ తాత్పర్యం వివరించి చెప్తూన్నాను.

"రాత్రులకు విశేషణమైనట్టి శరదోత్ఫుల్ల మల్లికలు అంటే— శర=నాశన మును, ద=ఇచ్చునట్టివై, ఉత్ఫుల్ల=బాగా ఎదిగియున్న, మల్=అహంకార మమ కారాలను, లికాః=గ్రహించునవియైన, రాత్రీః=తమోగుణ వ్యాపారములను" అని అర్థం చెప్పాలి.

రాత్రులు చీకటి కలవి. చీకటి తమోగుణానికి సంకేతం. ఆ రాత్రులు అనగా ఆ తమోగుణ వ్యాపారములు సాధకునిలో బాగావృద్ధి పొందిన అహంకార మమకారా లకు సంబంధించిన మనోవృత్తులు. 'మత్' అన్నది నేను నాది అను అర్థమిచ్చే పదం, మత్ లాతి గృహ్ణాతి ఇతి 'మల్లాః' అని అవుతుంది. 'మల్ల' అంటే అహంకార మమ కారాల నుగ్రహించే మనోధర్మం అన్నమాట. 'మల్ల' మీద స్త్రీలింగ యివక్షలో 'జీప్' చేస్తే 'మల్లీ' అని అవుతుంది. 'మల్లీ' అనే శబ్దం మీద స్వార్థంలో కప్ ప్రత్యయం

చేస్తే 'మల్లికా' అవుతుంది. అంటే అహంకార మమకార మనోవృత్తుల్ని గ్రహించే తామసిక వృత్తులు అనే అర్థాన్ని 'మల్లికలు' అనే పదం ఇస్తుంది. ఇట్లా చెప్పినపుడు భగవంతుని లీలవల్ల శరత్కాలంలో అకాలంలో మల్లికలు వికసించేయనే అసందర్భ వ్యాఖ్యానాల అవసరం లేదు. భగవాన్+అపి, భగ శబ్దం జనన కారణం అనే అర్థం చెప్పే పదం తామసాది గుణాలకు జనన కారణభూతానే అయిన వాడైనప్పటికీ సాధకులలో బాగా ఎదిగిన తామసగుణ వ్యాపారాలైన అహంకారమమకారాల వృత్తులతో పరమాత్మ కలిసి క్రీడించి సాధకునిలోని ఆ వృత్తి వికారాలను తనలో ఐక్యం చేసికో దలచిన వాడు అని శ్లోకంలోని 'భగవానపి' అన్న పదానికి తాత్పర్యం. నిర్గుణ పరమాత్మ పరంగా చెప్పాలి. అప్పుడు యోగమాయా ముపాశ్రితః అన్నది అన్వయిస్తుంది. యోగ మాయ అంటే, యోగ=తనలో కలిసిపోయియే యున్న, మాయా=అజ్ఞాన ప్రకృతిని, ఉపాశ్రితః=పొందినవాడై అని అర్థం. అంటే పరమాత్మతో కలిసియే యుండేది ప్రకృతి నిజానికి అది పరమాత్మ యొక్క స్వరూపమే కాన ఆ ప్రకృతి స్వరూపం అతనిదే కాన ప్రకృతికి సంబంధించివున్న అహంకార మమకారాల వృత్తులు కూడ అతనివిగానే సాధకులు గుర్తిస్తే వేరే అహంకార మమకార వృత్తుల వికారం సాధకుల కంటుకోదు. అని 'యోగమాయా సమాశ్రిత'. అనే పదంవల్ల అంతరార్థ పరంగా గ్రహించవచ్చు లోగడ కొంతవరకు సాధనలో సిద్ధి పొందినవారే ఈ విధంగా తమలోని అహంకార మమకారాలు పరమాత్మునివే అనే అనుభూతి పొందగలరు. ఇక్కడ సాధకులు గోపికలు. వారు అంతకు పూర్వం వస్త్రాపహరణ సాధనలో (మాయా నివారణ సాధనలో) మాయావరణాన్ని తొలగించుకొన్నవారే ఆ మాయావరణం తొలగించుకొన్నప్పుడే పరమాత్మ వారికి "మయేమాః రంస్యతాంక్షపాః" నాతో ఈరాత్రులు మీరు రమిస్తారు అని వాగ్దానం చేశాడు అంటే మాయావరణం తొలగించుకొన్న తర్వాత తామస సగుణాలైన అహంకార మమకార వృత్తులు భగవత్స్వరూపంలో లీనం చేసే సాధన సాధకులు ప్రారంభించాలి అనే అంతరార్థం దీనిలో వుంది.

ఇక్కడ 'రతి' అన్నది ఆనందపరంగా అంతర రతికి అర్థం కాని, బాహ్య సంయోగ రతికి అర్థం కాదు. శరద='శర' అనేది 'శౄహింసాయాం' అనే ధాతువు వల్ల నాశం చేయునది అనే అర్థం ఇస్తుంది. 'ద' అనేది 'ద' 'దానే' అని ధాతువు వల్ల ఇచ్చేది అనే అర్థం ఇస్తుంది. ఈ విధంగా 'శరద' అన్నది నాశాన్నిచ్చేది అనగా నాశం కల్గించేది అని అర్థం యిస్తుంది. ఉత్ఫుల్ల మల్లికలు అనగా బాగా వికసించిన అనగా పైకి ఎదిగివున్న అహంకార మమకారాలు అని అర్థం అవి సాధకుని నాశం

చేసేవి. అవి 'శరదోత్ఫుల్ల మల్లికాః' అని రాత్రి పదవిశేషణానికి అర్థం. బాగా ఎదిగిన తర్వాతనే తమోగుణాల్ని నాశంచేస్తే అవి సమూలంగా నాశమౌతాయి. అంటే పరమాత్మ సంయోగంతో అతనిలో లీనమౌతాయి. అనే అభిప్రాయం ఈ విశేషణం వల్ల స్ఫురిస్తూంది. యావత్తమోగుణాన్ని పైకి ఉద్బుద్ధం చేసి ఆత్మ వృత్తితో వానికి కలయిక కల్గించి వానిని సమూలం నాశం చేయాలి అనేది సాధనచేసే సాధకులు ఈ శ్లోకం వల్ల గ్రహించగలరని భావిస్తున్నాను.

శ్లో॥ నిశమ్య గీతం తదనంగ వర్ధనం
వ్రజ స్త్రియః కృష్ణ గృహీతమానసాః
ఆ జగ్మురన్యోన్య మలక్షితోద్యమాః
సయత్రకాంతో జవలోల కుండలాః

బాహ్యార్థంటీ క॥—

వ్రజస్త్రియః= గోకులంలోని స్త్రీలు, అనంగవర్ధనం=మన్మథోద్రేకాన్ని కల్గించే, తత్=ఆ, గీతం=పిల్లనగ్రోవి పాటను, నిశమ్య=విని, కృష్ణగృహీతమానసాః=కృష్ణునిచే ఆకర్షింపబడ్డ మనస్సులు కలవారై, అన్యోన్యం=ఒకరి నొకరు అలక్షితోద్యమాః= తెలియని విధం కలవారై, జవలోల కుండలాః=నడక వేగంవల్ల కదలుచున్న కర్ణ భూషణములు కలవారై గోపికలు సః=ఆ, కాంతః=అందగాడు, యత్ర=ఎక్కడ వున్నాడో అక్కడకు, ఆ జగ్ముః=వెళ్లిరి.

తా॥ అనంగ వర్ధనం అనగా మన్మథ ఉద్రేకం కల్గించునట్టి ఆ వేణునాదం విని గోకులంలోని గోపికా స్త్రీలు అందఱూ ఒకరి సంగతి ఇంకొకరికి తెలియకుండా, నడకలో చెవులకు పెట్టుకొన్న భూషణాలు కదలుతూండగా వేగంగా నడిచి ఆ కృష్ణుడున్న బృందావనానికి వెళ్ళేరు. ఒకరు వస్తూన్నట్టు రెండవ వారికి తెలియకుండా అందరు గోపికలూ కూడ వెళ్ళేరు. అని బాహ్యార్థ తాత్పర్యం. అంతరార్థం– 'వ్రజ' అంటే 'వ్రజతి ఇతి వ్రజః' అనే వ్యుత్పత్తిలో పొందునది అని అర్థం. ఇక్కడ కామ క్రోధాది వ్యాపారాల్ని పొందేది మనస్సు అని 'వ్రజ' పదానికి అర్థం. వ్రజస్త్రియః అంటే మనస్సులోని కామాది తామాసిక వృత్తులు అని అంతరార్థపరంగా చెప్పాలి.

"అనంగ వర్ధనం" అంటే– న+అంగ = 'అనంగ' అవుతుంది, అంగ పదానికి శరీరం అర్థం, శరీరం లేని స్థితి 'అనంగ' అవుతుంది అంటే జన్మరాహిత్య స్థితి అనగా ముక్తావస్థ అని అర్థం, ఆ ముక్తావస్థను, వర్ధనం=వృద్ధి పొందించేది అనగా

పు:క్తి కల్గించుటకు తోడు పడేదియైన, గీతం=అంటే పరమాత్మచే ప్రబోధింపబడిన ఉపదేశ విషయమును అని అర్థం. దానిని, అంటే పరమాత్మచే సాధకునిలో ప్రేరే పింపబడిన సంగతిని గుర్తించి 'కృష్ణ గృహీత మానసాః' అంటే, నిర్వృతితత్త్వంచేత అనగా భూసంబంధమైన విషయరాహిత్య తత్త్వం చేత ఆకర్షింపబడ్డవారై అని అంతరార్థం 'అన్యోఽన్య మలక్షితోద్యమాః' అంటే వ్రజంలో నున్న వారియొక్క అనగా మనస్సులోనున్న వృత్తుల యొక్క ఒకదాని ప్రయత్నం మరొకదానికి తెలియకుండా వెళ్ళేయి. మనస్సులోని వృత్తులు కొన్ని కామానికి, కొన్ని క్రోధానికి, ఈ విధంగా అన్నీ ఒకదానికి ఒకటి పోలనివే అయిన వృత్తులు అవడం వల్ల ఒక వృత్తి ఏమిచేస్తుందో రెండవ దానికి తెలియబడని విధంగా అన్ని వృత్తులూ నిర్వృతి తత్త్వాన్ని అనగా విషయ రాహిత్యాన్ని పొందేయి అని అంతరార్థం.

కృష్ణ పదానికి నిర్వృతితత్త్వం అనగా భూసంబంధ విషయరాహిత్యతత్త్వం అర్థంగా మనం లోగడ వ్యుత్పత్త్యర్థ ప్రదర్శనంతో తెలిసికొనియే యున్నాం. జవలోల కుండలాః, నడక వేగానికి కదిలే కుండలాలు-ఇక్కడ కుండలములంటే పాశములు లేక వలయం అనగా బంధ వలయములు అనగా జన్మ మరణ వలయం అనే అర్థం. "కుండలం కర్ణ భూషాయాం, పాశేపి, వలయేపిచ" అని 'మేదినీ' నిఘంటువు వల్ల తెలుస్తూంది జవ=వేగంగా, లోల=కదలుతూన్న, కుండలాః = కర్మ పాశములు కలవారై లేక జనన మరణ వలయము కలవారై అని అర్థం.

అంతకు పూర్వం వస్త్రాపహరణ ఘట్టంలో మాయావరణం కొంత తొలగడం వల్ల సాధకునిలోని జన్మనిచ్చే బంధములు ఎక్కువగా కదలాడి శిథిలములై పోతూన్నాయి అని పై విశేషణానికి అంతరార్థపరంగా అర్థం చెప్పాలి. ఒకరి నొకరు తెలియకుండా వచ్చేరు అంటే సాధకునిలోని కామాది వృత్తులు ఏ వృత్తికి ఆ వృత్తి ప్రత్యేకత కలది కాన ఒకదానిని పోలి ఒకటి వుండవు,అవి అన్నీ నిర్వృతి తత్త్వంతో కూడినవైనాయి అని అర్థం- కాంతుడున్న చోటకు అంటే, కాంత పదానికి సుందరము అనే అర్థం వుంది 'సత్యం శివం సుందరం' అన్నవి పరమాత్మ యొక్క స్వరూపాలు కాన సుందర పదం పర్యాయ పదమే అయివున్న 'కాంత' పదంతో పరమాత్మ స్వరూపం ఉన్నచోటుకు అనే అంతరార్థం చెప్పుకోవచ్చు.

సాధకులుని మనోతామసిక వృత్తుల్లోని జన్మ వాసనల్ని పోగొట్టుకోవడానికై తమలోని ఆత్మ ప్రాబల్యం లభించడంతో ఐహిక చింతలు వీడి తమలోని వృత్తులు తమ చోటుల నుండి వేగంగా ఒకదాని కొకటి తెలియకుండా అన్ని వృత్తుల్ని

పరమాత్మ స్థానానికి చేరుకొనేటట్లు సాధన చెయ్యాలనే తాత్పర్యం అంతరార్థ పరంగా ఈ శ్లోకంలో గ్రహించాలి.

శ్లో॥ దుహంత్యోఽభియయుః కాశ్చిత్
దోహం హిత్వా సముత్సుకాః
పయోఽధిశ్రిత్య సంయావం
అనుద్వా స్యాపరాః యయుః
పరివేష యంత్యస్తద్ధిత్వా
పాయ యంత్యశ్శి శూన్పయః
శుశ్రూషంత్యః పతీన్ కాశ్చిత్
అశ్నంత్యోపాస్య భోజనం
లింపంత్యః ప్రమృజం త్యోఽన్యాః
అంజంత్యః కాశ్చలోచనే
వ్యత్యస్త వస్త్రాభరణాః
కాశ్చిత్ కృష్ణాంతికం యయుః

బాహ్యార్థ తాత్పర్యం :- కొందరు గోపికలు గోవుల్ని పాలు పితుకుతూన్న వారు ఆ పనిని వదలివేసి వెళ్ళేరు. కొందరు పాలు కాచుతూన్న వారు పాలకుండల్ని పొయ్యి మీదనుండి దింపకుండానే వదలివేసి వెళ్ళేరు. కొందరు అలంకరించుకొంటూన్న వారు అలంకారాల్ని వదలివేసి వెళ్ళేరు. కొందరు బిడ్డలకు పాలిస్తూన్న వారు వారిని వదలివేసి వెళ్ళేరు. కొందరు భర్తలను సేవిస్తూన్న వారు సేవల్ని వదలివేసి వెళ్ళేరు. అన్నం తింటూన్న వారు భోజనం విడిచివేసి వెళ్ళేరు. గందాల లదుకొంటూన్న వారు స్నానాలు చేసి ఒళ్ళు తుడుచుకుంటూన్న వారు ఆ పనులు వదలివేసి వెళ్ళేరు. నగలు శరీరం పైని ఒకచోట పెట్టుకోవలసినవి కంగారుతో మరొక చోటన పెట్టుకొని కొందరు వెళ్ళేరు. అల్లాగే బట్టలు కూడ తికమికగా కట్టుకొని కొందరు వెళ్ళేరు. ఈ విధంగా వేణుగాన ధ్వనిని పట్టి అందరూ కృష్ణుడున్న చోటకు తిన్నగా చేరుకొన్నారు.

అంతరార్థ తాత్పర్యం :- 'దుహంత్యః' అంటే పాలు పితుకుచున్న వారు అని బాహ్యార్థంకాగా కోర్కెలను పితుకుతూన్న అనగా ఊహిస్తూన్న మనోవృత్తులు

అని అంతరార్థంగా చెప్పాలి. ఆ వృత్తులు ఆ కోర్కెలు విడిచివేసి పరమాత్మ ప్రబోధం తమలో కల్గడంతోనే పరమాత్మను చేరుకొన్నాయని అంతరార్థం. పాలు కాచుతూన్న వారంటే కోరిన కోర్కెలు లభించగా వాని అనుభవిస్తూన్న మనో వృత్తులు అని అర్థం. ఆ వృత్తులు ఆ విషయాల అనుభవాన్ని విడిచి పరమాత్మ పిలుపు నందుకొన్నాయని అంతరార్థం. అలంకరించు కొంటూన్న వారంటే - కోర్కెలను ఏవికావాలో ఎంచుకొంటూ దిద్దుకుంటూన్న విమర్శాత్మక మనో వృత్తులు అని అర్థం - ఆ విమర్శలు మానివేసి పరమాత్మ నందుకోవడానికి అవి బయలుదేరేయని అర్థం.

శిశువులకు పాలిస్తున్న వారంటే- మనోవృత్తులు తమకు సంబంధించిన ఉప వృత్తులను పోషించడం వదలివేసి పరమాత్మవైపు చేరుకొన్నాయని అర్థం. భర్తలను సేవించడం మానివేసిన వారంటే, తమ ప్రవృత్తికి కారణములైన కామాది అరిషడ్వర్గాన్ని, శృంగారాది రసాల్ని (వాసనల్ని) కాదని తిరస్కరించి పరమాత్మ వైపు కొన్ని వృత్తులు చేరాయని అర్థం. భోజనం విడిచి వేసిన వారంటే ; ప్రారబ్ధము లైన కర్మానుభవాల్ని విడిచినవై అని అర్థం. గంధం పూసుకొంటూన్న వారంటే- గంధ పదానికి జన్మ కర్మ వాసనలు అని అర్థం. జన్మ కర్మ వాసనలు అంటుకొనే విధంగా మమకారాలు పెంచుకొంటూన్న మనోవృత్తులు అని అర్థం.

స్నానంచేసి ఒళ్లు తుడుచుకొంటూన్న వారుఅంటే మనస్సుకు మలినం అంటు కోగా ఆ అంటిన మలినాన్ని పోగొట్టుకుంటూన్న మనోవృత్తులు అని అర్థం. రెండు లోచనములకు కాటుక దిద్దుకుంటూన్న వారు అంటే సుఖ దుఃఖాది ద్వంద్వములతో తామసిక గుణాన్ని పొందుతూన్న వృత్తులు అని అర్థం. తారుమారుగా కట్టుకొన్న బట్టలు, పెట్టుకొన్న నగలు కలవారు అంటే- బుద్ధిలేని అవకతవక పనులు చేసే మనోవృత్తులు అని అర్థం. ఈ విధంగానున్న సాధకుల మనోవృత్తులన్నీ కూడ తమలో ఆత్మ ప్రబోధం పొందడంతో, ముక్తి కోసం నిర్వృతి తత్త్వాన్ని చేరు కోవాలని ఆరాటపడాలనే సాధనా రహస్యాల్ని పై శ్లోకాలకు అర్థంగా అంతరార్థ పరంగా గ్రహించాలి.

( 32 )

శ్లో॥ తాః వార్యమాణాః పితృభిః
పతిభిర్భ్రాతృ బంధు భిః
గోవిందా పహృ్న తాత్మనః
నన్య వర్తం తమో హితాః

బాహ్యార్థం :- ఆ గోపికా స్త్రీలు, తమ తండ్రులు, భర్తలు, సోదరులు, బంధువులు, ఎవరెంతగా అడ్డగించినా ఆగక మోహం పొందినవారై కృష్ణుని చేత అపహరింపబడ్డ మనస్సు కలవారై వెళ్ళేరు.

అంతరార్థం :- సాధకులలోని మనోవృత్తులు పరమాత్మ ప్రబోధం పొందడంతో గోవింద+అపహృత+ఆత్మానః-కృష్ణునిచే అపహరింపబడిన మనస్సు కలవారై అని బాహ్యార్థం కాగా గో అంటే ఇంద్రియాల్ని, విందతే ఇతి విందః అంటే తెలిసికొన్నవాడు, అనే అర్థంలో సాధకులలోని ఇంద్రియ వ్యాపారాల్ని తన వైపునకు ఆకర్షించే పరమాత్మను మనసులో ధ్యానించునవియైన మనోవృత్తులు అని అంతరార్థం. పరమాత్మచేత అపహరించబడిన ఆత్మ కలది అంటే పరమాత్మ ప్రబోధం చేత అమనస్కస్థితి సాధకునిలో కల్గుతుంది అని అర్థం గ్రహించాలి. తల్లిదండ్రుల్ని, భర్తల్ని, సోదరుల్ని, బంధువుల్ని కాదని వచ్చేరు అంటే సాధకులలోని మనోవృత్తులు తమ పుట్టుకకు కారణములైన కామాదులను త్రిగుణాలను ద్వంద్వాలను తమతో సంబంధంగల వానినన్నిటినీ త్రోసివైచి పరమాత్మ ప్రబోధంతో పరమాత్మవైపు మోహితులై అంటే ఆకర్షితములై యుంటాయి. అని అంతరార్థ రహస్యాన్ని ఇందు గ్రహింపవచ్చు.

శ్లో॥ అంతర్గృ హగతాః కాశ్చిత్
గోప్యోఽ లబ్ధ వినిర్గతాః
కృష్ణం తద్భావనా యుక్తాః
దధ్యుర్మీలిత లోచనాః

బాహ్యార్థం :- లోపలి గదులలో వుండిపోవడం వల్ల వెలుపలికి రావడానికి శక్యం కాని గోపికా స్త్రీలు కొందరు కృష్ణుని అచ్చట నుండియే తమ కన్నులు మూసికొని తమ భావనల్లోనే పొందగల్గేరు.

అంతరార్థం :- అంతర్గృహం అంటే హృదయ గుహ అని అర్థం. హృదయ గుహలో సాధన చేస్తూన్న సాధకుల మనోవృత్తులు కన్నులు మూసికొని అంటే

ప్రకృతి లోనికి కాక ప్రకృతి వైపు చూడక అని అర్థం. ఆ విధంగా విషయ రాహిత్య తత్త్వాన్ని అంతకుపూర్వమే అంతర్గృహ సాధనలోనే తాము ఉపాసిస్తూన్న కారణంచేత ఆ భావనా పథంలోనే పరమాత్మను మరింతతీవ్రంగా (ప్రకృతివైపే చూడక) ఆ సాధననే సాగించాలని ఇందలి అంతరార్థంగా భావించాలి.

జ్ఞాన మార్గ సాధనలలో హృదయ గుహా సాధన సర్వ విధాల సంపూర్ణమైన సాధన. ఇది సాధనలన్నిటిలోను రాజు. అంతర్గృహం అంటే ఇంటిలోని లోలోపలి గది అని బాహ్యార్థం. శరీరం అనే ఇంటిలో లోలోపలి గది హృద్గుహ అని అంతరార్థం. ఆ హృద్గుహ ఏ ఆవరణం లేనిదిగా వుంటుంది కాన అది నిర్వృతితత్త్వానికి నిలయం అనాలి. అందులో పరమాత్మ జ్యోతి నివసిస్తూ వుంటుంది. అందు ప్రవేశించి సాధన చేసే వారికి గుణ ద్వంద్వాదు లేవీ బాధించ లేవు. కాన వారు వేరుగా నిర్వృతి తత్త్వాన్ని అభ్యసించే సాధనలు వేరుగా చేయనవసరం లేదు. అని అంతరార్థపరంగా సాధనా రహస్యాన్ని పై శ్లోకం వెల్లడిస్తూంది. ఈ హృదయ గుహా సాధన ముక్కుడే సాధకుల్ని తరింప జేసేది అని భగవాన్ శ్రీ రమణ మహర్షుల వారు 'కోఽహం' అనే చిన్న గ్రంథంలో వివరించేరు.

శ్లో॥ తమేవ పరమాత్మానం
జారబుద్ధ్యాపి సంగతాః
జహుర్గుణ మయం దేహం
సద్యః ప్రక్షీణ బంధనాః

బాహ్యార్థం :- పరమాత్మయైన ఆ కృష్ణుని జారుడనే బుద్ధితో కలిసినప్పటికిని గోపికలు వెంటనే 'ప్రక్షీణ బంధనా' అంటే వీడిన రైకముడి కోకముడి కలవారైనారు. గుణమయమైన దేహాన్ని అంటే ఒడలు తెలియని స్థితిని అనగా రతి సుఖాన్ని పొందేరు అని అర్థం.

అంతరార్థం :- ఈ విధంగా పరమాత్మను సాధకునిలోని ఇంద్రియ వృత్తులు 'జారబుద్ధ్యా' అంటే-జారశబ్దం'జరయతి శిథిలయతి ఇతి జారః' అనే వ్యుత్పత్త్యర్థంలో శిథిలం చేసేది అనగా నాశం చేసేది అనే అర్థం ఇస్తుంది.

తమలోని జన్మ వాసనలను పరమాత్మ నాశంచేస్తుంది అనే ఊహతో కలిసినవి అనేది అంతరార్థం. 'జారబుద్ధిచేత పొందినవి' అన్నదానికి చెప్పవచ్చును. త్రిగుణాలకు సంబంధించిన వృత్తులు పరమాత్మను సంధానం వల్ల నాశనం చెందుతాయి అనే

భావనా సాధనా రహస్యం ఇందులో ద్యోతకమౌతుంది. వెంటనే బంధనాలు విడిపోయి సాధకునిలోని ఆ వృత్తులు 'గుణమయం దేహమపి' గుణమయమైన దేహాన్ని కూడ అంటే సత్త్వరజస్తమోగుణ రూపాల్ని విడిచివేసినవి అని అంతరార్థాన్ని తెలిసికోవాలి. 'జారబుద్ధ్యాపి' అను దానిలోని 'అపి' అనే దాన్ని 'దేహమపి' అని దేహ పదానికి ఇక్కడ సంబంధం జెయ్యాలి, 'జారబుద్ధ్యా' అనే దానికి బాహ్యార్థంలో జారుడు అనగా విటుడు అనే భావంతో కృష్ణుణ్ని గోపికలు పొందినప్పటికీ ఆ కృష్ణుడు భగవంతుడు కావడంవల్ల అతనిని ఏవిధంగా భావించి సంగమించినా ఆ స్త్రీలు ముక్తినే పొందేరని చెప్పడానికి పరీక్షిత్తుడే ఈ క్రింద విధం శుకమహర్షిని ప్రశ్నించేడు.

శ్లో॥ కృష్ణం విదుః పరం కాంతం
నతు బ్రహ్మత యామునే
గుణ ప్రవాహో పరమః
తాసాం మోహధియాం కథమ్.

కృష్ణుణ్ని గోపికలు తమకు విటుడుగా భావించేరే కాని పరబ్రహ్మ స్వరూపంగా భావించలేదు గదా అటువంటప్పుడు తమోగుణ రూపమైన మోహబుద్ధిగల ఆ గోపికలకు త్రిగుణ రాహిత్యం ఎట్లాగు కల్గింది? త్రిగుణ రాహిత్యం కల్గితేనే కదా ముక్తికల్గేది- ఈ ప్రశ్న చక్కని ప్రశ్న ఇది మనకు కూడా కల్గేదే. 'జ్ఞానే నైవతు కైవల్యం' అన్నది సిద్ధాంతవచనం. అంటే జ్ఞానం చేతనే కైవల్యం వస్తుందని భావం. జార బుద్ధి అజ్ఞానానికి సంబంధించినది. తమోగుణ లక్షణం అది. జ్ఞానం వల్ల రావలసిన ముక్తి అజ్ఞానం చేత ఎట్లా వస్తుంది? తమోగుణం గుణరాహిత్యం ఎట్లు కలిస్తుంది? అడుగ దగ్గ ప్రశ్న అడిగేడు పరీక్షిత్తు. దానికి శుకుడు ఈ విధంగా చెప్పేడు.

శ్లో॥ ఉక్తం పురస్తా, దేత, త్తే
చైద్య స్సిద్ధిం యథా గతః
ద్విషన్నాప హృషి కేశం
కిముతాధోఽక్ష జప్రియాః
కామం క్రోధం భయం స్నేహ
మైక్యం సౌహృదమేవవా
నిత్యం హరౌ విదధతో
యాంతి తన్మయతాం హితే

తా॥ ఈ విషయం గూర్చి పూర్వం ఒకప్పుడు నీకు చెప్పబడింది. శిశుపాలుడు కృష్ణుణ్ని ద్వేష బుద్ధితో కూడి యుండి కూడ ముక్తిని పొందేడు అన్నప్పుడు గోపికలు జారబుద్ధితో కూడియుండి ముక్తిని పొందేరనడంలో తప్పేముంది? కామంతో కాని, క్రోధంతో కాని, స్నేహంతో కాని, కలయికతో కాని, భయంతో కాని, భక్తితో కాని దేనితోనైనా సరే హరి యందు నిత్యమూ తన్మయం పొంది వుంటే వారు తన్మయులై ముక్తిని పొందుతారు అని పై శ్లోకాల తాత్పర్యం. దీనిని వ్యాఖ్యానిస్తూ వాఖ్యాతలు కామంతో గోపికలు, క్రోధంతో శిశుపాలాదులు, భయంతో కంసాదులు, బంధు స్నేహంతో పాండవాదులు, కలయికతో గోవుల్ని కాసిన గోపకులు మొదలగు యాదవులు, భక్తి మనస్సుతో నారదాదులు తరించేరు అని వివరించేరు.

ఇక్కడ ఒక సూక్ష్మవిషయం విమర్శతో మనం గ్రహించాలి పైనిచెప్పిన, కామ క్రోధ భయాదులు అజ్ఞానానికి సంబంధించినవి. ఆ అజ్ఞాన గుణాలతో కృష్ణుడితో తగులం పెట్టుకొన్న కారణంచేత వారు ఆ అజ్ఞాన మనోవృత్తితోనే శరీర త్యాగం చేస్తారు. వారు ఆ అజ్ఞానంతో వున్నంత కాలం కృష్ణుణ్ని పరమాత్మగా భావించడం జరగేపనేకాదు. "యాంతే మతిస్సాగతిః" అనే పునర్జన్మ సిద్ధాంత వచనానికి చచ్చే కాలంలో ఏ వృత్తి మనస్సులో ఉంటుందో అదే వృత్తికి సంబంధించిన జన్మయే వానికి సిద్ధ మౌతుంది అని అర్థం

అటువంటప్పుడు నిత్యమూ కామ క్రోధ, భయాదులతో సంబంధం కలవాడికి చచ్చిపోయేటప్పుడు కూడ అవె మనోవృత్తులు వారిలో వుంటాయనక తప్పదు. కృష్ణుడు వారికి పరమాత్ముడుగా కన్పించడు. ఎట్లు? కృష్ణునియందు వారికి శత్రుత్వం, భయత్వం, శృంగార ప్రయత్నం, బంధు ప్రయత్నం వగైరా మాత్రమే చచ్చేటప్పుడు కూడ వుంటాయి అని అనుకోక తప్పదు అట్లాంటప్పుడు వారికి ముక్తి లేక కైవల్యం లభించడానికి వీల్లేదు అట్లాగే అయితే జ్ఞానమార్గ ప్రయోజనమే చెడిపోతుంది. కాన పై దానికి ఆ విధంగా వ్యాఖ్య చెయ్యడం సరియైనది కాదు. జ్ఞాన మార్గాన్ని నిలిపే విధంగా దానికి వ్యాఖ్య చెయ్యక తీరదు.

కామం క్రోధం భయం అనే గుణాలతో పరమాత్మతో నిత్య సంబంధం పెట్టుకొన్నారని పైని చెప్పిన శత్రుత్వంతో నిత్య సంబంధంగల శిశుపాలుడు, చిట్టచివర కృష్ణునిచేత చక్రం ప్రయోగింపబడినప్పుడు అంతలో అతనికి హఠాత్తుగా కల్గిన మార్పువల్ల అతనిని పరమాత్మగానే దర్శించడం జరిగింది. ప్రాణోత్క్రమణ కాలంలో పరమాత్మానుభూతితో లోగడ జీవితమంతా నడిచిన క్రోధాదిక గుణాలు పటాపంచలై జ్ఞానావిర్భూతి జరిగి ఆ జ్ఞాన దృక్పథంతోనే అతడు మరణించేడు,

రావణుడు చిట్టచివరకు తాను రాముని చేతిలో చనిపోయేటప్పుడు 'ఈతడు నారాయణుడే' అనే అనుభూతి పొందేడు. పాండవాదులు తమకు కృష్ణుడు బంధువైనా అతణ్ణి మొదటినుంచి బంధువుగా కాక పరమాత్మగానే సేవించేరు. యశోద తనకు బిడ్డయేయైనప్పటికీ, కృష్ణుణ్ణి బిడ్డగాకాక, పరమాత్మగానే చూచింది. ఆ విధంగా వారు జ్ఞానం పొందిన తర్వాతనే, త్రిగుణ రాహిత్యం పొందిన తర్వాతనే ముక్తులయ్యేరని చెప్పక తప్పదు.

మఱి గోపికలు విషయంలో, జారుడనే బుద్ధితో కృష్ణుణ్ణి ప్రేమించి తరించడానికి వీలులేదు గదా ! జారబుద్ధి నీచ శృంగారానికి సంబంధించిన తమోలక్షణం. ఆ లక్షణం వారిని విడిచిపెట్టనంత వరకు వారికి ముక్తి వచ్చిందని చెప్పడం వేదాంత సిద్ధాంతానికే విరుద్ధం. వారిలో జారత్వబుద్ధి పోయి పరమాత్మబుద్ధి జనిస్తేనే వారికి ముక్తి కల్గుతుంది. రావణాదుల క్రోధంలాగ, ముందున్న జారత్వబుద్ధి తర్వాత పటాపంచలైనపుడే ప్రాణోత్క్రమణ వేళనైనా కృష్ణుని యందు పరమాత్మబుద్ధి కల్గితేనే వారికి ముక్తి లభిస్తుంది.

భాగవతంలో ఎక్కడా ఆ విధంగా ముందు జారిణులైనా తర్వాత ఆ వ్యామోహం విడిచి వారు ముక్తి పొందేరని చెప్పబడనే లేదు. జారత్వం అనే తమోగుణ దృష్టి మారనిదే ముక్తి ఎట్లు వచ్చిందనాలి ? ఈ విషయం అంతా కూలంకషంగా, వివేచనా దృష్టితో పరిశీలిస్తే 'జారబుద్ధ్యా' అనే పదానికి విటవృత్తి అని అర్థాన్ని కాక మఱొక అర్థాన్ని అంతరార్థంగా చెప్పి తీరాలి. 'జార' అనేది పైని చెప్పినట్లు శిథిలం చేయునది అనే వ్యుత్పత్త్యర్థంతో ప్రయోగింపబడింది. అని చెప్పుకొంటే తమలోని వాసనలను శిథిలంచేసే వాడనే బుద్ధితో గోపికలు అనగా ఇంద్రియ వృత్తులు కృష్ణుణ్ణి అనగా విషయరాహిత్య తత్త్వాన్ని చేరుకొని రమించేయి అనగా ఆనందతాదాత్మ్యం చెందేయి అని అంతరార్థపరంగా చెప్పితీరాలి. లేకపోతే "యాంతే మతిస్సాగతిః" అనే జ్ఞానమార్గ సిద్ధాంత వచనానికే భంగం వస్తుంది. కేవల సగుణంగానే భాగవతంలో ఏ ఘట్టమూ అన్వయించడానికి వీలులేదు. అట్లా అన్వయిస్తే ముక్తి మార్గమే భ్రష్టమైపోతుంది. ముక్తి మార్గాన్ని ప్రవచించినప్పుడే భాగవత గ్రంథం భాగవత పదాన్ని సార్థకం చేసికొంటుంది.

కనుకనే వ్యాసమహర్షి సగుణ ఘట్టంలో చెప్పిన సగుణరూప కృష్ణుణ్ణి నిర్గుణ పరమాత్మగా కూడ వర్ణిస్తూ, స్తుతిస్తూ కంఠోక్తిగా తానే చెప్పుకుంటూ వచ్చేడు. ఇక సగుణంగా చెప్పిన విషయాల్లో కూడ అంతరార్థపరంగా నిర్గుణ తత్త్వాన్ని ప్రదర్శించే

టట్లు వ్యంగ్య వైభవం చూపించేరు. అట్లా కాకపోతే సగుణ నిర్గుణ తత్త్వాలు కలియక దేనికది కొట్టచ్చినట్లుగా తిలతండుల న్యాయంగా కన్పిస్తూ ఐక్య ప్రతిపాదకత్వానికి ఆఘాతం కల్గిస్తుంది. ఈ విధంగా అంతరార్థాలతో సూక్ష్మదృష్టి పరిశీలనతో సాధకులు భాగవతాన్ని అర్థం చేసికొంటేనే తమకు తరించడానికి అనేక రకాలైన జ్ఞాన మార్గ సాధనలు భాగవతం నిండా ప్రతి ఘట్టంలోనూ గోచరిస్తాయి.

కృష్ణుడు తన వద్దకు వచ్చిన గోపికా స్త్రీలను "మీరెందు కిక్కడకు వచ్చేరు ? భయంకరమైన ఈ రాత్రి ఇల్లు విడిచి రావడమేమిటి ? సోదరుల్ని, తల్లిదండ్రుల్ని, బిడ్డల్ని, భర్తల్ని విడిచి మీరీ విధంగా రావడం ఎంత సాహసం ! ఇళ్ళకు వెళ్ళండి. మీ భర్తల్ని సేవించండి. మీ బిడ్డల్ని కాపాడుకోండి, స్త్రీలకు తమ భర్తల్ని సేవించడమే పరమ ధర్మం. దుశ్శీలుడైనా, కఠినుడైనా భర్తను భార్య సేవించడం వల్లనే పుణ్యం కల్గుతుంది. రంకుతనంవల్ల మహాపాపం సంభవిస్తుంది. కాన మీరు వెంటనే మీ గోకులానికి పొండి" అని హితోపదేశం చేసేడు.

ఆ మాటలు విని గోపికలు దీనవదనలై దుఃఖంతో కొంతసేపు ఏమీ మాట్లాడలేక పోయేరు. తర్వాత తెప్పరిల్లి 'కృష్ణా ! నీవట్లా అనకూడదు. అన్నీ వదులుకొని నీకోసం వచ్చేం. మేము భర్తల్ని, సుతుల్ని విడిచి ఈ విధంగా జారునిగా నిన్ను తగులుకోడం తప్పన్నావు. కాని మా భర్తలు, కన్నవారు, అత్తవారు, బిడ్డలు, బంధువులు అందఱూ కూడ తామే నిన్ను కోరుతూంటే' మేము నిన్ను కోరి రావడంలో తప్పేముంది ! నీవు మమ్ము తరింప జేసినపుడే వారు కూడ తరిస్తారు.

అట్లాంటప్పుడు మేము వారికి ద్రోహంచేయడం అనేదే లేదుగదా ! వారికి ఉపకారమే చేస్తూన్నాం కదా ! చిత్తం అంతా నీ మీద వున్నప్పుడు ఇళ్ళల్లో మాకు చేతులు కాళ్ళు ఏ పనిని చెయ్యడానికి కదలాడవు. ఈ చిత్తం మాతోనే వున్నప్పుడు మేము ఇంటికి వెడితే మాత్రం ఏం లాభం ! పోతే నీ విరహాగ్నిచేత మేము కాలి పోతాము. నీ చల్లని కరములు మా తాపం అని దీనంగా చెప్పుకొన్నారు.

కృష్ణుడు తానై గోపికలతో రమించాలని కోరి వారి రాకకోసం వేణునాదంచేసి, గోపికలు వస్తే మీరు భర్తల్ని విడిచి, జారుణ్ని కోరి రాకూడదని మందలిస్తాడు దేనికి ? బాహ్యార్థంలో ఇట్లా జరగడం సంభవమంటారా ! గోపికలు నిన్ను మేము పొందితే మా వారు తరిస్తారు. వారు కోరేదీ అదే కదా ! అని సమాధానం చెప్పడం సంగతంగా ఉందా ! విటుడితో తాము రమిస్తే తమ భర్తలు ధన్యులైనట్లు సంతో

షిస్తారా ! ఇదెక్కడి సమాధానం ? బాహ్యార్థంలో దీనికి సమన్వయం కుదుర్చడ మెట్లాగు ?

అయితే మతేమిటి దీనికి అంతరార్థం ఉంది ? చక్కని అంతరార్థం ఉంది. ఆ అంతరార్థమే చెప్పుకోకపోతే 'భాగవతంలో రాసలీలలు రంకు పురాణ ఘట్టం' అని చెప్పేవారి వాదాన్ని కాదని సగుణంలో బాహ్యార్థంలో సమర్థించడానికి మార్గమే లేదు కృష్ణుని ప్రశ్నకు, గోపికల సమాధానాన్ని, సమన్వయించనే లేము.

సగుణ తత్త్వంతో గోపికలు దేవతలని, శ్రుతులనీ గొల్లవారై పుట్టేరని విష్ణువే కృష్ణుడుగా పుట్టేడనీ ఆ కారణంచేత వారిలోని శృంగారం అద్వితీయమని, దానికి జారత్వదోషం పట్టదనీ ఏదేదో సమర్థిస్తారు వ్యాఖ్యానకారులు.

అసలు మానవులుగా పుట్టేక వారు దేవతలైనా, శ్రుతులైనా, విష్ణువైనా మానవులు మానవులే గొప్ప తప్పుగా భావించే జారత్వానికి వారు పాల్పడ్డారనడంలో వారు ఏమి సాధించినట్లు? వ్యాసమహర్షి పాఠకులకు ఏమి అందించినట్లు? అది చారిత్ర కంగా సత్యంగా జరిగిందే అయితే ఆ జరిగిన ఆ పతితల శృంగారాన్ని భగవంతునితో ముడిపెట్టడం ఎందుకు? గోపికలు జారబుద్ధితో తరించేరు అనడం ఎందుకు? అవ తారపురుషుడని చెప్పిన రాముడిలోని ఏక పత్నీ వ్రతాది సుగుణాలు అవతార లక్ష ణాలు అని చెప్తూ, కృష్ణావతారంలో బహుపత్నీత్వ జారత్వాలు చెప్పడం ఏమిటి? గోపి కలు పరమాత్ముడుగా కృష్ణణ్ణి భావిస్తే మాత్రం పెళ్ళాడిన భర్తలను కాదని జారిణిగా సంచరించడాన్ని ఎన్ని విధాల సమర్థిస్తే మాత్రం అవి పాఠకుల చిత్తాన్ని జార దృక్పథంనుండి మరలిస్తాయా? అక్కడక్కడ వ్యాసుడు గోపికల్ని కృష్ణణ్ని పర మాత్మగా భావించినట్లు కృష్ణుడికి విశేషణపదాలు, వాడినా అంత మాత్రంవల్ల వారిని మానవరూపంలోని వారుగా కాక ఆత్మరూపం పొందినవారుగా పాఠకులు అర్థం చేసు కోవడం జరుగనే జరుగదు. ఏదో ఠికమికలో పాఠకుణ్ని పడవేస్తూన్నట్లే అవుతుంది. తప్ప ఆ విధంగా పరస్పర విరుద్ధమైన ద్వంద్వ వైఖరిని ప్రదర్శించడం వల్ల ఒడిగేదేమీ లేదు.

అంతరార్థపరంగా చెప్పినప్పుడే ఈ ద్వంద్వ వైఖరి విడిపోతుంది. ఈవిధంగా అవతారమని సగుణ తత్త్వాన్ని సమర్థించాలంటే అన్నీ దొంకతిరుగుడు సమాధానాలే చెప్పాలి తప్ప సూటియైన తృప్తికరమై ప్రయోజనకరమైన పరిష్కారం చేసే సమా ధానం దొరకనే దొరకదు. భాగవతానికి, అందులోను, రాసలీలలవంటి పచ్చి శృంగార

ఘట్టానికి నిర్గుణపరంగా అంతరార్థం చెప్పినప్పుడే అన్ని ప్రశ్నలు పటాపంచలై పాఠకులకు సాధకులకు చక్కని సాధనా ప్రణాళికల నందిస్తాయి.

కృష్ణుడు తానై గోపికలను ఆకర్షించడానికి వేణుగానం చేసి రప్పించి, వారు రాగానే 'మీరు మీ భర్తల్ని బంధువుల్ని కాదని రావచ్చునా?' అన్నాడేమిటి?

గోపికలు తమ భర్తలు, బంధువులు తాము కృష్ణుడితో రమిస్తే తాము తరించినట్లు సంతోషిస్తారని చెప్పడమేమిటి? ఈ ప్రశ్నలకు అంతరార్థపరంగా సమాధానం చెప్తున్నారు గమనించండి.

గోపికలంటే ఇంద్రియ వృత్తులని లోగడనే చెప్పుకొన్నాం. ఆ వృత్తాన్ని శృంగారాదిరసాలు పోషిస్తాయి కాన అవి గోపికలకు అనగా ఇంద్రియవృత్తులకు భర్తలుగా చెప్పుకోవాలి. భర్తృపదానికి పోషించువాడు అని అర్థం. కాన ఆ అరిషడ్వర్గాలు ఇంద్రియ వృత్తుల్ని పోషించేవి కాన అవి వాటికి భర్తలని చెప్పాలి ఇంకా త్రిగుణాలు, ద్వంద్వాలు మొదలైనవి ఆ ఇంద్రియవృత్తులకు సన్నిహితంగా వుంటాయి కనుక వానిని ఆ గోపికలకు అనగా ఇంద్రియవృత్తులకు ఆప్త బంధువులుగా చెప్పుకోవాలి. ముక్తినికోరే ఇంద్రియ వృత్తులు కృష్ణుడిమీద అనగా నిర్వృతితత్త్వంమీద వ్యామోహం కల్గివున్నాయి. కృష్ణుడంటే ఐహిక విషయరాహిత్యం అని కదా చెప్పుకొన్నాం.

విషయరాహిత్యంతో ఇంద్రియవృత్తులు వున్నప్పుడేముక్తిసిద్ధిస్తుంది. ఆఇంద్రియ వృత్తులు నిర్వృతితత్త్వంతో విముక్తి పొందితేనే వానిని పోషించే కామాది అరిషడ్వర్గమూ, శృంగారాదిరసాలు, త్రిగుణాలు, ద్వంద్వాలు ముక్తిని పొందుతాయి. ఇంద్రియాలూ, వాని వృత్తులూ, కామాదులూ, శృంగారాది రసాలూ, త్రిగుణాలూ, ద్వంద్వాలూ, మనస్సును అనగా జీవుణ్ని ఆశ్రయించి వుండేవి. జీవుడు ఎప్పుడూ వీటి విముక్తితో తాను పరమాత్మైక్యాన్ని పొందాలని తహతహ పడుతూనే వుంటాడు.

ఇంద్రియ వృత్తులు ఎప్పుడు నిర్వృతి తత్త్వంతో అనగా విషయరాహిత్యంతో కూడి వుంటాయో అప్పుడు జీవలక్షణాలన్నీ కూడ విముక్తిని పొందుతాయి. జీవుడు పరమాత్మైక్యాన్ని పొందుతాడు కాన, జీవుడు పరమాత్మైక్యాన్ని పొందాలంటే ఇంద్రియ వృత్తులు నిర్వృతిత్త్వంలో అనగా విషయరాహిత్యాభిలాషతో ఐతపడి వుండాలి. గోపికలు కృష్ణప్రియులై వుండడంద్వారా గోపికల భర్తలు కూడ తరిస్తారు అనడం అన్నదానికి పై అంతరార్థ వివరణం వల్ల గ్రహించగలం.

అయితే కృష్ణుడు తాను రమ్మని పిలిచి తర్వాత "మీరు ఎందుకు వచ్చారు?" అనడం ఏమిటి? అంటే-సాధకుని మనోవృత్తులు విషయరాహిత్యతత్త్వం వైపు తీవ్రంగా పరుగులు తీస్తూనే అంతలోనే తాము విషయరాహిత్య తత్త్వంకంటే ముందు తామున్న విషయతత్త్వంతోనే వుంటేనే బాగుంటుందేమో అనే సాధనను అడ్డగించే ఒకవిఘ్నంగా ఒకానొక ఊహ హఠాత్తుగా తోచి ఒక్కింత ఆలోచనలో సాధకుని పడవేస్తాయి. ముక్తికి అతి సన్నిహితంగా సాధకుని వృత్తులు చేరుకొంటూవున్న చివరి సాధనలో ఆఖరు విఘ్నంగా సాధకులను పరీక్ష చేసేదిగా ఒక్కసారి మొత్తం సాధన నంతనూ తల క్రిందులు చేసేదిగా ఈ విధమైన నాస్తికతత్త్వం సాధకుణ్ని ఆవరిస్తుంది ఇక్కడ సాధకుడు ఈ పరీక్షలో విజయం పొందుతేనే ఆఖరు సాధనగా ముక్తి శిఖరాగ్రానికి చేరుకొంటాడు. ఈ విధమైన చిట్టచివరి విఘ్నాన్ని ప్రత్యక్షం చేయడమే కృష్ణుడు గోపికల్ని వేసిన ప్రశ్నకు అంతరార్థంగా గ్రహించాలి.

గోపికలు తాము చేస్తూన్న ఈ పనివల్ల తమ భర్తలు—

శ్లో॥ సించాంగ ! న స్త్వమధురామృత పూరకేణ
హాసావలోక కలగీత జహృచ్ఛయాగ్నిం
తన్నో నిధేహి కరపంకజ మాత్మ బంధో !
తప్తస్తనేషుచ, శిరస్సు చ కింకరీణాం

బాహ్యార్థం :- అంగ=ఓయీ ! త్వం=నీవు, నః=మాయొక్క, హాసవలోక కలగీత=నీ చిరునవ్వుల చూపులచేత వేణునాదం రతి కల్గిన, హృచ్ఛయాగ్నిం=మన సిజుని వల్ల (మన్మథుని వల్ల) నైన తాపాగ్నిని, అధరామృత పూరకేణ=నీ అధ రామృత ప్రవాహంచేత, సించ=తడిపివేయుమా (ఆర్పివేయుమా !), కింకరీణాం=నీ దాసీలమైన, నః=మాయొక్క, తప్తస్తనేషు=తాపము పొందియున్న స్తనములయందు, శిరస్సు చ=తలలయందు కూడ, ఆత్మబంధో=ఓ ముఖ్య బంధువైన కృష్ణా, కర పంకజం=నీ హస్తమనే పద్మమును, నిధేహి=ఉంచుమా.

తా॥ కృష్ణా! నీ చూపులచేత, గానముచేత మాలో మన్మదాగ్ని మండిపోతూంది. దానిని నీవు నీ అధరామృతం అనే నీటిచేత తడిపివేసి మాకు తాపం పోగొట్టుము. మా స్తనములు, శిరస్సులుకూడ మన్మదాగ్నిచేత వేడెక్కిపోయినాయి. వానిమీద నీ హస్త పద్మము తాకించి ఆ తాపాగ్ని నిరూడ పోగొట్టుము. మేము నీకు దాస్యం చేస్తాము.

అంతరార్థం :- అంగ, అం=విష్ణువును అనగా సర్వవ్యాపకత్వమును, గ= పొందియున్న, ఆత్మబంధో := పరమాత్మకు దగ్గరగా జేర్చునట్టి ఓ నిర్వృతితత్త్వమా! అని అర్థం-నీవు నీ హాసావలోక జకలగీతజమైన అనగా నీయొక్క ప్రబోధ కృత్యముల వలన పుట్టినదైన, హృచ్ఛయాగ్నిం, హృత్=హృదయమందు, శయ=శయనించియున్న అనగా పొందియున్న, అగ్నిం=జ్ఞానప్రకాశమును, అధరామృత పూరకేణ= ధరాసంబంధంలేని మోక్ష చింతనా ప్రవాహంచేత, సించ=అభిషేకము చేయుమా! మా తప్తస్తములను అనగా తాపము నొందియున్న ద్వంద్వ గుణములను, తాపము పొందియున్న శిరస్సులను అనగా ఐహిక చింతలచేత వేడెక్కిన మా మెదడులను, నీ యొక్క కరపంకజమునుంచి ఆ తాపము అనగా ద్వంద్వ గుణముల తాపము, ఐహిక చింతల తాపము పోగొట్టునది నిర్వృతి తత్త్వమునకు సంబంధించిన నీ కరమును అనగా నీ కృత్యమును అనగా నీ దయా ప్రసారిత చేతనమును స్పర్శింపజేసి ఆ తాపములను పోగొట్టుమా అని అంతరార్థము.

తరిస్తారనడం తమలోని విషయ రాహిత్యాభిలాష తమ్ము పోషించే కామాదులను పూర్తిగా తరింపజేసేవి అని చెప్పుకోవడంతో సాధకుడు తుది పరీక్షా ప్రశ్నకు సూటియైన సమాధానం చెప్పి పరీక్షా విజయం సాధించినట్టుగా మనం భావించాలి.

గోపికలు పచ్చి శృంగారంతో కృష్ణుణ్ణి "మమ్ము నీ అధరామృతం త్రాగించు, కౌగలించు, మా తప్తస్తనాలమీద, శిరస్సులమీద నీ కరములుంచు" అని ప్రాధేయపడుతూ అన్నారన్న దానికి అంతరార్థం ఏమిటంటే ఇంద్రియవృత్తులు నిర్వృతితత్త్వాన్ని అర్థించేయి అన్నది, కృష్ణుణ్ణి గోపికలు ప్రాధేయపడ్డారన్న దానికి అంతరార్థం. అధరామృతం అంటే- న+ధరా=అధరా, అధరా+అమృతం=అధరామృతం అంటే 'ధరా' అనగా భూమి, 'అధరా' అనగా భూసంబంధం కాని తత్త్వం అని అర్థం. అది అమృతం అంటే జనన మరణ రాహిత్యమైన ముక్తినిచ్చేది అని అర్థం. ఆ ముక్తిని మాకు నీవు ప్రసాదించుము అన్నదే అధరామృతం త్రాగించు అన్నదానికి అంతరార్థం. 'కౌగలింత' పదానికి 'రెండు శరీరాలు ఏకం చెయ్యి' అని కదా అర్థం. మాలోని విషయ సహితతత్త్వం నీ విషయ రహిత తత్త్వంగా మారిపోయేటట్లు ఐక్యం చేయవలసింది అని ప్రార్థించడంగా అంతరార్థముతో చెప్పుకోవాలి.

తప్తములైన తలలమీద అంటే విషయ వృత్తుల తాపంతో తలలోనుండే ఆలోచనాకేంద్రంమీద తప్తస్తనములమీద అంటేస్తనములు గుండెమీదవుండేవి. అవి రెండుగా వుండేవి కాన హృదయంలో వుండే ద్వంద్వగుణాలకు స్తనములు ఉపలక్షకములని

గ్రహించాలి. అవి తప్తములై వున్నాయి అంటే విషయ సహితములై ముక్తిని చేర నీయకుండా బాధిస్తున్నాయి అని అర్థం.

"వాసిమీద నీ కరపంకజం ఉంచు" అని గోపికలు కోరేరు. అంటే విషయ రహిత తత్త్వానికి సంబంధించినది కృష్ణుని కరము. దానిని మా ద్వంద్వాలమీద మనస్సు మీద నుంచుము అనగా విషయరహిత తత్త్వం మామీద ప్రసరింపజేసి మమ్ము ముక్తికి చేర్చుము అని అంతరార్థపరంగా అర్థం చేసికోవాలి. ఈ విధంగా అంతరార్థపరంగా చెప్పకపోతే బాహ్యార్థంలో ఆ ప్రశ్నలకు సక్రమమైన సమాధానాలు కన్పించవు.

శ్లో॥ బాహుప్రసార పరిరంభ కరాలకోరు
నీవీ స్తనాలభన నర్మనఖాగ్ర పాతైః
క్ష్వేళావలోక హసితైర్వ్రజ సుందరీణాం
ఉత్తంభయన్ రతిపతిం రమయాంచ కార

బాహ్యార్థంలో టీక। బాహుప్రసార=చేతులు చాపుటచే, పరిరంభ=కౌగలించుటను, కర=చేయుటంచేతను, అలక=ముంగురును, ఊరు=తొడలను, నీవీ=కోకముడులను, స్తన=స్తనములను, ఆలభన=అంతటా పొందుటచే అనగా బాగా స్పృశించుట చేతను, నర్మ=వినోదములచేతను, నఖాగ్రపాతైః=గోళ్ళ మొనలచే పొడుచుటలు చేతను, క్ష్వేళ+అవలోక=వేళాకోళపు చూపులచేతను, హసితైః=నవ్వులచేతను, వ్రజసుందరీణాం=గోకులంనుండి వచ్చిన అందగత్తెలైన గోపికలలోని, రతిపతిం= మన్మథుణ్ణి, ఉత్తంభయన్=ఉద్రేకింప జేయుచున్నవాడై, రమయాంచకార=రమించెను.

తా॥ తర్వాత కృష్ణుడు చేతులు చాపి కౌగలించుతూ ముంగురులు, తొడలు, కోకముడులు, స్తనాలు, బాగా స్పృశించుతూ, హాస్య వచనాలు పల్కుతూ, నఖక్షతాలు చేస్తూ, కొంటెగా చూస్తూ, నవ్వుతూ ఆ గొల్ల పడుచులతో మన్మథోద్రేకాన్ని కల్గించి వారితో రమించేడు.

అంతరార్థటీక। బహు ప్రసార శబ్దంమీద స్వార్థమందు 'అణ్' ప్రత్యయం చేస్తే, వృద్ధి వచ్చి బాహు ప్రసార అని అవుతుంది. అప్పుడు బాహుప్రసార=అనేక విషయములకు సంబంధించిన మనోవృత్తులయొక్క, పరిరంభ=ఆలింగనంచేత అనగా కలయికచేత, కరాలక=భయంకరములై (కరాళ శబ్దంమీద స్వార్థంలో 'క' ప్రత్యయం చేస్తే 'కరాళక' అవుతుంది), ఊరు=పెద్దవైన, నీవీ=జన్మనిచ్చే మాయాః గ్రంథులను,

(నీవి అనగా కోకముడి, కోకను మాయకు పర్యాయంగా వాడడం వుండి. కాన మాయా బంధములకు 'నీవి' అనేపదం వాడబడిందిగా గ్రహించాలి. అవే జన్మనిచ్చే గ్రంధులు) స్తన=ద్వంద్వగుణముల ధ్వనులను (స్తనములు రెండగుటచే ద్వంద్వములకు ఉపలక్ష కము) స్తనపదానికి ధ్వనికూడ అర్థం వుండి. కాన ద్వంద్వధ్వనులను అలభన= పొందకుండుటచే, నర్మ=హాస్యప్రాయములుగా నున్నవైన, న+ఖ=ఇంద్రియ నిగ్రహ సంబంధములేని ('ఖ' అంటే ఇంద్రియము అర్థం, న+ఖ='నఖ' అంటే ఇంద్రియ విషయం లేనివైనవి అనగా ఇంద్రియ నిగ్రహమునకు సంబంధించి యున్నవైనట్టివి అనే అర్థం వ్యుత్పత్తిపరంగావస్తుంది). అగ్రపాతైః=శ్రేష్ఠములైన సాధనలు జరుపుటలు చేతను అనగా అనేక విషయాల కలయికచేత భయంకరములై పెద్దవైన జన్మగ్రంధు లకు, ద్వంద్వగుణములకు అంటని స్థితితో హాస్యప్రాయములుగా నున్నవై (నిమిత్త మాత్రంగా ఉన్నవై ఇంద్రియ సంబంధములేని శ్రేష్ఠములైన క్ష్వేళావలోక=ఉదాసీన దృష్టులతో కూడిన, హసితైః=నవ్వులచేత, అనగా ఉదాసీనంగా చూచి నవ్వి వదలి వేయడంచేత, అసంగతత్త్వంచేతఅని అర్థం-వ్రజసుందరీణాం=ఇంద్రియ సమూహము నకుస్థానమైన మనస్సుయొక్క వృత్తులలో, రతిపతిం=ఆనందముల కధిపతియైన బ్రహ్మా నందస్థితిని, ఉత్తంభయన్=(ఉత్+స్తంభయన్) పైకి ఆకర్షించి నిశ్చలపఱచువాడై, కృష్ణః=నిర్వృతితత్త్వం, రమయాంచకార=క్రీడించెను.

తా॥ వ్రజస్త్రీలు, వ్రజం అనగా సమూహం కలది అని అర్థం. ఇక్కడ ఇంద్రియ వృత్తుల సమూహం కలది అని అర్థం చెప్పుకోవాలి. ఇంద్రియ వృత్తుల కూడలి పట్టుకొన, వ్రజమనగా మనగా మనస్సు అని అర్థం, అందలి సుందరములు గోపికలు అనగా మనోహరంగా కనుపడే ఇంద్రియ విషయ వృత్తులు. వాటిలో కృష్ణ దనగా విషయ రహిత తత్త్వం చేరింది అంటే సాధకునిలోని విషయ సహిత వృత్తులు. విషయ రహిత తత్త్వాన్ని సాధన చేయడానికి సమీపించేయన్న మాట. అప్పుడు ఆ విషయ రహిత తత్త్వం యొక్క సమీప్యం సాధకులలోని విషయ వృత్తులలోనున్న అనేక విధములైన ఐహిక విషయాల కలయికతో భయంకరములై పెద్దవైన జనన కారణ గ్రంధులను, ద్వంద్వగుణాల ధ్వనులను అంటకుండా చేసే ఉదాసీన భావం కల్గించే ముక్తి కారణములైన ఉదాసీన భావ సాధనలచేత ఆ విషయ వృత్తులలో బ్రహ్మానందాను భావమును రేకెత్తింపజేస్తూ వాటికి తనలో ఐక్య భావమును కల్గించింది. అని అంతరార్థపరమైన భావము.

సాధకులు తమలోని విషయ వృత్తులకు నిర్విషయతత్త్వాన్ని అలవరింప జేయ డానికి ఆ విషయ వృత్తులయందు ఉదాసీన దృక్పథం చూపడం అంటే ఆయా విష యాల్ని పట్టించుకోకుండా, చూచీ చూడనట్లు అసంగతత్త్వంతో ఉండేటట్లు సాధన లతో మనస్సుకు తర్ఫీదునివ్వాలి. అప్పుడు విషయవృత్తులకు నిర్విషయతత్త్వంతో అనగా పర్రబహ్మ తత్త్వంతో ఐక్యభావం ఏర్పడుతుంది. అప్పుడు జన్మ కారణ మాయాగ్రంధులు వీడిపోతాయి. ద్వంద్వగుణాల ధ్వనులు మరలిపోతాయి. నిశ్చల తత్త్వంతో అనగా అనైంద్రియకత్వంతో అనగా అమనస్కతతో అఖండానందాను భవం ప్రారంభిస్తుంది. ఇదంతా కృష్ణ తత్త్వంవల్ల అనగా విషయరహిత తత్త్వం వల్ల సిద్ధిస్తుంది అనే సాధనా రహస్యాన్ని పై శ్లోకం అంతరార్థపరంగా చెప్తూంది. సత్సం గత్వంతో కల్గిన నిస్సంగత్వంతో ప్రారంభించిన సాధన నిశ్చల తత్త్వాన్ని చేరుకొంటే ముక్తి వస్తుందని శ్రీ ఆదిశంకరాచార్యులు వారు 'నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః' అనే సిద్ధాం తాన్ని చేరుకోవడానికి గోవిందభజన చెయ్యాలన్నారు. గో=ఇంద్రియ విషయములను, వింద=తెలిసికొన్నవాడైన అనగా కృష్ణునియొక్క అనగా నిర్వృతి తత్త్వంయొక్క భజనం అనగా పొందుట చేయవలెను అని అర్థం.

కృష్ణుని సంభోగం వల్ల మన్మథోద్దీపనంతో గోపికలతో శృంగార రసానందం ప్రారంభించడంతోనే వారు తమ అందచందాలకు గర్వించేరు దానితో తమవంటి ధన్యులెక్కడా, ఎవ్వరూ వుండరని వారికి అహంకారం కల్గింది. వారి ఆ గర్వం చూచి కృష్ణుడు వారి సంయోగ శృంగారరసాన్ని వియోగ శృంగారంగా మార్చి వారిని మరింత మన్మథోద్రిక్తలనుగా చేయడానికై వారిమధ్య ఉంటూన్నట్టే వుండి అంతలోనే మాయమై పోయినాడు.

అంటే సాధకులు తమలోని విషయ వృత్తులు నిర్విషయతత్త్వంతో అనగా అసంగతత్త్వంతో ఐక్యం చెందనారంభించడంతో వానికి ఆనందానుభవం ప్రారంభి స్తుంది. దానితో తమ సాధనల గొప్పతనానికి మురిసి గర్వించడం తమవంటి సాధకు లెవ్వరూ ఉండరనే అహంకారంతో విఱ్ఱవీగడం సంభవిస్తుందనీ, అట్లాంటప్పుడు బ్రహ్మానంద తత్త్వాన్ని వారిలో శాశ్వతంగా నిలబాటు చేయడానికోసం ముందుగా సాధకులలో పరమాత్మ ఆ ఆనందంతో కొంతకాలం విరహావస్థను సంభవింపజేస్తాడు అన్నది పై వాక్యాలలోని అంతరార్థ రహస్యంగా గుర్తించాలి.

## ద్వితీయ ఘట్టం

# రాస పంచాధ్యాయి

(దశమ స్కంధ పూర్వార్థంలో ముప్పయ్యో అధ్యాయం)

ఆ విధంగా కృష్ణుడు అంతర్హితుడవడంతో, గోపికలు అంతవరకూ ఆతని మోహ దృష్టులచేత, మనోహరాలాపాలచేత ఆకర్షింపబడ్డవారై తన్మయంతో నున్నవారు ఆతని విరహం వల్ల బాధతో ఆతని చేష్టలనే తలచుకొంటూ, అనుకరిస్తూ విరహపరి తాపంతో ఆతణ్ణి గూర్చి చెట్లను, పుట్లను, అడుగుతూ వెతకడం ప్రారంభించేరు.

ఓ అశ్వత్థమా! ఓ న్యగ్రోధమా! మా మనస్సులను దొంగలించుకొని పోయిన కృష్ణుణ్ణి మీరు చూచేరా!

ఓ అశోకమా! ఓ చంపకమా! ఓ పున్నాగమా మా ఆనందాన్ని అందాన్ని దొంగలించుకొనిపోయిన కృష్ణుడు మీకు కనుపించేడా!

ఓ తులసీ! మా హర్షానికి కారణుడైన కృష్ణుణ్ణి నీవు చూచేవా!

ఓ మల్లియలారా! అందాలరాశి, ఆనందాల వారాసియైన (ప్రోవునైన) కృష్ణుడు మీ పొదల మాటున దాగుకొనలేదు గదా!

ఓ భూమీ! మా ప్రియుడు నీ పై నుండియే నడిచివెళ్ళాలి గదా! ఎక్కడకు వెళ్ళేడో నీకు తెలిసే వుంటుంది; చెప్పవా ?

ఓ లేడీ! నీ కన్నులవంటి కన్నులుగల కృష్ణుణ్ణి నీవు చూడలేదు గదా!

అని ఈ విధంగా ఉన్మత్తాలాపాలతో ప్రాణి, అప్రాణి అనే భేదం లేకుండా కనుపడిన వాటినన్నిటినీ గోపికలు పృచ్ఛించేరు.

అంటే— సాధకులలోని విషయాసక్త మనోవృత్తులు, నిర్విషయతత్త్వం తమ్ము విడిచిపోవడంతో అంతవరకు ఆ నిర్విషయ తత్త్వానందాన్ని తన్మయత్వంతో అనుభవించిన వారగుటచే దాని విరహం వల్ల తమలో తిరిగి కల్గిన విషయ వాంఛల యొక్క ప్రాబల్యాన్ని సహించలేని వారై ఆ పరమాత్మ తత్త్వాన్ని ప్రకృతిలో నున్న ప్రతి వస్తువులోను చూచి గ్రహించడానికి ప్రయత్నం చేయసాగినవన్నమాట. ముందుగా ఆ కృష్ణుడే తామైన విధంగా తన్మయం చెందిన గోపికలు, తర్వాత ప్రతిచెట్టును, ప్రతి ప్రాణిని ఆ కృష్ణుణ్ని గూర్చి అడిగేరు. అంటే మొదట్లో సాధకుడు 'అహం బ్రహ్మాస్మి' అనే సాధన సాగించి అందు సిద్ధుడైన పిదప దానిని వీడిచి సర్వం

ఖల్విదం బ్రహ్మ" అనే సాధన కుపక్రమిస్తాడు అన్న సాధనా రహస్యం పైని చెప్పిన గోపికల కృష్ణాన్వేషణంలో మనం గ్రహించాల్సి వుంటుంది.

తర్వాత గోపికలు బాలకృష్ణుడు గోకులంలో వున్నప్పుడు చేసిన లీలలను నాటకాలుగా ఆడేరు. ఒకతె, పూతనగా మఱొకతె, కృష్ణుడుగా ఈ విధంగా అతని బాలలీలలన్నిటినీ దృశ్యంచేసి కొంతవరకు విరహాన్ని తగ్గించుకొన్నారు ఇక్కడ పాఠకులు పై బాల్యములోని కృష్ణలీలలను, వాటికి లోగడ నేను చెప్పిన అంతరార్థాలనూ మరల ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకొంటే. విషయవృత్తులు నిర్విషయవృత్తితో ఏ విధంగా ఆనందించేది తెలిసికోవచ్చు. పునరుక్త భయంతో వానిని వివరించడం ఇక్కడ జరుగ లేదని పాఠకులు గ్రహించగలరని భావిస్తాను.

తర్వాత గోపికలు కృష్ణుని కాలిముద్రలను ఒకచోటున చూచేరు. అవి శంఖ చక్రాది చిహ్నములు కల్గియుండడంచేత అవి కృష్ణుని కాలి జాడలుగానే గుర్తించేరు. ఆ పాద చిహ్నాలు ఆ ఇసుకనేలలో అడుగులు కొంచెం లోతుగా కన్పించడం వారు గమనించి, కృష్ణుడు మనలో ఎవతెనో తన మూపుపై నెక్కించుకొని పోవడంవల్ల ఆ బరువుచేత అతని పాదాలు ఆ ఇసుకలో లోతుగా నాటుకొనియుంటాయి అని వారు ఊహించేరు. 'అయితే ఆ గోపిక ఎవరు ? ఆ గోపిక ఎంత అదృష్టవంతురాలో' అని వారు ఆమె పైని ఈర్ష్యపడ్డారు. ఇంకా, అడుగులజాడలు బాగా పరికించేరు. ఒక లతా గృహంలో నాల్గు పాదాలు నడిచిన జాడలు కన్పించేయి. అప్పుడు వారు శంఖ శక్రాంకిత పాదాల జాడలు కృష్ణునివిగాను అవి లేకుండా మిగిలిన రెండు పాదాలు ఆసుదాని పాదాలుగాను వారు అనుమానంతో ఊహాగానంతో గుర్తించేరు. గడ్డి కప్పిన ఆ చోటున ఆ పాదాలు అంతకన్న ఎక్కువగా గుర్తించగల్గేటట్లు కన్పించలేదు. కృష్ణుడు తాను ఎత్తుకొని తీసికొని వచ్చిన గోపికను ఈ లతాగృహంలో ఈ గడ్డి శయ్యపైని క్రీడించివుంటాడని వారు భావించేరు. ఒక తీగవద్ద కాలి వ్రేళ్లు బాగా లోతుకు చొచ్చుకొని మడమ చిహ్నాలు మాత్రం కన్పించక పాదాల పై భాగాల్ని అనిననట్లున్న ఇసుకలోని కృష్ణుని పాద చిహ్నాలు చూచి 'ఇక్కడ ఎత్తుగా నున్న తీగెకు గల పువ్వులు గోపిక కోరికపైని కోసి వుంటాడని తలపోసేరు. ఇక్కడ స్త్రీ కూర్చున్న పృష్ఠ ముద్రలున్నాయి. ఆ గోపిక ఇక్కడ కూర్చుండినది. ఇక్కడ ఆమె జడలో ఆ పువ్వులు పెట్టే వుంటాడు అని అసూయాగ్రస్తులై ఒకరివైపు వేరొకరు చూచి చెప్పుకొన్నారు.

అంటే – సాధకునిలోని విషయవృత్తులు అంతవరకు తమలోనే వుండి తమ్మా

నందింపజేసిన నిర్విషయతత్త్వం తమలో ఏదో ఒక ప్రత్యేక మనోవృత్తిచేత ఆకర్షింప బడి ఆ వృత్తితో ఆ తత్త్వం ఎక్కువగా ఆనందించినట్లు ఆత్మ పరిశీలనలో సాధకుడు తెలిసికొంటాడు అనే అంతరార్థ రహస్యం పై విషయాల్ని పరిశీలించి చూచినప్పుడు మనకు తోస్తుంది. ఎవరికీ తెలియకుండా కృష్ణుడు ఎత్తుకొని వెళ్ళిన గోపిక ఎవరైనదీ గోపికలు తెలిసికొన్నట్లు వ్యాసుడు చెప్పలేదు. కాని వ్యాఖ్యానకారులు కొందరు ఆ గోపిక 'రాధ' అయి వుంటుందని వ్రాసేరు.

శ్లో॥ "అనయా ఽఽ రాధితోనూనం భగవాన్ హరిరీశ్వరః
యన్నో విహాయ గోవిందః ప్రీతోయా మనయద్రహః"

అన్న శ్లోకంలో "ఈమె చేత గోవిందుడు ఆరాధింపబడ్డాడు. అందుకే మనల్ని విడిచి ఆమెను తీసికొనిపోయేడు" అని గోపికలు అన్నారు. 'ఆమె చేత ఆరాధింప బడ్డాడు. కాన ఆమె పేరు రాధగా చెప్పబడిందనాలి. కృష్ణుడు ఎత్తుకొని పోయినది రాధ అని చెప్పడం జరిగివుండాలి. అంతే తప్ప వ్యాస భాగవతంలో ఎక్కడా రాధ చరిత్ర గాని ఆఖరుకు ఆమె పేరుగాని చెప్పబడి వుండలేదు.

'రాధ' అంటే ఆరాధన; అనగా భగవత్పూజనం అని అర్థం. గోపికలు అనగా విషయవృత్తులు. ఎంతగా తాము కృష్ణతత్త్వాన్ని అనగా నిర్విషయ తత్త్వాన్ని ప్రేమిస్తూ దాని వల్ల ఆనందం పొందినా అవి తమ తమ కామక్రోధాది విషయాల యందు కూడ అభిమానం కల్గివుంటాయి. పైగా తమకు కృష్ణ సంగం వల్ల కల్గిన తత్త్వానందం అనగా నిర్విషయానందం, తమ అందచందాలు అనగా తమ ఘనత యొక్క కారణంగానే కల్గినట్లు అహంకారంతో భావించడం కూడ జరుగుతుంది. ఈ విషయం గోపికలలో కృష్ణుడు తమ అందానికి వలచి తమ్ము రమించేడనే దానిలో చెప్పబడియే వుంది. ఆ కారణం చేతనే కృష్ణుడు వారికి వియోగ శృంగారంతో దిగులు పుట్టించి తన పైని వారి ప్రేమను స్థిరీకరించడం కోసమే తాను మాయమైనాడు అని కూడ చెప్పబడింది. అంటే గోపికలకు, కృష్ణుని మీద కంటే తమ సౌందర్య భాగ్యం మీదనే మమకారం ఉంది అన్నమాట. అట్లాగే సాధకునిలోని విషయవృత్తులు తమ సాధనా ఘనత మీదనే మమకారం కల్గియున్నవని అంతరార్థం తెలిసికొనవలసి వుంది.

ఆ గోపికలలో ఒక రాధ మాత్రమే సంపూర్ణంగా భగవదారాధనలోనే లీనమై వుంది. ఆ కారణం చేతనే మిగిలిన గోపికలను విడిచివేసి రాధను ఎత్తుకొని గోవిందుడు మాయమయ్యేడు. అంటే విషయవృత్తులలో ఏకాగ్రతా భావం ఏర్పడినపుడే నిర్విషయ తత్త్వం నిలువరించు కొంటుందని అదే ఆరాధనా వృత్తి అని మనం ఇక్కడ రాధాప హరణ ఘట్టం వల్ల తెలిసికోవాలి. శ్లోకంలో గోవిందుడు అన్న పదం, ఇంద్రియ వృత్తులను ఎఱిగినవాడు అనే అంతరార్థం కోసమే ప్రయోగింపబడిందనాలి. తర్వాత రాధకు కూడ తన్ను కృష్ణుడు మిగిలిన గోపికల కంటె ఎక్కువగా ప్రేమించి తనతో తీసికొని పోవడం తన సౌందర్య సౌభాగ్యానికి తార్కాణంగా గర్వం కల్గింది. అప్పుడామె ఆ అడవిలో ఒక చోట నిలబడి అహంకారంతో "ఇక్కడ నుండి నేను నడువలేకున్నాను. కృష్ణా! నన్ను ఎత్తుకొని నీవెక్కడకు వెళ్ళదలచి యున్నావో అక్కడకు తీసికొనివెళ్ళు" అని మంకుపట్టు పట్టింది. సరే అని ఆమెను "నా భుజాం మీదెక్క"మని అంటూనే అంతలో అక్కడి కక్కడే కృష్ణుడు మాయమయ్యేడు. ఈ విధంగా కృష్ణుడు ఆమెను కూడ విడిచి అదృశ్యుడయ్యేడు. ఆమె అతని చేత విడువబడి దుఃఖిస్తూ ఒక చోట కూర్చుండి వుంది. ఆమెను గోపికలు చూచేరు.

అంటే, ఆరాధనా వృత్తి అన్ని వృత్తులలో గొప్పదేయైనా, విషయ వృత్తికి సంబంధించిందే. అది కూడ కావడం వల్ల దానికి కూడ మాయ ఆవరించడం జరుగు తుంది. ఆ విధంగా మాయ ఆవరించినపుడు తనపై తనకు మమకారం, దానితో అహంకార గర్వమూ ఏర్పడుతుంది. దానితో తనకు సిద్ధించిన నిర్విషయతత్త్వం మీద ఆ వృత్తి అధికారం చెలాయించే భావాన్ని ఏర్పఱచుకొంటుంది. తన యిష్టం వచ్చినట్లు ఆ తత్త్వాన్ని నడుపుకోవాలనుకొంటుంది. అట్లాంటి విష్ణుస్థితి సాధకులకు ముక్తి సిద్ధించే ముందు పరీక్షా ఘట్టంగా ఎదురౌతుంది. ఆ పరీక్షలో తట్టుకోలేకపోతే చేతి కందిన తత్త్వం చెయ్యి విడిపించుకొని జాఱిపోతుంది. ఇదే రాధ గర్వం వల్ల కృష్ణుడు దూరమయ్యేడన్న దానికి అంతరార్థం గ్రహించాలి.

తర్వాత గోపికలు రాధను చూచి ఆమె కూడ తమ వలనే కృష్ణుని చేత వంచిత యైందని భావించేరు తర్వాత చీకటి ఆవరించడంతో అందఱు కాళిందీ పులిన తలంలో దీనాత్మలై కూర్చుండి ఈ విధంగా కృష్ణుణ్ణి గానం చేశారు.

# రాసపంచాధ్యాయి

## (మూడవ ఘట్టం)

### దశమ స్కంధం పూర్వార్ధం ముప్పై యొకటో అధ్యాయం

శ్లో॥ జయతి తేఽధికం జన్మనా వ్రజః
శ్రయతి ఇందిరా శశ్వదత్ర హి
దయిత! దృశ్యతాం దిక్షు తావకః
త్వయి ధృతాసవః త్వాం విచిన్వతే ॥1॥

బాహ్యార్థం తా॥:– ప్రియుడా! నీ పుట్టుక చేత గోకులం సర్వోత్కృష్టంగా వుండి. అక్కడ ఎల్లప్పుడూ లక్ష్మి తాండవిస్తూంది. ఆ గోకులంలోని మేము నీ మీదనే ప్రాణాలు పెట్టుకొని వున్నాం. మేము నీ వారలం. నిన్ను వెదుకుతూ తిర్గుతూన్నాం. మా దృష్టికి కన్పించవా! అని గోపికలు కృష్ణుణ్ణి గూర్చి ఆక్రోశించేరు.

అంతరార్థ తా॥ ఓ పరమాత్మా! ఈ వ్రజం అంటే దేహంలోని ఇంద్రియ సంఘాతం నీ వల్లనే జయప్రదంగా వుండి. మా దేహం తాలూకు అందచందాలూ, మనస్సు యొక్క, ఇంద్రియాల యొక్క సంచలనం, శోభ అంతా వ్రజంలో అనగా ఈ సంఘాతంలో నీవల్లనే నిశ్చలంగా నిల్వరింపబడి వుండి. మా గోపికలంతా అనగా ఇంద్రియ వృత్తులన్నీ పరమాత్మవైన నీకే సంబంధించి వున్నాయి. నీవుండుట వల్లనే ఈ దేహాల్లో జీవం వుంటుంది. నీవు మాతో మాలోనే వున్నా మేము నిన్ను కానలేక వెదుకుతూనే వున్నాం. మా మనోవృత్తులందు అన్ని దృక్పథాల్లోనూ నీవు మాకు గోచరించు స్వామీ! అని సాధకులలోని కొంత సాధన చేసి వున్న మనోవృత్తులు పరమాత్మ తమకు అంతలో కన్పించి, అంతలో మాయమగు చున్నందుకు బాధ పొందుతూ పరమాత్మ నన్వేషిస్తూ మొరపెట్టు కొంటాయి అని పై శ్లోకానికి అంతరార్థం చెప్పవచ్చు.

శ్లో॥ శరదు దాశయే సాధుజాత సత్
సరసిజోదర శ్రీముషా దృశా
సురతనాథ! తేఽశుల్క దాసికాః
వరద! నిఘ్నతోనే హకిం వధః ॥2॥

టీక॥ సురతనాథ!= సంభోగమునకు భర్తయైనవాడా! వరద!= కోర్కెలను తీర్చు వాడా! కృష్ణా!, శరత్=శరత్కాలి మందలి, ఉదాశయే=చెరువునందు, సాధుజాత= చక్కగా బయలుదేరిన, సత్=చక్కని అనగా అందమైన, సరసిజ=పద్మము యొక్క, ఉదర=లోపలి భాగమందలి, శ్రీ=శోభను అనగా కాంతిని, ముషా=అపహరించుచున్న అనగా పద్మ గర్భమందలి కాంతి వంటి కాంతి గల అని అర్థం, తే దృశా=నీ యొక్క చూపుతో, అశుల్క దాసికాః=నీవేమీ కన్యాశుల్కంగా మూల్యం చెల్లించకుండానే నీకు దాసీలమైపోయిన మమ్ము, నిఘ్నతః=బాధిస్తూన్న నీకు, వధః నకిం=నాశం కల్గించుకోవడమే కదా! అని ఆగ్రహ వచనంగా దీన్ని భావించాలి

తా॥ ఓ మా సంభోగపతీ! మా కోర్కెలను తీర్చేవాడా! కృష్ణా! శరత్కాలి మందు చెరువులలో చక్కగా వికసించి యున్న పద్మముల నడుమ గల శోభ వంటి నీకన్నుల కాంతి చేత నీకు మేము వశపడి పోయినాము. నీవు ఏమీ మూల్యాన్నివ్వక పోయినా నీకు మేము దాసీలమైనాము. మా కోర్కెలను తీర్చవలసిన నీవు మాకు కన్పించకుండా పోయి ఇల్లా బాధించడం నీవు నిన్ను కూడ నాశం చేసికోవడమే కదా! అనగా మా వల్ల కలిగే ఆనందాన్ని పాడుచేసికోవడమే కదా అని గోపికలు ఆగ్రహంతో ఆక్రోశించారు అని బాహ్యార్థంలోని భావం.

అంతరార్ధ టీక॥:- సురతనాథ, సు=సుగతికి అనగా ముక్తికి సంబంధించిన దైన, రత=ఆనందమునకు అనగా మోక్షానందమునకు, నాథ!=పాలకుడవైన వాడా! ముక్తికి సంబంధించిన ఆనందం ఇచ్చేదైన కృష్ణతత్త్వమా అనగా ఓ ద్వేషయ తత్త్వమా, అని సంబోధనం అంతరార్థపరంగా చెప్పాలి. 'శరత్' అంటే ('శౄ హింసాయాం' అనే ధాతువువల్ల హింసించునది అనే అర్థంలో 'శర' అని అవుతుంది. శరమై ఆచరించునది అనే అర్థంలో క్విప్ ప్రత్యయం చేస్తే 'శరత్' అని అవుతుంది.) హింసించునదిగా ఆచరించుచున్న, అనగా హింసించుచున్నదియైన, ఉదాశయే= ఉత్+ఆశయే=ఉన్నతాభిప్రాయములు కలదియైన అనగా ఉన్నతాశయాలను పాడు చేయునదియైన, అసాధుజాత, అసాధు=చెడ్డ వృత్తుల యొక్క, జాత=సమూహముతో అని అసాధుజాతను విడదీయాలి. సత్=కూడియున్న, సరసి= ప్రవాహమందు అనగా కాల ప్రవాహమునందు, జ=పుట్టిన అజ్ఞానము యొక్క, ఉదర=గర్భమందలి, శ్రీ= ప్రకృతిని అనగా ఐహిక వాసనా మనోవృత్తులను, ముషా=అపహరించునట్టిదైన, తే=నీయొక్క, దృశా=దృష్టిచేత అనగా జ్ఞానదృష్టి చేత (అజ్ఞాన గర్భమందున్న ప్రకృతికి సంబంధించిన ఐహిక వాసనా మనోవృత్తులను నాశం చేసే జ్ఞానదృష్టి చేత

అని అంతరార్థం చెప్పుకోవాలి. ఆ జ్ఞానదృష్టి కృష్ణతత్త్వం వల్ల అనగా విషయ నివృత్తి తత్త్వం వల్లనే సిద్ధిస్తుంది అని తెలిసికోవాలి) శుల్క దాసికాః, శుల్క= మూల్యమునకు అనగా ఐహిక సుఖరూప మూల్యమునకు, దాసికా=అమ్ముడుపోయిన మా ఐహిక మనోవృత్తులను, కిం=ఇట్టిదని చెప్పరాని జ్ఞానమును, నిఘ్నతః=పూర్తిగా నాశనంచేయునట్టి, తే=నీకు అనగా జ్ఞాన స్వరూపమునకు, వధః=నాశనము, నభవతి= కాజాలదు. అనగా అజ్ఞాన వృత్తుల్ని నాశం చేసే బ్రహ్మజ్ఞానానికి నాశం అనేది లేదు. అనగా అవ్యయానంద రూప ముక్తి సిద్ధిస్తుంది అని అంతరార్థం.

జ్ఞానమునకు సంబంధించిన ఉన్నతాశయాలను నాశం చేసే దుర్వృత్తుల సమూహంతో నడుస్తూన్న, కాల ప్రవాహంలోని అజ్ఞానమును తొలగించునట్టి విషయ నివృత్తి తత్త్వం చేత మా ఐహిక సుఖలాలసతా మనోవృత్తులను దానికి సంబంధించిన మూలా జ్ఞానమును నాశం చేసే శాశ్వతబ్రహ్మ జ్ఞానాన్ని మాకు కల్గించి, మాకు జనన మరణ రహితమైన ముక్తిని ప్రసాదించవలసిందిగా కోరుతున్నామని నిర్విషయ తత్త్వాభిలాషతో సాధకునిలోని వాసనా మనోవృత్తులు పరబ్రహ్మ తత్త్వమైన నిర్వృతిని కోరడం ఇందు అంతరార్థపరం స్ఫురిస్తూంది.

ఆత్మజ్ఞానం వల్లనే అజ్ఞానం విస్తరిస్తుంది. ముక్తి నిస్తుంది. ఆనందం వస్తుంది.

(1) ఆత్మన్యేవాత్మనా ఆత్మానం పశ్యేత్ (2) తరతి శోకమాత్మవిత్ (3) బ్రహ్మవిదా ప్నోతిపరం, నసపునరావర్తతే అనే శ్రుతులు పై శ్లోకార్థాన్ని అంతరార్థ పరంగా చెప్తూన్నాయి.

శ్లో॥ విషజలా ప్యయాత్ వ్యాళరాక్షసాత్
వర్ష మారుతాత్ వైద్యుతానలాత్
వృష మయాత్మజాత్ విశ్వతో భయాత్,
ఋషభ! తే వయం రక్షితాః ముహుః ॥3॥

బాహ్యార్థ తాత్పర్యం॥

"ఓ శ్రీకృష్ణుడా! విషజల పూరితమైన కాళిందీనది నుండి, కాళియ సర్పం నుండి, రాళ్లవర్షం నుండి, సుడిగాలి నుండి, విద్యుత్తువంటి అగ్ని నుండి, వృషభాసురుడు, వత్సాసురుడు మొదలగు వారినుండి, సమస్త భయములనుండి మేము నీవల్ల మాటి మాటికి రక్షింపబడియున్నాము. ఆ కారణం చేతనే ఇన్నాళ్లు ఎన్నో బాధలనుండి కాపాడిన నీవు మమ్ము విడిచిపోవుట భావ్యంకా"దని గోపికలు ఆక్రోశించేరు.

అంతరార్థం:-

ఋషభ! అంటే ఓ శ్రేష్ఠుడా! పరతత్త్వమా! అని సంబోధన. "విషజలాప్యయాత్" అంటే 'లడ యోర భేదః' అని ల, డ లకు భేదం లేదన్న సూత్రంచేత, విష జడాప్యయము అని చెప్పవచ్చు,)విషం వంటి జడస్థితియొక్క నాశనం నుండి, "వ్యాళ రాక్షసాత్" అంటే; (వ్యాళ పదానికి ఖలుడు అనగా దుష్టుడు అని అర్థం వుంది. రాక్ష అనేది రక్షయొక్క భావార్థకరూపం. 'స' అంటే నాశంచేయునది అని అర్థం. అప్పుడు రాక్షస అంటే రక్షణలేకుండా చేయునది అని అర్థం వస్తుంది.) రక్షణలేనట్టి దుష్ట వృత్తులనుండి అని అర్థం "వర్ష మారుతాత్;" ములంటే గాలివాననుంచి అనగా వాసనలవంటి భీభత్సం కల్గించే మనోవృత్తుల నుండి అని అర్థం చెప్పాలి. 'వైద్యుతాన లాత్,' వి+ద్యుతము=విద్యుతము అనగా విగతమైన ప్రకాశం కలది. అనగా జ్ఞాన ప్రకాశంలేనిది, అగు 'అనలాత్' అంటే, న, 'లాతి ఇతి=నలః' అనగా దేనిని గ్రహించనిది అనగా అసంగత్వం అని అర్థం, న+నల=అనల అని అవుతుంది. ఇప్పుడు అనల అంటే నిస్సంగం కానిది అనగా సంగంతో కూడినది అని అర్థం. ఇప్పుడు 'వైద్యుత+అనలాత్' అంటే జ్ఞాన ప్రకాశంలేని ప్రకృతి సంగభావం అనగా అజ్ఞానాన్వితమైన ఐహిక సంగం నుండి అని అర్థం వస్తుంది. వృషమయ+ఆత్మ జాత్=పశుపుత్వంవంటి మనస్సునుండి పుట్టిన మన్మధునినుండి అని అర్థం. విశ్వతో భయత్, 'విశ్వతః' 'శ్వ' అంటే రేపు అని అర్థం, విశ్వ=రేపు ఉండనిది అంటే, నిరంతరం మారుతూవుండే ప్రకృతి అని అర్థం. ఆ ప్రకృతివల్ల కల్గిన భయం నుండి అని 'విశ్వతో భయాత్' అనే పదాలకు అర్థం చెప్పాలి. ఇన్ని విధములైన అజ్ఞాన వృత్తుల భయంనుండి మేము నీవల్ల రక్షింపబడుతున్నాము. కాన నీవు మా లోపలనుండి విడువక మమ్ము పూర్తిగా తరింపజేయుమా! అని సాధకుల మనోవృత్తులు నిర్విషయ తత్త్వాన్ని ఆహ్వానించడం ఇందులోని అంతరార్థంగా గ్రహించాలి.

శ్లో॥ నఖలు గోపికానందనో భవాన్
అఖిల దేహినా మంతరాత్మ దృక్
విఖన సార్థితో విశ్వగుప్తయే
సఖ! ఉదియివాన్ సాత్త్వతాంకులే ! ॥4॥

టీక:- సఖ!=ఓ సఖుడా! భవాన్=నీవు, గోపికా నందనః=యశోదయొక్క కుమారుడవు, నఖలు= కావుగదా, సకల దేహినాం=దేహం కలవారందరి యొక్క అంత

రాత్మదృక్=అంతస్సాక్షివి, విశ్వ గుప్తయే= ప్రపంచరక్షణ కొఱకు, విఖనసా=బ్రహ్మ చేత, అర్థితః=కోరబడినవాడవు, సాత్వతాం= గొల్లవారియొక్క, కులే=ఇంటియందు, ఉదేయివాన్=పుట్టితివి.

తా॥ "నీవసలు నిజానికి గొల్లవాడవుకావు. బ్రహ్మదేవుడు విశ్వరక్షణకు నిన్ను ప్రార్థిస్తే గొల్లకులంలో పుట్టేవు గొల్లకులంలో పుట్టడం విశ్వరక్షణ కైనప్పుడు గొల్ల వారమేయైన మమ్ము రక్షించకుండా వుండడం న్యాయంకా"దని గోపికలు కృష్ణుణ్ణి వేడుకొన్నారు.

అంతరార్థం టీక॥—ఖైః సహితః=సఖః అవుతుంది 'సఖః' అన్నదానికి 'ఖైః' సహితః సఖః అనే వ్యుత్పత్తిచెప్తే ఇంద్రియములతో కూడి కొన్నవాడు 'సఖుడు' అని అర్థం వస్తుంది. అనగా ఇంద్రియము లందున్నట్టివాడు సాత్వతాంపతియైన పరమాత్మ. అధోక్షజుడనేది కూడ పరమాత్మకు పేరుంది. అధః, అక్ష, జ=ఇంద్రియముల లోపుల పుట్టినవాడు అని దాని అర్థం. అదే అర్థాన్ని 'సఖః'అనే సంబోధనాపదంకూడ చెప్తూంది. ఓ సాత్వతాంపతీ! ఓ అధోక్షజుడా! అని దానిఅర్థం. భవాన్ నీవు, గోపికా=ఇంద్రియ ప్రవృత్తులకు, ఆనందనః=ఆనంద మిచ్చేవాడవు; నఖలు=కావుగదా, విశ్వ=ప్రకృతి యొక్క, గుప్తయే=రక్షణకొఱకు, విఖన=ఇంద్రియ నిశ్చలతతో, 'ఖ' అంటే ఇంద్రియము, న=లేనిది, ఇంద్రియ వృత్తి లేనిది. నిశ్చలత 'నఖ' అనేదానికి అర్థం 'వి+నఖ' వి=విశేషమైన, నఖ=నిశ్చలతగలది 'విఖన' అవుతుంది, అప్పుడు 'విఖన' అంటే అఖండ నిశ్చలతత్త్వం అని అర్థం వస్తుంది. విఖన=అఖండ నిశ్చలతత్త్వంచేత, స+అర్థితః=సార్థితః=చక్కగా కోరబడినవాడవైన (అనగా నిశ్చలతత్త్వంతో మాలోని ప్రకృతి వృత్తులకు ప్రశాంతస్థితిని కల్పించుటకై ప్రార్థింపబడ్డవాడవై ముక్తి నిచ్చేదవు అని అర్థం). సాత్వతాం=మనస్సు మొదలగు సంఘాతం యొక్క, కులే=కులమార్గ మునందు, కులమార్గం అనగా మూలాధారం నుండి సహస్రారంవరకు నున్న వెన్ను పూసయొక్క మార్గం అని అర్థం. యోగమార్గంలో కుంభకంవల్ల మూలాధారంలో నున్న కుండలినీ శక్తిని ఇంద్రియ వృత్తులతోకూడ కులమార్గం గుండా (వెన్నుపూస గుండా) శిరస్సులోని సహస్రారంలోనికి ప్రవేశపెట్టడం అనే యోగ పద్ధతిలోని ముక్తి సాధనను ఇక్కడ అర్థంగా చెప్పాలి. 'కులే' అంటే ఆ యోగమార్గమందు ఉదేయివాన్ =పుట్టినవాడవు.

తా॥ ఓ అధోక్షజా! నీవు ఇంద్రియ వృత్తులకు ఆనందపరచునట్టి వాడవు కావు. మాలోని ప్రకృతి కంతకు ప్రశాంతి ప్రసాదించి ముక్తినిచ్చేవాడవు. నిశ్చలతత్త్వంతో

యోగమార్గంలో కుంభకంచేసే వారికోసం కులమార్గంలో గోచరిస్తావు కాన మేము నిన్ను యోగమార్గంలో సాధన చేస్తున్నాం. మాకు నీ దర్శనం ప్రాప్తింపచేయుము అని సాధకులలోని మనస్సు మొదలగు ఇంద్రియ సముదాయం పరమాత్మను కోరడం ఇందులోని అంతరార్థపరమైన యోగమార్గ తాత్పర్యంగా గ్రహించాలి.

శ్లో॥ విరచితా భయం వృష్ణిధుర్య! తే
చరణ మీయుషాం సంసృ తేర్భయాత్
కరసరోరుహం కాంత! కామదం
శిరసి ధేహి నః శ్రీకరగ్రహం. ॥5॥

టీక॥ వృష్ణిధుర్య=యాదవకుల మందు శ్రేష్ఠుడైనవాడా! సంసృతేః=సంసారముయొక్క, భయాత్=భయంవల్ల, తే=నీయొక్క, చరణం=పాదమును, ఈయుషాం=పొందినవారమగు, నః=మాయొక్క, శిరసి=తలమీద, విరచిత+అభయం=అభయమిచ్చునదియు, కాంత కామదం=అందమై, మన్మథోద్దీపకమైనదియు, శ్రీకరగ్రహం=సంపత్కరమై యున్నదియునగు, కరసరోరుహం=నీహస్త పద్మమను, నిధేహి=ఉంచుము.

తా॥ "యదువంశోత్తమా! మేము మా సంసారాల్లో మ కు కల్గే భయం కారణంగా నీ పాదాలయొద్దకు చేరుకొన్నాం. ిహస్తం అభయ దాయకమైనది; అందమైనది. మన్మథోద్రేకం కల్గించేది, సమస్త సంపదలను ఇచ్చేది కాన దానిని మా శిరస్సుమీద వుంచి మమ్ము కృతార్థులను చేయు" మని గోపికలు ఆక్రోశించేరు.

అంతరార్థం:- వృష్ణిధుర్య=ముక్తి ధర్మమును నిలబెట్టువాడా! పరమాత్మ!, సంసృతేః=జనన మరణ పరిభ్రమణం యొక్క, భయాత్=భయంవల్ల, చరణం=నీ గమనమును, అనగా నిర్విషయ రూపమైన ముక్తిమార్గమును, ఈయుషాం=పొందినట్టి మా ఇంద్రియ వృత్తులకు, శ్రీ కరగ్రహం- శ్రీ=ముక్తి సంపదను కూర్చునట్టిదియు అనగా జ్ఞానము గ్రహింపజేయునట్టిదియు, కాంత కామదం, క=బ్రహ్మ పదార్థమునకు సంబంధించినట్టి సుఖమును, అంత=నాశనము చేయునట్టి, కామ=కోరికలను, దం=ఖండించునదియు, ('దఖండనే' అనే ధాతు రూపం) కరసరోరుహం, కర=చేయునట్టివి అనగా కర్మల యొక్క, సరః=ప్రవాహమందు, అరుహం=మొలవ నట్టియు, అనగా కర్మమార్గంలో లభించనట్టిదియునగు అనగా జ్ఞానమును అని అర్థం, శిరసి=మా తల యందు అనగా మా ఆలోచనా కేంద్రమందు, నిధేహి=ఉంచుము.

అనగా ముక్తి ధర్మమును నడిపించు ఓ కృష్ణ తత్త్వమా! (విషయ నివృత్తి తత్త్వమా!) మేము జనన మరణ పరిభ్రమణ భయంవల్ల నిన్ను పొందడానికి సాధన చేస్తున్నాం. నీ సంబంధమైనజ్ఞానం అనగా విషయనివృత్తి జ్ఞానం అన్ని విషయవాంఛ లను నాశనం చేసేది, ముక్తిసుఖాన్ని చ్చేది, ఎన్ని కర్మలుచేసినా ఆ కర్మమార్గంలోఫలితాన్ని కల్గించనిదియునై యున్నది. అట్టి జ్ఞానాన్ని మాలో ప్రవేశపెట్టుము. అని ఆ సాధకుని మనోవృత్తులు పరబ్రహ్మతత్త్వాన్ని కోరుకొన్నాయి. అని అంతరార్థపరమైన అర్థం దీనిలో గ్రహించవచ్చును.

శ్లో॥ వ్రజ జనార్తిహన్ వీర! యోషితాం
నిజ జనస్మయ ధ్వంస నస్మిత!
భజ సఖే! భవత్కింకరీస్మనో
జలరుహాననం చారు దర్శయ ॥6॥

టీక॥ వ్రజజన+ఆర్తిహన్=గోకులంలోని జనుల బాధలను పోగొట్టినవాడా! వీర!=వీరుడా! నిజజనస్మయధ్వంసనస్మిత=నీ వారమైన మాయొక్క గర్వాన్ని పోగొట్టే మందహాసం కలవాడా! సఖే!=సఖుడా! భవత్కింకరీః=నీ దాసీలమైన, నః=మమ్ము, భజ=పొందుమా, యోషితాం=స్త్రీలమైన, నః=మాకు, చారు=అంద మైనదైన, జలరుహాననం=పద్మమువంటి నీ ముఖమును, దర్శయ=చూపింపుము.

తా॥ ఓ సఖుడా! నీవు గోకులంలోని జనుల బాధలు పోగొట్టినావు. నీ వార మైన మా యొక్క సౌందర్యాదులవల్ల కల్గిన గర్వాన్ని చిరునవ్వుల చేతనే నీవు తొల గించగలవు. మేము నీకు దాసీలమై యున్నాము. మమ్ము చేరి, నీ ముఖకమలాన్ని మాకు చూపించుమని గోపికలు ఆర్తనాదం చేసేరు.

అంతరార్థం :- వ్రజజనార్తిహన్, వ్రజ=ఇంద్రియ సంఘాతంనుండి, జన=పుట్టే, ఆర్తి=జనన మరణాది రూప బాధలను, హన్=పోగొట్టువాడా!, వీర! వి+ఈ+ర, వి=విగతములైన, ఈ=కోరికలుగల శుద్ధ మనోవృత్తిని, ర=గ్రహించు వాడా! నిర్విషయ వృత్తులను స్వీకరించువాడా! అని అర్థం, నిజ జనస్మయధ్వంస నస్మిత=నీ వారలమైన మాయొక్క అహంకారమును నాశనంచేయు శుద్ధస్వరూపుడా!, సఖే=(ఖైః=ఇంద్రియైః సహితః, సఖః=ఇంద్రియములతో కూడినది మనస్సు, సఖము (మనస్సు) కలవాడులో సఖి అవుతుంది) ఇంద్రియములందు ఉండేది మనస్సులోపల

నుండువాడా! ఇంద్రియాంతర్గతుడు అధోక్షజుడను పరమాత్మ; జీ అధోక్షజుడా! యోషితాం, య+ఉషితాం, 'యాతి ఇతియం' య=జనన మరణాల పరిభ్రమణలో, ఉషితాం=ఉన్నవారమైన, నః=మాకు, చారు=అందమైన, ఆనందమునిచ్చునదైన, జలరుహాననం, 'లడ యోర భేదః' అనే దాని వలన, జడరుహ+అననం అని మార్చి చెప్పాలి, జడ=జడ ధర్మమైన తమస్సునుండి, రుహ=పుట్టిన తామసిక వృత్తులనుండి, అననం=బ్రతికించునట్టి జ్ఞానమును, దర్శయ=చూపించుమా, భవత్కింకరః=నీ వేడి చేయమంటే దానిని చేసే దాసీలమైన మమ్ము, భజ=పొందియుండుమా.

తా॥ ఇంద్రియముల లోపలనున్న మనస్సును ఆకర్షించునట్టిదియు, ఆశ్రయించిన వారి అహంకార మమకారములను పోగొట్టునదియు ఇంద్రియ సంఘాతంవల్ల కల్గు జనన మరణాది బాధలు పోగొట్టునదియు నగు ఓ నిర్వృతిరూప పరబ్రహ్మ తత్త్వమా! మేము నీవు చెప్పినట్లు చేయుదుము. మాలోని జడధర్మమైన తమోగుణాది వృత్తులనుండి రక్షించి జ్ఞానమును మాకు ప్రసాదించుము. ఎల్లప్పుడు నీవు మమ్మంటిపెట్టుకొని కాపాడుచుండుము అని సాధకుల మనోవృత్తులు నిర్వృతి పరమాత్మను అర్థించడం ఇందు అంతరార్థపరంగా కన్పిస్తూంది.

శ్లో॥ ప్రణత దేహినాం పాపకర్శనం
తృణ చరానుగం శ్రీనికేతనం
ఫణి ఫణార్పితం తే పదాంబుజం
కృణుకుచేషునః కృంధిహృచ్ఛయం ॥7॥

టీక॥ ప్రణత దేహినాం=వినయంచేత వంగిన దేహంకల భక్తుల యొక్క, పాపకర్శనం=పాపములను పోగొట్టునదియు, తృణచరానురాగం=(గడ్డిని మేయు) గోవుల వెంబడి నుండునదియు, శ్రీనికేతనం=లక్ష్మీదేవికి నివాసమై యుండునదియు, ఫణిఫణార్పితం=కాళియ సర్పంయొక్క పడగలపై నుండునదియునగు తే=నీయొక్క, పాదపంకజం=పాదపద్మను, నః=మాయొక్క, కుచేషు=స్తనములయందు, కృణు=ఉంచుము, నః=మాయొక్క, హృచ్ఛయం=హృదయమందున్న మన్మథ తాపమును, కృంధి=హరించుము.

తా॥ కృష్ణా! మేము నీకు వంగి నమస్కరిస్తున్నాము. మా పాపాల్ని పోగొట్టునదియు, గోవులవెంట నడుచునదియు, లక్ష్మీదేవిచే సేవింపబడునదియు, కాళియాహి పడగలమీద నాట్యమాడినదియు నగు నీ పాదపద్మాన్ని మా స్తనాలమీద వుంచి మా మన్మథ తాపాన్ని పోగొట్టుమని గోపికలు వేడినారు.

అంతరార్థం :- ప్రణతదేహినాం=వంచి వశపఱచుకొని యున్న దేహం కల వారు అనగా యోగ సాధనలచేత, ఆహార నియమాలచేత దేహాలను శిక్షణలోనుంచి వశ పఱచుకొనే వారియొక్క, పాపకర్మనం=తామస మనోవృత్తులను నాశనం చేసేది, తృణచర+అనుగం, తృణ=గడ్డియందు, చర=చరించుచున్న జీవితత్త్వమును, అనుగం=అనుసరించునది అనగా తృణాదులందుకూడ కల్గిన జీవము తానై యుండు నదియు, శ్రీ=శోభించేదైన ప్రకృతిని, అనుగం=అనుసరించి యుండేదియు అనగా ప్రకృతిలో దాగియుండునదియు, ఫణిఫణార్పితం=పామువంటిదగు కుండలినీ మాయ యందు, అర్పితం=పొందింపబడి యుండునదియు, (యోగమార్గంలో పామురూపం గల కుండలినీ శక్తియొక్క శిరస్సుపై నుండునదియు) నగు, తే=నీయొక్క, పద+అంబు+జం; స్థానమైన నీటియందు పుట్టిన భగవత్ శక్తిని భగవంతుడు ముందు నీటిని సృజించి ఆపైని ఆ నీటిలో తన శక్తిని ఉంచేడు. "ఆప ఏవససర్జాదౌతాసు వీర్యమవా సృత్" అను సూక్తి చెప్పుచున్నది. అనగా శుద్ధ పరమాత్మ శక్తిని, నః= మాయొక్క, కుచేషు='కుంచతి ఇతి కుచః' అనగా అణచి వుంచేవి అనగా ద్వంద్వ గుణములు ద్వంద్వాలు సాధకుని ముక్తికాంక్షను అణచివేస్తూంటాయి. కాన కుచేషు= ద్వంద్వములయందు, కృణు=చేయుమా, లేక ఉంచుమా, నీ శక్తినొసగి మా ద్వంద్వ తాపం చల్లార్చుమా! అని అర్థం. హృచ్ఛయం=హృదయమందున్న మాయను, కృంధి=అణచివేయుమా.

ఓ నిర్గుణతత్త్వమా! మేము దేహాన్ని యోగాది సాధనలతో శిక్షించియున్నాము. మాలోని అజ్ఞాన దోషాల్ని తొలగించుము. గడ్డిపరకలలో కూడ జీవరూపమున నిన్ను చూస్తున్నాము ప్రకృతి రూపుడవగు నిన్ను 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను సాధ నతో మేము చూచుచున్నాము. కాన మాయను తొలగించు నీ మహత్తరమైన నీ శక్తిని మా ద్వంద్వగుణాల యందుంచి ముక్తిని గూర్చిన మా పరితాపమును పోగొట్టుము అని సాధకులలోని మనోవృత్తులు పరమాత్మను ప్రార్థించేయి అనే అంతరార్థం ఇందు ఇమిడి యున్నదిగా గ్రహించాలి.

శ్లో॥ మధురయా గిరా వల్గువాక్యయా
బుధ మనోజ్ఞయా పుష్కరేక్షణ!
విధికరీరి మా వీర! ముహ్యతీః
అధరసీధునాఽఽప్యాయయస్వనః ॥9॥

టీక॥ వీర := వీరుడా ! పుష్కరేక్షణ := పద్మముల వంటి నేత్రములు కల వాడా ! వల్గు వాక్యయా = అందమైన వాక్యములు కల్గినట్టియు, బుధ మనోజ్ఞయా = పండితులకు మనోహరమైనట్టియు, మధురయా = తియ్యనైన, గిరా = మాటచేత, ముహ్యతీః = మోహపెట్టుచున్న, ఇమాః = ఈ, విధికరీః = నీ పనులు నెరవేర్చే దాసీల మైన, నః = మమ్ములను, అధర సీధునా = అధర రసమనే మద్యంచేత, అప్యాయస్వ = తృప్తిపరుచుము.

తా॥ "నీ ఆజ్ఞను పాలించు దాసీజనమైన మమ్ము చల్లని, చక్కని, మనోహర మైన మాటచేత మోహపెట్టి, నీ అధరామృతమిచ్చి తృప్తి తీర్చు"మని గోపికలు వేడిరి.

అంతరార్ధ తాత్పర్యం :- మనస్సునకు నచ్చే విధంగా నిన్ను గూర్చిన చక్కని వాక్యాలుగల మాటలచే అనగా ఉపనిషద్వాక్యాలచే మేము ఆకర్షింపబడియే యున్నాము. ఆ ఉపనిషన్మార్గ విధులను మేము అనుసరిస్తున్నాము కూడ. అయినా అజ్ఞానం మమ్ము విడవడం లేదు. అట్టి మమ్ము అధర సీధువుచేత అనగా న+ధరా, యస్మిన్ తత్ అధరం అని అవుతుంది. అంటే భూసంబంధమైనదేమీ లే డి యగు నీ నివృత్తి తత్త్వం (కృష్ణ తత్త్వం) అనే మత్తు రసంచేత తన్మయత్వం కల్గించుము అనగా మేమింతవరకు ఉపనిషద్వాక్యాలు చెప్పిన ప్రకారం నడుచుకొంటూనే వున్నాం కాని మాలోని ఐహిక ప్రవృత్తి మాత్రం వానివల్ల పోవడం లేదు కాన నీ నివృత్తి తత్త్వాన్ని మాకు బాగా అందేటట్లు చేసి మరేమీ తెలియని విధంగా మాకు తన్మయత్వాన్ని కల్గించు'మని ఆనందరూపమైన నివృత్తి తత్త్వాన్ని సాధకుల మనోవృత్తులు అంత రంగికంగా కోరుకొనడం ఇందు అంతరార్ధంగా కన్పిస్తూంది.

శ్లో॥ తవ కథామృతం తప్త జీవినాం
కవిభిరీడితం కల్మషాపహం
శ్రవణ మంగళం శ్రీ మదాతతం
భువిగృణంతి యే భూరిదాః జనాః ॥9॥

ఈ శ్లోకానికి బాహ్యార్ధం అంతరార్ధం రెండూ ఒకటే !

తా॥ "నీ కథలు అమృతం, అనగా రుచికరమైనట్టి ముక్తినిచ్చేవి అని అర్ధం. త్రివిధ తాపములచేత శాంతి లేనివారికి చిత్తశాంతి నిచ్చేటి నీకు సంబంధించిన ఆ కథలు కవులచే చెప్పబడినవి. ఆ కథలు మనోనైర్మల్యాన్ని కలిగిస్తాయి, ఆ కథలు

వింటే సర్వసుఖాల్ని అనుభవిస్తాయి, ఆ కథలు మోక్ష సంపదను విస్తరింపజేస్తాయి. ఆ కథల్లో ఆ మహానుభావులు ఎన్నెన్నో ప్రయోజనాల్ని నిక్షేపించేరు. ముక్తి మార్గం చేర్చే సంగతులనుకూడ కథల్లో ప్రవేశ పెట్టేరు." అని గోపికలు కృష్ణుణ్ణి కీర్తించేరు. ఇందులో వ్యాసుడు తాను ఈ భాగవతంలో వ్రాసిన కృష్ణగాథలన్నీ ముక్తిమార్గాన్ని సాధించే సాధనలుగా నిక్షేపించి చెప్పేడన్న సంగతి తానే వెల్లడిస్తూన్నట్లు స్పష్టంగా మనకు గోచరిస్తూంది. అంతరార్థం లేకపోతే ఆ కథలు బాహ్యార్థంలో మోక్షము నిచ్చేవి కావు. కాన భాగవత కథలన్నిటికీ ముక్తి పరమైన అర్థం వుండి తీరింది అని చెప్పాలి. అంతరార్థాలు చెప్పికొన్నప్పుడే అవి విముక్తిపరమైన మౌతాయి.

శ్లో॥ ప్రహసితం ప్రియ ! ప్రేమ వీక్షణం
విహరణంచతే ధ్యాన మంగళం
రహసి సంవిదోయా హృదిస్పృశః
కుహక ! నోమనః క్షోభయంతిహి ॥10॥

టీ॥ ప్రియ ! = ప్రియుడా !, తే = నీ యొక్క, ప్రహసితం = చక్కనినవ్వు, ప్రేమ వీక్షణం = ప్రేమతో కూడిన చూపు, విహరణంచ = విహారమూ కూడ, ధ్యానమంగళం, ధ్యాన = ఆలోచనమునందు, మంగళం = శుభమును కల్గించునది, కుహక = ఓ మోసగాడా ! యాః = ఏవి, రహసి = నీ తోడి రహస్యమందు, సంవిదః = మేము ఎఱింగిన విషయాలు, హృది = మనస్సునందు, స్పృశః = నాటి కొన్నవై యున్నవి, అవి నః = మా యొక్క, మనః = మనస్సును, క్షోభయంతి = బాధించు చున్నవి.

తా॥ ఓ ప్రియుడా ! ఇదివరకు నీవు నవ్విన నవ్వులు, నీవు చూచిన ప్రేమ చూపులు, ఆడిన ఆటలు అన్నీ కూడ తలచుకొన్నప్పుడెల్ల ఆనందాన్నే కల్గిస్తూ న్నాయి. కాని ఓ మోసగాడా! నీవు మాతో రహస్యంలో చేసిన పనులు మా మనస్సులో తీవ్రంగా నాటికొని తలచుకొన్నప్పుడెల్ల అవి మమ్ము బాధిస్తూనే వున్నాయి. కాన మాతో కూడి మమ్ము పూర్తిగా ఆనందపెట్టుమని గోపికలు కృష్ణుని వేడుకొన్నారు.

అంతరార్థం :- ప్రియ = ఇష్టుడా ! తే = నీ యొక్క, ప్రహసితం = చక్కని నవ్వు కల్గించే విషయమూ, ప్రేమ వీక్షణం = ప్రేమతో చూచిన విషయమూ, విహరణంచ = ఆటలాడిన విషయమూ కూడ, ధ్యా + న + మంగళం, ధ్యా = బుద్ధిచేత, మంగళం = ముక్తి శుభమును కల్గించేది, న = కాదు, కుహక = మాయావృతుడా !

రహసి=బైటకు కానరాకుండా లోలోపలి ఆలోచనయందు అనగా నిగూఢమైన అంత రార్థ దృష్టియందు, సంవిదః=బాగా తెలిసిన విషయాలు, హృది=హృదయమునందు, స్పృశః=విడవకుండా ఉన్నవై, నః=మా యొక్క, మనః=మనస్సును, క్షోభయంతి= కలతను కల్గిస్తున్నాయి.

తా॥ "ఆనందకరమైన ఓ పరమాత్మా! పైకి కానవచ్చే నీ సంబంధించిన అనగా సగుణ సంబంధములైన, నీవు నవ్వినట్లు చెప్పే కథలు, నీవు ప్రేమగా చూచి నట్లు చెప్పే కథలు, ఆటలాడేవని చెప్పే కథలు అన్నీ కూడ బాహ్యార్థంతోనే చూస్తే అవేవీ ముక్తిని కల్గించేవి కావు. ఆ కథల్లో అంతరార్థపరంగా ఉన్న భావాలు మాత్రం మా హృదయాల్లో నాటుకొనిపోయి మా మనస్సును ముక్తికొఱకు ఆరాటం అనగా ముక్తికై సంచలనం కలిగిస్తున్నాయి." అని సాధకుల మనోవృత్తులు కృష్ణ కథలలో అంతరార్థపరంగా నున్న కృష్ణతత్త్వాన్ని అనగా నివృత్తి తత్త్వాన్ని గ్రహించి ముక్తి యర్థిస్తున్నట్లు ఈ శ్లోకంలో నిర్గుణ పరమాత్మయొక్క విశిష్టత్వాన్ని వెల్లడిస్తూంది.

వ్యాసభగవానుడు ఈ శ్లోకంలో కూడ తాను భాగవతంలో వ్రాసిన సగుణ పరములైన భగవత్కథలన్నిటికీ, కథాపరంగా ముక్తి కల్గించే శక్తిలేదనీ, వానిని అంత రార్థపరంగా తెలిసికొన్నప్పుడు మాత్రమే అవి ముక్తిని కల్గించే శక్తి కలదిగా తెలుస్తా యనీ సాధకులను కంఠోక్తిగానే ప్రబోధిస్తూన్నట్లు స్పష్టపడుతూంది. మఱి కథలుగా ఎందుకు వ్రాశాడంటే సాధకులకు జ్ఞాపకకోశంలో (Memory) అవి మఱచి పోని విధంగా నిల్వరించి వుంచడానికే అట్లు మానవ జీవిత ఘట్టాలుగా వుండే విధంగా వ్రాసివున్నాడని, అట్లా చేయక కేవలం నగ్నంగా సాధనా విషయాలు సూత్రాలుగా చెప్తే అవి సాధకులకు గుర్తులో వుండడం సులభంగా శక్యం కాదనీ సగుణ తత్త్వాన్ని మేళవించి కథలుగా చెప్పడం జరిగిందనీ మనం గ్రహించక తప్పదు.

శ్లో॥ చలసియత్ వ్రజా, చ్చారయన్ పశూన్
నళిన సుందరం, నాథ ! తే పదం
శిలతృణాంకురైః, సీదతీతి, నః
కలిలతాం మనః, కాంచగచ్ఛతి ॥11॥

టీ॥ కాంత :=ఓ కాంతుడా !, నాథ=నాథుడా ! వ్రజాత్=గొల్లపల్లెనుండి, పశూన్=పశువులను, చారయన్=త్రోలుతూన్నవాడవై, చలసి ఇతియత్=తిరుగు చున్నావని అనేది, తే=నీ యొక్క, నళినసుందరం=పద్మమువలె మృదువైన, పదం=

పాదము, శిలతృణాంకురైః=రాళ్ళచేత, గడ్డి మొలకలచేత, సేదతి=బాధ నొందు చున్నది అనేది, నః=మా యొక్క, మనః=మనస్సును కలిలతాం=వ్యాకులతను, గచ్ఛతి=పొందించుచున్నది.

తా॥ ఓ. నాథా: నీవు గొల్లపల్లెనుండి పశువులను త్రోలుకుంటూ వస్తూన్నప్పుడు రాళ్ళు, సూదులవంటి గరిక మొలకలు గ్రుచ్చుకొనుటవల్ల నీ పాదాంకు ఎంతగా నొప్పి కల్గిందో అని మా మనస్సు ఎంతో బాధపడుతూంది సుమా ? అని గోపికలు బాధతో పల్కారు.

అంతరార్థం :-

నాథ=ప్రభూ! కాంతః క+అంత, క=ఐహికభోగసుఖాల్ని, అంత=నాశము చేయు నివృత్తి తత్త్వమా: వ్రజాత్=ఇంద్రియ సమూహ స్థానమైన మనస్సు నుండి, పశూన్=ఇంద్రియ వృత్తులను, చారయన్=నడిపిస్తూన్న వాడవై, శిలతృణాంకురైః= శిలలవలె యున్నట్టి అనగా కఠినములైనట్టి, తృణాంకురముల వలె నున్నట్టి అనగా గ్రుచ్చు కొనునట్టివై యున్నట్టిది అగు ఆధిభౌతిక, ఆధిదైవిక ఆధ్యాత్మిక తాపాలచేత, నళిన సుందరం=సహస్రారపద్మ మండలి పర బ్రహ్మ సంబంధమైన, పదం= స్థానము అనగా పరబ్రహ్మ నివసించే నిర్వృతి స్థానము, సీదతి= వినాశస్థితి నొందు చున్నవి, ఇతియత్=అనే సంగతి, నః=మాయొక్క, మనః=మనస్సును, కలిలతాం= 'కలిం మాయాం లాతి గృహ్ణాతి ఇతి కలిలం', తస్యభావః, కలిలతా, కలిలతాం= మాయావరణ భావమును, గచ్ఛతి=పొందుచున్నది.

తా॥ ఐహిక సుఖాలాలసతల్ని నాశం చేసే ఓ కృష్ణతత్త్వమా: ఓ నివృత్తి తత్త్వమా: నీవు మా మనస్సుల నుండి ఐహిక వృత్తుల్ని బైటకు లాగి వానిని సక్రమ మార్గంలో నడుపుతూంటావు. అప్పుడు మా ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపాలతో కూడిన మనోవృత్తులను పైకి లాగేటప్పుడు నిర్వృతిపరమాత్మకూడ మాయా స్వరూపాన్ని వహించడం వల్ల దానికి కూడ ఆ తాపత్రయము బాధను కల్గిస్తుందేమో అని మాయావరణంతోనే అప్పుడప్పుడు నిర్వృతి పరమాత్మయొక్క నిజస్థితి అర్థం కాక సాధకుల మనోవృత్తుల మాయావృతమైన ఆరాటం అంతరార్థపరంగా ఇందులో ద్యోతకమౌతూంది పాపుల పాపాల్ని భగవంతుడు తాను వహించి వాటిని తాను అనుభవిస్తాడని కొందఱు అన్య మతాలవారు, కొందఱు మన మతాలవారు భావిస్తూండడం అజ్ఞాన విలసితం అనే సంగతి కూడ ఇందు తెలిసికోవచ్చు.

శ్లో॥ దిన పరిక్షయే నీలకుంతలైః
వనరు హాననం బిభ్రదావృతం
ఘన రజస్వలం దర్శయన్ ముహుః
మనసి, నస్స్మరం వీర! యచ్ఛసి ॥12॥

టీక :- దినపరిక్షయే=పగటిభాగం అంతా గతించిన తర్వాత అనగా సాయం సమయములందు, నీలకుంతలైః=నల్లనైన ముంగురులతో, బిభ్రత్=పొందినదై, ఆ వృతం=ఆవరింపబడినదియు, ఘనరజస్వలం=ఎక్కువగా దుమ్ము కొట్టి యున్నట్టిదియు నగు, ఆననం=నీ ముఖమును, దర్శయన్=మాకు (మనస్సులలో) కన్పింపజేయు చున్నవాడవగుచు, వీరః=ఓ వీరుడా! ముహుః=మాటి మాటికి, స్మరం=మన్మధుణ్ణి, యచ్ఛసి=ఇస్తున్నావు (మన్మధోద్రేకం కల్గిస్తున్నావు)

తా॥ ఓ వీరుడా! నీవు సాయంకాల సమయాల్లో గోవుల్ని తోలుకొని వస్తూ న్నప్పుడు నల్లని ముంగురులు వ్రేలాడుతూ, దుమ్ము కప్పియున్న నీ ముఖాన్ని మా మనస్సులలో ఇప్పుడు కూడ తోపింపజేస్తూ మా మనస్సులో మాటిమాటికి మన్మధో ద్రేకాన్ని రేకెత్తిస్తున్నావు ఇది వీరవృత్సం కాదు సుమా! అని గోపికలు కృష్ణుని నిందా గర్భంగా ఎత్తి పొడిచేరు.

అంతరార్థం :-

దినపరిక్షయే, దిన=ప్రకాశ మానమైన వివేకము యొక్క, క్షయే=నాశమైన కాలమందు అనగా అజ్ఞాన సమయాల్లో, నీలకుంతలైః, నీల=నల్లనైన, అనగా తమో గుణ సంబంధమైన, కుం=భూమిని గూర్చిన అనగా ఐహికములైన తలైః=ప్రదేశము లచే, అనగా తమోగుణంతో ఐహికములైన కోరికలచేత, బిభ్రత్ = భరించినదై ఆవృతం=మామనసు లందావరించినట్టిదియు నగు, ఘనరజస్వలం గొప్ప రజోగుణం కల్గినదియు, వనరుహాననం= (వన పదానికి జలం అర్థం. జలం మాయకు సంకేతం) వనరుహ మాయలో పుట్టిన గుణత్రయమును, అననం=బతికించునట్టి అజ్ఞానమును, ముహుః = మాటిమాటికి, నః=మాయొక్క, మనసి=మనస్సునందు, దర్శయన్= చూపిస్తూ, స్మరం=స్మరణమును అనగా తలంపును, యచ్ఛసి=ఇస్తూన్నావు. అనగా జ్ఞాపకం చేస్తూన్నావు.అజ్ఞానంలో మమ్ము పడవేస్తున్నావు అని భావం.

తా॥ ఓ కృష్ణతత్త్వమా! మాకు నీ సంబంధమైన వివేకం పోయిన సమయాల యందు మమ్ము ఐహికభోగ లాలసతతో తమోగుణవృత్తుల చేత, రజోగుణ వృత్తుల

చేత మాకు అజ్ఞానాన్ని కల్గిస్తూ, ఆ అజ్ఞానాన్నే మేము అనుభవించేటట్లు చేస్తున్నావు. మరి మేము నిన్ను దర్శించేదెట్లు? అని సాధకుల లోపలి సాధనా వృత్తులు ఆవేదన పడడం అంతరార్థపరంగా ఇందు చెప్పబడింది.

శ్లో॥ ప్రణత కామదం పద్మజార్చితం
ధరణి మండనం ధ్యేయ మాపది
చరణ పంకజం శం తమం, చ తే
రమణ! న స్తనేష్వ ర్పయాధిహన్! ॥13॥

టీక :- ఆధిహన్=మనోవ్యథలు తొలగించు వాడా! రమణ = ఆనందం కల్గించు వాడా! ప్రణత కామదం = మిక్కిలి వంగి నమస్కరించువారి కోర్కెలను తీర్చునట్టిదియు, పద్మ జార్చితం=బ్రహ్మదేవుని చేత, లేక లక్ష్మీదేవి చేత పూజింపబడి నట్టియు, ధరణి మండనం=భూమికి అలంకారమైనట్టిదియు, ఆ పది =ఆపత్సమయ మందు, ధ్యేయం=ధ్యానింప దగినట్టిదియు, శంతమమ్‌చ = అత్యంతము సుఖమును కల్గించునట్టిదియు కూడ నగు, తే=నీ యొక్క, చరణ పంకజం=పాదపద్మాన్ని, నః=మా యొక్క, స్తనేషు=స్తనముల యందు, అర్పయ=ఉంచుము.

తా॥ మా మనోవ్యథలు తీర్చి ఆనందం కల్గించే కృష్ణా! నమస్కరిస్తే చాలు కోర్కెలు తీర్చేవీ, బ్రహ్మాదుల చేత పూజింపబడేవీ, అలంకారమైనవీ, ఆపత్కాలంలో స్మరిస్తే ఆపత్తులు తీర్చేదీ. అయిన నీ యొక్క పాదపద్మాల్ని మా స్తనాల మీద వుంచి మా మన్మథ తాపాల్ని పోగొట్టుము—అని గోపికలు కృష్ణుని వేడుకొన్నారు.

అంతరార్థం :-

అధిహన్, అధి=మనోమలినములను, హన్=నాశంచేయువాడా! ప్రణతకామదం, ప్ర=విశేషంగా, నత=వంచివేసిన, కామ=కోర్కెలు కలవారి అనగా ముక్తిని గూర్చిన వాంఛ గలవారికి, దం=ముక్తినిచ్చునట్టిదియు, పద్మజార్చితం, పతతి ఇతిపత్; 'పత్+మా+యేషాంతే, పద్మాః' అని అవుతుంది. పత్ = నాశనమయిన, మాః+ప్రకృతి మాయ కలవారి చేత అనగా మాయను నాశం చేసిన వారిచేత, (మా అనగా మాయా ప్రకృతి అని అర్థం) అర్చితం=పూజింపబడు నట్టిదియు, ధరణి మండనం=భూమియందలల కారమైనది, అనగా భూ విషయికములగు నన్నిటిని భాసింపజేయు నట్టిదియు నని అర్థం. ఆపది, ఆ=అనునది ప్రకృతిని చెప్పే పదం, 'అ' అంటే

సర్వవ్యాపక పరమాత్మ అర్థం-దానిపైని స్త్రీత్వవివక్షలో 'టాప్=ప్రత్యయం' చేస్తే, 'ఆ' అనిఅవుతుంది పరమాత్మ యొక్క స్త్రీ ప్రకృతి కాన 'ఆ' అనునది ప్రకృతికి అర్థం, ఆపది=ప్రకృతి యొక్క స్థానమందు, ధ్యేయం= ధ్యానింపదగినట్టిదియు, (అనగా పరమాత్మకు వేరే రూపం లేదు. ప్రకృతిలోనే పరమాత్మ వుండి వున్నాడు కాన ప్రకృతియే పరమాత్మకు స్థానమైనడియు. కాన 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను భావంతో ప్రకృతిని పరమాత్మ భావంతో ధ్యేయ స్థానంగా సాధకులు చేసికోవాలి అనే అర్థం 'ఆపది ధ్యేయం' అన్న విశేషణంలో గ్రహించాలి) చరణ పంకజం, చరణ=నమలుచున్న అనగా అనుభవిస్తూన్న ప్రారబ్ధ కర్మ అను నట్టి, పంక= అజ్ఞానమునకు, జం=జనన స్థానమైనట్టిదియు, అనగా ప్రారబ్ధ కర్మల పుట్టుకకు కారణ మైనదియు నగు, తే=నీ యొక్క, శంతమం=అత్యంతమైన సుఖాన్ని అనగా బ్రహ్మా నందాన్ని, నః=మా యొక్క, స్తనేషు=కర్మో పాసనా మార్గ ద్వంద్వమునందు, అర్పయ= ఉంచుము అనగా మా కర్మోపాసనల ద్వారా ముక్తిని ప్రసాదింపుమని భావము.

తా॥ ఓ నివృత్తి తత్త్వమా! మేము ఇంద్రియ సంఘాతమును, సాధనలచే శిక్షించుకొని యున్నాము. ఆ సాధనలచేత మాయను నాశనం చేస్తున్నాము. మా ఐహికములైన భోగములలో నిన్ను దర్శిస్తున్నాము. సర్వ ప్రకృతియు నీవిగా భావి స్తున్నాం. అయినా మేము కర్మోపాసనా మార్గాల్ని ద్వంద్వ గుణాల్ని విడవలే కున్నాము కానీ ఆ కర్మో పాసనా మార్గములందు ముక్తి రూపమైన నీ ఆనంద స్వరూ పాన్ని మాకు అందజేయ వలసినదిగా గోరుచున్నాము అని సాధకుల మనోవృత్తులు బ్రహ్మానంద తత్త్వాన్ని అర్థిస్తున్నాయి అని ఇందు గ్రహించాలి.

శ్లో॥ సురత వర్ధనం శోక నాశనం
స్వరిత వేణునా సుష్ఠు చుంబితం
ఇతరరాగ విస్మారణం నృణాం
వితర వీర ! న స్తేఽధరామృతం ॥14॥

టీ॥ వీరః = ఓ వీరుడా ! సురతవర్ధనం=సంభోగమును వృద్ధిపరచునట్టి దియు, శోక నాశనం=వియోగ శోకమును పోగొట్టునదియు, స్వరిత వేణునా=సంగీత స్వరములతో కూడిన పిల్లనగ్రోవి చేత, సుష్ఠు=చక్కగా, చుంబితం=స్పృశింప బడినడియునగు, తే=నీ యొక్క, అధరామృతం=పెదవుల నుండి కల్గు అమృత

రసమును, నృణాం=నరులమగు మాకు, ఇతర రాగ విస్మారణం=ఇతరములైన కోరికలను మరపించునటిది.

తా॥ కృష్ణా ! నీ అధరము అమృతాన్ని ప్రవహింపజేసి మాకు సంభోగ సుఖాన్ని వృద్ధి చేస్తుంది. నీ అదరము పిల్లనగ్రోవిచే చక్కగా సంగీత స్వరాలు పల్కుతుంది. ఆ అధరమును ఇట్టిదట్టిదన లేము. అది ఇతరములైన కాంక్షల నన్నిటిని గూడ మరపింపజేసే ఆనందాన్నిస్తుంది. దాన్ని మాకు ప్రసాదించుము అని గోపికలు కృష్ణుని ప్రార్థించేరు.

అంతరార్థం :-

వీర, వి+ఈ+ర, వి=విశేషముగనైన, ఈ=కోరికలకు, ర=అగ్నియైన వాడా ! మా కోర్కెల సంబంధించిన ఇంద్రియ వృత్తులను నాశం చేయు నిర్వృతి రూప పరబ్రహ్మ స్వరూపా ! సురత వర్ధనం, సు=సుగతికి అనగా ముక్తి సంబంధించిన, రత=ఆనందమును అనగా నిర్విషయానందమును, వర్ధనం=వృద్ధిచేయు నట్టిదియు, శోకనాశనం=జనన మరణ విచారము లేకుండ చేయునట్టిదియు, స్వరిత వేణునా, స్వంరత='స్వరితం' అనే ఉచ్చైస్స్వరంతో కూడిన, వేణునా=వేదనాదంతో, సుష్ఠు=చక్కగా, చుంబితం=స్పృశింపబడి నట్టిదియు, ఇచ్చట వేణునాదం వేదధ్వనికి ఉపలక్షకం, వేణువువల్ల వచ్చే ధ్వని ఉదాత్తానుదాత్త స్వరితములనే స్వరాలతో కూడిన వేదధ్వనిగా గుర్తింపబడింది. కాన వేణుపదం వేదధ్వనికి ఉపలక్షకంగా చెప్పుకో వచ్చును. వేణుధ్వనితో అనగా వేదస్వరంతో స్పృశింపబడినది పరబ్రహ్మ తత్త్వమని అర్థం. వేదమే పరబ్రహ్మ తత్త్వాన్ని తెల్పినది. అట్టిదైన తే=నీ యొక్క, అధరా+అమృతం, అధర=భూ సంబంధము లేనిదీ, అమృత=నాశం లేనిదీ అగు విషయ రాహిత్య తత్త్వం అనగా కృష్ణతత్త్వం, నృణాం=నశించే నరులకు, ఇతర రాగవిస్మారణం=ఇతర విషయములందు రాగం లేకుండా చేయునది యగుచున్నది.

తా॥ విశేషంగా మేము కోరే కోర్కెలకు సంబంధించిన ఇంద్రియ వృత్తులను నాశం చేయునట్టి నిర్వృతిరూప బ్రహ్మ తత్త్వమా ! నీవు ముక్తి సుఖాన్ని మాలో వృద్ధి చేస్తావు. మమ్ము చావులేని స్థితిని అనగా అమృత స్థితిని పొందిస్తావు. నీవు స్వరబద్ధమైన వేద ప్రతిపాదిత స్వరూపమవు. నీ తత్త్వము విషయ నిర్వృతి తత్త్వము. (అదే కృష్ణతత్త్వము) ఆ తత్త్వమును మాకు ప్రసాదించి మాకు విషయ నివృత్తి కలిగించుము అని సాధకులలోని సాధనావృత్తులు నిరాకార నిర్వృతి పరబ్రహ్మమును వేడుకొన్నాయి.

శ్లో॥ అటతి యద్భవా నహ్ని కాననం
తృటి యుగాయతే త్వా మపశ్యతాం
కుటిల కుంతలం శ్రీముఖం చతే
జడ ! ఉదీక్షతాం పక్ష్మకృ ద్దృశాం ॥15॥

టీక: భవాన్=నీవు, అహ్ని=పగటివేళయందు, కాననం=అరణ్యమును గూర్చి.

అంతరార్థ టీక : అజడ := జడముకాని ఓ చైతన్య పరమాత్మా !, (మూడవ పాదం చివర 'తే' అనుదాని తర్వాత 'అజడ' అని పూర్వరూప సంధితో విడదీయ వచ్చును) న+అహ్ని=అనహ్ని, భవానహ్ని ; భవ+అనహ్ని, భవ=సంసారమనెడు, అనహ్ని=రాత్రియందు, అనగా తమోగుణమందు, కాననం, క+అననం, క=సుఖ మును, అననం=రక్షించుకొనుటను గూర్చి, అటతియత్=(సాధకుడు) తిరుగుచున్న ప్పుడు, త్వాం=నిన్ను, అపశ్యతాం=చూడజాలని సాధనా వృత్తులకు, తృటి=క్షణ కాలం. యుగాయతే=యుగముగా పరిణమించుచున్నది. తమోగుణంతో సుఖాభిలాషకై సాధకుడు ప్రయత్నించుచున్నప్పుడు సాధకునిలోని సాధనా మనోవృత్తులు నిన్ను చూడజాలకపోవుటచేత, క్షణమును ఒక యుగంగా గడుపుతూ బాధపడ్తాయి అని భావం. త్వాం=నిన్ను, పక్షకృత్‌దృశాం=కనురెప్పలను చేధించి వేసినట్లుగా ఎల్ల ప్పుడూ చూచునట్టి, ఉదీక్షితాం=ఉన్నతమైన జ్ఞానదృష్టితో చూచువారికి, కుంతలం= భూ ప్రదేశము, (అలుక్సమానము) తే=నీ యొక్క, శ్రీముఖం=చక్కని ముఖమగు చున్నది. రెప్పపాటు లేకుండా వుంటే అనగా ఎప్పుడు విడవకుండా వుండే ఉన్నత జ్ఞానదృష్టి గలవారికి భూమిపైని గల సమస్త ప్రకృతియు పరమాత్మగానే కన్పిస్తుంది అని భావం.

తాత్పర్యం :- సాధకుడు అప్పుడప్పుడు తమోగుణంతో సుఖలాభం కోసం యత్నిస్తూన్నప్పుడు సాధన లెన్నిచేసినా పరమాత్మ సాక్షాత్కారం ఎన్ని యుగాల కైనా పొందలేడనీ రెప్పపాటు లేనట్టుగా జ్ఞానదృష్టితో నిన్ను నిత్యమూ చూచేవారికి భూమి అంతయూ పరమాత్మ స్వరూపంగానే కన్పిస్తుంది అని 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధనా వృత్తులవల్ల గ్రహించాలన్నది ఇందలి అంతరార్థం.

అటతియత్=తిరుగుచున్నప్పుడు, త్వాం=నిన్ను, అపశ్యతాం=చూడన్ని వారికి, తృటి=క్షణమాత్రకాలము, యుగాయతే=యుగముగా అగుచున్నది, కుటిల కుంతలం=వంకర ముంగురులు గల, తే=నీ యొక్క, శ్రీముఖం=శోభాయుక్తమైన

ముఖమును, ఉదీక్షతాం=కన్నులు ఎత్తిపట్టుకొని చూచువారలకు, పక్ష్మకృత్=కను రెప్పలను నిర్మించిన వారగు బ్రహ్మదేవుడు, జడః=మందబుద్ధికలవాడు.

తా॥ నీవు పగటి వేళలందు పర్వతాలపైని అరణ్యంలోనికి వెళ్ళితే నిన్ను చూడని వారికి ఒక్కొక్క క్షణం ఒక్కొక్క యుగంగా ఉంటుంది. అటువంటిది నీవు కన్పించని ఇంతకాలము ఈ రాత్రివేళ మాకు ఎన్ని యుగాలుగా ఉంటుందో ఆలోచించు, వంకర తిరిగిన ముంగురులతో కూడిన నీ అందమైన నీ ముఖాన్ని కన్ను లెత్తి చూచేవారికి కనురెప్పలు బ్రహ్మదేవుడు ఎందుకు నిర్మించాడా అని ఆతని జడ బుద్ధికి తిట్టబుద్ధి మాకు కలుగుతూంది అని గోపికలు కృష్ణుణ్ని స్తుతించేరు.

శ్లో॥ పతిసుతాన్వయభ్రాతృ బాంధవాన్
అతి విలంఘ్యతేఽన్త్యచ్యుతాగతాః
గతివిదస్తవోద్గీత మోహితాః
కితవ ! యోషితః కస్త్యజేన్నిశి ? ॥16॥

టీక॥ కితవ ! =మోసగాడా ! పతిసుతాన్వయభ్రాతృ బాంధవాన్=భర్తలను, బిడ్డలను, వంశమును, సోదరులను, బంధువులను, అతివిలంఘ్య=పూర్తిగా వదలివేసి, తే=నీ యొక్క, అంతి=సమీపమును, అచ్యుతాగతాః=విడిచిపెట్టి లేనివారమై వచ్చి నాము, తవ=నీ యొక్క, ఉద్గీతమోహితాః=పెద్దగా చేసిన గానం చేత పరవశులమై, గతివిదః=మార్గం వెదకుతూ వచ్చియున్న, యోషితః=ఆడువాండ్రమైన మమ్ములను, నిశి=అర్ధరాత్రియందు, కః=ఎవడు, త్యజేత్=విడిచిపెట్టును ! ఎవ్వరూ విడువరని భావం.

తా॥ ఓ మోసగాడా ! మేము మా భర్తలను, బిడ్డలను, వంశమును, సోదరులను, బంధువులను అందరినీ పూర్తిగా వదులుకొని నిన్ను విడువలేక నీ సమీపానికి చేరుకొన్నాం. పెద్దగా చేసిన నీ గానాన్ని విని పరవశులమై దారి వెతుక్కుంటూ వచ్చిన ఆడువారిని మమ్ము ఈ అర్ధరాత్రి విడిచిపోవడం నీకు భావ్యం కాదు సుమా ! అని గోపికాస్త్రీలు కృష్ణుని గూర్చి దీనంగా పల్కేరు.

అంతరార్థ తాత్పర్యం :- మమ్ము సగుణ నిర్గుణ తత్త్వాలతో ముఖ్యపెట్టు చున్న ఓ పరమాత్మా! మేము మా అధిపతులైన ఇంద్రియాలను, వాటికి సంబంధ

ధించిన త్రిగుణాలను, ద్వంద్వాలను సమస్తమును విడిచి నిన్నే భావించుకొనుచున్నాము. నీవు మా అంతరాత్మలో చేసిన గొప్ప ప్రబోధాల్ని ఆలించి నిన్ను చేరే మార్గం తెలిసికొని నిన్ను విడిచిపెట్టకుండా వుంటున్నాము. మేము స్వతంత్రులం కావి మనోవృత్తులం. మమ్ము ఈ తమో గుణమైన అజ్ఞానంలోనే పడవేసిపోవడం నీకు భావ్యమా॰ అని సాధకునిలోని సాధనావృత్తులు భగవద్దర్శనానికి ప్రాధేయపడునవిగా గ్రహించాలి.

శ్లో॥ రహసిసంవిదం, హృచ్ఛ యోదయం,
ప్రహసితా ననం, ప్రేమ వీక్షణం,
బృహదురశ్శ్రియో వీక్ష్య ధామతే
ముహురతి స్పృహాః ముహ్యతే మనః ॥17॥

టీ॥ రహసిసంవిదం=రహస్యమైన సంభోగ విషయాన్ని గుర్తింప జేసేదియు హృత్+శయ+ఉదయం=మా హృదయములోని మన్మథుని ఉద్రేకింపజేసేదియునగు, ప్రహసిత+ఆననం=నీనవ్వు ముఖమునూ, ప్రేమవీక్షణం=నీవలపుచూపునూ, శ్రియః=అందచందాలకు, ధామ=స్థానమైన, బృహత్=విశాలమైన, తే=నీయొక్క, ఉరః=వక్షస్థలమునూ, వీక్ష్య=చూచి, అతి స్పృహాః=మిక్కిలి వాంఛ కలదియై, మనః=మా మనస్సు, ముహుః=మాటిమాటికి, ముహ్యతే=పరవశమగుచున్నది.

తా॥ ఓ కృష్ణా! నీ సంభోగ రహస్యాల్ని అనుభవించియున్న మా మనస్సు, మన్మథోద్రేకాన్ని కల్గించే నీ నవ్వు ముఖాన్ని, ప్రేమచూపుల్ని, అందచందాలు కల్గిన నీ వక్షస్థల శోభను జ్ఞాపకం తెచ్చుకొని మాటిమాటికి పరవశం చెందుతూంది అని గోపికలు మోహంతో కృష్ణుని స్తుతించేరు.

అంతరార్థ తాత్పర్యం :- నీ అవతార కథల్లోని రహస్యమును ఉపనిషత్తుల విజ్ఞానం ద్వారా తెలిసికొన్న మేము, మా హృదయంలో ఉదయించిన నీయొక్క సత్యం శివం సుందరం అన్న పరమాత్మ తత్త్వములను గుర్తించి నీయందే వశపడినవారమైయున్నాము అని సాధకులలోని సాధనావృత్తులు పరమాత్మ తత్త్వాన్ని గుర్తించినవిగా ఇందు చెప్పబడిందిగా గ్రహించాలి. శ్లోకంలోని ప్రహసితాననం అనేది పరబ్రహ్మ తత్త్వమైన సుందర పదాన్ని, ప్రేమ వీక్షణం అనేది శివం అన్న పదాన్ని, ఉరస్సు అనేది సత్యం అనేదాన్ని అంతరార్థపరంగా చెప్తున్నవిగా గ్రహించాలి.

శ్లో॥ వ్రజవనౌకసాం, వ్యక్తి, రంగ ! తే
వృజనహం, త్వలం విశ్వమంగళం
త్యజమ, నాక్చనః త్వత్ స్పృహాత్మనాం
స్వజన హృద్రుజాం యన్ని షూదనం ॥18॥

టీ॥ అంగః=ఓయీ!, తే=నీయొక్క, వ్యక్తిః=అవతారం, అలం=అత్యంతము, వ్రజవనౌకసాం=గొల్లపల్లెలో నివసించే గొల్లవారికి, అడవుల్లోని మునీశ్వరులకు కూడ అనగా అజ్ఞులకు, ప్రాజ్ఞులకు కూడ అని అర్థం, అలం=పూర్తిగా, వృజిన హంత్రి=పాపాల్ని పోగొట్టేది, విశ్వమంగళం=సమస్తశుభాల్ని కల్గించేది, త్వత్ స్పృహ+ఆత్మనాం=నీయందలికోర్కె తోడనేయున్న మనస్సుగలమాకు, స్వజనహృత్ రుజాం=నీవల్లనే పుట్టిన వియోగరూప రోగములకు, యత్=ఏది, నిషూదనం= నాశం చేసేదో, అట్టి దానిని అనగా ఔషధమును, మనాక్=కొంచెము, త్యజ=మా కొఱకు విడిచిపెట్టుమా! ప్రసాదించుమా అని అర్థం.

తా॥ ఓ కృష్ణా! గొల్లపల్లెలోని గొల్లవారికి, అడవులలోని మునులకు కూడ నీ అవతారం పాపాలను పోగొట్టేది, శుభాలను ఇచ్చేదిగాను ఉన్నది. అటువంటప్పుడు నిన్నే నమ్మకొనియున్న మాకు మాహృదయ తాపాల్ని పోగొట్టే దర్శనరూప ఔషధాన్ని ప్రసాదించవా! అని గోపికా స్త్రీలు దీనంగా వేడిరి.

అంతరార్థం :-

'అంగ'=అనగా, అం=సర్వవ్యాపక పరమాత్మను, గ=పొందియున్న మాలోని నిర్వృతి తత్త్వమా! వ్రజవనౌకసాం=ఇంద్రియ సంఘాతము అను అరణ్యంలో వుండే సాధక మనోవృత్తులని అర్థం.

అంతరార్థ తాత్పర్యం :- ఓ నిర్వృతి తత్త్వమా! ఇంద్రియ సంఘాతంలోనున్న మా అహంకారాది ప్రవృత్తి తత్త్వాల్ని పోగొట్టి ముక్తి సాధనలచే ఆనందాన్ని అందిస్తూన్న నిన్నే నిరంతరమూ కొల్చుచున్న మాకు మాహృదయాల్లో పుట్టి రోగాలవలె బాధిస్తూన్న కామక్రోధాధులను, త్రిగుణాలను, ద్వంద్వాలను పూర్తిగా నశింపు చేసే నిర్వృతి రూపమైన మందును కొంచెము మాకు ప్రసాదించుమా! అని నిర్వృతి తత్త్వాన్ని సాధకునిలోని సాధనా వృత్తులు కోరినట్లుగా ఇందు అంతరార్థ పరంగా తెలిసికోవాలి.

శ్లో॥ యత్తే సుజాత చరణాంబురుహం స్తనేషు
భీతాః శనైః ప్రియ! దధీమహి, కర్కశేషు
తే నాటవీమటసి, తద్వ్యథ తేన కించిత్
కూర్పాదిభిః భ్రమతి ధీర్భవదాయుషాంనః ॥19॥

టీక॥

ప్రియః = ప్రియుడా! యత్ = ఏ, తే = నీయొక్క, సుజాతచరణాంబురుహం = చక్కనైన పాదపద్మమును, కర్కశేషు = కఠినములైన, స్తనేషు = మాస్తనములయందు, భీతాః = భయపడుచున్న వారమై శనైః = నెమ్మదిగా, దధీమహి = ధరిస్తున్నామో, తేన = అట్టి నీపాదపద్మముతో, అటవీం = అడవిని గూర్చి, అటసి = తిరుగుచున్నావు. తత్ = అపాదపద్మము, కూర్పాదిభిః = మొనలుదేరిన రాళ్ళు మొదలైన వానితో, కలిసి భ్రమతి = తిరుగుచున్నది. కాన, తత్ = ఆ పాదపద్మము, కించిత్ = కొంచెముకూడ, నవ్యథతే = బాధపొందదంలేదా అని, భవదాయుషాం = నీమీదనే బ్రతుకు పెట్టుకొని జీవిస్తూన్న, నః = మాకు, ధీః = ఆలోచన కల్గుచున్నది.

తా॥ ఓ ప్రియుడా! నీచక్కనైన మృదువైన పాదపద్మమును మేము నీతోడి సంభోగకాలాల్లో మా అతికఠినములైన స్తనాల మీద ఏమి నొప్పికల్గుతుందో అని భయపడుతూ నెమ్మదిగా పెట్టుకొంటూ వచ్చేము. ఇప్పుడు నీవు మమ్ము విడిచి అడవుల్లో తిరుగుతూంటే, మొనలుతీరిన రాళ్ళు గ్రుచ్చుకొని ఆ నీపాదపద్మాలకు ఎంతోనొప్పి కల్గుతూంటుందని బాధపడుచున్నామని గోపికలు తమ సంభోగ విశేషాలు తలంచుకొని బాధపడ్డారు.

అంతరార్థం :-

ప్రియ := ఓ ఆనందరూప పరమాత్మా ! యత్ = ఏ, తే = నీయొక్క, సుజాత చరణాంబురుహం,- సు = సుగతికై అనగా ముక్తికై, జాత = పుట్టినదియు, చరణ = ప్రవర్తించుచున్న, అంబు = నీరూయతో, రుహం = కలిసిపుట్టిన నీ నిర్వృతి తత్త్వమును (నీరు, మాయకు ఉపలక్షకము), కర్కశేషు = అతి క్లిష్ట కర్మలచే కఠినములైన, స్తనేషు = కర్మ ఉపాసనా మార్గములందు, భీతాః = భయంతో కూడినవారమై, శనైః = నెమ్మదిగా, దధీమహి = ధరిస్తున్నాము. మాయాం తర్వర్తియైన నీ నిర్గుణ పరబ్రహ్మ తత్త్వాన్ని మేము కర్మోపాసనా క్లిష్టమార్గములలో నెమ్మదిగా నీ నిర్వృతి తత్త్వం ఎక్కడ చెదిరిపోతుందో అనే భయంతో నిల్పుకొనుచున్నాము అని అర్థం. తేన =

నీ నిర్వృతి తత్త్వంలో, అటవీం=గహనమైన కర్మమార్గంలో, అటసి=తిరుగుచున్నావు, కూర్మాదిభిః=కఠినములైన ఆ కర్మ మార్గములోని కఠిన నియమాలతో, తత్=ఆ నీ నిర్వృతి తత్త్వం, అటతి=తిరుగుచున్నది, అనగా సగుణ తత్త్వంతోనే ముడిపడి నిర్గుణ తత్త్వం నిగూఢంగా ఉంటూంది అని. ఈ విధంగా నిర్గుణతత్త్వం సగుణంతో ముడి పడి వున్నదని, భవదాయుషాం=నీ నిర్వృతి తత్త్వాన్ని మాత్రమే నమ్మి బ్రతికి యున్న, నః=మాయొక్క, ధీః=బుద్ధి, కించిత్=కొంచెంకూడ, నవ్యథతే=బాధ పడదం లేదు. మేము నిర్వృతితత్త్వ రహస్యాన్ని సగుణతత్త్వంలో అంతరార్థపరంగా తెలిసికొనియే యున్నాం అని సాధనావృత్తుల నిశ్చితార్థం.

తా॥ ఓ బ్రహ్మానంద తత్త్వమా ! నీవు మాయాంతర్వర్తివై యుండి జాగ్రత్తగా తెలిసికొనేవారికి మాత్రమే అందుతావు. మేము జాగ్రత్తగా కర్మోపాసనా మార్గము లందు నెమ్మదిగా నీ అవతార కథలలోని అంతర్నిగూఢములైన అర్థములను గ్రహించి నిన్ను మాలో చెదరిపోకుండా నిల్వరించుకొన్నాము. కాన అందుచేత కర్మారణ్యంలో నీవు తిరుగుతూన్నా, ఏ అవతారాల్లో ఏవిధంగా సంసార కర్మలు చేస్తూ సుఖదుఃఖాలు అనుభవిస్తున్నట్లున్నా మాకు నీ తత్త్వాన్ని గ్రహించడానికి ఆటంకం ఏమీలేదు. కాన మేము అవతార కథల విషయంలో కాని, కర్మకాండ విషయంలోకాని, ఉపాసనా విష యంలోకాని, కించిత్తుకూడ నీ తత్త్వానికి అఘాతం కల్గుతుందని అనుకోవడం లేదని సాధకులలోని సాధనా మనోవృత్తులు నిర్వృతి తత్త్వంమీద ప్రగాఢ విశ్వాసాన్ని వెల్ల డించడం ఇందులో స్పష్టపడుతూంది.

వ్యాసమహర్షి ఈ రాసలీలలలో కొన్ని శ్లోకాల్లో గోపికల స్తనములందు పాదాలు వుంచినట్లు, గోపికల శిరస్సులపైని కరములు ఉంచినట్లు చెప్పబడింది. కరము స్తన ములపై ఉంచడం సంభోగ క్రియలో జరుగుతుంది. కాని పాదం వుంచడమేమిటి ? అనీ, స్తనములమీద ఉంచవలసిన 'కరం' శిరస్సుమీద ఉంచడమేమిటి ? అనికూడ పాఠకులకు సందేహం కల్గవచ్చు. స్తనములు హృదయ స్థానములు. భగవంతుని పదం అనగా స్థానం అని అంతరార్థం. అది హృదయమే. హృదయగుహలోనే పరమాత్మ నివాసం. కాన స్తనములందు పదం ఉంచడం అనేది సాధకుల హృదయమందలి భగ వత్ స్థానాన్ని నిర్వృతి తత్త్వం చేరుకొనినదిగా భావించాలి. ఇక శిరస్సు ఆలోచనా కేంద్రంగల మెదడుకు స్థానం. కరంఅనగా చేయునది అనగా పని. అనగా ఆలోచనా క్రియ అని కనపడానికి అర్థం. భగవంతుని గూర్చిన ఆలోచనా క్రియ శిరస్సులోని

మెదడుతో జరిగించాలి అన్న అభిప్రాయం కరం శిరస్సుపై నుంచడం అన్నదాని భావంగా గ్రహించాలి.

మెదడుతో ఆలోచించి మన హృదయంలో నున్న పరమాత్మను గుర్తించాలి అన్నది శిరస్సుపైని కరమూ, స్తనములపైని పదమూ ఉంచడంలోని అంతరార్థంగా పాఠకులు గ్రహించాలి.

# రా స పం చా ధ్యా యి

## (నాల్గో ఘట్టం)

## దశమస్కంధం పూర్వార్థం ముప్పైరెండో అధ్యాయం

ఈ విధంగా గోపికలు కృష్ణుణ్ణి గూర్చి గానం చేస్తూ, ప్రేలాపిస్తూ కృష్ణ దర్శనం కోసం భోరుమని ఏడ్వడం ప్రారంభించేరు.

అంటే, సాధకుల సాధనా వృత్తులు తమకు ఎప్పటికీ నిర్వృతితత్త్వం ఒకసారి అంది, మఱొకసారి అందకపోవడంతో 'మా సాధనాభ్యాసం నిరర్థకమేనా ?' అని తీవ్రంగా ఆరాటం పొందేయి అని అంతరార్థం.

అంతట కృష్ణుడు నవ్వు ముఖంతో పీతాంబరధారియై, సాక్షాత్తూ మన్మధునకే మన్మథోద్రేకాన్ని కల్గించే అందగాడై ఆ గోపికలమధ్య సాక్షాత్కరించేడు.

పీత+అంబర+ధారియై అంటే, పీత=మ్రింగివేయబడిన, అంబర=(అంబరం అంటే వస్త్రం అర్థం, వస్త్రం మాయకు ఉపలక్షకం. కాన) మాయను, ధారి=ధరించినవారు, సాధకుల మనోవృత్తులలోని మాయావరణం తొలగించినవాడై అని అంతరార్థం.

తమ కత్యంత ప్రియుడైన ఆ కృష్ణుని సంతోషంతో కన్నులు విప్పార గోపికలు చూచేరు. గోపికలు అంతా ఒక్కసారి లేచి నిలబడ్డారు. పోయిన ప్రాణం తమలో తిరిగి చేరుకొన్నట్లు వారు ఊరట చెందేరు. అంటే నిర్వృతితత్త్వం తమలో చేరడంతో సాధనా వృత్తులు తమకు తిరిగి జీవనం వచ్చినట్లు ఎదురేగి స్వాగతం చెప్పేయి అని అర్థం.

ఒక గోపిక కృష్ణుని చేయి పట్టుకొని లాగింది. మఱొకతె తనభుజంమీద కృష్ణుని చేతిని పెట్టుకొంది, ఇంకొకతె కృష్ణుడు నమిలి ఉమ్మేస్తూన్న తాంబూలం

తమ్మెను దోసలిపట్టి గ్రహించింది. ఒకతె తన తప్తస్తనాలతో ఆతని పాదాలను అదిమి పట్టింది.

అంటే, ఒక సాధకునిలోని ఒక మనోవృత్తి నిర్వృతితత్త్వాన్ని గట్టిగా తనలో నిలుపుకొనడానికి యత్నించింది. మఱొక మనోవృత్తి ఆ తత్త్వం తన్ను విడవకుండా వుండేటట్లు అంటిపెట్టుకొంది. ఇంకొక మనోవృత్తి నిర్వృతితత్త్వం తన్ను విడిచి బైటకు పోకుండా పట్టుకొని ఆ తత్త్వాన్ని మనస్సులో తాను మ్రింగివేసింది. ఇంకో మనోవృత్తి తాను చేస్తున్న కర్మోపాసనాభ్యాసంతో గట్టిగా ఆ తత్త్వం పాతుకొని పోయి యుండేటట్లు అదిమికొంది అని అంతరార్థాలు పైవాక్యాలకు చెప్పుకోవాలి.

సహింపలేని ప్రేమోద్రేకంతో ఒకనొకతె బొమముడి పాటుతో, పెదవులు కొరుకుతూ చురుకు చూపులతో కొట్టుతూన్నట్లు చూచింది. మఱొకతె రెప్పపాటులేని చూపులతో అతణ్ణి త్రాగేస్తున్నట్లు తదేకదృష్టితో చూచింది. కాని తృప్తితీరక ఉన్న చోటనే కదలిక లేకుండా మ్రాన్పాటుతో నిలబడిపోయింది.

అంటే, సాధకుల్లోని ఒక వృత్తి ఇంతవరకు తమ్ము విడిచి వున్నందుకు ఆగ్రహించిందని, మఱొక వృత్తి పూర్తిగా దానిని ఆకళించుకొంది అని అంతరార్థపరంగా చెప్పుకోవాలి.

శ్లో॥ సర్వాస్తాః కేశవాలోకపరమోత్సవ నిర్వృతాః
బహూః విరహజం శోకం ప్రాజ్ఞం ప్రాప్యయథాజనాః
తాభిర్వి ధూతశోకాభిః భగవాన చ్యుతోవృతః
వ్యరోచతాధికంతాత! పురుషశ్శక్తిభిర్యథా

అందఱు గోపికలుకూడ కృష్ణ పునర్దర్శనానికి బ్రహ్మానందపడ్డారు. విరహతాపాన్ని విడిచిపెట్టేరు వివేకవంతునితో కలిసిన అజ్ఞానులవలె సంబరపడ్డారు.

ఆ గోపికలు విరహతాపం వదలి తనచుట్టూ చేరినపుడు, కృష్ణుడు ప్రకృతి యొక్క శక్తులు పరివేష్టించి యున్న పురుషునివలె ప్రకాశించేడు.

గోపికలన ప్రకృతికి సంబంధించిన వృత్తులని, కృష్ణుని పురుషుడని పై వాక్యంలో ఉపమానంగా చెప్పడంలోనే ఆ పదాలకు అన్నిచోట్ల అవే అంతరార్థము లుగా చెప్పుకోవాలన్న కీలకాన్ని స్పష్టం చేసినట్లుంది.

తర్వాత కృష్ణుడు ఆ గోపికలను కాళిందీ నదియొక్క ఇసుక తిన్నెలమీదికి చేర్చి వారి మనోరథాల్ని సంపూర్తిగా ఫలింపజేసేడు.

శ్లో॥ తద్దర్శనాహ్లాద విధూత హృద్రుజాః
ఘనోరథాంతం శ్రుతయో యథాయయుః
స్వైరుత్తరీయైః కుచకుంకుమాంకితైః
రచకపన్నాసన మాత్మబంధవే.

తా॥ కృష్ణ దర్శనంవల్ల కల్గిన ఆనందంచేత హృదయతాపం పోయినవారై వేదములవలె గోపికలు కృష్ణుని గూడి కోర్కెలయొక్క అంతముల పొందిరి.

కుచములందలి కుంకుమ రచన లంటుకొన్న పైట వస్త్రములను విప్పి ఆత్మ బంధవైన కృష్ణునకు అసనముగా చేసేరు. శ్రుతులవలె 'అతనితో కూడి కోర్కెలు తీర్చుకొన్నారు అంటే వేదాలు కర్మ ఉపాసనా పదములు వానికి పరమాత్మను నేరుగా చూపే శక్తి లేదు. నిర్వృతి తత్త్వం సిద్ధించినపుడే అవి పరమాత్మను దర్శింపజేస్తాయి. అని ఇక్కడ వేదములతోడి ఉపమాన ప్రయోజనం గుర్తించాలి.

గోపికలు తమ స్తనాల్ని కప్పుకొనే పైట వస్త్రాలు తీసి కృష్ణుడికి కూర్చుండ డానికి ఆసనంగా వేసేరు అంటే, స్తనములు కర్మోపాసనా మార్గములకు ఉపలక్షక ములుగా చెప్పుకొన్నాం. కాన స్తనములను కప్పే వస్త్రం అనగా కర్మోపాసనలను ఆవరించి వున్న మాయను అవగా అజ్ఞానాన్ని గోపికల అనగా సాధకుల మనో వృత్తులు తమనుండి తొలగించివేసి ఆ మాయమీద నిర్వృతి తత్త్వాన్ని ప్రతిష్ఠింప చేసేయనేది ఇందు అంతరార్థంగా గ్రహించాలి.

ఇక్కడ కృష్ణునకు దగ్గర చుట్టం అనే బాహ్యార్థంలో ఆత్మబంధవే అని విశేష ణాన్ని వ్యాసుడు ప్రయోగించేడు. అంతరార్థంలో సాధకునిలోని జీవాత్మకు, బంధు వైన పరమాత్మ బంధువనీ, జీవాత్మకుగల వాసనావరణ బంధనాల్ని పరమాత్మ తొల గించి ముక్తిని కల్గిస్తాడనీ, అందుకోసమే కర్మోపాసనా కాండలలోగల మాయావర ణాన్ని సాధకుల మనోవృత్తులు తొలగించివేసి ఆ మాయావరణం తమ్మంటుకొన కుండా పరమాత్మను దానిమీద ప్రతిష్ఠింపజేస్తాయనీ సాధనా రహస్యం ఇందులో తెల్పబడిందిగా గ్రహించాలి.

శ్లో॥ తత్రోపతిష్టో భగవాన్ స ఈశ్వరో
యోగేశ్వరాంతర్హృది కల్పితాసనః
చకాసగోపీ పరిషద్గతోఽర్చితః
త్రైలోక్య లక్ష్మ్యేక పదం వపుర్దధత్

తా॥ పరమేశ్వరుడైన కృష్ణుడు ఆ గోపికల పైట వస్త్రముల పైని కూర్చుండి యోగములలో గొప్పయోగం పొందిన వారియొక్క లోపలి హృదయభాగంలో వుండి త్రైలోక్య చిహ్నమునకు స్థానమైన దేహము ధరించి ఆ గోపికల సమూహం చేత పూజింపబడ్డాడు.

తా॥ ఇందులో వ్యాసుడు తన్మయతతో తాను పొందిన జీవ బ్రహ్మైక్యాన్ని సాధకుల కందించేడని చెప్పాలి కర్మోపాసనల నావరించియున్న మాయ తిరిగి సాధకుల మనోవృత్తుల కంటకుండా ఆ మాయపై ఆనందస్వరూపం నిలబడే విధంగా త్రిగుణములు తానుగా మూడులోకాలు తనకు చిహ్నంగా వుండే తత్త్వంతో సాధకుల లోని సాధనావృత్తులచేత నిర్వృతి తత్త్వం పూజింపబడింది అనే సాధనానుభూతి యొక్క కథనం ఇందు వ్యాసునిచేత కంఠోక్తిగానే చెప్పబడింది. త్రైలోక్యలక్ష్మైక పదం అంటే త్రిగుణాలు త్రిలోకాలు, దేహత్రయమూ సర్వప్రకృతీ కూడ త్రైలోక్య పదానికర్థం. లక్ష్మి పదానికి చిహ్నం అర్థం. ప్రకృతి పరమాత్మయొక్క దేహ చిహ్నం. సర్వగుణాలతోనూ సర్వప్రకృతీ పరమాత్మయొక్క స్వరూపంగా సాధకుల మనోవృత్తులకు అనుభవం కల్గింపబడిందిగా ఇచ్చట వ్యాస హృదయాన్ని అర్థంచేసికోవాలి. తర్వాత గోపికలు తృప్తిపడి ఆతని పాదాలు తమ ఒడిలో పెట్టుకొని ఒత్తుతూ కృష్ణునితో కొంచెం కోపంతో సాభిప్రాయంగా చూస్తూ,

కృష్ణా ! కొందఱు తమ్ము సేవించిన వారిని తాము సేవిస్తూంటారు, మఱి కొందరు తమ్ము సేవించకపోయినా సరే, వారిని తాము సేవిస్తూనే వుంటారు, మఱి కొందఱు తమ్ము సేవించిన వారిని, సేవించని వారిని ఉభయుల్ని కూడ సేవిస్తూంటారు. ఇందుకు కారణం ఏమంటావ్ ? అని అడిగేరు.

కృష్ణుడీవిధంగా సమాధానం చెప్పేడు, 'పరస్పరం ఉపకార ప్రత్యుపకార కాంక్ష తోనే కొంచరు ప్రియురాండ్రు ప్రియుల్ని సేవిస్తూంటారు. వారు కేవలం స్వార్థైక పరాయణలు. వారిలో సౌహృదయంకాని, ధర్మంకాని కన్పించదు. స్వార్థంకోసం తప్ప, ఆ సేవలో మఱో ఉద్దేశమే లేదు. తమ్ము సేవించక పోయినా తాము సేవించే

వారు కొందరున్నారు. వారు తల్లి తండ్రులవంటివారు. వారికి కరుణ, సౌహార్దయం కూడ వుంటుంది. అది 'సాటిలేని ధర్మం' అనిపించుకుంటుంది. ఇంకా, తమ్ము సేవించిన వారిని, తాము సేవించని వారు కొందరున్నారు. అట్టివారిలో కొందరు ఆత్మారాములు, కొందరు ఆప్తకాములు, కొందరు అకృతజ్ఞులూ, కొందరు గురు ద్రోహులూ ఔతారు. ఆత్మారాములు అంటే తమ సంగతులంటే ఆనందపడేవారు అని బాహ్యార్థం. పరమాత్మ యందే ఆనందిస్తూంటారు అనేది అంతరార్థం. ఆప్త కాములు అంటే పొందిన మన్మధుడు కలవారు అనగా మన్మధ తృప్తి తీరినవారు అని బాహ్యార్థం. పొందబడిన కోర్కెలు కలవారు అనగా కోర్కెలు లేనివారు అని అంతరార్థం. అకృతజ్ఞులు అనగా చేసిన మేలు మఱచిపోయే వారని బాహ్యార్థం.

(కృత=చేయబడినదానిని, అజ్ఞులు=గుర్తించని వారు అని విడదీసినపుడు వచ్చే అర్థం, అకృత=చేయబడని దానిని గూర్చి, జ్ఞులు=ఆలోచించేవారు, భవిష్యత్తులో ఏమి చెయ్యాలి అనే ఆలోచన కలవారు అని అంతరార్థం. జరిగిపోయిన దానికి వారు విచారించరు. గురుద్రుహః=గురుపదానికి ఉపకారం చేసిన వారు అని అర్థం వుంది. కాన ఉపకారం చేసిన వారికి ద్రోహం చేసిన వారు అని దానికి బాహ్యార్థం. గురు=గొప్పదైన 'ద్రు' అంటే వృక్షం అని అర్థం-(వృక్షాన్ని ప్రకృతిగా భగవద్గీతలో చెప్పబడింది, హః-నశింపు చేయువాడు అని వ్యుత్పత్త్యర్థం కాన "గురుద్రుహః" అంటే గొప్పదైన ప్రకృతిని నాశం చేసినవారు అనగా ప్రకృతి చింతలేనివారు అని అంతరార్థం చెప్పాలి."

ఓ సఖులారా! నేను నన్ను భజించిన వారిని సేవించను, దానివల్ల మీరు నన్ను కృతఘ్నుడు అనుకోవద్దు. నేను వారు కోరినట్లుగా జేస్తే వారు తృప్తిపడి, మఱి నన్ను అసలే సేవించరు. కాన నన్ను సేవించే మనోవృత్తి నిరంతరం వారిలో ఉండడం కోసమే నేను వారి కోరికలను తీర్చి వారిని అనుసరిస్తూ వుండను.

దరిద్రునకు దైవవశంవల్ల ఎప్పుడైనా ధనం ప్రాప్తించి ఆ ధనం పోతే, దాని మీదనే ధ్యాసతో అది మళ్ళీ ఎప్పుడు దొరుకుతుందా అనే చింతతో ఉంటాడు. అప్పుడతనికి ఇతర చింత ఏమీ వుండదు. అదే విధంగా మీరు లోకాన్ని, వేదాన్ని విడిచిన వారైనా మీకు నన్ను విడవడం వల్ల నన్ను తిరిగి ఎప్పుడు కలుస్తామా అనే నిరంతర ధ్యానానువృత్తిని మీకు కల్గించడం కోసమే నేను పరోక్షంగా ఉండాలనీ, అదే మీకు లాభకరమనీ ఎంచి, మీ నుండి మాయమయ్యాను. అందుచేత నా ప్రియురాండ్రైన మీరు నిర్దుష్టమైన నా సంభోగాన్ని కోరడాన్ని నేను కాదనను. ఇళ్లల్లోని వాటిని

ప్రకృతికి సంబంధించిన అన్నిటినీ తృణప్రాయంగా వదలివేసి నా పొందును మాత్రమే కోరే మీ సత్కృత్యాన్ని నేను ఎన్నటికీ కాదనడంలేదు. మీ సద్వ్యాపారమే నన్ను మీ వద్దకు చేర్చింది. కాని నాకు మీ యందు వేరే మిమ్ము కూడాలి అనే ప్రత్యేకాభిమానం ఏమీ లేదు కాన నేను ఎప్పుడూ నిర్లిప్తుడుగానే వుంటాను అని మీరు భావించండి."

పై వాక్యాల్లోని అంతరార్థాల్ని పాఠకులు సులువుగానే గ్రహించగలరనీ వానికి వేరుగా వ్రాయనక్కర్లేదని వ్రాయడం జరుగలేదు.

"మనం పరమాత్మను సేవిస్తూన్నాం కదా ! ఆతడు మనకెందుకు ప్రత్యక్షం కాడు?" అనే ప్రశ్న ప్రతి సాధకుడికి కల్గుతుంది. అదే ప్రశ్న గోపికలు కృష్ణుణ్ణి సాభిప్రాయంగా అడిగేరు. తన్ను సేవించేరనే అభిమానం పరమాత్మకు ఎవరిమీదకూడ ఉండదనీ, ఆతడు నిర్లిప్తుడనీ, సాధకుల సాధనా తీవ్రతయే పరమాత్మను ప్రత్యక్షపరుస్తుంది. కాని పరమాత్మ వేఱుగా ఎవరినీ అభిమానించడం అంటూ వుండదన్న సంగతి కృష్ణుని సమాధానంలో అంతరార్థపరంగా మనకు బోధపడుతూంది. సాధకులు నిరంతర ధ్యానం సాగించడంలో వేదోక్త కర్మోపాసనా కలాపం తమ ధ్యానానికి అడ్డంగా వున్నప్పుడు వానిని త్రోసివేసి ధ్యానానికే ప్రాధాన్యం ఇవ్వాలనీ, ఆ నిరంతర ధ్యాన వృత్తియే పరమాత్మ సాక్షాత్కార స్థితిని కల్గిస్తుందనీ, పరమాత్మ గోచరించకపోతే తమ ధ్యానం ఇంకా, ఇంకా ఎక్కువ తీవ్రతతో నిరంతరాయంగా సాగించుకోవడమే తప్ప మఱొక దారి త్రొక్కకూడదనీ, అసలు మఱొక దారిలేనే లేదనీ కూడ ఇందు సాధనా రహస్యాల్ని సాధకులు గ్రహించాలి.

# రాస పంచాధ్యాయి

## ఐదో ఘట్టం

### (దశమ స్కంధం పూర్వార్థం ముప్పైమూడో అధ్యాయం)

కృష్ణ భగవానుడిచ్చిన చక్కని మృదువైన సమాధానాలు విని గోపికలు కృష్ణ విరహం వల్ల కల్గిన బాధను విడిచి పెట్టేరు. గోవిందుడప్పుడు ఒకరిచేతు లొకరు పట్టుకొని తన్ను అనుసరించి వున్న ఆ గోపికలతో ప్రతి గోపికతోనూ కలిసి రాసక్రీడలు ప్రారంభించేడు. ప్రతి గోపికయు కృష్ణుని మెడ మీద చేయి వేసికొని గుండ్రంగా నిలబడి యుండే విధంగా అందఱికూ అన్ని రూపాలతో కృష్ణుడు వుండగా వారితో

రాసక్రీడ ఆరంభమైంది. ఆకాశంమీద విమానాల మీద దేవతలు తమ భార్యలతో వచ్చి ఉత్సాహంగా ఆ రాసక్రీడల్ని తిలకించి దుందుభులు మ్రోయించి వారిపై పుష్ప వర్షం కురిపించేరు. వారిలో గంధర్వులు పాడుతూ నాట్యాలు కూడ చేసేరు.

రాసమండలంలోని గోపికా స్త్రీల రత్న కంకణాలు కడియాలు, అందెలు, వడ్డాణాల గంటలు, చిరునవ్వులు గలగలా ధ్వనించేయి. మణిహారం మధ్య మరకత మణిలాగ శ్యామసుందరుడు వారి మధ్య ప్రకాశించేడు.

ఆ రాసక్రీడలో పాదాల కదలికల చేతను, బాహువుల విదుపుట చేతను, చిరు నవ్వుల చిలుకరింపులతో, కనుబొమలు త్రిప్పుటల చేతను, నడుములు విలాసంగా వంచుటలచేతను, పైట కొంగులు కొంటె తనంతో జార్చుటలచేతను, చెంపలమీద చిందు లాడే కర్ణ భూషణాల వింత కాంతుల చేతను, అలసట పొందిన అందమైన ముఖాల చేతను, విడిపోతున్న కేశబంధాల చేతను, ఊడిపోతూన్న వడ్డాణాలచేతను, కృష్ణుని కూడుకొన్న గోపికలు కృష్ణ గానం చేస్తూ మేఘం మధ్య తళతళ మెరిసే మెరుపు తీగెల్లాగ ప్రకాశించేరు.

ఒక గోపిక స్వరజాతులతో గీతాలాపనం చేసింది. ఆమెను 'బాగుంది బాగుంది' అని మెచ్చుకొని కృష్ణుడు ఎత్తి ముద్దాడేడు. మఱొక గోపిక రాసక్రీడతో అలసట చెంది కృష్ణుని భుజం మీద వ్రాలింది. అప్పుడామె తలలోని మల్లికలు ఊడి క్రింద పడ్డాయి. అప్పుడామె కృష్ణ బాహువునందు పూయబడిన చందన పరిమళం ఆఘ్రాణించి మైమరచి పోయి మీదవ్రాలి కృష్ణుణ్ణి ముద్దు పెట్టుకొంది. మఱొకతె నాట్య భంగిమంలో కృష్ణుని చెక్కిలి చెంత చెక్కు చేర్చి తన నోటిలోని తాంబూలం చర్వితాన్ని అతని నోటికి అందించింది. మఱొకతె నాట్యం చేస్తూ కృష్ణుని ప్రక్క చేరి అతని చేయిలాగి తన స్తనాలమీద పెట్టుకొంది. ఈ విధంగా గోపికలు కృష్ణుని అంగాంగ సంగతన్మయతతో బ్రహ్మాండంగా ఆనందించేరు. ఆ రాసక్రీడల్లో ఊడి పోయిన స్తన వల్కాలాలూ, కటి వస్త్రాలూ, హారాలూ, అలంకారాలూ, కేశబంధాలూ తిరిగి సవరించుకోవడానికి ఓపిక లేనికారణంచేత వాటిని వదలివేసి అలసి పడిపోయేరు. గోపికలందరితో కృష్ణుడు తానొక్కడె అద్దాలమధ్య పిల్లాడి ప్రతిబింబాల మోస్త రుగా పెక్కురూపాలుగా మారి విహరించేడు. బింబం ఒకటే అద్దాలు చాల వుంచే అన్నిటిలోను, ఆ ఒక్క బింబమే ప్రతిబింబించి అనేకాల్లాగ కన్పిస్తుంది. అల్లాగునే ఒకే పరమాత్మ అనేక సాధక వృత్తుల్లో ప్రతిబింబించి అన్ని పరమాత్మల్లాగ భాసి స్తుంది. అనే అంతరార్థపరంగా ఇచ్చట మనం అర్థం చెప్పుకోవాలి.

ఆత్మారాముడై వారి నందరితో క్రీడించి కృష్ణుడు వారి నమందానంద డోలికల్లో ఊగులాడించేడు అంటే నిర్వృతి తత్త్వం సాధకుల మనోవృత్తులలో ఆనందాన్ని పరి పూర్తి చేసిందని దాని అంతరార్థం.

ఈ విధంగా శరద్రాత్రులన్నీ కృష్ణుడు వారితో గడిపేడు. అలసిపోయిన గోపికల శరీరాల్ని తన హస్తంతో నిమిరి అలసట తీర్చి ఆనందపరిచేడు. రస సంబంధమైన అనగా వాసనా సంబంధమైన మనోవృత్తులతో భగవత్క్రీడలు అని రాస క్రీడా పదానికి అర్థం. 'రాస' అంటే రస సంబంధమైన అని అర్థం. అంటే జనన మరణాల్ని చ్చే వాసనా సంబంధమైన అని అర్థం. సాధకులలోని మనో వృత్తులలో నున్న వాసనా బంధముల కృష్ణతత్త్వంతో అనగా నిర్వృతి తత్త్వంతో ప్రకాశించడంతో విషయ వాంఛా నివృత్తి కల్గి బ్రహ్మానంద సాక్షాత్కృతి సాధకులకు కల్గింది అని పై రాసక్రీడల్లోని పరమార్థం గ్రహించాలి. ప్రతి గోపికతో కృష్ణుడు చేసిన క్రీడా విశేషం సాధకులలోని ప్రతి సాధనా వృత్తియు నిర్విషయ తత్త్వాన్ని సాధకులలో ప్రవేశపెట్టడంగా అంతరార్థ పరంగా ఇందు పాఠకులు సులువు గానే అవగాహన చేసికోగలరని భావిస్తూ వానిని ప్రత్యేకంగా విడివిడిగా వివరించడం విరమించినందుకు క్షమింతురుగాక!

తర్వాత పరీక్షిత్తు శుకమహర్షిని ఈ విధంగా ప్రశ్నించేడు.

"ధర్మ సంస్థాపనం కోసమూ, అధర్మ వినాశం జరిగించడం కోసమూ పుట్టిన కృష్ణుకు ఇల్లాంటి అశ్లీలమైన అసహ్యకరమైన జారకృత్యం చేయడం ఏమిటి? అపని కృష్ణుడే చేసినప్పుడు మనం చేస్తే తప్పేమిటి ? అని ప్రజలను కోరా! పరదారా సంగమం దోషం వారికి రాదా! అది ధర్మ విరుద్ధం కాదా! నా మనస్సుకు ఎంతగా ఏమి చెప్పుకొన్నా ఈ సంశయం మాత్రం తీరడంలేదు. మీరేమంటారు మహర్షీ?" అని శుక మహర్షిని పరీక్షిత్తు ప్రశ్నించేడు.

నిజమే ఈ ప్రశ్న పరీక్షిత్తుకే కాదు. అందరికీ కల్గేదే. అగ్ని ఎట్టి అశుద్ధాన్ని స్వీకరించినా ఆ అశుద్ధవస్తు కల్మషం దాని కంటుకోదు. ఆ యా వస్తువుల్లోని అ శుద్ధత్వాన్ని అగ్ని పరిహరించి వాని స్వరూపాన్ని తన స్వరూపంగా మారుస్తుంది. అగ్ని అశుద్ధాన్ని కాల్చివేసింది కదా అని మనం అల్లాగ శుద్ధం చేయలేం కనుక మనం అశుద్ధాన్ని మీద వేసికొంటే ఆ దుర్గంధం మనకు పోదు. పరమాత్మ చేసేడు కదా అని ఆ పనిని మరొకరు నిర్దుష్టంగాచేయలేరు కాన అట్టిపని ప్రతివారు చేయవచ్చుననుకోకూడదు.

ఈశ్వరుడు మ్రింగలేదా అని విషాన్ని మనం మ్రింగకూడదు కదా! అని శ్రీ శుకుడు జవాబిచ్చేడు. ఈ సమాధానం బాగా సరిపడివుంది. అంతరార్థపరంగా ఈ రాసక్రీడా ఘట్టంలో జీవ బ్రహ్మైక్య సాధన చెప్పబడింది. ఈ సాధన అన్ని సాధనలలోను పర మోత్కృష్ట సాధనంగా భావించాలి.

శ్లో॥ బ్రహ్మరాత్ర ఉపావృత్తే
వాసుదేవాను మోదితాః
అనిచ్ఛంత్యోయయు ర్గోప్యః
స్వగృహాన్ భగవత్ప్రియాః

శ్లో॥ క్రీడితం వ్రజవధూభిరిదంచ విష్ణోః
శ్రద్ధాన్వితోఽను శృణు యాదథవర్ణయేద్యః
భక్తిం పరాం భగవతీం ప్రతి లభ్య కామం
హృద్రోగ మాశ్వ పహినోత్యచిరేణ ధీరః

గోపికల్ని బ్రహ్మరాత్రం కాగానే, అంటే రాత్రియందలి బ్రాహ్మీ ముహూర్తం అనగా తెల్లవారు జాము కాగానే వాసుదేవుడైన కృష్ణుడు సెలవిచ్చివంపేడు కృష్ణుణ్ని విడిచి ఇళ్ళకు ఇష్టం లేక పోయినా వారు తమతమ ఇళ్ళకు వెళ్ళి పోయేరు.

బ్రహ్మ రాత్రం కాగానే అంటే రాత్రి బ్రహ్మత్వ స్థితికి రాగానే అని అంత రార్థం. రాత్రి అంటే తమోగుణం, మాయ అన్న మాట అది బ్రహ్మత్వ స్థితిని అంటే జ్ఞాన స్థితిని, పొందగానే సాధకుల మనోవృత్తులు, వాసుదేవాను మతముతో అంటే 'వాసుదేవ స్సర్వగతః' అనే వ్యుత్పత్త్యర్థంలో అంతట నున్నదీ బ్రహ్మస్వరూపమేఅనే జ్ఞానంతో అనగా 'సర్వం ఖల్విదం' అన్న సాధనతో బ్రహ్మ భావం స్థిరపడ్డంతో తమ ఇళ్ళకు అంటే తమకుస్థానములైన, ఇంద్రియాల్లోనికిచేరుకున్నాయి అల్లావెళ్ళడం వానికిష్టం లేక పోయినా కృష్ణతత్వాన్ని ఇంద్రియాల్లో అనుభవంలోనికి తెచ్చుకోవడం కోసం ఆ మనోవృత్తులు ఇంద్రియాల ఆధీనంలోకి వెళ్ళేయి. అప్పుడు "సర్వం ఖల్విదం బ్రహ్మ భావన" కలిగి ఇంద్రియాలు ఏ విధంగా ఏ విషయాల్లో తమ్ము ప్రేరేపించినా ఆ విషయాలన్నీ బ్రహ్మ స్వరూపమే అనే భావనతో ఆ యా పనుల్ని నిర్వర్తించడం అనే అనుభవం మనో వృత్తులకు వచ్చి నప్పుడే బ్రహ్మజ్ఞానం స్థిరపడు తుంది. అందుకోసమే సాధకుని మనో వృత్తులు సాధనలు పూర్తి కాగానే స్వస్థానా

ల్లోనికి వచ్చి యథాపూర్వంగా ప్రవర్తిస్తాయి. అనే సాధనా రహస్యం ఇందులో సాధకులు గ్రహించాలి.

ఫ ల శ్రు తి :-

"గోపికా స్త్రీలు సర్వ వ్యాపకుడైన విష్ణు పరమాత్మతో క్రీడించడం అనే ఈ రాసక్రీడలను చదివినా విన్నా పరమాత్మతో స్థిరంగా కలిసి వుండి ఐహిక మంతా సుఖంగా గడిపి ముక్తిని పొందుతారు." అని వ్యాస మహర్షి ఫలశ్రుతి చెప్పడం వల్ల ఈ రాసలీలలు వట్టి పచ్చి శృంగారానికి సంబంధించిన జార లీలలు కావనీ, పరమాత్మతో కలసి సాధకుల మనోవృత్తులు జ్ఞానసిద్ధిని పొందిన సాధనలనీ మనం అర్థం చేసికోక తప్పదు.

ఈ రాసలీలలు పంచ అధ్యాయాల్లో చెప్పబడ్డాయి అంటే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయములనే సాధకులలోని పంచకోశములలో నున్న వృత్తులతో కృష్ణ తత్త్వం అనగా విషయ నిర్వృతి తత్త్వం ప్రకాశించినపుడు ఆనంద రూప పరమాత్మయొక్క తాదాత్మ్యం ఎట్లా సిద్ధిస్తుందో అది అంతా ఈ రస పంచాధ్యాయికి చెప్పిన అంతరార్థం వల్ల సాధకులైన పాఠకులు గ్రహించగలరు.

మొదటి అధ్యాయంలో కృష్ణ గానంలో గోపికలు కృష్ణుణ్ణి చేరుకొన్నారు. అంటే ముక్తిని పొందడానికై పరమాత్మ ప్రబోధంతో అన్నమయ కోశంలోని వృత్తులు నిర్విషయా తత్త్వాన్ని చేరుకొంటాయన్న మాట. మనోవృత్తులకు మొట్ట మొదటి జన్మస్థానం అన్నమయ కోశం. రెండవ అధ్యాయంలో గోపికలూ కృష్ణుడూ కలసి ఆడడం, పాడడం, ప్రాణమయ కోశంలో ఆ వృత్తులు నిర్వృతి తత్త్వంలో కలసిపోవడానికి యత్నించే యన్నమాట. మూడవ అధ్యాయంలో మయకోశాలు కోల్పోయిన కృష్ణ తత్త్వాన్ని వెదకి వెదకి ఆ వృత్తులు తిరిగి పట్టుకొన్నా యన్నమాట. నాల్గవ అధ్యాయంలో విజ్ఞానమయ కోశంలో అవి నిర్వృతి తత్త్వంలో లీనం కావడం, ఐదో అధ్యాయంలో ఆనందమయ కోశంలో ఆ వృత్తులన్నీ ఆత్మానంద స్థితితో కూడి తిరిగి ప్రకృతి లోనికి వచ్చి నిత్యానంద స్థితితో ప్రకాశించడం జరిగిందన్నమాట. పైవిధంగా సాధకులు పంచకోశ సాధనాభ్యాసం జరిగించాలి.

# 1. ఉరగ శాప విమోచనం

# 2. శంఖ చూడుని వధ

## (కృష్ణ తత్త్వ నిరంతర సాధన)

ఒకనాడు గోపాలు రందఱు దేవయాత్రకు బయలుదేరి సరస్వతీ నదీతీరంలోని అంబికావనంలో ప్రవేశించేరు అక్కడ సరస్వతీ నదిలో స్నానంచేసి, శివుణ్ణి పూజించేరు. నందుడు సునందుడు మొదలగువార్లంతా ఆ రాత్రి సరస్వతీ నదీ జలం మాత్రం త్రాగి పరున్నారు. అప్పుడు ఆకలితో ఒకపెద్ద ఉరగం (పాము) వచ్చి హాటిలో నందుని మింగింది. నందుడు ఆ ఉరగం నోట్లో పడిపోతూ కృష్ణా! కృష్ణా! అంటూ ఆక్రోశించేడు. కృష్ణుడు వచ్చి పాదంతో ఆ ఉరంగమాన్ని (పామును) తన్నే టప్పటికి ఆ ఉరగం మహాతేజస్సు గల ఒక విద్యాధరుడై కృష్ణుని యెదుట నిలచి 'తా నొక్కప్పుడు అంగిరసునియొక్క వికృతాంగస్థితిని చూచి, నవ్వడం వల్ల ఈ ఉరగ రూపం వచ్చిందనీ, నీ పాదస్పర్శవల్ల ఇప్పుడు ఆ రూపంపోయి నా విద్యాధరత్వం నాకు వచ్చిందని చెప్పి వెళ్ళిపోయేడు. తర్వాత మల్లికాగంధ మత్తాళిజుష్టమైన వాయువు వీస్తూండగా ఆ సరస్వతీ తీరంలో ఆ రాత్రిని అభినందిస్తూ వ్రజస్త్రీలు కృష్ణుని పరి వేష్టించి పండుకొని తన్మయత నొంది గానం చేస్తూ కాలక్షేపం చేస్తున్నారు. అప్పుడు కుబేర సేవకుడు అగు శంఖచూడుడనే వాడు ఆ వ్రజ స్త్రీల కంటబడ్డాడు. వ్రజస్త్రీలు భయపడి కృష్ణునికి దగ్గరగా చేరి గట్టిగా పట్టుకొన్నారు.

కృష్ణుడు ఆ శంఖచూడుణ్ని చంపి అతని తలమీద నున్న శంఖాన్ని ఊడ తీసి తెచ్చి బలరాముని ముందు పెట్టేడు అంతా ఆనందించి గోకులానికి వెళ్ళి పోయేరు

పైరెండు కథలు ఒకే అధ్యాయంలో సంగ్రహంగా చెప్పబడ్డాయి. అసలు ఈ కథలకు సమన్వయంతో అర్థం కన్పించదు. అడవిలో నందాదులను ఉరగం మింగ డం, దాన్ని కృష్ణుడు విడిపించడం ఏమిటి? ఇదే మోస్తరు కథ కృష్ణ లీలల్లో ఒకసారి చెప్పబడిందికూడ. చర్విత చర్వణంగా ఎందుకా కథ మళ్ళీ చెప్పడం, పాము మింగడం తిరిగి బ్రతకడం అసలు జరిగేదేనా? రెండో కథ ఇంకా మరీ అసందర్భంగా వుంది. జుట్టులో శంఖమేమిటి? ఆ శంఖాన్ని కృష్ణుడు ఊడదీసి బలరాముడి కివ్వడం ఎందుకు? ఇవి నిజంగా జరుగుతే చారిత్రక దృక్పథంతో వానిని వ్యాసుడు వ్రాసేడంటారా?

అసలు ఇది చరిత్రగా గ్రహించదగ్గ కథేనా? "శంఖచూడుడు కుబేరుని అనుచరుడు" అని చెప్పడంవల్ల చరిత్రాత్మకత్వం సిద్ధిస్తుందా? దిక్పాలుడైన కుబేరుడు పంపేడా? వాడంతట వాడేవచ్చేడా? ఇందు తలాతోకా కన్పించదు. ఇటువంటి అసందర్భ కథల్లో తప్పక అంతరార్థం వుండాలి. ఆ అంతరార్థాన్ని విడదీసి చెప్తాను :-

"గోపాలురు దేవయాత్రకు వెళ్ళేరు." గోపాలురు అంటే 'గో+పాల' విషయ వృత్తులను పోషించేవి ఇంద్రియాలు అని అర్థం. 'దేవ' అంటే దివ్‌ధాతువునకు ప్రకాశం అనగా జ్ఞానం అని అర్థం. గోపాలుర దేవయాత్రకు వెళ్ళడం అనగా ఇంద్రియాలు జ్ఞానాభ్యాసా సాధనానికి పూనుకోవడం అని అర్థం. సాధకులలోని ఇంద్రియాలు జ్ఞాన సాధనకు పూనుకోవడం జరిగించేయి అని దాని అంతరార్థం గ్రహించాలి. వారు సరస్వతీ నదీ తీరంలో అంబికావనం చేరుకొన్నారు.

సరస్వతి అనగా నిరంతర ప్రవాహం కలది అని అర్థం. 'సరస్' శబ్దానికి ప్రవాహం అర్థం-'సరస్' కలది 'సరస్వతి' నిరంతర ప్రవాహం కలది అనగా కాలం అని ఇక్కడ అర్థం చెప్పాలి. అంబిక+అవనం, అంబిక అనగా ప్రకృతి అర్థం, తల్లి అనే అర్థం కల పదాలన్నిటికి ప్రకృతి అని అర్థం చెప్పుకోవచ్చు. అవనం అంటే రక్షించడం అర్థం. బాహ్యార్థంలో అంబిక అనే పేరుగల అడవి అని అర్థం.

ఇక్కడ అంబిక+అవనం అని విడదీస్తే ప్రకృతి వలన రక్షణం అనే అర్థం వస్తుంది. గోపాలురు దేవయాత్రలో సరస్వతీ తీరంలోని అంబికావనం చేరుకొన్నారు అంటే సాధకుని ఇంద్రియాలు జ్ఞాన సాధనలో కాలక్రమంలో అనగా కొంతకాలం సాధనలు నడచిన తర్వాత ప్రకృతి వలన రక్షణం పొందగల్గేరు. అనగా సాధనతో ప్రకృతియొక్క ఆటంకాలు కాకుండా రక్షింపబడతారు అని అంతరార్థం గ్రహించాలి.

తర్వాత వారు శివుణ్ణి చేరి పూజించేరు. 'శివుడు' అంటే పరమాత్మ.' పరమాత్మను అందుకొన్నాయి ఇంద్రియాలు' అని దాని అర్థం. సత్యం, శివం, సుందరం అనేవి పరమాత్మను తెల్పే పదాలు. తర్వాత నందసునందాదులు ఆరాత్రి సరస్వతీ జలం త్రాగి నిద్రించేరు.

నంద+సునంద+ఆదులు అంటే సాధకునిలోని జీవాత్మ, పరమాత్మ, ఇంద్రియములు అని చెప్పుకోవచ్చు. సరస్వతీ నదిలోని జలం త్రాగేరు. జలంలో 'ల' అన్నది 'లడ యోర భేదః' అనే సూత్రం వల్ల 'డ' క్రింద మారుస్తే 'జడం' అని అవుతుంది. కాలప్రవాహంలో నున్న జడత్వాన్ని జీర్ణం చేసుకొన్నాయి. సాధకుని

లోని జీవ, పరమాత్మేంద్రియ వృత్తులు అని అర్థం. అప్పుడు చెప్పవచ్చు. 'రాత్రి' అనగా అజ్ఞాన స్థితి. ఆ స్థితిలో నిద్రించేరు అనగా అజ్ఞాన కార్యాలు ఏమీ లేకుండా ప్రశాంత స్థితిని వారు పొందేరు అన్న మాట. జీవాత్మ పరమాత్మలను నందసునందలు అని పేర్కొడంలో అంతరార్థంగా గ్రహించాలి.

ఆనందార్థకమైన 'నంద' పదం ఆనందాన్ని అన్వేషించే జీవలక్షణం తెల్పేది గాన దాని వల్ల జీవాత్మను గ్రహించాలి. సునంద పదం శాశ్వతిమైన ఆనందం అనే అర్థంలో పరమాత్మను చెప్పేదిగా గ్రహించాలి. ఇవన్నీ సాధకునిలోనివే. సాధకుని లోని ఇంద్రియ వృత్తులు జ్ఞానాభ్యాసం చేత ప్రకాశత్వం పొంది, కాలక్రమంలో సాధనల వల్ల ప్రకృతి రక్షణతో శివత్వాన్ని చేరుకొని అజ్ఞానం తమ్ము ఆవరించని విధంగా తమలోని జడత్వాన్ని తమలోనే జీర్ణించివేసికొని ప్రశాంత స్థితిలో మునిగి వున్నా యని గోపాలురు పరుండినారని చెప్పినంతవరకు కథకు అంతరార్థంగా గ్రహించాలి.

తర్వాత 'ఉరగం వచ్చి నందుణ్ని మింగింది.' 'ఉరము' అంటే హృదయం, దానిని 'గ' అంటే పొందినది అని అర్థం. అనగా హృదయాంతర్వర్తియైన ప్రకృతి స్వరూపం గోచరించిం దన్నమాట. ఉరగం సర్పరూపం అంటే ప్రకృతియొక్క రూపం. సర్ప పదానికి వ్యాపించేది అనే అర్థం వుంది. ప్రకృతి వ్యాపించే స్వభావం కలది కాన ప్రకృతికి సర్ప పర్యాయపదాల అన్నిటిని ఉపలక్షకంగా చెప్పవచ్చు. అనగా ప్రకృతి నందుణ్ని మింగింది. నందుడనగా పరమాత్మరూప ఆనందాన్ని అనుగమించే జీవుడని చెప్పుకొని వున్నాం. ఆ ఆనందాన్ని చేరాలనుకొనే జీవుణ్ని ప్రకృతి మింగింది అంటే ప్రకృతినే బ్రహ్మ ఆనందాన్ని అనుభవించడం సాధకునికి ముఖ్య లక్షణంగా గుర్తింప జేయడమే నందుణ్ని ఉరగం భక్షించడం అన్నదానికి అంతరార్థం.

అప్పుడు నందుడు కృష్ణుణ్ణి రక్షించుమని పిలిచేడు. కృష్ణుడు రక్షించేడు, కృష్ణుడు పాదంతో సర్పాన్ని తన్నడంతో ఆ పాముకు విద్యాధర రూపం వచ్చింది. అంటే నిర్వృతి తత్త్వంతో ప్రకృతియొక్క ప్రవృత్తి తత్త్వాన్ని త్రొక్కి పెట్టడంతో ప్రకృతియొక్క వృత్తి తత్త్వం జ్ఞానంగా మారిపోయిం దన్నమాట. కృష్ణుడంటే నిర్వృతి తత్త్వం. ప్రకృతి ప్రవృత్తి తత్త్వం కలది. ఆ ప్రకృతి యొక్క ప్రవృత్తిని, నిర్వృతి తత్త్వ సాధనతో రక్షించుకొంటూ ప్రకృతిని అంటీముట్టకుండా ఆసంగతో అనుభవించడాన్ని సాధకులు నేర్చుకోవాలి అన్నదే ఈ కథలోని అంతరార్థ రహస్యం.

ఆ పాము విద్యాధరుడు. విద్యా అంటే జ్ఞానం దానిని ధరించే మనోవృత్తి విద్యాధరుడన్న మాట. ఆ జ్ఞానవృత్తికే అజ్ఞాన రూప సర్పాకారం సిద్ధించింది. అది ఆంగిరసుని చూచి నవ్వడం వల్ల వచ్చింది. 'అంగిరస' అంటే అంగమును అనగా దేహమును పొందిన వాసనా వృత్తిని అని అర్థం. 'రస' పదానికి జన్మనిచ్చే వాసనలు అర్థం అని చెప్పకొనే వున్నాం. వాసనా సహితమైన దేహాన్ని చూచి జ్ఞానవృత్తి పరిహసించడం వల్ల ఆ జ్ఞానవృత్తికి అజ్ఞాన స్వరూపం వచ్చింది. వాసనలు, దేహము కూడ జ్ఞానముతో చూచినప్పుడు పరమాత్మ స్వరూపంగా కన్పించాలి. అట్లాగు కన్పించినప్పుడే, అది శుద్ధ జ్ఞానం అవుతుంది. దేహాంతరత వాసనల్ని పరమాత్మకన్న వేరుగా చూచే ద్వైత భావన కలది జ్ఞానం అనిపించుకోదు. అది అజ్ఞానావరణమే. అదే సర్పం. సర్పం అంటే ఆవరించి వ్యాపించి వుండేది అనే వ్యుత్పత్తిలో అజ్ఞానానికి అర్థంగా చెప్పాలి. విద్యాధరుడు అంగిరసుని చూచి నవ్వడం వల్ల సర్పత్వం వచ్చిందంటే జ్ఞానం తనకు కల్గిందనుకొని ద్వైత భావం పొందిన వానికి అజ్ఞానమే గతి అనీ, నిర్వృతి తత్త్వ సాధనతో అజ్ఞానం పోతుందనీ ఈ కథా సారాంశంగా గుర్తించాలి

ఈ కథలో నందుడు సర్పం మ్రింగుతూంటే కృష్ణుణ్ని రక్షణ కోరడంలో అనగా జీవుడు మాయ తన్ను ఆవరిస్తున్నప్పుడు నిర్వృతి తత్త్వాన్ని ఆశ్రయిస్తే మాయావృత్తి తప్పిపోతుందనీ, అది జ్ఞానరూపంగా మారిపోతుందనీ అప్పుడు శాశ్వతంగా ఆత్మానందం కల్గుతుందనీ, జ్ఞానం అంటే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్న అనుభూతియే అని మనకు అంతరార్థ పరంగా తెల్పుతూంది.

ఇక శంఖ చూడుని కథ. శం+ఖ+చూడుడు, 'ఖ' అంటే ఇంద్రియాలు, 'శం' అంటే సుఖం, 'శంఖ' అనగా క్షేమ, శం ఇతి శంఖః అని వ్యుత్పత్తిలో ప్రథమాతత్పురుష సమాసంలో ఇంద్రియములందలి సుఖం అని అర్థం వస్తుంది. చూడము అనేది శిఖ లేక అగ్రం అనే అర్థంలో శ్రేష్ఠమైనది అని అర్థాన్నిస్తుంది. ఇంద్రియ సుఖమే శ్రేష్ఠమైనది అనే సాధకునిలోని మనోవృత్తికి 'శంఖ చూడుడు' అని పేరు. ఇతడు కుబేరానుచరుడు. 'కు' అంటే భూమికి సంబంధించిన అనగా భూతాత్మకమైన, బేర=అంటే దేహం అని అర్థం భూసంబంధమైన దేహాన్ని అను

సరించి వుండేది ఇంద్రియ సుఖం అనేది శంఖచూడుడు 'కుబేరానుచరుడు' అన్న దానికి అంతరార్థం అన్నమాట.

మల్లికా గంధమత్తాళిజుష్టమైన వాయువు వీస్తుండగా అంటే మత్+ల=మల్ల అని అవుతుంది. అనగా 'మత్' అనేది అహం మమ అనే వానికి ప్రాతిపదిక రూపం అవడంచేత, 'మత్' అన్నది అహంకార మమకారాలను తెల్పే పదం. అప్పుడు మత్+ల అంటే ల అనగా గ్రహించేది అని అర్థం. అహంకార మమకారాలను గ్రహించేది 'మల్ల' అని అవుతుంది. మల్లయే 'మల్లీ' అని స్త్రీత్వ వివక్షలో రూపం ఏర్పడుతుంది. దానిపైని స్వార్థంలో 'క' ప్రత్యయంచేస్తే 'మల్లికా' అవుతుంది. 'మల్లికా' అనగా అహంకార మమకారాలను గ్రహించేదైనట్టిది అని అర్థం. గంధ=(జన్మలనిచ్చే) వాసనలచే, మత్త=గర్వించిన, ఆళి = (ఇంద్రియాల యొక్క), సమూహంతో, జుష్టమై=కలిసినదై, వాయువు వీస్తూండగా, అనగా అహంకార మమకారాల వాసనలతో కూడిన ఇంద్రియాల ప్రేరేపణలు తమలో వ్యాపిస్తూండగా అని అంతరార్థం.

వ్రజాంగనలు కృష్ణుని పరివేష్టించి పరుండి ఆడుచు పాడుచు, రాత్రి గడుపుచున్నారంటే, మనోవృత్తులు నిర్వృతి తత్త్వంతో కూడి అజ్ఞానాన్ని పోగొట్టుతున్నాయి అని అర్థం. అప్పుడు 'కుబేరానుచరుడు శంఖ చూడుడు, వారికి కన్పించేడు' అంటే నిర్వృతి తత్త్వంతో అజ్ఞానాన్ని నాశం చేస్తూ సాధన చేస్తూన్న సాధకుని సాధనా వృత్తులకు, దేహంలో సుఖాల్ని పండిరచే ఇంద్రియ వృత్తులు ఒక్కసారిగా ఎదురయ్యేయి అని అంతరార్థం. దానితో తమ సాధన పూర్తిగా భంగమయిపోయిందనే భయంతో ఆ వృత్తులు నిర్వృతి తత్త్వాన్ని గట్టిగా ఆహ్వానించేయి అన్నదే శంఖచూడుని చూడ్డంతోనే వ్రజాంగనలు కృష్ణుణ్ణి గట్టిగా కౌగలించుకొని కేకలు వేశారన్న దాని అంతరార్థం.

కృష్ణుడు శంఖచూడుణ్ణి చంపి వాని తలలోని శరఖాన్ని బలరాముడి కిచ్చేడు అంటే నిర్వృతి తత్త్వం పంచ భూతాత్మకమైన దేహంలోని ఇంద్రియ సుఖాన్ని బలమైన ఆత్మానందంలో లీనం చేశాడని అంతరార్థం వస్తుంది. బల+రాముడు అంటే బలమైన అనగా శాశ్వతమైన 'రామ' అనగా ఆనందం అనగా బ్రహ్మానందం అని అర్థం. నిర్వృతి తత్త్వం బ్రహ్మానందంలో విషయానందాన్ని ఐక్యం చేస్తుంది అన్నదే కృష్ణుడు శంఖాన్ని బలరాముడి కిచ్చేడన్న దాని అంతరార్థం.

ఈ కథలో సాధకునిలోని ఇంద్రియ వృత్తులు నిర్వృతి తత్త్వాన్ని తమలో ప్రవేశ పెట్టడానికి సాధనలు చేస్తూన్నప్పుడు చిట్ట చివరి అవస్థలో దేహంలోని ఇంద్రియ సంఘాలు అన్నీ ఒక్కసారి పుంజుకొని సాధకుని మనోవృత్తులు చేసే నిర్వృతి సాధనను భ్రష్టం చెయ్యడానికి ప్రలోభం కల్గిస్తాయనీ, అప్పుడు సాధకుడు మేల్కొని తన సాధనలతో విషయ నిర్వృతి తత్త్వాన్ని వదలకుండ గట్టిగా అంటి పెట్టుకొనే వుండే ఆ నిర్వృతి తత్త్వం వల్ల విషయానందాన్ని బ్రహ్మానందంతో లీనం చేసి ముక్తిని సాధించవచ్చుననే, ఇందు ముక్తి సాధనా రహస్యాల్ని గ్రహించాలి.

దశావతారాలు చెప్పినప్పుడు 'మత్స్యః కూర్మః వరాహశ్చ : నారసింహశ్చ వామనః : రామోరామశ్చ రామశ్చ : బౌద్ధః కల్కిరే వచ" అని, మత్స్యావతారం, కూర్మావతారం, వరాహావతారం, నారసింహావతారం, వామనావతారం, పరశురామా వతారం, శ్రీ రామావతారం, బలరామావతారం, బుద్ధావతారం, కల్కి అవతారం అని పదింటిని చెప్పడంలో కృష్ణుణ్ణి అవతారంగా గుర్తించలేదు. కాని, కృష్ణుడుతో కలిసియే పుట్టిన బలరాముణ్ణి మాత్రం పేర్కొనడం జరిగింది. అంటే అంతరార్థ పరంగా కృష్ణ తత్త్వం బలరామ తత్త్వానికి కారణ భూతంగా చెప్పబడిందే కాని ప్రత్యేక తత్త్వం మాత్రం కాదు రెండూ అనగా కృష్ణ బలరామ తత్త్వాలు రెండూ ఒకటే తత్త్వం అన్న మాట ఒక కారణం రెండవది కార్యం. కార్యకారణాలు రెండూ ఒకటే గదా : అందుకే దేవకి గర్భాన్ని సంకర్షణం చేసి ఒక భాగం కృష్ణుడు గాను, ఒక భాగం బలరాముడు గాను ఆవిర్భవించినట్లు కృష్ణ బలరామ జననగాథలో చెప్పబడి వుంది. కృష్ణ తత్త్వం విషయ నిర్వృతి తత్త్వం. ఆ తత్త్వం బ్రహ్మానందాన్ని అనగా బలరామ తత్త్వాన్ని సాధిస్తుంది. కనుకనే ఈ నిర్వృతి తత్త్వమూ, బ్రహ్మానంద తత్త్వమూ రెండూ ఒకటి సాధనగా రెండవది సాధ్యముగా కలిసిన జంట తత్త్వం. అదే రామకృష్ణుల్ని కలిసి ఒకటే అవతారంగా ఆ శ్లోకంలో దశావతారాల్లో చెప్పడం లోని ఉద్దేశం. అవతారాల్లో కృష్ణ తత్త్వానికి కాక బలరామ తత్త్వానికి ప్రాధాన్యం ఇవ్వడం సాధ్య సాధనాలలో సాధ్యమునకు అనగా మోక్షానందానికి ప్రాధాన్యం ఇవ్వడం జరిగిందిగా గ్రహించాలి.

# కంసవధ

## (అపరాశక్తి నిరోధన సాధన)

కంసునివద్దకు నారదుడు వచ్చి బలరామకృష్ణుల్ని స్తుతిస్తాడు. వారిని చంపే ఉద్దేశంతో కంసుడు రామకృష్ణుల్ని తీసికొని రమ్మని అక్రూరుణ్ణి పంపేడు. కంసుని ఆహ్వానంపై అక్రూరునితో కలిసి బలరామకృష్ణులు మధురను ప్రవేశించేరు. రాజగృహం చేరేరు.

దారిలో రజకుడు వస్త్రాలు కంసునికొఱకు పట్టుకొని వెడుతూంటే వాటిని లాక్కొని తాము కట్టుకొన్నారు. సుదాముడనే వాడు మాలికలిస్తే వానిని దీవించేరు. 'కుబ్జ' చందనగంధం పూస్తే దీవించి ఆమె కుబ్జాత్వం పోగొట్టేరు. మల్లశాలలో నున్న ధనుస్సును ఎత్తి విరిచేసేరు. కువలయాకారుడనే ఏనుగును సంహరించేరు. చాణూర ముష్టికులనే మల్లురను చంపేరు. చిట్టచివర కంసుణ్ణి అతని ఎనమండుగురు సోదరులనూ సంహరించేరు.

నారదుడంటే జ్ఞానం ఇచ్చువాడు గురువు అని లోగడ చెప్పుకొన్నాం. కంసుడు అంటే కం=ముక్తిసుఖాన్ని, స=నాశంచేసే అపరాశక్తి అనికూడ వ్యుత్పత్త్యర్థం చెప్పుకొనే వున్నాం.

"కంసుడు నారదునివల్ల బలరామకృష్ణుల వీరోచిత కృత్యాల్ని విన్నాడు. విని వారిని అక్రూరుని పంపి తీసికొని రావలసిందిగా ఆదేశించేడు" అంటే సాధనలో చిట్ట చివరి దశలో సాధకునిలోని పరాశక్తిని అనగా ముక్తి సాధనావృత్తిని నాశం చెయ్యడానికి సర్వ శక్తులతోను యత్నించి ఇక అది శక్యం కాదనుకొన్నప్పుడు అపరాశక్తిపరాశక్తిలోనే తాను లీనంఅయిపోవడానికి పూనుకొంటుంది. అట్టి పూనికకై దానిలో నొకానొక దివ్యమైన జ్ఞాన ప్రబోధం హఠాత్తుగా కలుగుతుంది. అదే కంసునకు అనగా అపరాశక్తికి నారదుడు అనగా జ్ఞానప్రబోధం, కృష్ణ మహిమను అంటే నిర్విషయ తత్త్వం ప్రభావాన్ని బలరామ మహిమను అంటే శాశ్వతానందతత్త్వాన్ని గూర్చి ప్రబోధం కల్గించింది. అపరాశక్తి వానిలో లీనమైపోయేటంత ఉద్రేకం ఆ జ్ఞాన ప్రబోధంవల్ల కల్గిందన్నమాట. అప్పుడు అపరాశక్తిలోని క్రూరభావం అనేదే వుండక ప్రశాంతిస్థితి ఆవరిస్తుంది. "అప్పుడు అక్రూరునిచేత బలరామకృష్ణుల నాహ్వానింపజేసేడు కంసుడు." అంటే జ్ఞాన ప్రబోధంకల్గి అక్రూరభావం కలిగి (న+క్రూర= అక్రూర అవుతుంది) తాను నిర్విషయతత్త్వంతోనూ, శాశ్వత బ్రహ్మానంద తత్త్వం

తోనూ లీనం కావాలనే ప్రబోధంకల్గి మొదటనుంచి వున్న క్రూరత్వంపోయి, అపరా శక్తి ముక్తికై చేసే ఆహ్వాన ప్రయత్నంగా అక్రూరునిచే కంసాహ్వానానికి అంతరార్థం చెప్పుకోవాలి.

శాంతభావంతో ఐహిక సుఖ వాంఛాభావాలు విడిచివేసి ఆహ్వానించినపుడు నిర్విషయతత్త్వం, (కృష్ణతత్త్వం) బ్రహ్మానందతత్త్వం (బలరామతత్త్వం) కంసునిలో (అపరాశక్తితో) ప్రవేశించడానికి సంతోషంతో ఇష్టపడి వస్తాయి అనడమే అక్రూరునితో వెంటనే బలరామకృష్ణులు మధురకు రావడమంటే. మధు=తీయనిదైన ముక్తిస్థితిని, ర=గ్రహించునది అనగా ముక్తి కావాలనే మనోవృత్తికే మధురని పేరు. కంసుడు మధురలోనే ఉన్నాడు అంటే సాధకునిలోని ముక్తివృత్తి ఆతనిలో విజృంభించిన దుష్టశక్తులవల్ల అట్టడుగున పడి వుంటుందన్నమాట.

అపరాశక్తిని నిర్విషయతత్త్వంలోను బ్రహ్మానంద స్థితిలోను లీనం చెయ్యాలంటే ముందు ఆ శక్తిలోని రజోగుణాన్ని తమోగుణాన్ని ముందు నాశనం చేయాలి. ఆపైని సుగతికై కోర్కెను పెంచాలి. త్రిదేహాల్ని నశింపుచేసి అమనస్కత కల్గించాలి; ఆ తర్వాత సాధకునిలోని జనన మరణాలయంలో చిక్కుకొని పరిభ్రమింపజేసే వాసనావృత్తుల్ని అన్నింటినీ నాశం చెయ్యాలి. ఆ తర్వాత అహంకార మమకార భావాల్ని పోగొట్టాలి. ఇవన్నీ ముక్తికాంక్ష ప్రబలమైనప్పుడు అవి అన్నీ ఎన్నాళ్ళనుండి పాతుకొని వున్నవైనా ఒక్కక్షణంలో కల్గిన నిర్విషయాసక్తి వల్లనూ బ్రహ్మానందాసక్తి వల్లనూ ఒక్కసారిగా పటాపంచలైపోతాయి. తీవ్రమైన ముముక్షత్వం సిద్ధించాలే కాని ఆ ముముక్షత్వమే వుంటే ఎన్ని జన్మలనుండి వస్తూన్న వాసనలైనా సరే ఒక్క క్షణంలో వేరే సాధనలతో నిమిత్తమే లేకుండా నశిస్తాయి.

"రామకృష్ణులు కంసునియొక్క మధురా నగరంలో రాజభవనంలో ప్రవేశిస్తూ రజకుని చంపి వాని వద్దనున్న కంసుడు ధరించే రాజవస్త్రాలు తాము ధరించేరు." అంటే, రజకుడంటే సాధకునిలోని రజోగుణం అని చెప్పాలి. రజస్ శబ్దం సకారాంతమైనా, అర్షప్రయోగంగా అకారాంతంగా గుర్తించి దానిపైని స్వార్థమందు కప్ ప్రత్యయంచేస్తే 'రజక' అనే శబ్దాన్ని రజోగుణంగా సాధించవచ్చు. బట్టలు, మాయకు ఉపలక్షకంగా మనం లోగడ ఎన్నోసార్లు చెప్పుకొన్నాం. రజకుణ్ణి చంపేశారు అంటే కంసునిలోని అంటే అపరాశక్తిలోని రజోగుణం నాశం చేయడం జరిగిందన్నమాట. ఆపైని కంసుడు ధరించే బట్టలు, తాము కట్టుకొన్నారంటే సాధకునియొక్క అపరా

శక్తిలోని మాయను నిర్వృతితత్త్వం, బ్రహ్మానందతత్త్వం తమలో లీనం చేసికొన్నా యన్న మాట.

తర్వాత 'త్రివక్ర' అనే కుబ్జను అనగా దేహంలో మూడు వంకరలు తిరిగి యున్న మరగుజ్జుగానున్న స్త్రీ యొకతె సుగంధ ద్రవ్యాలను తయారుచేసే సైరంధ్రి కనుపించగా ఆమెనుండి సుగంధ ద్రవ్యాలను తాము తీసికొని బలరామకృష్ణులు తమ వంటికి పూసికొన్నారు కృష్ణుడు ఆమె పాదం తన పాదంతో త్రొక్కిపట్టి ఆమెముఖం ఎత్తి పట్టుకొని పైకిలేపి ఆమె కుబ్జాత్వాన్ని పోగొట్టేడు. అంటే 'త్రివక్ర' అనగా సాధకునిలోని త్రిగుణాల వక్రత అని అర్థం. అది వాసనలతో కూడినదన్నదే ఆమె గంధాలు తయారుచేసే సైరంధ్రి అంటే ఆ త్రిగుణ వక్రత తీర్చి ఆ వాసనల నిర్వృతి తత్త్వం గ్రహించింది అని అంతరార్థపరంగా కుబ్జాత్వ నివారణానికి అర్థం తెలిసి కోవాలి. ఆ సైరంధ్రి కృష్ణుని తనతో క్రీడించి సంభోగించవలసిందిగా కోరింది. ఆ కోర్కెను కృష్ణుడు తర్వాత మరొకప్పుడు తీర్చేడు.

తర్వాత "సుదాముడనే మాలాకారుణ్ణి బలరామకృష్ణులు దీవించి వరాలిచ్చేరు." 'సుదామ' కలవాడు సుదాముడు అంటే (సు+ద+అమా) సు=సుగతిని, ద= ఇచ్చేదైన, అమా=అమాయకత్వం 'మా' అంటే మాయ అర్థం, ఇప్పుడు సుదాము డంటే సాధకునిలోని అమాయక మనోవృత్తి అని అర్థం. ఆ అమాయకతను బల రామకృష్ణులు దీవించేరు. అనగా నిర్విషయ, బ్రహ్మానందతత్త్వాలు అమాయకత్వాన్ని అభిమానిస్తాయి అని మనం గ్రహించాలి.

తర్వాత మూడు వంకరలుగల ధనుస్సును రామకృష్ణులు విరిచివేశారు. అంటే సాధకునిలోని స్థూల సూక్ష్మ కారణ దేహాల్ని నాశంచేశారు అని తెలిసికోవాలి. అప్పుడు అమనస్కత సాధకునిలో సిద్ధిస్తుంది.

తర్వాత కువలయాపీడుడు అనే గజమును నాశంచేసేరు అంటే, కు=భూ సంబంధమైన, వలయ=జనన మరణ వలయంచేత, ఆపీడుడు=బాగా బాధించే వాసనా వృత్తి అని దాని అర్థం. అది గజము, 'గ' అంటే పోవునది, 'జ' అంటే పుట్టేది అని అంతరార్థంలో భూమిపై చస్తూ పుట్టుతూ వుండే భ్రమణాన్ని కల్గించే వాసన అని అర్థం. ఆ వాసనను నిర్విషయ తత్త్వమూ, బ్రహ్మానందతత్త్వమూ ధ్వంసంచేశా యని కువలయాపీడ గజ సంహారానికి అంతరార్థం ఇక్కడ చెప్పాలి.

తర్వాత రామకృష్ణులు ముష్టిక చాణూరులనే మల్లురను వధించేరు,

ముష్టి+క అంటే ముష్టి=గుప్పెటయందు 'క' అంటే ఐహికసుఖం కలవాడు అనగా ఐహిక సుఖాన్ని ఎవరిని పొందనీయక తానే పొందే లోభరూపమైన ఆంతశ్శత్రుగుణం అన్నమాట, చణ+ఉ+ర='చణోర' అవుతుంది. 'చణోర' అనునదే స్వార్థంలో అణ్ ప్రత్యయంతో 'చాణోర' అవుతుంది. ఇక్కడ 'చాణూర' అనే పదాన్ని 'చాణోర'గా మార్చుకొని అర్థం చెప్పుకోవాలి. అసలు 'చాణోర' అనే పదమే 'చాణూర' అని వాడబడిందనాలి. చణ=సమర్థమైన, అనగా బలమైన, ఉ=ప్రకృతిని, ర=గ్రహించునది, 'చణోర' అన్నమాట అర్థ ప్రయోగంగా 'చణ' అనేది విశేషణం. అంటే బలమైన ప్రకృతికై ఆసక్తిగల మనోవృత్తి అన్నమాట. ఈ ముష్టిక చాణూర మనోవృత్తులు మల్లవృత్తులు. మల్ల అనగా, మత్+ల=మల్ల అహంకార మమకారాలను గ్రహించే వృత్తులు మల్ల పదంచేత గ్రహింపబడుతాయి. ఈ శబ్దానికి లోగడ వ్యుత్పత్తి ప్రదర్శనం చెప్పికొనియే యున్నాము. ఈ విధంగా అహంకార మమకార వృత్తులతో కూడిన ప్రబల ఐహిక సుఖాసక్తి ముష్టిక మల్లుడు, ప్రబలమైన ప్రకృతి ప్రియత్వం చాణోరమల్లుడు అనే పదాలకు అర్థం. ఈ రెండువిధాల మనోవృత్తులను నిర్విషయతత్త్వం, బ్రహ్మానందతత్త్వం సాధకునినుండి నాశం చేశాయి అన్నదే కంసుని తాలూకు చాణోరముష్టికులనే మల్లురను రామకృష్ణులు నాశం చేశారన్నదాని అంతరార్థంగా భావించాలి. బాహ్యార్థంలో మల్లపదానికి మల్లయుద్ధం అనగా ద్వంద్వ యుద్ధం చేసేవారని అర్థం. చివర కంసుణ్ణి అతని ఎనమండుగుర సోదరులతో సహా చంపేశాడు. కృష్ణుడు అంటే చర్మము మొదలైన అష్టవిధములైన ధాతువులతో దేహంలో వున్న అపరాశక్తిని విషయ నిర్వృతి తత్త్వం సమూలంగా నాశంచేసి వేసింది అని అర్థం. అపరాశక్తి యొక్క సమూల నాశంతో యావద్వాసనలు నశిస్తాయి. సాధకునకు బ్రహ్మానందంతో ముక్తి సిద్ధిస్తుంది. ఇదంతా నిర్వృతి తత్త్వాన్ని విడవకుండా ఉపాసిస్తూండడం వల్లనే లభిస్తుందని ఈ కంస వధా కథనంవల్ల సాధకులు గ్రహించగలరు. కంస వధా ఘట్టం భాగవతంలో చాల ముఖ్యమైనది అంటే విషయ నిర్వృతి తత్త్వంతో సర్వవాసనా నివృత్తిని సాధకులు పొందడం అనేది ముక్తి సాధనలలో శ్రేష్ఠమైనదని భావించాలి.

కృష్ణుడు కంసుణ్ణి చంపివేసిన తర్వాత కంసుని తండ్రియైన ఉగ్రసేనుణ్ణి చెఱనుండి విడిపించి మధురారాజ్య సింహాసనంమీద అతణ్ణి నిలిపి పట్టాభిషేకం జరిపించేడు. ఈ సాధనలో ఉగ్రసేనుడు సాధకుడుగా మనం లోగడ చెప్పుకొన్నాం. ఉగ్రసేనునకు కంసుడు కుమారుడు, దేవకి కుమార్తె. కంసుడంటే సాధకునిలోని

ముక్తిసుఖాన్ని నాశంచేసే అపరాశక్తి, దేవకి అంటే సాధకునిలోని ముక్తి సుఖాన్ని ప్రకాశింపజేసే పరాశక్తి. పరాశక్తికి పుట్టిన కృష్ణుడు అంటే నిర్వృతి తత్త్వం సాధకునిలోని అపరా శక్తిని నాశం చేసింది. రెండు శక్తులూ ప్రతి సాధకుని లోను ఉంటాయి. పరాశక్తినుండి పుట్టిన నిర్వృతి తత్త్వం అపరాశక్తియొక్క విఘ్న కార్యాలను నాశంచేసి సాధకుని ముక్తి సామ్రాజ్య పట్టాభిషిక్తుని చేయడమే కృష్ణుడు కంసుణ్ణి చంపి ఉగ్రసేనుని చెఱ విడిపించి అతణ్ణి మధురా రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చెయ్యడంలోని అంతరార్థం.

# గురు పుత్రానయనం

## (ముక్తి కాంక్షావిచ్ఛిత్తి నివారణ సాధన)

తర్వాత రామకృష్ణులు మధురానగరంలో కొన్నాళ్లున్నారు. అప్పుడు వారి గురువు, 'ప్రభాసతీర్థంలో తమ పుత్రుణ్ణి సముద్రం, తరంగాలతో లాక్కొని పోయిందని, ఆ కుమారుణ్ణి తెచ్చి యివ్వవలసిందని కోరేరు.

వెంటనే రామకృష్ణులు సముద్రుణ్ని పిలిచి అడిగేరు. సముద్రుడు తాను హరించలేదనీ, తనలో నివసిస్తూన్న పంచజుడైన (పంచజన్యుడైన) శంఖుడనేవాడు తన పొట్టలో వారిని పెట్టుకొన్నాడని చెప్పేడు. కృష్ణుడు సముద్రంలోని పంచజన్యుణ్ణి చంపి అతనిపొట్ట చీల్చి శంఖాన్ని కనుగొన్నాడు. తర్వాత గురుపుత్రుడు యమ లోకంలో వుంటాడని గ్రహించి యమలోకం వెళ్ళి యముణ్ని పిలిచి అడిగేడు. యముడు గురుపుత్రుణ్ని తెచ్చియిచ్చేడు. కృష్ణుడు గురునకు ఆ పుత్రుణ్ని సమర్పించేడు.

ఈ కథలో అన్నీ అసంగతములుగానే కన్పిస్తాయి. సముద్రంలో పంచజను డైన శంఖుడెందుకున్నాడు. సముద్రంలో వాడు నివాసంగా ఎల్లాగు వుంటాడు ? వాని కడుపులో శంఖం ఎందుకుంది ? చనిపోయి తవ లోకానికి వచ్చిన బాలుణ్ని తిరిగి యముడు ఇవ్వడం ఎట్లా జరుగుతుంది ? ఈ కథంతా బాహ్యార్థంలో అసందర్భ భూయిష్ఠంగానే వుంది. దీనికి అంతరార్థం వుంది, చెప్తాను.

పుత్రుడు అంటే 'ముక్తికాంక్ష' అనే అంతరార్థాన్ని వ్యుత్పత్తి ప్రదర్శనతో మనం లోగడ ఎన్నోసార్లు చెప్పుకొన్నాం. గురు అంటే గొప్పది అని అర్థం.

గురుపుత్రుడు అంటే సాధకునిలోని గొప్పదైన ముక్తిని కాంక్షించే మనో వృత్తి అని అంతరార్థపరంగా చెప్పుకోవాలి. ప్రభాస తీర్థం. అంటే మిక్కిలి ప్రకాశించే గురువు చెప్పిన సాధన అని అర్థం. తీర్థపదానికి గురువు అని అర్థం. సముద్రం అంటే దేవతా యాథార్థ్య చింతనం అనగా భగవదన్వేషణా ప్రయత్నం అని అర్థం. (స+ముత్+ర అనగా ఆనందంతో కూడిన భగవంతుడు. గ్రహించేది) సాధకుడు ముక్తి సాధనను గురువు చెప్పినట్లు చేస్తూ, అనగా భగవద న్వేషణా యత్నం చేస్తున్నాడు అని" ప్రభాస తీర్థంలో సముద్రాన్ని చేరడం" అన్న దానికి అంతరార్థం. అప్పుడు పంచజనుడు అనగా పంచేంద్రియముల నుండి పుట్టి నట్టి శంఖుడు అనగా ఇంద్రియ సుఖాభిలాష (శంఖపదానికి ఇంద్రియ సుఖం అని వ్యుత్పత్తి ప్రదర్శనతో లోగడ చెప్పుకొనియున్నాం) గురుపుత్రుణ్ని అనగా గొప్పదైన ముక్తికాంక్షను సముద్రానికి వచ్చినపుడు అనగా భగవదన్వేషణ జరిపేటప్పుడు శంఖుడు అనగా ఇంద్రియ సుఖాభిలాష తన పొట్టను బెట్టుకొని సముద్రంలో దాగి నదని అర్థం అంటే సాధకునిలోని ముక్తిని కోరే మనోవృత్తి భగవదన్వేషణ చేస్తూండగా ఆ సాధకునిలోని పంచేంద్రియాల్లో ఐహిక భోగాసక్తి పైకివచ్చి సాధకుని ముక్తికాంక్షను భగవదన్వేషణా కార్యాన్ని అట్టడుగుకు చేర్చివేసింది. ఈ విధంగా సాధకునకు సాధనా విచ్ఛిత్తి కల్గింది అనేది అంతరార్థంగా గ్రహించాలి.

గురువు కృష్ణుణ్ని తన పుత్రుణ్ని తిరిగి ఇప్పించాలని కోరేదంటే గొప్పగా సాధన చేసే సాధకుడు విషయ వాంఛారహిత నిర్వృతి తత్త్వాన్ని ముక్తికాంక్షతో ఆశ్రయించేదన్నమాట. అప్పుడు కృష్ణుడు పంచజనుడైన శంఖుణ్ని చంపి శంఖాన్ని తెచ్చేడు అంటే సాధకునిలోని పంచేంద్రియ విషయసుఖాన్ని నిర్వృతి తత్త్వం తనలో కలుపుకొన్నాడన్నమాట. కృష్ణుని చేతిలో ధరించి ఉన్నట్లు చెప్పే పాంచజన్యం అనే శంఖం ఇదే. పంచేంద్రియాల్లోంచి పుట్టిన ఐహిక సుఖాసక్తిని నిర్వృతి తత్త్వం తనలో లీనం చేసికొంటుందని చెప్పడమే విష్ణువు చేతిలో పాంచజన్యమనే శంఖాన్ని ధరించడ మంటే.

తర్వాత కృష్ణుడు యముణ్ని పిలిచేడు. యముడు, గురుపుత్రుణ్ని ఇచ్చేడు. కృష్ణుడు గురువునకు ఆ పుత్రుణ్ని సమర్పించేడు. యముడు అంటే యమం అనే

సాధకునియొక్క అంతరింద్రియ నిగ్రహసాధన అని అర్థం. నిర్వృతి తత్త్వం అంతరింద్రియ నిగ్రహంతో ఒకప్పుడు విచ్ఛిత్తియైన ముక్తికాంక్షను తిరిగి సాధకునిలోనికి చేర్చింది అని పై కథావాక్యాలకు అంతరార్థం గ్రహించాలి.

ఈ గురుపుత్రానయన కథ సాధకులు విచ్ఛిన్నమైన ముక్తి కాంక్షను నిర్వృతి తత్త్వంతో పునః ప్రతిష్ఠితం చేసికోవాలనే సాధనా రహస్యాన్ని చెప్తున్నదిగా భావించాలి.

తర్వాత కృష్ణుడు మొదట్లో మధురాపురాపుర ప్రవేశించినపుడు గంధాలు నిర్మించే సైరంధ్రి కిచ్చిన వాగ్దానం ప్రకారం ఆమె సౌఖ్యం కోసం ఆమె ఇంటిలో గడిపేడు. అప్పుడు సైరంధ్రి సమస్త సుగంధ వాసనలతో శయ్యాగృహం నింపి వేసింది. శయ్య పైని వారిరువురు అంగాంగ లింగనంతో ఉండగా ఉద్ధవుడూ, అక్రూరుడూ కృష్ణుని దర్శించి స్తుతించి వెళ్ళేరు.

బాహ్యార్థంలో 'ఇంత విడ్డూరం వుంటుందా' అనిపిస్తుంది. దాసీదానింటిలో కృష్ణుడు ఆమెతో సంభోగిస్తూండగా అక్రూరుడు, ఉద్ధవుడు వంటి మహాభక్తులు కృష్ణదర్శనంచేసికొనిపైగాస్తుతించి వెళ్ళడం ఏమిటి? దీనికి అంతరార్థం చెప్పకోకతప్పదు. గంధాల్ని నిర్మించే సైరంధ్రి అంటే సమస్త జనన మరణాలనిచ్చే వాసనాకేంద్రమైన మనస్సు అన్నమాట. దాన్ని నిర్వృతి తత్త్వం తనలో ఐక్యం చేసికొంది అన్నదే వారి అంగాంగలింగనానికి అర్థం. అటువంటి బ్రహ్మతత్త్వాన్ని దర్శించి అక్రూరుడు ఉద్ధవుడు స్తుతించేరు. అక్రూర అంటే క్రూరత్వం లేని ప్రశాంత గుణం. ఉద్ధవుడంటే ఉత్+హావ=ఉద్ధవం అవుతుంది. అంటే ఉన్నతమైన హవనం అనగా హోమ ద్రవ్యం అనగా పరతత్త్వంలో ఆహుతిచేసే అమనస్కస్థితియే అది అని అంతరార్థపరంగా గ్రహించాలి. దీనితో దశమస్కంధం పూర్వార్థం సమాప్తం. ఇందు కృష్ణుని శిశుపౌగండ కౌమార వయోలీలలు వర్ణించబడ్డాయి. కృష్ణుని జననంతో ప్రారంభించి కంసవధతో పూర్వార్థం పూర్తి చేయబడింది. ఇది దశేంద్రియ నిగ్రహ సాధనా ప్రశికల సమూహంలో పూర్వభాగం అని దశమస్కంధ పూర్వార్ధానికి అంతరార్థం గ్రహించాలి.

# అంతరార్థ భాగవతము

## బ్రహ్మ విద్యాదర్పణం

## దశమ స్కంధం - ఉత్తరభాగం

# జరాసంధ చరిత్ర

## (ద్వంద్వ ప్రశమన సాధన)

"కంసవధ జరగడంతో కంసుని భార్యలైన అస్తి, ప్రాప్తి అనేవారు తమ తండ్రియైన జరాసంధుని యింటికి చేరుకొని తమకు ప్రాప్తించిన వైధవ్యాన్ని చెప్పు కొన్నారు. జరాసంధుడు శోక కోపా విష్టుడై "భూమిమీద యాదవవంశం లేకుండా సమూల నాశం చేస్తా" నని ప్రతిజ్ఞ చేసేడు. ఇరవైమూడు అక్షోహిణీల సేనతో యాదవ రాజధానీ నగరమైన మధురా పట్టణాన్ని ముట్టడించేడు.

సముద్రం పొంగినట్లు వచ్చిన సేనల్ని చూచి, ఇప్పుడు "ఈ సేనల్ని మాత్రం నాశం చేస్తాను. జరాసంధుణ్ణి ఇప్పుడు చంపను. వాడు ఇంకా సేనల్ని తెచ్చి మళ్ళా మళ్ళా వస్తాడు. అట్లా వాడు తెచ్చిన సేనల నన్నిటిని నాశంచేస్తే కాని భూ భారం తగ్గదు. సాధు రక్షణకోసం భూ భారం తగ్గించడానికే నేను అవతరించేను గదా!" అని కృష్ణుడు అనుకుంటూండగానే ఆకాశాన్నుండి సూర్యకాంతిగల ఆయుధాలతో నిండి సారధితో కూడిన రథం క్రిందికి దిగింది. దాని నారోహించి రామ కృష్ణులు జరాసంధ సేనను సమగ్రంగా నాశంచేసి జరాసంధుణ్ణి చంపక వదలి వేశారు. తర్వాత పదిహేడుసార్లు కృష్ణుని మీదికి జరాసంధుడు ప్రతిసారి ఇరువైమూడువేల అక్షోహిణీల సేనలతోను యుద్ధానికి వెళ్ళడం కృష్ణుడా సేనల్ని పూర్తిగా నాశం చేయడం జరాసంధుణ్ణి చంపకుండా విడిచిపెట్టేస్తూండడం జరిగింది. జరాసంధుడు పద్దెనిమిదోసారి యుద్ధానికి రానై యుండగా, నేడో రేపో జరాసంధుడు తిరిగి ఇరువై మూడువేల అక్షోహిణీల సేనలతో వస్తాడని ఊహించి ద్వాదశ యోజనాల వైశాల్యం గల ఒక దుర్గాన్ని సముద్ర మధ్యమందు విశ్వకర్మచేత అప్పటికప్పుడు సృష్టించేరు. అదే ద్వారకా పట్టణం. తన యోగశక్తిచేత కృష్ణుడు ఆ ద్వారకలో యాదవ వంశా లన్నిటిని ప్రవేశపెట్టేడు. పద్దెనిమిదోసారి జరాసంధుడు మధురను ఇరువైమూడు

అక్షౌహిణీల సేనతో వచ్చేడు. అప్పుడు మధురనుండి రామకృష్ణులు పారిపోయి ద్వారకలో ప్రవేశించేరు."

ఈ కథలో కంసుని భార్యల ఇద్దరి పేర్లు 1. అస్తి, 2. ప్రాప్తి అనేవి. ఈ పేర్లేమిటి ? జరాసంధుణ్ని ఎదిరించలేక రామకృష్ణులు పారిపోవడం ఏమిటి? ద్వారకను నిర్మించి అందులో దాక్కోడం ఏమిటి ? ద్వారకలోనికి జరాసంధుడు రాలేదా ? ఈ సంశయాలకు బాహ్యార్థంలో సరియైన సమాధానం లేదు. అంతరార్థపరంగా చెప్పుకోవాల్సిందే :

కంసుడంటే సాధకునిలోని ముక్తి సుఖాన్ని నాశం చేసే అపరాశక్తి అని అర్థం చెప్పుకొని వున్నాం కదా ! అతని భార్యలు ఒకతె అస్తి, రెండవది ప్రాప్తి. అస్తి అంటే ఉన్నది అనే అర్థం కల క్రియా పదం. అంటే అంతర్గతమే సాధకుల లోని అపరాశక్తికి లోబడివున్న పూర్వజన్మలనుండి వుండివున్న సంచితకర్మ వాసనలు అన్నమాట. అవి జన్మలనుండియో ఉన్నవి కాన వానిని 'అస్తి' పదంతో గుర్తించడం జరిగిందనాలి. ప్రాప్తము అనేదాన్ని పొందబడినది అనిఅర్థం ప్రాప్తి అన్న అదే అర్థం. ప్రారబ్ధములైన కర్మలవల్ల పొందబడినదీ అపరాశక్తికి వశపడి వుండేదీ. అయినా ప్రారబ్ధ కర్మ వాసనలన్నది ప్రాప్తి అనే దానికి అంతరార్థపరమైన అర్థం చెప్పుకోవాలి. అస్తి ప్రాప్తి అనేవి రెండూ ముక్తి సుఖాన్ని దూరం చేసే అపరాశక్తికి వశంలోనివైన (భార్యలైన) ప్రారబ్ధ సంచితకర్మ వాసనలన్నమాట. అవి రెండూ జరాసంధుని కుమార్తెలే. జరాసంధుని పుట్టుకను గూర్చి కొంచెం ఇక్కడ చెప్పుకోవాల్సి వుంది. మగధ దేశమునేలే రాజు భార్యకు నిలువుగా రెండుగా చీలిన శిశుఖండాలు పుట్టేయి. రాజుకు తెలియకుండా. ఆ శిశుఖండాల్ని ఆమె దాసీదానిచేత ఊరి చివరి పొదల్లో పారేయించింది. ఆ పట్టణాన్ని రాత్రుళ్ళు కావలికాసే 'జర' అనే రాక్షస స్త్రీ పొదలో ఏడుస్తూన్న ఆ శిశుఖండాల్ని చూచి రెండిటిని సమంగా అతికింది. ఆ ఖండాలు రెండూ అతుక్కొని ఏక శిశువుగా మారింది. జరచేత సంధింపబడిన ఖండాలు కల వాడు కాగా జరాసంధుడనే పేరు ఆ శిశువున కేర్పడింది. ఆ జరాసంధుడు మగధ దేశానికి రాజయ్యేడు.

ఇదేమిటి ! ఈ కథ మరీ చిత్రంగా వుంది. రెండు ఖండాలూగా పుట్టినని జీవించి వుండడం. వానిని ఒకటిగా సంధించడం జరిగే పనేనా ? దీనికి కూడ అంత రార్థం చెప్పాల్సి వుంది.

'జర' అంటే జరయతి శిథిలయతి 'ఇతి' జరా : అంటే శిథిలమయ్యేది అని

వ్యుత్పత్త్యర్థం చెప్తే శిథిలమయ్యే స్వభావం గల దేహం 'జర' అనే పదానికి అంత రార్థంగా చెప్పవచ్చు. ఆ దేహం అసలు రెండు శకలాలు కలిసి ఒకటిగా ఏర్పడింది. సుఖదుఃఖాది ద్వంద్వగుణాలతో దేహం ఏర్పడుతుంది. వాటిచేతనే అది శిథిల మవు తుంది. ఆ ద్వంద్వగుణ విశిష్టమైన దేహమే జరాసంధుడన్నమాట. ఈ విధంగా జరా పదానికి దేహం అర్థం అయినప్పుడు శిశుశకలాలికి ద్వంద్వాలు అర్థం అని చెప్పుకోవాలి

ఇక జరాసంధునికి అస్తి, ప్రాప్తి అనేవారు కూతుళ్ళు. అంటే పూర్వజన్మ సంచిత వాసనలచేత ఈ జన్మలోని ప్రారబ్ధకర్మ వాసనచేత, ద్వంద్వగుణ విశిష్టమైన దేహం ఏర్పడుతుంది సంచిత ప్రారబ్ధములనేవి సాధకునిలోనే అపరాశక్తి వశంలో భార్యలు వలె వుంటాయి. ఈ విధంగా కంసుడూ, అతని భార్యలు, అస్తి ప్రాప్తి అనేవీ, జరాసంధుడూ అనేవి అన్నీ కూడ సాధకునిలోనివే అని అంతరార్థపరంగా గ్రహించాలి. సాధకునిలోని అపరాశక్తిని, నిర్వృతి తత్త్వం తనలో లీనం చేసికొన్నా ఇంకా ఆ శక్తి తాలూకు వాసనాలేశాలూ, ద్వంద్వగుణ లక్షణాలూ సమూలం నశించవు. సాధకునియొక్క ప్రాణోత్క్రమణతో కాని వానికి పూర్తి విముక్తి జరగదు. ప్రాణోత్క్రమణం జరిగే వరకు సాధకుడు వాసనలను, ద్వంద్వములను నిర్వృతి తత్త్వంతో మాటిమాటికీ నాశం జరిగిస్తూనే వుండాలి.

ప్రతిసారి జరాసంధుడు ఇరువైమూడు అక్షోహిణీల సేనతో పద్దెనిమిదిసార్లు కృష్ణుణ్ణి ఎదిర్చేడు. అంటే పంచభూతాలు 5, పంచభూత స్పర్శలు 5, పంచేంద్రియాలు 5, అంతఃకరణ చతుష్టయం 4, త్రిగుణాలు 3, జీవుడు 1. మొత్తం ఇరువై మూడు తత్త్వాలు. వానికి సంబంధించిన వృత్తులు, ఉపవృత్తులు అసంఖ్యాకములుగా వుంటాయి. అవి అక్షోహిణీల సేన. అక్ష+ఊహినీ=అక్షోహిణి అక్షోహిణి అని రెండూ అవుతుంది. అక్ష అనే పదానికి ఇంద్రియాలు అనే అర్థం వుంది. ఊహినీ అంటే అసంఖ్యాకములైన కలిగిన వాసన ఊహలు అని అర్థం. ఇంద్రియాలు ప్రోత్స హించే తలంపులుకల వాసనలే అక్షోహిణీల అనే పదానికి అంతరార్థం. అరిషడ్వర్గానికి సంబంధించి త్రిగుణాలతో కలిసి వుండే ఈ వూహల (6×3) వైవిధ్యం పద్దెనిమిది విధాల వుంటుంది. ఆ పద్దెనిమిది రకాలకు సంబంధించిన ఊహలలోను ప్రతిరకం అనేక వేలు ద్వంద్వగుణ విశిష్టమైన దేహంలో ఉండేవే. ఈ పద్దెనిమిది విధాల

విభాగంతో వున్న లక్షోపలక్షల ఊహలు నిర్వృతి తత్త్వంవల్ల నశిస్తాయి. అదే కృష్ణుడు జరాసంధుడు ఇరవైమూడు అక్షోహిణీల సేనతో పదిహేడు సార్లు వచ్చి దండయాత్రను ప్రతిఘటించి ఆ అక్షోహిణీలను నాశం చేశాడన్న దానికి అర్థం అదే. జరాసంధుణ్ణి మాత్రం చంపలేదు. అంటే ద్వంద్వగుణ విశిష్టమైన దేహం ప్రాణోత్క్రమణతో కాని పోవదు కాన, అంతవరకు సాధకుడు నిర్వృతి తత్త్వాన్ని ప్రతిష్ఠించి ఉపాసిస్తూనే వుండాలి అనేదే దానికి అర్థం. పద్దెనిమిదోసారి కృష్ణుడు పారిపోయి ద్వారకలో దాగుకొన్నాడు. అంటే 'ర' అనగా 'రాతి' గృహ్యాతి అని చెప్తే గ్రహించుట అని అర్థం. న+ర 'అర' అవుతుంది. 'అర' అనగా గ్రహించనిది అని అర్థం వస్తుంది. ద్వి+అ+ర=ద్వార అవుతుంది. (ఆర్షప్రయోగంగా 'ద్వి' అనేది 'ద్వా'గ మారింది.) దానిమీద స్వార్థంలో 'కప్' ప్రత్యయం చేస్తే 'ద్వారక' అవుతుంది. ద్వంద్వగుణాలు లేని నిర్వృతి తత్త్వమునకు నివాసస్థానమైన ముక్తి కేంద్రం అన్నది ద్వారక అన్న పదానికి అంతరార్థంగా చెప్పాలి.

సాధకునిలో ఇంకా వాసనలు సమూలం సంపూర్తిగా నశింపలేదు. ఇంకా కొంతకాలం సాధకుడు నిర్వృతి సాధన చేయవలసియే వుంది. కాన అప్పుడే ముక్తి లభించడానికి వీల్లేదు. సాధకుని సాధన ఇంకా పూర్తి కాకపోవడంవల్ల అతనినుండి నిర్వృతి తత్త్వం మాయమవుతుంది. అదే అన్ని దండయాత్రల్లోను జరాసంధుడి సేనల్ని చంపివేసిన కృష్ణుడు ఆఖరు పద్దెనిమిదవ దండయాత్రలో కూడ జరాసంధుని బారినుండి పారిపోయి తప్పించుకొని ద్వారకలో దాగికొన్నాడు అన్నదానికి అంతరార్థ పరంగా గ్రహించాలి. ద్వారకలోనికి జరాసంధు రాలేడు. అంటే జరాసంధుడంటే ద్వంద్వగుణ విశిష్టుడని కదా చెప్పుకొన్నాం. ద్వారక అంటే ద్వంద్వ గుణాల్ని గ్రహించని ముక్తి తత్త్వం అని కూడ చెప్పుకొన్నాం కదా! ద్వంద్వ విశిష్టుడు ద్వంద్వాన్ని గ్రహించని అద్వైత తత్త్వం వద్దకు ఎట్లా చేరుకోవటం కుదురుతుంది. రెండూ విభిన్న తత్త్వాలు ఒకచోట కలియవు కదా! అదే జరాసంధుడు ద్వారకలోనికి ప్రవేశించలేక తిరిగి పోయేడన్న దానికి అంతరార్థం. ద్వైత తత్త్వం అద్వైత పరమాత్మ తత్త్వాన్ని చేరలేదు అనే సాధనా రహస్యం ఇందులో గ్రహించాలి.

ఈ కథలో అస్తి, ప్రాప్తి అనే పేర్లు, జరాసంధుడు, ద్వారక అనే పేర్లు, ఇరువైమూడు అక్షోహిణీల సేన, పద్దెనిమిదిసార్లు దండయాత్ర, కృష్ణుడు పారిపోవడం అనేవి అంతరార్థానికి కీలకములుగా స్పష్టంగా కన్పిస్తున్నాయి.

# రుక్మిణీ కల్యాణం

## (జీవ సందేశ సాధన)

"విదర్భ దేశాన్ని భీష్మకుడనే రాజు పాలిస్తూన్నాడు. అతనికి రుక్మి, రుక్మ రథుడు, రుక్మబాహువు, రుక్మకేశుడు, రుక్మమాలుడునను ఐదుగురు కొడుకులూ ఆ పైని రుక్మిణి అనే ఒక కూతురూ కల్గేరు. రుక్మిణి కృష్ణుని ముకుందునిగా తెలిసికొని అతనిని వివాహమాడాలని అభిలషించింది. కృష్ణుడు కూడ ఆమె శుభ లక్షణాల్ని గుర్తించి తనకు తగ్గ భార్యగా నిశ్చయించుకొన్నాడు. తండ్రి భీష్మకుడూ, బంధువు లందరూ కూడ కృష్ణుడికే రుక్మిణి నియ్యడానికి తలిచేరు. కాని ఆమె పెద్దన్న రుక్మి మాత్రం ఆమెను శిశుపాలుని కివ్వాలని పట్టుపట్టేడు. పెండ్లి శిశుపాలునితో జరుగు తుంది అని అన్న పట్టు తెలిసి, మరునాడు పెండ్లి అనగా తొలినాడే రహస్యంగా రుక్మిణి తన గురువుగారైన బ్రాహ్మణుణ్ణి పిలిచి కృష్ణుడి వద్దకు తన కోర్కె తెల్పవల సిందిగా," పెండ్లికి పూర్వంగా ఊరిచివర నున్న భవానిదేవి గుడికి తాను వెళ్ళి వచ్చే టప్పుడు తన్ను బలాత్కారంగా తీసికొనిపోవచ్చు"నని ఉపాయంకూడచెప్పిపంపించింది. కృష్ణుడామె సందేశం అందుకొని ఆ ప్రకారం సరిగా పెండ్లికి ముందుగా కులదేవతా యాత్ర ముగించుకొని వస్తూన్న రుక్మిణిని మెరుపు మెరసినట్లుగా వచ్చి తన రథం మీదికెక్కించుకొని ద్వారకాపట్టణానికి రథం మళ్ళించేడు. శిశుపాలుడు తనకు తోడుగా వచ్చిన జరాసంధుణ్ణి, దంత వక్త్రాదుల్ని తనతో కూడ తీసికొని యదు సైన్యంతో పోరాడి ఓడిపోయి తమకది అనువైన కాలం కాదని కృష్ణునితో యుద్ధం విడిచి పారి పోయేడు రుక్మి మాత్రం వెనుదిరుగక కృష్ణుణ్ణి వెంటాడేడు. కృష్ణుడాతణ్ని తల నరికి వేయడానికి ఖడ్గం ఎత్తడంతో రుక్మిణి కృష్ణుణ్ని బ్రతిమలాడి ఆ పని విరమింపజేసింది. కృష్ణుడాతని తలగొరిగి విరూపుణ్ని చేసి వదలేసేడు. తర్వాత ద్వారకలో రుక్మిణీ కృష్ణులకు వివాహం జరిగింది."

భీష్మకుడు విదర్భను పాలిస్తున్నాడు. 'భీష్మం' అంటే ప్రతిజ్ఞ లేక పట్టుదల అని అర్థం. భీష్మకుడంటే భగవంతుని కోరే పట్టుదలతో కూడిన సాధకుడు అని చెప్పాలి విదర్భ దేశం అంటే విశేషంగా దర్భలతో కూడిన ప్రదేశం అనే వ్యుత్ప త్త్యర్థంలో 'యజ్ఞాలు' అనే అంతరార్థం చెప్పుకోవచ్చు. భీష్మకుడు విదర్భంను పాలి స్తున్నాడంటే పట్టుదల కల సాధకుడు భగవదన్వేషణకై యజ్ఞాలతో కర్మోపాసనా పరుడై యున్నాడన్న మాట. అతనికి ఐదుగురు కొడుకులు ఒక కూతురు. ఐదు

ఇంద్రియాల్ని ఐదుగురు కొడుకులుగాను భగవంతుణ్ని చేరాలనే సాధకునిలోని జీవుడే కూతురుగాను చెప్పబడ్డం జరిగింది. 'రుక్మ' పదానికి బంగారం అనే అర్థముంది. బంగారాన్ని చెప్పే అన్నిపదాలూ అంతరార్థంగా ప్రకృతిని చెప్పేపదాలు. ఈ సంగతి లోగడ చెప్పుకొన్నాం. కాన రుక్మం కలది రుక్మి అంటే సర్వేంద్రియ ప్రకృతి రుక్మి పదానికి అర్థం. రుక్మ బాహు, రుక్మకేశుడు, రుక్మ రథుడు, రుక్మమాలుడు అనేవి ప్రకృతి ననుసరించి వుండే ఇంద్రియాలు. ఇక రుక్మిణి అంటే "రుక్మిణానీయతే ఇతి రుక్మిణీ" అనే వ్యుత్పత్తిలో రుక్మిచేత పొందింపబడేది అని అర్థం అనగా జీవుడు ప్రకృతి చేతజీవుడు కోరికలయందు ప్రవర్తింప బడువాడు కాన, రుక్మిణి అనే పదం సాధకుని లోని జీవ చైతన్యానికి సంకేతంగా చెప్పాలి.

సాధకుడు యజ్ఞాల చేత భగవంతుని చేరాలని ప్రయత్నిస్తూ ఉన్నా ఆ యజ్ఞాలు త్రైగుణ్య ప్రకృతికి సంబంధించిన విషయాలే కావడం వల్ల ఆతడు ప్రకృతిని కాదనలేక దాని ఇష్ట ప్రకారమే పోతాడు. అదే భీష్మకునకు రుక్మిణిని కృష్ణుని కియ్యా లనే లోనఉన్నా రుక్మి యొక్క ఇష్ట ప్రకారం శిశుపాలుడికే ఇవ్వడాన్ని కాదనలేక పోయేడు. శిశుపాలుడు అంటే శిశువు అనగా ఏమీ తెలియనిది అనగా అజ్ఞానం అన్నదానికి సంకేతం. శిశుపాలుడంటే అజ్ఞానాన్ని పెంచే అహంకారం అన్నది అంత రార్థం. కృష్ణుడు రుక్మిణినీ, రుక్మిణి కృష్ణుణ్నీ ఒకరినొకరు చూచుకోక పోయినా గుణాలు వినడం చేత గాఢంగా ప్రేమించుకొని పెండ్లి చేసికోవాలనే గాఢ వాంఛ కలవారు, అంటే జీవ తత్త్వమూ, పరమాత్మ తత్త్వమూ ఒకదాని నొకటి విడిచి వేఱుగా వుండనివి; అనీ, అవి నిజానికి ఒకే తత్త్వమనీ, రుక్మిణీ కృష్ణుల పరిణయా సక్తికి అర్థం. బ్రాహ్మణునిచేత రుక్మిణి సందేశం పంపించిందీ అంటే బ్రాహ్మణు డంటే బ్రహ్మను పొందేవిజ్ఞానం అనేది దాని అర్థం. 'బ్రహ్మన యతి ఇతి బ్రాహ్మణః' అనే వ్యుత్పత్త్యర్థం వల్ల ఆ అర్థం సిద్ధిస్తుంది. జీవుడు బ్రహ్మ జ్ఞానంతో నిర్వృతి తత్త్వమైన పరబ్రహ్మ స్వరూపాన్ని తన్ను ప్రకృతి యొక్క మాయా బంధం నుండి అజ్ఞాన వశం కాకుండా కాపాడుమని చేసే నిరంతర జ్ఞాన సాధనమే రుక్మిణి బ్రాహ్మ ణునిచేత కృష్ణునికి సందేశం పంపిందన్న దానిలోని అంతరార్థంగా గ్రహించాలి.

శిశుపాల జరాసంధ దంతివక్త్రులు తమకు ఇది కాలం కాదని కృష్ణుని విడిచి పారిపోయేరంటే నిర్వృతి తత్త్వం తమలో ఐక్యపడడానికి ఇంకా సాధనలు చేయవలసి వుందని సాధకునిలోని ప్రకృతి ననుసరించి యున్న అహంకారాదులు నిర్వృతి తత్త్వాన్ని చేరలేక వెళ్ళిపోయేయని అంతరార్థపరంగా చెప్పాలి

కృష్ణుడు రుక్మి యొక్క తల గొరిగి విరూపం చేసి వదలేసేడంటే నిర్వృతి తత్త్వం, జీవుణ్ణి తనలో ఐక్యం చేసుకోవడానికి ముందు జీవుణ్ని అజ్ఞానం వైపునకు లాగే ప్రకృతి యొక్క ఆకారాన్ని విరూపం చేసిందన్న మాట. జీవుడు బ్రహ్మ జ్ఞాన సాధనతో పరమాత్మను నిరంతరం ధ్యానించడం వల్లనే నిర్వృతి పరబ్రహ్మైక్యాన్ని పొందుతాడు. రుక్మిణీ కల్యాణానికి బ్రాహ్మణ సందేశమే కారణంగా చెప్పడం లోని అంతరార్థం అదే. ముఖ్యంగా ఈ కథలో ముక్తి కారణమైన జీవ సందేశ సాధన కథాపరంగా రూపొందింపబడిందిగా గ్రహించాలి.

# స్యమంతకోపాఖ్యానం

## (సత్యభామా పరిణయం)

### (సత్యజ్ఞాన ప్రకాశాన్ని నిర్వృతి తత్త్వం లీనం చేసే సాధన)

"సత్రాజితుడనే రాజున్నాడు. అతడు సూర్యోపాసకుడు. సూర్యుడాతనికి ప్రీతుడై స్యమంతకమనే మాణిక్యాన్ని ఇచ్చేడు. అతనికి 'సత్యభామ' అనే కూతురు వుంది. ఒకనాడు సత్రాజితుడు తన మెడలో స్యమంతక మణిని ధరించి ద్వారకకు వచ్చి కృష్ణుణ్ని దర్శించేడు. ఆ మణి కాంతులకు ఆనందపడి ఆ మణిని తనకిమ్మని కృష్ణుడు సత్రాజితుణ్ణి అడిగేడు. ఆ మణి ప్రతి రోజు ఎనిమిది బారువుల బరువు (ఇరువది మణుగులు ఒక బారువు) బంగారాన్నిస్తూన్న కారణం చేత దానిని సత్రాజితుడు కృష్ణుని కియ్యలేదు.

తర్వాత ఒకప్పుడు సత్రాజితుని తమ్ముడు 'ప్రసేను' డనేవాడు ఆ మణిని ధరించి అడవికి వేటకు వెళ్ళేడు. అడవిలో ఒక సింహం ప్రసేనుణ్ని చంపి మెడ లోని మణిని మాంసపు ముద్ద అనుకొని కొరకడం ప్రారంభించింది. ఆ సింహాన్ని చంపి 'జాంబవంతు' డనే ఎలుగుబంటి ఆ మణిని తీసికొనిపోయి తన గుహలో ఉయ్యాల తొట్టెకు పైని బాలకునకు ఆడుకోవడానికి కట్టింది.

సత్రాజితుడు 'కృష్ణుడే తన తమ్ముణ్ని చంపి స్యమంతక మణిని అపహరించి వుంటా' డని కృష్ణునిపై నింద నారోపించేడు. ఆ మాట కర్ణాకర్ణికగా కృష్ణునికి తెలిసింది. కృష్ణుడు అడవిలో వెదకి ప్రసేనుడి శవాన్నీ, అక్కడే చనిపోయి వున్న సింహాన్నీ చూచి అక్కడ నుండి అడుగుల జాడ లాధారంగా జాంబవంతుని గుహ

లోనికి వెళ్ళి, ఇరువై ఎనిమిది రోజులు ఆ జాంబవంతునితో యుద్ధం చేసి, ఆ మణిని పుచ్చుకొన్నాడు. జాంబవంతుడు కృష్ణుడికి తన కూతురైన జాంబవతి అనే అమ్మాయిని భార్యగా సమర్పించేడు.

తర్వాత సత్రాజితునకు కృష్ణుడు స్యమంతక మణిని ఇచ్చేశేడు. సత్రాజితుడు తాను తిరిగి ఆ స్యమంతక మణితో కూడ తన కూతుర్ని సత్యభామను కూడ కృష్ణుడికి దానం చేసేడు."

సత్రాజితుడు అంటే సత్త్రి+అజితుడు అని విడదీస్తే సత్త్రి=యజ్ఞములచేత, అజితుడు=జయింపబడని వాడు. అంటే యజ్ఞాది వేద కర్మకాండకు వశపడక జ్ఞాన సంబంధంగల ఉపనిషదర్థ సాధనలు చేయు సాధకుడు అని అర్థం. అతడు సూర్య భక్తుడు, 'సూర్య' అంటే 'సూరి' సంబంధమైనది సూరి అనగా పండితుడు. కాన పాండిత్యము అన్నది సూర్యపదానికి అర్థం అని పాండిత్యానికి సంబంధించిన జ్ఞానము నందు భక్త=కలిసియుండు వాడు అనిసూర్య భక్తుడు అన్నదానికి అర్థం అనుభవానికి సంబంధించింది కాని, వట్టి పాండిత్య జ్ఞానం కేవల రజోగుణానికి సంబంధించినది అవుతుంది. ఇక్కడ సూర్య పదం వట్టి పాండిత్యం అనే అర్థంలో అది రజోగుణభూ యిష్టమైంది అని చెప్పాలి. అప్పుడు సత్రాజితుడు సూర్య భక్తుడంటే జ్ఞాన సాధన చేస్తూన్నా, రజోగుణంతో కూడిన వట్టి అనుభవ శూన్యమైన జ్ఞానం కలవాడు అని అర్థం. జ్ఞాన పాండిత్యం గర్వం వలన యజ్ఞాది కర్మ మార్గమును నిరసించి పేరుకు సత్రాజితుడని పేరు పడ్డాడని సత్రాజితుడు సూర్య భక్తుడన్న దానికి ఇక్కడ అంతరార్థం చెప్పుకోవాలి. సూర్యుని వల్ల అతడు స్యమంతక మణిని పొందేడు. స్యమ్+అంతక, అని విడదీస్తే స్యమ్ అంటే సే అంతః కర్మణి అను ధాతువు వల్ల కలిగిన 'స్యమ్' అను దానికి చంప దగ్గది అని అర్థం వస్తుంది. అనగా నాశంచేయ దగ్గది జన్మము అని అర్థం. దానికి అంతక=నాశకమైన మణి=కాంతినిచ్చే శక్తిగా స్యమంత మణి పదానికి అర్థం చెప్పుకోవాలి. 'స్యమంతక పదం అర్ష ప్రయోగంగా భావించి సమాసంలో ప్రథమా విభక్తి లోపం రాదని, ఇది అలుక్సమాసమని భావించాలి. జన్మన్ని నాశంచేసే శక్తికే స్యమంతక మణి అని పేరు. సూర్యానుగ్రహం వల్ల అనగా జ్ఞాన పాండిత్య బలం వల్ల సత్రాజితునకు ఆముక్తి శక్తి లభించింది అని అర్థం. స్యమంతక మణి ప్రతి రోజూ ఎనిమిది బారువుల బంగారాన్ని సృష్టిస్తుంది అంటే ఆ శక్తి త్వగాది అష్ట ధాతువులకు జ్ఞాన సంబంధమైన పుష్టి కల్గించేదని అర్థం చెప్పుకోవాలి. అయితే ఆ పుష్టి ఏ రోజు కారోజే కల్గించేది అనగా నిత్యమైనది కాదని

కూడ తెలిసికోవాలి. అనుభవ జ్ఞానమైతే శాశ్వత జ్ఞానపుష్టిని అష్టధాతువులలోను కల్గిస్తుంది. ఇది అనుభవ రహిత పాండిత్యజ్ఞానం కావడం వల్ల దానివల్ల కలిగే జ్ఞానం అప్పటికప్పుడు పుట్టి పోతూండేది అనగా నిలకడ కానిది అని అంతరార్థపరంగా తెలిసికోవాలి.

సత్రాజితుణ్ని కృష్ణుడు ఆ స్యమంతకమణిని తన కిమ్మన్నాడు అంటే నిర్వృతి తత్త్వంలో ఆ అశాశ్వత జ్ఞాన సిద్ధిని ఐక్యం చేసి శాశ్వతత్వం పొంద వలసిందిగా అంటే సాధకునిలోని అశాశ్వత జ్ఞానాన్ని నిర్వృతి తత్త్వంతో నాశం చేసికోవాలి అని సాధకునకు ఆతనిలో పరమాత్మ ప్రబోధం చేసింది అని అర్థంగా గ్రహించాలి. సత్రాజితు డందుకు అంగీకరించలేదు. అంటే సాధకుడు రజోగుణ ప్రకృతి కలవాడు కాన ఆత్మ చేసిన ప్రబోధాన్ని రాజస అహంకారంతో స్వీకరించేడు కాదని అంతరార్థం ఇందు తెలిసికోవాలి. ఇది సాధకుని సాధనల్లో కలిగే చివరి విఘ్నంగా గ్రహించాలి.

"సత్రాజితుని తమ్ముడు ప్రసేనుడు స్యమంతక మణిని అన్ననడిగి ధరించి వేటకు వెళ్ళేడు" ప్రసేనుడు అంటే, ప్రజ్ఞావిశేషమైన, సేన అనగా అన్ని ఇంద్రియ వృత్తుల పరివారం అని అర్థం. సాధకునిలోని ఇంద్రియ ప్రవృత్తులనీ జనన మరణ పరిభ్రమణను చేసే శక్తితో కూడి కార్యములందు ప్రవర్తిస్తూనే వున్నాయి అన్నదే ప్రసేనుడు స్యమంతక మణితో వేటకు వెళ్ళేడన్నదాని అంతరార్థంగా భావించాలి

'ప్రసేనుణ్ని సింహం చంపింది' అంటే ఇంద్రియ పరివారానికి సాధనా బలంతో కార్యములందు ప్రవర్తించే ఆసక్తి పోయింది అనగా సాధకునిలో తూష్ణీం స్థితి కల్గింది అని అర్థం. ఇది ముక్తి సాధనకు బలానిచ్చే శక్తిగా భావించాలి.

సింహాన్ని జాంబవంతుడు చంపేడు అంటే జాంబవంతుడు ఎలుగుబంటి. అది నల్లని రూపం గలది. కాన అది తమోగుణానికి సంకేతంగా గుర్తించాలి. ఇక్కడ సాధకునిలో నింకా రజోగుణం అంతర్గతంగా నిలిచియుందనీ ఆ రజోగుణాన్ని తమోగుణం అణచివేసింది అన్నదే సింహాన్ని ఎలుగుబంటి చంపిందన్న దానికి అంతరార్థం. సాధకునిలోని తమోగుణం పరమాత్మ స్పర్శతో కాని నశించదు.

కృష్ణుడు 28 రోజులు యుద్ధంచేసి జాంబవంతుణ్ని ఓడించేడు అంటే ఇరువై ఎనిమిది తత్త్వాలలోని తమోవృత్తులను అనగా పది ఇంద్రియాలు, పంచభూతాలు, పంచభూతాల తాలూకు శబ్ద స్పర్శ రూప రస గంధ గుణాల్ని మనోబుద్ధి చిత్తాహం కారాలనే అంతఃకరణ చతుష్టయాల్ని త్రిగుణాల్ని కలిపితే ఇరువై ఎనిమిది తత్త్వాలు

అవుతాయి. ఆ ఇరువై ఎనిమిది తత్త్వాల్లోని తమోవృత్తులను సాధకునిలోనుండి పూర్తిగా నశింపు జేయడమే ఇరువై ఎనిమిది రోజులు జాంబవంతునితోని యుద్ధంగా భావించాలి. "జాంబవంతుడు కృష్ణునకు మణితోకూడ తన కూతురైన జాంబవతిని భార్యగా స్వీకరించవలసిందిగా ఇచ్చేడు. జాంబవతి అంటే తమోగుణంలో నిగూఢంగా వున్న భగవద్దైక్యం కోరే వృత్తి అన్నమాట. దాన్ని నిర్వృతి తత్త్వంలో ఐక్యం చేయడమే జాంబవంతుని కృష్ణుడికి భార్యగా చెయ్యడమంటే.

తర్వాత సత్రాజిత్తుడు మణితోకూడ తన కూతుర్ని సత్యభామను కృష్ణునకు భార్యగా సమర్పించేడు. సత్యభామ అంటే సత్య+భా+మా=సత్యభామ అని విడదీయాలి. సత్య=భగవంతుని గూర్చిన (సత్యం శివం సుందరం అనేవి భగవంతుని చెప్పే పదాలు) భా=కాంతియొక్క, మా=సంపద కలది అనగా అనభవ జ్ఞాన దృష్టితో తెలిసికొన్న సత్య స్వరూపమైన పరమాత్మ జ్ఞానం అని అర్థం. అది యజ్ఞాది కర్మకాండ సాధనవల్ల గాక వట్టి పాండిత్యం వల్లగాక అనుభవ జ్ఞానసాధన వల్లనే నిర్వృతి తత్త్వం కల్గుతుంది అన్నదే సత్రాజితునకు సత్యభామ కూతురై వుందని అర్థమనీ, అది నిర్వృతి తత్త్వంలోనిదే యగుటచే జ్ఞాన సాధకుడు తనలోని ఆ సత్య జ్ఞాన ప్రకాశాన్ని నిర్వృతి తత్త్వంలోనే ఐక్యం చేసేడనీ, దానిలో జనన మరణ పరిభ్రమణ పోయిందనీ సత్రాజితుడు సత్యభామనూ స్యమంతకమణినీ కూడ కృష్ణుడి కిచ్చేడన్నదానికి అంతరార్థంగా సాధనలు గ్రహించాలి.

జీవునిలోని త్రిగుణాలు కూడా అంతర్గతంగా భగవదైక్యం కావాలని కోరేవే. కాని బహిర్గతంగా అవి ప్రకృతి వశంలో వుండి ప్రకృతికే బలాన్నిస్తూంటాయి.

రుక్మిణీకల్యాణ కథలో భీష్మకుడు సాత్త్వికగుణ ప్రకృతి. ఆ సాత్త్విక ప్రకృతి యొక్క అంతర్గతంలోనున్న భగవదైక్యం కోరే వృత్తి రుక్మిణి. దానిని నిర్వృతిపరం చెయ్యడమే రుక్మిణీదేవి శ్రీకృష్ణుని పొందడం అంటే. ఇది సత్త్వగుణైక్యంలో కల్గిన నివృత్తి ఈ స్యమంతకమణి కథలో స్యమంతక మణిని కృష్ణుడడిగినా ఇవ్వక పోవడంవల్ల సత్రాజితుణ్ని జ్ఞానాహంకారంకల రాజసిక ప్రకృతికి సంకేతంగా చెప్పుకోవాలి. ఆ రాజసిక ప్రకృతిలో భగవదైక్యం కావాలనే ప్రకృతియే సత్రాజితుని కూతురు సత్యభామ రాజసిక ప్రకృతి తాను నిర్వృతి తత్త్వంలో సత్యజ్ఞాన ప్రకాశంతో ఐక్యం పొందడమే సత్యభామా పరిణయాన్ని సత్రాజిత్తుజరిపించడంలోనిఅర్థం. తామసికగుణం భగవదైక్యం కోరే తన తపన నిర్వృతి తత్త్వంలో ఐక్యం చెయ్యడమే అనగా సాధకుని తమోగుణం భగవద్గుణంలో లీనం కావడమే జాంబవతీ పరిణయానికి అంతరార్థం.

ఈ విధంగా సత్త్వ రజస్తమో గుణాలు నిర్వృతి తత్త్వంలో లీనం చెయ్యాలనే సాధనా సారాంశాన్ని, పై రెండు కథలు కలిపి ఒకే పరమాత్మైక్య సాధనగా పాఠకులు గ్రహించాల్సి వుంది

# అష్టమహిషీ కల్యాణం

## (అష్ట విధ శక్తుల సాధన)

కాళిందీ నదీ తీర అరణ్యంలో ఒకనాడు "రుక్మిణీ సత్యభామా జాంబవతులను పెండ్లాడిన పిమ్మట కృష్ణుడు అర్జునుడితో కలసి రథంమీద వెడుతూండగా కాళిందీ అనే పేరుగల కన్య ఎదురుపడి "నేను సూర్యదేవుని కూతుర్ని; శ్రేష్ఠుడైన విష్ణువును పతినిగా చేసికోవాలని తపస్సు చేస్తూ అన్వేషిస్తూన్నాను. నేను ఈ యమునాజలంలో నివసిస్తూన్నాను అని పలికింది విష్ణుని అవతారమే అయిన కృష్ణుడా పెను రథం మీదెక్కించుకొని ద్వారకకు తీసికొని వెళ్ళి పెండ్లి చేసికొన్నాడు తర్వాత కృష్ణుడు 'అధిదేవి' యను తన మేనత్త కూతుర్ని తనయందు ప్రేమగల మిత్రవింద అను దాన్ని ఆపె సోదరులు దుర్యోధనున్ని మాట విని తనకిచ్చుట కిష్టపడకపోయినా అందరూ చూస్తూండగా బలాత్కారంగా ఆపెను ఎత్తుకొనిపోయి వివాహం చేసికొన్నాడు. కృష్ణుడు తర్వాత కోసలదేశపు రాజైన 'నగ్నజిత్తు' అను రాజు కూతురు 'సత్య' అనే పేరుగల నాగ్నజితిని ఆపె తండ్రి, పణంగా ఏర్పరచిన ఏడు ఎద్దులను స్వాధీనపరుచుకోడానికి తాను ఏడువిధములుగా మారి ఒకేసారి వాటిపై తలపడి వాటి పొగరణచి వాటి ముక్కులలోనుండి త్రాళ్ళు బిగించి బంధించివైచి సత్య అను పేర్గల ఆ నాగ్నజితిని వివాహమాడేడు.

తర్వాత కేకయదేశపురాజు భార్య శ్రుతకీర్తియను మరొక మేనత్తయొక్క కూతురును 'భద్ర' అనుదానిని పెండ్లాడేడు. ఆ తర్వాత మద్రదేశపురాజు కూతురను 'లక్ష్మణ' యను దానిని స్వయంవరంలో గ్రహించి వివాహం చేసికొన్నాడు. ఈ విధంగా కృష్ణుడు అష్టమహిషులను వివాహమాడేడు. అందులో "రుక్మిణి పట్టమహిషి"

కాళింది అంటే 'కలింద' అనే పదం, 'కాళింద' అని స్వార్థంలో 'అణ్' ప్రత్యయం చేస్తే అవుతుంది. కలిం=మాయను దతి=ఖండించునది అనే అర్థంలో మాయా నిరోధవృత్తి కాళింద అవుతుంది. కాళింద పదంమీద స్త్రీత్వ వివక్షలో 'జీప్' చేస్తే 'కాళిందీ' అనే రూపం అవుతుంది. సాధకునిలోని మాయా నిరోధక మనో

వృత్తియే కాళింది అంటే. నిర్వృతి తత్త్వంలో ఆ కాలిందీ వృత్తి జతపడి వుంటుం దన్నదే కృష్ణుడు కాలిందిని వివాహమాడేడన్నదాని అంతరార్థం.

'మిత్రవింద' అంటే మిత్రులను అనగా అన్నిటిని తానుగా గుర్తించు మనో వృత్తిఅని 'మిత్రం ఇవ విందతి' అనే వ్యుత్పత్తివల్ల మిత్రవింద అనే పదం సిద్ధిస్తుంది. సర్వులను మిత్రులనుగా చూచే లక్షణం భగవంతునికి ప్రియమైన లక్షణం 'అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ' అని భగవద్గీతలో భగవత్ప్రియులైన భక్తుల లక్ష ణాలనుగూర్చి చెప్పేరు సాధకుడు నిర్వృతి తత్త్వానికి అనగా భగవంతునికి ప్రియుడుగా ఉండాలంటే ద్వేషం లేకుండా అందరి యెడల మిత్రభావంతో ఉండాలన్నదే మిత్ర విందను కృష్ణుడు వివాహమాడేడన్నదాని అంతరార్థం.

'నగ్నజిత్తు' కూతురు సత్య. 'నగ్న' అంటే విషయవాంఛలులేని శుద్ధ సత్త్వ ప్రకృతి అన్నమాట. అది 'సత్య' అనగా భగవంతునిచేరే నిజమైనతత్త్వం భగవంతుని ఆ నగ్నమైన శుద్ధ సత్త్వమైన మనోవృత్తి చేతనే, జిత్తు=జయించేది, అనగా చేరుకొనే మనోవృత్తి. 'నేతి' 'నేతి' అనే నిషేధ సాధన అన్నదే నాగ్నజితియైన సత్య అన్న దానికి అంతరార్థం. సాధకులలోని సప్తధాతువులలోని కల్మషంపోలేనే ఆ నగ్న సత్యవృత్తి వస్తుంది. పొగరుబోతు ఎద్దు ఏడింటిని స్వాధీనంచేసికొని నాగ్నజితియైనసత్యను కృష్ణుడు వివాహమాడేడంటే సప్తధాతువులలోని క్రూరత్వాన్ని సాధకుడు నిగ్రహించి తనలో శుద్ధ సత్త్వ వృత్తిని సాధించి నిర్వృతి తత్త్వంలో ఐక్యం చేసేడన్నదే సత్యానాగ్నజితీ వివాహానికి అంతరార్థం గ్రహించాలి.

'భద్ర' అంటే భద్రమునుచేయు మనోవృత్తి అని అర్థం. భద్రము అనగా శుభము మంగళకరము అని అర్థం. అట్టి మంగళకరమైన మనోవృత్తి ముక్తిని గూర్చిన మనోవృత్తి. దానిని నిర్వృతి తత్త్వంలో జతచేయడమే భద్రా వివాహానికి అంతరార్థం.

'లక్ష్మ' అంటే భగవంతుని చిహ్నమైన ప్రకృతి, 'లక్ష్మనయతి ఇతి లక్ష్మణా' అనే వ్యుత్పత్తి ప్రదర్శనమువల్ల ప్రకృతిలో పరమాత్మను చూచే 'సర్వంఖల్విదం బ్రహ్మ' అనే సాధనా మనోవృత్తియే 'లక్ష్మణ' అని చెప్పాలి. ప్రకృతిలో పర మాత్మను చూచే మనోవృత్తి నిర్వృతి తత్త్వాన్ని చేరడమే లక్ష్మణా వివాహానికి అంత రార్థంగా గ్రహించాలి.

కృష్ణునితో రుక్మిణీ సత్యభామా జాంబవతుల మూడు వివాహాలకు సత్త్వ రజస్తమోగుణాలు నిర్వృతి తత్త్వంలో లీనమవడం అనేది అర్థంగా లోగడ తెలిసికొని

వున్నాం. ఇప్పుడు కాళిందీ, మిత్రవింద నాగ్నజితీ లక్ష్మణాభద్రల అయిదు వివాహా లకు అంతరార్థం ఇక్కడ తెలిసికొన్నాం. ఈ విధంగా అష్టవిధ సాధనలతో శక్తు లను సాధకుడు సాధించి పరమాత్మను చేరుకోవాలి అని పై అష్టమహిషీ కల్యాణముల కథలవల్ల గ్రహించాల్సి వుంది.

# పదహారువేల పైని నూరుమంది కన్యల పరిణయం

## (ఏకోత్తర శత షోడశ సహస్ర కళాసమైక్య సాధన)

"ఇంద్రుడు, ప్రాగ్జ్యోతిష పురాధిపతియైన నరకాసురుడనే పేరుగల భౌమా సురుడి బాధలు పడలేక ద్వారకకు వచ్చి కృష్ణుడికి చెప్పుకొన్నాడు. కృష్ణుడు గరు త్మంతునిపై సత్యభామతో కలిసి నరకాసురుడి మీదికి ప్రాగ్జ్యోతిష పురానికి యుద్ధానికి బయల్దేరేడు. గిరిదుర్గం, శస్త్రదుర్గం, జలదుర్గం, అగ్నిదుర్గం, వాయుదుర్గం అనే వాని తోను, మురాసుర పాశములతోను ఆవృతమై వుంది ప్రాగ్జ్యోతిషపురం. వీటినన్నింటినీ భేదించుకొంటూ గరుడునిపైనెక్కి కృష్ణుడు వెళ్ళేడు. కృష్ణుడు రావడం తెలిసి ఇన్నాళ్ళూ జలంలో పరుండివున్న పంచముఖాల మురాసురుడు పైకిలేచేడు. కృష్ణుని పైకి త్రిశూలం పుచ్చుకొని లంఘించేడు. కృష్ణుడు వాడి పంచముఖాల్ని ఖండించి వాణ్ణి చంపేసేడు. అంత భౌమాసురుడు పంపగా, మురుని కొడుకులు ఏడుగురు కృష్ణుని చుట్టుముట్టేరు. వారినందర్నీ కృష్ణుడు యమాలయానికి పంపేసేడు. అంత భౌమాసురుడు తానే అపార సైన్యంతో కృష్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. నరకుడు ప్రయో గించిన శస్త్రాస్త్రం తన్ను చేరకుండానే కృష్ణుడు నరకుడి తల నరికేసేడు. తర్వాత కృష్ణుడు భౌమాసురుడు చెరబెట్టిన పదహారువేల పైని నూరుమంది రాజకన్యలను చెర విడిపించేడు. ఆ రాజకన్యలు కృష్ణుని వరించేరు కృష్ణుడు ద్వారకకు తీసికొనిపోయి వారిని వివాహమాడేడు."

ప్రాక్+జ్యోతిషం=ప్రాగ్జ్యోతిషం అవుతుంది. 'జ్యోతిషం' అంటే ప్రకాశం అని అర్థం. * ఆధ్యాత్మికపరంగా దేహంలోని జ్ఞానప్రకాశమునకే జ్యోతిషపురం అని పేరు. పురం అంటే దేహం, పురము నందలి జ్యోతిషం, జ్యోతిష

* "అష్టా చక్రానవ ద్వారా ... జ్యోతిషావృతః" అధర్వణ 10.2.9. తైఅ 1.27.2.31

పురం అని ప్రథమాతత్పురుష సమాసం చెప్పాలి. ప్రాక్=అంటే ముందు భాగం అని అర్థం. ప్రాక్ జ్యోతిషపురం అంటే దేహంలోని జ్ఞానానికి ముందువున్న ఆవరణ భాగం అని అర్థం చెప్పాలి. ఈ విధంగా మాయావరణం లేక అజ్ఞానావరణం అన్నదే 'ప్రాగ్జ్యోతిష పురం' అవుతుంది అని ఆధ్యాత్మికపరంగా ఇచ్చట అంతరార్థం చెప్పాలి. అది భౌమాసురునికి రాజధాని పట్టణం. 'భౌమః' అనగా భూమికి సంబంధించిన మాయ అని అర్థం. అసురుడు అంటే సు=సుగతిని అనగా ముక్తిని గ్రహించువాడు, సురుడు, న+సురః అసురః, ముక్తిని గ్రహించనివాడు అని అర్థం. ఇప్పుడు భౌమ+అసురుడు అంటే ముక్తిని గ్రహించని భూసంబంధమైన విషయానందం అనే అజ్ఞానం అని అర్థం వస్తుంది.

ఆతనికి నరకుడు, భగదత్తుడు అనే పేర్లు కూడ వున్నాయి. నర+క=నరక, 'నౄహిం సాయాం అనే ధాతువు వల్ల 'నర' అంటే నశించేది అని అర్థం. 'క' అంటే సుఖం అర్థం. నరక అంటే నశించే సుఖములు అని నరకపదానికి అంతరార్థం. అవి భూ సంబంధమైన అజ్ఞానంవల్ల వచ్చేవి. అని భౌమాసురపదానికి అంతరార్థం. భగదత్తుడు అంటే భగ అంటే జనన కారణమైనది. దానిచేత, దత్త=ఇవ్వబడేది అనే అర్థంలో జనన మరణ కారణములైన వాసనల నిచ్చే అజ్ఞానం అనేది భగదత్త పదానికి అర్థం. ఈ విధంగా భౌమ, నరక, భగదత్త పదాలు ఒకే ఐహిక సుఖరూప అజ్ఞానం అనే అర్థాన్నిస్తాయి. ఆ అజ్ఞానాధీశుడు జీవుడు ఆతడు ప్రాగ్జ్యోతిషాధీశుడు అనగా మాయావృతజీవుడు అనే అర్థం నరకాసురుడు ప్రాగ్జ్యోతిషాధిపతి అన్న వాక్యానికి అంతరార్థం. ఇంద్రుడు అంటే మనస్సు అని లోగడ ఎన్నోసార్లు వ్యుత్పత్తి ప్రదర్శనంలో అర్థం చెప్పుకొనే వున్నాం. మనస్సు మాయచేత త్రిప్పబడుతుంది. అదే ఇంద్రుడు నరకాసురుడి వల్ల బాధలు పొందడమంటే.

ఇంద్రుడు నరకాసురుని బాధలకు తాళలేక కృష్ణుణ్ణి వేడుకొన్నాడు అంటే మనస్సు మాయకు తాళలేక నిర్వృతి తత్త్వాన్ని ఆశ్రయించిందన్నమాట. 'నిర్వృతి' అంటే విషయావరణం లేని మనోవృత్తి. దాన్ని చేరితే భౌమాసురుడి చేష్టలు అంటే భూసంబంధమైన కాంక్షలు పటాపంచలు కావలసిందే...గరుత్మంతుడంటే వేదం అని అర్థం. సత్యభామ అంటే సత్యస్వరూపుడైన పరమాత్మకు సంబంధించిన జ్ఞాన ప్రకాశసంపద అని అర్థం.

కృష్ణుడు సత్యభామతో గరుత్మంతుడి మీద ఎక్కి ప్రాగ్జ్యోతిషపురాన్ని భేదించడానికి వెళ్ళాడు అంటే నిర్వృతి తత్త్వం సత్యస్వరూపమైన జ్ఞానకాంతి

సంపదతో వేదమార్గంతో మాయను భేడించడానికి వెళ్ళింది అని అర్థం. అనగా సాధకుడు మాయను వేదచోదితమైన బ్రహ్మస్వరూపంతో కలిసిన నిర్వృతి తత్త్వాన్ని సాధించి తనలోని అజ్ఞాన నాశనానికి ఉపక్రమించాలి అన్న సాధనా రహస్యం పై కథాభాగానికి అంతకూ సారాంశమైన అంతరార్థంగా గ్రహించాలి.

ప్రాగ్జ్యోతిషపురం జలాదులగు ఐదు దుర్గాల మధ్య నిర్మింపబడింది అంటే పంచభూతాల తత్త్వాలతో అజ్ఞానం బంధింపబడింది అని అర్థం. అందు 'ముర'డు అనే అసురుడు దుర్గాధిపతి. 'ముర' గంధే, వ్యాప్తౌచ' అనే ధాతువు వుంది. మురతి ఇతి మురః అనగా వ్యాపించునది వాసన కలది అనే అర్థాలు వస్తాయి. అనగా జనన మరణాల్ని వ్యాపింపజేసే వాసనలు ముర పదానికి అర్థంగా గ్రహించాలి. మురుడు పంచముఖాలతో జలం * ఉన్నాడులో జలం అన్నది జడం అవుతుంది. అప్పుడదిమాయ అన్నదానికి సంకేతం. పంచేంద్రియాలు పంచముఖాలు. మాయ పంచేంద్రియాల వాసనలతో నిర్వృతి తత్త్వం మీద లంఘించడమే జలం నుండి పంగముఖుడగు మురుడు కృష్ణుని మీద పడడం అంటే. గరుత్మంతుడంటే వేదః ('ఛందోగరుత్మాన్' అని వుంది) వేదం అంటే జ్ఞానమార్గం చెప్పేది. సత్యభామ అంటే పరతత్త్వం, కృష్ణుడంటే నిర్వృతి. సాధకునిలోని జ్ఞాన పరతత్త్వమైన నిర్వృతి పరబ్రహ్మ సాక్షాత్కారంలో సాధకునిలోని ఐహిక విషయాలను రెచ్చగొట్టే పంచేంద్రియ వాసనా ప్రాబల్యం, పంచభూతతత్త్వాల ప్రాబల్యం నాశం పొందింది అనడమే కృష్ణుడు గరుడినిలో సత్యభామతో వచ్చి మురాసురుడిని, వాని దుర్గాన్ని నాశం చేశాడన్న దాని అంతరార్థం.

మురాసురుడి నాశంతో భౌమాసురుడి బలం తగ్గింది. అప్పుడే కృష్ణ డాతణ్ణి చంపేసేడు. అంటే పంచఇంద్రియ, పంచభూత, వాసనా ప్రాబల్యనాశనంతోనే ఐహిక సుఖరూప మాయావరణం నిర్వృతి తత్త్వంలో విలీనమౌతుంది అనే సాధనా రహస్యం నరకాసురవధలో అంతరార్థపరంగా గ్రహించాలి.

తర్వాత నరకాసురుడు చెరబెట్టిన 16100 మంది కన్యలను కృష్ణుడు విడిపించేడు. వారు కృష్ణుణ్ణి ప్రేమించేరు. కృష్ణుడు వారిని వివాహం చేసికొన్నాడు.

16100 రాజకన్యలు అనగా ముకుళ మొగ్గ ప్రాయంలో వున్న సుఖదుఃఖ వృత్తుల బీజాల రూపాలన్న మాట. అవి వాసనల అధీనంలోకి వస్తేనే సుఖదుఃఖాల్ని

---

* 'లద యోర భేదః'

ఇవ్వగల్గుతాయి. ప్రతి జీవిలోను 16100 నాడీరూప కళలు అనగా సుఖదుఃఖ బీజాల రూపాలై వుంటాయి. 'కళాషోడశ సాహస్రం నాడీషు వడి దృశ్యతే' అని సోపాధిక బ్రహ్మ విద్యాదర్పణంలో చెప్పబడింది కాన ఏకోత్తర శతషోడశ కన్యలనే దానికి ఆధ్యాత్మికంగా సుఖదుఃఖ నాడీకళా బీజ వృత్తులని అంతరార్థం చెప్పుకోవాలి. ఆ పదహారువేల ఒకవంద వృత్తుల్ని నిర్వృతి తత్త్వాన్ని ప్రేమించేటట్లుచేసి అందులో లీనం అయేటట్లు సాధకుడు చూసుకోవాలి. అన్నదే ఏకోత్తర శతషోడశ సహస్ర భార్యా పరిగ్రహణానికి అంతరార్థం.

యుద్ధమైన తర్వాత వచ్చేటప్పుడు కృష్ణుడు ఇంద్రుని ఉద్యానంలోని పారిజాత వృక్షాన్ని వ్రేళ్ళతో ఊడదీసి సత్యభామ పెరటిలో పాతివేసేడు.

ఇంద్రుడంటే సాధకునిలోని మనస్సు. ఆతని ఉద్యానం అంటే; ఉత్+యానం =ఉద్యానం అవుతుంది. ఉత్=ఉన్నత స్థితిని గూర్చిన అనగా ముక్తిని గూర్చిన, యానం=ప్రయాణం అని అర్థంలో ఇంద్రుని ఉద్యానం అంటే సాధకునిలోని ముక్తిని గూర్చిన ప్రయాణం అని అంతరార్థం చెప్పుకోవాలి. 'పారిజాతం' పరితః+ జాతం=పారిజాతం, అంతట పుట్టి ఉన్నది అనే వ్యుత్పత్త్యర్థంలో 'మాయ' అనే అంతరార్థం పారిజాతానికి అంతరార్థంగా చెప్పుకోవాలి. ఇంద్రుని ఉద్యానంలోని పారిజాతాన్ని అనగా సాధకుని మనస్సులో అంతట ఆవరించివున్న అజ్ఞానాన్ని, కృష్ణుడు అంటే నిర్వృతి తత్త్వం, వ్రేళ్ళతో పెకలించింది. సత్యభామ పెరటిలో పాతేసింది అంటే సత్యప్రకాశ రూప జ్ఞానంలో ఆ మాయను లీనం చేసింది అని అర్థం. సాధకుని మనసులోని అజ్ఞానం జ్ఞానానంద జ్యోతిలో లీనం కావడం నిర్వృతి తత్త్వంతోనే జరుగుతుంది అనే సాధనా రహస్యం ఇందులో మనం గ్రహించాలి.

"అప్పటినుండి భ్రమరాలు సత్యభామ పెరటిలో ఝుంకారాలు చేసికొంటూ వుండిపోయేయి." భ్రమ+ర=భ్రమను పొందేది అనే వ్యుత్పత్తిలో భ్రమరాలు అంటే మాయను కల్గించే మనోవృత్తులు అన్నమాట. అవి సాధకునిలో అజ్ఞాన రూపమాయ నుండి మరలి సత్య జ్ఞానానందరూప పరంజ్యోతి చుట్టు ధ్వనిస్తూ అక్కడే ఉండి పోయేయి. అనగా సాధకునిలోని విభ్రమం కల్గించే మనోవృత్తులు ఫలితం లేని ఆక్రోశాలతో వుండిపోతాయి. అనేది పారిజాతా వృక్షాపహరణకి కథా ప్రయోజనంగా అంతరార్థం గ్రహించాలి.

# రుక్మిణిపై కృష్ణుని ప్రణయ కోపం

## (ప్రలోభ సంతారణ సాధన)

ఒకనాడు రుక్మిణీదేవి శయ్యా గృహంలో కృష్ణుడు పరుండియున్నాడు. రుక్మిణీ కాళ్ళవైపున నిలబడి విసనకర్రతో విసరుతూంది. శయ్యా గృహం చక్కగా అలంకృతమై వుంది. నానా విధ పరిమళ ధూపాలతో వ్యాప్తమై వుంది. మంచము పందిరికి కట్టిన మల్లికల మాలలపైని భ్రమరములు మూగుచున్నవి. పారిజాతవనం నుండి వాయువులు ఘుమ ఘుమ వీస్తున్నాయి. ఆ సమయంలో కృష్ణుడు రుక్మిణివైపు చూస్తూ చిరునవ్వుతో ఇల్లాగు అన్నాడు.

"రాజపుత్రీ ! మహావైభవంగల మహారాజులు నీ కాళ్ళముందుకు వచ్చినా, నీవు వారి నందర్నీ కాదని నన్ను కోరడంలో ఏ పమే చేశావు నేను ఏమీ లేనివాడిని. ఏమీ లేనివారి కిష్టుడను. అట్టి నా వల్ల నీకేం సుఖం ? నీవు పొరబడ్డావేమో ? ఆలోచించు కొని ఇప్పుడైనా సరే నీవు నీ మనసు నచ్చిన చోటుకు నీవు పోవచ్చు ఒకదారి ఒక విధం అంటూ లేని గుణహీనులగు వారిని పొంది స్త్రీలు దుఃఖపడతారు గాని సుఖ పడరు గదా ! నాకు అసలు దారేషణ, పుత్రేషణ, ధనేషణ అనేవి లేనే లేవు కదా ! నాతో నీకేం కులుకు తీరుతుంది ?"

ఆ మాటలు విన్న రుక్మిణీ చేతి నుండి విసనకర్ర జారిపోయింది. గాలిలేక ఎక్కడి వాసన అక్కడే వుండి పోయేయి. మాట, చేష్ట కూడ స్తంభించి మ్రాన్పడి పోయింది రుక్మిణి. చూపు మాత్రం కృష్ణుని పాదాల మీదనే దైన్యంగా ప్రాలింది. కాటుక కన్నుల నుండి నల్లని ధార, కుచ కుంకుమారణ్యంతో కలిసి భూమి మీద పడుతోంది. అంతేకాని సమాధానం మాత్రం లేదు. కృష్ణుడు రుక్మిణిని చూసేడు. ఒక్కసారి పడక మీదికి లాక్కొని గట్టిగా గుండెకు అదుముకొన్నాడు కాటుక కన్నుల నీరు స్తనముల పైని కుంకుమ రేఖలతో కలిసినదై ఎర్రనైన నీటిని తుడిచి వేసినాడు. ముఖమెత్తి అలకలు దిద్ది అధరాన్ని ముద్దాడి "ఊరకే పరిహాసానికి నీవేమంటావో వినాలని అన్నాను గానీ నీ హృదయం నాకు తెలియదా ?" అంటూ ఓదార్చినాడు.

రుక్మిణిదేవి శయ్యాగృహంలో రుక్మిణి విసనకర్రతో వీస్తూండగా, కృష్ణుడున్నాడు-అంటే

'రుక్మి' అంటే ప్రకృతియనీ, 'రుక్మిణి' అంటే ప్రకృతిచే పొందింపబడినది అనీ అనగా అది ప్రవృత్తి తత్త్వానికి సంబంధించింది అనీ వ్యుత్పత్తిపరంగా లోగడనే అర్థం చెప్పుకొన్నాం. కృష్ణుడంటే నిర్వృతి తత్త్వం గదా! ప్రవృత్తి తత్త్వంలో లోపల నిర్వృతి తత్త్వం నిగూఢంగా కలిసి ఉండడమే కృష్ణుడు రుక్మిణీ శయ్యాగృహంలో ఉన్నాడన్న దానిలోని అర్థం. అప్పుడు మల్లికల వాసనలకు భ్రమ రాలు మూగేయి మత్+లిక అన్న వ్యుత్పత్తిలో మల్లిక పదానికి అహంకార మమ కారాలు అర్థం అని లోగడ చెప్పుకొన్నాం. భ్రమరం అంటే భ్రమ+ర అన్న వ్యుత్పత్తిలో మాయా ప్రవృత్తులచే అర్థం కూడ చెప్పుకొన్నాం.

పారిజాతం అంటే అంతటా వ్యాపించిన మాయ అని కూడ చెప్పుకొని వున్నాం. అగరు ధూప వాసనలు అంటే జనన మరణ పరిభ్రమణం ఇచ్చే కర్మ వాసనలు అని కూడ చెప్పుకొన్నాం. సాధకునిలోని ఈ అహంకార మమకార వృత్తులూ, మాయావరణమూ, జన్మ కారణ వాసనలూ సాధకునిలో అంతర్గతంగా నిర్వృతి తత్త్వం వున్నా సరే, ప్రకృతి ప్రేరేపణతో అటునుండి ఇటూ, ఇటు నుండి అటూ వ్యాపిస్తూన్నాయి అన్నది రుక్మిణి విసనకర్రతో వీస్తూండగా సకల శృంగారో ద్దీపక వస్తు సముదాయంలో కృష్ణుడు శయ్యాగృహంలో ఉన్నాడన్న దానికి అంత రార్థంగా గ్రహించాలి.

అప్పుడు కృష్ణుడు రుక్మిణితో "నీవు నన్ను కోరడంలో పొరపాటు పడ్డావు. నీవు నీ మనసు వచ్చిన వారితో ఇప్పుడైనా సరే వెళ్ళవచ్చు" అని అన్నదానికి సాధకునిలో నిర్వృతి తత్త్వం ఎంత గాఢంగా ఉందో తెలిసికోవడానికై పరమాత్మ, సాధకునికి ప్రవృత్తి సుఖాల్ని చూసి ప్రలోభం కల్గించే పరీక్షించడంగా పై కృష్ణ వాక్యాలకు అంతరార్థం చెప్పుకోవాలి. రుక్మిణి కృష్ణ పాదాల కేసి చూస్తూ, మ్రాన్పడి, కాటుక నీరుతో స్తన కుంకుమాన్ని స్రవింపజేసింది అంటే సాధకునిలోని పర మాత్మను సమీపించియున్న ప్రకృతి తనలోని తమోగుణాన్ని, రజోగుణాన్ని కడిగి వేసి నిశ్చల తత్త్వంతో నిర్వృతి తత్త్వస్థానం మీదనే మనసు కేంద్రీకరించింది అని దానికి అంతరార్థం చెప్పుకోవాలి.

కృష్ణుడు రుక్మిణి యొక్క కాటుక నలుపు నీటిని స్తనముల కుంకుమ తాలూకు ఎరుపు కలిసిన నీటిని తుడిచివేశాడంటే ద్రవించిన సాధకునిలోని ద్వంద్వములలోని

రజస్తమోగుణాల్ని సాధకుని నిర్వృతి తత్త్వం పూర్తిగా నాశం చేసిందని అర్థం. స్తనములు ద్వంద్వ గుణాలకు సంకేతంగా చెప్పుకొని వున్నాం. నలుపు ఎరుపు రంగులు తమోగుణ రజోగుణాల్ని చెప్తాయి. కృష్ణుడు రుక్మిణి యొక్క అధరం ముద్దాడే, ఆలింగనం చేసికొని, రొమ్మున కద్దుకొన్నాడంటే, సాధకునిలోని నిర్వృతి తత్త్వం సాధకునిలోని ఐహిక విషయరాహిత్యాన్ని గ్రహించడంగా కైవల్యాన్ని ప్రసాదించడంగా అర్థం చేసికోవాలి. 'ధర' అంటే భూమి, న+ధర=అధర అవుతుంది. అపుడు అధరం అంటే (భూసంబంధంలేని) విషయరాహిత్య వృత్తి అనే అంతరార్థం వస్తుంది. హృదయం పరమాత్మకు స్థానం హృదయాన్ని అద్దుకోవడం అనేది పర మాత్మలో ఐక్యం చేసికోవడం అనే అంతరార్థాన్ని చెప్తుంది.

సాధకునికి కైవల్యం ప్రాప్తించే తుది సాధనలో ప్రవృత్తి తత్త్వం ఒక్కసారిగా తలెత్తి సాధకుణ్ణి ప్రలోభం పెట్టుతుంది. ఇన్నాళ్ళు సాధన చేసిన విషయ రాహిత్య సాధనలో ఏమీ ఆనందం దొరకకపోవటంలో సాధకుడు విసిగి తన చుట్టూ తన అనుభవానికి వేచివున్న సుఖాలవైపు, ఐశ్వర్యాలవైపు మ్రొగ్గిపోతూండడం చాల మంది సాధకులలో జరిగేదే. మొదట్లో ఉన్న విరక్తి భావం చివరిదాకా నిలువక పోవడం వల్ల ఆవరించివున్న సుఖాలవైపు మనసు మళ్ళి సాధన భ్రష్టత కల్గడం జరుగుతుందని గ్రహించాలి. ఇది సాధన పూర్ణత్వం పొందే తుది సమయంలో కల్గే విఘ్నాల్ని సాధకుడు తట్టుకోలేక భ్రష్టత్వం పొందడంగా అనే సాధనా నాశ విఘ్నంగా భావించాలి.

ఈ విధంగా రుక్మిణిపై చూపిన కృష్ణ ప్రణయ కోపం సాధనా మధ్యలో ప్రలోభ నిరూపణంగా సాధకులు గ్రహించి అప్రమత్తులుగా ఉండాలి. ఇది సాధనలో చివరి స్థాయికి చేరిన వారికి చేసే హెచ్చరికగా వ్యాస భగవానుడు చెప్పినట్లు కన్పి స్తుంది. లేకపోతే రుక్మిణీ కృష్ణుల శృంగార శయ్యాగృహ వృత్తాంతం వ్యాసుడు విన్నాడా ? కన్నాడా ? ఏం ప్రయోజనం సాధించాలని దాన్ని భాగవతంలో లోకానికి తెలియాలని ఇరికించేడు ? ఇదంతా అంతరార్థపరంగా అన్వయించుకోక తప్పదు. అలా అన్వయించుకొన్నప్పుడు దీనిలో సాధకుల కెంతో అవసరమైన ప్రలోభ సంతారక రహస్యం దొరుకుతుంది

# నృగ మహారాజు చరిత్ర

## ( ఏకైక ముక్తి సాధనావశ్యకతా సాధన )

నృగుడనే రాజు బ్రాహ్మణులకు ఎన్నో గోదానాలు చేసేడు. ఒకసారి అతడు కశ్యపుడనే బ్రాహ్మణునకు దానం చేసిన గోవు తిరిగివచ్చి ఆయన మందలో కలిసి పోయింది. దానిని రాజు మఱొక బ్రాహ్మణునకు దానంగా ఇచ్చేడు.

ఆ బ్రాహ్మణుడు దానిని తోలుకొని పోతూండగా కశ్యపుడు చూచి రాజుకు ఫిర్యాదు చేశాడు. గోవు నాదంటే నాదని ఇరువురూ రాజు వద్ద కలహం నడిపేరు. ఆ గోవుకు బదులు ఎన్ని గోవులు పరిహారంగా ఇస్తానని రాజు బ్రతిమాలినా ఇద్దఱూ కూడ వినలేదు.

తాను మొదట ఇచ్చిన బ్రాహ్మణ గోవును తాను తనదిగా తిరిగి స్వీకరించిన పాపానికి నృగునకు కృకలాస (ఊసరవెల్లి) జన్మ వచ్చింది. మిక్కిలి పెద్దదైన తనువు గల ఊసరవెల్లి జన్మతో కృష్ణుని ఉద్యానవనంలోని ఒక పాడు కూపంలో (నూతిలో) నృగుడుండగా సాంబాదులగు కృష్ణానుచరులు దానిని చూచి పైకి తీయుటకు ఎంతెంతో ప్రయత్నించేరు. దాని బరువును తామందఱూ కలిసి కూడ సహించలేక ఆ సంగతి కృష్ణునికి చెప్పేరు. కృష్ణుడు వచ్చి దానిని ఎడమ చేతితో గడ్డిపరకలాగ పైకి తీసేడు. కృష్ణ స్పర్శతో ఊసరవెల్లి దివ్యదేహం పొంది తన కథ అంతా చెప్పి ముక్తి మార్గాన్ని చేరుకుంది.

ఏమిటీ కథ ? తనకు తెలియకుండా తిరిగి తనకు చేరిన గోవును తిరిగి మఱొక నికి దానం ఇవ్వటం వల్ల పాపం చుట్టుకొన్నదా ? ఏదైనా తెలిసి చేస్తేనే పాపంగాని తెలియక జరిగిన పనికి పాపం రావడం ఏమిటి ? పుణ్యం పాపం అనేవి భావాలు. అవి మనసునకు అంటేవి కదా ! తెలియక చేసినవి మనసుకు ఎట్లాగు అంటుతాయి ?

ఇక్కడ నృగునకు ఊసరవెల్లి జన్మ రావడం అతను చేసిన పనికి దేవుడు వేసిన శిక్ష అనవచ్చునా ? దేవుని శిక్ష అంత అవివేకంగా ఉంటుందా ? మఱి సాంబాదులు ఎంతోమందికలిసి లాగినా కృకలాసం కించిత్తుకూడ కదలలేదేమి? కారణం? అట్టి దాన్ని కృష్ణుడు ఎడంచేత్తో గడ్డి పరకలాగ లాగివెయ్యగల్గడం ఏమిటి ? కృష్ణ స్పర్శ తగలడంతో నృగుడు ముక్తుడవడం ఏమిటి ? కృష్ణుడు భగవదవతారం అయితే మాత్రం నృగుడు చేసిన పాపాన్ని పోగొట్టవలసిన అవసరం కారణం కృష్ణుడికి ఏల వచ్చింది ? ఎవరి పాపాన్ని వారు అనుభవించవలసిందే కదా ! ఒకరి పాపాన్ని

ఒకరు విముక్తి చెయ్యడంలో కారణం ఉండనక్కర్లేదా? ఇదంతా బాహ్యార్థంలో కథలో అసందర్భంగా కనిపిస్తూంది ఇందులో అంతరార్థం ఏదో ఉండాలనిపిస్తూంది. కాన దానిని వివరిస్తాను.

'నృగ' అంటే నృ=నరజన్మను, గ=పొందినవాడు సాధకుడైన జీవుడు అని అర్థం. అనేక జన్మల నుండి ముక్తి కోసం యత్నిస్తూ చివరకు నరజన్మను పొందు వాడు సాధకుడు. అట్టి సాధకుడు నృగుడని పిలువబడ్డాడు.

ఆతడు బ్రాహ్మణులకు అనేక గోవుల్ని దానం చేసేడు. 'బ్రాహ్మ' అంటే బ్రహ్మ సంబంధమైన ముక్తి మార్గం అని అర్థం. నయతి ఇతి 'నః' అనగా పొందు చున్నది అనే అర్థాన్ని 'న' అనేది ఇస్తుంది. కాన బ్రాహ్మ నయతి ఇతి బ్రాహ్మణః అనే వ్యుత్పత్తిలో బ్రహ్మ పదార్థాన్ని చేరే మార్గం అనేది బ్రాహ్మణ పదానికి అర్థంగా చెప్పవచ్చు.

గోవు అంటే ఇంద్రియ వ్యాపారం అని అనేకసార్లు అర్థం చెప్పుకొనే ఉన్నాము. నృగుడు అనేక గోవుల్ని అనేక బ్రాహ్మణులకు దానం చేశాడు అంటే నరజన్మ పొందిన ముక్త సాధకుడు తన ఇంద్రియ వృత్తులతో ఎన్నిటినో ఎన్నోవిధాలైన ముక్తి మార్గాలలో సాధన సాగించేడు అని ఇక్కడ సాధనాపరంగా అంతరార్థం చెప్పుకోవాలి.

ఒకప్పుడు నృగుడు ఒక గోవుని కశ్యపుడనే బ్రాహ్మణునకు దానం చేసేడు. కశ్యపుడు అంటే పశ్యకః ఇతి కశ్యపః అని అక్షరాలు తలక్రిందు చేసి చెప్పే వ్యుత్పత్త్యర్థంలో భగవంతుని చూచే ముక్తి సాధన అనే అర్థం 'కశ్యప బ్రాహ్మణ' అన్న పదానికి అంతరార్థం చెప్పాలి. భగవద్దర్శనం చేయించే ఒక ముక్తి మార్గ సాధనను సాధకుడు తన ఇంద్రియ వ్యాపారంతో సాగించాడన్నది "కశ్యప బ్రాహ్మణునకు గోవును దానం ఇచ్చే"దన్న దానికి అంతరార్థపరంగా సులువుగానే చెప్పుకోవచ్చు.

కశ్యపుని తప్పించుకొని తర్వాత ఆ గోవురాజుకు తెలియకుండా రాజు యొక్క గోవుల మందలో చేరింది. అంటే ఆ సాధనకు తాను ఇష్టపడక ప్రవృత్తి పరమైన ఆ ఇంద్రియ వ్యాపారం తిరిగి సాధకుని ఇంద్రియ వృత్తులలోనికి చేరుకొన్నది అన్న మాట. అంటే కశ్యప బ్రాహ్మణ సాధనా మార్గం అంటే ముక్తి మార్గం తనకు నచ్చక సాధకుని ఇంద్రియ వృత్తి సాధకునికి తెలియని విధంగా వెనక్కి తిరిగి సాధకుని ప్రవృతి రూప మనోవృత్తులలో మిళితమైందన్న మాట. ఈ విధంగా

సాధకుడు తాను ప్రవృత్తి పరమైన ఇంద్రియ వృత్తులలో చేసే ముక్తి సాధన సాధకునికి తెలియకుండానే భ్రష్టస్థితి పొందడం జరిగి సాధనకు నష్టము కల్గు తూండడం అనేది తరచు సాధనలో జరుగుతూంటుంది అన్న సాధనా విఘ్న రహస్యాన్ని "కశ్యప బ్రాహ్మణున కిచ్చిన గోవు నృగ మహారాజు యొక్క మందలోకి తిరిగి చేరిందన్నది" అంతరార్థపరంగా స్పష్టపరుస్తూంది.

తర్వాత ఆ గోవును నృగుడు మరొక బ్రాహ్మణున కిచ్చేడు అంటే కశ్యప సాధనా భ్రష్టమైన ఆ మనోవృత్తిని అదే కశ్యప సాధనలో తిరిగి ప్రవేశ పెట్టక మరొక విధమైన ముక్తి మార్గ సాధనలో సాధకుడు ప్రవేశ పెట్టే డన్నమాట. ఈ విధంగా ఒక రకమైన సాధనలో ప్రవేశ పెట్టిన మనోవృత్తి ఆ సాధకునికి తెలియకుండా దారి తప్పించుకొని భ్రష్టమైనప్పుడు సాధకుడు గుర్తించి ఆ మనోవృత్తిని తిరిగి ఆ మొదటి సాధనలోనే పూర్ణస్థితిని పొందేటట్లు బలవంతంగా ప్రవేశ పెట్టి సాధన నిర్విఘ్నంగా సాగించాలే కాని ఆ మొదటి సాధనను కాదని మరొక సాధనను చేపట్టడం, ఈ విధంగా సాధనల నుండి తిరిగి తిరిగి భ్రష్టమైన మనోవృత్తుల నను సరించి సాధనలను మాటి మాటికి మారుస్తూన్నంత కాలం సాధకునకు గమ్యం చేరు కోవడం అన్నది జరుగనే జరుగదు. ఎప్పుడూ మొదటి మెట్టు పైననే సాధన వుండి పోతూంటుంది. ఆ విధంగా తెలిసి చేసినా, తెలియక చేసినా ధ్యానమార్గాలను చీటికి మాటికి మార్చేపని ఎంతో దుష్ఫలితాల్నిస్తుందనక తప్పదు. అదే నృగునకు ఊసర వెల్లి జన్మ కల్గిందనడానికి కారణం. ఊసరవెల్లి తన శరీర కాంతుల్ని వాతావరణాను కూలంగా మాటి మాటికి మారుస్తూంటుంది. అంతలో నల్లగా, అంతలో ఆకుపచ్చగా ఎఱ్ఱగా, ఎన్నో కాంతుల్ని శరీరంలో ఊసరవెల్లి మారుస్తుంది. ఇది ఊసరవెల్లి యొక్క శరీర సహజ స్థితి.

ముక్తి కొఱకైన ధ్యాన సాధనలో చీటికి మాటికి మార్గాలు మారుస్తూండడం అన్నది ఊసరవెల్లి ఉపమానం వల్ల మనకు అంతరార్థం సులువుగా బోధపడుతుంది. అందుకే అట్లా కృకలాస జన్మ చెప్పబడింది.

సాంబాదులు ఎంత ప్రయత్నించినా అది కదలలేదు. "సాంబ" అనే పదానికి (స+అంబ) ప్రకృతితో కూడినట్టి మనోవృత్తి అనే అర్థం మనం చెప్పుకోవాలి. 'అంబ' అనే పదం ప్రకృతిని చెప్పే అర్థం కలది కాన సాంబాదులు అంటే ప్రవృత్తి పరమైన ప్రకృతికి సంబంధించిన అనగా విషయ సంబంధం కల వృత్తులు వాని ఉపవృత్తులు అని అంతరార్థం ఇచ్చట చెప్పుకోవాలి.

ప్రకృతికి సంబంధించిన విషయ ప్రవృత్తులు ఏవీ ఎన్ని కలిసినా ముక్తికి ఏ మాత్రమూ కూడ సహకారులు కావని ఇక్కడ సాంబాదులు అందఱూ కలిసినా ఊసరవెల్లిని కదుపనే లేక పోయారన్న దాని అంతరార్థం.

కృష్ణుడు వచ్చి ఎడమ చేతితో గడ్డిపరక వలె ఊసరవెల్లిని పైకి తీయడం ఆ ఊసరవెల్లి దివ్యత్వం పొంది ముక్తిని పొందడం జరిగింది. అంటే 'కృష్ణ పదానికి'—

శ్లో॥ "కృషిర్భూ వాచక శ్శబ్దః
ణశ్చ నిర్వృతి వాచకః
తయోరైక్యం పరం బ్రహ్మ
'కృష్ణ' ఇత్యభిధీయతే"

అన్న సోపాధిక బ్రహ్మ విద్యా దర్పణ గ్రంథంలోని నిర్వచించిన ప్రకారం మనం, 'భూ విషయిక నిర్వృతి తత్త్వం' అనే అర్థాన్ని మొదట నుండి చెప్పుకొని వస్తూనే ఉన్నాం. కృష్ణుడు అనగా సాధకునిలోని భూ విషయక నిర్వృతి తత్త్వం. ఆ తత్త్వం సోకిన వెంటనే ఇంతకు పూర్వం సాధనలో అంటియున్న ముక్తి మార్గ వైవిధ్యాసక్తి సడలిపోయి ఒకే ఒక నిర్వృతితత్త్వ సాధన మీద మాత్రమే సాధన సాగింపబడి ముక్తి మార్గం ఫలితాన్ని పొందగల్గిందని పై వాక్యాలకు అంతరార్థం చెప్పుకోవాలి.

ఈ విధంగా మాటి మాటికి ధ్యాన వ్యాపారాన్ని అనేక సాధనల వైపు మారుస్తూ ఉండకూడదని, ఏ సాధనను సాగించినా సరే విషయ నిర్వృతి తత్త్వాన్ని ముందుంచుకొని సాగించాలనీ, లేకపోతే సాధకులు ఎన్ని జన్మలకు కూడ సాధనలో ముక్తిని పొంది తరించలేరని ముఖ్యమైన నిర్వృతి సాధనా రహస్యాన్ని ఈ నృగోద్ధరణో పాఖ్యానం మనకు చెప్తూంది. ఇంకా, సాధనలో మనోవృత్తులు సాధకునకు తెలియకుండా భ్రష్టత పొందుతూంటాయని వానిని గుర్తించి ప్రారంభించిన సాధనలోనికి వానిని తిరిగి తిరిగి ప్రవేశపెట్టుతూ సాధకుడు సాధనా గమ్యస్థితిని పొందాలని కూడ ఈ కథ చెప్తూంది.

నర జన్మలోనే ముక్తిని సాధించాలనీ, సాధనలలో "కశ్యప" సాధనతో అనగా బ్రహ్మావలోకన ధ్యానంలో అఖండ మనోవృత్తిని నిలపాలనీ, ధ్యానంలో మనోవృత్తి లక్ష్యము నుండి తప్పిపోయి ప్రవృత్తి మార్గంలో పడి సాధనను భ్రష్టం చేసే అవకాశం ఏర్పడగలదనీ, అప్పుడు సాధకుడు తనలోని విషయ నిర్వృతి తత్త్వంతో (కృష్ణ తత్త్వంతో) సాధన సాగించాలనీ, అలా చేస్తే మనోవృత్తి లక్ష్యము నుండి

తప్పిపోవడం అనేది జరుగదనీ, సాధన ఫలించి ముక్తి సిద్ధిస్తుందనీ ఈ నృగోద్ధరణ కథా సారాంశంగా అంతరార్థం మనకు విశదపరుస్తూంది. కాన ఇది అన్ని కథల కన్నా సాధకులకు చాల ప్రధానమైనదిగా పాఠకులు భావించాలి.

# శి శు పా ల వ ధ

## (అజ్ఞాన నాశన సాధన)

"ధర్మరాజు రాజసూయ యజ్ఞంలో సభాసదులలో నందఱకన్న శ్రేష్ఠునిగా కృష్ణుణ్ణి నిర్ణయించి, కృష్ణునకు అగ్రపూజ చేసేడు. అదిచూచి కృష్ణుని మేనబావ శిశుపాలుడు సహింపక అట్లా చెయ్యడానికి వీల్లేదని ఎదుర్కొన్నాడు. "కృష్ణుని కన్న ఎన్నోరెట్లు శ్రేష్ఠులుండగా, గోపాలుణ్ణి అగ్రపూజ చేయడం తగదు తగద"ని ఆక్షేపించేడు. కృష్ణుడు శిశుపాలుని తలను సుదర్శన చక్రంతో ఖండించేడు. వెంటనే శిశుపాలుని దేహాన్నుండి తేజస్సు ఒకటి బయటకు వచ్చి కృష్ణుణిలో కలిసిపోయింది. తర్వాత దంతవక్త్రుడు అనువాడు కృష్ణునెదిర్చి సుదర్శనంతో వధింపబడ్డాడు. ఈ కథ విన్నవారు సర్వపాప విముక్తులౌతారు అను ఫలశ్రుతితో శిశుపాలవధ కథ పూర్తిచేయబడింది."

ఈ కథలో 'ధర్మరాజు' అంటే వేద ప్రతిపాదితమైన ధర్మంచేత ప్రకాశించే సాధకుడు అని అర్థం చెప్పాలి. ఆతడు యజ్ఞం చేస్తున్నాడు. యత్+జ్ఞ=యజ్ఞ అవుతుంది. యత్=ఏదో అనగా అనిర్వాచ్య పరమాత్మ యేదో, జ్ఞ=తెలిసికొనే యత్నం అన్నది యజ్ఞ పదానికి అర్థంగా చెప్పాలి. అది వేదములతో జరిపేది. సాధకుడు వేద ధర్మ మార్గంలో పరమాత్మాన్వేషణా సాధన చేస్తున్నాడన్నది ధర్మరాజు యజ్ఞం చేస్తున్నాడన్నదాని అంతరార్థం. అగ్రపూజ 'అగ్ర' అంటే మొదలు, చివర అని, రెండు అర్థాలు. దానికి ఉన్న కారణంచేత ఆద్యంతాలు రెండూ తానైయున్న పరమాత్మ అని అగ్ర పదానికి అర్థం చెప్పుకోవచ్చు. ఈ విధంగా అగ్రపూజ అంటే ఆద్యంతాలు తానే యైన పరమాత్మకు జరిగించే పూజ అన్నమాట.

సాధకునిచేత ఆ అగ్రపూజ కృష్ణుడికి జరిపించబడాలి. కృష్ణ పదానికి నిర్వృతిత్వం (భూసంబంధమైన వాంఛలచే ఆవరింపబడని తత్త్వం) అని లోగడ వ్యుత్పత్త్యర్థ పూర్వకంగా అర్థంచెప్పుకొన్నాం. దేనిచేతనైన ఆవరింపబడని తత్త్వమూ, ఆద్యంతాలు తానైయున్న తత్త్వమూ ఒకటే కాన కృష్ణపూజ, అగ్రపూజయే అవుతుంది.

అది ధర్మరాజుచేత జరుపబడింది. అందరూ బ్రహ్మాది దేవతలూ, నారదాది మునులూ ఆ అగ్రపూజను అభినందించేరు. వారంతా ఏదో కొంత కోరికల ఆవరణం కలవారే అనగా వారు ప్రవృత్తి తత్త్వం లోపలివారే. నిర్వృతి తత్త్వం సాధించిన వారు వారెవ్వరూ కారు కాన వారెవ్వరూ అగ్రపూజకు తగినవారు కాకపోవడాన్ని అందఱు నిశ్చయించి నిర్వృతి తత్త్వం మాత్రమే పరమాత్మ తత్త్వంగా భావించేరన్న అంతరార్థం బ్రహ్మాదులు కృష్ణపూజకు అభినందించేరన్న దానికి అంతరార్థపరంగా చెప్పాలి.

ఒక్క శిశుపాలుడు మాత్రం కృష్ణుడికి అగ్రపూజ జరపడాన్ని ఇష్టపడక కృష్ణుడిపైని విరుచుకుపడ్డాడు. శిశుపాలుడు కృష్ణునకు మేనత్తకొడుకు బావ అంటే కృష్ణునితో నిత్యం బంధు సంబంధం కలవాడు.

శిశుపాలుడంటే, వ్యుత్పత్త్యర్థం ప్రకారం శిశువులు పాలించేది. లేక శిశువులచే పాలింపబడేది అనగా "అన్నీ తమకే కావాల"నే తీవ్ర విషయ వాంఛరూప ప్రవృత్తి తత్త్వం అని అంతరార్థం చెప్పాలి. శిశుపాలుడు కృష్ణుడికి బంధువు మేనత్తకొడుకౌతాడు. కాని, శత్రువు కృష్ణుడంటే ఎంతమాత్రం సహింపులేక శత్రుత్వంతో వుండేవాడు. ఆ కారణంచేత జ్ఞాన స్వరూపమైన నిర్వృతి తత్త్వాన్ని నిత్యమూ ఆవరించియే వుంటూ ఆ తత్త్వాన్ని ఎదుర్కొంటూ నిత్యసంఘర్షణంతో శత్రుత్వం సాధించే అజ్ఞాన రూప ప్రవృత్తి తత్త్వంగా శిశుపాలుణ్ని అంతరార్థపరంగా చెప్పుకోవచ్చు. ఆద్యంతాలు కలది ప్రవృత్తి తత్త్వం. ఆద్యంతాలు లేనిది నివృత్తితత్త్వం. రెండూ ఒకే మనసులోనివేయైనా విరుద్ధతత్త్వాలు ఒకదాన్ని మఱొకటి ఇష్టపడక సంఘర్షణతో వుంటాయి. ఈ విధంగా శిశుపాల కృష్ణులు ఇరువురూ దగ్గఱి బంధువులే అయినా, విరోధులు అన్న దానికి అంతరార్థం ప్రవృత్తి తత్త్వం నివృత్తి తత్త్వాన్ని వ్యాప్తి నందనీయక ఎప్పుడు ఎదురుదెబ్బ తీస్తూనే వుంటుంది. అదే శిశుపాలుడు కృష్ణునకు అగ్రపూజ కిష్టపడక ఎదిరించడంలోని అంతరార్థం.

"కృష్ణుడు సుదర్శన చక్రంతో శిశుపాలుడి తల తెగవేసేడు." సుదర్శనం అంటే సుసుగతిని అనగా ముక్తినిగూర్చిన దర్శనం అనగా జ్ఞానం అని వ్యుత్పత్తి లోగడ చెప్పుకొనే వున్నాం. ఒక్కొక్కసారి సాధకునిలోని అజ్ఞానం పెచ్చుపెరిగినపుడు సాధకునిలోని సమ్యగ్దర్శనం అంతలోనే ఆవిర్భవించి ఆ అజ్ఞానాన్ని సంపూర్ణంగా తనలోలీనం చేసివేసికొంటుంది. ఇది సాధనలో పూర్ణస్థితిని పొందిన సాధకునిలో మాత్రం జరుగుతుందని గ్రహించాలి.

సుదర్శనంవల్ల శిశుపాలుని తల తెగడంతోనే ఆతని దేహంనుండి దివ్యజ్యోతి ఒకటి లేచి కృష్ణునిలో ఐక్యమైనది అంటే సాధకునిలోని అజ్ఞానం ముక్తి జ్ఞాన దర్శనంతో, సాధకునిలో ఆవిర్భవించిన నిర్వృతి పూర్ణజ్ఞాన స్థితిలో లీనమై పోయిందన్న మాట. అంటే సాధకుడు కైవల్యాన్ని పొందేడన్న మాట. దంతవక్త్రుడుకూడ శిశుపాలుని అనుసరించి కృష్ణునిలో ఐక్యమైపోయేడు. దంతవక్త్రుడు అంటే దంతములు నోటియందు కలవాడు అని వ్యుత్పత్తి చెప్తే నోటిలో దంతాలు వచ్చే వయస్సుగల శిశువు వంటివాడు. అనగా అజ్ఞాని అనియే అంతరార్ధపరంగా అర్ధం చెప్పవచ్చు. ఈ విధంగా శిశుపాల దంతవక్త్రులు అన్నదమ్ములుగా విషయాలయందు ప్రవృత్తి తత్త్వం కల అజ్ఞాన ద్వంద్వ ప్రవృత్తులుగా చెప్పుకోవాలి. ఈ రెండు ద్వంద్వ ప్రవృత్తి తత్త్వాలు నివృత్తి తత్త్వాన్ని ఎదిర్చి నిలువలేవన్నదే శిశుపాల దంతవక్త్రుల కృష్ణునిచేత వధింపబడ్డారన్న దాని అంతరార్ధం.

ఈ కథలో సాధకుడు ధర్మమార్గంలో జీవితం నడుపుకుంటూ భగవదన్వేషణ సాగించాలనీ, ఆ అన్వేషణలో ఆద్యంతములులేని నిర్వృతి తత్త్వాన్ని గుర్తించి అదే భగవత్తత్త్వంగా మనసులో నిలుపుకొని సాధనతో ఆరాధించాలనీ, ఆ విధంగా ఆరాధిస్తూండగా అతనిలోని అపరాశక్తి ప్రోత్సాహంతో అజ్ఞాన ప్రవృత్తి ద్వంద్వతత్త్వాలు తలెత్తి నివృత్తి తత్త్వ సాధనచేయవద్దనీ, దానివల్ల సుఖం దొరకదనీ, ప్రవృత్తితత్త్వమే సర్వసుఖాల నిస్తుందనీ, సాధకుని నిర్వృతి తీవ్రసాధనను దిగజార్చడానికి ప్రయత్నిస్తాయనీ, అప్పుడు సాధకుడు చలించకుండా నిర్వృతి తత్త్వంలోనే నిశ్చలంగా ఉండాలనీ, అప్పుడు ఇక చేసేదిలేక సాధకునిలోని ప్రవృత్తి ద్వంద్వ తత్త్వాలు ముక్తిజ్ఞాన సాక్షాత్కారంతో నిర్వృతి తత్త్వంలో లీనమైపోతాయనీ, అదే సాయుజ్య ముక్తి లేక కైవల్యముక్తి అనీ సాధనా విధానాన్ని గుర్తించాలి. ఈ విధంగా జయ విజయులు అనే సాధకునిలోని ద్వంద్వ లక్షణాలు సత్త్వరజస్తమో గుణాలనే మూడు జన్మలలోను (హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా, రావణ కుంభ కర్ణులుగా, శిశుపాల దంతవక్త్రులుగా) భగవత్తత్త్వాన్ని సాధించి సాయుజ్యముక్తిని చేరుకొన్నాయనీ, సనక సనంద నాదుల శాపం ఈవిధంగా విముక్తి పొందిందనీ కథాంశాన్ని అంతరార్ధపరంగా ఇక్కడ గ్రహించాలి. ఈ అంతరార్ధం వల్లనే విన్నవారికి చదివినవారికి నివృత్తి తత్త్వం అంది పాప వాసనలు నశిస్తాయి. అంతేకాని బాహ్యార్ధంవల్లనైతే ఈ కథ వినడంవల్ల పాపాలు పోవడం జరగడం అసంభవం. కాన వ్యాసుడు ఈ కథ చదివిన పాపాలు పోతాయని ఫలశ్రుతి చెప్పడంలోనే పైని చెప్పిన అంతరార్ధం ఈ కథలో వుందన్న విషయం ధ్రువపడుతూంది.

# కుచేలోపాఖ్యానం

## (శిథిలీకృత వాసనా నాశన సాధన)

"కుచేలుడు కృష్ణుని బాల్యమిత్రుడు. అతనికి సుదాముడనీ, శ్రీసుదాముడనీ మరో రెండు పేర్లు కూడ వున్నాయి. అతని భార్యపేరు వామాక్షి. వామాక్షి వల్ల కుచేలుడు ఇరువై యైదుగురు బిడ్డల్ని కన్నాడు.

కుచేలుడు గర్భదరిద్రుడు. నిరంతరం భగవద్ధ్యానం తప్ప మరేమీ ఎఱుగడు. దారిద్ర్య బాధపడలేక వామాక్షి కుచేలుడిని అతని బాల్యమిత్రుడైన శ్రీ కృష్ణుని వద్దకు వెళ్ళి యాచించి ధనం తేవలసిందని ప్రాధేయపడింది. కృష్ణునికి కానుకగా సమర్పించడానికి నాల్గుగుప్పెళ్ళు అటుకులు విప్రుల్ని యాచించి తెచ్చి మూటకట్టి యిచ్చింది.

కుచేలుడు ద్వారకకు వెళ్ళేడు. కృష్ణుడల్లంత దూరాన్నుండియే కుచేలుణ్ని చూచి ఎదురేగి తోడి తెచ్చి తన శయ్యమీద కూర్చోపెట్టుకొన్నాడు. రుక్మిణీదేవి విసనకర్ర పట్టి వీస్తూంది. కృష్ణుడు కుశలప్రశ్నలుచేసి అతని వద్దనున్న మూట విప్పి చేరెడు అటుకులు తిన్నాడు. ఇంకా తినాలని అనుకుంటూంటే రుక్మిణి ఆపివేసింది.

తర్వాత కృష్ణుణ్ణి ధనం అడగకుండానే కుచేలుడు సెలవు తీసికొని ఇంటికి వచ్చేసేడు. అతని ఇల్లు అప్పుడు బంగారు మేడగా మారింది. సర్వసంపదలతో నిండి వుంది. ఆతనికి వామాక్షి స్వాగతం చెప్పింది.

కుచేలుడు అంత సంపద వచ్చినా వాటిని అంటి అంటకుండా జీవనానికి కావలసినంత మాత్రం ఉపయోగించుకొని అసంగయోగంతో అనుభవించి భగవద్ధ్యానాసక్తితోనే జీవించి ముక్తిని పొందేడు."

కుచేలుడికి ఇరువై యైదుగురు కొడుకులనడం, అతని భార్య వామాక్షియనే పేరు గలదనడం అంతరార్థాన్నిచ్చేవిగా వుండాలి అనక తప్పదు. కృష్ణుడు అటుకులు తింటే కుచేలుడికి అష్టైశ్వర్యాలు కలగడమేమిటి ? దీనికి కూడ అంతరార్థంలో తప్ప సమాధానం కన్పించదు శ్రీదాముడనీ, సుదాముడనీ కుచేలుడికి ఇంకో రెండు పేర్లు అదనంగా ఎందుకేర్పడినట్లు ? కుచేలుడు అనే ఆ పేరు ఉండడంలో అర్థం ఉందా ? వీటికన్నిటికీ అంతరార్థంలోనే సమాధానం దొరుకుతుంది.

కుచేలుడు అంటే కు+చేల, కు=చెడ్డదైన, చేల=బట్ట అనగా చినిగిపోయి, ప్రాతపడిపోయి, జీర్ణమైపోతున్న బట్ట అని దానికర్థం. ఘట్టుప్రభువు కుచేలోపాఖ్యా

నంలో "శతసహస్ర పరిచ్ఛేదు సంఘటిత జీర్ణ వస్త్రమాచ్ఛాదనముగ ధరించేవాడు కుచేలు"డని వర్ణించేడు. 'సులభముగ నిర్వదేవు రసుతులగనియె' అని కూడ ఆ కావ్యంలో చెప్పేడు.

వస్త్ర పర్యాయ పదాలన్నిటికి 'మాయ' అనేది అంతరార్థపరంగా మనం చెప్పుకొంటూనే వున్నాం. ఇప్పుడు కుచేలుడంటే చినిగిపోయిన, ప్రాతపడిపోయిన, జీర్ణావస్థలో నున్న మాయావరణం ఒకానొక కల సాధకుడు అని అంతరార్థ పరంగా మనం చెప్పుకోవచ్చు. సాధకునిలోని మాయకు సంబంధించినదైన జనన మరణ కారణములైన వాసనా బీజములు ప్రాతపడి, ముక్కలైపోయి శిథిలావస్థలో నున్నాయన్న అర్థం కుచేల పదంవల్ల వస్తూంది. ఆతనికి 'సుదాము'డనీ 'శ్రీదాము' డనే మఱో రెండు పేర్లు కూడ వున్నాయి. "దామము" అంటే పశువులను కట్టివేసే పాశం (పలుపుత్రాడు) అని అర్థం. అనగా కర్మపాశం అని ఇచ్చట 'దామ' పదానికి అర్థం. 'శ్రీ' అంటే, 'సంపద' అనీ, 'సు' అంటే, చక్కనైనది అనీ అర్థం. చక్కని సంపదల ననుభవింపజేసే ఒక కర్మ పాశంచేత కట్టబడినవాడు అని శ్రీదాముడు, సుదాముడు అనే పదాలకు రెంటికి కలిపి అర్థం. శిథిలావస్థలోనున్న వాసనా బీజాలుకల ఆ సాధకునిలో (కుచేలునిలో) ఎప్పుడో ఒకప్పుడు సిరిసంపత్తుల ననుభవించే శుభయోగానికి సంబంధించిన వాసనాబీజం కూడ వుండి అన్నదే కుచేలు నకు సుదాముడనీ శ్రీదాముడనీ మఱొక రెండు పేర్లు వున్నాయని చెప్పడంలోని అంత రార్థం. సాధకుడు ముక్తుడు కావడానికి వాసనలు పూర్తిగా నాశనమయ్యే ముందు ఈ శ్రీదామ, సుదామ వాసనలు ఫలించి పెట్టుతాయి.

ఇక్కడ సాధకుడు సమస్త వాసనలను శిథిలంచేసి ముక్తావస్థకు చేరుకోడానికి సిద్ధంగానే వున్నాడు. కాని ఆతనికి ఏదో జన్మలో సిరిసంపద లనుభవించే యోగ వాసనల అనువస్థితి వుంది. దానిని కూడ నాశం చేసికొంటేనే కాని ఆ జన్మలో ముక్తి రాదు. మఱో జన్మలో సంపదలువస్తే వాని భోగానుభవంలో మఱికొన్ని వాసనలు అంటుకొనే అవకాశం వుంది. అల్లాగే జరుగుతే సాధకుడు ముక్తి పొందలేడు సరి గదా జనన మరణ పరిభ్రమణంలో పడిపోతాడు. చేసిన సాధనలన్నీ అడుగున పడి పోతాయి. అందుచేత ఈ జన్మలోనే ఆతడు తరించాలంటే సుదామ లేక శ్రీదామ యోగం ఇప్పుడే ఫలించి విడిచి పోవడం జరిగించాలి. అందుకే సాధకుడు (కుచేలుడు) కృష్ణదర్శనానికి అనగా నిర్వృతి తత్త్వ సాధనకు పూనుకొన్నాడు అని అంతరార్థం చెప్పాలి.

కుచేలునకు కృష్ణుడు ఆబాల్య స్నేహితుడు. కృష్ణుడంటే విషయ వాంఛారహిత నిర్వృతి తత్త్వం అని చెప్పుకొని వున్నాం కదా! వాసనలను జీర్ణస్థితికి తెచ్చే సాధనను అనగా కుచేల సాధనను అభ్యసిస్తూన్న సాధకుడు మొదటనుండి విషయ వాంఛారహిత మైన నిర్వృతి తత్త్వాన్ని సాధనలతో అనుసరిస్తూనే వున్నాడన్నదే కృష్ణుడు కుచేలునకు ఆబాల్యస్నేహితుడన్న దానికి అంతరార్థం.

ఆతనికి 'వామాక్షి' భార్య. వామ+అక్షి, వామ అంటే ఎడమవైపు అనే అర్థంలో అప్రధానమైనది అనేదిగా లక్షణార్థం చెప్పుకోవాలి. 'అక్ష' అంటే ఇంద్రియాలు, కాన వామాక్షి అంటే ఇంద్రియ విషయాల్ని అప్రధానంగా చూచే సాధకుని లోని అనాసక్తి యోగం అని అర్థం. సాధకునికి అనాసక్తియోగం, అతడు చేసే నివృత్తి తత్త్వానుసరణ సాధనకు సహకారిణిగా వుండి అనేదే కుచేలునకు వామాక్షి భార్యగా వున్నది అన్నదానికి అంతరార్థం. ఇరువై అయిదుగురు బిడ్డలు అంటే సాధకునిలోని జీవతత్త్వాలు అని చెప్పాలి. ఇరువై అయిదు అవి దశఇంద్రియాలు, (10) పంచభూతాలు (5) శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే పంచ భూత గుణాలు (5) మనోబుద్ధి చిత్తాహంకారాలనే అంతఃకరణ చతుష్టయం (4) జీవుడు (1) (10+5+5+4+1=25) అన్నవి దేహంలో వుండేవి ఇరువైఅయిదు జీవతత్త్వాలు. అవి తమ్ము సుఖాలతో పోషించడానికి సాధకుణ్ని పీడిస్తూంటాయి. వామాక్షి కుచేలుణ్ని తమ ఇరువై అయిదుగురు బిడ్డల్ని బ్రతికించడానికి శ్రీకృష్ణుణ్ని అడిగి సంపద తెమ్మంది. అంటే దేహాన్నాశ్రయించియున్న ఇరువై అయిదు జీవతత్త్వాలు బ్రతికి వుంటేనే కాని అనగా అవి పని చేస్తూంటేనే కాని సాధకునికి సాధన అనేది సాగనే సాగదు. అనాసక్తి యోగంతోనే వానిని అనుభవించాలే కాని, వానిని అసలే విడిచి వుండడం అసంభవం. అందుచేత సాధకునిలోని అనాసక్తి వృత్తి, (వామాక్షి) సాధకుణ్ని నిర్వృతి తత్త్వాన్ని ఎక్కువగా స్వాధీనం చేసికొంటే మునుముందు అనుభవించవలసివున్న శ్రీదామ సుదామ వాసనల్ని నిమిత్తమాత్రంగా అనుభవించి వదలి వేయవచ్చునని, ప్రబోధం కల్గించడాన్నే వామాక్షి పిల్లల సంరక్షణకు ధనం తెమ్మని కృష్ణదర్శనానికి కుచేలుణ్ని ప్రోత్సహించి పంపించడంలోని అంతరార్థంగా గ్రహించాలి.

కృష్ణుడి కివ్వడానికి నాల్గు చేరల అటుకులు వామాక్షి మూటకట్టి యిచ్చింది. ధాన్యం ఉడకబెట్టి రేకుల్లాగ దంచిన పిమ్మట వానిని చెరిగి అటుకులు తయారు

చేస్తారు. ఇక్కడ ధాన్యం వాసనాబీజాలు. అవి ఉడికించడం, దంపించడం, చెరగడం అనేవి సాధనల వల్ల వాసనా బీజాలలోని జన్మలనిచ్చే శక్తిని నాశనం చేయడం అన్న మాట. ఇప్పుడు అటుకులు అంటే మొలవేస్తే మొలిచే శక్తి లేని శిథిల వాసనా బీజాలన్నవి అంతరార్థపరంగా చెప్పాలి. ఆ అటుకులు నాల్గు చేరలు ప్రోగుచేసి ఇచ్చింది. నాల్గు చేరలు అంటే-ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలు. ఆ పురుషార్థాలుని సాధించడానికి సాధకుడు శిథిల స్థితికి తెచ్చిన వాసనా బీజాలే అటుకులు అన్న దానికి అంతరార్థం. ఆ అటుకులు తీసికొని కుచేలుడు శ్రమపడి ద్వారకకు వెళ్ళి కృష్ణుణ్ని దర్శించేడు.

ద్వారకలో కృష్ణుడున్నాడు. 'ద్వారక' అంటే సుఖదుఃఖాది ద్వంద్వగుణాలు అంటని అద్వైత స్థితి అని లోగడ జరాసంధోపాఖ్యానంలో వ్యుత్పత్తి ప్రదర్శన పూర్వకంగా అంతరార్థం చెప్పుకొని వున్నాం. ద్వంద్వ రహిత స్థితిలో నిర్వృతి తత్త్వం నివసించి వుంటుందన్నదే ద్వారకలో కృష్ణుడున్నాడన్న దాని అంతరార్థం. వాసనా శైథిల్యం సాధించిన సాధకుడు (కుచేలుడు) శ్రమతో సాధనలు చేసి ద్వంద్వవాసనలను శమింపజేసి అద్వైతస్థితిలో నిర్వృతి తత్త్వాన్ని పూర్తిగా సాధించగల్గేడు అన్నదే కుచేలుడు ద్వారకకు వెళ్ళి కృష్ణుని దర్శించేడన్న దాని అంతరార్థం.

కృష్ణుడు ఆతడు తెచ్చిన ఆటుకుల మూట విప్పి చేరెడు అటుకులు నోటిలో వేసికొని తిన్నాడు. కుచేలుడికి అష్టైశ్వర్యాలు వచ్చేయి అంటే సాధకునిలో జనన మరణాలనిచ్చే వాసనా బీజాల్ని పూర్ణ నిర్వృతి తత్త్వం అనుభవం కల్పించి నాశనం చేస్తుంది అని అర్థం.

అటుకులు జీవశక్తి లేనివి గదా ! అవి జన్మ వాసనల నిచ్చేవి కావుగదా? కృష్ణుడు అటుకులను తినడం వల్ల సాధకునిలోని శ్రీదామ, సుదామ అనేవి అనుభవానికి రావడం, పోవడం, ఏమిటి? అనే సందేహం పాఠకులకు కల్గవచ్చు. అటుకులు ఎంత ఉడికించి, దంచి, చెరిగిన ధాన్య బీజాలైనా అందులో అక్కడక్కడ చెదురు పాటుగా జీవశక్తి గల గింజలు కూడ వుండవచ్చు. అటువంటి వాసనా బీజాలు చెదురు పాటుగా సాధకునిలో నుంటేనే, వానిని నిర్వృతి తత్త్వం సాధకునిచేత నిమిత్త మాత్రంగా అనుభవింప జేస్తుంది. అదే కృష్ణుడు అటుకులు తినడంతో ఇంటి వద్ద

కుచేలునికి అష్టైశ్వర్యాలు వచ్చేయన్నదాని అంతరార్థంగా భావించాలి. రుక్మిణి అంటే ప్రకృతిచే పొందింపబడే కోరిక. సాధకుని ప్రకృతిలోని కాంక్ష అతనిలోని వాసనా బీజాల అనుభవంతో అతనిని ముక్తిని పొందించడానికి తోడుపడి అవసరమైనంతవరకు మాత్రమే నిర్వృతి తత్త్వాన్ని వాడుకొనేటట్లు చేయడమే సాధకుని ప్రకృతిలో వుండే కాంక్ష. సాధకునిలోని ఆ దివ్య ప్రకృతి కాంక్షయే అతనిని నడిపిస్తుంది. రుక్మిణి కృష్ణుని మరొక చేరెడు అటుకులు తినకుండా ఆపుచెయ్యడంలోని అంతరార్థం ఇదే.

సాధకుడు పూర్ణ నిర్వృతి తత్త్వ సాధనలో పరిపక్వ స్థితిని పొందేడు. అతడు తనకు కల్గిన అష్టైశ్వర్యాల్ని చూచి గర్వించలేదు అనుభవించలేదు. తన జీవ యాత్రకు ఎంత తక్కువ అవసరమో అంత తక్కువగా మాత్రమే ఆ సంపదలను అనాసక్తి యోగంతో వినియోగించుకొని నిర్వృతి స్థితిని చెదరిపోకుండా నిల్వరించుకొని ప్రాణోత్క్రమణంలో ఆ నిర్వృతి తత్త్వంలో సాధకుడు కైవల్యాన్ని పొందేడు అన్నదే కుచేలుడు తన సంపదలను విడిచి తపస్సు చేసి ముక్తిని పొందేడన్న దాని అంతరార్థం.

ఇందులో నిర్వృతి తత్త్వాన్ని పూర్ణంగా సాధిస్తే ముందు జన్మలలో అనుభవించ వలసిన సుఖదుఃఖానుభవాలు తేలికగా ఈ జన్మలోనే అనాసక్తి యోగంతో సాధకుడు అనుభవించి ప్రాణోత్క్రమణంతో ముక్తి నందుతాడనే సాధనా రహస్యం చెప్పబడింది.

ఈ కథ వింటే పాపాలు పోతాయన్న ఫలశ్రుతికి అంతరార్థపరంగా వింటేనే అది చెప్పుకోవాలి. అని అంతరార్థ పరంగా వింటే ఆ సాధనలందు ఆసక్తి కల్గి శ్రోతలు ముక్తి కాంక్షను పొందడం సాధ్యమౌతుంది కాన ఫలశ్రుతి వల్ల ఇందులో అంతరార్థం ఇమిడి వుందని వ్యాసభగవానుడు ఉద్దేశించినట్లు పాఠకులు గ్రహింతురు గాక!

# సుభద్రార్జునుల వివాహం

## (ముక్తి ప్రాప్తి సాధన)

అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ యతి వేషంతో రైవతక పర్వతం చేరేడు. బలరాముడాతణ్ని యతియే అనుకొని ఆతిథ్యానికి పిలిచేడు. అతిథిగా ఇంటికి వచ్చిన యతిని అర్జునుణ్నిగా గుర్తించి బలరామ కృష్ణుల సోదరి సుభద్ర మోహించింది. కృష్ణుడు బలరామునకు తెలియకుండా సుభద్రను అర్జునునితో గాంధర్వ వివాహం నడిపించి వారినిద్దర్ని రథం ఎక్కించి ఇంద్రప్రస్థం పంపిస్తూంటే బలరాముడడ్డు పడ్డాడు. కృష్ణుడు అర్జునుణ్ని గుర్తింపజేసి బలరాముణ్ని ఒప్పించి సుభద్రార్జునుల కలయికకు ఆటంకం లేకుండా చేసేడు.

ఇందు అర్జునుడు సుభద్రను వివాహం చేసికొని తీసికొని వెళ్ళడానికి బల రాముడు ఎందుల కాటంకపరిచేడు? అన్నది ప్రశ్న. యతి వేషంలోనున్న కారణం చేత మొదట్లో అర్జునుణ్ని గుర్తింపలేకపోయేదని బాహ్యార్థంలో సమాధానం చెప్ప వచ్చు. ఈ సుభద్రార్జునుల వివాహ కథకు చక్కని అంతరార్థం వుంది.

బలరాముడంటే ప్రకృతిని బ్రహ్మగా గుర్తించడం ద్వారా కల్గిన బ్రహ్మానంద తత్త్వం అనీ కృష్ణుడు నిర్వృతి తత్త్వం లోగడనుండి చెప్పుకొని వస్తూనేవున్నాం. అర్జు నుడు కృష్ణభక్తుడు అర్జునుడు అంటే ఋజు ప్రవర్తన అనగా సత్యధర్మవర్తన కల సాధ కుడు అని అర్థం. 'ఋజు' పదము నుండి 'అర్జున' పదం పుట్టింది. 'ఋజు' అంటే సత్యమార్గం అని అర్థం. అర్జునుడు కృష్ణభక్తుడు. కృష్ణునకు అర్జునుడు అంటే విడరాని అమితమైన ప్రేమ. కృష్ణుడు నిర్వృతి తత్త్వం. అర్జునుడు ఋజు ప్రవర్తకుడు. ఋజు ప్రవర్తన కలవారికి నిర్వృతి తత్త్వం సులువుగా అందుతుంది. నిర్వృతి తత్త్వం ఋజు ప్రవర్తనకే పట్టువడుతుంది. ఈ రీతిగా కృష్ణార్జునుల మైత్రి ఋజు ప్రవర్తనా నిర్వృతి తత్త్వాల కలయికగా అంతరార్థపరంగా భావించాలి. అర్జునుడు యతి వేషంలో ఉన్నాడు. యతి అంటే ఇంద్రియ నిగ్రహం సాధనచేసే యత్నంచేసే వాడని అర్థం. ఋజు వర్తనలో ఇంద్రియ నిగ్రహం సాధన చేస్తూవున్న సాధకుడే యతి వేషములో నున్న అర్జును డన్నదానికి అంతరార్థం. సుభద్ర యతి వేషంలోని అర్జునుణ్ణి చూచి

మోహించింది. సుభద్ర అంటే, సు=చక్కని, భద్ర=శుభకరమైనది. అనగా ముక్తి అని అర్థం. ఆ ఋజు ప్రవర్తకుడై ఇంద్రియ నిగ్రహం కల సాధకునకే ముక్తి ప్రాప్తిస్తుంది. అంటే నిర్వృతి తత్త్వంతో జతపడిన ఋజు మార్గంలో ఇంద్రియ నిగ్రహము చేసే సాధకునకు ముక్తి అంటే వాసనల యొక్క విడుమర సిద్ధిస్తుంది అన్నదే యతి వేషంలో నున్న కృష్ణ భక్తుడైన అర్జునుడిని సుభద్ర వరించిందన్న దాని అంతరార్థం.

కృష్ణుడు సుభద్రార్జునుల వివాహం జరిపించేడు అంటే నిర్వృతి తత్త్వం ఋజు వర్తనతో తన్నారాధించే సాధకునకు వాసనల యొక్క విడుమరను కల్గిస్తుందని అంతరార్థం. బలరాముడు సుభద్రార్జునుల కలయికకు మొదట్లో అంగీకరించలేదు అంటే నిర్వృతి తత్త్వం మీదనే ఆసక్తి కలవానికి ప్రకృతిలో బ్రహ్మను గుర్తించే బ్రహ్మానందం అనుభూతి అంత తొందరగా చేకూరదని అంతరార్థం చెప్పుకోవాలి. ప్రకృతి నంతను పరబ్రహ్మ స్వరూపంగా గుర్తించినపుడే వాసనలు విడుమర పొంది అఖండ బ్రహ్మానందానుభూతి సాధకునికి కల్గుతుందేకాని వట్టి నిర్వృతి తత్త్వం మాత్రమే చాలదని చెప్పడమే బలరాముకు సుభద్రార్జునుల వివాహానికి ఆటంకం చెప్పడంలోని అంతరార్థం. సుభద్ర బలరామ కృష్ణుల కిద్దరకూ ప్రేమ పాత్రురాలైన చెల్లెలు అంటే ముక్తి ఇటు నిర్వృతి తత్త్వం వల్ల అటు ప్రకృతిని పరబ్రహ్మ స్వరూపంగా చూచే సాధన వల్ల కల్గే ఆనంద తత్త్వం వల్ల కూడ లభిస్తుందనేది అంతరార్థంగా గ్రహించాలి.

దీనివల్ల సాధకుడు ఋజు మార్గంతో ఇంద్రియ నిగ్రహంతో నిర్వృతి తత్త్వాన్ని ఆరాధిస్తే వాసనల విడుమర (ముక్తి) లభిస్తుందనీ, తర్వాత బ్రహ్మానందం కల్గుతుందనీ వాసనల యొక్క విడుమర నిర్వృతి తత్త్వం వల్లను అనగా అహం బ్రహ్మాస్మి సాధనల వల్లను, సర్వం ఖల్విదం బ్రహ్మ అను సాధన వల్ల కూడా కల్గుతుందని తెలిసికోవాలి.

పూరీ జగన్నాథంలో పై తత్త్వాన్ని తెల్పే అర్చా విగ్రహ ప్రతిష్ఠ జరుపబడింది. ఆ దేవాలయంలోని విగ్రహాలు కృష్ణుడు, బలరాముడు, సుభద్ర మాత్రమే అయి

---

"భద్రం కర్ణేభిః శృణు" అనే శ్రుతిలోని భద్రం అన్న పదానికి ముక్తిని గూర్చి అని అర్థం.

వుండడం సాధకులకు పైసాధనలను రెండింటినీ ముక్తి కారణములుగా ప్రబోధించడమే అని అనక తప్పదు. కాకపోతే ఎక్కడైనా కృష్ణుడి విగ్రహంతో జత పరచడం అతని భార్యలైన రుక్మిణీ సత్యభామలను గానీ రాధాదేవిని గానీ ప్రతిష్ఠించడం వుంది. కాని ఇక్కడ అట్లా కాక బలరామ కృష్ణ సుభద్రలను సహోదరులను ప్రతిష్ఠించడంలో అంతరార్థపరంగానే తప్ప మరొకవిధంగా సముచితమైన సమాధానం దొరకదు. ఎక్కడైనా స్త్రీ విగ్రహం ఆమె భర్తతో కలిపి ప్రతిష్ఠింప బడుతోందే కాని సోదరులతో కలిపి ప్రతిష్ఠింపబడడం లేదు. కాన దీనిలో అంతరార్థాన్ని గ్రహించాలి.

# బహుళాశ్వ శ్రుత దేవుల చరిత్ర

## (ప్రకృతి పురుషైక్య సాధన)

విదేహ రాజ్యాన్ని పాలిస్తూ మిధిలా పట్టణంలో బహుళాశ్వడనే రాజున్నాడు. అతడు కృష్ణ భక్తుడు. ఆ విదేహ రాజ్యంలోని మిధిలా నగరంలోనే శ్రుతదేవుడనే ఒక బ్రాహ్మణు డున్నాడు. అతడు కూడ కృష్ణ భక్తుడే.

తనకు ప్రియులైన ఆ ఇద్దరినీ అనుగ్రహించే నిమిత్తం కృష్ణు డొకప్పుడు మిధిలానగరానికి వెళ్ళేడు. తన నగరంలో ప్రవేశించిన కృష్ణుణ్ణి ఎదుర్కొని బహుళాశ్వడు తన ఇంటిలో ఆనాడు ఆతిధ్యం స్వీకరించవలసిందని ఆహ్వానించేడు. కృష్ణుడందులకు సమ్మతించేడు. తర్వాత శ్రుతి దేవుడు వచ్చి కృష్ణుణ్ని పూజించి తన ఇంటికి ఆ రోజున ఆతిధ్యాన్ని స్వీకరించడానికి రావలసిందిగా కోరేడు. కృష్ణుడందులకు సమ్మతించేడు. బహుళాశ్వడు తన సమక్షంలోనే శ్రుతిదేవుని ఆతిధ్య స్వీకారానికి ఇష్టం తెల్పినను తాను కృష్ణుణ్ని ఇదేమిటని ప్రశ్నించలేదు. కృష్ణుడు బహుళాశ్వని ఇంటికి ఆతిధ్య స్వీకారానికి వెళ్ళేడు. శ్రుతిదేవుడు కూడ కృష్ణుణ్ని అనుగమించి అతనితో కూడా వెళ్ళేడే కాని "మా ఇంటికి వస్తానన్నారు కదా! బహుళాశ్వనింటికి విందుకు వెడుతున్నారేమిటి?" అని కృష్ణుణ్ని ప్రశ్నించలేదు. అతనికి కృష్ణుని అభిప్రాయం అగ్రాహ్యంగానే వుంది.

ఇంతలో శ్రుతదేవుని ఇంటినుండి శ్రుతదేవుని కుమారుడు పరుగు పరుగున వచ్చి "కృష్ణుడు సపరివారంగా మన ఇంటికి ఆతిధ్యం స్వీకరించడానికి వచ్చేడు. నిన్ను

గురించి అడిగేడు. ఆ కారణంచేత నీ కోసం నేను వచ్చే"నని ఆయాసపడుతూ చెప్పేడు. అది విని శ్రుతిదేవు డాశ్చర్యచకితుడై తన ఇంటికి మనోవేగంతో వెళ్ళేడు. అక్కడ కృష్ణుణ్ని కౌగలించుకొని ఆతిథ్యం మర్యాదలు నడిపించేడు.

ఇక్కడ బహుళాశ్వుడు తన ఇంటిలో కృష్ణునకు సపరివారంగా పూజా సత్కారాలు నెరవేరుస్తూండగా ఒక బ్రాహ్మణుడు శ్రుతిదేవుని ఇంట నుండి వచ్చి శ్రుత దేవుని ఇంట్లో శ్రీకృష్ణుని దర్శించుకొని ఇప్పుడే వచ్చేనని బహుళాశ్వునితో ప్రసంగవశాత్తు చెప్పేడు. అది విన్న బహుళాశ్వుడు విస్మితుడైయ్యేడు. వెంటనే బహుళాశ్వుడు శ్రుతదేవు నింటికి వెళ్ళి అచ్చట కృష్ణుణ్ని దర్శించేడు.

ఈ విధంగా బహుళాశ్వ శ్రుతదేవుల ఇళ్ళల్లో ఒకే రోజున ఒకే సమయంలో శ్రీకృష్ణుడు విందారగించి ఇరువుర్ని ఏక కాలంలో సంతుష్టుల్ని చేసేడు.

ఈ కథ చాల ఆశ్చర్యకరంగా వుంది గదూ! ఒకేసారి ఒకే సమయంలో ఇరువుర ఇండ్లల్లో కృష్ణ ప్రవేశం బాహ్యార్థంలో పొసగేడిగా చెప్పడం ఎట్లాగు? కృష్ణుడు మానవరూపంలో నున్న భగవంతుడుగా చెప్పుకోవాలి. అంతలో మానవుడిగా అంతలో భగవంతుడుగా మారిపోతూండడం ఏమిటి? ఇది భగవల్లీల అని నమ్మించడం హేతుబద్ధమైన వాదం కాజాలదు. వట్టి మూఢ విశ్వాసాలతో భగవంతుని చేష్ట లర్థం చేసుకోవడం వల్ల సాధకులకు కలిసి వచ్చేది ఏమీ లేదు. పైగా సాధకుడు మూఢంగా విశ్వాసంతో ఎంత కాలం వున్నా భగవంతుని అనుభవం తనకు దొరకని కారణంగా కొన్నాళ్ళకు నాస్తికుడుగా మారిపోవడం జరుగుతూండే తప్ప శాశ్వతంగా మరణ కాలం వరకు ఆ విశ్వాసం ఆతనిలో నిలబడి ఆతణ్ణి తరింపజేయడం జరుగదు. విశ్వాసం మీద ఆధారపడినవి కట్టుకథలే కాని చరిత్ర సత్యాలు కావు. ఆ కట్టు కథలు మహత్తరమయిన అంతరార్థాల్ని కల్గి వున్నాయి. ఆ కట్టు కథలలోని గుట్టువిప్పుకొంటే అసలు సత్యమార్గం బోధపడుతుంది. ముక్తికి సాధనా మార్గం దొరుకుతుంది. అందు కోసం చేసే విశ్వప్రయత్నమే ఈ అంతరార్థ వివరణా ప్రయత్నం. ఇక పై కథలోని అంతరార్థం వివరిస్తాను:-

విదేహ రాజ్యం అంటే, "విగతం, దేహం యస్మిన్‌తత్=విదేహం" అనే వ్యుత్పత్త్యర్థంలో విడిచిపెట్టబడిన దేహం గలది, అనగా జన్మ రాహిత్యం కల్గిది అనే

అర్థంలో మోక్షము అనే అర్థం 'విదేహ' పదానికి వస్తుంది. మోక్షము కొఱకు సాధనలను పాలించడమే విదేహ రాజ్యం పాలించడమంటే. విదేహ రాజ్యానికి మిథిలా పురం రాజధాని. 'మిథిల' అంటే మిథ్యతే, అ|తరి పవః ఇతి మిథిః, మిథింలాతి గృహాతి ఇతి మిథిలా అని వ్యుత్పత్తి ప్రదర్శనలో మిథిలా అంటే శ|తువులు ఇక్కడ కలిసి మి|తులుగా ఉంటారు. అట్టి మి|త భావమును |గహించునది కాన 'మిథిల' అని నిఘంటువుల్లో చెప్పిన వ్యుత్పత్త్యర్థం-అంటే విదేహ రాజ్యంలో వుండే వారికి అంటే ఈ మోక్ష రాజ్యంలో వుండే వారికి * శ|తుషట్కం శ|తుభావం విడిచి పెట్టి మై|తితో వుం. ఏడి అని అర్థం. కలిసి వుండేది అని మిథ్ ధాతువునకు 'To associate' అని Apte నిఘంటువులో కూడ వున్నది. 'బహులాశ్వుడు' అంటే బహుల+అశ్వ అని విడదీయాలి. అశ్వము అంటే న+శ్వ=రేపటికి ఉండనిది అనగా నిత్యమూ మార్పు చెందేది అనే అర్థంలో 'అశ్వ' అని అవుతుంది. అప్పుడు 'అశ్వ' అంటే ప్రకృతి అర్థమని లోగడ చెప్పుకొని వున్నాం. 'బహుల' (బహు=అన్నిటిని, ల= |గహించేది) అంటే సర్వమైన |ప్రకృతి అని అర్థం. ఈ విధంగా బహులాశ్వుడు అంటే సమస్త |ప్రకృతి యొక్క స్వరూపం అని అర్థం. బహులాశ్వుడు మిథిలను రాజధానిగా చేసికొని విదేహ రాజ్యం పాలిస్తున్నాడంటే సాధకునిలోని ప్రకృతి పరస్పర విరోధ భావం విడిచి ఐక్యంగా ఉంటూ, సాధనలు సాగిస్తూ మోక్షం కొఱకు |ప్రయత్నిస్తూందని అర్థం. అతడు కృష్ణ భక్తుడు అనగా ఆ సాధకుడు 'నిర్వృతితో' అనగా విషయ రాహిత్య మనోవృత్తితో సాధన చేస్తూన్నాడు అని దాని అర్థం. |ప్రకృతిలో ఉంటూనే ఆ |ప్రకృతిలో దేనికీ అంటుపడకుండా ఆ |ప్రకృతితోనే విషయ వాంఛారాహిత్యమునకు సాధనల్ని సాధకులు సాగించాలనే అర్థం ఇందు |గహించాలి. ఆ విదేహ రాజ్యంలోనే "ఆ మిథిలా పట్టణంలోనే |శుతదేవుడనే |బ్రాహ్మణుడు కూడ వున్నాడు. అతడూ కృష్ణభక్తుడే." |శుతదేవుడు అంటే |శుతమంటే వినబడినది. అనగా తెలియబడినది |ప్రసిద్ధమైనది అని అర్థం, వేదము అని కూడ అర్థం. దివ్ ధాతువునకు |ప్రకాశం అర్థం కాన 'దేవు'డంటే |ప్రకాశించే వేద విజ్ఞానం అని అర్థం. |ప్రసిద్ధమైన వేదము చేత కల్గిన జ్ఞానం అన్నది |శుతదేవ పదానికి అర్థం అన్నమాట.

---

* 1 కామం 2 |క్రోధం 3 లోభం 4 మోహం 5 మదం 6 మాత్సర్యం అనేవి ఆరు అరిషడ్వర్గం.

ఆతడు 'బ్రాహ్మణు'డు. "బ్రహ్మన యతి ఇతి బ్రాహ్మణః" అనే వ్యుత్పత్త్యర్థంలో బ్రహ్మ పదార్థాన్ని పొందేవాడు బ్రాహ్మణుడు అని అర్థం. పరబ్రహ్మ స్వరూపాన్ని జ్ఞానంతో అన్వేషించే సాధకుడున్నాడు అన్నది శ్రుతదేవుడనే బ్రాహ్మణుడు అన్న దానికి అంతరార్థంగా చెప్పుకోవచ్చు. ఇతడు కూడ కృష్ణ భక్తుడంటే నిర్వృతి తత్త్వం తోనే సాధన చేసేవాడన్న మాట. వేద ప్రసిద్ధమైన బ్రహ్మ జ్ఞానంతో ముక్తికై నిర్వృతి తత్త్వాన్ని సాధన చేస్తున్నవాడు శ్రుతదేవ బ్రాహ్మణుడు, సర్వభూత ప్రకృతిని అవ రోధంగా పాలిస్తూ ముక్తికి నిర్వృతి తత్త్వ సాధన చేస్తూన్నవాడు బహుళాశ్వుడు. ఇందు ఒకడు బ్రాహ్మణుడు మఱొకడు రాజు. జ్ఞాన మార్గం ఒకరిది, ప్రకృతి మార్గం అనగా అజ్ఞాన రూప మాయా ప్రకృతి మార్గం మఱొకరిది. ఈ రెండు మార్గాలూ ఒక దానికి ఒకటి విరుద్ధమైన తత్త్వాలు గలవి. అయినా రెండూ ముక్తి కోసము ఒకే నిర్వృతి తత్త్వ సిద్ధికి సాధనలు సాగిస్తాయి. నిర్వృతి తత్త్వంలో జ్ఞానాజ్ఞానాలు రెండూ కూడ ముక్తిని సాధిస్తాయి అని మనం శ్రుతదేవ, బహుళాశ్వులు కృష్ణ భక్తులు అన్న మాటలో గ్రహించాలి. అదే కృష్ణుడు బహుళాశ్వుని ఇంటిలోను శ్రుతదేవు నింటిలోను ఒకే రోజున ఒకే సమయాన్న విందు స్వీకరించే దన్నదానికి అంతరార్థం

ఈ కథవల్ల అజ్ఞానరూప మాయా ప్రకృతిమార్గంలో కూడ నిర్వృతి తత్త్వం మిళాయించి ముక్తిని సాధించవచ్చుననీ, వేద విజ్ఞాన మార్గంలో నిర్వృతి తత్త్వం సాధిస్తే ఏ ఫలం కల్గుతుందో అజ్ఞానమార్గంలోకూడ నిర్వృతితత్త్వం సాధించినా అదే ఫలం లభిస్తుందనీ సాధనా సారాంశ రహస్యాన్ని గ్రహించాలి. నిర్వృతితత్త్వాన్ని జోడిస్తే ఏ మార్గంలోనైనా ముక్తిని సాధించవచ్చుననీ, అసలు ముక్తికి మూలం నిర్వృతితత్త్వ సాధనమే అనీ, అదే కృష్ణ భక్తియనీ సాధకులు పై శ్రుతదేవ బహుళాశ్వ సాధకులకు కృష్ణానుగ్రహం కల్గిందనీ పైచెప్పిన కథలో అంతరార్థాన్ని గ్రహించాలి. ఈ కృష్ణభక్తికి స్త్రీ శూద్ర ద్విజ భేదంకానీ, వయోభేదం కానీ ఏవీ లేదనీ, కృష్ణభక్తి అందఱికి కావలసిందేననీ, అదే అందఱినీ తరింపజేసేదనీ, అదే జీవితంలో సులభమైన సాధన అనీ, నిరపాయకరమైనదనీ కూడ గ్రహించాలి. ఈ కథలో వ్యాసుడు కృష్ణతత్త్వానికి ఇంతింతనరాని ప్రాధాన్యం ఇచ్చేడనీ చెప్పాలి. ప్రకృతిలో పరమాత్మానందమును అనుభవించే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధన బలరాము

సాధన అనిపించుకుంటుంది. పరమాత్మలో ప్రకృతిని ఇది బ్రహ్మముకాదు, ఇది బ్రహ్మము కాదు అని 'నేతి నేతి' అని నిషేధిస్తూ చేసే 'అహం బ్రహ్మాస్మి' అనే సాధన నిర్వృతి సాధన. అదే కృష్ణసాధన. ఈ రెండింటికీ నిర్వృతితత్త్వమే మూలం. పురుష సృష్టియే ప్రకృతి. అది నిజానికి లేనిదే ఉన్నట్టు కన్పించే మాయయే ప్రకృతి. పరమాత్మ జ్ఞానంతోనే ఆ మాయా ప్రకృతి నశించి ఆనందానుభవం వస్తుంది. పరమాత్మ ప్రకృతివల్లనే తెలియబడుతుంది. పరమాత్మను ప్రకృతిద్వారానే తప్ప దర్శించనేలేము. విద్యుచ్ఛక్తిని బల్బులు వగైరా సాధనాల వల్లనే తప్ప నగ్నంగా దర్శించలేము గదా! అల్లాగే నశించే ప్రకృతితోనే నశింపని పరమాత్మను తెలిసికోవాలి. ఈ విధంగా ప్రకృతి పురుషులకైక్యాను సంధానం నిత్య సిద్ధమైనది. అదే కృష్ణ బలరాముల అవినాభావ స్థితి అనే సంగతికూడ పై కథలో విశదంచేస్తూంది.

> "శివశ్శక్త్యాయుక్తోయది భవతిశక్తః ప్రభవితుం
> నచే దేవందేవః నఖలు కుశలః స్పందియమపి"

అని ఆది శంకరాచార్యులవారు సౌందర్యలహరిలో మొట్టమొదటి శ్లోకంలో వ్రాశారు. శక్తితో కూడినప్పుడే శివుడు అనే వాడొకడున్నాడన్న సంగతి తెలుస్తుంది. లేకపోతే శివునికి కదలికలేదు, మెదలికలేదు," అని ఆ శ్లోకభావం. శివుడంటే పురుషుడు లేక పరమాత్మ. శక్తి అంటే ప్రకృతి లేక జీవాత్మ అని అర్థం. ప్రపంచంలోని జడ దేహములన్నీ ప్రకృతి. ఆ దేహాల్లోనే వుంటూ వాటి జడత్వాన్ని వదల్చి కదలించి, మెదలించే చైతన్యం పరమాత్మ దేహాల్లోని దేహాల్లోనే దేహాత్తోనే తెలిసికోవలసిందే. విడిగా దాని పరమాత్మను నగ్నంగా దర్శించడం అశక్యం. కాని ప్రకృతి పురుషులకు రెండింటికి సమప్రాధాన్యం ఉందన్న సంగతికూడ పైకథలో తెలిసికోగలం.

# బృందావన విహారం

## (ఇంద్రియ సమూహ రక్షణా సాధన)

తర్వాత ఒకప్పుడు శ్రీకృష్ణుడు తాను పెరిగిన నందవ్రజం చేరుకొన్నాడు. గోపికలు కృష్ణుని సమీపించేరు. ఆపైని కృష్ణుడు అక్కడ ఎందఱు గోపికలు ఉన్నారో అందరికి అన్ని దేహాలతోను ఒకేసారి వేరువేరుగా దర్శన స్పర్శన సంభాషణలు నడిపేడు. అందరికీ అమితానందం కల్గించేడు.

ఇది చిన్నకథే అయినా ఈ కథలో కూడ ఒకే కృష్ణుడు అందరు గోపికలతో ఒకేసారి వేరువేరుగా స్పర్శన, దర్శన, సంభాషణలు సాగించేడన్నది బాహ్యార్థంలో అసంభవమైన విషయం. భగవంతుని లీలలవి అని సమర్థించుకోవడం మూఢ విశ్వాసమే అవుతుంది. కాని హేతుబద్ధం కానేరదు.

గోపికలంటే ఇంద్రియ వృత్తులను పాలించేవి. అవి మనోవృత్తులు అని మనం లోగడనే చెప్పుకొన్నాం. సాధకులు నిర్వృతి సాధన చేసేటప్పుడు వారి మనోవృత్తు లన్నిటిలోనూ నిర్వృతి తత్త్వం ఒక్కసారిగా వ్యాప్తమౌతుంది. సాధకునిలోని అన్ని వృత్తులు ఒక్కసారిగా నిర్వృతి తత్త్వంలో లీనమై పోవడంవల్ల పరమ ప్రశాంతస్థితి కల్గి సాధకునకు శాశ్వతమైన నిర్విషయానందం అనుభవంలోనికి వస్తుంది. ఈ నిర్వృతి సాధనలో ఒక్కసారిగా అన్ని ప్రవృత్తులు బ్రహ్మానంద స్థాయికి చేరు కొంటాయి. ఈ సాధనా రహస్యాన్ని బృందావనంలోని గోపికలకు ప్రతి ఒక్కరికి కృష్ణుడు దర్శన, స్పర్శన భాగ్యం కల్గించాడన్నదాని అంతరార్థంగా మనం గ్రహించాలి. 'వ్రజం' అంటే సమూహం అని అర్థం. నందవ్రజం అంటే సమూహంగా ఒకేసారి ఆనందాన్ని అనుభవించడం అని అర్థం. బృంద+అవనం=బృందావనం అవుతుంది. 'బృంద' అంటే సమూహం అని అర్థం. ఇంద్రియవృత్తుల సమూహం బృంద పదానికి అర్థం అన్నమాట. 'అవనం' అంటే రక్షించడం అని అర్థం. నిర్వృతి తత్త్వం ఇంద్రియవృత్తుల్ని తనలో ఐక్యం చేసికొని రక్షణ కల్పించడమే కృష్ణుడు బృందావనంలో విహరించడం అన్నదానికి అంతరార్థంగా గ్రహించాలి.

ఈవిధంగా అంతరార్థం చెప్పుకోకపోతే బాహ్యార్థంలో వట్టి మూఢ నమ్మకాల

మీద ఆధారపడితే ఆ మూఢ నమ్మకాలవల్ల ముక్తి ఎంతమాత్రం సాధ్యంకాదు అని గ్రహించాలి.

దీనితో దశమ స్కంధ పూర్వోత్తర భాగాలు సమాప్తం. ఈ దశమ స్కంధం ఒక్కటే అంతరార్ధపరంగా ముక్తి తత్త్వాన్ని చెప్పడానికి సర్వ సమర్థమైనది. కనుకనే భాగవతంలో దశమ స్కంధ పారాయణానికి ఎంతో ఫలితం వుందని చెప్తారు పెద్దలు.

# అంతరార్ధ భాగవతము

(బ్రహ్మవిద్యా దర్పణం)

## ఏకాదశ స్కంధం

కృష్ణావతార పరిసమాప్తి లేక ఉపసంహారం

(నిర్వృతి తత్త్వ సమగ్రతా ప్రాప్తి సాధన)

శ్లో॥ "నైవాన్యతః పరిభవోఽస్య భవేత్ కథం చిత్
మత్సంశ్రయ స్యవిభవోన్న హనస్యనిత్యం
అంతః కలిం యదుకుల స్యవిధాయ వేణు
స్తంబస్య వహ్నిమివ శాంతి ముపైమిధామ"

ఈ యదుకులమునకు దేనివల్లను కూడ ఏ విధంగాను తిరస్కారం (ఎదురు) లేదు. ఈ యదుకులం నన్ను ఆశ్రయించియున్న కారణంచేత ఈ కులానికి వైభవం నిరాటంకంగా నడుస్తూంది. ఆ యదుకులంలో అంతః కలహం పుట్టించి వెదురు డొంక అగ్నిపుట్టి ఆహుతియైపోయినట్లు తమంత తాముగా నాశమయ్యేటట్లు చేసి నేను పరమ ప్రశాంతి స్థానాన్ని పొందుతాను" అని కృష్ణుడు ఆలోచిస్తూ వున్న సమయంలో విశ్వామిత్ర అశిత, వామదేవాది ఋషులు కృష్ణ దర్శనానికి ద్వారకకు దగ్గరలోనున్న వనానికి వచ్చేరు. అప్పుడు యాదవ కుమారులు అక్కడకు వెళ్ళి జాంబవతీ సుతుడైన సాంబుడను వానికి గర్భం ధరించిన స్త్రీ వేషంవేసి "ఈ పెకు

కొడుకు పుడతాడా ? కూతురు పుడుతుందా ?" అని మునుల్ని అవహేళన చేసే ఉద్దే శంతో ప్రశ్న అడిగేరు. మునులు వారి అపహాస్య ధోరణి తెలిసికొని "ఈ పెకు యాదవకుల నాశనానికి ఒక ఇనుప రోకలి పుట్టుతుంది" అని చెప్పేరు. వెంటనే సాంబుని కడుపు చీల్చి చూడగా అందుండి ఒక ఇనుప రోకలి పడింది. దానిని యాద వులు ఉగ్రసేనుడను తమ రాజుకు చూపగా ఆయన భయపడి ఈ ముసలాన్ని అరగ దీసి స్వరూపనాశం చేసి సముద్రంలో కలిపివేయండని ఆజ్ఞాపించేడు.

ఆ విధంగా ఆ ఇనుప రోకలిని రాతిమీద అరగదీసి ఆ గంధాన్ని సముద్రపు నీటిలో కలిపేశారు. చిట్టచివరకు ఒక చిన్న ముక్కగా మిగిలితే దాన్ని అరగదీయ లేక సముద్రంలో విసరివేశారు.

శ్లో॥ కశ్చిన్మత్స్యోగ్రసేత్ లోహం
చూర్ణాని తరలైస్తతః
ఉహ్యామానాని వేలాయాం
లగ్నాన్యాసన్కిలైరకాః

శ్లో॥ మత్స్యో గృహీతో మత్స్యఘ్నైః
జాలేనాన్యైస్సహార్ణవే
తస్యోదర గతం లోహం
సశల్యేలుబ్ధకోఽకరోత్॥

ఆ ఇనుప ముక్కను ఒక మత్స్యం మ్రింగింది. ఆ అరగదీసిన గంధం ఒడ్డుకు కొట్టుకొని వచ్చి రెల్లుదుబ్బుగా ప్రభవించింది. ఇనుప ముక్కను మ్రింగిన మత్స్యాన్ని మత్స్యఘ్నులు (జాలరివాండ్రు) పట్టుకొని దాని కడుపు కోసి దానిలోని సూటిగా మొన తేరియున్న ఇనుప ముక్కను తీసేరు. దాన్ని ఒక కిరాతుడు బాణాగ్రంగా చేసికొన్నాడు. ఆ లుబ్ధకుని పేరు 'జర'.

ఆ తర్వాత ఒకప్పుడు శ్రీకృష్ణుడు ఒక అశోక వృక్షచ్ఛాయను శయనించి

